# సమకాలిక
# భారతీయ సాహిత్యము

## విద్వత్ గోష్ఠి

అనువాదం :

తల్లావజ్ఝల కృత్తివాసతీర్థులు



సాహిత్య అకాదెమీ

న్యూ ఢిల్లీ

*Samakalika Bharatiya Sahityamu* — Telugu translation of "Contemporary Indian Literature—A Symposium (Revised & Enlarged edition)" from English by T. Krittivasa Tirthulu. Sahitya Akademi, New Delhi, 1965. Price Rs. 8/-



ప్రథమ ముద్రణ : 1965

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
సికింద్రాబాదు

Also available at :
Sahitya Akademi
Rabindra Bhavan, New Delhi-1
38/B, Mount Road, Madras-6

ముద్రణ :
ది ఓరియన్ట్ పవర్ ప్రెస్, తెనాలి.

వెల : రూ 8/-

# పీఠిక

సమకాలిక భారతీయ సాహిత్య సంపుటము స్వల్పమైనది ప్రకటించడానికి సాహిత్య అకాడెమీ పూనుకోవడం నాకు ముదావహంగా ఉన్నది. రచయితలు ప్రతి భాషకూ నేపథ్యమునూ, తత్సాహిత్యాభివృద్ధిని గురించీ, ఆధునిక ధోరణులనూ స్థాలీపులాకంగా పరామర్శించినారు. వివిధభాషలలో రచయితలు అందరికీ సామాన్యమైన మూలమునుండే భావోద్రేకము తెచ్చుకొన్నారు. అందరికీ రసానుభూతి, విజ్ఞానానుభవమూ రమారమి ఒక్కటే. అందుచేత దృక్పథంలో ఐక్యము గోచరిస్తున్నది. దూరదేశాల నుండి ప్రసృతమయిన భావాలకు మనదేశము ఎన్నడూ విముఖముగా ఉండలేదు. అయితే స్వీకరించిన భావములన్నీ తన వైశిష్ట్యమువల్ల ముద్రితము చేసుకొంటుంది.

సాహిత్యము పవిత్రస్థానము. దానిని సవ్యముగా వినియోగించుకొన్నప్పుడు, మనము అజ్ఞాన ద్వేషశక్తులను చెండాడి జాతీయైక్యమును, విశ్వజనీన సంసర్గమును పెంపొందించగలము. సాహిత్యము గతాన్ని వ్యక్తము చేసి, ప్రస్తుతాన్ని ప్రతిబింబించి, భవిష్యత్తును తీర్చి దిద్దవలెను. తేజోమయమగు వాక్కు, పాఠకులలో దయార్ద్ర జీవిత దృక్పథానికీ, తాము జీవిస్తున్న ప్రపంచ రసాస్వాదనానికీ, తమ్ము తాము అవగాహన కావించుకొని, తమ భవిష్యత్తుకై విచక్షణతో విధానములు ఏర్పరచుకోవడానికిన్నీ ఉపకరించవలెను.

ఈ చిన్ని పుస్తకము పాఠకులకు మన మానసికహృదయ బాధలనూ, మన ఆశలనూ, ఆదర్శములనూ వ్యక్తము చేయగల దని ఆశించుచున్నాను.

సర్వేపల్లి రాధాకృష్ణన్

# అనుక్రమణిక

## సర్వేపల్లి రాధాకృష్ణన్

పీఠిక

# అసామీ సాహిత్యము

విరించి కుమార బారువా

## పరిచయము

అసామీ హైందవార్య భాషాకుటుంబము లోనిది. ఆ కుటుంబములోని భాష లన్నిటిలో అది ప్రాచ్యతమ మైనది. వ్యాకరణ విధానము, శబ్ద జాలము, వాక్యపరిచ్ఛేదాన్నిబట్టి, అది ఆర్యభాషగా పూర్ణవికాసం పొందింది. ఒడియా, వంగభాషల వలె, ఆసామీకూడా ప్రాచ్య—అప భ్రంశమునుంచి ఉద్భవించిందే. లభ్యమైన అసామీ సాహిత్యం, లిఖితమైన తార్కాణాలవల్లను, పదమూడో శతాబ్దినాటిదనాలి. అయితే ఆ దృష్టాంతాలు మత సంబంధమైనవి లేదా సంస్కృతోద్భవము లనదగును. వాటి ధోరణి శతాబ్దాలపాటు సాగబోయే అసామీ సాహిత్య సరణిని సూచించింది. పధ్నాలుగో శతాబ్దిలో ప్రభువులూ, సామంతులూ పోషించగా అసామీ సాహిత్యము వర్ధిల్లింది. ఆ యుగంలో కచారీ రాజైన మహామాణిక్యుడు అర్థించగా మాధవకందళి, సంస్కృత రామా యణాన్ని అసామీభాషలోకి అనువదించినాడు. మహాభారతంలో ఉపా ఖ్యానాలుకూడా అసామీలోకి అనువదింపబడినవి. మనసా నాగినీ—దేవతావైభవాత్మక గేయాలు, పద్యాలూ, గాథలూ, ఆ యుగంలోనే ఉల్లేఖింపబడినవి.

పదిహేనో శతాబ్దిలో శంకరదేవుడు నవ్యవైష్ణవ ధర్మోపదేశము చేయగా వ్యాపించిన వైష్ణవ ధర్మప్రచారంతో అసామీయ పారస్వతాభి వృద్ధి కలిగింది. అసామీయులు శంకరదేవుని ఆత్మీయతా ప్రభావము—మధ్యకాలమునాటి అసామీయ సంస్కృతిని ఆధ్యాత్మిక జీవితమును తీర్చిదిద్దినదని తలంతురు. ఇది యథార్థము. శంకరదేవుడూ, అతని అనుయాయులును మత ధర్మప్రచారంతోనో, మతాంతరులను కలుపు

కోడంతోనో ఆగలేదు. వారివల్ల అసామీయజీవితము, సారస్వతము, విద్య, అధిక ప్రోద్బలము పొందినవి. శంకరదేవునివల్లనూ, ఆతని అనుయాయులవల్లనూ, అసామీయ సాహిత్యమున ఒకానొక నూతన శకము ప్రారంభమయ్యెను. 15, 16 శతాబ్దాల్లో భక్తకవులవల్ల అనేక రీతుల్లో సాహిత్యసృష్టి జరిగింది. సంస్కృత మహాభారతమునకూ, రామాయణమునకూ, భాగవతపురాణమునకూ అనువాదాలూ అనుకరణాలూ వచ్చినవి. వైష్ణవధర్మవివరణం, 'బర్‌గీత్', 'అంకియనట్' అనే మత ధార్మికగేయాలూ, నాటకాలూ బయల్వెడలినవి.

పదిహేడో శతాబ్దిలో అహోము రాజులపోషణ కింద అసామీయ సారస్వతం వికాసం పొందింది. ఆ యుగంలో అసామీయ సాహిత్యము గద్యాత్మకమైంది. అహోము రాజాస్థానకైంకర్యతులు చరిత్రాత్మకమైన బురంజీలుగా వృద్ధిచెందినవి. సర్. జి. ఎ. గ్రియర్సన్ ఈ అసామీ సాహిత్యాన్ని గురించి ఇలా పలికినాడు : "అసామీయులకు తమ సారస్వతముపై అభిమానము మిక్కుటము. అది యుక్తమే. భారతీయ సాహిత్యంలో ఐతిహాసికరచనలు లేని లోపమును అసామీయులు బురంజీలను అనేక సంపుటాలుగా రచించి పూరించిరి. అసాములో పెద్ద మనుష్యులనిపించుకోవాలంటే బురంజీలను పఠింపక తప్పదు." (భారతీయ భాషల సింహావలోకనం) మత ధార్మికమైనవే కాక ఇంకా వైద్య, ఖగోళ, గణిత, నాట్య, వాస్తుశాస్త్రాలకు సంబంధించిన గద్య పద్య గ్రంథాలు, అసాములో ప్రభుపోషణచే వర్ధిల్లినవి. శృంగార రసాత్మకమయిన ఉపాఖ్యానాలు గేయపద్యాత్మకాలు సంతరింపబడినవి. గీత గోవిందమునకు అనువాదాలు ఎన్నో వెలువడినవి.

ఒకవంక రాజపోషణలో ఐతిహాసిక, ప్రయోజనాత్మక సారస్వతాభివృద్ధి కలుగుతూ ఉండగా, వైష్ణవ శాస్త్రాచార్యులవల్ల వివిధ మార్గాల్లో సాహిత్యసృష్టి జరిగింది. ఆ గ్రంథాలు వైష్ణవ భక్త జీవిత గాథలు. వాటిని 'చరిత పుథి' అంటారు. ఆ సాహిత్యాంగము మనకు సరికొత్తది. ఇంతవరకూ సాహిత్యంలో దేవతాకోటికే ప్రాధాన్యం ఉంటూ ఉండేది. ప్రప్రథమంగా ఈ 'బురంజీలు', 'చరితపుథీలు' మానవ కథా వస్తువుతో రచింపబడినవి.

## ఆధునికయుగము

పద్దెనిమిదో శతాబ్ది అంతమూ, పందొమ్మిదో శతాబ్ది ఆదీ; అసామీయ చరిత్రలో అంధయుగాలుగా పరిగణింపబడుతున్నవి. ప్రజానీకంలో అంతః కలహాలు, మోవమరియుల మత ఘర్షణలు (మోవమరియులు వీర వైష్ణవ శాఖీయులు — శూరులు) చెలరేగినవి. తుదకు 1816-1819, 1824 సంవత్సరాల్లో బర్మీయుల దండయాత్రలవల్ల, అస్సాంరాష్ట్రము స్వాతంత్ర్యాన్ని కోలుపోయింది. బ్రిటిషువారు 1827 లో అస్సామును తమ సామ్రాజ్యంలో కలుపుకొన్నారు. బ్రిటిష పరిపాలనారంభంలో పాఠశాలల్లోనూ, కోర్టుకచేరీలల్లోనూ 1836-1872 వరకూ అసామీ భాషకు ప్రచారం లేదు. అందుచేత ఆ యుగంలో అసామీభాషావికాసం అంటూ లేదు. అసామీయులు అధికారాన్ని కోలుపోయిన 1836 లోనే కొందరు అమెరికన్ బాప్టిస్టు మిషన్ సభ్యులు అస్సాములో ప్రవేశించిరి. వారు తమ మత ప్రచారం నిమిత్తము ఇతర పరికరాలతోపాటు ముద్రణ యంత్రాన్ని కూడా పట్టుకొని వచ్చారు. 1846 లో అమెరికన్‌మిషనరీలు శిబ్ సాగరునుండి, అసామీభాషలో 'అరుణోదయ' అనే మాసపత్రికను ప్రకటించినారు. ధర్మ ప్రచార సంబంధమయిన కరపత్రాలతోపాటు, వారు వివిధవిషయాలను గురించి స్కూళ్ళకొరకు పాఠ్యగ్రంథాలు ప్రకటించారు క్రైస్తవ ధర్మ ప్రచారకుల యత్నాలకు స్థానిక నాయకుల అభిమానం తోడుపడటంవల్ల, 1882 లో అసామీభాష న్యాయమైన యథా పూర్వస్థితిని పొందింది. ఆ యుగంలో సాహిత్య సృష్టినిగూర్చి పి. హెచ్. మూర్ అనే మిషనరీ, విద్వాంసుడూ, భాషావేత్త 1907 లో ఈ విధంగా అన్నాడు :- "క్రైస్తవముకాని, క్రైస్తవేతరముకాని — ఆధునికమని చెప్పదగిన సాహిత్యం అసామీలో, 19 వ శతాబ్ది తుది అరవయ్యేళ్ళ ల్లోనే సృష్టి అయినది. బ్రౌన్, బ్రోన్‌సన్, నిధిలెవీ అనే ముగ్గురున్నూ అసామీయ క్రైస్తవ సాహిత్య స్థాపకులలో ప్రముఖులు."

కాని చెప్పుకో తగిన సాహిత్యమంటూ ఇరవయ్యో శతాబ్దారంభంతో వచ్చింది. ఆ వికాసానికి కలకత్తా కళాశాలల్లో పాశ్చాత్య విద్యాభ్యాసం చేసిన అసామీయ యువకుల ప్రయత్నాలు కారణం. కలకత్తాలో అధ్య

ఘనం చేస్తున్నప్పుడే చంద్రకుమార అగర్వాలు (1858-1938), లక్ష్మీనాథ బెజ్‌బారువా (1868-1938), హేమచంద్ర గోస్వామి (1872-1928), పద్మనాథ గోహాయిన్ బారువా (1871-1946) ప్రభృతులగు మిత్రులు 1889 లో జోనకి (మిణుగురు పురువు) అనే పత్రికను స్థాపించినారు. ఆ పత్రిక ఆంగ్లదేశంలో 'కాల్పనిక భావోద్యమం' [1] వంటి లక్షణాలు కలిగిన కావ్యసాహిత్య రీతులలో కొన్ని రాగాలు స్వరాలూ పలికింది. ఆధునిక అసామీయ సారస్వతోజ్జీవనానికి జాతీయ చైతన్యమే మూలంగా అందరూ గణిస్తున్నారు. ఆ చైతన్యోజ్జీవనం ఈ రచయితల్లో ఉదయించింది. వీరూ వీరి అనుయాయుల్లూ ఒకే కక్ష్యలో గమించి, బహుముఖంగా భావవ్యక్తీకరణం చేసినారు. ఈ కవులు కోమల భావగీతారచనమేకాక దేశభక్తి ప్రబోధక కవిత్వాన్ని, ఒజోమయ వర్ణనాత్మక కవిత్వాన్ని, సారస్వత సామాజిక మత ధార్మిక వ్యాసాలనూ, కథానికలనూ, నాటకాలనూ, నవలలనూ రచించినారు అంతటితో తృప్తిపడక ఐతిహాసిక పరిశోధనలోనూ, జానపద గేయ, కథాగీత సంపాదనవంటి వ్యాసంగంలోను ఉత్సాహపరులైనారు.

కాల్పనిక భావోద్వేగవాదులు- మొదటి తరంవారు - ఆ కవులకు ప్రధానంగా భావోద్దీపనం ఆంగ్లసాహితివల్ల కలిగింది. ప్రణయసౌందర్యాలను కావ్యవస్తువులుగా స్వీకరించి వారందరూ భావగీతాలల్లినారు. ఆ కవులలో లక్ష్మీనాథ బెజ్‌బారువా సర్వతోముఖ ప్రజ్ఞాశాలి. ఆయన మహాకవి. గొప్ప వ్యాసకర్త, ప్రఖ్యాత పత్రికా రచయిత కూడా. ఆయన చేతుల్లో కవిత, సంప్రదాయ శృంఖలాలనుండి విముక్తమయింది. ఆయన కొత్త బాణీలో కవితాగానము చేయ తలచినాడు. నవ్యసాహిత్య ప్రక్రియలను, నూత్నశబ్దవిన్యాసాన్ని, సాహిత్యంలో ప్రవేశపెట్టినాడు. లక్ష్మీనాథ కవి భావకవిత్వాన్నీ, ప్రకృతి పరంగా కావ్యాలనూ, కథాకథనాత్మక కవిత్వాన్నీ, ద్విపదలవంటి వాటినీ, రచించి ప్రముఖంగా సారస్వత సేవ చేసినాడు. దేశభక్త్యాత్మక గేయాల్లో 'అమార్ జన్మభూమి',

1 రొమాంటిక్ ఉద్యమం

'మోర్‌దేశ', 'అసాం సంగీత్', 'బీన్ బరగి' వంటి రచనలలో లక్ష్మీనాథుడు అసామీయ పురావైభవాన్నీ, మహోన్నత సంస్కృతినీ, చరిత్రనూ ప్రగాఢ దేశభక్తి వివశుడై కవితా గానము చేసినాడు. కాల్పనిక భావోద్వేగంచేత అదర్శ ప్రాయమైన గతగాథలు బెజ్‌బారువా హృదయంలో జాతీయభావాన్ని ఉద్దీపిత మొనర్చెను. ఆయన రచనల్లో అసాముకు, సర్వతోముఖమైన భావ్యభ్యుదయం కలదనే విశ్వాసం గోచరిస్తుంది. కేవలము రాజకీయమూ భౌతికమేకాక రసిక నైతికాభ్యుదయం కూడా కలుగుతుందనే ఆయన విశ్వాసం.

దేశభక్తితో కమలాకాంత భట్టాచార్యు డనే మరొక కవి కూడా కవిత్వము చెప్పినాడు. విస్మృతమై, సుప్తమైన జాతీయ సంస్కృతీ వైభవాన్ని జాగరితమూ, ఉజ్జ్వలమూ చేయడంతోనే ఆయన దేశాభిమానము ఆగలేదు. దేశానికి ప్రజాతంత్రం అవశ్యమని ప్రజాహృదయానికి పదే పదే ఆయన నచ్చ చెప్పెను.

'చింతా', 'చింతా తరంగ' అనే ఆయన ఖండకావ్య సంపుటాలు రెండూ ప్రసిద్ధి గాంచినవి. స్వేచ్ఛారాహిత్యంవల్ల దేశానికి దాపురించిన అనర్థాలు ఆయనకు తీవ్రహృదయవేదన కల్గించెను.

చంద్రకుమార అగర్వాలా సొగసుగా కొన్ని పద్యాలు చెప్పినాడు. అవి 'ప్రతిమా', 'బీన్‌బరగి' (వేణుగీతి) అనే ఖండకావ్యాల్లోవి. కవిపై ఫ్రెంచి తత్త్వవేత్త అయిన అగష్టు కాంటే ప్రభావమూ, వైష్ణవీయ మానవ సేవా భావమూ ప్రసరించినవి. దుర్గేశ్వర్‌శర్మ, నీలమణిఫుకన్ అనే కవులిద్దరు ఆధ్యాత్మిక భావ ప్రధానులు. దుర్గేశ్వరశర్మ, తాత్త్విక కవి కావడం చేత జీవితం, ఈశ్వరత్వం, ఆత్మజ్ఞానం, వంటి వాయన కెక్కువగా నచ్చేవి. నీలమణిఫుకన్ కవితలో అనుభూతికన్న భావపుష్టి అధికం. ఆయనకున్న సౌందర్యతృష్ణ 'మానసీ' (విజ్ఞానమయ సౌందర్యం) అన్న కావ్యంలో గోచరిస్తుంది. 'సంధ్య' (అన్వేషణ) అన్న కావ్యంలో అదే రీతిగా అమరమైన సత్య సౌందర్యాన్వేషణం గోచరమవుతుంది. 1942 లో ఫుకన్ ఆగష్టు విప్లవంలో పాల్గొనడంవల్ల కారాగార బద్ధుడైనాడు. ఆయన కారాగార అనుభూతులు 'జింజిరీ' (శృంఖలాలు) అన్న కావ్యంలో నిబద్ధమైనవి.

హితేశ్వర బార్బారువా ఆంగ్లసాహితిని అధ్యయనము చేసినాడు. షేక్స్పియర్, వర్డ్స్వర్త్, మిల్టన్ వంటి ఆంగ్లకవులవల్ల అయన ప్రభావితుడైనాడు. బ్లాంక్‌ఛందస్సు, సానెట్, విషాదకావ్యం అనేవి హితేశ్వరునివల్ల మా అసామీయ సాహిత్యాని కాయన పెట్టిన భిక్షమే. బ్లాంక్ ఛందస్సు ప్రబేధాలలో అయన మైకేల్ మధుసూదన దత్తుతో అగక, షేక్స్పియరు లక్ష్యాలనుగూడా చూరగొనెను. అయన కావ్యాలలో 'కాంతాపూర్ ధ్వంస' (1912), 'యుద్ధక్షేత్రే ఐహోంరమణీ' అనేవి ఐతిహాసికాలు. ఈ రెంటి ఇతి వృత్తాలూ ఐహోము చరిత్రనుంచి కవి స్వీకరించినాడు. ఆ కావ్యాలు వీరరస పూరితాలు. ఓజోగుణ ప్రధానముల్తైన అతని మాతృదేశభక్తి పద్యాలు అసామీయుల నాలుకలపై ఆడుచుండును.

మాతృదేశ చిరబంధముక్తికై
రణరంగంలో యుద్ధంచేస్తూ
అసువుల నెవ్వడు అర్పిస్తాడో
కరగత మతనికి పరమానందం.
మృత్యు వాతనికి విశ్రాంతి
జగజ్జనని ఒడిలో సుఖముగ కనుమూసే
అతనికి అగ్నియె చల్లని వెన్నెల
మృణ్మయ తల్పమె సుమశయ్య
శూల పాతములు విరిజడులు

ఆ యుగంలోనే వాడేఐన అంబికాగిరి రాయచౌదరీ కవిత మనోరంజకమైనది. ఆయన కవిగా, గాయకుడుగా, గేయకవిగా, పత్రికా రచయితగా, రాజకీయాందోళనకారిగా, దేశాభిమానిగా ఖ్యాతితెచ్చుకొన్నాడు. యౌవన దశలో ఆయన ప్రణయ భావకవిత్వం అతి సుకుమారంగా చెప్పినాడు. ఆయన రచించిన 'తుమి' (నీవు) అన్న సాంకేతిక కావ్యం తొలిసారి 1915 లో ముద్రితమైంది. పది మాత్రలతో గంతులువేసే పద్యపంక్తుల్లో తులలేని సౌకుమార్యం, కోమల మధుర సంగీతం జాలువారుతవి. 'తుమి' లో కావ్యవస్తువు సౌందర్యాలోకం. ఆ కావ్యం ఇంద్రియ విషయలాలసాతీతమైన భావచిత్రణంతో ఉట్టిపడుతున్నది. అనంతర

జీవితంలో• స్వాతంత్ర్యోద్యమంతో సన్నిహిత సంబంధంవల్లా, తత్కార ణంగా కారాగారప్రాప్తిచేతనూ, ఆయన జీవిత దృక్పథమూ కవితా దృష్టిన్నీ చాలా పరివర్తనం పొందినవి. ప్రస్తుతము• అంబికాగిరి ఆవేశపూరితాలైన రాజకీయ కావ్యములు రచిస్తున్నాడు.

ఆ యుగంలో ప్రముఖ కవికోటిలోవాడు రఘునాధచౌదరీ. సామా న్యంగా ఆయనకు 'విహగికవి' అని పేరు. అనగా ఆయన పక్షులను కావ్యవస్తువులుగాచేసి కవిత చెప్పినాడు. ఆయన ప్రథమ కవితాసము చ్చయం, 'సదరి' (ప్రియురాలు)తోనే ఆయనకు పక్షులమీదా పువ్వుల మీదా కల అభిమానం వ్యక్తమైనది. కొన్నాళ్ళకు ఆయన•'కేతకి'(కోయిల), 'దాహి-కతదా' (తోక ఆడింపు) అన్న రెండు దీర్ఘకావ్యాలు ప్రచురించి నాడు. ఆ కావ్యద్వయంలో పక్షులు కావ్యవస్తువులై కవిమానసములో సుప్రతిష్ఠితమైనవి. కేతకికావ్యంలో కోకిలరాక పుడమికి నూతనజన్మగా కవి భావించాడు. మానవుల అనుభూతికి అందని మధురస్వర మేళవంటి 'నిరుపాధికానందం' ఏదో కేతకిగానంలో వినిపిస్తుంది. మనోహరమైన ప్రకృతి సౌందర్యాన్ని బహుభంగుల వర్ణించేందు కీ వస్తువు కవికి బాగా ఉపకరించింది. ఆ వర్ణనలో కాళిదాస కవీంద్రుని గాఢప్రభావము గోచరిస్తున్నది.

యతీంద్రనాథ దుయరా [1] కవిలో కాల్పనిక భావరుగ్మతామయ మైన అద్వైతిక నైరాశ్యవాదము సంపూర్ణంగా వ్యక్తమవుతున్నది. ఆయన కృతుల్లో స్వానుభవాలు, విరుద్ధసంచారిభావాలు, ప్రణయచాంచల్యం, రాగనైరాశ్యం, ద్యోతకమవుతూ ఉంటవి. ఆయనవల్ల ఆసామీయకవిత శబ్ద సమృద్ధితో, ఛందోలావణ్యంతో, రుచిర స్వచ్ఛనిసర్గ భావచిత్రణంతో సుసంపన్నమైంది. ఆయన భావచిత్రణా లెన్నో స్రవంతి, పడవ, పడవ వాడు—వీనినుంచి గ్రహించినాడు. అతని ప్రప్రథమకృతి, 'ఓమార్‌తీర్థ' (1926) అనేది ఖయ్యామ్ రచించిన 'రుబయ్యాత్' అనే పారశీక

---

[1] ఆయన వనఫూల్ అనే గ్రంథానికి స్వాతంత్ర్యప్రాప్తి తరువాత ఆసామీయసాహిత్యంలో అత్యుత్తమమైనదని సాహిత్య అకాడెమీ పారితోషికం ఇచ్చింది.

కావ్యానికి విశిష్టలలితానువాదం. వచన కవితా (కథకవిత) రచయితగా ఆయన ఖ్యాతి తెచ్చుకొన్నాడు. అసామీభాషలో పత్రచనలో ఆయనే కృతకృత్యుడు.

రత్నకాంత బర్కకతి రచించిన కావ్యాలు కోమలమైన ఐహికప్రణయ మాధురీ సౌందర్య విలసితాలు. రవీంద్రుని కవిత్వం ఆయన అధ్యయనంచేసి కొంతలాభం పొందినాడు, ముఖ్యంగా అందంగా శ్రావ్యంగా ఛందాన్ని నడపడంలో. దేవకాంతబారువా ఛందోగమనంలో అసామీయ కవితకు వైచిత్రిని కూర్చినాడు. దేవకాంతకవి రాబర్టు బ్రౌనింగు కవి వలె నాటకీయ పద్యాత్మక స్వగతాల మూసలో ప్రణయ పాకమును పోసినాడు.

దింబేశ్వర్ నియోగ్, బినంద చంద్ర బారువా, దేశభక్తి పూరిత కవిత్వం పాటవంతో రచించినారు. వారి కావ్యాలు, ప్రధానంగా పురాతన అసామీయ వైభవానికి నేటి సంశయగ్రస్థావస్థకూ వ్యత్యాసం చూపించుతవి. నేటికి రేపటికి ధైర్యాన్ని భావోద్దీప్తినీ, వెలుగునూ పూరించుటకే వారు గతాన్ని త్రవ్వి యెత్తుతారు. గత కాలపు వీరవరనారులను ఆ కవులు స్మరిస్తూ, వారి వలె నేటి వైదేశిక దాస్య శృంఖల చ్ఛేదనం చేయండనీ, మాతృభూమికి సర్వతోముఖ జీవిత వికాసాన్ని అభ్యుదయాన్ని కూర్చండనీ ఈ తరంవారిని ఆహ్వానిస్తున్నారు. భాషా సారస్వతాలు, సంస్కృతీ, ఆర్థిక జీవితమూ – సమస్తమూ పునః శక్తివంతము కావాలి. ప్రసన్న లాల్ చౌదరీ రచించిన దేశాభిమాన కవితలో భావతైక్ష్ణ్యము గోచరిస్తున్నది.

ఈ అర్థ శతాబ్దిలో మహిళారచయితలు లేఖిని పూనినారు. వారిలో నళినీ బాలాదేవి అతి ప్రవీణ. మర్మయోగ కవయిత్రిగా నళినీ బాల హృదయంలో అవ్యక్త వేదనా, ఇదమిత్థమనరాని తీవ్రకాంక్షా ఉన్నవి. సంధియర్ సూర్ (సంధ్యా సంగీతం), సపోనార్ సూర్ (స్వప్న సంగీతం), పరషమని (పరుసవేది) అనే ఆమె కావ్యసముచ్చయాలు మూటిలో ఇదే ఇతి వృత్తం. ఆమె కవితలో అనుస్యూతంగా సంసార తాపతప్తమైన హృదయ వేదన వ్యక్తమవుతున్నది. భక్త కవయిత్రిగా ధర్మేశ్వరీదేవి బారువానీ విఖ్యాత. ఫులార్ సరాయ్ (పూలసజ్జ),

ప్రాణార్ పరశ్ (ప్రాణస్పర్శ) అనే రెండు కావ్య సంపుటా లామె ప్రచు రించింది. విశ్వమే ఈశ్వరుడనే గాఢ విశ్వాసమూ, విశ్వాత్మయందు లీనం కావాలనే జీవునికాంక్ష ఆ కావ్యసంపుటాలలో వ్యక్తమవుతున్నవి. గద్య పద్య రచనలు చేస్తున్న నేటి యువతులలో సుప్రభా గోస్వామి, ప్రీతిబారువా, లక్షహీరదాస్, సుచిత్రతరాయ్ చౌదరీలను పేర్కొనాలి.

## యుద్ధానంతర కవిత్వం

గత ప్రపంచ సంగ్రామం దాకా అసామీయ కవిత్వంలో దివ్యప్రేమ, మానవీయప్రేమా, ప్రకృతీ, దేశభక్తి, ప్రధాన కావ్యవస్తువులు. అప్పటి నుంచీ మన తరుణ కవులు అధికంగా సోషలిస్టు, మార్క్సిస్టు సిద్ధాం తాల్లో అభినివేశం సంపాయించారు. వారు జీవితము సరళమూ సుఖ కరమూ కాదనీ, అనేక క్లిష్ట సమస్యలతో సంశ్లిష్టమనీ భావించారు. కావున పరస్పర విరుద్ధములగు సమస్యలే వారికి కావ్యవస్తువులు కావలసివచ్చెను. హాస్యచమత్కార వర్ణభేదములచే బహుభంగుల నొప్పారు జీవితము వారి గంభీర కావ్యాల్లో శబల రమణీయమై దర్శన మిచ్చును. నవ్యభావ వ్యక్తీకరణకోసం ఆ యువకవులుఐరోపీయ సాంకే తిక వాదుల కవితా సిద్ధాంత సంవిధానాలవైపు దృష్టి సారిస్తూ వచ్చారు. అందులో కొందరు టి. యస్. ఇలియట్, ఆధునిక వంగీయ కవులయిన బుద్ధ దేవబోస్, జీవనానందదాస్, అమియ చక్రవర్తి ప్రభృతుల ప్రభావ ముచే వశీకృతులైనారు. అలా ప్రభావితులు కావడానికి – చాలామంది అసామీయ రచయితలు కలకత్తా కళాశాలల్లో చదువుకోడం, లేదా వంగ కవిత్వాన్ని గాఢ సహృదయంతో అధ్యయనం చేయడం కారణం కావచ్చును. ఆ కవులు తమ రచనల్లో పెట్టుబడి దారుల దోపిడిని, వర్గ సంఘర్షణము, ప్రస్తుత సామాజిక వ్యవస్థ త్వరితంగా పరివర్తనం చెంద వలసిన ఆవశ్యకమునూ ఉట్టంకించినారు. నవ్య సాంఘిక వ్యవస్థలో ఉదయించే క్లిష్టకాముక సమస్యలు, మనసులోని ఆంతర చైతన్యంలో భాసించే క్లిష్టగ్రంథులను, అపరిచితమైన భాషలో శబ్ద వైచిత్రితో ఈ నవ్య కవిత్వము వ్యక్తము చేస్తున్నది. అంతేకాక, శాస్త్ర విజ్ఞానము నుంచి, మనోవిజ్ఞాన శాస్త్రాల్లోంచి భావవ్యక్తికోసం వీరు నవ్యపద

జ్ఞాలాన్ని స్వీకరించిరి. అందుచేత వారి కావ్య వస్తువులేకాక ప్రక్రియలు కూడా నవ్యాతి నవ్యములే. ఆ కవులు సాంప్రదాయిక కావ్యరూపాన్ని సంవిధాన లక్షణాలనూ త్యజించి, స్వేచ్ఛాఛందమూ, ప్రక్రియా వైవిధ్యమూ అవలంబించారు. వారి భావ చిత్రణము నవ్యమైంది. తొల్లిటి కవి సమయాలను గ్రహించినప్పుడు వాటిని అసాధారణ ధోరణిలో వ్యాఖ్యానిస్తున్నారు.

ఆ రచయితల్లో హేమబారువా సాంకేతిక కవితాపద్ధతిని అవలంబించ డానికి యత్నించిన వారిలో ప్రథమ గణ్యుడై నాడు. బారువాకవి భావ చిత్రాలు నవ్యమై, పరిహాసాత్మక వ్యత్యాస సంవలితమై, అసమగ్ర విపరీత సంవిధానాత్మకమైనవి. నవకాంత బారువాకూడా ఆ సాహిత్య ప్రక్రియా ప్రయోగాలు చేసినాడు. అతని 'హే అరణ్య హే మహానగర' అనే రచనలో వ్యావహారిక భాషతో కఠిన సంస్కృత పదజాలం చిత్రంగా కలపి ఉంటుంది. అందులో నూత్న కవితా శిల్ప మొకవంకా, ఆ చెంతనే సంశ్లిష్టభావ చిత్రణం కనిపిస్తుంది. నవకాంత బారువా, మహేంద్రబోరా అనే కవు లిద్దరికీ ఆంగ్ల అసామీ సంస్కృతబాషలనుంచి — అందరూ ఎరిగినవో, మారుమూల నున్నవో, ఎన్నడూ అనుకోని వాక్యాలను తమ రచనల్లో గుదిగూర్చి వాక్యాలంకారం సాధించటం, ఆ గుది గూర్చిన వాక్యాలను తరువాత వ్యాఖ్యానించటం పరిపాటి అయింది. నవ్యకవిత్వోద్యమానికి పత్రికల ప్రాపు లభించింది. వానిలో 'రామ ధనువు' అనే మాసపత్రిక ముఖ్యమైనది. నవ్యరచయితలందరూ ఏక కుటుంబములో వాళ్ళవలె కలిసిమెలిసి ఆ పత్రికద్వారా నూత్నకవితా ప్రకాశము చేసినారు. ఆ యువకవు లందరికీ సాహిత్యము, సామాజిక రాజకీయ విషయిక చర్చలకు, తత్ప్రచారానికి సాధనప్రాయమైంది. ఆ రచనల్లో ఒకవ్యవస్థా, ఒక క్రమమూకనుపించవు. ఆ పద్యాలు పత్రికా రచనాస్థాయిని మించి పోలేవు. వయస్సుమీరిన కవులు రచనా వ్యాసంగం విరమించడంవల్లనూ యువకవులుమాత్రం ఏదో ప్రయోగ ప్రాయమైన రచన సాగిస్తూఉండడంవల్లా అసామీయకవితకు దురవస్థ ప్రాప్తించినది. అసామీలో నిజముగా నవ్యకవిత అనిపించుకొన దగినది రావలసిఉన్నది.

## రూపకము

అసామీయభాషకు రూపక రంగశాల సంప్రదాయంషుసంపన్నంగా ఉంది. ఇప్పటికీ మధ్యమ యుగాలనాటి 'అంకీయనట' అనే రూపకం మన జనపదాల్లో జనరంజకంగా ఉంది. అయితే అధునికదృష్టిలో రూపకమనేది పాశ్చాత్యులవల్ల ప్రాప్తమైంది. అసామీయభాషలో పాశ్చాత్యనాటకరీతిలో అకృతిలో అదిలో నాటకరచన చేసినవారు, గుణాభిరాంబారువా, హేమచంద్రబారువా, రుద్రరాంబార్డొలాయి ప్రభృతులు. అయితే విశిష్టమయిన నాటకనిర్మాణశిల్పం లక్ష్మీనాథబెజ్ బొరువా, పద్మనాథగోహాయిణ బారువాల చేతుల్లో సుష్ఠుగా పరిణతి పొందింది. బెజ్‌బారువా రచించిన నాటకాల్లో దేశభక్తిభావాలు ప్రధానం. చక్రధ్వజసింహలో అసామీయచరిత్రలో ఒక ఉజ్జ్వలఘట్టాన్ని అయన చిత్రించినాడు. 1663—1669 లో ఐహోమురాజు చక్రధ్వజసింహుడు పరిపాలించినాడు. అప్పుడు పదేపదే ముసల్మానులు సమరధాటి చూపగా, ఆయన లచిత్‌బర్‌ఫూకన్ అనే సమర్థ సేనాపతినిపంపి శత్రు నిర్మూలనం చేసినాడు. ఆ ఇతివృత్తాన్ని బెజ్‌బారువా తన నాటకానికి గ్రహించినాడు. 1816 లో బర్మీయులు అసామీయులపై సమరం సాగించగా, తత్కాలీన పరిస్థితులను నాటకకారుడు చిత్రించడమే కాకుండా, అసాం స్వాతంత్ర్యం కోల్పోవడానికి కారణమైన ఐహోము రాజాస్థానపు క్షీణప్రాయ పరిసర వాతావరణాన్నికూడా చూపినాడు; 'బేలీమార్' (సూర్యాస్తమయం) అన్న నాటకంలో ఆయన 'జయమతి' అనే మరొక చారిత్రకనాటకంలో చరిత్రతో పాటు, 'దాలిమి' అనే అమాయికమైన నాగసుందరిపాత్ర చుట్టూ అద్భుత భావకల్పితమైన దృశ్య చిత్రణము చేసినాడు. లక్ష్మీనాథుని ప్రహసనాలు సామాజికుల కడుపులు చెక్కలయ్యేలాగ నవ్విస్తవి.

పద్మనాథ గోహాయిన్ బారువా గద్య రచనలోను పద్యరచనలోను మన మహాకవి శ్రేణిలోవాడు. ఆయన ఐతిహాసిక పౌరాణిక వృత్తాలతో నాటకాలు రచించినాడు; ప్రహసనత్రయం లిఖించినాడు. ఆయన జయమతి (1900), గదాధర్ (1907), సాధనీ (1911), లచిత్ ఫూకన్

(1915), అనే నాలుగు నాటకాలు ఐహోము చరిత్రను ఆధారం చేసికొని ఉల్లేఖించినాడు. వీనిలో ఆయన ఇతివృత్త వికాసంలోగాని, నాటక పరిమితిలోకానీ, నవ్య దృక్పథాన్నీ, నవ్యాలోకాన్ని, చూపడానికి శ్రద్ధ చేయలేదు. వృథా భావాతిరేకత, అసంభావితవిషయవర్ణన, ప్రకృతిపై ప్రేమ, ప్రయోజన శూన్య సంభాషణలు, అనుచితోల్లాప ప్రదమైన దృశ్యాలు, దానిలో ఇతివృత్త నిర్మాణ శిల్పానికి తోడ్పడవు. ఐతే గోహాయిన్ బారువా సామాన్య ప్రజలనూ జానపద దృశ్యాలనూ చిత్రించడంలో బహు చాతుర్యం చూపినాడు. 'గాఁవోఁ బురా' (గ్రామ కరణం) అన్న రచన ప్రసిద్ధి కెక్కింది. గ్రామకరణ ప్రహసనంలో పంధొమ్మిదో శతాబ్దపు తుది దశకంలోని బ్రిటీష పరిపాలనను వాస్తవి కంగా కవి చిత్రించినాడు. దీనబంధు మిత్ర కృతమైన 'నీలదర్పణ' మనే వంగనాటకంవలె, గ్రామకరణ ప్రహసనానికి ఒక విశేష ప్రాధాన్య మున్నది. ప్రస్తుత శతాబ్దారంభంలో అసామీయ నాటక సాహిత్యానికి ఆ నాటకం అమూల్యాలంకారం. నాటకంలో గ్రామకరణము అనుభవించే దుస్థితి వర్ణితమైంది. ఆయన భారమై బాధ్యతగల కరణీకపు గౌరవోద్యో గము వహిస్తాడు. అత డతి శ్రద్ధగా ఉద్యోగ నిర్వహణముచేయు ప్రయత్న ముతో సొంత వ్యవహారములు పాడయి పోవునంతటి చిక్కులోకి వస్తవి. అందుకు ప్రతిఫలంగా పెద్దా పిన్నా ప్రభుత్వాధికారులవల్ల లాభము గాని మెప్పుగాని లేక పోగా కేవలము అవమానము ప్రాప్తమవుతుంది.

చంద్రధర బారువా మరొక ప్రఖ్యాత నాటకకర్త. ఆయన మేఘనాథ వధ (1904), తిలోత్తమ సంభవ, మన్న రెండు పౌరాణిక నాటకాలూ బ్లాంక్ ఛందస్సులో రచించినాడు. మొదటి నాటకంలో ఇంద్రజిత్తు వధ కథావస్తువు. రెండవదానిలో తిలోత్తమ అనే అప్సరసకోసం సుందోప సుందులనే ఇద్దరు రాక్షసులు పోట్లాడుకొని నశిస్తారు. ఇతివృత్త కల్ప నలో పాత్రపోషణలో ఆ నాటకాలు రెండూ మైకేలు మధుసూదన దత్తుని ప్రభావాన్ని పొందినవి. భాగ్యపరీక్ష అన్న ప్రహసనంలో ఒకానొక నిర్ణయానికి రావడం జరుగుతుంది; విధికీ, సంపదకూగల గుణసాపే క్ష్యత నుద్దేశించి. ఆ ప్రహసనంలో వ్యావహారిక భాషలో ఉచిత సన్ని వేశ సమన్వితంగా వాస్తవికంగా జానపదజీవితం చిత్రితమైంది.

ఈ యుగంలో నాటకకర్తలు ప్రహసన రచనలో కృతార్థులైనారే కాని యితర నాటక రచనలో కాలేదన్న విషయం గమనార్హం. ప్రహసనాల్లో మిత్రదేవమహంతి రచించిన 'బీయబిపర్యయ' 'కుకరీకనర్ అధ మంగళ' అన్నవి బాగా విజయము సాధించినవి. దానికి కారణం కథావస్తువు వినోదకరంగాను, సంభాషణ ఉల్లాసకరంగాను ఉన్న హాస్యదాయకదృశ్యాలు ఉండుటే. స్వాతంత్ర్యం పరమలక్ష్యమైన అఖిలభారతీయ జాతీయోద్యమ శకంలో ఐతిహాసికనాటకాలు అసంఖ్యాకంగా వచ్చినవి. కథావస్తువులకు కావలసినంత ఐతిహాసపామగ్రి అస్సామీయులకున్నది. నకుల చంద్రభూయాన్ కృతమైన 'బదన్‌బర్ఫు కణ', ప్రసన్నలాల్‌చౌదరీ రచించిన 'నీలాంబర్', శైలధర రాజఖొ లిఖించిన 'స్వర్గదేవ్ ప్రతాప్‌సింగ్', దైవచంద్ర తాలూక్‌దార్ కృతమైన 'భాస్కరవర్మ' అనే ఉత్సాహోద్దీపనం కలిగించే చారిత్రాత్మక నాటకాలు ఈ శతాబ్దారంభంలోనివి. భాస్కరవర్మ అనే నాటకంలో తాలూకదారు ఒక ధీరోదాత్తనాయకుణ్ణి సృష్టిచేసి సజీవ మయిన చారిత్రక నేపధ్యము కన్నులు కట్టినట్టు చేసినాడు. పన్నెండు పౌరాణికనాటకాలు రచించి ఖ్యాతిపొందిన అతుల చంద్రహాజారిక 'కనౌజ్ కువారి', 'ఛత్రపతి శివాజీ' వంటి భారతేతిహాసాత్మక కథావస్తువులుకూడా, నిర్వహించి కృతకృత్యుడైనాడు. అసామీయరంగానుకూలంగా హజారికనాటకాలు రచించినాడు. ఆయన రాకపూర్వం సాహిత్యరంగంలో, రంగశాలలో వంగ నాటకకర్తల నాటకాలే ప్రయోగింపబడుతూ ఉండేవన్నవిషయం గమనార్హం. ఇలా హజారికవల్ల వంగీయులమీద ఆధారపడవలసిన అవశ్యకత లేకుండా పోయింది.

స్వాతంత్ర్యం ప్రాప్తమైనప్పణ్ణించీ విప్లవాత్మక చారిత్రకనాటకాలు అధికంగా దేశభక్తిపూరితదృష్టితో రచించినవి వస్తూ ఉన్నాయి. చంద్రకాంత ఫూకన్ రచించిన 'పియాలీఫూకన్', ప్రవీణఫూకన్ కృతమైన 'మణిరామ్‌దివాన్' అన్న నాటకాల్లో బ్రిటీషువారిని తరుముటకు రహస్యంగా కుట్రలుపన్ని దేశస్వేచ్ఛకై కృషిచేసినఇరవయ్యో శతాబ్దిలోని ఇద్దరు దేశభక్తులజీవితం రూపితమైంది. దురదృష్టవశాన ఆ దేశభక్తులిద్దరూ ప్రభుత్వానికి పట్టుబడ్డారు. చివరకు విచారణకూడాలేకుండా

ప్రక్షభుత్వము వారిద్దరినీ ఉరితీసింది. సురేంద్రనాథ సైకియాకృత 'కుషాల్‌కోవార్' అనే నాటకంలో 1942 అగస్టు విప్లవోద్యమంలో ఆత్మ బలిదానంచేసి అమరవీరుడయిన కుషాల్‌కోవార్ జీవితం చిత్రితమైంది. ఈ నాటకంకూడా బాగా విజయవంతమైంది.

కమలానంద భట్టాచార్యుని 'నాగకోవార్' జ్యోతిప్రసాద్ అగర్వాలా 'శోణితకువారీ', 'కారింగార్‌లిగిరీ' అన్న నాటకాలు కాల్పనిక బావోద్వేగాత్మకంగా రచింపబడ్డవి. ఆధునిక అసామీయ నాటకచరిత్రలో రంగవికాసంలో, జ్యోతిప్రసాద్ అగ్రవాలా విశేషఖ్యాతికలవాడు. ఆయన భావగేయాత్మక నాటకకర్తే కాకుండా దేశభక్తుడూ, ప్రథమ శ్రేణిలో గణ్యుడయిన కవి శేఖరుడుకూడాను. ఐరోపాఖండంలో జ్యోతిప్రసాదు శిక్షణ పొందినాడు. తత్ఫలితంగా ఆయన గేయాలలో, స్వరకల్పనలో, నాటక లక్షణాలలో వైదేశిక ప్రభావం గోచరిస్తుంది.

## నవల

ఇరవయ్యో శతాబ్దికి పూర్వము చెప్పుకోతగ్గ నవలలు అసామీయ సాహిత్యంలో అంతగాలేవు. రజనీకాంత బార్డోలాయివల్ల సర్వాంగీణమైన నవల బావనా పటిమగల వచన కావ్యసృష్టిగా రూపొందింది. బురంజీల నుంచి ప్రధానంగా కథావస్తువులు స్వీకరించినాడు రజనీకాంతుడు. కాని ఆయన ప్రథమ నవల 1895 లో 'మిరిజీయారీ' (మిరీకన్య) లిఖించినాడు. అది మాత్రము ఐతిహాసికముకాదు. మిరీ జాతి కన్యకూ మిరీజాతి యువకుడికీ ఏర్పడిన ప్రణయము, నవలలో కథావస్తువు. సువంశిరీనదీ తీరాన కథ నడుస్తుంది. నదీ నేపథ్య చిత్రణాన్ని నవలాకారుడు ఉదాసీనంగాకాక విషాద మానవగాదతో ఓతప్రోతంగా పెనవేసుకొన్నట్టు రూపించినాడు. ఈ విధంగా ఆటవికుల జీవితాన్ని చిత్రించటము, జడప్రకృతిలోని వస్తువులను చైతన్యవంతము చేయడమున్నూ ఆధునిక అసామీయ సాహిత్యం తొలిరోజులలో అసాధారణము. బార్డోలాయి మరో రెండు నవలలు రచించాడు. మనోమతి (1900), రహదాయ్‌లిగిరి 1930) అనే నవలల్లో ప్రణయం ప్రధానవృత్తం. ఆ రెండు నవలలకూ నేపథ్య చిత్రణం అస్సాంమీద బర్మా దండయాత్ర. 'దందువ ద్రోహ

అనే మూడో నవలలో 18 శతాబ్దినాటి రాజకీయోద్యమ - వాతావరణం చిత్రితమైంది. 1909 లో ఆ నవలకు పీఠిక వ్రాస్తూ ఆయన స్వదేశంలో ఉన్న పర్వతముల, లోయల సౌందర్యాన్ని ఆస్వాదించడానికి కారణం వాల్టర్‌స్కాట్, బంకిమచంద్ర ఛట్టోపాధ్యాయుల గ్రంథాలు తన హృదయాన్ని కదల్చడమని అన్నాడు. అందుచేత ఆయన అసామీయ చరిత్రనుంచి కథావస్తువు స్వీకరించి, స్వదేశప్రకృతిని నేపథ్యంగా చిత్రించి రచనలు కావించినాడు. తరుచుగా గతించిన ప్రజాశౌర్య గాథలను, దేశంలోఉన్న వైష్ణవము గుణాతిశయమునూ అభిమానించి గ్రంథకర్త రూపించడంవల్ల ఆయన రచనలలో ప్రచార పత్రికాధోరణి మధ్య మధ్య కనిపిస్తున్నా నవలా కారుని ప్రథానోద్దేశ్యం కథా కథనం కావడంచేత ఆయననవలలు ప్రజాహృదయం చూఱగొన్నవి. పద్మనాభ గోహయిన్ బారువా రచించిన 'లహరి', 'భానుమతి' అనే రెండు నవలల్లో కథావస్తువు ప్రణయము. ఈ నవలల్లో ఐహోము రాజుల పాలనము నేపథ్యభూమిగా చిత్రితమైంది. చరిత్రాత్మకమైన నేపథ్య దృశ్యచిత్రణ చేసినా, ఏ నవలా కూడా ప్రత్యేకంగా చారిత్రక మనడానికి వీలులేదు. దైవచంద్ర తాలూకదారుడు, దండినాథ కలిత తమ నవలల్లో స్త్రీ పురుష సంబంధాలను అన్వేషించినారు. ఈ విషయంలో బార్దొలాయికన్న, వారు కొంత ముందుకు వెళ్ళినారు. తాలూకదారు గాంధీయ భావాలు పొందుపరచినాడు. 'ఆదర్శ పీఠం' (ఆదర్శ భూమి) అన్న నవలలో కలిత రచించిన 'సాధనలో' కూడా ఇటువంటి ఆదర్శ ధోరణే వ్యక్తమవుతుంది.

అసామీయ నవలాసృష్టి ఎలాగయినా సంఖ్యలో పరిమితము. గత దశాబ్దాంతందాకా నవల పరిపాకాన్ని పొందలేదు. ఇటీవల అది ఉన్నత స్థాయి నందుకొన్నది. నవలల్లో నవ్య ధోరణులు వచ్చినవి. పురాతనమైన కాల్పనిక భావోద్వేగతనుంచి విడివడి నవలలు వాస్తవికంగానూ, మనో విశ్లేషణాత్మక రీతుల్లోనూ రచింపబడుతున్నవి. ఆధునిక, నవలా కారుల దృష్టి ఇంతవరకు సమాజములో సామాజికమూల్యము విస్మృతులైనవారిపై ప్రసరింపసాగి, అట్టివారి విలువలు నిర్ణయించుటకు పూనుకొన్నది. అలాంటి నవలల్లో అసాం జానపద జీవితానికి సంబంధించిన 'జీవనేర్ బతాత్'

(ఉన్నత జీవన పథము) లో యథార్థ జానపద జీవితము చిత్రితం కావడంవల్ల జనప్రీతిదాయకమైంది. హితేష్‌దేక రచించిన ' అజీర్ మనుష్ ' (యుగమానవుడు), ఆద్యనాథశర్మకృత ' జీవనార్ తీన్ అధ్యాయ్' (జీవనాధ్యాయత్రయం), చంద్రకాంత గొలాయ్ కృత 'సోనార్ నంగల్ ' (పైడినాగలి), గోవింద మహంతి రచించిన ' కృషికార్ నాటి ' (కృషిక సంతతి) సామాజిక జీవితము చిత్రించు ప్రముఖ నవలలు. నవకాంత బారువా ' కపిలీ పరీయ సాధువు ' అన్న నవలలో, ప్రేమ గాథ కల్పించి, దాని చుట్టూ, ఏటేటా చాపల్యంతో ప్రవాహగతి మార్చు కొంటున్న కాపిలీనదీతీరాన నివాసము చేస్తున్న దౌర్భాగ్యుల జీవితము చిత్రించినాడు. ' దవర్ అరునయ్ ' (మబ్బులు లేవింక) అన్న నవలలో జోగేశదాసు గత ప్రపంచ సంగ్రామ ఫలితంగా సమాజంలో నైతిక ధార్మిక భావాలలో కలిగిన విచ్ఛిన్నత చూపినాడు. కథాకథన శిల్ప నైపుణికల వీరేంద్ర కుమార భట్టాచార్య ' రాజపథేరింగియై ' ' రాజ మార్గపు పిలుపు ' అన్ననవలలో సమాజంలో ' లోపాలు ' సరిదిద్దాలనే విప్లవ యువకుని జీవితము రూపించినాడు. వైజ్ఞానిక దృష్టితో, మన స్తత్వ ధోరణిలో ఈ నవలను గ్రంథకర్త తీర్చి దిద్దినాడు.

మనస్తత్వము చిత్రించు మరికొన్ని నవలలు ఇటీవల తమ కథా సంవిధానంవల్లనూ, మనసులో అడుగు పొరలో తారాడే భావాంకు రాలనూ ఆకాంక్షలనూ చిత్రించడం చేతనూ జనామోదం పొందినవి. ప్రఫుల్ల దత్త గోస్వామి కృత ' కేచ పతర్ కపని ' (కంపిస్తున్న ఆకు జొంపము) అన్న నవలలో ఆదర్శ సంబంధమయిన సమస్యవల్ల అస్థిరమైన ఒకానొక యువకుని మానసం వర్ణితమైంది. రాధికామోహన గోస్వామి రచించిన ' చక్‌నైయా ' (సుడిగుండం) అన్న నవలలో ఆధు నిక సమాజ పరిసరాలకు అనుగుణంగా జీవించలేక భగ్నమనోరథు డైన ఒకానొక యువకుని జీవితము చిత్రితమైనది.

## కథానిక

ప్రాశ్చాత్య ప్రభావంవల్ల కథానికావికాసము కలిగింది. కథానికా శిల్పాన్ని పరాకోటికి ప్రాపింపచేసిన ప్రప్రథమరచయిత లక్ష్మీనాథ

బెజ్‌బారువా. ఆయన యావజ్జీవమూ, పత్రికాసంపాదకుడై సంపాదకీయ దృష్టితో కథానికాసమీక్షచేయడం అలవరచుకొన్నాడు. పత్రికలో తావు పరిమితమైనప్పుడు కథాపరిమాణం, భాష, సంక్షిప్తంగా ఉండాలి. బెజ్‌బారువా రచించిన చిన్నకథలు (ప్రస్తుతం మూడు సంపుటాలుగా సాధుకథర్‌కూకి, జోనబీరీ, సురభి,) జీవితశకలాలను చిత్రిస్తూ, అనుభూతి లేశాలనూ, క్షణికముద్రిత మనోభావాలనూ ప్రదర్శిస్తున్నవి. ఆయన, శరచ్చంద్రగోస్వామిన్నీ తమ కథానికల్లో ప్రాంతీయ వర్ణికా లేపనం ప్రదర్శించినందువల్ల వాటిలో వాస్తవికత, ప్రధానలక్షణ మన దగును. మాధ్యమిక వర్గీయుల శ్లిష్టసంకీర్ణ మనస్తత్వం వారి భాషను సంకోచింప జేసినా గాఢ మానవభావాలూ హాస్యమూ కరుణా వారికి అందుబాటులో లేకపోలేదు. నగేంద్రనారాయణచౌదరీ, త్రైలోక్యనాథ గోస్వామిల కథల్లో గాఢసామాజిక చైతన్యం గోచరిస్తుంది. గోస్వామి కథలు 'అరుణ', 'మరీచికా' అనే రెండు సంపుటాలుగా వచ్చినవి. వాటిలో మనకు చుట్టూ నిత్యమూ అనుభవసిద్ధమయ్యే జీవితశకలాలు వర్ణితమైనవి. అరుణలో 'జరజ' అన్న కథానిక మిక్కిలి ఓజోవంతమైనది. రతన్ వివాహము కానివారికి జన్మించినందువల్ల నిర్దాక్షిణ్యమైన సామాజిక పీడనానికి గురిఔతాడు. 'విధవ' అనే మరొకకథలో వితంతువులయిన తల్లీకూతుళ్ళబాధా, సాంఘికంగా పడే కష్టాలూ చిత్రితమైనాయి. 'మరీచికా' అన్న సంపుటంలో కథలు, రెండో ప్రపంచయుద్ధంవల్ల సంభవించిన ఆధివ్యాధులకు, విశేషంగా సంబంధించినవి. గోస్వామి కృతమైన 'జీయమను' (జీవిస్తున్న మానవుడు) చిన్ననవల. యుద్ధంవల్ల సామాజిక నీతికీ ధర్మానికీ సంబంధించిన గ్లాని, తన్నివారణకు అవశ్యకమైన సంస్కరణాలున్నూ ఈ నవలలో ప్రధాన వస్తువులు. మాహెబోరా లక్ష్మీనాథఫూకన రచించినకథల్లో ఉత్తమమైన అసామీయ హాస్యం జాలువారుతుంది. హలీరాందేకా కథలు విలక్షణ పరిహాసాత్మక దృక్పథముకలవి.

అసామీయ భాషలో లక్ష్మీనాథశర్మ అత్యంతమూ ఆధునికమైన ధోరణిలో కథానికలు రచించినాడు. ఆయన కథల్లో తొలిసారిగా స్త్రీకి, ఆమె రసభావాలకూ తావు ఏర్పడింది. చాలామంది కథారచయితలు ఆయన తరువాత వచ్చారు. వారు ఆధునిక మహిళలను వారి ప్రణయ

గాథలూ వర్ణించినారు. వారు బీణాబారువా, రామదాస ప్రభృతులు. బీణా బారువారచించిన 'పటపరివర్తక' (దృశ్యపరివర్తనము) అన్నకథా సముచ్చయంలో కళాశాలా విద్యార్థినుల జీవితమూ, భావాతివేలమైన ప్రణయ చాంచల్యమున్నూ వర్ణింపబడినవి. ఆయన జానపద జీవితాన్ని కూడా చిత్రించినాడు. అఘోనీబాయ్ అన్న కథానికా సంపుటంలో ప్రధాన కథానిక, అఘోనీబాయ్ అన్నది సుదీర్ఘమైనది. అందులో అఘోనీబాయి అనే గ్రామీణవనిత ఇతర జానపదులకు పాయిలాపాయిలాగా నిత్యమూ ఉండేది. వారి సుఖదుఃఖాలకు సానుభూతి చూపేది. ఆమెది మాత్రము విషాద జీవితము. అందులో జానపదచిత్రాలు రమ్యమై సుసంపన్నంగా ఉన్నవి. కథానికా శిల్పనైపుణివల్లా కథన సంవిధాన చమత్కారంవల్లా రామదాసు పాఠకుల మనసు చూరగొంటాడు. ప్రస్ఫుటవర్ణన, రమణీయ సంభాషణ, భావపూర్ణత, భావసూక్ష్మతాభివ్యక్తీకరణ సామర్థ్యము, ఈ గుణాలవల్ల, అసామీయ భాషలో అతని కథలు ఉత్తమ స్థాయికివచ్చినవి. సమాజము సామాన్యంగా అంగీకరించని నిషిద్ధ ప్రణయోన్మత్తతకు సంబంధించిన కథ లవి. ఇందుకు కథారచయిత మనోవిశ్లేషణము, సానుభూతినీ తెచ్చిపెట్టినాడు. సేతుబంధన్, బరస జేతీయ నామే (వేసవి వచ్చినప్పుడు) వంటి కథానికలలో ఇది విశదము. దీనానాథశర్మ రచించిన 'ఉష', 'సంగ్రామ్' అనే నవలలు రెండూ కొంత జనామోదము పొందినవి. అయితే (1952) దులాల్, (1953) అకాల్ సరియ, (1952) కోవాభటురీయ ఓధర్ తలాల్, కల్పనా అరుబస్తవ, అన్న వాటిలోని కథానికలవల్ల ముఖ్యంగా ఆయన ప్రసిద్ధుడైనాడు. శర్మ ఎక్కువభాగం ప్రణయ కథలు, అవి హేయ వ్యభిచార జీవితాన్ని, అందులో ముఖ్యంగా స్త్రీలదే చిత్రించినాడు. 'సావరణ' అనే కథలో ఆయన, నవపరిణీత అయిన భార్యయొక్క అసంతృప్త ప్రణయమూ, స్త్రీ మానస సంశ్లిష్టతనూ గాఢంగా పరిశీలించి వర్ణించినాడు. ఆయన అభిరుచులు పరిమితాలు. కథావస్తువులు ఒకే తీరుగా సంకుచితంగా ఉంటవి.

లక్ష్మీధరశర్మ అనంతరము వచ్చిన కథారచయితలు రెండో ప్రపంచ యుద్ధందాకా, ఫ్రాయిడ్‌వల్ల ప్రధానంగా ప్రభావితులైనారు. ఖండాంతర

గ్రంథకార్ల రచనలు అధ్యయనము చేయడంవల్ల ఆ కథకులు కామ వాసనా ప్రేరితులైనారు. చాలామంది రచయితలు అక్రమ ప్రణయ విలాసాన్ని, విశృంఖల కామాకర్షణనూ నిస్సంకోచంగా, అవి తక్కిన జీవిత సత్యాలలాగ యథార్థాలైనట్లే ఆమోదించారు. అందుచేత కాముక ప్రణయాన్ని బట్టబయలుగా అక్రమంగా నిస్సందేహంగా అనౌచిత్యమని అనుకోకుండా రచయితలు వర్ణించారు. వారు నూత్న సామాజిక నేపద్యంతో స్త్రీ పురుషుల ప్రధాన సంబంధాన్ని వినూత్నంగా నిర్ణయించాలని వాంఛించినట్లు తోస్తుంది.

రెండో ప్రపంచ యుద్ధానంతరం, కవిత్వం, నాటకాలూ, నవలలవలె, కథానిక కూడా పరివర్తనం చెందింది. కథానిక గ్రహించిన సమస్యలు మధ్యమ తరగతివీ, కార్మిక కర్షకులవిన్నీ, నవ్యసామాజిక ఆర్థిక పరిసరాలు, అననురూపతలూ, అవకాశాలు అందరికీ సమంగా లభ్యంకాక పోవడం — ఇవి ఈ నాటి కథలకు మూలవస్తువులు. ద్వితీయ ప్రపంచ యుద్ధంవల్ల వచ్చిన సామాజిక రాజకీయ నైతికోల్బణానికి సంబంధించినవి ఆ కథలు. వాటికి నూత్నమైన విలువలు నిర్ణయం చేయడానికి కథకులు యత్నిస్తున్నారు. తొలినాటి సాంఘిక వ్యవస్థలో కర్షకుడు సంతృప్తితో గడిపిన జీవితానికిన్నీ, నవ్యసామాజిక వ్యవస్థలో రేగుతున్న కార్మికుల అసంతృప్తి, బాధ, హింస, దోపిడీ, ఆగ్రహావమాన ద్వేషాలకున్నూ, కల వ్యత్యాసం చిత్రిస్తున్నవి కథలు. ఈ రచయితలలో అబ్దుల్ మాలిక అసామాన్య కథావస్తు నిర్మాణంవల్ల, ఉల్లాసదాయకమైన భాషవల్ల, విశేషఖ్యాతి ఆర్జించినాడు. జోగేష్‌దాస్, వీరేంద్రకుమార భట్టాచార్య, హెమెణ బార్గో హైణ, భబేంద్రనాథ సైకియా ప్రభృతులు కూడా ఎన్నో విధాలుగా రక్తీ, వైవిధ్యమూ, మన ఆధునిక కథానికకు కూర్చినారు.

## వ్యాసము

పంధొమ్మిదో శతాబ్దిలో కొంత పరిపాకము చెందిన వచనము, అటు పిమ్మట వ్యాసంగా వికాసం పొందింది. లక్ష్మీనాథ బెజ్ బారువా ఆత్మాశ్రయ వ్యాసరచనా విధానాన్ని ఏర్పరిచినాడు. భిన్న విషయాలపై

వ్యాసాలు రచించే ఉత్తమ వ్యాసకర్తల్లో ఆయన ఒకడు. వ్యాస రచయితగా ఆయన అపూర్వంగా సొగసులు కులికిస్తాడు; హాస్యము జాలు వారుతుంది రచనలో. ఆయన సహనమున్న విమర్శకుడు. చస్టర్‌టన్ వలె, బెజ్‌బారువా వ్యాసానికీ చిన్నకథకూ మధ్యే మార్గంలో ఉండే సాహిత్య ప్రక్రియను సాధించి కృతకృత్యుడైనాడు. ఈ నవ్యతవల్ల ఆయన వ్యాసాలు ఉల్లాసదాయకంగా ఉంటవి. సుపరిచితాలయిన ఎన్నో విషయాలను, దైనందిన జీవితంలో అల్పంగా కనబడే వాటిని హాస్యం జాలువారుస్తూ రచిస్తాడు. ఆయన తన వ్యాసాల్లో, సర్ రోజర్ డికవర్లీని అనుకరిస్తూ కృపాచార్‌బార్‌బారువా అన్న పాత్ర కల్పించి నాడు. ఆసామీయుల జీవితాచారాలు కృపాబారుపాత్రలో విశిష్టంగా కనబడుతవి. 'బర్ బారువార్ భవర్ బర్‌బరానీ' (బర్ బారువాగారి యోచనా బుద్బుదాలు' అన్న శీర్షికతో చమత్కారంగా రచించిన వ్యాస పరంపర అసామీయ సాహిత్యంలో ప్రసిద్ధము. ఆ వ్యాసాల్లో, లోక వృత్తంలో ప్రధానాకర్షణగల విషయాలనే అధికంగా ఉద్దేశించి, దేశంలో బోలు మనుష్యులనూ, డొల్లగా గుల్లగా ఉండే సంస్థలనూ, వ్యాస రచయిత వెక్కిరించినాడు. సమకాలిక జీవిత సమస్యలను నిశితంగా పరిశీలించి ఉత్తమహాస్యము జాలువారే శైలి అవలంబించి పాఠకులకు రచయిత ఆహ్లాదము కలిగిస్తాడు. ఇలాంటి ఆత్మాశ్రయ వ్యాసరచనా విధానము అవలంబించి కృతకృత్యులైనవారు హాలిరాండేకా, హేమచంద్ర బారువాలు, సత్యనాథబొరా 'కేంద్రసభ' వంటి సమకాలీన సామాజికరేఖాచిత్రణంలో బెజ్‌బారువాను అనుసరించినప్పటికీ, చివర కాయన ఉదాత్త విషయాలు స్వీకరించిన సమర్థవచన రచయిత ఐనాడు. 'సారథి' 'చింతాకలీ' (భావముకుళాలు) అన్న సత్యనాథుని వ్యాసాలు యోచనా విలసితాలు; నిర్మాణ సౌష్ఠవం కలవి. ఆ వ్యాసాలద్వారా, ఆయన ప్రామాణికభాష ఏర్పరించినాడు; వ్యాకరణయుక్తతతో, నుడికారముజోడించి వచనశైలిని పరిపూతముచేసినాడు. మరొక ప్రముఖ వచనరచయిత, బనీకాంతకాకతి. ఆయన, మహావైదుష్యము, విస్తృతవిజ్ఞానమూ కల వాడు కనుక అసాము రాష్ట్రంలో మహామేధావి అనిపించుకున్నాడు.

ఆయన బుద్ధివలెనే ఆయనలేఖినికూడా సూక్ష్మమూ, కఠినమూ అయిన్నది. అసామీయభాషమీదను సాహిత్యంమీదను విద్వత్పరిపూర్ణమూ అధి కారికమూ ఐన వ్యాసావళిని కాకతి రచించినాడు. అవి తేటతెల్లమై తీర్చిదిద్దిన శైలిలో ఉన్నవి. అవి మన సాహిత్యానికి కలకాలము వన్నె తేగలవు.

ఆంగ్లవిద్యా వ్యాసంగము జాతీయ వికాసం కలిగించి, స్వభాషా సంస్కృతి, చరిత్రలపై అభిమానకారణమైనదనుట నిర్వివాద విషయం. తత్ఫలితంగా చాలమంది విద్వాంసులు అసామీయ ప్రాచీనచరిత్రనూ, సాహిత్యాన్నీ గాఢంగా అవలోడనంచేసి చరిత్రాత్మక వ్యాసాలు విశే షంగా రచించారు. హేమచంద్రగోస్వామిచేసిన అర్ధపరిశోధనలు ఉత్తమ వచనంలో కూర్చినాడు. సూర్యకుమార భూయాఞ చారిత్రక రచనలు ఐహోము చరిత్రాంశాలను బహుముఖంగానూ, గాఢంగానూ గవేషణచేసినవి.

భూయాఞ తన ఐతిహాసిక వ్యాసాల్లో వాడుకలోలేని ప్రాచీన పదా లను, ప్రయోగాలను, పురాతన అసామీయ బురంజీలనుండి నేర్పుగా ఉద్ధరించినాడు. వేణుధర్ శర్మకూడా ఉల్లాసకరంగా చారిత్రక వ్యాసాలు రచించినాడు. శర్మ రచనాశైలిలో ఆత్మీయత ఉన్నది. ఆయనకు కేవలం అసామీయ పదాలంటే మోజు. సూర్యకుమార భూయ్యాఞ ప్రాచీన అసామీయగ్రంథ ప్రతులను సంపాదించి ప్రక టించుటకే తన జీవితం అంకితం చేసినాడు. ఆయనను అనుసరించి కృతకృత్యులైనవారిలో హరినారాయణదత్తబారువా, కాళీరాంమేధి, విరించి కుమారబారువా, ఉపేంద్రచంద్రలేఖరు, మహేశ్వర్ నియోగ్, సత్యేంద్రనాథశర్మ ప్రభృతులు ఎందరో గణింపదగినవారు. ఆ విద్వాంసులు వివిధ విషయములపై ప్రాచీనగ్రంథాలను సూక్ష్మవిమ ర్శనతో పరిష్కరించినారు. వాటిమూలంగా వారు అసామీయభాషా వికా సమును పరిణామమునూ తేల్చి అసామీయుల ధారావాహిక ప్రతిభను ప్రదర్శించినారు. లక్ష్మీనాథబెజ్‌బారువా, నకులచంద్రభూయాఞ, ప్రప్ర థమంగా అసామీయ సంస్కృతిమీదా, జానపదజీవితంమీదా అభిరుచి చూపి, జానపద గేయాలూ గాథలూ సంతరించినారు. ఇటీవల కొన్నేళ్ళ

నుంచీ ఐతిహాసిక సాంస్కృతిక విషయములకు సంబంధించిన అమూల్య రమణీయ రచనలు వచ్చినవి. గత అర్ధశతాబ్దాంతంలో పుట్టిన అపరిమితమైన సాహిత్య గ్రంథాలవల్లనూ వాటి వైవిధ్యమువల్లనూ, ఆసామీయ సాహిత్య సంప్రదాయం భవిష్యత్తులో ఇంకను పూర్ణతరమై వికాసవంతమై ప్రకాశింపగల బీజమున్నదని గాఢముగా విశ్వసించుచున్నాము.

## ఆసామీయ సాహిత్యాకర గ్రంథజాతము


i. Assamese Literature
*by Dr. Birinchi Kumar Barva— Published by P. E. N. India.*

ii. Studies in Early Assamese Literature
*by Dr. Birinchi Kumar Barva.*

iii. Studies in Literature of Assam
*by Surya Kumar Bhuyan.*

iv. Aspects of Early Assamese Literature
*Published by Gauhati University.*

v. Linguistic Survey of India
*by G. A. Grier Son. Vol. V, Part I, pp. 393-446.*

vi. Assamese : Its Formation and Development
*by Banikanta Kakati.*

vii. Sankaradeva and his Predecessors
*by Dr. Maheswar Neog.*

# ఉడియా సాహిత్యము

మాయాధర్ మాన్‌సింహ్

## భాష - ప్రజ

భారత ప్రజాస్వామికానికి ఆగ్నేయసీమగాఉన్న ఒరిస్సారాష్ట్రంలో రమారమి ఒక కోటి యాభై లక్షల ప్రజలు మాట్లాడుతున్న భాష ఒరియా. ఒరిస్సారాష్ట్రపు రాజకీయ సీమలుదాటి కొన్ని లక్షలమంది ఒరియా భాష మాట్లాడే ప్రజలున్నారు. కళింగులూ, ఉత్కళులూ అని ప్రాచీన కాలంలో వ్యవహరింపబడినవారు సైనిక సముద్ర విజయాలు సాధించి, సామ్రాజ్యాలు కొన్ని శతాబ్దాలు గంగాతీరము మొదలుకొని గోదావరీ తీర పర్యంతము, వ్యాపింప చేసుకొన్న వారి భాషే ఓఢ్రము. సముద్రాలు తరించి వారు వలసలు, సామ్రాజ్యాలు స్థాపించి, కీర్తి గడించినవారు. ఆ సామ్రాజ్యాలలో ప్రఖ్యాతులయిన శైలోద్భవుల రాజ్యము ఆగ్నేయాసియా ఎల్లలను చాలా తావుల్లో ఒకప్పుడు స్పృశించింది.

కాని వలసలూ, సామ్రాజ్యాలున్నూ క్షీణించి పోయినవి. అది సహజమే. ప్రాచీన కళింగము నేటి భారతదేశంలో ఒరిస్సారాష్ట్రంగా తరిగిపోయి, అల్పపరిమాణంలో శేషించింది. మహాసామ్రాజ్యాలూ, మహోన్నత మందిరాలూ స్థాపించి సృష్టించిన ఉత్కళులూ, కళింగులూ క్షీణప్రాయులయిన వారి సంతానమునకు వదలిపెట్టిన మహాశిల్ప సామ్రాజ్యము - కళలోనూ, స్థాపత్యములోనూ అమూల్యమైనది, ఇంకా ఉడియావారికి నిలిచియే ఉన్నది. వాస్తు శిల్ప నిర్మాణ ప్రేరణ, ఓఢ్రులలో వేయి సంవత్సరాలు క్రీ. పూ. ద్వితీయ శతాబ్దిలోని జైనుల ఖండగిరి, ఉదయగిరి, గుహాలయ నిర్మాణమునుంచీ సాగి సాగి, క్రీస్తు అనంతరం పదమూడో శతాబ్దిలోని కోణార్క సూర్యదేవాలయ నిర్మాణము వరకూ సాగినది. కోణార్క దేవాలయమువారు శిలలో దర్శించిన

మ్మహోద్భుతమై మహోదాత్తమైన సుందర స్వప్నము. వాస్తు శిల్పాది కళల ద్వారా జాతీయాభివ్యక్తికి అవకాశాలు ఓఢ్రులకు లభ్యము కానిసమయంలో పరిగా సాహితీ కళావికాసమువారు పొందడం గమనింపదగినది. దానికి కారణాలు ఇంకా సమగ్రముగా పరిశోధించవలసిఉన్నది.

ఆసామీ, వంగ, ఓఢ్ర విద్వాంసు లందరూ అష్టమ, నవమ శతాబ్దాలకు చెందిన 'బౌద్ధగాన్ ఓ దోహా' అనే ప్రాచీనమైన గ్రంథాన్ని ఎవరి మటుకువారు, తమ భాషకు సంబంధించిన ఆద్యసాహిత్య గ్రంథమని ప్రకటిస్తున్నా, ప్రస్తుతము వ్యవహారంలో రాత కోతల్లో ఉన్న ఓఢ్రము 14 క్రీ. శతాబ్దిలో పలుకుబడిలోకి వచ్చింది. దీని సోదరీ భాషలైన వంగ, ఆసామీ భాషలుకూడా అంతే.

క్రీ. శ. 14 శతాబ్దినుండి 19 శతాబ్దివరకూ, అనగా ఆధునిక యుగము ఆరంభమయ్యేవరకూ అయిదు వందల సంవత్సరాలలో ఓఢ్ర సాహిత్య నిర్మాణ వికాసాలు ఇంచుమించుగా ఇతరాధునిక భారతీయ సాహిత్యాలవలెనే, అదేరీతుల్లో, కేవలం సంవిధానంలోనూ, స్వభావం లోనూ, స్థానికమైన వ్యత్యాసాలతో వచ్చినవి. మొత్తముమీద సాహిత్యపు తీరుచూస్తే, మత విషయములయు, మతేతర విషయములయు మేళన మున్నది. పవిత్ర సాహిత్యము రచయితలమీద అనూహ్యామైన మాదకతా నిషేధ ప్రభావం కలిగించగా, వారు, రామాయణ మహాభారత భాగవత పురాణాదులు గీచిన ఏక కేంద్ర వృత్తాలను దాటి, ఇతి వృత్తం కోసం సాహసించలేదు. కాని ఈ సంకుచిత దిక్చ్రకవాళాల్లో, ఘనమైనవిన్నీ, శాశ్వతమైన కృతులున్నూ, ఉద్భవించినవి. ఈ పరిమితక్షేత్రంలో సాహిత్య నిర్మాణము అమితముగా పెరిగింది. భావగీతాత్మకరచనలు, ద్విపదలవంటి దేశీయ రచనలు, కావ్యాలు, పురాణాలవిషయము చెప్పనే అక్కర్లేదు. అధమపక్షము పన్నెండు రకాలుగా రామాయణమూ, నాలుగు భేదాలతో మహాభారతమున్నూ, ఒరియాలో ఉన్నవి.

## ఆధునిక యుగము

పౌరాణిక వాతావరణంతోకూడిన మధ్యయుగ ప్రపంచానికి పూర్తిగా భిన్నమైనది ఆధునికయుగము. ప్రజాదృక్పథమూ, అలోకమూ,

పునః ఏర్పడడానికి పాశ్చాత్య సంపర్కము సాహాయ్యము చేసింది. ప్రజలకు పురుషార్థాల విషయంలో పూర్తిగా నవ్యాభిమతం ఏర్పడింది. దీనివల్ల నవ్యమై ఓజోమయ సాహిత్యము, ప్రాచీన కవిశేఖరులకు సుతేరాము తెలియని విస్తృత మండలాలను స్పృశించే సూక్ష్మ హృదయ సంవేదనముతో ఉద్భవించింది.

కాని పాశ్చాత్య సంపర్కము, విచారకరమైన చారిత్రక పరిస్థితుల వల్ల, ఓఢ్రదేశంలో ఆలస్యంగా ప్రవేశించింది. అదికూడా ప్రజలకు అనుకూలము కాని పరిస్థితులలో వచ్చినది. సోదర భాషలలో పొరుగున ఉన్న వంగ భాషతో పోల్చినప్పుడు, ఓఢ్రభాష వెనుక వడిందని చెప్ప వలెను. దానికి కారణము భాషలో కానీ, ప్రజల్లోకానీ వస్తుతః అల్పత్వము కాదు. అయితే బ్రిటీష పరిపాలనలో వంగదేశమునకు బహుముఖంగా సుసంపన్నంగా ప్రాప్తమైన అవకాశాలు ఓఢ్రులకు కనీసం ఒక్క శతాబ్ది ఆలస్యంగాగాని లభ్యం కాలేదు.

గత ఇరవయ్యేళ్ళనుంచే రాష్ట్రమంటూ ఓఢ్రులకు ఏర్పడింది. పదహారో శతాబ్దాంతంలో ఓఢ్రదేశం స్వాతంత్ర్యం కోలుపోయినది. అప్పటినుంచే బ్రిటిషవారు భారతదేశము విడిచివెళ్ళేకాలానికి ఒక దశాబ్దము ముందు ఓఢ్రదేశానికి ఒకరకమైన సజాతీయ రాష్ట్రము పునః ఏర్పడేవరకూ, ఓఢ్రులు నాలుగు రాష్ట్రాలలో చెల్లాచెదరై, దళితులై, ప్రతిచోట, అల్పసంఖ్యలో ఉంటూ, దయనీయులై పీడితులై దోపిడీచేయ బడుతూ వచ్చారు. ప్లాసీయుద్ధానంతరం శతసంవత్సరాల్లో, వంగరాష్ట్రమునకు విశ్వవిద్యాలయమంటూ ఏర్పడగా, ఆంగ్లపాఠశాలలూ, కళాశాలలూ ఏర్పడి, సాహిత్యంలో ఉన్నతస్థాయిలో వికాసమురాగా, ఓఢ్ర అసామిూబాషల్లో ఏ కృషీ చూప వీలులేకపోయింది. కనీసము పూర్ణమైన ఒక్క ఉన్నతపాఠశాలఅయినా ఒరిస్సాలో లేకపోయింది. ఇటువంటి పరిస్థితులున్నా, ప్రజల భాషాసాహిత్యాలు నిలవడమే కాక వృద్ధిలోకి వచ్చాయి. అందుకు ముఖ్యకారణము మహా ప్రవీణుడు, శేముషీసంపన్నుడు, ఆధునిక ఓఢ్ర సాహిత్యజనకుడైన ఫకీర్ మోహన్ సేనాపతి దోపిడిచేసే శక్తులను శూలాగ్రంతో ఎదుర్కోడమే.

ఫకీర్‌మోహన్ సేనాపతి (1843-1918) - ఆయన ఇంటిపేరుకు తగినట్టుగా నిజంగా ఆధునిక ఒరియా సాహిత్యానికి, జాతీయతకూ 'సేనాపతి' అయినాడు. అనేక విషయాల్లో ఆయన విశిష్టవ్యక్తి మూడునాలు గేళ్ళుమాత్రం సామాన్యపు చదువునేర్చినాడు. ఆయన తన బాబయ్యకు ఆయనవృత్తిలో సహాయంగా ఉంటూ జీవిక ఆరంభించినాడు. పడవలు పయనించే పాతరోజుల్లో స్వస్థానమైన బాలసోర్ పాతరేవులో, ఘట్టం దగ్గర. ఆయన తెరచాపలమరమ్మతుపైన అజమాయిషీచేస్తూ ఉండేవాడు. ఇలాంటి పరిస్థితినుంచి కేవలము బుద్ధి విశేషంవల్ల, ప్రజ్ఞవల్ల కష్టపడి, చివరకు అనేక ఓఢ్రసంస్థానాలకు దివాన్ కాగలిగినాడు. ఆయనకు కనీసం అయిదు భాషలు క్షుణ్ణంగావచ్చును. ఆంగ్లంలో వ్యవహారజ్ఞానం ఆయనకుండేది. ఒరిస్సాలో గ్రంథప్రకాశకుడుగా, పత్రికావిలేఖరిగా, సహకారవిధానంలో ప్రచురణకర్త కాగలిగి మార్గదర్శకుడైనాడు. ఆయన ఒక్కచేతిమీదుగా రామాయణ మహాభారతాలను మూలమునుండి ఒరియాభాషానువాదము చేసినాడు. ఆ భాషలో ఆ మహాకావ్యాలకు చాలా అనువాదాలు అప్పటికే చాలా వచ్చినా. ఆయన కథానికా రచన ప్రయత్నించినాడు. కథానికలు రచించినవాళ్ళల్లో ఆయనే మొట్టమొదటివాడు. అంతటితో కాక జానపద ద్విపదలూ, కీర్తనలూ, కథన కావ్యాలు, హేళనాత్మకరచనలు బుద్ధునిమీద ఒక మహాకావ్యమూ, వృత్తినుండి విరమించిన కాలంలో అరు ఉత్తమ నవలులున్నూ, వ్రాసినాడు. భాషా శైలికి అద్వితీయుడని పేరు చెందినాడు. పుడమి యెడ గల మక్కువ, గాఢవాస్తవికత, హాస్యము, ఉత్తమ ధర్మోపదేశమూ నవలల్లో వ్యాప్తమైనవి.

ఓఢ్రదేశమునకు బయట ఫకీర్ మోహన్ పేరు ఇప్పటికి ఎక్కువ తెలియదు. ఒరిస్సాలో ఓఢ్రేతరులైన I. A. S. ఆఫీసర్లు చాలామంది ఒకటో రెండో ఆయన నవలలు తప్పక చదివినవారు అని నేను విన్నాను. ఆధునిక భారతీయ సారస్వతంలో సేనాపతి నవలారచయితగా నిజంగా అద్భుతమైనవాడనీ, ప్రజాసాహిత్య రచయితగా, సాహితీ క్షేత్రంలో తక్కినవారిలో కొందరికన్న అగ్రేసరుడనీ, వారిలో కొందరనగావిన్నాను. వంగరాష్ట్రంలో ప్రసిద్ధుడయిన బంకిమ చంద్రుడు ప్రౌఢసాంస్కృతిక

శైలిలో నవాబులు, బేగములు, జమీందారులు, రాజులు ఇటీవల కొత్తగా ఏర్పడిన వంగభూమిలోని పై మధ్యమ వర్గీయులను గురించిన్నీ రచనలు చేస్తున్నప్పుడు, ఓఢ్రంలో ఈ అజ్ఞాత రచయితకు, సరళంగా జీవించే, చదువురాని నేతపనివాళ్ళతో, మంగళ్ళతో, రైతాంగముతో, పల్లెలో బందిపోట్లకు తోడు దొంగగా సాయపడే చౌకీదారుతో, పట్టణాల్లో పల్లెల్లో గిల్లికజ్జాలు పెట్టే దాసివాళ్ళతో, ఇంగ్లీషు మేజిస్ట్రేట్ల దగ్గర లంచాలుతినే అల్పపాతకపు గుమాస్తాలతో, బుకాయించే న్యాయవాదులతో, ఆంగ్లసుధాపానపు తొలిగుక్కతో కైపెక్కి, తామూ తమ తలి దండ్రు లనూ విషాదంలో కల్లోలంలో ముంచే పూర్వ కుటుంబాల తాలూకు కుఱ్ఱ కారుతోటిన్నీ, సన్నిహిత పరిచయం ఉండేది. ఫకీర్‌మోహనుకు ఆంగ్ల విద్య యథాక్రమంగా అలవడక పోవడము నిజంగా మంచికే వచ్చిందని చెప్పాలి. ఆయనకు ముఖ్యంగా ప్రజాజీవితంతో సంబంధం అధికం. ఆయన భాష స్వభావ సిద్ధంగా, పటువుగా, జనపదంలో వాడవాడల్లోని ముదికారపు సొంపుతో, పంటకారుగల క్షేత్రాల్లో, నీలాటిరేవుల్లో, నిత్యమూ స్నానమాడి ఉబుసు పోక మాట్లాడే పిచ్చాపాటీలో దొర్లే నానుడులతో, ఇంపుగా ఉంటుంది. ఆయన తన చిన్న కథల్లో, నవలల్లో, ఉదాత్త సాహితీ సౌష్ఠవమునూ, అపురూపమయిన లావణ్యాన్నీ, ప్రావీణ్యంతో నిర్వహించినాడు.

ఫకీర్‌మోహన్, నవలలూ, కథానికలూ, స్త్రీ పురుషుల సజీవ వాస్త వికి ఓజోమయ చిత్రశాలగా ప్రదర్శించినాడు. ఆ చిత్రణలో గొప్ప సాహిత్యాచారులకుండే దివ్యప్రతిభాచ్ఛవి గోచరిస్తుంది. అయితే ఆయన చిత్రించిన స్త్రీ పురుషులు ఇహ ప్రపంచంలోని స్త్రీ పురుషులకన్న అత్యంతము సజీవంగా అలరారుతూ, కనబడతారు. ఆయన జాతీయ చిత్రప్రదర్శనశాలను సృష్టిచేసి, ఓఢ్రసమాజములో రమారమి అన్ని వర్గాలవారికి ప్రాతినిధ్యం ఇచ్చినాడు. ఆయనరచన సెర్వాంటిస్ రచిం చిన డాన్‌క్విక్సాట్‌ను స్మృతికితెస్తుంది. స్పానిష్‌భాషలో డాన్‌క్విక్సాట్ ప్రౌఢ జాతీయగ్రంథంగా పరిగణింపబడుతున్నది. అందులో స్పెయిన్ దేశము విపులంగా శిల్పసమన్వితంగా ప్రతిబింబితమైందని అంటారు.

ఆయన నవల "[1] ఛామణాఅఠాగుంఠా" (ఆరెకరాలు ఎనిమిది కుంటలు) అనే దానిలో, పిల్లాపీచులేని అమాయిక సరళ స్వభావులయిన నేతపనిచేసే దంపతులు, పల్లెలో వడ్డీవ్యాపారిచేతుల్లో సర్వమూ పోగొట్టు కొని, ఆహుతి అయిపోయినకథ చిత్రింపబడింది. ఈ పుస్తకంలో జానపద వాస్తవికత గాఢంగా ఉన్నది. ఇది 'ఉత్కళసాహిత్య' మాసపత్రికలో అనువృత్తంగా అచ్చుపడుతూవచ్చింది. ఆ నవలలో ఖూనీకేసు విచారణ చాలా బాగా వర్ణితమైంది. పుస్తకంలో వర్ణన నిజంగా తోచి, కటకము వచ్చారట కొంతమంది కేసు కళ్ళారాచూదామని.

ఈ నవల మూలసిద్ధాంతాల్లో కేవల యదార్థఘటనల్లో కాకపోయినా ప్రేమచందుగారి 'గోదాన్' అనే నవలను పోలిఉంది దానికంటె రమా రమి యాభై సంవత్సరాలముందు వచ్చింది. 'లచ్చమ' అనే ఐతిహాసిక నవలలో వంగ, ఓఢ్ర దేశాల్లో మరాటీదండుచేసిన దోపిడీలను సేనాపతి వర్ణించినాడు. ఆయన 'మామూ' (మేనమామ). 'ప్రాయశ్చిత్త'ము అనే నవలల్లో పాశ్చాత్య సంస్కృతి ప్రభావఫలితంగా పురుషార్థాలను నిర్ణ యము చేసికోలేని సంఘర్షణలో యువకులు చిక్కుకోడమూ, ప్రాచీన సమాజవ్యవస్థ విచ్ఛిన్నము కావడమూ వర్ణితమైనాయి. ఈ రెండూ నవలలూ మహాకావ్యాలుగా పరిగణించవచ్చును. ఈ మహాకావ్యాల్లో విముక్తి, పునరుత్థానము, జీవులు తప్పుచేయడమూ, అనుభవములో అవస్థాభేదము వచ్చినతరువాత యథాప్రకారం సరళజీవితాలోకనచేసి, ఋజువర్తనం అలవరచుకోడమూ ఇతివృత్తములు.

సృజనాత్మక రచయితగా ఫకీర్‌మోహన్ గొప్పవాడు కావడమే కాక, తొలియౌవనంలో వంగ భాషా సంస్కృతి ప్రభావాధిపత్యాన్ని తీవ్రంగా ప్రతిఘటించి, మాతృభాషను ఉద్ధరించడంవల్ల, ఓఢ్ర సాహిత్యంలో ఆయనకు విశిష్ట స్థానం లభించింది.

---

[1] ఈ నవలను సాహిత్య అకాడమీ అన్య భారతీయ భాషల్లోకి అనువదింప చేయడానికి ఎన్నికచేసింది. తెలుగులో దీనిని పురిపండా అప్పలస్వామి గారు అనువదించి ప్రకటించారు.

## రాధానాధ్ - మధుసూదనులు

ఏమయినా ఫకీర్‌మోహన్ ఏకాకికాడు. ఆయన ప్రాచీన ఓఢ్ర భాషా సంస్కృతీ పారంపర్యాన్ని పునః శక్తివంతము చేయడానికి జీవితం అంకితం చేసుకున్న ప్రవీణగ్రంథకార వర్గానికి ప్రజ్ఞాశాలి అయిన నాయకుడైనాడు. ఫకీర్‌మోహన్‌తోపాటు రాధానాథరాయ్, మధు సూదనులు అనే మహాకవు లిద్దరూ కలిసి వెరసి మహా కవిత్రయ మని అని పించుకొన్నారు. మానవుణ్ణీ, ప్రకృతినీ, ఈశ్వరుణ్ణీ క్రమంగా ఫకీర్ మోహన్, రాధానాథ్, మధుసూదనులు తమ ప్రధాన భావనాంకుశాలుగా పెట్టుకొన్నారు. ప్రాచీన భాషలో నవీనమై ఆత్మతృప్తికరమూ స్వయం సమృద్ధమున్నూ అయిన సాహిత్య సృష్టి వారు చేశారు. ఈ మహా కవి త్రయం చేసిన సృజనాత్మక సాహితీ సర్వస్వంలో సాహితీ సౌష్ఠవాంశ లన్నీ ఉన్నవి.

ఫకీర్‌మోహన్ బస్తీల్లో, పల్లెల్లో ప్రశాంత సామాజిక వ్యవస్థయొక్క ఉపరితలాలకింద మానవుడి భావోద్రిక్త చిత్తవికార విజృంభణాత్మక రూపకాన్ని జాతిమోల ప్రదర్శింప చేసినాడు. మధుసూదన్ (1853-1912) ఈశ్వరుణ్ణి, శుద్ధజీవనాన్ని, జీవపరమాత్మల ఆనంద యోగాన్ని ఉద్దేశించి ఉదాత్త కవితాగానము చేసినాడు. అయనకు ఈశావాస్యంగా, సర్వత్ర అనగా, దైనందిన లౌకిక జీవిత ఘటనల దగ్గర్నుంచీ, హిమా వృత మహాశిఖరాలవరకూ, గోచరించింది. ఆయన సాహిత్యంవల్ల కీర్తి కోసం పాకులాడలేదు; గ్రంథరచన విస్తృతంగా చేయ యత్నించలేదు. ఆయన కృతులలో చాలాగేయాలూ, భావగీతాలూ, ద్విపాత్తులు, గేయ గీతికలు, చతుర్దశ చరణ ఛందాలూ (సానెట్లు) అన్నింటిలో పారమార్థిక జీవిత వాతావరణం వ్యాప్తమైంది. అయన కవితా రచనల్లో రమారమి పన్నెండు చతుర్దశ చరణ ఛందాలు, (సానెట్లు) నదిని గూర్చిన 'నదీ ప్రతి' ఆకాశాన్ని ఉద్దేశించిన 'ఆకాశప్రతి', 'ధ్వని', అనే గేయ గీతికలు (ఋషిప్రాణే దేవావతరణ) అనే భావగీత కథనాత్మక పద్య ఖండికలు రెండూ, 'హిమాచలే ఉదయో సిహోబా' అనే హిమాలయముపై సూర్యో దయము, ఋషిప్రాణంలో దేవావతరణము ఏ సాహిత్యంలో అయినా

అమూల్య నిధులవుతాయి. ప్రతిసాయంతనమూ, వేలకొద్దీ బడిపిల్లలు వారి వసతిగృహాల్లో ఒరిస్సాలో ఆయనగేయాలు గానంచేస్తూ ఉంటారు. ఓఢ్ర జాతీయ జీవనంలో కాకపోయినా, ఓఢ్ర, సాహిత్యంలో, ఆయన కవిత సజీవమై, శక్తివంతమై, నైతికాధ్యాత్మిక శక్తిగా ఉన్నది.

## రాధానాథ్ (1848–1908)

నిజంగా కవీ, భావుకుడున్నూ, సేనాపతి ఓఢ్రములోచేసిన వచన రచనకు, రాధానాథ్ కవితానుబంధముకూర్చి, ఓఢ్రులకు యథార్థ జాతీయ సాహిత్య సృష్టిచేసినాడు. ఓఢ్రకవిత్వంలో నవ్యయుగ స్థాపకుడైనాడు. రెండు ముఖ్యమైనమార్గాలు చూపినాడు. మొదటిది-మధ్యమ యుగాలనాటి ఉపేంద్రభంజకవి, అతని సాహిత్యమార్గములో పద, చిత్ర బంధకవిత్వపు సాముగరిడీల వ్యామోహమునుంచి, ఓఢ్రపద్యాన్ని తప్పించి, స్వేచ్ఛకూర్చినాడు. పదసంఘటనలో జాగరూకుడై శబ్దాలంకారాలు పోహళించడంలో మితిమీరక ప్రాచీనమహాకవులవలె, ప్రసన్న శైలిలో మనోహరంగా కవిత్వము చెప్పినాడు రాధానాధుడు. తొలిసారిగా ఆయన కవితలో, శబ్దార్థ సన్నిహిత సంబంధవిషయంలో, జాగరూకత వహించి సూక్ష్మదృష్టితో, పదాలను తూచితూచి చక్కగా ఔచిత్యాన్ని పాటించడంలో తనకు మార్గదర్శకాచార్యుడైన కాళిదాసును అనుసరించినాడు.

కాని ఆయన ఓఢ్రకవితలో విప్లవాన్ని తీసుకుని రావడమే కాక, ఆధునిక ఓఢ్రసాహిత్యంద్వారా ఒరియాజాతీయ జీవితాన్ని తన కృతుల్లో భావాంకురాలుగా వినియోగించినాడు. ఇదే ఆయన సాహిత్యానికి సమకూర్చినబలం. ఓఢ్రదేశంలో యావత్ ప్రకృతినీ రసమయంగా వీక్షించి, కావ్యవస్తువుకు నేపథ్యంగా చిత్రించినాడు. ఆయన కొంత ఓఢ్రేతిహాసంలో నుంచికానీ, లాటిన్‌గ్రీకు పురాణాల్లోంచికానీ, ఇతివృత్తం స్వీకరించి ఓఢ్రదేశ నేపథ్యము కల్పించి, తదనుకూలంగా వస్తువును రూపాంతరము పొందించినాడు; ఓఢ్రప్రకృతిసీమ నాయికానాయకులకు విహార భూమిగా చేసినాడు. ఆయనకు నాలుగు శతాబ్దాలకు పూర్వమునుంచి, సరళదాస బల రామదాసులు తప్ప. ఓఢ్రకవులు ఎంతసేపూ గంగా

యమునా స్రవంతులనూ, గోవర్ధనాది పర్వతాలనూ, వారు తిలకించని ఔత్తరాహిక ప్రకృతిదృశ్యాలను గురించి గానము చేసేవారు. ఒరిస్సాలో వారిద్వార దేశాన్నే ఉన్న సురుచిర ప్రకృతి సౌందర్యాన్ని, వారు తిలకింపనేలేదు. విశాలమై గంభీరమైన మహానది, బ్రాహ్మణి, వైతరిణీ నదులనూ, మలయ, మేఘశాన, మహేంద్రగిరుల శోభనుగురించి, వారు కవితాగానం చేయలేదు. తొలిసారిగా రాధానాథుడు ఒరిస్సాలో సుందర ప్రకృతి శోభకు ముగ్ధుడై, భిన్నమానసికావస్థల్లో, భావగీతాత్మక పారవశ్యంతో ప్రకృతిని వర్ణించినాడు; కావ్యగానంచేసినాడు; సంపన్నమైన చిలక సరోవర రామణీయకాన్ని కావ్యవస్తువుచేసి, సుదీర్ఘంగా, భావగీతాత్మకంగా, కథనకావ్య ముల్లేఖించినాడు. ఆ కావ్యము ద్విపాద ఛందంలో శ్రవణపేయంగా, చిత్రంగా ధారావాహకశైలిలో, రచించిన దివ్య ప్రకృతి సూక్తమువలె ఉంటుంది. రాధానాథుడు చిలకసరస్సును వివిధరీతుల్లో, శబలిత సౌందర్యాన్ని సజీవమూర్తివలె అతిసన్నిహితం చేసుకొని, మధ్యమధ్య సమకాలీన ఓడ్రరాష్ట్ర స్థితిగతులను భావిస్తూ, హృదయ సంవాదముకలిగిస్తూ, గతాన్ని స్మరిస్తూ, జీవితాలోకనము చేసినాడు. అందుచేతనే రాధానాథుని 'చిలక' ఒరియాసాహిత్యంలో సీమాంతశిల.

[1] చిలక సరోవరంవలెనే ప్రముఖ మహీధరముకానీ, నదికానీ, ప్రకృతిదృశ్యంకానీ, చారిత్రక స్మరణచిహ్నముకానీ, ప్రజల దేవుడు కానీ, దేవతారూపంకానీ, ఒరిస్సాలోది ఏదీ రాధానాథుని కవితావస్తువు కాకుండా, అమరత్వం పొందకుండా ఉండలేదు. నిజానికి చిలకసరస్సువలె చాలా ప్రదేశాలు ఆయన కవితవల్లనే ప్రస్తుతకాలంలో ఖ్యాతిని పొందినవి. కాళిదాస కవీంద్రుడు యావద్భారతానికీ. కావ్యలోకంలో అమరత్వము సిద్ధింపచేసినట్టు, రాధానాథుడు ప్రకృతికవిగా ఒరిస్సా రాష్ట్రాన్ని అభివర్ణించి, అమరత్వం కూర్చినాడు. గ్రీకులు యవన ప్రపంచవిషయంలో చేసినట్టు, రాధానాథుడు ఒరిస్సాను యావత్తూ

---

1 సాహిత్య అకాడమీ ఈ కావ్యాన్ని అన్యభారతీయ భాషానువాదాలు చేయించడానికి ఎన్నిక చేసింది—సంపా :

సజీవ దేవీదేవకోటిమయము చేసినాడు. ఆ దేవతలకు మానవ వ్యవహారాల్లో అమితోత్సాహం ఉన్నది. ఆయన మూగగా సుందరంగా ఉన్న ప్రకృతిని మానవవ్యక్తిత్వంతో శోభిల్లేలాగ చేసినాడు. కొద్దిలో చెప్ప వలసివస్తే ఆయన ఒరిస్సాను ఉదాత్తకవితా సౌందర్యవాసిత భూతలం గానూ, మానవాతీతుల విహారరంగంగానూ, పురాణ కల్పనాత్మకలోకం గానూ, సుందరవీరులతో, లావణ్య నాయికలతోనూ చిత్రించినాడు. కటకములో చరిత్ర ప్రసిద్ధమైన శిలాఘట్టంమీద నవనాగరకుడు సాయం విహారానికివస్తాడు; కర్జుడీనదికి అద్దరికొండలవైపు తిలకించి, రాధానాధ కవీంద్రుని లేఖినీ నిష్యంద కవితా ప్రవంతిలో చిత్రంగా పరిపూతమై నట్టు భావిస్తాడు. ఎక్కడయినా సరే విద్యావంతుడయిన ఓఢ్రుడు తన భూమిలో భావుకుడై నడచు నప్పుడు, రాధానాధ కవీంద్రుని కావ్యం లోని పంక్తులు ఏవోకొన్ని, స్వభావసిద్ధంగా అతని పెదవులపై విరిసి, ఆ ప్రదేశంలోని సారాన్ని సముచితంగా ద్యోతకం చేస్తాయి.

ముఖ్యంగా ఆయన మహాకావ్య ప్రణేత. రాధానాధుడు కొన్ని భావ గీతికలల్లినాడు. ఆయన కృషి ప్రధానంగా కావ్యరచనలే, పైన వర్ణించిన అచుంబితాలయిన ఇతి వృత్తాలను ఆయన స్వీకరించాడు. సగము ఇతిహాసాత్మకమైన ఇతి వృత్తాలతో సరళ ప్రసన్నతతో, ఇంపుగా కథాకథనంతో, దేశభక్తి జనకమైన స్థానిక నేపథ్యచిత్రణంతో, రస పోషణతో, జీవిత తత్త్వాలోకనంతో, ఆయన కృతులు ఓఢ్రభాషలో విశిష్ట ములు; అని ఒరియా సాహిత్యంలో నవ్యయుగస్థాపనకు కారణ భూతాలు అని అర్హస్థానము గడించుకొన్నవి. ఆయన కావ్యాల్లో ఉత్త మోత్తమ బృహత్కావ్యం 'మహాయాత్ర'. ఆ కావ్యం గంభీరం, శ్రవణ సుభగం, బ్లాంక్‌ఛందంలో దృశ్య చిత్రణాత్మకమున్నూ. కవి 21 సర్గ లలో మహాకావ్యం పూర్తిచేయాలని సంకల్పించినాడు. కాని సర్గ సప్తకం మాత్రం పూర్తికాగానే ఆయన గతించినాడు. కావ్యం అసంపూర్ణం అయినా, ఆ రచన అద్భుతసృష్టి. మహాభారతకథ ఆ కావ్యా నికి మూలము. పాండవులు కురుక్షేత్ర యుద్ధానంతరం స్వర్గారోహణం ద్వారా భారత దేశపు భవితవ్యం, వైదేశికుల విజయాలు వర్ణిస్తూ, భవి ష్యత్తు నిర్దేశించినాడు కవి. ఆయన పాండవులను కావ్యంలో పురీక్షేత్రం

రప్పింప చేసినాడు. అక్కడవారు అగ్నిని కలుసుకొంటారు. అగ్నిదేవుడు ఓఢ్రము మధ్య భారతములలోని పురాతన కాననములగుండా సహ్యాద్రి శిఖరాలమీద పడమటి కనుమల మీదికి వారికి మార్గము చూపుతాడు. అక్కడ అగ్నిదేవుడు భారతేతిహాస దృశ్యాన్ని వివృతము చేస్తాడు. కలియుగ ప్రభావమువల్ల మహానుభావులైన ఆర్యులు తమ దేశంలో అవినీతివల్ల ఏమవుతారో అగ్ని విశదముచేస్తాడు. మహమ్మద్ గోరిచేత విషాదకరాపజయం పొందిన పృథ్వీరాజ గాథ వరకూ, కవి కథ రచించాడు. యుద్ధవర్ణనము, ప్రకృతి వర్ణనమున్నూ, మహాకావ్యోచితమై అద్భుతంగా ఉన్నాయి. అంతిమ యుద్ధ సమయంలో హైందవ సేనాపతి చేసిన హృదయాన్ని ఉత్తూత లూగించే, దేశభక్తి దాయకమైన వీర ప్రసంగాన్ని, విస్మరించలేము.

## అనుయాయులు

రాధానాథ్, ఫకీర్‌మోహన్, మధుసూదనులకు ముగ్గురికీ చాలా మంది అనుయాయులు ఉండేవారు. వ్యాసవిస్తర భీతివల్ల వారందరి సంగతి సందర్భాలూ సాకల్యంగా చర్చచేయడానికి ఇక్కడ వీలుకాదు. కనీసము ఇద్దరినిగురించి కొద్దిగా చెప్పకతప్పదు. ఇద్దరిలో ఒకరిరచనలు మితంగా ఉన్నా వాటిలో స్వకపోలకల్పన అధికం. రెండోవారిలో కావ్య శిల్పసంవిధానం అసామాన్యంగా ఉంది.

నందకిశోర్‌బల్ రాధానాధ మధుసూదనకవులను అనుకరించి అధికంగా కావ్యరచన కావించినాడు. ఆయన ముఖ్యంగా ఓఢ్రదేశీయ జనపదాలనుగురించి కావ్యగానంచేశాడు. ఆధునిక భావగీతికా సందోహంలో జానపద గీతాభణితులూ, సంప్రదాయాలూ తెచ్చినాడు. ఆయన రచించిన 'పల్లీచిత్ర' ప్రతి ఓఢ్రుని హృదయంలో గాఢంగా దేశాభిమానం ఉద్భవింపచేస్తుంది. ఆధునిక నాగరికతా ప్రభావముద్ర నుండి తెప్పరిల్లలేనిస్థితికి కవి వగచి శాంతమై చిత్రసదృశమై, స్వయంపూర్ణమై పూతమైన జానపద జీవనంకోసం కవి తపిస్తాడు. ఆయన 'నానాబయ గీతాలు' ఓఢ్రంలో పిల్లలకోసం రచించిన ముఖ్య పద్య సముచ్చయం.

శంబలపురంలో తంతువాయ కవి అయిన గంగాధర్ మెహర్ అద్భుత శిల్పనైపుణ్యముగలవాడు. ఆయన అంతగా విద్వాంసుడుకాడు. కొద్దిగా చదివినవాడు. కాని ఆ కవి ప్రాచీన పౌరాణిక కథావస్తువులను పోహళించడంలో చిత్రమైన నవ్యరుచి, శ్రవణసౌఖ్యం, ఛందస్సుల్లో నవ్య సౌకుమార్యం, నవ్యాలోకం పాత్రోన్మీలనంలో వాస్తవికత తెచ్చి నాడు. అట్టివి ఓఢ్రంలో ఎప్పుడూ కనీవినీఎరగలేదు. శంబలపురంలో ప్రపంచ ప్రసిద్ధిచెందిన నేతవాళ్ళవలె అతనూ సంప్రదాయసిద్ధంగా వృత్తిశిక్షణపొంది, జీవిక నిర్వహిస్తూ ఉండేవాడు. ఆయనకు కవిత్వం కూడా ఒకవృత్తే. ఒకానొక వర్ణవిశద చిత్రశిల్పమే కవిత్వమని చూపి నాడు. అతని కావ్యఖండము ప్రతిదీకూడా, చైనాదేశపు దీర్ఘాలేఖ్య పటమువలె, భావప్రాణితమై, విశదరాగరంజితమై, సన్నివేశములతో కూడినది. అతనిక్షేత్రము పరిమితము. కాని పరిమితావధుల్లోనే అతడు చిన్నచిన్న స్వర్గధామాలు కల్పించినాడు. అతని ద్విపదీఖండాలు, చతుష్పాదఛందాలూ, జనసామాన్యభాషణంలో ప్రవేశించాయి. ఒరిస్సాలో ఆయనపద్యమే స్నిగ్ధకవితాశిల్పానికి ప్రమాణమైంది. ఓఢ్రకవులందరిలో ప్రాచీనుల్లోకానీ, నవ్యులలోకానీ, ఆయన ఛందోలావణ్యము అతిసౌష్ఠవమైనదిన్నీ, అతిమధురమైనదిన్నీ, ఆయన 'తపస్వినీ' కావ్యంలోని సీతాదేవి నారీత్వానికి లక్ష్యప్రాయమైన ఉదాత్తమైన పాత్ర సృష్టి.

## సత్యవాది సమితి

రాధానాథ మధుసూదన కవుల మార్గానుసారులు. వారి సంప్రదాయాలను ప్రస్తుత శతాబ్దిలో తృతీయ దశకంవరకూ అనుష్ఠించినా, ప్రథమ దశకంలోనే వారి సాహితీ పటిమా ప్రభావము ఇంచుమించుగా లోపించి, బుద్ధిమంతులైన నూతన తరము వారికి, కనబడకుండానే అవకాశమిచ్చింది.

1903 లో అనగా బ్రిటీషువారు ఓఢ్రదేశాన్ని ఆక్రమించిన తర్వాత సరిగా శతవర్షానంతరం, ఉత్కళ సమ్మేళనం ఏర్పడింది. ఆ సమ్మేళన వేదికమీద సంస్థానాధిపతులూ, ఒరిస్సాలో అన్ని వర్గాల ప్రజలూ కలసి, నాలుగు రాష్ట్రాల్లో చెల్లాచెదరయిన, ఓఢ్రము మాట్లాడే

ప్రాంతాలను సంయుక్తము చేయమని, అందరూ ఐక్య కంఠంగా వాంఛించినారు. సజాతీయ భాషారాష్ట్ర నిర్మాణ వాంఛ తొలిసారిగా భారతదేశంలో వ్యక్తము కావడానికి ఇదే మొదలు. 1903 నుంచీ ప్రథమ ప్రపంచ సంగ్రామాంతం వరకూ, గాంధీ నాయకత్వారంభం నుంచి సహాయ నిరాకరణోద్యమందాకా, ఇదే ఓఢ్రులగాఢ స్వప్నమూ, మహాకాంక్షకూడానూ. ఈ జాతీయోద్వేగం అధునిక భారతంలో ఉత్తమ మహాత్ములలో ఒకరయిన పండిత గోపబంధుదాసు (1877-1928) గారి ద్వారా, గాఢంగా వ్యక్తమైంది. ఆయన కవిత్వం, వచనం, వాగ్ధాటి వల్లనూ, ఓఢ్రప్రజను ఉత్తూత లూపినాడు. ఇలా జనానీకాన్ని ఉద్రిక్త పరిచినవారు, లోగడ ఎవరూలేరు. ఆయన పలుకులు అశేష ప్రజా హృదయాంతరాళమునుండి నినదించినట్లయింది. ఆయన పురీ ప్రాంతంలో సాక్షిగోపాల్ వద్ద ఒక విహారాన్ని, ఆరామ వాటికలో పాఠశాలనూ స్థాపించినాడు. అందులో ఉన్నత విద్యావంతులు, విద్వాంసులు అయిన పండిత నీలకంఠదాస్, గోదావరీ మిశ్ర, కరుణాసింధు మిశ్రవంటివారు పనిచేసేవారు. వైదేశిక ప్రభుత్వంలో అడిగిన మాత్రాన ఆకర్షణీయమైన జీవనోపాధులు లభ్యమయ్యేవాటిని మనసార విడిచిపెట్టి, త్యాగశీలంతో స్వల్పభృతితో, కృషిచేసినారు. ఈ సత్యావాది సమితి రమారమి పన్నెండు సంవత్సరాలు ఓఢ్రదేశానికి సంస్కృతీకేంద్రమై, విరాజిల్లింది. పండిత గోపబంధువుల ప్రోత్సాహదాయక నాయకత్వాన విహారంలో అధ్యాపక వర్గము యావత్తూ, విద్య సారస్వతాల మూలంగా జాతీయ పునర్నిర్మాణం కోసం, జీవితాలను అంకితము చేసుకొన్నది. ముఖ్యంగా ఆ ఉద్యమం ఉజ్జీవనోద్యమంగా వైదిక సంస్కృతి వైపు మరలమని ఉద్బోధించింది. సరళ జీవిత విధానం, ఉదాత్త భావనలతో, వ్యక్తి తన జీవితంలో నిర్విరామంగా త్యాగసేవాధర్మాలు అనుష్ఠిస్తూ, జాతికోసం, మానవసేవకోసం గీతానుసారంగా జీవయాత్ర చేయడం, ఇవే సత్యవాదుల ఆదర్శాలు. అయితే గోపబంధుదాసును మినహాయిస్తే ఆ ఉన్నతాదర్శాలు తక్కినవారిలో ఆచరణలోకి రాలేదు. అందుచేత జాతీయజీవితంలో నైతికశక్తిగా, సత్యవాదిసమితి స్థిరపడ లేకపోయింది. ఆ ఉద్యమము సాగిన కొలదికాలములో సృష్టియైన

సత్యాహిత్యంవల్లనే ఆ ఉద్యమము స్మరణీయమైంది. సత్యవాది సమాజపత్రికలో గోపబంధువుల మహాకాంక్షలూ, ఆదర్శాలూ, ఆత్మ విష్యందమైన అమృతాశీస్సులూ, గంభీర గద్యశైలిలో నిర్దుష్టంగా, భావాభివ్యక్తి లాలిత్యంతో, ఉదాత్తయోచనావిలసితంగా, కవితామోదంతో అద్వితీయంగా. ఓఢ్రదేశంలో వాసించింది. ఆయనరాసిన 'కారాగారబద్ధుని స్వగతం' అన్న గ్రంథము ఓఢ్రంలో జానపదకవితవలె జనామోదము పొందింది.

గోపబంధువుకు అనుయాయుల్లలో సన్నిహితుడయిన నీలకంఠ దాసపండితులు 'ఆర్యజీవన' అన్న తన గ్రంథంలో పాండితీపూర్ణ గూఢ శైలిలో బ్రాహ్మణాదర్శాన్ని ప్రబోధించినారు. ఆయన కోణార్క దేవాలయ శిల్పసంబంధమైన ఇతివృత్తం స్వీకరించి, ఓజస్సుతో అతిసౌందర్య శబలితంగా, కావ్యం రచించినారు. ఆయన ఆ గ్రంథానికి పీఠికలో ఓఢ్రదేశచరిత్రను ఉజ్జ్వలంగా, యోచనోత్తేజకంగా, రచించారు. 'సత్యవాదిసమితి' విద్యార్థులు విజ్ఞానయాత్ర చేశారు. ఆ విద్యార్థులు దర్శించిన స్వప్నమువలె ఆ చరిత్ర సాగింది. నీలకంఠదాసు రాజకీయ మరుభూమిలో సంచారముచేసిన తరువాత సృజనాత్మక సాహితీ ప్రపంచంలో ఈ మధ్య తిరిగి అడుగుపెట్టినారు. 'ఒడియాసాహిత్యేర్ క్రమ పరిణామ' అనే ఆయన గ్రంథము సామాన్యపాఠకులకోసం రచించిన ఒడియాసాహిత్యచరిత్ర. అది ఉత్తమసాహిత్య రచనగా జనామోదము పొందింది. సత్యవాది విహారానికి చెందిన కృపాసింధు మిశ్రపండితులు 'కోణార్క', 'బరబతి' అనే ఉత్తమ ఐతిహాసిక గ్రంథాలు రెండు రచించి వారు. గోదావరిమిశ్ర దేశభక్త్యాత్మకమై హృదయాన్ని ఉత్రూతలూపే నాటకాలు, పద్యాలు, తులలేనిపదాలు, రచించినాడు. ఒరిస్సాలో చక్కని సాహిత్యము సామూహికంగా సాధించినవారు సత్యవాది విహారపండితులు. ఆ విహారము అంతరించి పోవడానికి కారణాలు ఏమైనప్పటికి ఒరిస్సా జాతీయ జీవనములో పునః పూరించడానికి వీలులేని శూన్యము ఏర్పడింది. వంగదేశానికి శాంతినికేతనము ఎటువంటిదో, కొద్దికాలమే నిలిచినా ఆ కొద్దిరోజులే సత్యవాది విహారము అటువంటిదిగా ఉంది ఓఢ్రరాష్ట్రానికి.

## రూపకము - రంగశాల

రూపకము మెల్లగా సాహిత్యంలో ఒకశాఖగా గౌరవమును స్థాపించు కొంటూ వచ్చింది ఈ కాలంలోనే. నాటకము ఒరిస్సా జాతీయ జీవనంలో కూడా ఒక అంశము కాగలిగింది. ఒరిస్సాలో వంగీయ సమాజాలు వంగభాషలో నాటకాలు ప్రదర్శిస్తున్నప్పుడు, వాటిని ధిక్కరిస్తూ పోటీగా దేశభక్తితో ఓఢ్రనాటకం ఉద్భవించింది. రమాశంకర్‌రాయ్, ·కామ పాలమిశ్ర, బికారీచరణ్ పట్నాయక్, గోవిందసుర్దేవ్ క్రమంగా రంగ శాలకు ప్రథిమకలిగించారు; దేశంలో గౌరవము తెచ్చారు. నాటక రంగము వినోదానికే కాక సమాజసంస్కరణకూ, జాతీయోద్ధరణకూ వేదికగా అయినది. వంగీయ నాటకకర్తలు ఇతివృత్తంకోసం రాజస్థాన మహారాష్ట్రగాథలు ఐతిహాసిక నాటకాలకోసం అన్వేషిస్తున్నప్పుడు, ఓఢ్రనాటకకర్తలు ఓఢ్రచరిత్రనుంచే ఖారవేలుడు, కపిలేంద్రుడు, పురుషోత్తముడు, అనంగభీములవంటి ఉదాత్తనాయకులు సామ్రాజ్య విజేతల గాథలు కథావస్తువులుగా స్వీకరించినారు. ఓఢ్రులవంటి బహు కాలమునుంచి ఛిన్నభిన్నమైన జాతికి ఇదే సహజమై ఇష్టమైన రసమైంది.

ఈ యుగంలోనే వైష్ణవపటి అంతటా ఒరిస్సాలోని జానపదనాట కానికి 'యాత్ర'లుగా నవీనాకారమిచ్చి విప్లవము తెచ్చినాడు. ఈ 'యాత్ర' లలో సామయిక లోకవృత్తము ప్రతిబింబితము కావడమే కాక, యక్షగాన సంగీతరూపక సౌందర్య లక్షణము పోకుండా నిలిచి, లాక్షణికంగా రంగానుకూల నాటకానికి సన్నిహితంగా ఇవి సిద్ధమైనవి. ఒరిస్సా గ్రామాలలో సమర్థుడైన ఈ ఒక్కని చేతిమీదుగా సాధించింది, యావత్ సవ్యభారతంలో నిరుపమానమైన కార్యముగా పరిగణింప వచ్చును.

## గాంధీ, రవీంద్రులు - 'సబ్జాలు'

ఈ కాలానికి గాంధీయమైన తుఫాను దేశమంతటా చెలరేగింది. గోపబంధు పండితులూ, ఆయన అనుయాయులూ, జాతీయోద్యమ

ప్రతిఘటనలో మగ్నులైనారు. సత్యవాదివర్గము ఈ విధంగా లుప్తమై పోగా, కటకంలో పట్టపరీక్ష ఇవ్వని విద్యార్థిగణము వంగీయ వాణిజ్య చిహ్నాలతో, చిల్లరసాహిత్య సామగ్రితో, బైటికివచ్చింది. అప్పుడు రవీంద్రనాథునికీర్తి పరాకాష్ఠ అందుకొని జనామోదము పొందింది. నిజంగా ఆయన ప్రభావాన్ని ప్రతిఘటించడం అసాధ్యం. అయితే కటకంలో యువకవులు, తదీయ ప్రభావవశ్యులై స్వతంత్రంగా నిలవ లేక పోయినారు. రవీంద్రుని జ్ఞానభాండారమునుంచి, కవితానిధి నుంచీ వారు నిజంగా అమూల్యమైనవి తెచ్చుకోలేదు. కాకపోతే వారు రవీంద్రుని ఉద్వేగ జనకమై అనవసరమైన బాహ్యావిషయాలు ఛందోగమన విధానము, హేతురహితా భాసమూ-తరుచుగా రవీంద్రుని కవితలో గోచరించే కొంత దురవగాహతను, మాత్రమే అనుకరించ డానికి యత్నించినారు. 'సబుజాలు' (హరితాలు) అనే ఉపనామములు పెట్టుకొన్నారు. రవీంద్రుడూ, ప్రమధచౌదరీ సనాతన పురాతన వంగ సమాజాన్ని ప్రతిఘటించ డానికి పెట్టుకొన్న పేర్లనే - వంగభాషలో సబ్జపత్రవలెనే 'యుగవీణ' అనే పత్రిక వీరు తమ బావవ్యక్తీకర ణకు పెట్టుకొన్నారు.

అయిదారేళ్ళపాటు క్రొత్తసరుకులు వారు సాహితీప్రపంచంలో తీసుకురావడంచేత, ఒరిస్సాలో కొంత కల్లోలము కలిగించారు. అయితే ఆ సరుకులు దిగుమతి చేసుకొన్న సరుకనీ, వాటివేరులు ఒరిస్సా భూమిలో పాతుక్కు పోలేదనీ, అందరూ ఎరుగుదురు. ఆ కవులు స్వతంత్రంగా ప్రచురణాలయం స్థాపించారు. మఖలో పుట్టి పుబ్బలో అంతరించారు వారు ఆకస్మికంగా. అచిరకాలంలో ఆశ్చర్యంగా 'హరి తాలు' పీతవర్ణము కావడం మొదలు పెట్టినవి.

అయినప్పటికీ ఆ 'హరితాలు' కనీసం రెండు దశాబ్దాలు యువ తరమువారి మనసులపై తమ ప్రభావాన్ని ప్రసరింప చేశారు. వారు ఓఢ్రసాహిత్యంలో దేశీయ ఛందాలతోపాటు, రవీంద్రుని ఛందోగమన విధానాన్ని, ఓఢ్రసాహితిలో నిలిచేటట్లు చేశారు. ఆనంద శంకర్‌రాయ్, వైకుంఠనాథ పట్నాయక్ ఆ తొలి దినాల్లో కావ్యాలు వ్రాశారు. విమర్శకులు వాటిని ఓఢ్రసారస్వత సంపన్నిధికి అనుబంధాలుగా

ఆహ్వానించారు. ఈ కావ్యాల్లో శబ్దాలంకారంవల్ల ఒకానొక సంగీత వైచిత్రి కలిగిన నవ్యలోకంలో మనము తప్పక ప్రవేశిస్తాము. ఆ ప్రపంచంలో పదసంగీతము, నవ్యప్రేమాలోకము, సౌందర్యము, ప్రణయము, నవీన; భావ చిత్రణము, నవీనశబ్దసంఘటనజనిత స్వర సౌందర్యమూ, ఒరిస్సాలోని విదగ్ధుల చెవులకు విపరీతంగా తోచాయి. ఇంతకుముందు సరళదాసు మొదలు గంగాధరమిహిర్ ప్రభృతులు దాకా, ప్రజల నానుడిలోగల, నుడికారముగల దేశీయకవితకూ, భాషకూ, ప్రజాహృదయానికీ, అలవాటు పడినారు. యువకవి మండలి అంతా కలిసి 'వాసంతి' అనే నవల రచించిన తరువాత, కొంత కల్లోలము రేగింది. ఆ ప్రభావము యువ నవలా రచయితల మీద కొంత కనపడింది. కాళిందీ చరణపాణిగ్రాహి [1] 'మాటిరమనీష' (మట్టి మనుష్యులు) అనే నవలను తరుణకవుల ఉద్యమ దశలో రచించినాడు. ఆయన కథలు చాలా ప్రచారమై ప్రజామోదము పొందినవి. ప్రస్తుతము కాళిందీచరణ్ ఆధునిక సమస్యలకు సంబంధించిన వచన రచనలవల్ల ఓఢ్రదేశమంతటా ప్రతిష్ఠ సంపాదించినాడు.

## ప్రజాకవులు

'హరితాల' వెనువెంటనే 1930 మధ్యలో సోషలిస్టులు, కమ్యూనిస్టులు వచ్చినారు; తమతోపాటు ఫ్రాయిడ్, వాల్టువిట్‌మన్, కారల్ మార్క్సుల భావాలుకూడా తెచ్చినారు. ఓఢ్రదేశం ప్రధానంగా వ్యావసాయక రాష్ట్రం అయినప్పటికీ, నిన్నటిదాకా కొద్దిగా బియ్యపుమరల పరిశ్రమ మాత్రమే ఉన్నప్పటికీ, ఆ నవయుగ మార్గదర్శకులు వర్గయుద్ధాన్ని గురించి తీవ్రంగా ఆవేశంతో పద్యాలు రాశారు. అంతా తన కేమీ తెలియకుండా కటకంనగరపు మురికివీధుల్లో మలినుడైన పేదరిక్షావాడు చాలా కథానికలకు కథానాయకుడై పోయినాడు. మార్గదర్శకులు ఈ మార్గము అవలంబించని వాళ్ళను మధ్యయుగాలవాళ్ళనీ,

---

[1] అన్య భారతీయ భాషల్లో అనువదించడానికి సాహిత్య అకాడమీ ఈ గ్రంథాన్ని ఎన్నిక చేసింది. —సంపా.

వాస్తవ జీవితాన్ని తృణీకరించి ఉదాసీనంగాచూచే భోగపరాయణులనీ, పేళాకోళము చేసినారు. నిజము చెప్పవలసివస్తే ఖండాంతరాలలో ఈ వర్గ సంఘర్షణ నినాదము సంచలనశీలమైన ఒక ఫేషన్‌గా తయారయింది. ప్రజలమాట అటుంచి, మార్క్స్‌పక్షానుసారులై ప్రజాకవు లనే పేరు పెట్టుకొన్న వారి ఈ అయోమయధోరణి విద్యాధికులైన వారికి కూడా అవగాహన కాదు.

లెక్కలేనంతమంది ఈ వామపక్షరచయితల్లో సమర్థులయిన కొందరి పేర్లుమాత్రం ప్రశస్తికి వచ్చినవి. అయితే ఒడ్రకవిత్వంలో వారికి స్థానం తప్పనిసరిగా ఉండడానికి కారణం వారి పాక్షికసిద్ధాంత ప్రబోధంవల్లకాదు ; మానవకారుణ్యాన్ని ఆర్ద్రభావాన్ని, సామాజిక వాస్తవికతనూ, వారు చిత్తశుద్ధితో సృష్టిచేసినారు కనుక వారిపేర్లు నిలిచినవి. శచీరౌత్‌రాయ్ రచించిన 'పల్లీశ్రీ' ఒరిస్సాలో తదర్హమైన ప్రజామోదము పొందింది. అతని కొన్ని కథానికలలో, పద్యాలలో ఆధునిక వ్యర్థ జీవిత ప్రతిబింబము గోచరిస్తున్నది. అవి శాశ్వతంగా సాహిత్యంలో రసిక జనామోదము పొందుతూ ఉండవచ్చును. అనంత పట్నాయక్ రాసిన కొన్ని పద్యాలు, మనమోహనమిశ్ర భావోద్రిక్తుడై రచించిన కొన్ని గేయాలూకూడా, వారే రాజకీయ సిద్ధాంతాలను పట్టుకొని వేళ్లాడుతున్నప్పటికీ, చాలా హృదయాలను కదిల్చినవి.

అయితే వామపక్ష సిద్ధాంతం ఈ కాలంలో అన్ని సాహిత్యాల సామాన్యధోరణే అయినప్పటికీ. ఇప్పుడు ఉద్ధతమైన వారి యుద్ధనినాదము వినబడడములేదు. ఇప్పుడు టి. యస్. ఇలియట్, ఎజ్రాపౌండ్ అనే ఆంగ్ల అతి నవ్యకవుల ఛాయలు సంచారము చేస్తున్నవి. ప్రతినెల, ప్రతివారము సామాన్యమైన పేలవవచనాన్ని బుద్ధిపూర్వకంగా, అసంబద్ధంగా, తర్కరహితంగా, పద్యరూపంగా పోహళించి అభ్యుదయ కవిత్వమనే పేరుతో ప్రదర్శించడం మనము చూస్తున్నాము. ఈ పద్య సంప్రదాయ నటనముకూడా ఎందుకో అర్థం కావడంలేదు.

గతముప్పది సంవత్సరాలనుంచీ కొందరు రచయితలు మాత్రము సాహిత్యోద్వేగాల పతనోత్పతనాలలో, కుడిఎడమ రాజకీయ పక్షానుబంధాలను ధైర్యంగా ప్రతిఘటిస్తూ, దోషాన్ని విమర్శిస్తూ, వ్యక్తు

లతో నిమిత్తం లేకుండా గుణప్రశంసచేస్తూ, శాంతంగా సాహిత్య సంస్కృతిని ఆరాధిస్తూనే ఉన్నారు. ఈ సాహిత్యోపాసక వర్గానికి చెందినవాడు రాధామోహన్‌గడనాయక్. ఆయన ఒరిస్సాలో ప్రేమ సౌందర్యం, వీరగాథలనూ నిర్దుష్టమయిన ఛందస్సుల్లో కవిత చెప్పిన వాడు. ఆయన ప్రాచీన సాహిత్యాన్ని, ఛందశ్శాస్త్రాన్ని కూలంక షంగా మథించినాడు.

శాంతినికేతనంలో డాక్టర్ కుంజబిహారిదాస్ శుద్ధసాహిత్యోపాస కుడుగా ప్రశంసార్హుడు. ప్రస్తుతము ఆయన ఒరిస్సాలోని జానపదకవితా సముచ్చయము సేకరించే మహాకార్యమునందు నిమగ్నుడైనాడు.

అయితే మొత్తంమీద ఒకరిద్దరు కవులను మినహాయిస్తే కవిత నికి తగిన విపణి పడిపోతున్నది. ఒరిస్సాలో తుది దశాబ్దిలో నవలలూ నాటకాలూ, ప్రధానంగా కాస్తోకూస్తో ప్రశంసార్హాలు.

## నవల, నాటకము, వచనము

ఫకీర్‌మోహన్ తరువాత ఒరిస్సాలో నవలలకు కొరత ఏర్పడ్డది. ఏదో ఒకటి రెండు పుస్తకాలు ఏటేటా వచ్చినా విశేషంగా చెప్పుకోతగి నవికావు. ఆఖ్యాయికా సాహిత్యంలో అనంతరఘట్టం 'హరితా' లదే. కాని రెండు నవలలకే సాహిత్యక్షేత్రము పరిమితమైంది. రమారమి గతదశాబ్దమునుంచి మహంతులు, గోపీనాథ, కహ్నుచరణ సోదరులు, చంద్రమణీదాస్, నిత్యానంద మహాపాత్రో ప్రభృతుల వికాసంవల్ల ఓఢ్రసాహిత్యంలో మహాప్రవాహంగా నవలలు వస్తున్నవి. చవుకబారు, చక్కలిగింతలుపెట్టే నవలలను అటుంచితే, కహ్నుచరణ, గోపీనాథ, నిత్యానందుల నవలల్లో మహాప్రయోజనం మనకు కనపడుతున్నది. [1]గోపీనాధ్ నవీనక్షేత్రాలు శోధించడానికి, ఆదివాసుల సమస్యను

---

[1] ఆయన నవల 'అమృతసంతాన' ఆదివాసుల జీవితానికి సంబంధిం చింది. సాహిత్యఅకాడమీ పురస్కారాన్ని, 1955 లో అందుకొన్నది. దీనికి హిందీ అనువాదము అకాడమీ తరఫున ప్రయాగలో భారతీ భాండారము ప్రకటించింది.

కథాస్వీకరించినాడు. అతని అగ్రసోదరుడైన కహ్నుచరణ్ సమాజ సమస్యలలో మగ్నుడైనాడు. ఇద్దరూ విస్తారంగా గ్రంథరచన చేస్తున్నారు.

## నాటకరంగము

ఓఢ్రదేశానికి ప్రత్యేకరాష్ట్రము ఏర్పడిన అనంతరం, కటకంలో నగరజీవిత వికాసానికి శాశ్వత లక్షణంగా నాటకరంగ స్థాపనకు ప్రోద్బలము లభించింది. ప్రస్తుతం సజీవంగా అభ్యుదయము పొందు తున్న నాటకరంగాలు నాలుగు కనబడుతున్నాయి. నవలలవలెనే నాటకాలకు చాలా గిరాకీ వచ్చింది. అశ్వినీకుమారఘోష్, కాళీచరణ పట్నాయకులు, ఎక్కడ గోదావరీమిశ్ర గోవింద సుర్దేవులు విడిచిపెట్టి నారో, అక్కడినుండి ఓఢ్రనాటక సంప్రదాయాన్ని అందుకుని అవిచ్ఛి న్నంగా సాగిస్తున్నారు. పౌరాణికేతిహాస రూపకాల దినాలు గడిచి పోయినవి. ప్రస్తుతము రంగస్థలాన ఛలామణీ అవుతున్నది సామాజిక నాటకము.

## వచనము

రామశంకర్, ఫకీరీమోహన్‌వారి తరువాత వచ్చినవారి నవలల వల్లనూ, రత్నాకరపతి, బిపిణబిహారిరాయ్, పండిత నీలకంఠదాస్, శశిభూషణ్‌రాయ్ (రాధానాధరాయ్ పుత్రుడు) ప్రభృతుల వ్యాసాల వల్లనూ, గోపాలచంద్ర ప్రహరాజ కృతమైన తీవ్రహేళనాత్మక రచనల వల్లనూ, పండితగోపబంధుదాస రచిత కవితామయ వ్యాసోపన్యాసాల వల్లనూ, ఓఢ్రంలో వచన రచన అధికంగా అభివృద్ధిపొందినదని చెప్ప వచ్చును. విమర్శనాత్మక గ్రంథాధ్యయనంతోపాటు ప్రాచీనమధ్యమ కాలీన సాహిత్యములో శాస్త్రీయ వైజ్ఞానిక విషయాభావం అధికం కావటముచేత, ఆ లోటుకూడా పూర్తి చేస్తున్నారు. తారిణీ చరణరథో ఈ శతాబ్దారంభంలో ప్రామాణికమైన ఓఢ్రసాహిత్య చరిత్ర రచనా రంభము చిన్నగ్రంథంగా చేసినాడు. తరువాత సాహిత్య చరిత్ర సంపు టాలు పెద్దపెద్దవిగా వినాయకమిశ్ర, సూర్యనారాయణదాస పండితులు

ప్రకటించినారు. అనంతరము పండిత నీలకంఠదాస్ ఒడియాసాహిత్య క్రమపరిణామాన్ని గురించి రెండు బృహత్ సంపుటాలు అనుబంధాలుగా ప్రకటించినాడు. ఫకీర్‌మోహన్, గంగాధర్‌మోహన్‌వంటి కవులనుగూర్చి ప్రత్యేకంగా ఇటీవల గ్రంథాలువెల్లువగా వచ్చినవి. ప్రస్తుత శతాబ్దా రంభంలో ఓడ్రభాషాతత్త్వమును గురించి పండిత గోపీనాధ నవశర్మ మహాగ్రంథరచన చేయగా పండిత వినాయకమిశ్ర, గిరిజాశంకర్‌రాయ్, గోళకిబిహారీధార్ ప్రభృతుల విద్యత్కృషి ఫలితంగా తదను బంధంగా ఒడియాభాషాచరిత్ర వచ్చినది. అల్పానల్ప పదకోశములు రమారమి పన్నెండింటిలో, పండితగోపీనాధనందశర్మ ఒరియాశబ్ద తత్త్వ బోధాభి ధానమనే శబ్దవ్యుత్పత్తి తెలిపే నిఘంటువు ఒకటిన్నీ, శ్రీ గోపాలచంద్ర ప్రహరాజు రచించిన చతుర్భాషాత్మక, సప్తసంపుటాత్మక బృహత్ శబ్దకోశము (పూర్ణచంద్ర ఒడియాభాషాకోశము) ఒకటిన్నీ, అతిప్రధాన మైనవి. వాటితో రెండవది లక్షన్నర రూపాయలు వెచ్చించి ప్రకటించి నది. పాఠక ప్రజలకు అత్యావశ్యకమైన, ఉల్లాసకరమైన వివిధవిజ్ఞాన విషయాలను క్రోడీకరించి, విజ్ఞానకోశాలను నాలుగైదు కూర్పులు ప్రక టించిన అనంతరం, ఉత్కళ విశ్వవిద్యాలయమువారు శాస్త్రీయ పద్ధ తులతో ఉత్కళీయ విజ్ఞానకోశమును పూర్తిచేయడానికి ఉద్యమించినారు.

ఓడ్రంలో పాఠకలోకానికి వైజ్ఞానికతృష్ణ అధికమైంది. పాఠకుల తృష్ణ ప్రస్తుతము నిలకడగా ఉండడముచేత గ్రంథప్రకాశకులు పెద్ద చరిత్రగ్రంథాలూ, వ్యవసాయానికి సంబంధించిన అన్నివిషయాల మీదను అణువిచ్ఛేదనముగూర్చి విమర్శగ్రంథాలూ, విజ్ఞానసమితి వారి ఉపదేశాత్మకగ్రంథాలు ప్రచురించారు. ఓడ్రయువకులు విజ్ఞాన శాస్త్రజ్ఞులు ఓడ్రభాషలో శాస్త్రవిజ్ఞానాన్ని ప్రజామోదము పొందించ డానికి యత్నిస్తున్నారు. ఇట్టి కృషిలో ప్రత్యేకంగా గోకులానందమహా పాత్రో, డాక్టరు బి. కె. బెహరా ప్రభృతులు ప్రశంసార్హులు. వారుశాస్త్ర జ్ఞానాన్ని ప్రజానీకానికి అందించడానికి కృషిచేస్తున్నారు. మన్‌మోహన ముద్రాలయాధికారి, ఉత్సాహి, తరుణుడున్ను అయిన ప్రఫుల్లకుమార దాస్ నోబెల్‌పారితోషికము పొందిన విశ్వజనీన సాహితీవేత్తల గ్రంథా లను అన్నిటిని ఓడ్రంలో అనువాదముచేసి ప్రకటించడానికి పూను

కొన్నాడు. అందుచేత ఆయన ప్రశంసార్హుడు. ఆయన అనువాదాల్లో ఒకానొకటి అయిన 'స్వతంత్ర ప్రజ' అనే హాల్డర్‌లాక్స్‌నెన్ అనే ఐస్‌లాండ్ దేశీయుని పుస్తకానికి భారతదేశంలోనేగాక ఆసియాలో ప్రప్రథమానువాదం ఓఢ్రభాషలోనే చేయడం సంభవించింది. తరుణుడూ అధ్యాపకుడూ అయిన వైద్యనాథమిశ్ర స్తుతిపాత్రుడు. ఆయన ప్రజాస్వామ్యాన్ని గురించి గ్రంథాలూ, వ్యాసాలూ పార్లమెంటు ప్రభుత్వ విధానము, సామాజిక రాజకీయాధ్యయనమూ, బుద్ధిమంతులైన ఓఢ్రులను విద్యావంతులుగాచేసే నిమిత్తము, వారికి మన జాతీయ జీవనంలో ముఖ్యలక్షణాలు తెలియజేసే నిమిత్తము రచనలు సాగించడమే పవిత్ర ధర్మంగా పెట్టుకొన్నాడు. వైద్యగ్రంథాలు, మనోవిజ్ఞానము, తర్కము, పశుపోషణం, కోళ్ళపెంపకం ఇత్యాది గ్రంథాలు నిలకడగా విపణిలోకి వస్తున్నాయి. ఉత్కళభాషలో 'ఉత్కళసాహిత్య' సంపుటాలలో పీనుగులనుగూర్చిన గ్రంథాలనో భారతీయ భాషలన్నిటివంట ఉత్తమమైనవి ఉన్నాయి. పారిభాషికపదాలు శాస్త్రాలకు, వివిధవిజ్ఞానాలకు సంబంధించినవి సమగ్రంగా, నిఘంటువుగా, కొన్ని సంపుటాల్లో, క్రోడీకరింపబడ్డాయి. ఆ పారిభాషిక పదకోశసంపాదకవర్గానికి ఓఢ్ర ప్రభుత్వయాజమాన్యాన డాక్టర్ ఆర్తవల్లభమహన్తి ప్రధానసంపాదకుడై కార్యము నిర్వహించినాడు. బాలసాహిత్యము ప్రశంసనీయంగా ప్రవృద్ధమవుతున్నది. అయితే ఇందు నిమిత్తము చేస్తున్న వ్యయము స్వల్పము. 'శిశుసంఖలి' అనగా 'శిశునిధి' అనే ఉత్తమ బాలవిజ్ఞానకోశాన్ని సారస్వత ప్రచురణాలయము ప్రచురించింది. కాని అది అసంపూర్ణము.

పురాతనకాలంలోనూ, మధ్యయుగాల్లోనూ, ప్రస్తుతకాలంలోనూ రచయిత్రీమణులు ఉంటూనే ఉన్నారు. నిస్సందేహంగా ప్రవీణురాండ్రయిన వారిద్దరిపేర్లు పేర్కొనక తప్పదు. డాక్టర్ కుంతలకుమారి సబత్ ఢిల్లీలోవుండి గతించింది. ఆమె కవయిత్రిగా నవలారచయిత్రిగా దేశసేవికగా పేరుపొందింది. ప్రస్తుతము శ్రీమతి విద్యుత్ ప్రభాదేవి భావగేయాత్మకరచనలు చేస్తున్నది. ఆమె ధారావాహికంగా నిర్దుష్ట ఛందాల్లో విస్పష్ట భావచిత్రణంలో కవితచెప్పి ఖ్యాతి గడిస్తున్నది.

ఓఢ్రరాష్ట్ర నిర్మాణానికి పూర్వంకన్న మొత్తంమీద ప్రకృత పరిస్థితులు బాగా కనబడుతున్నాయి. మేము పట్టపరీక్షకు వెళ్ళడానికి కింది పరీక్షలకు చదువుతున్న రోజులనుంచీ 1930 ల వరకూ, ఒకటి రెండు వారపత్రికలతో ఓఢ్రదేశం తృప్తిపడింది. ప్రస్తుతము దైనికపత్రికలు అయిదున్నాయి. అందులో ఆంగ్లదైనిక పత్రిక ఒకటి. పుస్తకవ్యాపారము బాగా వృద్ధిలో వున్నది. ఒరిస్సా భావిదశ ఆశాజనకంగా ఉంటుందని సహేతుకంగా విశ్వసించవచ్చును. అందుకు కారణం ఒరిస్సాలో సహజశక్తి సంపన్నిధానముండు టేకాదు. అందుకు తోడుగా లలితకళా సంస్కృతిక్షేత్రాల ఉత్తమ సంప్రదాయం భిన్నరూపాల్లో వ్యక్తమవుతున్న సంస్కృతివల్లకూడా ఓఢ్రదేశపు భవితవ్యము ఉజ్జ్వలంగా ఉండక తప్పదు.

ఆకర గ్రంథజాతము


i. Orissa — *by W. W. Huntur.*

ii. A Comparative Grammar of the four Eastern Indian Languages.
*by John Beams.*

iii. Typical Selections of Oriya Literature 3 vols.
*by B. C. Majumdar, Calcutta University.*

iv. Modern Oriya Literature,
*By Priya Ranjan Sen, Calcutta University.*

v. Lingustic Survey of India,
*by G. A. Grierson, Vol V, pt. 2, pp. 367-449*

# ఉర్దూ సాహిత్యము

ఖ్వాజా అహమద్‌ఫరూకీ

## చారిత్రక ప్రాతిపదిక

1857 సంవత్సరములోని జాతీయ భావోల్బణము చాలా విశిష్ట సంఘటన. మొగలాయీ సామ్రాజ్యము అంతమైంది. మూడు శతాబ్దాల పాటు పరిపాలనకాలంలో సాంస్కృతిక మూల్యాలను సంరక్షణ చేయడానికి కృషిచేసిన సామ్రాజ్యము మంటిలో కూలిపోయింది. పారిశ్రామిక విప్లవాధారాలతో, తమకు వశ్యమైన విజ్ఞానశాస్త్ర సాహాయ్యము వల్ల బ్రిటీషువారు భారతదేశంలో సుప్రతిష్ఠితులై, తమ ప్రయోజనాల నిమిత్తం దేశాన్ని స్వేచ్ఛగా కొల్లగొట్టడానికి అడ్డులేకపోయింది. దేశీయమై పురాతనమైన విధానము, వైదేశికమై నవ్యమైన విధానానికి, తావును కల్పిస్తూ ఉండేది. ఆ నవ్యవిధానంలో అభ్యుదయలక్షణాలూ, కొన్ని విశిష్టగుణాలూ, లేకపోలేదు. దానివల్ల మనకు పాశ్చాత్య వైద్యమూ, విజ్ఞానశాస్త్రాలున్నూ, సన్నిహితాలయినవి. మన సామాజిక జీవితమూ, మానసిక దృక్పథమున్నూ, పాశ్చాత్య సంస్కార ప్రభావ భావితాలైనవి.

కాని ఆర్థిక రాజకీయ రంగాలలో వైదేశిక సామ్రాజ్య స్థాపనము బ్రిటీషుపాలకుల స్వప్రయోజనాలకూ, భారతీయుల ప్రయోజనాలకూ మధ్య నిశితమైన ఘర్షణకు దారితీసింది. 1857 నాటి విప్లవము వివిక్త సంఘటనకాదు; ఇతిహాసంలో హఠాత్సంభవమూకాదు. బ్రిటీషు విజేతలచేతుల్లో రాజకీయముగానూ, సాంస్కృతికముగానూ. భారతీయులు నలిగిపోగా, యావత్ప్రజానీకపు అసంతృప్తిన్నీ, రాశీభూతమయిన దాని ఫలమది. అది కేవలమున్నూ సైనిక విప్లవముమాత్రం కాదు. కాని డాక్టర్ డఫ్‌మాటల్లో అది "ఒకానొక తిరుగుబాటు - విప్లవము." అది

"భావి స్వాతంత్ర్య సంఘర్షణకుముందుగా వేసుకొన్న వేషముతోకూడిన రిహార్సలు" సంయుక్తమైన ఒకానొక ఉద్యమానికి సంప్రదాయిం వీర్పడింది. ప్రాచీన సామాజికశక్తులు "1857 లో తమ శక్తిని పునః ప్రతిష్ఠించే తుదియత్నంలో పరాజితమైనాయి." 1870 అనంతరంగాని నవ్యసామాజికశక్తులు ఉద్భవించలేదు.

1885 లో భారతజాతీయ కాంగ్రెస్ స్థాపితమైంది. 1870, 1885 సంవత్సరాల యుగాంతరంలో రైతాంగంలో, అసంతృప్తికలిగింది. పాలకులు చేతిపనులవల్ల జీవించేవారినీ, వృత్తికారులనూ, కుంఠితులను చేసినారు. 1867, 1885 మధ్యలో కాటకాలు వినాశకరంగా. ఉప్పొంగిల్లినవి. దక్కనులో 1875 రైతాంగము విప్లవించింది. జాతీయ వార్తాపత్రికలు నిలకడగా వృద్ధిలోకి వచ్చాయి. అమెరికాఖండంలో ప్రజానీకంలో రేగిన స్వాతంత్ర్య సమరమువల్లనూ, ఆస్ట్రియా రాజ్యాధిపత్యాన్ని సహించక, ఇటలీప్రజలు సాగించిన జాతీయ స్వాతంత్ర్య సమరమువల్లనూ. థామస్‌పెయిన్, స్పెన్సర్, మిల్, వాల్టేర్, గారిబాల్డీ జీవితాలూ, గ్రంథాలవల్లనూ, బుద్ధిమంతులయిన విద్యావంతులు ఉజ్జ్వల భావోద్దీపితులై నిద్రాణస్థితినుండి మేలుకొని రాజకీయ చైతన్య స్పందితులైనారు. భారతీయ మితవాదులు అభ్యుదయభూమికను నిర్వహించినారు. అయితే నిరుద్యోగసమస్య ప్రబలం కావడం, ప్రజానీకంలో కల్లోలం ఉత్పన్నమై, భారతదేశంలో సైనిక జాతీయవాద వికసనానికి ప్రోద్బలం ఇచ్చింది. 1905 నుంచి 1918 దాకా జాతీయోద్యమం ప్రబలమయిన ధాటీతో, విస్తృతమైన సామాజికాధారమును సంపాదించింది. ప్రథమ ప్రపంచసంగ్రామం, స్వదేశపాలనోద్యమ నినాదం, యుద్ధానంతర ఆర్థిక సందిగ్ధావస్థవల్ల, భారతదేశంలో బ్రిటీషుపాలన పునాదులు శిథిలములైనాయి.

రౌలట్‌శాసనము, సైనికశాసనము ప్రబలముగా పంజాబులో ఉన్న కాలంలోనూ, ఖిలాఫత్ ఆందోళనమున్నూ, జాతీయమైన అసంతృప్తినీ, పూర్ణరూపంలో పొర్లి ప్రవహించాయి. ప్రభుత్వము రాజకీయ నాయకులకు వ్యతిరేకంగా తీవ్రవిధానాలు అమలుజరిపింది. ప్రభుత్వము మౌలానాఆజాద్ 'అల్‌హిలాల్,' మౌలానా మహమ్మద్ అలీగారి

'కామ్రేడ్.' 'హందర్డ్' లను నిషేధించి, 1915 లో ప్రముఖ నాయకులను నిర్బంధించింది. గాంధీమహాత్ముడు ఉత్సాహంతో ఖిలాఫత్ ఉద్యమానికి అండదండలిచ్చి, 1921 లో ప్రసిద్ధ 'సహాయ నిరాకరణోద్యమం' ప్రారంభించినాడు. ఆయన తుది నిశ్వాసంవరకూ, భారత రాజకీయరంగాధిపత్యము వహించినాడు. 1930—34, 1942 సంవత్సరాల్లోని జాతీయ ప్రజానీకోద్యమాలకూ, ద్వితీయ ప్రపంచయుద్ధానికీ, సమాంతరంగా కులమతశక్తులుకూడా బలాన్ని సమకూర్చుకోగా, చివరకు దేశవిభజనము పాకిస్తాన్ ప్రభవించడమున్నూ ఫలించింది. గాంధీజీ 'కులమతతత్త్వ నిర్మూలనకు తన జీవితరక్తాన్ని సజీవమైన ఆహుతిగా అర్పించినాడు.'

## సాహితీ నేపథ్యభూమి

జాతీయ చరిత్రాత్మక వికాసదశలన్నిటికీ అనుకూలంగా, ఉరుదూ సాహిత్యం విరాజిల్లింది. ఆ సాహిత్యం ప్రజల మనోవైజ్ఞానిక పరిశీలనలతోనూ, భావోద్రిక్తాను భావాలతోనూ, భావస్పందనాలతోనూ, ముర్మరించింది. జీవితం యథాతదంగా ప్రతిఫలింపచేయడానికి, సాహితీవేత్తలు ఆస్థాన సంప్రదాయకావ్య వస్తువులయిన గులాబీలు, కోయిలలు, శబ్దాడంబరమునూ, గతానుగతిక నిర్జీవ భావ చిత్రణమున్నూ, ఇంకా అవలంబించవచ్చునా కూడదా అని చర్చచేసినారు. 1856లో అయోధ్య 1857 లో ఢిల్లీరాజ్యాలు అస్తమించిన తరువాతనూ, బ్రిటిషుపాలన సుప్రతిష్ఠితము అయినమీదట, భావపరివర్తనం వచ్చింది. ఉరుదూ సాహిత్యం భవిష్యత్తులో బాగా ప్రాధాన్యం వహించగల సన్నివేశ ప్రభావాన్ని తప్పించుకోగలిగింది. పరివర్తనలో దశలన్ని - భీషణఘర్షణ, రుగ్మతామయ చేష్టాప్రతిరూపము - ఆరోగ్యదాయక సమన్వయమున్నూ స్ఫుటముగా ఇక్కడ గోచరించాయి. ప్రాచీనమైన దాని వక్కపక్కలనే నవ్యమూ ఓజోమయమైన భావమార్గము - ఆంగ్లేయ విద్యాభ్యాసం వల్లనూ, ముద్రణయంత్రంవల్లనూ, ఆధునికమైన రవాణా విధానాల చేతనూ, వచ్చింది.

బ్రిటిషు సంస్కృతిప్రభావముప్రథమతః ఢిల్లీ లో ఉరుదూసాహిత్యో

జ్జీవనంలో, 19 శతాబ్దిలో రెండవ పాతికేళ్ళకాలంలో గోచరించింది. ఔత్సాహికులు కొందరు సాహిత్య విజ్ఞానశాస్త్రాన్నీ, సంస్కృతినీ ఉరుదూలో రచన సాగించినారు. 1825 లో స్థాపితమయిన ప్రాచీన ఢిల్లీ కళాశాలవల్ల శాస్త్రవిజ్ఞానోజ్జీవనం సంభవించింది. ఢిల్లీకలాశాలలో శాస్త్రీయ పరిశోధనలవల్ల విద్యార్థులు 'మంత్రముగ్ధులైనారు.' నవ యుగానికి తాము అగ్రేసరులుగా వారు భావించారు; వారు క్రొత్త కలలు కన్నారు; నవ్యాలోకనం చేశారు. 1844 లో 'దేశభాషానువాద సమితి' ఢిల్లీ కళాశాలలో స్థాపితమైంది. ఆ సమితి శాస్త్ర విజ్ఞాన గ్రంథాలను ప్రచురించింది. ఆచార్య రామచంద్ర 'ముఫిదున్ నజీరీన్', 'ముహిబ్బే హింద్' అనే రెండు పత్రికలు ప్రధానంగా పాశ్చాత్య భావాలను, శాస్త్ర విజ్ఞాన సంబంధమైన మూల్యాలను, ప్రచారంచేసే నిమిత్తంగా ప్రచురించినాడు. 1864 లో ఢిల్లీ సమితి ఏర్పడింది. దానికార్య సచివుడయిన ప్యారేలాల్ అషబ్,-ఆజాద్, (మృ. 1910) యాలీ (మృ. 1914) లకు సాహాయ్యము చేసినాడు. వారివల్ల ఉరుదూ సాహిత్యంలో ఆరోగ్యదాయకమైన పరివర్తనం ఫలించింది.

ఇది పరివర్తనమైనప్పటికీ అంత ఆశ్చర్య జనకంగానూ, అతి వేగంగానూ రాలేదు. శాంత పరివర్తనము భారతీయుల ఉపజ్ఞానుకూలమైంది. పరివర్తన మార్గదర్శకులు సంస్కారభావమువల్ల, శక్తి వంతులయినారే కాని, విప్లవ భావంతోకాదు. పూర్తిగా వారు గతాన్ని విచ్ఛేదన చేయలేదు. నవ్యాలోకంతో మహాకవులను అవగాహన చేసికొని, పునః వారిని వ్యాఖ్యానించినారు. భావార్ద్రత ఉరుదూ సాహిత్యంలో కలిగించి, జీవిత యాథార్థ్యమును చూపించాలని వారి ప్రధానోద్దేశ్యము. వారు పాశ్చాత్య ప్రభావాతిశయాన్ని పరిహరిస్తూ కృత్రిమ చిత్తశుద్ధి రాహిత్యాన్నీ, ఆడంబర భావచిత్రణాన్నీ, ఆడంబరమైన అతిశయోక్తినీ గర్హించినారు.

ఆజాద్, హాలీ కవులు నవోద్యమానికి మార్గదర్శకులైనారు. 1874 లో కల్నల్ హాల్ రాయడ్ సలహాపై కవితా గోష్ఠులను (ముషాయిరాలను) వారు ఏర్పరచి నవ్యకావ్య పఠనం చేసేవారు. బర్కరత్, ఉమ్మీద్, ఇన్‌సాఫ్, హుబ్బేవతన్ అనే కావ్యాలు హాలీకవి రచించినాడు.

అది ఉరుదూ కవితలో బుద్ధి పూర్వకమయిన నవ్యసరణి. ఆలీఘర్ ఉద్యమ వ్యవస్థాపకుడయిన సర్‌సైద్ అహమ్మద్‌ఖాన్ అర్థించడంచేత, హాలీకవి 'ముస్సద్దస్' అనే మహోన్నతమైన ఉరుదూ కావ్యం రచించినాడు. సాహిత్యయుగముమీద ఆ కావ్యము తన ప్రతిష్ఠాంకమును ముద్రించినది. హాలీ ప్రాచీన సాహిత్యాన్ని సామాజిక చైతన్య దృష్ట్యా, ప్రయోజనకర ప్రవృత్తి దృష్ట్యా, మూల్యనిర్ణయము చేసినాడు. సారస్వతము జీవిత దర్పణమయినపుడే, దానికి వైశిష్ట్యము ఉంటుందని హాలీకవి అభిమతము. సర్‌సయ్యద్ అహ్మద్‌ఖాన్ (మృ 1898) తన ప్రేరణము, ప్రభావమూ, సంస్కారోత్సాహాలవల్ల ఉరుదూ సాహిత్యగమనాన్నే మార్చివేసినాడు. అందుచేత ఆయనకు మహాగణ్యత ఇవ్వక తప్పదు. ఆ స్థానాల్లో జటిలనియమాలవల్ల ఘనీభూతమైన ఉరుదూ సాహితీస్రవంతి ఆంగ్లసాహిత్య సంసర్గమువల్ల మసృణమై, అర్థమై, జాలువారింది. పురాతన మూల్యాలను వెనుకకు తోసివేయడం, జరిగింది. సాహిత్యము శృంఖలాముక్తమైంది. అలాగ ఉరుదూలో యథార్థమైన ఉజ్జీవనం ఆరంభమైంది.

ఆ నవ్యోద్యమ బీజాలు సుల్తాన్‌కులీకుతుబ్‌షా (మృ. 1611), మీర్ (మృ. 1810) సుదా (మృ. 1780) లు రచించిన షహర్ అషోబ్ లలోనూ, మీర్‌హసన్ (మృ.1786) కృత 'మస్నవీ' లలో ఆనీస్ (మృ. 1874) రచించిన 'మర్షియా' లలో నజీర్ అక్బరాబాదీ (మృ. 1830) పద్యాల్లో, మీర్జాగాలిబ్ (మృ. 1869) కృత గజల్‌ఛందో బద్ధకవితలో చూడగలము. గాలిబ్ కవినిగూర్చి ఇలా విమర్శించాడు. గాలిబ్‌లేకుంటే హాలీకవి ఉండేవాడుకాడు. (మృ 1914) ఎకచార్ (మృ. 1938) ఉండడు. ఆ ఇద్దరూ ఉరుదూ కవితామందిర స్తంభాలు. కాని ఆ సాహిత్యము అవతారికా ప్రాయమైంది. దానికి ఓజోమయ నవజీవన స్పందన కలగడానికి పాశ్చాత్యవిద్యాప్రేరణ ఆవశ్యకమయింది.

పరివర్తన శీలమయిన ఉత్సాహము ప్రతి సాహిత్యశాఖలోనూ, వ్యాప్తమైంది. ప్రాచీన కృతక లాక్షణిక కావ్యధోరణి సన్నగిల్లింది. సంప్రదాయక గజలు ఛందోనియమము మితిమీరి ఉన్నదనిపించింది. సామాజిక రాజకీయ కావ్యవస్తువులుకూడా, ఇమిడేటట్లుగా గజలు విస్తృత

మైంది. ప్రకృతీ, దేశభక్తివల్ల భావోద్దీపనంకలిగి, నూతన కావ్యవస్తువు లుగా స్వీకరించి, కవిత్వము చెప్పినారు. నవ్యబాధ్యత బుద్ధిపూర్వకంగా కవులు గుర్తించినారు. జీవితానుభవాలు హృదయసంవాదము కాక తప్పదని కవులు గ్రహించారు. లాక్షణిక ధోరణిలో పదసంఘటనమును పరిహరించి, కవులు నవ్యసాహిత్య ప్రక్రియలు ప్రయోగించినారు. వాటి వల్ల వారికి అధికంగా స్వాతంత్ర్యంవచ్చింది. కొద్దిలో చెప్పవలెనంటే, హాలీకవీశ్వరుని సంస్కరణోత్సాహము, సూక్ష్మ విమర్శనాత్మకదృష్టి ఇస్మాయిల్ (మృ. 1897) ప్రసన్నతా సూక్ష్మదృష్టి, దుర్గాసహాయ్ సురూర్ (మృ. 1910) యొక్క తీవ్ర దేశభక్తి, అక్బర్ (మృ. 1921) సుందరకవిత్వమూ, సూక్ష్మ హేళనాత్మకమూ, నర్మహాస్యోపేత మున్నూకాగా, నవ్యోద్యమ వికాసానికి అవకాశము కలిగింది. వార్తాపత్రికలూ, మాసపత్రికలూ, పాశ్చాత్య గ్రంథాను వాదాలూ పెరిగినవి. వాటితోపాటు సృజనాత్మక విషయ, రచనా వైవిధ్యమూ అమితమైంది.

ప్రథమ ప్రపంచ సంగ్రామానికి పూర్వయుగంలో, ఉరుదూ కవి త్వాన్ని తన గర్భంలో ప్రోదిచేసికొన్న భూసారముగల శాంతవాహినితో పోల్చవచ్చును. 19 శతాబ్దాంతంలో ఉదారోద్యమాల ప్రభావంచేత, జీవనవాహిని కూడా కొంతవరకు, శాంతంగానే ప్రవహించింది. భారత జాతీయ శోభా దరిద్రాణ దశకు వగచి, కావ్యాలాపముచేసిన ప్రథముడు, హాలీకవి. ఆయన కవిత్వము జీవితానికి దూరము కాలేదు. ఆయన కవనంలో వర్ణాత్మికాశబలిత జీవితము ప్రతిఫలించింది. అందుచేత తరువాత వచ్చిన రచయితలకు కావలసిన ఒరవళ్ళు దొరికినవి. కావ్యాలు సామాన్యంగా అనువాదాలో, అనుకరణాలో అయినప్పటికీ, తరుచుగా సరికొత్త ఇతి వృత్తాలుకూడా కవులు స్వీకరించారు. కొన్ని స్వతంత్ర కావ్యాలుకూడా ఉదాత్త దేశభక్తి భావ పూర్ణములైనవీ, ఇంచుమించు అబల సహజ కోమలరీతిలో, దేశము నెడల ప్రేమ ప్రకటించినవిన్నీ, వచ్చినవి. కవులు మాతృభూమిని కొత్తగా కనుక్కొన్నట్లుగా, తార కోజ్జ్వల నిశలను, కుట్మలిత లతలను, కువకువలాడు శకుంతాలనూ ఉద్దేశించి, కావ్యగానాలు చేసినారు. చక్‌బస్త్ (మృ. 1926), బెనజీర్‌షా

(మృ. 1930), సురూర్ జహానాబాదీ (మృ. 1910), వహీదుద్దీన్ సలీమ్ (మృ. 1928), షౌక్‌ఖిద్వాయ్ (మృ. 1928), నజీర్, నదీర్ (మృ 1912) కవుల కావ్యాలలో, 1914 సంవత్సరానికి పూర్వధోరణులు విశదంగా ప్రతిబింబించినవి.

గజలు రచనలో పరివర్తనం శాంతంగా వస్తూవచ్చింది. హాలీకవి వల్ల గజలులో కావ్యవస్తువు సామాజికమై విస్తృతమైంది. ఆయన గతాను గతికమైన శబ్దాలంకారాలను విసర్జించి, గజలుకు నవ్యోదయ గానము చేసినాడు. ఆ గజలు ఛందస్సులో, అతి ప్రసన్న భాషలో, యోచనా భావముల సమ్మేళన జరిగింది. అమీర్ (మృ. 1900), దాగ్ (మృ. 1904) కవులు ప్రజానీకామోదము పొందుతూఉన్నా, ఉరుదూలో మహాకవి శేఖరులైన మీర్, గాలిబుల చేతులలో మరల పూర్వ సంప్రదాయ సరణినీ, ఆకృతినీ, గజలు పొందింది. సంస్కరణం చేసినందుకు హాలీనినిందిస్తున్న లక్నోలో, మీర్, గాలిబు కవులు ఇప్పుడు గజలుకు రూపరేఖలు ఏర్పరించినారు. సాఖిబ్ (మృ. 1869 , అజీజ్ (మృ. 1935) అసర్ కవులు ఆ ప్రాచీన మహాకవుల అడుగుజాడలలో నడచి వారు. ముషాఫీ (మృ. 1824), నసీందేహ్లాలీ (మృ. 1843) లను హజరత్‌మొహాన (మృ. 1951) అనుసరించినారు. ఢిల్లీ, లక్నోలలో పూర్వసాహిత్య భేదాలు అంతరించగా, ఆ కవితాశయ్యలు రెండూ శ్రవణ పేయంగా సామరస్యము పొందినవి.

ఎక్బాల్ కవీశ్వరుడు ఉపజ్ఞా ప్రావీణ్యమువల్ల పైకివచ్చి, గజలు ఛందస్సుకు నవ్యరీతిని కల్పించినాడు. ఆయన సమకాలిక సమస్యలను సాంస్కృతిక ఘర్షణలను, సామాజిక కల్లోలాన్ని కావ్యవస్తువులుగా స్వీకరించి, గజలురూపంగా రచించినాడు. కవులు మొదట ప్రణయ గానము చేయడానికిమాత్రమే గజలును సాధనంగా వినియోగించుకొనే వారు. ఎక్బాల్ స్వప్రయోజనార్థం గాలిబ్‌కవి వంటివారి సంప్రదాయక శైలిని, ఉపజ్ఞతో అనుసరించి నేర్పుతో స్వప్రయోజనం ఘటింప జేసుకొన్నాడు. ఆయన తన భావుక జీవితాంశమైన మూలతాత్త్విక ప్రమితి విషయక పదార్థాలను, గజలు ఛందపు జిగిబిగిలో విన్నాణంతో కూర్చినాడు. ఆయన తన కవితా సాంకర్య మహావైవిధ్యాలవల్లనూ, అధిక

తరంగా అర్ధగాంభీర్యమునకూ, జీవితసమస్యల పూర్ణవ్యక్తీకరణ కున్నూ, గజలు ఒక సాధనంగా చేసికొన్నాడు.

షాద్ అజీమాబాదీ (మృ. 1927) నసీఖ్‌కవీంద్రుని ఆలంకారిక లక్షణాలను, మీర్‌రియాజ్ (మృ. 1934) కవీశ్వరుని తీక్ష్ణ స్వచ్ఛసంగీతంతో మేళవించినాడు. ఆయన బాధామయ కఠినజీవితమునుంచి తప్పించుకొని, కవితామాధ్వీకామోదమయధామములోకి, నిజస్వభావాన్నిబట్టి వెళ్ళినాడు. అర్‌జూ స్ఫుటంగా, ధైర్యంగా, ప్రజలభాషనే ఉపయోగించినాడు. ప్రసన్నమైన భాషవల్ల, అతనిశైలికి ఓజోవిశేషము వచ్చింది. ఆయన ఇలాంటి బాషనువాడి నిజమైన సరియైన సంస్కరణ ప్రవేశపెట్టినాడు. యశ్ ఓయగన కవి, గాలీబును మరోతీరుగా తూర్పార పట్టినా, ఆ కవిగారి బలహీన హృదయకోమలతలో పాలుపంచుకొన్నాడు. అతనికి గాలీబ్ కవీశ్వరునికిగల భావనాశక్తి, పదాలకు పక్షములుతొడిగే భావనాశక్తికానీ, ఉజ్జ్వలమయమైన ఆలోకనకానీ, పాపాన్నికూడా దివ్యంగా చూడగల క్రాంతదృష్టి కానీ లేదు. అయినప్పటికీ యాస్ కవి గారి పద్యాలుకొన్ని కొత్తబాణీలో. భావోద్రిక్తతతో, పూర్ణమైన అహమిక, కవితాసారమున్నూ కలవి. లక్నోలో గజలు ఛందాన్ని అర్ధగభీర పూర్ణంగా వర్ధిల్లచేసిన అర్‌జూ, అజీజ్, సాఖిబ్, నఫీ, అసర్ కవులశ్రేణితో అతడు సరితూగు సాటివాడు.

## సమకాలిక కావ్యసరణులు

ఆధునిక భారతదేశంలో హజరత్ మొహానీ ఉత్తమోత్తమ గజలు రచయితగా చెప్పవచ్చును. హాలీకవి లక్నో పురీయ గజలు ఛందస్సు యొక్క సంప్రదాయ సంవిధానాన్ని గట్టిగా విమర్శిస్తున్న కాలంలో, మొహానీ సాహిత్య జీవితం ఆరంభించినాడు. హాలీవిమర్శవల్ల విరుద్ధమైన రెండు విధాలుగా ఫలితము ఏర్పడింది. అజమ్ తుల్లాఖాన్ (మృ. 1927) గజలులో భావైక్యమూ, సహజత్వమూలేవని తలచి, దాన్ని రూపుమాపవలెనని యత్నించినాడు. మొహానీ ఉరుదూ గజలుకు పునః ప్రాణకలిగించి, దేహాళీలక్నౌ పురీయ శైలీభేదము పోగొట్టి, తెలివిగా దాన్ని సమరసపరచినాడు. హసరత్ జీవితమార్గాల్లో అతివాది,

విప్లవకారుడే అయినా కళారంగములో మాత్రంకాదు. సంప్రదాయాను సారంగావస్తున్న గజలు యొక్క సర్వప్రాచీన సంకేతాలనూ, కవితా వస్తువులనూ వినియోగించుకొని, నవ్యసరణినీ, వాతావరణాన్నీ కల్పించి నాడు; గజలులో ప్రాచీనార్వాచీనతలకు సేతువు కట్టినాడు; అనగా ప్రాచీనమయిన ఓజస్సునూ, నవ్యమైన ఎఱుకనూ, భవిష్యత్తులో సాధ్యతలనూ, సమ్మిళితము చేసినాడు. ఆయన కావ్యములో ప్రణయ వస్తువులు, నీరసములూ గతాను గతికమైనవిన్నీ కావు. అవి యదార్థ ములూ అనుభవసిద్ధమైనవిన్నీ. ఆయన భావగేయాత్మకతలో గార్హస్థ్య మైన సహృదయతాస్పర్శ, ప్రాగ్దేశీయరుచి, ఓజస్సుతోడి స్థైర్యమున్నూ ఉన్నాయి. హసరత్ సరికొత్త గజలును సృజించలేదు. ప్రాచీనంగా ఉన్నదాన్ని ఉద్ధరించినాడు. ఆయన ముషాఫీ, (మృ. 1824) మోమిన్ (మృ. 1851) కవుల కోవలోనివాడు; కేవలానుభవమువల్ల గడించిన సామాజిక రాజకీయ చైతన్యంతో, తన ఉత్తమాంశలను మేళవించినాడు. హసరత్ తన విధానాన్నే అవలంబించి తన కావ్యకళామయ స్వభావ మును వ్యక్తీకరించడానికి, తగిన సాధన కనుక్కున్నాడు.

ఫానీ కవీశ్వరుని గజలులు, మర్మవేదనా ముఖరితమై, మధురాతి మధురంగా ఉంటాయి. ఆయన సుందరంగా, ఔత్సుక్యంగా, కరు ణార్ద్రంగా రసభావ పోషణ చేస్తాడు. ఆయన గజలు హృదయాన్ని కదల్చి వేయగల అసామాన్య శక్తి కలది. దీపిత వేదనవల్ల, పదసంఘ టనా ప్రావీణ్యంవల్ల ఆ కవి గజలులు హృదయ సంవాద మవు తున్నాయి. చిత్తశుద్ధితో చూచింది, అనుభవించింది, ఆయన అభి వ్యక్తము చేస్తాడు. విశుద్ధమైన కావ్యనిర్మాణ కౌశలములో, సమ కాలికులందరిలో ఆయన మిన్న. ఆయన జీవితము దీర్ఘవేదనాభరితము; పరిసరాలకు అనుకూలంగా జీవించలేక బాధపడినాడు. ఆయన కవిత కోమల కరుణారస భరితము. అందుచేతనే ఆ కవిత్వం అతిసుందర సంగీత మాధురికి మూలమైంది. ఆయన కన్నీరు అప్రాప్త తీవ్రకాంక్ష చేత, 'పరమేశ్వరునికోసం అగాధ హృదయ వేదనతో' ఉద్భవించింది. ఆయన 'ఆలోచనా ప్రపంచము' కొందరు అపోహ పడినట్లు, సంకుచిత మైనదికాదు.

అఖ్తర్ (మ్ఫ. 1936) ఎక్కువగా గాలిబ్, మోమిన్ కవులవల్ల ప్రభా వితుడైనాడు. అతని యోచనా వైఖరివల్ల గజలుకు అర్థగాంభీర్యము వచ్చింది. కవితాకోమలత్వంచేతను, మధుర భావచిత్రణ వల్లనూ, గజలు రచయితలలో అతనికి ఉన్నతస్థానం వచ్చింది.

అసర్‌కవి భావగేయాత్మకశక్తి అసాధారణమై, సర్వతోముఖమై, సర్వమానవీయ రసభావ పోషణా చాతురీ విలసితమైనది.

జిగర్ గజలు కవిగా ప్రముఖుడు. శబ్దగంభీరమైన అవరోహ ణానికీ, కోమలభావుకతకూ, పరిపక్వమైన ఆత్మజ్ఞానానికీ, భావవైవిధ్య, భావశబలతకూ అతనికి అన్యులు సాటిరారు. అద్భుత విరళభావ చిత్ర ణలో. సంగీతాన్ని ఛందాన్ని మేళవించి నడపడంలో అసమాన సర్వతో ముఖప్రజ్ఞ అతనికి ఉన్నది. ప్రణయము, సౌందర్యమూ అతని భావనాశక్తికి ప్రధానాశ్రయాలు. మానవాత్మోన్మీలనముచేతను, సుకు మార విరక్తిచేతను, మాదకతామయ భావముచేతనూ, అతని భావగీతా త్మకత విశదమై, గుణవిశిష్టమైనది. యువకవులమీద అతని ప్రభావము అధికము. యువజనులు అతని కవిత్వపు బాహిరమైన సొగసులు అనుక రింపబోయి విఫలులైనారు.

ఫిరాఖ్ పాశ్చాత్యకావ్య మాధురిని తనివితీర ఆస్వాదించినవాడు. ప్రాగ్దేశీయ సంస్కృతియెడల ద్వేషమాత్సర్యాలులేకుండా, ఆయన పాశ్చాత్య సంస్కృతిని అవగాహన చేసికొన్నాడు. ఆధునిక సమస్య లతోనిండిన ప్రవృత్తికి ఆయన పరిష్కారం ఆధ్యాత్మికం; అది ప్రేమ, ధైర్య, విప్లవాత్మక రసావేశ లక్షణ లక్షితమైంది. ఆ కవీశ్వరుడు ప్రతి ఆలంబన విభావానికీ, సన్నివేశానికీ, వైషయక పరిజ్ఞానంతో, ప్రతిస్పంది స్తాడు. అతని భావము యోచనాశీలముకలది; భావనాశక్తి, విస్తృతమైన వ్యుత్పత్తివల్ల సుసంపన్నము. కాని సకృత్తుగా ఆయనలో సంయమము లోపించినట్టు గోచరిస్తుంది.

ఫెయిజ్ కవీంద్రుని గజలు విశిష్టమై సహృదయులను కదలించి వేస్తుంది. రూపకాలంకారాలు విశాలజ్ఞాన భాండారంనుంచి అరువు తెచ్చుకొంటాడు. అతని భావనాశక్తి అయత్నోపలబ్ధము; దాని ఫలితము సహజమైనది. బహుకాలము అతడు కారాగారవాసి. అటువంటి జీవితం

వల్ల కవితలో సాంకేతికతకు ఒక విచిత్ర రామణీయకము సిద్ధించింది. కవితను తీయని కలవలె చేసినాడు ఫెయిజ్‌కవి. ఫెరాఖ్‌వలెనే ఫెయిజ్, కవిలో పమత్వములేదు; ఆధ్యాత్మిక ద్రఢిమ లోపించడంచేత, ఆ కవి చిత్తవృత్తిలో ఏదో భీతి గోచరిస్తుంది.

జాజ్‌బీ కవి గజలులో స్వాభావికమైన భావోద్రిక్త జీవితాన్ని స్వేచ్ఛగా వ్యక్తముచేయవలెనని ఉద్దేశించినాడు. ఆయన భావాభివ్యక్తీకరణకోసం, ఇంద్రియోపలబ్ధితో కావ్యసాధన చేస్తూనే ఉన్నాడు. ఆ కవీంద్రుని వాణి కరుణాలింగితము కావడంచేత, కమనీయంగా ఉంటుంది. అవాణి సహృదయ హృదయాన్ని కదల్చివేస్తుంది. విశ్వసౌందర్యానందంలో ఓలలాడితే అది ఆశ్రయమవుతుంది. కాని ఆయన ఆలోచనలో పుష్టిలేదు, శైలి యత్న పూర్వకము. మజ్రూనదీం ఖాసిమీ, అఖ్తరుల్ ఇమాన్ కవులు గజలు రచనలో వర్ధిష్ణువులు. ఇంకా వీరికి స్థాయి చిక్కలేదు.

1938 – 46 సంవత్సర మధ్యకాలంలో ఉరుదూగజలు కవిత్వం మీద, తీవ్ర విమర్శరేగింది. గజలు ఆ విమర్శన ధాటికి నిలవగలిగింది. అది సాహిత్యంలో విప్లవకాలము, నూతన సాహిత్య ప్రక్రియలకై ప్రయోగాలు చేస్తున్న సమయమున్నూ, వర్ణన కవిత్వం, సానెట్, గేయాలు, బ్లాంక్‌ఛందస్సు, స్వేచ్ఛాఛందస్సులను కవులు ప్రయోగిస్తూవచ్చారు. అవి క్రమంగా ఎక్కువ జనప్రీతి పాత్రములయినాయి. కాని కొంతకాలం గజలు తీవ్ర సమీక్షకు గురిఅయి వెనుకబట్టినా, అది పునర్వికాసం చెందింది. ఫెయిజ్‌కవి 'దస్తేసబా' అనే రచన, గజలు చరిత్రలో, ఒకానొక విశిష్ట సంఘటనం. దేశవిభజనా తత్ఫలితంగా దారుణ సమస్యలు చెలరేగి నప్పుడు, ముఖ్యంగా ఆత్మాశ్రయ భావానుకూలమైన గజలు, పునః జనప్రీతి దాయకమైనది. నిర్వాసుల భంగపాటు, తీవ్రవేదన, పోగొట్టుకొన్న పురుషార్థాల యెడల మాదకమైన మమత, సాహిర్, జగన్నాథ్ ఆజాద్, ఆర్షామల్సియానీ, మజ్రూం, హరిచంద్ అక్తార్, హాఫీజ్ హోషియార్‌పురీ, సలీక్, తబాషుమ్, జహీర్, ఖ్వాత్తుల్, నసీర్ కజీం ప్రభృతుల గజల్ కవితలో స్ఫుటంగా గోచరిస్తాయి. అప్పుడప్పుడు ఈ కవిత్వం భావాతిరేకతవల్ల గడబిడగా ఉంటుంది;

అయితే ఆకార ప్రకారం అస్పష్టంకాదు. అందులో యాదార్థ్యం ఉంది. ఆ కవిత్వంలో భావవిన్యాస యోచనల ఏకత్వం ఉన్నది. ఉరుదూ గజలుయొక్క ఒకానొక ప్రత్యేకదశకు, ఆ కవిత్వం ప్రాతినిధ్యం వహించింది.

నవీనమైన గజలు, పూర్వపు గజలుకన్న, రీతిలో వస్తు ప్రధానత లోనూ మాత్రమే భిన్నము. కవులు ప్రియురాలి సయ్యాటలాడే ముంగురులు, కపోలపార్శ్వము, అందలినూగు ఆమె మొగాన పుట్టు మచ్చను గురించిన్నీ గజలు వ్రాయడంలేదు. వారు 'ఆత్మీయవాణి'ని వ్యక్తము చేస్తారు. అతిగా అలంకారాలూ, ఆడంబరమూ తీసివేసి, వారు నిరలంకృతిని చూపినారు; కవిత్వంలో మర్మయోగాను భవము తగ్గిస్తున్నారు. ప్రస్తుతం అధికంగా కావ్యవస్తువులు మానవుడూ ప్రపంచమున్నూ. నవ్యతకోసం వ్యామోహం వల్లనూ, విజ్ఞానబుద్ధికి తగిన శిక్షణ లేకపోవడం వల్లనో, కావ్యలక్షణ విషయంలో సంస్కారం లేకపోవడం చేతనూ, దురదృష్టవశాన నవీనగజలు అందాన్నీ. కమ్మదనాన్నీ, కోలుపోయింది; అయినాసమర్థులయిన కవులచేతుల్లో ఆ గజలు ఉత్తమ కవితావాహకంగా ఉన్న దిప్పటికీ.

తక్కిన కావ్యాల విషయానికి వద్దాము. 1914 లో ప్రపంచ సంగ్రామంతో దేశము అల్లకల్లోలంగా ఉన్నరోజుల్లో ఎక్బాల్‌కవీశ్వరుని 'ఖిజర్ ఏ రాహ్' అన్న కావ్యరచన. ఆధునిక ఉరుదూ కావ్యసాహిత్యంలో సీమాంతశిలగా చెప్పవలెను. తరువాత రాబోయే కవులకు అది మార్గదీపిక. ఏక్బాలుకవి ఒక ఋషి, మానవవాదిన్నీ. మానవవాదిగా ఆయన సామాజిక, రాజకీయ, ఆర్థికమైన ప్రాగ్దేశీయ సమస్యలను గాఢంగా పరిశీలించాడు. ఖురాన పవిత్ర మతసిద్ధాంతరీత్యా అతని ప్రతిభాస్వర్ణ స్పర్శవల్ల, కవిత్వానికి రంగారుబంగారు మెరుగులు దిద్దినాడు; వ్యంగ్య వైఖరివల్ల, కావ్యవ్యక్తీకరణపుటవధులను విస్తృతము చేసినాడు. 'ఒంగేదరా', 'బలేజిబ్రీల్', 'జర్‌బేకలీమ్' అనే కావ్యాలవల్ల ఉరుదూ, సాహిత్యంలో, నవయుగముతెచ్చి, సంపన్నము చేసినాడు. అందువల్ల ఉరుదూ సాహిత్యము ఏ సాహిత్యంతోనైనా సరితూగ కలదు.

జోష్ మలిహాబాదీ విప్లవగానము చేసినకవి. రెండు ప్రపంచ యుద్ధాలు 1921 లో సహాయనిరాకరణోద్యమం, 1929—30 లో ఆర్థిక సంక్షోభం. 1931 లో రాజకీయ విధేయతారాహిత్యోద్యమం, కూలీకి పెట్టుబడికీ మధ్య ఘర్షణ, సోషలిస్టు భావప్రకోపమూ. – వీటన్నిటివల్లా ఉరుదూసాహిత్యము ప్రభావితమైంది. తత్ఫలితంగా రచనలో విప్లవ భావం ప్రవేశించింది. జోష్ ఈ విప్లవానికి ప్రతీక. కాని ఆయనలో హడావిడి ఎక్కువ, లోతు తక్కువ, సమత్వం అంతకన్న లేదు. ఆయనలో కాఠిన్యోల్బణంవల్ల, ఒక్కొక్కప్పుడు అభిరుచి మంచిదికాదనిపిస్తుంది. ఆయన బాహిరమైన దాన్నే స్పృశిస్తాడు. పదసంఘటనా డంబరంలో, ప్రకర్షలో, కవి తన ఆగంభీరదృష్టిని మరుగుపరుస్తాడు. ఎక్బాల్ కవి తరువాత యువకవులమీద గాఢ ప్రభావము ప్రసరింపచేసినవాడు, జోష్. ఆయన కవులకు 'విప్లవకవి, ఋషి'న్నీ, పరిచితమైన ప్రాంతీయ దృశ్యచిత్రణములో ఆయన విశిష్టంగా ఉపమాన రూపకాలంకారాలు ప్రయోగించి; సుందరానుభవము సహృదయుడికి కలిగిస్తాడు.

జఫర్ ఆలీఖాన్ విస్తారంగా ధారాశుద్ధిగా, కావ్యరచన చేయగల ప్రవీణుడు. కాని ఆయన క్షణికమయినవి కావ్యవస్తువులుగా స్వీకరించి, కావ్యనిర్మాణశక్తిని వృథాచేసికొన్నాడు. సీమాబ్‌కూడా పద్యరచనా ప్రవీణుడు. ఆయన కొంత హడావిడిగా రచించినా, ఆత్మవిశ్వాసి. ఆయన స్వీకరించిన ఇతి వృత్తాల గొప్పదనంతో ఆయన కవితాశక్తి సరితూగ లేదు.

హాలీ కవి నుంచి ఏక్బాల్, జఫర్ ఆలీఖాన్, ఏహసాన్, మహిర్ కవుల వరకూ ఇదివరలో ఎరగని ఔన్నత్యాన్ని అందుకొన్నది ఉరుదూ "నజమ్'. హాఫీజ్ జలంధరీకవి 'షానామా ఏ ఇస్లామ్' అనే సుదీర్ఘ చారిత్రక కావ్యం ఫిర్‌దౌసీని అనుకరిస్తూ రచించినాడు. దఖనులో నుస్‌రతీ (మృ. 1673) 'ఆలీనామా' కావ్యాన్నీ, రుస్తమీ 'ఖవర్ నామా' అనే కావ్యాన్ని రచించారు. అవి కథాకథనాత్మకమైన ఉరుదూ కావ్యాలలో అవి మొదటివి. కాని హాఫీజ్ జలంధరీ రచించిన 'షానామా ఏ ఇస్లామ్' కావ్య వైశాల్యమును ఔన్నత్యమును అవలోకించినప్పుడు, భావనాశక్తివల్ల చకితులము అవుతాము. అయినా అందులో ఆయన

మొదటి రెండు ఖండాల్లో కృతకృత్యుడైనట్టు, తృతీయఖండంలో కాలేదు. తృతీయఖండంలో ఆయన కావ్యరచనాశక్తులు ఉడిగిపోయినవా అని పిస్తుంది ఆయన గీతాలవల్లకూడా స్మరణీయుడు. ఆ గీతాలలో పంగితమూ మాధుర్యము విశేషంగా ఉన్నవి.

నేటికాలపు సాహిత్యప్రవృత్తిలో ఒక విచిత్రసంఘటన ఏమంటే, హిందీ రచనాపద్ధతిలో ఉరుదూలో గేయాలు రావడము. ఈ రకమైన కవిత్వానికి పూర్వచరిత్ర చాలా ఉన్నది. అందులో, అన్నిటికంటె ముఖ్యంగా, భారతీయ సంస్కృతిలోగల ఏకత్వమూ, భిన్నశాఖలకు సామరస్య సంపాదనమూ, ప్రతిబింబితమై నిరూపితము లౌతవి. అజంతుల్లాఖాన్, హాఫీజ్‌జల్లంధరీ, అఖ్తార్‌షేరానీ, తసీర్, ఖలీద్, మఖ్బూల్ అహమ్మద్‌పురీ, హాఫీజ్ హోషియార్‌పురీ, సఖర్ నిజామీ, ఆబిద్, ఇంద్రజిత్ శర్మ ప్రభృతులైన కవులు, అతిసొగసుగా గేయరచన చేసినారు. ఆ గేయాల్లో సన్నిహిత గృహజీవిత సౌరభం వ్యాపిస్తుంది. షాఉఖ్ ఖిద్వాయ్, అర్జూ, రజాకవులు గజలుఛందంలో అదీ తీరుగా భావగేయాత్మకత వ్యక్తము చేసినారు. అయితే అజంతుల్లాఖాన్, గేయకవిత్వంలో, ఉద్దీపనం అధికం. ఆయన గీతావళిలో నివాతనిష్కంపత. మనసును వెంటాడే స్పందనాత్మక వాతావరణం గోచరిస్తాయి. అఖ్తార్ షిరానీ కాల్పనిక భావవాదిగా (రొమాంటిసిస్టు) చాలా ప్రముఖుడు. ఆయన కవితాలక్షణం ఆలేఖ్యచిత్రణం. ఆయన దృశ్యానికి కావలసిన అనేక విశేషాలనూ, సన్నివేశాలనూ కల్పించి, ఉరుదూలో కనీవినీ ఎరగని ఇంద్రియ శక్తితో, కవితా చిత్రణ చేస్తాడు. దేదీప్యమాన భావ చిత్రణవల్ల, వస్తుగత నవ్య కల్పనల వల్లనూ, నిషిద్ధ ప్రణయకలాప పోషణలో ధీరతవల్లనూ, ఆయన కవిగా ఉన్నతస్థాయికి అర్హుడు.

1935 లో ‘అభ్యుదయోద్యమము’ మూర్ధాభిమానంతో పట్టుదలతో ప్రచారోత్సాహంతో, నవ్యసమర ధాటితో, ఆరంభమైంది. పురాకల్పితాలకు హస్తోదకమిచ్చి, నవ్యమైనవాటిని స్వాయత్తము చేసికోవలెనను కొన్నప్పటికీ, దేశంలో సంస్కారపటుత్వమున్న భూమిలో, నవ్యమైనవి గట్టిగా వేళ్ళు తన్నుకోలేదు. ‘అభ్యుదయవాదులు’ ప్రాచీనమైన ప్రతి విషయాన్నీ, విధ్వంసక తీవ్రతతో విమర్శించినారు. వారి ప్రయోగాలు

షాహిత్యంలో అతిగావెళ్ళగా ప్రతిదిన్నీ ఉన్నదివున్నట్లు వెళ్ళకక్కవలె ననే 'అతి' వల్ల, వారు అసభ్యతాసీమకు చేరినారు. మిరాజీ, రషీద్ అభ్యుదయ శబ్దవాచ్యులైన వారిద్దరు అందుకు దృష్టాంతాలు. వారు సిద్ధాంతాలను ఉమ్మరంగా ఉద్ఘోషించినారు. వారి పద్యాలు వెర్రి ఆవేశంతో ఉఱ్ఱూతలూగేవి. అయితే వాటిలో ఉత్తమ కవిత్వానికి కావల సిన ఏకాగ్రత, తపస్సు, తీవ్రతా లేవు. ఐనా ఆ ఉద్యమము ఒకానొక రాజకీయ సిద్ధాంతాన్ని అతిగా ప్రతిపాదించినప్పటికీ, ఆ ఉద్యమము ప్రథమోత్సాహం శమించిపోయిన పిమ్మట దానివల్ల ఉరుదూ సాహి త్యానికి పటువైన ప్రోద్బలం, నవోజస్సు, స్వేచ్ఛాప్రదాయక చైతన్యం కలిగినవి. జోష్, ఫెయిజ్, ఫిరాఖ్, జాజ్‌బీ, మజాజ్, మఖ్‌దూం, జన్ నిసార్ అఖ్తార్. సర్దార్‌జఫ్రీ ప్రభృతులు ఓజస్సూ, గాఢ యాదార్థ్యంగల అభ్యుదయ కవి ప్రముఖులు. సామాజిక వ్యవస్థను పునః నిర్మించాలనే సవాలు స్వీకరించారు ఆ కవులు. వారు తమకు తోచిన రీతిగా భారతీయ వ్యాధులు నిర్మూలించుటకు సర్వరోగనివారిణి కనుక్కోవలెనని యత్నిం చారు. వారి పద్యాలు, ఏ కావ్యసముచ్చయంలోనో చదివితే మాత్రం, అందంగా ఉంటాయి. కాచపాత్రలో పుష్పగుచ్ఛంలాగ. దారిద్ర్యం, బానిసతనం, తోపిడీవిధానాన్నీ గర్హిస్తూ, మహోద్రేకంతో చెప్పిన కవిత్వంగా దానికి ఆకర్షణ మున్నది. 1931 నుంచీ ప్రజానీకంలో, తీవ్రంగా ఒకవెల్లువ పొంగులెత్తింది. కార్మికవర్గము సామ్యవాద సమాజస్థాపనకై పోరాటము సాగించినది. 'అభ్యుదయ' కవులు ఈ జాగృతిని చిత్రించినారు. ఆ కవితలో పుష్టికానీ, స్థాయికానీ లేదు. అయితే వారిలో చైతన్యము జాగరితమై, ఎఱుక సూక్ష్మమై, ఆందోళ నతో ఉన్నది. వారు వాతాయనాలు తెరిచినారు. వారు గవాక్షము వెలుపలకు వంగిచూడమని మనలను ప్రబోధించినారు.

అధునిక ఉరుదూ కవిత్వమును గురించి మొత్తంమీద నిర్ణయిస్తే, దాని పురోభివృద్ధికి అవకాశాలున్నాయని చెప్పాలి. మన దేశభక్తి, మత రహిత సర్వసమదృష్టి, సామాజిక ఆర్థిక అసమానతయెడల మన స్వాతంత్ర్యసమరం, తీవ్రవేదనా సంక్షుబ్ధదేశము, పునరావాససమస్య- ఇవన్నీ యథాతథంగా కవితలో ప్రతిబింబించాయి. దేశవిభజనానంతస

రంలో ఉప్పతిల్లిన పంక్షోభం శమించింది. గాయాలు మానుతున్నాయి. వైషమ్యము పమసిపోయింది. సర్వసంక్షేమదాయక రాజ్యానికి సామ్య వాద పమాజ వ్యవస్థకు పునాదులు వేసినాము. మనము ప్రాచీనార్వాచీన, స్వపన సంస్కృతులను బాగా అవగాహన చేసుకోడంకోసం, నవ్యరసిక దృష్టిని స్థాపించాలనికూడా యత్నిస్తున్నాము. ఆధునిక ఉరుదూ కవికి, కావ్యప్రయోజన పరత్వమూ, ముందడుగు వేయడానికి ధైర్యస్థైర్యాలున్నూ ఉన్నాయి. అతడు వైశాల్యమూ విస్తృతీ, ప్రేరణ మున్నూ కలవాడై, నవభారతాలోకన పరాయణుడైనాడు. అయితే నిజమైన కవితా సృష్టికి ఆవశ్యకమయిన హృదయ మేధస్సుల సమ్మేళన, పమస్థాయినీ, అతడు ప్రాప్తించినప్పుడే కాని కవిత సార్థకముకానేరదు. సమకాలికమైన అభిరుచికై, అతడు సాధారణమై, అతివిశదమై, పేలవమైపోయే ప్రమాదానికి లోను కాకూడదు.

## కథానిక

ఆధునిక కధానికా రచన ప్రేమచందుతో (1880-1936) ఆరంభమైనదని చెప్పవచ్చును. సూక్ష్మవిషయగ్రాహిత, యోచనాశీలమున్నూ కలిగిన ఆయన గ్రామిక ప్రజానీక జీవితంలో, విశిష్టమూ అతి సన్నిహితమూ అయిన ఉద్యమాలు, ఘట్టాలూ సరళమూ స్ఫుటమున్నూ అయిన భాషలో చిత్రించినాడు. అటుగాక నియాజ్, యల్దురాం, యల్ అహమ్మద్, వాస్తవికాన్ని తప్పించే ప్రజ్ఞ అధికంగా చూపినారు. వారల ప్రయత్న పూర్వకమయిన స్వాప్నిక కల్పన, సుపరిచితమయిన యాదార్థ్యాన్ని కాల్పనిక భావధోరణిలో దాటివేయడం, ఆ యుగంలో ప్రతిరచయితలోనూ కనబడే లక్షణాలు. నియాజ్ యల్దురాములు తెచ్చిన వైదేశికమైనట్టిన్నీ, కాల్పనిక భావోద్వేగతారూపమైన ఆర్ద్రపంకము నుండి కథానికను ప్రేమచందే సంరక్షించి దానికి స్థాయికూర్చినాడు. అందులో అతనికి చకోవు మొపాసాలవంటి వైదేశిక ప్రవీణుల రచనలు ఉపకరించాయి. అభ్యుదయోద్యమముకూడా కథానికా రచనకు ప్రోద్బలం ఇచ్చింది. 1936 తరువాత సమకాలీన సాహిత్య ప్రక్రియలలో, అత్యంత ప్రధానమైనది కథానిక. ప్రేమచంద్ ఉరుదూ కథానికకు

ప్రయోజనాత్మకమైన మార్గము కల్పించి, సంక్షుబ్ధమైన నేటి ఆధ్యాత్మిక చరిత్రను కథలలో చిత్రించినాడు.

ప్రేమచంద్ (1880-1936) సంస్కరణాభిమానములోకి మధ్య దిగజారుతున్నా, స్వదేశప్రజల హృదయ భావాలనూ, జీవితాలనూ, విశిష్టఘటనలనూ వాస్తవికంగా చిత్రించినాడు. జీవితాన్నీ శిల్పాన్నీ మంచి 'కఫన్' ('శవముపై కప్పు వస్త్రము') అనే ఉత్తమ కథానిక రచించినాడు. అది ఉరుదూ కథాసాహిత్య చరిత్రలో మూలరాయి వంటిది. 'అంగారే' అనే కథానికా సముచ్చయం, వివిధ రచయితలవి. 1935 లో ప్రకటితమైంది. ఆ పుస్తకాన్ని ప్రభుత్వము నిషేధించినా, ఆ కథాసంపుటివల్ల సమకాలిక కథానికా రచయితలు గాఢంగా ప్రభావితులయినారు. అయితే 1936 లో అభ్యుదయ రచయితల సమితి స్థాపన ముఖ్యసంఘటనం. దానివల్ల ఉరుదూ కథావికాసానికి మరొక దశ ఏర్పడింది.

1936 నుంచి 1946 దాకా ఉరుదూ కథానికల్లో, అభ్యుదయవర్గ సిద్ధాంత ప్రణాళిక ధ్వనించింది, ప్రతిధ్వనించింది. హుసేనీ, కిషన్ చందర్, బేడ, అక్తార్అన్సారీ, అహమ్మద్అలీ, ఇస్మాత్చౌగతాయ్, హయతుల్లా, బల్వంతసింగ్, అహమ్మద్ నదంఖాసిమీ, హసన్అస్కారీ, గులాంఅబ్బాస్, ముంతాజ్‌షీరీన్, ముంతాజ్‌ముఫ్టీ, ఇబ్రాహిం జలిస్, మంతుప్రభృతులయిన కథకులు తమతమ తీరుల్లో కథానికా వికాసానికి తోడుపడినారు. వారు భావనాశక్తివల్ల గతానుగతిక సంప్రదాయక నిరోధాలను అన్నింటినీ ఛేదించి, శైలీపాటవంతో, కొత్తదారులు తొక్కగలిగినారు; సామాజిక సమస్యలతోపాటు, ఆంతరిక మానసికవాసనాగమనాలను కథలలో రూపించదలచినారు. అహమ్మద్ ఆలీ రచించిన 'హమారీ గలీ' (మాసందు), 'మేరాకమ్‌రా' (నాగది); కిషన్‌చందర్ రాసిన 'దోవర్లాంగ్ లంబీ సడక్' (రెండు ఫర్లాంగుల పొడవైనదారి); మను రచించిన 'నయాకానూన్' (కొత్తచట్టం); హయతుల్లా 'ఆఖిరీ కోశిశ్' (తుదియత్నము); బేడీరచించిన 'గరమ్‌కోట్' (వెచ్చనికోటు) ఉత్తమకథానికలకు దృష్టాంతములు. ఇక్కడ మనము జీవితానికీ శిల్పానికీ కళామయ సామరస్యము చూడగలము. కొన్నికథలు దుర

దృష్టవశాన నూతన యౌవన కాముక హృదయానికి ఆకర్షణీయమైన రచనలు, కాముక ప్రవృత్తిని అతిధైర్యంగా, కథకులు ఘోషించినారు. వాటిలో.

మంతు; బేడి, కిషన్‌చందర్, ఇస్మాత్, హయతుల్లా, అక్తార్ బరేనవీ, అహమ్మద్‌ఆలీ ప్రభృతులు కథకులలో ముఖ్యులు. వారు కథలలో విస్తారంగా కల్పనావైవిధ్యం, విన్యాసములో శ్లిష్టతనూ చూపినారు. భావనాశక్తి, పరిశీలనాపాటవమూ చక్కగా సమరసము చేసినారు. అందుచేత భవిష్యత్తులో కథావికాసానికి శుభసూచన లున్నని. అహమ్మద్ నదీం ఖాసిమీ, బల్వంత్‌సింగ్, గులాంఅబ్బాస్, హెజబ్ ఇంతియాజ్, ముంతాజ్ ముఫ్తి, అఘబాబర్, ఇబ్రాహింజిలీన్, హజిరామస్తూర్, సలేహా అబిద్ హుసేన్ ఖదీజామస్తూర్, ముంతాజ్‌షెరీన్, తస్నీమ్, మహేందర్‌నాథ్, సుహాయర్, ఖుర్రతిక్‌అయిన్, షఫీకుర్‌రహ్మాన్, ప్రభృతులు ఉత్తమ కథకులుగా పైకివచ్చినారు. నిష్కాపట్యంతో, నాటకీయతతో మానవ ప్రకృతిని పరిశీలించి, ఉల్లేఖించినారు. కాని కొన్నికథలు రచనాశిల్పము కొరవడిన వారిచేతుల్లో, ఎంతసేపూ సంక్షుబ్ధకాముక చిత్తవృత్తినీ, ఉద్విగ్నతనూ, భావాతిరేకతనూ మోటుగాచూపడంతో నిండిపోతున్నవి. అభ్యుదయ రచయితల రచనలు గుణాలతో దోషాలతో కలగాపులగమైనవి కావడంచేత, సమీక్షా దక్షుడైన వాడు పొల్లు దులిపి. గింజలను ఏర వలసి వస్తుంది.

1947 లో దేశవిభజనం ఒక విషాదగాథ. ఆ విభజనవల్ల భారత దేశానికో, పాకిస్తానుకో లక్షలకొద్దీ ప్రజలు ఇల్లు వాకిళ్ళు విడిచివెళ్ళి పడరానిబాధలు పడ్డారు. కొందరు ఉరుదూకథకులు ఈ విషాదగాథను, నిర్లిప్తులై నిగూఢదృష్టితో చిత్రించినారు. క్రిషన్‌చందర్ 'హమ్‌వహ్షిహైఁ' (మనము కిరాతులము) అన్న కథలో భావగేయాత్మకమైన మానవతావాదము (లిరికల్ హ్యూమానిజమ్) విశదముకాగా, సహనమూ వివేకమూ ఆవశ్యకమని ప్రబోధించినాడు. శిల్పదృష్టితో చూచినప్పుడుకూడా, ఆ కథలు మంచివి. ఇస్మాత్ అనే కథానికారచయిత్రి కల్లోలాలనూ, సమస్యలనూ, కథావస్తువులుగా స్వీకరించింది. ఆమె కథలలో 'సోనేకా అండా' (బంగారపుగుడ్డు) 'చౌథికాజోరా' (ఛౌథీదుస్తులు) గుణవిశిష్టాలు, అయితే

ఆమె కథలు కొన్ని కిషన్ చందర్ రచనలవలె అతివిశదంగానూ, గడబిడ గానూ ఉంటాయి. అహమ్మద్ నదీమ్ శిల్పమెరిగిన కథారచయిత. మన ప్రాంతీకల వాస్తవికవాదిన్నీ. ఆయన అంతరమైన మానసవాసనాగతులను చిత్రించినాడు; మానవ పురుషార్థాల ప్రాధాన్యం ప్రతిపాదించినాడు. రాజకీయ దృక్పథంకన్న ఆయన దృష్టి కళామయము. నదీమ్ భావనా శక్తి చేతనూ, భావపుష్టివల్లనూ జీవితమును వ్యాఖ్యానిస్తూ, చాలా కథలు రచించినాడు. 'నయాఫర్‌హాద్' 'అతీష్‌ఏగుల్' (అగ్గిపువ్వు) 'అల్లాహుందోలిల్లాహ' (ఈశ్వరుడు కీర్తింపబడుగాక!) అనే కథలలో ఆయన చిత్తశుద్ధి చూపినాడు. ఆయనది ఉద్దీపన కలిగించే విశిష్టమైన శైలి. ఖ్వాజా అహమ్మద్ అబ్బాస్ ఉత్సాహదాయకంగా రాస్తాడు. అయితే కిషన్‌చందర్‌వలె మధ్యమధ్య దిగజారిపోతాడు. రాజకీయ సందేశము ప్రధానమైన అతని కథానికల్లో సృజనాత్మకశక్తి స్పష్టంగా క్షీణప్రాయమై కనిపిస్తుంది.

వర్తమాన కథానికా రచయితలను కొందరిని పేర్కొనవచ్చును. వారు దేవేంద్ర ఇస్సార్, అన్వార్ అజీమ్, అష్‌ఫాక్ అహమ్మద్, జమరుద్దీన్, ఇబ్నుల్‌హసన్, ఖలీల్ అహమ్మద్, షౌకత్‌సిద్దికీ, అన్వార్, ఇంతిజార్ హుసేన్ ప్రభృతులు. ఈ కథకులు సంవిధానాత్మక చాతుర్యంవల్ల జీవితానుభూతిని సహృదయానుభవానికి తీసికొనివస్తారు. వారు కథను తీర్చి దిద్దడంలో, వాస్తవిక చిత్రణలో ధీరులు. ఇతివృత్తాల్లో నీతినియమాలు, ధర్మశీలతను పోషించి, పఠనయోగ్యమైన రచనకు తార్కాణంగా కథలు రచించారువారు. స్వభావసిద్ధమైన వివరాలు ఆధారంచేసుకొని కథాసంకేతాన్నీ వృత్తాన్నీ మలచివేసినారువారు. స్పర్శవేద్యము కాని అమూర్తమైన అంతఃకరణావస్థలను, సహృదయానుభవానికి అందేటట్లు చేశారు శిల్పనైపుణ్యంగల కొద్దిమాటలతో. వారు ఇట్టినేర్పుతో కథల్లో సన్నివేశానికి, పరిసరాల బంధానికీ లొంగని మానసికావస్థలను చిత్రించినారు. రచయితలు జుగుప్సాకరమైన కథావస్తువుకు ప్రాధాన్యం ఇవ్వడం తగ్గుతున్నది ఈ కథకులు స్వల్పంగా జీవితోల్లాసాలను వెతికి, పాత్రనూ సన్నివేశాన్నీ సున్నితంగా పోషిస్తున్నారు. సృజనాత్మక రచనా శిల్పులుగా ఈ కథకులు విశేష ప్రజ్ఞావంతులుకారు. అయినా

మనకు సమకాలీన యుగపుటాధ్యాత్మిక చరిత్రను అందించినాడు. వారు విశ్వాసము స్తంభించిన సమాధ్యవస్థనుండి జాగృతులవుతున్న వారివలె గోచరిస్తారు.

## నవల

ఉరుదూ కథాసాహిత్యము ముఖ్యంగా 'దాస్తాన్' (అవాంతర గాథలతోకూడిన కథాపరంపరలు) లతో సంపన్నమైంది; అవి ఎక్కువ భాగము లక్నోలోని ప్రసిద్ధమైన నవల్‌కిషోర్ ముద్రాశాలవారు పారశీక భాషనుండి అనువాదాలు చేయించి అచ్చువేశారు. ఈ కథలు అధిభౌతిక మైనవి వీటిల్లో సాహసశౌర్యయాత్రలు, ప్రణయమూ కథావస్తువులు. ఈ రచనలు సుదీర్ఘంగా ఉంటవి. ఈ కథలలో నాయకులు అజేయ శౌర్యధైర్య సద్గుణాలు కలవారై సాహసాలుచేస్తూ, వంచన, దుర్మార్గమున్నూ ఘోరంగాచేసే మాంత్రికులనూ పిశాచాలనూ చీల్చిచెండాడుతూ వెళ్ళుతారు. నజీర్ అహమ్మద్ (మృ. 1912) తరువాత ఉరుదూ నవలకు యదార్థమైన ఆరంభము పండిత రతన్‌నాద్‌సర్షార్ (మృ 1902) కావించినాడు. ఆయన 1878 లో ప్రధమానువృత్తంగా 'ఫిసానే ఆజాద్' (ఆజాద్ సాహసాలు) అన్నరచన 'అవధ్ అఖ్‌బార్' లో ప్రకటించినాడు. అదిఅమరగ్రంథము. లక్నోజీవితాన్ని ఆదర్శప్రాయంగా చేయక యధాతధంగా అన్నికోణాల్లోనూ చిత్రించినాడు. అబ్దుల్ హలీం షరాక్ (మృ. 1926) 'దిల్‌గుందాజ్' అనే పత్రికలో చరిత్రాత్మక నవల ప్రచురించి సేవచేసినాడు. షరాక్ ఉన్నతశ్రేణికి చెందిన నవలాకారుడు, చరిత్రకారుడూ, విమర్శకుడూ, వ్యాసకర్త, పత్రికా రచయితయున్నూ, ఆయన విస్తారంగా రచనచేసినా, అత్యంతాకర్షణీయంగా వ్రాస్తాడు. మిర్జాహదీరుస్వా, ఖ్యాతి 'ఉమ్‌రావు జన్‌అదా' అనే స్వీయజీవిత కథా రూపంలో రచించిన నవలవల్లవచ్చింది. ఆ నవలలో కథావస్తువు లక్నోలో సంస్కారమున్న నర్తకి జీవితము. నజీర్ అహమ్మద్ చిత్రించిన జహీర్‌దార్‌బేగ్, సర్‌షార్ కృతమైన ఖోజీ, రుస్వా సృష్టించిన బిస్మిల్లా, రషీదుల్‌ఖైరీ వర్ణించిన 'నసీఅషమ' ఉరుదూ నవలలో అత్యుల్లాస కరమైన పాత్రలు, జీవచైతన్య స్పందనం కలవిన్నీ.

ప్రేమచంద్ నవలాకారులలో అత్యున్నతుడు. ఆయన వాస్తవికంగా పతిత దళిత జీవుల వేదనామయ జీవిత చిత్రణ విశదంగా చేసినాడు. నిజానికి 'మూకచోదిత పశువు'లకు వాక్కును ఆయన ప్రసాదించి వారికిగల సరళమానవత లోని ఉదాత్తత నిరూపించినాడు. ఆయన భారతీయ ప్రజానీకము ఆర్థికంగా చేస్తున్న పోరాటమునూ వారి ఆధ్యాత్మిక జాగృతినీ, స్ఫుటంగా చిత్రించినాడు. కథా రచయితలకూ నవలా కారులకున్నూ, ఆయన మార్గదీపిక. ప్రేమచంద్ రచించిన నవల 'మైదాన్ ఏ అమల్', షరాద్, రుస్వా, రషీదుక్ ఖయిరీ నవలల కన్న భిన్నము. 'మైదాన్' నవల ఆధునిక ఉరుదూ నవలలకు శ్రీకారము చుట్టింది. ఆయన రచించిన 'గోదాన్' ఉత్తమ నవల. గ్రామీణ జీవిత చిత్రణ విశదంగా నవలారూపంలో, శిల్పవైవిధ్య సంపన్నతతో ఉరుదూలో పూర్వం కనీవినీ ఎరగని తీరులో 'గోదాన్'లో విరచితమైంది.

అభ్యుదయోద్యమము నవలలమీదకన్న, కథానికలపైనే లక్ష్యముంచింది. 1936 నుంచి 1946 వరకూ కథానిక ప్రధాన సాహిత్య శిల్ప ప్రక్రియగా ఉంటూవచ్చింది. కృష్ణచంద్రుని 'షికస్త్' (పరాజయము) అన్న నవలమాత్రం ప్రసిద్ధం కాకపోయినా పఠనీయంగా ఉంటుంది.

ఆధునిక విఖ్యాత నవలాకారులలో వీరిని పేర్కొనవచ్చును :— ఇస్మత్ చౌగతాయ్, అజీజ్అహమ్మద్, ఖురక్తుల్ఐన్ హైదరు, షలేహా అబీద్‌హుసేన్ ప్రభృతులు. ఇస్మత్ రచించిన 'టెఢీలకీర్' (వక్రరేఖ) అనే నవల భావకల్పనలో స్వతంత్రము కాకపోయినా, సంవిధానంలో, పోషణలో స్వచ్ఛంగాఉంది. ఆమె మాధ్యమికవర్గానికిచెందిన ముసల్మాను కుటుంబజీవితాన్ని, చాలా సన్నిహితంగా విపులంగా మనఎదుట చిత్రించింది. సామాజిక ప్రవృత్తిలో కాముకవాసన, భావోద్రేకమునూ ఆమె పరిశీలించింది. అజీజ్ అహమ్మద్, 'గురేజ్' (పలాయనం) అన్న నవల పౌష్ఠవరచన. ఆ నవలలో కాముకప్రవృత్తి శృంగారకలాపమూ ధైర్యంగా మొగమోటంలేకుండా చిత్రించడంవల్ల, కొంతమంది పాఠకులకు హేయభావంకలిగినా రచన బాగాసాగింది. అజీజ్ అహమ్మద్ రచిం

చిన 'అసీసీఖులందీ, అసీసీవ స్తీ' (అటువంటి ఔన్నత్యం, అటువంటి అగాథం), షబ్‌నమ్ (మంచు) అన్న నవలలు చదివేందుకు బాగుంటాయి. అంతకన్న విశేషంలేదు వాటిల్లో.

ఖుర్రతుల్ ఐఙహైదర్ రెండు ముఖ్యమైన నవలలు వ్రాసింది. అవి 'మేరీభీ సనంఖనీ', 'ఫసానేఘమీదిల్' (నా హృదయదుఃఖగాథ)అనేవి. ఆమె జేమ్సుజాయిన్ అన్న నవలారచయితయొక్క 'చైతన్యప్రవంతీ' సంవిధానము (Stream of consciousness) అనుకరించి పక్కృత్తుగా కృతకృత్యురాలైంది.

ఈనాటి నవలాకారులకు, సలీహా అబీద్‌హుసేనును మాత్రం మినహాయిస్తే, విశ్వాసములేదు. ఆమెలో ప్రబలమైన గాథశక్తి అగాధంగా లేదు. అయితే ఆమెకు ఏదో చెప్పవలెననే మహాకాంక్ష ఉన్నది. అహసనా ఫరూఖీ ఆధునిక జీవితంలోని నటనలను విధ్వంసకంగా హేళనచేసి వేస్తాడు. అతని 'అష్నాయ్', 'షామేఅవథ్' అన్న నవలలు ఆకర్షణీయంగా ఉన్నా, వాటిలో లోతులేదు. ఫియాజ్‌అలీ రచించిననవలలు 'అన్వార్', 'షామీఙ' వినోదంగా చదువుకోవచ్చును. వీరికంటె జనాభిరుచికి అనుకూలముగా రచనచేయడం తెలిసిన గ్రంథకర్తలు అరుదు. రామానందసాగర్ 'అవుర్ ఇఙసాఙమర్గయాఽ' (మరిన్నీ ఆ మనిషి మరణించాడు) అన్న నవల పాఠకుల చిత్తాన్ని మొదటిపుట మొదలు తుదిదాకా ఆకర్షిస్తుంది. ఆయన 1947 లో కులవర్గ కల్లోలాలవల్ల, విశీర్ణమైన సున్నితహృదయాన్ని ఆ నవలలో చిత్రించాడు. ఆ విషాద దుర్దినాలలో అవివేకంగా ఉన్మత్తంగా ప్రవర్తించిన ప్రజానీకాన్ని మానవవాది స్థాయితో ప్రదర్శించినాడు ఆ నవలలో. ఉరుదూనవల ఎన్నోవిధాల లోపభూయిష్ఠము. విశ్వసాహితివల్ల పరిపుష్టివికాసముకల్గి, జీవితానుభూతి మనకు 'అనుభావ్యం' అయ్యే లాగగాని, అంతఃకరణావచ్ఛిన్న చైతన్య సంశ్లిష్టతను లోతుగా చూడకలిగేలాగుగాని చేయగల సాహితీశిల్పులు చాలా తక్కువమంది ఉన్నారు. అహమ్మద్ అలీ, కృష్ణచంద్ర, ఇస్మాత్, అజీజ్ అహమ్మద్, ఖ్వాజాఅహమ్మద్ అబ్బాస్, సలీహా అబీద్ హుసేన్, ఖుర్రతుల్ అయిన్‌హైదర్, ఎ. హమీద్, ఇంతిజార్ హుసేన్, అదిల్‌రషీద్, అఖ్తార్, జమునాదాస్, షౌకత్‌తన్వీ

ప్రభృతులు పమర్థులూ, వృద్ధిలోకిరాగల నవలాకారులూ. పవలాకారులు మొత్తంమీద ఉరుదులో మానవవాద సంప్రదాయానుగుణంగా రచనలు సాగించినారు.

## రేఖాచిత్రణము - రిపోర్టు

రేఖాచిత్రణలో ఫర్‌హతుల్లా బేగ్, రషీద్ అహమ్మద్ సిద్దికీ, ఖ్వాజీఅబ్దుల్‌గఫర్, మోలానా అబ్దుల్ మజీద్ దర్యాబదీ, నియాజ్‌ఫత్తేహపురీ, డాక్టర్ అబీద్‌హుసేన్, ఖ్వాజాహసన్ నిజామీ అతి ప్రధానులు. వారు భారతీయ జీవితాన్ని ఆచారాలను విశదవర్ణాత్మికా శబలితంగా, అలంకారాలతో చిత్రించడంవల్ల, పాఠకునికి ఆహ్లాదం కలిగిస్తుంది.

## లోకవృత్త కథనము (Reportage)

ఉరుదూ సాహిత్యంలో 'వృత్తకధనం' భావవ్యక్తీకరణకు నవ్య సాధనం. కృష్ణచందర్ 'పౌథే' (మొక్కలు), 'సుబహ్‌హోతీహై' (తెల్లవారుతున్నది), అదీల్‌రషీద్ – 'ఖిజాకీ ఫూల్' (శైశిరసుమాలు), 'ఫిక్రత ఉజానసీ, ఛటాదర్యా' (ఆరోనది), తజ్వార్‌సమీర్ – 'జబ్ బంధటూతే' (బంధాలు తెగినప్పుడు). ఇబ్రాహింజలీ - దోముల్క్ ఏక్ కహానీ' (రెండుదేశాలు - ఒకకథ) అన్నవి రచించారు. వీటిలో దేశవిభజనానంతరం, విద్వేష ప్రజానీకమధ్యంలో ఉరుదూ రచయితలు పత్రికారచనలోనూ, మానవతలోనూ, స్థిరవిజయం చూపినారు.

## నాటకము

ఉరుదూలో మొట్టమొదటి నాటకాన్ని 'ఇందర్‌సభ'ను అమనత్ అనే ఆయన రచించాడు. నటులు అయోధ్యను పాలించిన ఆఖరు రాజయిన వజీర్‌అలీషాకాలంలో రంగముపై సంగీతాత్మకమైన ఆ సుఖాంత నాటకాన్ని ప్రయోగించినారు. 1856 లో అలీషా పదచ్యుతుడైనపిమ్మట, పార్శీనాటక సమాజాలు ప్రజాభిరుచికి కావలసిన వినోదము కల్పించాయి. మహమ్మద్ మియాఁరౌనఖ్‌బనార్సి, తాలీబ్ అహసాలఖనవీ, ఆ నాటకసమాజాలకు రాసిపెట్టిన ప్రఖ్యాత నాటకకారులు,

అఘహషర్ కాశ్మీరీని ఉర్దూలో 'మార్లో' వంటి నాటకకారుడని అన్నారు. ఈ యుగంలో నాటకాలు చాలభాగం కఠినమై విస్తబ్ధమైన వచనరచనతో సాగినవి.

ఉరుదూలో గొప్పనాటకము లేకపోవడం విచారకరం. ఇస్తియాఖ్ హుసేన్ఖురేషీ, సయ్యద్ ఇంతియాజ్ ఆలీతాజ్, ప్రొఫెసర్ మహమ్మద్ ముఖజిబ్, డాక్టర్ అబీద్హుసేన్, అహమ్మద్‌మజా, షాహిద్ అహమ్మద్ దేహ్లవీ, ఆబిద్ అలీ అబీద్, ఫజుల్‌హాక్ ఖురేషీ, మిర్జా అబీద్, ఉపేందర్ నాధ్ అష్క్, మహమ్మద్ హుసేన్, కె. యల్. కపూర్, షౌఖత్ తన్వీ ప్రభృతులు ఉరుదూ నాటక సాహిత్యాన్ని విస్తృతము చేసినారు. స్వాతంత్ర్యప్రాప్తితో విశ్వసంస్కృతిని అవగాహన చేసుకోడం చేతనూ, ఉరుదూ నాటకము వర్ధిల్లుతూ, తొల్లింటి లోపాన్ని సవరించు కొంటు న్నది. ఏకాంకికలు, రేడియో శ్రవ్యనాటికలుకూడా జనప్రీతిదాయకాలు అవుతున్నవి. వెండితెరకోసం నాటకాలు కుప్పతిప్పలుగా వచ్చాయి. కాని అవి సాహిత్యవర్ధకాలు కావు; అవి ప్రజాభిరుచిపై వ్యాఖ్యాన ప్రాయమైన నాటకాలు.

భారతదేశంలో ఉరుదూరంగ వికాసం బాగా రూపొందించాలనే తహతహ పుట్టింది కొందరికి. ఆధునిక నాటకరంగం దేశీయంగాలేదు. పాశ్చాత్యరంగ ప్రభావంవల్ల రమారమి ఒకశతాబ్ది కాలంలో అది వర్ధిల్లింది. ప్రజాప్రీతిపాత్రమైన నాటకరంగశాలల్లో ఇంకానిలిచియున్న ఊరూరూ తిరిగేనటులు, పల్లెపట్టున తిరునాళ్ళలో, సంతల్లో నాటకాలు ఆడేవాళ్ళున్నూ, మరుగున పడిపోయారు, ప్రాచీన సంప్రదాయ, నాటకోద్ధరణకు తీవ్రకృషి చేస్తున్నప్పటికీ, హబీబ్‌తన్వీరీ రచించిన 'ఆగ్రా బజార్' అన్ననాటకం ప్రాచీనార్వాచీనతలను చక్కగా సమ్మేళనము చేసింది. భవిష్యత్తులో ఉరుదూ నాటకాభ్యుదయ సూచకం ఆ నాటకం.

## సమీక్ష

సమీక్షాత్మక రచనకూ, గ్రంథసంపాదకత్వానికీ, డాక్టర్ అబ్దుల్ హక్, ప్రొఫెసర్ హమీద్‌హసన్‌ఖుద్రీ, నియాజ్‌ఫత్తేహపురీ, సజ్జద్ జహీర్,

డాక్టర్ అబ్దుల్లా, ప్రొఫెసర్ ఖలీముద్దీన్, ప్రొ. మాసూద్‌హుసేన్ రజ్వీ, మజునూగోరఖ్‌పురీ, ఇబాదత్ బరేలవీ, ఫిరాఖ్, అస్కారీ, ముంతాజ్ హుసేన్ ప్రభృతులు ప్రముఖులు. ప్రొ. ఆలీఅహమ్మద్ సురూర్, సయ్యద్ ఎహ్తెషాం హుసేన్, ప్రఖ్యాత విమర్శకులు. వారు సార స్వతాన్ని, సర్వసామాజిక వైఖరులలోనూ సమీక్షించి, విమర్శనకు శాస్త్రీయ విధానము అవలంబించారు. 'కళ కళకోసమే' అనే సిద్ధాం తపు టాధారంతో సూక్ష్మవిమర్శనాత్మకమైన ఇంప్రెషనిజమ్ గాఢంగా ఉంటూ వచ్చింది. కాని ఆ సిద్ధాంత ప్రవాహానికి బాగాపాటు వచ్చింది. సారస్వత చరిత్ర కారులలో మహమ్మద్ షిరానీ గులాం రసూల్‌మెహర్, హమీద్‌హసన్ ఖాదరీ, నసీరుద్దీన్‌హష్మీ, అబ్‌దుస్‌సలాంనద్వీ, డాక్టర్ రాంబాబూ సాక్సేనా, మలిక్‌రామ్, విఖర్ అజీమ్, తన్హా, ప్రొ. సర్వారీ, డాక్టర్ జోరే ప్రభృతులను పేర్కొనాలి. వారి పరిశోధనలవల్ల నూతన విషయాలెన్నో బహిర్గతాలైనాయి; చాలా పొరపాట్లు సర్దుబాటయినాయి. కొందరు ప్రసిద్ధగ్రంథాలను రోగపరీక్షాదృష్టితో, నిర్లిప్తతె సమీ క్షించారు. ఖాజీఅబ్దుల్ వదూద్, ఇమ్తియాజ్ ఆలీఖాద్ అర్షి, డాక్టర్ అబ్దుస్ సత్తర్ సిద్ధికి ఉరుదూ సాహిత్యంలో భూగర్భశాస్త్రవేత్తలు. వారు పురాతన శకలాలనూ అవశేషాలనూ మాత్రం పరిశోధించినారు. ప్రస్తుత దశాబ్దిలో సమీక్షాత్మక సాహిత్యం అమితంగా వస్తున్నది. ఆ సమీక్షలు కొన్నింటిని పేర్చికూర్చి చదివితే, తీవ్రతత్పరత కనపడక మానదు; సమకాలిక చరిత్రకూ సారస్వత విమర్శనకూకల అన్యోన్య సంశ్లేషము గోచరిస్తుంది.

## హాస్యము, హేళన

ఉరుదూ విశిష్టత, దాని సుసంపన్నమైన వ్యంగ్య, హేళనాత్మక సాహిత్యమువల్ల వచ్చింది. ఇంతియాజ్ ఆలీతాజ్, ఫత్‌రస్, రషీద్ అహ్మద్ సిద్ధిఖీ, ఖాజీ అబ్దుల్ గఫర్, డాక్టర్ అబీద్‌హుసేన్, కన్నయ్యా లాల్ కపూర్, షౌఖత్ తన్వీ ప్రభృతులు సొగసుగా, అమిత హాస్యంతో, అతి మౌలికమైన శైలిలో రచించినారు.

## గాథ విషయాత్మక, చరిత్రాత్మక సారస్వతము

చాలమంది శాస్త్ర, మత, ఐతిహాసిక, విద్యావిషయక, అన్యగాథ విషయాత్మక రచనలు చేసిన వారిలో కొందరినే పేర్కొనాలి. మౌలానా అబుల్‌కలాం ఆజాద్, డాక్టర్ అబీద్‌హుసేన్, ఖ్వాజా గులామస్ సయ్యుద్దీన్, డాక్టర్ జకిర్ హుసేన్, సయ్యద్ సులేమాన్ నద్వీ, మౌలానా అబ్దుల్ మజ్జిద్ దర్యాబాదీ, నియాజ్, అబుల్‌హసన్అలీ, షామోనుద్దీన్, జఫర్ హుసేన్, సైద్‌అహమ్మద్, హిఫజర్ రహమాన్, మౌలానా హుసేన్, అహమద్‌మదానీ, మనజీర్ అహసన్ గిలానీ, ఖలీఖ్ నిజామి, మౌలానా అషరఫ్‌అలీ, సబాకుద్దీన్ అబ్దుర్ రేహమాన్, మౌలానా మౌదూదీ ప్రభృతులు రచించిన గ్రంథాలు సుస్పష్టమై, పాండితీపూర్ణమై, పరిశోధనాత్మకమో అనుకరణములో ఐ వైవిధ్యం కలిగి ఉన్నాయి.

## లేఖా సాహిత్యము

ఉర్దూలో లేఖాసాహిత్యము విశిష్టమైంది. అది విస్తృతమైన వైవిధ్యం కలది. సారస్వత చరిత్రలో ప్రసిద్ధులైన రజబ్ అలీబేగ్ సురూర్, వజ్జిద్ అలీషా, మిర్జాగాలీబ్, హాలీ, షిబ్లీ, మెహదీఇఫాదీ, మౌలానా అబుల్‌కలాం ఆజాద్ వంటి ప్రముఖులు వ్రాసిన లేఖలు ఆ భావుకులు అనుభవించిన రసభావాలనూ చేసిన ఆలోచనలనూ నాటకములోవలె ప్రత్యక్షు మొనర్చును. వాటి భాష ముఖాముఖి సంభాషణ శైలితఉండి ఆత్మీయత కలిగి హృదయంగమంగా ఉంటుంది. నియాజ్ వ్రాసిన లేఖలు నవ్వుబుడగలవంటివి. అవి అద్భుతమైనవీ స్పర్శసాధ్యములు కానివీ. మౌల్వీ అబ్దుల్‌హక్, హమీజ్‌హసన్ ఖాదరీ రాసిన ఉత్తరాలు వ్యవహారపద్ధతికి భిన్నంగా ఉంటాయి; దైనిక భాషణంలాగ ఉంటాయి; ఆ రచయితల్లాగనే నిరాడంబరంగా సరళంగా ఉంటాయి. డాక్టర్ ఎక్బాల్, సయ్యద్ సులేమాన్ నద్వీ ఊపిరి సలపని బహుముఖ సాహిత్యవ్యాసంగంలో మధ్య వ్యవధి లభించినప్పుడు లేఖలు వ్రాసివేసేవారు. అది వారి మనసులను తెలియచేసే సూచికలు. మౌలానా అజాద్ రాసిన 'గుబారేఖతీర్' అన్న ఉత్తరాలను హడావిడిగా వ్రాసివేసినవి

కావు. † అవి పరిపక్వత పొందేవరకూ వ్యవధానమిచ్చి, ప్రతివాక్యమూ కుసుమమువలె వికసించేవరకూ ఆగికాని పంపబడలేదు. కారాగార జీవితం అనుభవిస్తున్నప్పుడు ఆజాద్ ఆ లేఖలను పట్టుపురుగు పోగులు వడికినట్లు రచించినాడు. ఆ లేఖలలో సాహిత్యశయ్యా మార్దవమూ, నిర్దుష్టమైన శిల్పమున్నూ. ఆయన ప్రదర్శించినాడు. సజ్జద్ జహీర్ కూడా కారాగృహంలో లేఖలు వ్రాసివాడు. చదవడానికి ఆ లేఖలు విస్ఫారంగా ఉంటాయి. సఫియా అఖ్తార్ లేఖల్లో తీవ్రమైన ఓజస్సూ, భావోద్వేగత గోచరిస్తాయి. ఆమెకుగల ఓజస్సూ, సంయమమూ కలసి పాఠకులకు సముద్రపవనంలాగనో ఆరోగ్యదాయకమైన ఔషధము లాగానో అనుభవము కలిగిస్తుంది. ఆమెశయ్య విశిష్టమైనది.

కల్లోలమైన భారతేతిహాసమహార్ణవంలో ప్రస్తుత సాహిత్యశకము ఆశాజనకమైన దివ్యరమణీయ ద్వీపమువలె గోచరిస్తుంది. పురోగమిస్తున్న భారతీయ వికసనోద్యమంలో అది ఒకానొక ముఖ్యఘట్టము. అది అంధతమస్సుతో నిండి తుపానురేగిన నిశాకాలమును తట్టుకొని దాట గలిగింది. నేటి ఉరుదూ సాహిత్యము ఈ వైఖరుల నన్నిటినీ ప్రతిబింబిస్తున్నది. అది జీవముతోనూ సౌందర్యముతోనూ సమగ్రమైనది. అందులో కొన్ని లోపాలు ఉన్నా, అది విశాలమై సహనశీలమైనది; మానవతాపూర్ణమై హృదయోత్తేజకమైనది; అది నవభారత నిర్మాణంలో సామాజిక కర్తవ్యానికి విముఖమైనది కాదు.

## ఆకరగ్రంథ జాతము

Encyclopaedia of Islam, Vol. IV, pt II, 1934, pp. 1023-29; డాక్టర్ అబ్దుల్ హక్-ఉర్దూ సాహిత్యవ్యాసము.
Encyclopadia Britanica, II edition, Vol. XIII, pp. 479-491; హిందూస్తాని, హిందూస్తానీ సాహిత్యవ్యాసాలూ; ఆర్. రసెలుగారి ఉరుదూ సాహిత్యవ్యాసమున్నూ అదే గ్రంథము

† ఈ పుస్తకాన్ని దేవనాగరలిపిలో పదావళితో సాహిత్య అకాడెమీ ప్రచురిస్తున్నది. —సంపా.

నవ్యతమ ముద్రణంలో 572–574 పుటల్లో.
History of Urdu Literature. *By Dr. Ram Babu Saxena; Ram Narain Lit*; Allahabad, 1927.
The Influence of English Literature on Urdu Literature. *By S. Abdul Latiff*; London, 1924.
Urdu Prose under the Influence of Sir Syed Ahmad, *By Shaikh Mahd. Asraf.* Lahore, March 1940.
The Ardent Pilgrim, A study of *Dr. Iqbal, By Iqbal Singh*; London, 1951.
Urdu Ghazal (A study of Urdu Lyrical poetry with selections). *By Dr. Yusuf Hussain;* Delhi, 1952.
Poems from Iqbal, translated *By Victor G. Kiernan*; London, 1955.
Interpretations of Ghalib, *By J. L. Kaul*; Atmaram & sons, Delhi, 1957.
Linguistic Survy of India. *By G. A. Grierson,* Vol. IX Pt. I pp. 42-270.

## వ్యాసకర్తలను గురించి

1. బిరించి కుమార బారువా (జన్మ 1910) — అసామీ బాషలో ప్రముఖ విద్వాంసుడు, నవలాకారుడు, కథకుడు—ఆయన రచనలు 'Assamese Literature'. 'A Cultural History of Assam' — 'Studies in Early Assamese Literature'.
2. కాజీ అబ్దుల్ వదూద్ (జన్మ 1894) నవలాకారుడు, వ్యాసకర్త, వంగబాషలో కథకుడు—1939 లో వంగసాహిత్య పరిషత్తుకు అధ్యక్షుడు—ఆయన రచనలు కొన్ని :—మీర్–బరిబర్ (చిన్నకథలు), నవపర్యాయ (వ్యాసావళి), ఆజాద్ (నవల)

3. కె. ఆర్. శ్రీనివాస అయ్యంగారు (జన్మ 1908) విద్వాంసుడు, విమర్శకుడు, జీవితకథా రచయిత, ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఆంగ్లభాషా ప్రాచార్యుడు — ఆయన రచనలు :— Indo-Anglican Literature, Indian Contribution to English Literature & Sri Aurobindo.
4. మనసుఖ్‌లాల్ ఝవేరీ (జన్మ 1907) కవి, విమర్శకుడు, సెంట్‌జేవియర్స్ కళాశాలలో బొంబాయిలో గుజరాతీ భాషకు ప్రాచార్యుడు — ఆయన రచనలు కొన్ని :— చంద్రదూత, ఆరాధనా (కవితా సముచ్చయాలు రెండూ), గుజరాతీ, సాహిత్య నున్ రేఖాదర్శన్ (సమీక్ష).
5. యస్. హెచ్. వాత్స్యాయన్ (జన్మ 1911) హిందీకవి, నవలా కారుడు-కథకుడు 'వాక్' (త్రైమాసిక పత్రిక) సంపాదకుడు; ఆయన రచనలలో కొన్ని :— భగ్నదూత్ (పద్యాలు), శేఖర్, ఏక్‌జీవనీ (నవల), అజ్ఞేయ్‌కీ కహానియా (కథలు).
6. వి. కె. గోకక్ (జన్మ 1909) కవి, నాటకకర్త, వ్యాస రచయిత, విమర్శకుడు, కర్ణాటక విశ్వవిద్యాలయంలో ఆంగ్లభాషా ప్రాచార్యుడు; కర్ణాటక కవిసమ్మేళనకు 1934 లోనూ, 1949 లోనూ కర్ణాటక సాహిత్య గోష్ఠికిన్నీ అధ్యక్షుడు; ఆయన రచనలు కొన్ని :— పవన (పద్యాలు) Indian Karnataka (వ్యాసాలు), సాహిత్యదల్లి ప్రగతి (సమీక్ష)
7. పి. యన్. పుష్ప (జన్మ 1917) శ్రీనగరంలో A. S. కళాశాలలో హిందీ సంస్కృత శాఖలకు అధ్యక్షుడు; హిందీలో కాశ్మీర సాహిత్యం, ఆంగ్లంలో కాశ్మీర కవితాసంకలనం ప్రకటించినాడు.
8. సి. కున్హన్ రాజా మలయాళములో సంస్కృతములో ప్రముఖ విద్వాంసుడు, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో సంస్కృతాచార్యుడు.
9. యం. వి. రాజాధ్యక్ష (జన్మ 1913) బొంబాయిలో ఎలిఫిన్ స్టన్ కలాశాలలో ఆంగ్లోపన్యాసకుడు — 'పంచకవి' అనే మహారాష్ట్ర ప్రముఖ కవులవి, అయిదుగురివి కావ్యాలు ఏర్చి కూర్చినాడు.

10. మధ్యాధర్ మాన్‌సిన్హా (జన్మ 1905) ప్రముఖ ఓఢ్రకవి, నాటకకర్త, విమర్శకుడు, శంబలపూర్‌లో గంగాధర్ మెహర్ కళాశాలకు ప్రిన్సిపాలు—ఆయన రచనలు కొన్ని—ధూప, హేమ పుష్ప, అతృతా (అన్నీ కావ్య సముచ్చయాలు) కవి, కవిత—'ఒరియా సమాజ్ ఓ సాహిత్య' అన్నవి.

11. ఖుష్వంత సింగ్ (జన్మ 1915) ప్రముఖ పత్రికా రచయిత, నవలా రచయిత, కథకుడు, యోజన పత్రికా సంపాదకుడు, శిఖుల చరిత్ర రచయిత, Train to Pakistan (నవల అంగ్లంలో), నమ్ వీచ్ కీ పియహై (కథలు)

12. డా. వి. రాఘవన్ (జన్మ 1908) మద్రాసు విశ్వవిద్యాలయంలో సంస్కృతానికి ప్రాచార్యుడు—అఖిల భారత ప్రాచ్య పరిషత్తు తరపున పారిస్‌లో అంతర్జాతీయ ప్రాచ్య విద్వాంసుల సదస్సుకు 1953 లో ప్రతినిధి; ఆయన సంస్కృతంలో తమిళంలో అంగ్లంలో పాండితీ పూర్ణమైన రచనలు ప్రకటించినాడు. సుమారు 250 పరిశోధక వ్యాసాలు ప్రకటించినాడు, Journal of Oriental Research పత్రికకు సంపాదకుడు.

13. యల్. హెచ్. అజ్వానీ (జన్మ 1899) సింధికవి, విమర్శకుడూ. బొంబైలో బంద్రాలో జాతీయ కలాశాలకు ప్రిన్సిపాలుగా ఉన్నాడు. ఆయన కవిగా, సింధికవితా వ్యాస సంకలనకర్తగా ప్రసిద్ధుడు—నవోదార్ (పద్యాలు) విచార్ (వ్యాసాలు)

14. టి. పి. మీనాక్షి సుందరం (జన్మ 1901) వ్యాసకర్త, విమర్శకుడు, మద్రాసు ప్రెసిడెన్సీ కలాశాలలో తమిళ భాషకు ప్రాచార్యుడు.

15. కె రామ కోటేశ్వరరావు (జన్మ 1894) బందరులో జాతీయ కలాశాలకు ప్రిన్సిపాలుగా ఉండేవాడు. భారతీయ సంస్కృతికి సంబంధించిన 'త్రివేణి' అనే అంగ్ల పత్రికకు సంపాదకుడు–కాపూరి ప్రధాని (జీవితకథ), మహారాష్ట్ర వీరులు – ఆయన రచనలు.

**16.** ఖ్వాజా అహ్మద్ ఫరూకీ (జన్మ 1917) ఉర్దూలో ప్రముఖ విమర్శకుడు-ఢిల్లీ కలాశాలలో ఉరుదూ శాఖకు అధ్యక్షుడు-మిర్‌తక్కీ మిర్ హయాత్ షాయిరీ అనే విమర్శనకు సాహిత్య అకాడమీ బహుమతి ఇచ్చింది.

# కన్నడ సాహిత్యము

వి. కె. గోకాక్

## పరిచయము

కొత్తగా ఏర్పడిన కర్ణాటక రాష్ట్రంలో బొంబాయి, మదరాసు, హైదరా బాదు, రాష్ట్రాలలోని కొన్నిభాగాలూ మైసూరు కూర్గు రాష్ట్రాలూ చేరినవి. ఈ నూతనరాష్ట్ర వైశాల్యము 85,000 చః మైళ్ళు. జనసంఖ్య రమా రమి 2 కోట్ల 50 లక్షలు. ఈ రాష్ట్ర ప్రజలకు సుసంపన్నమైన ప్రాచీన చరిత్ర ఉన్నది. కదంబులు, రాష్ట్రకూటులు, చాళుక్య హొయసల విజయనగర చక్రవర్తుల పోషణలో, భారతీయ సంస్కృతికి, లలిత విజ్ఞానవాస్తు శిల్పాలకు, కర్ణాటకము విశిష్టముగా దోహదము చేసింది.

ప్రాచీనతా దృష్టినిబట్టిచూస్తే భారతదేశంలో తమిళము తరువాత కన్నడ సాహిత్యము వస్తుంది. కర్ణాటకములో జైనము ఆరంభము కావ డంతో, కన్నడ సాహిత్యం ఉదయించింది; ఆ రేడు శతాబ్దాలలో శాస నాలలో విశిష్టరూపాన్ని పొందింది. ఆ యుగానికి చెందిన కవుల కృతులు చాలా ఖిలమైపోయినవి. కావ్యలక్షణాత్మక మయిన 'కవి రాజమార్గము' (825 క్రీ. శ.) అన్న గ్రంథము మాత్రమే లభ్యమవుతున్నది. ప్రథమ గద్యరచన 'వొడ్డరాధన' క్రీ. శ. 925 నాటిది. క్రీ. శ. 925 నుంచి 1150 వరకూ స్వర్ణయుగము; చంపూకావ్యాలు మహాకావ్యాలు పంప, పొన్న, రణ్ణకవులు రచించినారు. 1150 నుంచి 1336 వరకూ సాహిత్య జీవితంలో వీరశైవ విప్లవ' యుగము. తత్ఫలితంగా నూత్నసాహిత్య 'ప్రక్రియలు, వచనాలు, అనగా భావోద్వేగ వచనాలు నాతిదీర్ఘములు, కాగళె, త్రిపది, షట్పదివంటి నవ్యఛందస్సులున్నూ, ఉదయించాయి. వచన శైలి వ్యావహారిక భాషకు బాగా సన్నిహితమైంది.

క్రీ. శ. 1336 నుంచి 1575 వరకూ స్వర్ణవిజయనగరయుగము.

వైష్ణవ దాస (భక్త) కవులు, మహాకావ్యప్రణేతలయిన కుమారవ్యాస, లక్ష్మీశ, రత్నాకరవర్ణివంటివారు, నిజగుణ శివయోగివంటి వీరశైవ భక్త కవులవల్లనూ, ఆ సాహిత్యయుగము అలంకృతమైంది. 1575 నుంచి 1700 వరకూ ఆ యుగము పురాతన సాహితీభావనాంకురాలు ముఖ్యంగా సాగినవి. సర్వజ్ఞుడివంటివాడు మాత్రము విజయనగర వినాశానంతరం మార్పుచెందిన సామాజిక దృశ్యాన్ని అవహేళన చేసినాడు. 18 శతాబ్దిలో మైసూరు ప్రభువయిన చిక్కదేవరాయల పోషణలో, చంపూ మహాకావ్య పునరుజ్జీవనయత్నము చరిత్రవంటి ప్రయోజనాపేక్షతో, వచన రచనా భ్యాసమూ గోచరిస్తున్నాయి. రమారమి 19 శతాబ్దిలో ద్వితీయ దశకంవరకూ ఆ భావనాంకురాలు ప్రవర్తిల్లినవి. సుమారీ కాలంతోనే ఆధునికయుగము ఆరంభమైనదని చెప్పవచ్చును.

## ఆధునిక యుగము

నేడు సర్వతోముఖంగా భారతీయ మహాకార్య సాఫల్యానికి రూపురేఖలు తీరుస్తున్న నవ్యభావ జీవితోద్యమము ఒక శతాబ్దికి పూర్వమే ప్రవృత్తమైంది. దాని సమగ్ర ప్రభావం, పూర్ణరూపాంతరం నిమిత్తం అవిచ్ఛిన్నంగా, అవ్యాహతంగా ప్రవృత్తమైన ప్రయత్నము అనుభవ గోచరము కావలసిఉన్నది. గత శతాబ్ది మధ్యభాగంలోనే నవ్యశక్తుల వల్ల కన్నడ సాహితి ప్రభావితమైంది. ఆ రోజుల్లో కొందరు విద్వాంసులయు క్రైస్తవమత ప్రచారకులయు రచనల్లోనూ అది గోచరమవుతున్నది ఆకాలంలోనే కన్నడభాషకూడా మధ్యయుగాలనుండి మార్పుచెందుతూ, ఆధునిక ఆకార ప్రకారాన్నీ, నిర్మాణాన్నీ పొందింది. మధ్యయుగపు కన్నడము, ఆధునిక భాషగా పరివర్తనం పొందడంలో కెంపునారాయణ విరచిత 'ముద్రామంజూష' (1823) అన్న గ్రంథాన్ని సీమాంత శిలగా చెప్పాలి. ముద్రారాక్షస నాటకకథను రచయిత స్వీకరించి, స్వతంత్ర రీతిలో గద్యకావ్యంగా రచించాడు. ఆ భాష మధ్యమ కాలికమైన ఆధునికమైన వ్యాకరణ ప్రయోగాల విచిత్ర సమ్మేళనంతో సాగింది. 1799 నుంచి 1868 దాకా మైసూరు రాజ్యాన్ని పాలించిన ముమ్మడి కృష్ణరాయలు స్వయంగా విద్వాంసుడూ రసికుడనే విఖ్యాతితో లలిత

కళాపోషకుడై విరాజిల్లినాడు. ఆయన పేరనున్న కన్నడరచనలు చాలాభాగం వచనంలో ఉన్నవి. భావియుగంలో వచనానికి ప్రాధాన్యము కన్నడంలో వస్తుందన్న సూచన అది. సామాన్యంగా అందరూ అనేది వచనాంతంలో కవిత్వం ఉదయిస్తుందని. కాని కన్నడ సాహిత్యంలో 14 శతాబ్దాలపైకాలంలో వచనానికి ఎక్కడా ఆరంభములేదు. పద్యము అవిచ్ఛిన్నంగా వాసిస్తూనూఉంది. ఈ ఆధునిక కన్నడ సారస్వత గణతంత్ర రాజ్యానికి శిరోభూతుడుగా ఒకమహాశూర రాజేంద్రుడు నిలిచినాడు.

## పాశ్చాత్య ప్రభావము

ఆధునిక భారతీయ సాహిత్యోద్భవం దేశీయమా లేక వైదేశికమా అనే సమస్యను గురించి ఊహాపోహ చేయడం సరసత సన్నగిల్లిన కళాశాలా వైదుష్యమని చెప్పాలి. కాని నిజము చెప్పవలసివస్తే పాశ్చాత్య ప్రభావంవల్లనే భారతీయ దిక్చక్ర దీపికలు, ఇంతకు పూర్వం లేదేమోనని అనిపించే టంతగా, ఉజ్జ్వలమైనవి. ఒకానొక నవ్యాగ్రహం ఒక శతాబ్దికి పూర్వం భారతీయగ్రంథకర్తల దృష్టిదాకా ప్రసరించడమే కాదు. సాహితీ గగనమంతా కాంతితో విరిసింది. ఆంగ్లసాహితి వారికి నవ్యదృష్టిని, నవ్యాలోకాన్నిచ్చింది. నవల, కథానిక, విషాదాంత నాటకము జీవితచరిత్ర, స్వీయచరిత్ర, వ్యాసము, దినచర్య లేఖనము, లేఖా రచన, భావగీతిక — ఇవన్నీకాక ఇతర సాహిత్య ప్రక్రియలు మనోజ్ఞమైన అవాంతర భేదాలతో, అనంతవైవిధ్య సంపన్నతతో, వారికి గోచరించినవి. వారు ఆతురతగా షేక్స్పియర్, మిల్టన్, ఎడిసన్, స్విఫ్టు జాఁసఁ, గోల్డుస్మిత్, బర్క్, వర్డ్సువర్తు, కీట్స్, షెల్లీ, స్కాట్, జేన్ ఆస్టిఁ, మెకాలే డికెన్సు, థాకరీల కృతులు పఠించారు. స్కాట్‌వల్ల బంకిం చంద్రుడు వంగభాషలోను, ఆప్తేమహారాష్ట్ర భాషలోనూ ఉత్తేజం పొంది నవలలు రచించారు. వారినవలలవల్ల ఉత్సాహప్రేరితులై వెంకటాచార్, గళగ్‌నాద్ కన్నడంలో ఆఖ్యాయికలు రచించారు.

షేక్స్పియరు నాటకాలు చదివిన కన్నడకవులు, కన్నడంలో బ్లాంక్‌ఛందంలో నాటకము, విషాదాంత చారిత్రాత్మక నాటక రచన

లారంభించారు. కన్నడంలో పౌరాణిక నాటక రచనకున్నూ తరుచుగా ఆకార ప్రకారాలు షేక్స్పియరునుంచే నాటక కారులు స్వీకరించారు. కన్నడంలో సామాజికాచార పరామర్శచేస్తూ హాస్య నాటకాలు రచించిన వారికి ప్రోద్బలము గోల్డుస్మిత్, షెరిడెనులు కలిగించారు. కన్నడ సాంఘిక నాటకానికి హెన్రిక్ఇబ్సెన్ ఉత్తేజము కలిగించాడు. తుల్యబల విరోధాలు గల సమస్యను చర్చించే నాటక రచనకు, బెర్నార్డుషా రచనలు ఉత్సాహం కలిగించాయి. కర్ణాటక జానపద సంప్రదాయాల్లో తత్తుల్యమైన జీవశక్తి ఉన్నప్పటికీ, కన్నడ గేయనాటిక, సంగీత రూపకాలు ఆంగ్లసాహితీ సంప్రదాయమువల్ల వికాసం పొందినవనక తప్పదు. ఎడ్గర్అలెన్పో, హాథారన్, కానన్డయల్ కథలు కన్నడ కథారచయితలకు ప్రోద్బలం ఇచ్చినవి. బాస్వెల్, మెకాలె ప్రభృతుల గ్రంథాలు కన్నడంలో జీవిత కథారచయితలకు లక్ష్యాలైనవి. కన్నడంలో ఆత్మీయ వర్ణనాత్మక రచనలు చేసిన త్రివిక్రమ దివాకర, మధుర చిన్న వంటివారికి, వర్డ్సువర్తు రచించిన 'Prelude' మిల్, టాల్స్టాయ్, ఆస్కార్వైల్డుల జీవిత చరిత్రలు నమూనాలయినవి. లాంబ్, హాజలిట్, ప్రభృతులు కన్నడీయుల ఆత్మాశ్రయ వ్యాసరచన కుద్దీపము కలిగించారు. కోల్రిడ్జి, ఆర్నాల్డు, బ్రాడ్లీ, వంటి ఆంగ్లసాహిత్య సమీక్షాదక్షుల రచనలు కన్నడంలో సారస్వత విమర్శకులకు మార్గదర్శకాలు. పాల్గ్రేవ్, సంతరించిన Golden Treasury అనే 'కవితాసువర్ణనిధి' కన్నడ కవితలో విప్లవము తెచ్చింది. ఆంగ్లసాహితీ సంపన్నులైన ప్రాచార్యులయిన బి. యం. శ్రీకంఠయ్య ఆంగ్లంలో భావగీతికలకు మురిసిపోయి, వాటిని పెక్కింటిని కన్నడంలోకి అనువదించినాడు. ఇది నవ్య కవిత్వోద్యమానికి ఒక సవాలైంది. కన్నడ కవి నూత్నఛందఃకల్పనలకు, ఆంగ్లకవిత ఒక పెన్నిధిగా పరిణమించింది. అయితే నూత్నఛందస్సుల గతులు మధ్యయుగాలనాటి ఛందోరీతుల ధారావాహిక నిరవచ్ఛిన్నతే అనే ఆవకాశమూ ఉన్నది. అదివరకున్న దానికన్న కన్నడ సాహితీసౌధము పాశ్చాత్య ప్రభావంవల్ల అంతస్తులతో వివిధమందిరాలతో విరాజిల్లింది. ఏ ఇంగ్లండుకో, అమెరికా సంయుక్త రాష్ట్రాలకో పైచదువులకు వెళ్ళిన తరుణ సాహితీపరులు, వైదేశిక ప్రభావ భావితులై, నవ్యసంవిధానాలు

సాహిత్యంలో అవలంబించడానికి కారకులైనారు. అలాంటి వారిలో కైలాసం. ఆద్య, నాటిక రచనలోనూ; గోకక్, పి. సదాశివరావులు కవితలోనూ, నవ్యలాక్షిణిక ధోరణి అవలంబించినారు.

ఇంగ్లండులో సాంస్కృతిక సంబంధను ప్రయోగాత్మక ప్రావాహిక సారస్వత పక్షాలవైపునా సమానంగా ఉన్నది. మధ్యయుగము అవతరించక పూర్వమే భారతీయ శాస్త్రీయ విజ్ఞానాభివృద్ధికి నిరోధము ఏర్పడింది. అయితే మన విశ్వవిద్యాలయాల్లో ఆంగ్లవిద్యావిధానము ఎన్నిలోపాలున్నా నవ్యశాస్త్రీయ విజ్ఞానాత్మక రచనకు మహోత్సాహము కలిగించింది. కన్నడ భాషలో ఇంచుమించు ప్రస్తుతం సర్వ భౌతికశాస్త్ర, సామాజికశాస్త్ర గ్రంథాలున్నూ, గోచరిస్తున్నాయి. ఈ క్షేత్రంలో అభ్యుదయాన్ని త్వరితం చేయగలగాలి. కర్ణాటక విశ్వవిద్యాలయాల్లో కన్నడము బోధన సాధనమైనప్పుడు కన్నడీయ శాస్త్ర వేత్తలు, ఆర్థిక శాస్త్రవేత్తలు వికాసంపొంది తమ పరిశోధనలనూ, సృజనాత్మకాలోకనాలనూ కన్నడంలో విశదంగా వివరించడానికి సిద్ధమయినప్పుడు, యథార్థ ప్రయోగాత్మక సాహిత్యమువల్ల కన్నడ భాష సుసంపన్నము కాగలదు. అయితే కన్నడ పత్రికారచన చారిత్రకమైన సహనత్యాగాల ఫలితంగా ఉచ్ఛస్థాయిని పొందింది. ఆంగ్లసంప్రదాయ సంబంధమైన శాఖాంతరంగా మనకు వింత ధోరణిలో ఆంగ్లీకృత కన్నడంద్వారా, వార్తలూ, అభిప్రాయాలతో, అది ఆరంభమైంది. భారతీయ ప్రజాతంత్రము తనది కాగలిగినట్టే అదీ తనది కాగలిగింది. సమస్త మానవ ప్రవృత్తినీ తనకు జాతీయమైన భాషలో అనుకూలంగానో, ప్రతికూలంగానో, పరామర్శ చేయగలిగింది. పసివాళ్ళకోసం నిరక్షరాస్యులైన పెద్దలకోసం నవసారస్వతం అనువాద అనుకరణ స్వతంత్ర సృజనాత్మకంగా కేవలం ఆ వరుసలోనే కాకపోయినా ఉద్భవిస్తున్నది.

## మహాగ్రంథోద్ధరణము

పాశ్చాత్య ప్రభావితాలయిన భారతీయ సాహిత్య ఫలాలను పరిశీలిస్తున్నప్పుడు మనకు ఒకానొక వైపరీత్యము ఎదురవుతున్నది.

వైదేశిక పూజామందిరాలలో ఏతదర్చనతోపాటు పురావైభవోద్ధరణకూడా ఏకకాలంలో సంభవించింది. మేలుకొన్న మధ్యమవర్గాన్ని గట్టిగా పట్టిన నవ్యమూ, విప్లవాత్మకమున్నూ అయిన జాతీయత, సూయజు కాలువ ద్వారా భారతదేశం చేరింది. వేదాలు, ఉపనిషత్తులు, కాళిదాస ఇత్యాద కులు, పాణిని ప్రభృతుల యథార్థమహిమాతి శయము, షోపెన్‌హేవర్, మోక్షమూలర్, రైడర్, కీత్ పండితులవల్ల మనము తిరిగి గుర్తించి నాము; వేదాలను ఉపనిషత్తులను గాడ్విన్, మిల్, బెర్ట్రండ్ రసెలు మూలంగా మనము దగ్ధము చేయాలనే ప్రమాదాన్ని సమీపించినప్పటి కిన్నీ ఈ ఉజ్జీవన చైతన్యము సర్వవ్యాపకము కాగా ఒక్కొక్కసారి ఎవరికయినా ఆలోచనవస్తుంది; అస లుజ్జీవనమే నవ్యోద్యమ సారమని. ప్రప్రథమం నవ్యప్రభావవశం వదులైనవారిలో అన్యతముడు, బసవప్ప శాస్త్రి ఒథెల్లోనాటకాన్ని, కాళిదాసకృత శాకుంతలనాటకాన్నీ, అద్భుతంగా కన్నడానువాదము చేసినాడు. ముల్‌బాగల్ ఉత్తరరామచరిత నాటకాన్ని అనువదించినాడు. తుర్‌మరి భట్టబాణుని కాదంబరికి అధునిక కన్నడ పరివర్తనము చేసినాడు. సంస్కృత భాషలోని ఉత్తమ గ్రంథాలను కన్నడభాషలో అనువదించడం పూర్వమునుంచీ ఒక అవిచ్ఛిన్న సంప్రదాయమైనా, విభిన్న పరిస్థితిలో పూర్తిగా సంస్కృత గ్రంథానువాదం ఉద్ధరింపబడింది. పురాణాలకున్నూ కన్నడానువాదాలు వచ్చాయి. మహాఐరోపీయ గ్రంథకారులకు మనము నివాళులిచ్చినా, మన హృదయాంత రౌత్సుక్యంవల్ల ఆత్మీయ గౌరవమునూ, మహా పారంపర్యాన్నీ (మన వారసత్వపు హక్కును తాత్కాలికంగా విడిచి పెట్టుకొన్నా) విస్మరించకూడదని దృఢ నిశ్చయము చేసికొన్నాము.

క్రైస్తవధర్మ ప్రచారాన్ని దృష్టిలో ఉంచు కొన్నప్పటికీ, వైదేశికమత ప్రచారకులు మన పురా సంస్కృతికి, పునఃప్రతిష్ఠ కల్పించడానికి అమూల్యమైన సేవచేసినారు. రైస్‌విద్వాంసుడు కర్ణాటక ఎపిగ్రాఫికాను ప్రచురణ చేయడంతో అధునిక పద్ధతిలో ఐతిహాసికాధ్యయనం ఆరంభమైంది. కిట్టెల్‌కన్న డాంగ్లపదకోశాన్ని సంతరించగా, సాహిత్యాసక్తులకు పదిహేను శతాబ్దాలనుంచీ సంచితమూ, విస్తృతముగా ఉన్న, కన్నడ భాషామూలములను చూపింది. కన్నడ గ్రంథ

కర్తల రచనలూ కాలక్రమాగత దృష్టితో వారిజీవిత పర్యాలోకనముమ్నా; 'కవి చరితె' అన్న సంపుటాలుగా రావడంతో కవి చరిత్రాధ్యయనం సూక్ష్మవిమర్శన పాటవంతో ఆరంభమైంది. ప్రాచీన కన్నడ కవితానిధి, 'కావ్యకళానిధి' ప్రచురణాలవల్ల, పాఠకలోకానికి లభ్యమయ్యే అవ కాశం కల్పింపబడింది. శ్రీహాలకట్టి కన్నడ సారస్వతంలో అమూల్యా భాగమైన 'వచనాల'కు సూర్యాలోక భాగ్యం కలిగించినాడు. అజ్ఞా తంగా ఉన్న రత్నాకరవల్లికవి తక్కిన కవులతోపాటు కన్నడ కవి త్వంలో న్యాయమైన అగ్రస్థానం అధిష్ఠించినాడు. సర్వజ్ఞ, వైష్ణవదాస కవులు సముచితమైన తమ స్థానాలు సాహిత్యంలో పొందినారు. నిస్సందేహంగా కాక్సటన్ ముద్రణయంత్రమువల్ల ఇంగ్లండు దేశీ యులు అతిగా సంపన్నులైనారు. కాని నిజంగా ముద్రణయంత్రము వల్ల.కన్నడప్రజలు తమలోతామున్నా అన్యప్రజానీకంతోను ఏకమై, ఉభయులకూ సామాన్యంగాఉన్న సంస్కృతీ పారంపర్యాన్ని బాగా గ్రహించినారు.

ఉజ్జీవిత కన్నడ రచనల ప్రధాన లక్షణాలలో, ఒకానొకటి తమకు మహాసాహితీ సంప్రదాయమున్నదనే చైతన్యం. కన్నడ కవితా వధూ టిని సంబోధిస్తూ బేంద్రేకవి—

'ఓహో జైనకోశ గళన్మకరంద ఝరీ,
భోగయోగములు వాసించెను నీలో!
నీవో ఆత్మీయ ప్రాణేశ్వరివే.
వీర శైవ యోగులు అందుకే నిట్టూర్చిరి.
ఓ, అభినేత్రీ, గేయకార భక్తాలికి
వారి హృదయానందోద్గారం వారి విలాపం
వ్యక్తము చేశావే నీవే!
ముద్దన కవి స్నిగ్ధప్రేమతో
తావకీనైంద్ర ధనూరుచి శబలిత శబ్దమ్ములు
పరితూగంగా గలవు; ఆశిస్సులు వచించును.
ఓ దేవీ! అతులిత శోభాతరుణీ!
మదంతరాంతరైక్యము కూర్పుము

బహుకాలము వేచితి నీకై
ఓహో గేయమ్మా! ఓహో గేయమ్మా!

బేంద్రే, మధుర చెన్నకవులు జానపద కవితోజ్జీవనకై ప్రముఖ పాత్ర నిర్వహించినారు. జానపద కవితోజ్జీవనమే ద్విపదవంటి భావ కవితకూ భావగీతికా రచనకూ ఉద్దీపనము కలిగించింది. మన చరిత్ర పురాతన శిలాలేఖవాల్లో ప్రశస్తుల్లో తెలియవచ్చింది. జానపద గాథలు నుడికారాలు, నానుడులు సంకలితము చేయబడి ముద్రితముకాగా, సంస్కృతి నిధానములని గుర్తింపబడ్డవి. కన్నడ భాషాభేదాలను ప్రదేశ నామములనూ సశాస్త్రీయంగా విమర్శచేయడం వల్ల మన శ్రవ్య దృశ్య కావ్యాలకు రాగరంజనం కలగడమే కాకుండా, కర్ణాటక భూమిలో భాషా శాస్త్ర పఠనప్రవృత్తి ఆరంభమైంది. ఆధునిక భారతీయ భాషలు కూడా అన్యోన్యంగా భారతీయ సాంస్కృతికోజ్జీవన దశలను వివృతము చేసినవి. ఉజ్జీవనకేకాక పాశ్చాత్య సంస్కారం ముద్రితం కావడానికిన్నీ, ఆధునిక భారతీయ భాషలు ఒకదానికి మరొకటి సాయపడినవి. కర్ణాటక యక్ష గానాలు ప్రబావంవల్ల, మహారాష్ట్ర రూపక పరిణామము సంభవమైంది. దానికి మారుగా మహారాష్ట్రభాషలో నవల, కన్నడంలో నవలా వికా సాన్ని త్వరితం చేసింది, ఆప్తే రచించిన ఐతిహాసిక కాల్పనిక బావోద్రిక్త నవలల ద్వారా. భావప్రసారానికి కారకులైన మహాభారతీయ నాయకు లయిన రాజా రామమోహనరాయ్, మహర్షి దయానంద, శ్రీరామకృష్ణ, స్వామి వివేకానందులు, శ్రీఅరవిందులు, అనిబెసెంట్, మహాత్మగాంధీ, రవీంద్రనాథఠాకూర్, రమణమహర్షివంటి మహనీయులు ప్రాంతీయులూ కారు, వారు యావద్భారతీయులు. సర్వతోముఖమూ, ఏకమున్నూ అయిన సర్వోద్యమానికి వారు విశిష్ట ప్రతీకలు. దేశము వారిని మహ నీయులని ఆమోదించింది. వారి జీవితాలు, ఉదారసూక్తులు. అసంఖ్యాకు లైన దేశములోని సంస్కారముగల స్త్రీ పురుషుల దృక్పథాలను తీర్చి దిద్దినవి. భారతీయులు ఈ మహనీయులందరి ప్రభావంచేత భావితులై నారు. మహామహుల దివ్యప్రభావానికి వశంవదులు కావడానికి, అమూల్య మయిన ఆంగ్లభాష ముఖ్యంగా బావసాధనమైంది. శ్రీ అరవిందులు, పండిత నెహ్రూల ప్రభావప్రాసారానికి ఆంగ్లవాణి ప్రధానంగా ఉపక

రించింది. గాంధీ రవీంద్రుల భావాలు అవగాహన చేసుకోడానికి ఆంగ్లమ్ము రెండోపక్షంగా ఉపకరించింది.

## ఒక విశ్లేషణము

కాని సాహిత్య శిల్పికి ప్రధానంగా ఉజ్జీవనంతో సంబంధము, తన మనస్సుకుగల విజ్ఞానాత్మకమైన అవశ్యకతా, తన సృజనాత్మక ప్రేరణే. కవితాశిల్పి అందుకే గతాన్ని తవ్వి తీయవలెనని పురాతత్వ వేత్తవలె కోరడు. తన ప్రయాణ సంభారం మీద చీటీలన్నింటినీ ప్రదర్శించడంలో అత్యంత సంతృప్తి అతనికి లేదు, ఖండాంతరయానం చేసే డాంబికుడైన ప్రయాణికునివలె. తాను చూచిన సత్యదర్శనకు సంబంధించిన సహజజ్ఞాన భావమూ, వర్తమాన భవిష్యత్ పర్యాలోచనమున్నూ, అతనిది అతనికే ఉంటవి. ఆయన భూతకాలం వైపు దృష్టి మరలిస్తే, సుసంపన్న సాంస్కృతిక పారంపర్యంనుండి ప్రోద్బలాన్ని తెచ్చుకొంటే, అలా చేయడానికి కారణం, నిజాలోకనం నిరూపించుకోడానికీ దృఢపరచుకోడానికిన్నీ, ఆయన నలువైపులా అవలోకిస్తూ, అన్య దేశాల్లో సాహిత్యోద్యమాలను అవగాహన చేసుకోడంలో ఔత్సుక్యం చూపితే దానికి కారణం వాటిలో సజాతీయమైన లయనూ, నాడీస్పందననూ, గుర్తించడం వల్లనే. ఆ కవితాశిల్పి విస్తృత దేశసంచారం, రవీంద్రుని కస్తూరికామృగమువలె చేస్తాడంటే నిజ పరిమళమిహికచే ఉన్మత్తుడవుతున్నాడన్నమాటే. అతడు నిజజీవిత దృక్పథమునే నిలువుగానూ అడ్డంగానూ రెండు విధాల చూస్తాడు. ఆధునిక భారతీయ భాషలు చిత్రంగా ఆంగ్లసాహిత్యం నుంచి ఋణము తెచ్చుకొని, విశిష్ట సాహసానికి పూనుకొన్నాయి వారు తమ పురాతన భావోద్రేకపు నీటియూటల్లో లెస్సగా తాగి, బలిమిని మళ్ళీ తెచ్చుకొన్నారు. దానికి కారణం ఆ పలుకులు పలికిన ఆ స్త్రీపురుషులు వారి జీవితము వారు గడపవలసినవారు, వారి మహాకాంక్షలు వారు సాధించవలసినవారు.

ఏమిటీ నవ్యజీవితం ? కన్నడీయులకు సంబంధించినంతవరకు దాన్ని నిర్వచించ వచ్చును. వారికి 19 శతాబ్దిలో పూర్వార్ధములో అప్రయత్నంగా ఈ విశిష్ట నవ్యభావ జీవితోద్యమారంభం జరిగింది.

కనపడకుండానె భాషానిర్మాణం పరివర్తనం పొందింది. వచనము వ్యాయ్యమైన తన సీమలో క్రమంగా విజాధిపత్యాన్ని వ్యాపింప చేసికొన్నది.

కన్నడ గ్రంథాలు అచ్చుకావడం ఆరంభమైనవి. 1865 లో మైసూరులో కర్ణాట ప్రకాశికవంటి పత్రికలుండేవి. 1823 లో నూతన నిబంధన బైబిలుకు కన్నడానువాదం ప్రకటితమైంది. మైసూరులో రాజపోషణవల్ల దక్షిణ కర్ణాటకంలో పూర్వకర్ణాటక సాహిత్య సంప్రదాయాలు అవిచ్ఛిన్నంగా సాగడానికి సాహాయ్యం లభించింది శేషించిన కర్ణాటకము పరిపాలనా వైవిధ్యంవల్ల విచ్ఛిన్నమైంది. తన మనుగడ కోసం కన్నడము ఇక్కడ పోరాటం చేయవలసి వచ్చింది. కాని ఈ కారణాలవల్ల బహుప్రభావాలను కన్నడము అవగాహన చేసుకొని, ముందుగా ప్రజాతంత్రాత్మక భావవ్యక్తీకరణాన్ని వికసింపచేసికొన్నది. ఈ యుగపు రచనల్లో అనిశ్చితత్త్వమూ, పరివర్తన శీలమున్నూ గోచరిస్తాయి. అయితే మధ్యమకాలిక సారస్వత సంప్రదాయము అవిచ్ఛిన్నంగా సాగిపోతూ, సారస్వతరంగం మీద ఇంకా ఆధిపత్యము చలాయిస్తూనే ఉంది.

## ప్రథమ దశ

నవజీవన సంరంభముతో 19 శతాబ్దికి పశ్చిమార్థం ఉద్బుద్ధమై కదలు లాడింది. పాశ్చాత్య సంస్కార ప్రాభవము, సముద్ధరణమున్నూ, ఏతత్‌యుగ ప్రధాన ప్రవృత్తి. సంస్కృతాంగ్ల మహాగ్రంథానువాద ప్రవాహపరంపర కన్నడ సీమలో వెల్లివిరిసింది. నాటకము, నవల, జీవిత చరిత్ర, సమీక్ష క్రమంగా తమ స్థావరము నిలుపుకొన్నవి. ఈ సాహిత్య ప్రక్రియలలో నవల సుప్రతిష్ఠితమైంది. కన్నడంలో వాస్తవికతను చిత్రించిన ప్రప్రథముడూ ప్రవీణుడు అయిన నవలాకారుడు యం. యన్. పుట్టణ్ణ. ముద్దన 'రామాశ్వమేధం' అన్న మహాఖ్యాయికలో సంప్రదాయగాథను, జీవితాలోకంవల్ల నవ్యాకృతిలో రచించాడు. ఈ నవలారూప గద్య కావ్యంలో చాలా అద్భుతంగా నవచైతన్యం రససిద్ధిని పొందింది. ఈ నవలలో కథకుడైన ముద్దన అతనిభార్య మనోరమ

వీరిద్దరి స్నిగ్ధప్రేమ కన్నడీయ బెనిడిక్, కన్నడీయ బియాట్రిస్‌గా, మనకు గోచరిస్తారు. కన్నడీయులు చాలా సాహిత్య పత్రికలు ఆరంభించారు. నవ్యసాహిత్య ప్రక్రియలు శాంతంగా పాదుకొన్నవి. శయ్య, ఛందస్సు, భావచిత్రణనుబట్టి భావగీతము పరివర్తనము చెందుతూ, సంధిదశలో ఉన్నది. అయితే నవ్యప్రభావమువల్ల విశదమైన మార్పు పొందుతూనే ఉంది. సరీఫ్ సాహెబువంటి ప్రవీణజానపద గాయకుడు కూడా, నూలునేతయంత్ర సంశ్లిష్ట నిర్మాణానికి చకితుడై ఆధిభౌతికమైన తన ఇతివృత్తానికి ప్రతీకమాత్రంగా అయినా, దానియందు గౌరవము చూపినాడు. క్రైస్తవమత ప్రచారకులుకూడా ఈ యుగంలో బైబిలునూ, ప్రార్థనాగీతాలనూ, కన్నడానువాదాలుచేసి కార్యోత్సాహులయినారు.

1900 నుంచి 1920 దాకా సాహిత్యకృషి అధికతరంగా స్పష్టంగానూ, బహుముఖంగానూ సాధించారు. బి. రామారావు, ఆలూర్, ముదవీడు, ములియె తిమ్మపయ్య, పంజి మంగేశ్వరరావు, యస్. జి నరసింహాచారి ప్రభృతులీ యుగంలో కార్యమగ్నులయినారు. ఆధునిక కన్నడ కవిత, యస్. కట్టి, వి. యం. తట్టి, శాంతకలి, కావ్యానంద ప్రభృతుల రచనల్లో స్ఫుటంగా పాదుకొన్నవి. ఈ యుగంలో కొన్ని భావగేయానువాదాలు హెచ్. నారాయణరావు, బి. యం. శ్రీకంఠయ్యలు చేసి ప్రచురించే ఉన్నారు. కెరూర్ ప్రజ్ఞాశాలి అయిన మార్గదర్శకుడు. ఆయన ప్రజ్ఞతో నాటకాలూ, నవలలూ, కథానికలున్నూ రచించాడు వాటికి పత్రికా రచయితగా ఆయన ఉద్వేగ కార్యక్రమాచరణతో పాటు పూనుకున్నాడు. 1914 లో సాహిత్యపరిషత్ స్థాపన జరిగింది. కర్ణాటక భూమిలో దానితో ఉద్ధరణం సింహాసనాధిష్ఠితమైంది.

## స్వర్ణ యుగము

1920 నుంచి కన్నడ సాహిత్యానికి స్వర్ణయుగం వచ్చింది. కర్ణాటక మంతటా పాటలుపాడే విహంగకులాయాలు ఆకస్మికంగా గొంతు లెత్తినవి. బి. యం. శ్రీకంఠయ్య, మాస్తి, ఓ. వి. గుండప్ప కవుల ఆధ్వర్యవంలో 'తలిరు' గుంపు; మంగుళూరులో 'మిత్రమండలి' పంజి,

గోవిందపాయ్ మార్గదర్శకత్వాన; ధార్వారులో గెలియరగుంపు, బేంద్రే నాయకత్వాన-ఇంకా ఇతర సాహితీ సమితులు రాష్ట్రమంతటా కార్యోత్సాహంతో అద్భుత లావణ్యస్ఫోరక కావ్యసృష్టి చేసినవి. ప్రజ్ఞావంతులైన కె. వి. పుట్టప్ప, వి. సీతారామయ్య, పి. టి. యస్. రాజరత్నం, కాడెంగొడ్లు, మధురచెన్న, ముగలి ఈ సాహితీ సమితులనుండే ఉదయించారు. బేటిగెరి, పళి, కూడా సొగసుగా కవిత్వము చెప్పినారు. వారు తమ జీవితంలో చూచిన జాతీయ భావోద్గారంవల్ల ఉఱ్ఱూతలూగుతున్న యుగాన్ని, ఆ మంటలో గుబాళించే తావినీ కవితలలో వ్యక్తంచేశారు. దీర్ఘభావగేయము, విషాద సంస్మరణాత్మక కావ్యం, సానెట్, గేయం, భక్తిగీతం, కథనకావ్యం, ద్విపదవంటి దేశీయకావ్యం, శృంగారాద్భుత రసబంధుర కవిత్వం, దార్శనిక కావ్యం, నాటకీయ భావగేయం, గీతికా స్వగతం-వీటినీ ఇతర కావ్య ప్రక్రియలనూ పరమహర్షంతో, యథార్థ భావోద్దీపనంతో, కవులు కృషి చేసినారు. రకరకాల నవలలు ఉజ్జ్వల తార్కాణాలుగా రచింపబడ్డాయి. ఆచార వ్యవహారాలకు సంబంధించిన 'సుదర్శన' అనే నవల బెటిగెరి రచించాడు. దేవదు 'అంతరంగ' మన్న నవలలో మనోవిజ్ఞానమును చూపినాడు. 'సంధ్యారాగ' మనే నవలలో ఎ. యస్. కృష్ణరావు పాత్రోన్మీలనం ప్రధానంగా నవలా రచన చేసినాడు. కస్తూరి హేళనతో 'చక్రదృష్టి' అనే నవల రచించాడు. కరంతు 'మరలి మన్నిగె' (క్షేత్రానికి మరలండి) అన్న నవలను సమస్యాత్మకమైన 'కనరపురుష' అనే నవల ముగలి రచించారు. ఆద్య 'విశ్వామిత్ర సృష్టి' అనే నవలను 'చైతన్య ప్రవంతి' సంవిధానంతో రచించాడు. ప్రాదేశిక చిత్రణం కరంతు 'బెట్టదజీవ'లో చక్కగా తీర్చినాడు. ఐతిహాసిక నవలా రచన బెటిగెరి, కెరూరు వాసుదేవాచారి, శాస్త్రి, కె. వి. అయ్యర్ సాగించినారు. ఆకర్షణీయంగా ఔత్సాహికులయిన కొందరి చేతుల్లో పరిశోధక నవల పడ్డది. సంశ్లిష్ట నిర్మాణం చూపుతూ ఎ. యన్. కృష్ణరావు, 'నటసార్వభౌమ', కె. వి. పుట్టప్ప 'కనురసుబ్బమ్మ', గోకక్ 'సమరసవె జీవన' (సమరస జీవనం) నవలలూ రచించారు.

ప్రముఖులైన వారీ యుగంలో నాటకరచన చేసినారు. టి పి.

కైలాసం, హుయిల్‌గోళ్, గరుడ, సంస, ఆద్య ప్రభృతులు నాటక కర్తలు. రూపకభేదాలు దిగ్విజయంతో అవతరించి సార్థకమైనవి. పౌరాణిక వస్తువు స్వీకరించి గరుడ 'పాదుకాపట్టాభిషేకాన్ని' సి. కె. వెంకటరామయ్య 'మండోదరి' నీ, సమస 'సుగుణ గంభీర', మాస్తి 'తాళికోటె', చారిత్రక నాటకాలనూ హుయిల్‌గోళ్ 'శికుణ సంభ్రమం', కైలాసం 'హోంరూలు'ను, ఆద్య 'హరిజనవర' అనే సామాజిక రూపకాలనూ, కరంతు 'గర్భగుడి', ముగలి 'నామధాః' అనే హేళనాత్మక నాటకాలను రచించారు. తీవ్రవిషాదాంత నాటకంకోసం పాఠకుడు సమస, నాటకాలను కైలాసం రచించిన 'తప్పెవరిది' వంటి నాటకాలు చూడాలి. కాల్పనిక భావోద్వేగ సుఖాంతనాటకా లనదగినన్ని గోకక్ 'యుగాంతరం' రచించారు. కైలాసం, ఆద్య, బేంద్రేలుకూడా ఏకాంకనాటికా రచనా ప్రవీణులు. సాహిత్య చరిత్రలో వైశిష్ట్యాన్ని పొందినది పద్యనాటిక. యవన విషాదాంత రూపక విధానంలో శ్రీగారు 'అశ్వత్థామ' నూ, కె. వి ఆర్. (ప్రాచీన గ్రీకుభాషనుండి నేరుగా అనువాదము) 'అంటిగోను' ను రచించారు. షేక్స్పియరు నాటకానువాదం చేయడంలో బ్లాంక్ చందాన్ని స్వీకరించారు. అనువాదాల్లో పుట్టప్ప, డి. వి. జిలు. మాస్తి 'యశోధర' 'తిరుపాణి' వలె గేయరూపకము రచించినాడు. పి. టి. యన్. 'అహల్య' రచన చేసినాడు. విషాదాంత సుఖాంత సంగీత రూపకాలు, కరంతుకృత 'సోమియ భాగ్యం' 'ఎవరో అది చెప్పారు' అన్న వాటిలోవలె బ్లాంక్‌ఛందము విరివిగా వాడినారు. బ్లాంకు ఛందస్సును ప్రవేశపెట్టడం పటువైన సాధనం. ఆ ఛందస్సు కన్నడములో ఉన్న 'రగళె' అనే దానిలో ఒకానొక ఛందోభేదానికి సమీపంగా ఉంటుంది.

ఆధునిక సాహిత్య ప్రక్రియలలో అమితంగా జనప్రీతి దాయకమైంది కథానిక. కన్నడ కథానికా రచనకు మాస్తి జనకుడు. ఆయన ప్రజ్ఞతో కొన్ని కథానికలు రచించారు. తాత్త్వికకథలు 'శారీపుత్రుని చివరరోజులు' వంటివి, దేశాభిమానాత్మక కథలు 'వసుమతి' వంటివి, ఐతిహాసిక కథలు 'రాణి నిజగళ్' వంటివి. జానపద జీవితానికి సంబంధించిన 'మోసరిన మంగమ్మ' లాంటి కథలు. భావో

ద్రిక్తమైన కథలు 'ఆమె ఇందిరా కాదా ?' అన్నవి రచించారు. బెటిగెరి, ఆనంద, గోరూరు, గోపాలకృష్ణరావు, కృష్ణకుమార్, శ్రీమతి గౌరమ్మ ప్రభృతులు చాలమంది కథానికా వైశాల్యాన్ని విస్తృతంగా వ్యాప్తి చేశారు; సన్నివేశం, పాత్రచిత్రణ, భావయోచనలు, వాతావరణము మనోవిజ్ఞానాలవైపు దృష్టి ఉంచినారు కథకులు.

ఆధునిక కన్నడ సాహిత్యంలో వ్యాసములు సాహితీ విశిష్టాలు. వ్యాసం సంగ్రహరచనగా ఆదిలోనే ఆరంభమైంది. అయితే ఆత్మాశ్రయం వ్యాసరచనలు, 'బాతాఖానీలు' 'మెఱుపులు' వంటి సంకలనలతో విలవ తొక్కు కొన్నవి. విస్తీర్ణ వైవిధ్యాలతో వ్యాస సముచ్చయాలు వచ్చాయి. ఏ. యన్ మూర్తిరావు 'దివాస్వప్నాలు', నారాయణభట్టు 'ఉపన్యాసి గళు' యన్. కె. కులకర్ణి 'ఝంగలపుటికె', ఆద్య 'స్వారస్యం' అనే వ్యాస సంపుటాలు వెలువరించారు. పాత్రోన్మీలనాత్మక వ్యాసాలు శ్రీకృష్ణశర్మ బింద్రేలు; సమీక్షాత్మక వ్యాసాలు, టి. యన్ స్, ఎ. యన్. కృష్ణరావులు; పుట్టప్ప వర్ణనాత్మక వ్యాసాలు; కథనాత్మక వ్యాసాల వంటివి పి టి యన్. 'భావనా చిత్రగళు;' లేఖా రూపంలో భౌగోళిక సంస్కృతీవిలసిత వ్యాసాలు గోకక్ రచించి, వ్యాసక్షేత్రంలో విస్తృతినీ, వైవిధ్యాన్ని సాధించారు. డి. వి. జి. 'గోఖలే' జీవిత కథ మహోత్తమంగా రచించాడు. పుట్టప్ప 'వివేకానంద' జీవితాన్ని కాల్పనిక భావోద్వేగరీతిలో వ్రాసినాడు. కన్నడంలో స్వీయచరిత్ర ఆధ్యాత్మికంగా విరచితమైంది, మధురచిన్న 'Prelude' (పరిచయం) తో సాహిత్యజీవితం రాజరత్నం తన 'పదేళ్ళు' అనే గ్రంథంలో చిత్రించినాడు. గోకక్ సౌందర్య తత్త్వ దృష్టితో 'రూపసౌందర్యము' అన్న ఆత్మ జీవితచరిత్రనూ, దివాకర్ ప్రధానంగా రాజకీయ జీవితకథను 'సెరెమనె' అనేది రచించాడు. దిన చర్య రచన సాహిత్య ప్రక్రియగా గోకక్ 'సముద్రాల అవ్వలినుండి' లో చూపినాడు. ఎ. రావు 'ముక్తిమూల్యం' సాహిత్యరూపంలో దినచర్య రచించాడు. యాత్రాగ్రంథ రచన ఆకర్షణీయంగా వి. సీతారామయ్య, గోపవి, మానవి ప్రభృతులు రచించారు. ఈ యుగంలో ప్రధానంగా రచయితలు నవ్యోద్యమపు ఆశయాలను నిర్వచించడానికి సాహిత్య సమీక్ష చేశారు. వారు ప్రాచీనమైన అపార కన్నడ సాహిత్యసంపదను

వ్యాఖ్యానిస్తూ, ఐరోపీయ సాహిత్యాన్ని ఉత్తేజపరచిన ఆదర్శాలను వివరణచేస్తూ, ప్రాచీనార్వాచీనాలను సమన్వయ పరుస్తూ సాహిత్య సమీక్ష సాగించారు. ఈ సందర్భంలో టి. యన్. యస్. రచించిన సంస్కృతాలంకార శాస్త్రచరిత్రనూ, ముగళి రచించిన కన్నడ సాహిత్య చరిత్రనూ, కృష్ణమూర్తి సంస్కృతంనుంచి అనువదించి సంపాదించిన 'ధ్వన్యాలోకము'నూ, కర్కికృత ఛందోవికాసాన్నీ, ప్రత్యేకంగా పేర్కొనాలి. లోగడ పేరాల్లో పేర్కొన్న చాలమంది గ్రంథకర్తలు సాహిత్య సమీక్షకు దోహదము చేశారు. చాలమంది విమర్శకులు మాలవాడ్, రంగన్న వంటి వారు ఈ క్షేత్రం సుసంపన్నం చేశారు. విద్వాంసులైన బసవనక్, కుందనగర్ వంటివారు ప్రాచీన కన్నడ మహాకావ్యాలను పరిష్కృత పాఠాలలో ప్రచురించారు. ప్రముఖ విద్వాంసుల స్మారక సంపుటాలు వారల గౌరవార్థం ప్రకటింపబడ్డాయి. అవి కన్నడ సాహిత్య సమీక్షకు అమూల్యాలంకారాలు. నిజంగా వారిలో చాలమంది అనేక సాహిత్య ప్రక్రియలు చేపట్టి విశిష్టకృషి చేసినవారు.

## 1939 అనంతరం

రెండవ ప్రపంచయుద్ధంతో రమారమి 1939 నుంచి నూతన దశ అరంభమైనదన వచ్చును. ఈ సమయానికి దాదాపు 1930 ల లోని 'అభ్యుదయోద్యమం' శక్తిని కూడదీసుకొన్నది. ఈ యుగసాహిత్యం గాఢంగా తద్భావ భావితమైంది. తరుణ సాహితీపరు లుదయించడానికి అభ్యుదయోద్యమం కేంద్రమైంది. 'రసఋషి' అనే పేరుతో వచ్చిన భావగేయాల సంకలనం ఈ నవచైతన్యాన్ని నిరూపిస్తున్నది. తొల్లింటి దశలోని రచయితలు రచనా కార్యమగ్నులై ఉంటూ, నవ్యమార్గ దర్శకులైనారు. భారతరంగంలో నాటకీయ సన్నివేశాలు—1942 లో క్విట్ ఇండియా ఉద్యమం, 1947 లో స్వాతంత్ర్యావతరణం, మతద్వేషం వల్ల కొట్లాటలు భారతీయ సంస్థాన విమోచనం, గాంధివధ, గోవావిమోచనోద్యమం, భారతదేశంలో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణం వంటివి త్వరితంగా సంభవించాయి. ఈ వాతావరణపు వెలుగు నీడల్లో యువసాహితీపరుల తరంవారు, వికాసం పొందినారు. వెనకటి తరం వారైన రచ

యితలు ఈ సన్నివేశాలపై పరిపక్వ శిల్పరామణీయకమైన ఆలోకము ప్రసరింపచేసినారు. అయితే యువరచయితలు కొత్తతీవ్రతగల స్పంద నం అనుభవించారు.

కవిత్వానికి నవశక్తి సమకూరే అదను కలిగింది కె. నరసింహ స్వామి, అడిగ, శ్రీధర, కణవి, ఎక్కుండి, కిణ్ణిగోలి, ఆర్. శర్మ ప్రభృ తులు భావగేయానికి, నవ్యభావుకతా సామర్థ్యము సమకూర్చినారు. దీర్ఘకావ్యము రచనా వైవిధ్యాన్ని సాధించింది. పుట్టప్ప బ్లాంక్ ఛంద స్సులో రామాయణకావ్యం పూర్తిచేసి, సాహిత్య అకాడెమీవారి పారి తోషికం పొందినాడు. డి. వి. జి. తన ' కగ్గ ' అచ్చువేసినాడు. ఆ కావ్యం అతని విశ్వాసానికి పరిచయ వాక్యము వంటిది. మాస్తి ' నవరాత్రి ' ఛాసరు కృత కాంటర్‌బరీ గాథలవలె రచించాడు. బేంద్రే కాల్పనిక భావోద్వేగాత్మక మహాకావ్య విధానానికి ఉండే స్వేచ్ఛ చూపినాడు. ' సఖీగీత 'లో, ఆర్నాల్డు రచించిన ' సోహ్రాబ్ రుస్తుం ' అన్న కథనకావ్య ధోరణిలో గోవిందపాయి ఏసుక్రిస్తు, బుద్ధదేవుల వృత్తములు స్వీకరించి దీర్ఘకావ్యాలు రచించాడు. వినాయకకవి 'జీవితాలయం'లో భారతీయో జ్జీవనాన్ని శిల్పరామణీయకంగా అనుభవానికి అందిస్తూ, భావగీతాత్మక సన్నివేశం కల్పించినాడు. టి. యస్. ఇలియెట్ రాసిన ' మరుభూమి ' (Waste Land) అనే కావ్యధోరణిని అనుసరిస్తూ అడిగ ' లోయ ' ' గొండాలపురం ' అనే నవ్యరచనలు చేసినాడు. వినాయక కవి స్వేచ్ఛా చందం అవలంబించి, నవ్యేతివృత్తంతో ' సముద్రగేయాలు ' రచించి నాడు. కావ్యరచనలో కాల్పనిక భావోద్వేగత, జానపద స్వరూపం లోనో, లేదా స్వస్వరూపంలోనో, సుప్రతిష్ఠితమైంది. నవ్యశబ్ద సంఘ టన, భావచిత్రణ, నూత్నఛందో నిర్మాణం, నవ్యకావ్య సాధనకు ఆవశ్యకమైనాయి. ఆధునిక సంవిధానము కావ్యరచనకు అట్టిది కలి గించునని ఆశ కలిగించినది. వినాయక, అడిగ, ఆర్. శర్మ, శివరుద్రప్ప, కణవి ప్రభృతులు ఈ నవ్యమార్గాల్లో సాహసంతో దూకినారు. ఆధునిక విధానం కావ్యరచనా వైవిధ్యంలో ఒకానొకటి. ఆధునిక సంవిధానం లోనే అనేక పద్ధతులు ఇమిడి ఉన్నాయి. ఈ సంవిధానాలన్నీ కవులు వెదకి అవలంబిస్తున్నారు.

1939 నుంచి వివిధ సాహిత్య ప్రక్రియల్లో బహుముఖంగా సాధించగలిగిన దానిమూల్య నిర్ణయం చేయడానికి ఇక్కడ చోటులేదు. కాని నవలాకారులపేర్లు కొన్ని ఉదాహరిస్తున్నాను—వారు మిర్జి, కట్టి మణి. ఇనాందార్, కులకుండ శివరావు, టి. ఆర్. యస్, కె. టి. పురాణిక, హెగెడి. వీరిలో కొందరు హుయిర్‌గోర్, అనంతమూర్తి, వరగిరి వంటి వారితోపాటు కథానికలుకూడా రచించారు. పర్వతవాణి, యల్.జె. బేంద్రే, యన్, కె. కులకర్ణి ప్రభృతులు కొందరు నాటక కారులలో నవ్యులు. నడిగె, గడకర్, వడప్పి ప్రభృతులు, ఆత్మాశ్రయ వ్యాస రచయితలు. కె. కృష్ణమూర్తి, కె. నరసింహమూర్తి ప్రభృతులు సాహిత్య సమీక్షకు దోహదం చేశారు.

రచయితలు రెండో ప్రపంచ యుద్ధాన్ని ఆధారంగా భూమిగా కల్పించి, చాలా నవలలూ, కథానికలూ రచించారు. అదే ప్రధానమయిన ఇతివృత్తంగా స్వీకరించి కొందరు కవిత్వం చెప్పినారు. గోవిందపాయ్ చెప్పినట్టు మానవుడు మానవత్వంతో మనగలిగినంత వరకూ 'రణరంగం శాంతికి జనని'. ఇంచల్ అంటాడు. 'క్రీస్తు, బుద్ధుడు, బసవుడు' శాంతి సందేశమిచ్చిన భూమి మీదనే 'ఈ సర్వజీవ మారణహోమ' మని. 'అసుర' లో వినాయక కవి హిట్లరుతో కవిగారి ఇంటర్వ్యూను భావన చేసి కథను నడుపుతూ, ఆసురీశక్తి ప్రేరణ వ్యాఖ్యానం చేస్తాడు. హిరోషిమానగరంలో అటంబాంబు ప్రేలుడువల్ల జరిగిన సర్వసంహారం ఉద్దేశించి చిత్తల్ కవి హృదయమర్మ చ్ఛేదకంగా జాలిగొలిపే రచన చేసినాడు. కస్తూరి హీరోయిక్ ఛందస్సును వ్యాజంగా ఉపయోగించు కొంటూ, అణ్వాస్త్రాలను అవహేళన చేస్తున్నాడు. శ్రీరావు యుద్ధకథను ప్రసన్న పద్యకథా ధోరణిలో రచించినాడు.

ఇనూందార్ కిట్టమణి వంటివారి నవలల్లో క్విట్ ఇండియా ఉద్యమం బాగా చిత్రింపబడింది. వి. సీతారామయ్య ఉద్యమోద్రేకాన్ని, ఓజస్సుతో దీర్ఘగేయంగా రచించినాడు :—

"ఓహోయీ ప్రజానీకం !
ఎవరయ్యా దానిగతి నిరోధించేవారు ?
ఎవరయ్యా అంతులేని దానిఆశలకు అవధులు కట్టగలారు ?

గాలిగోపురాలు లేచునులే
నీలాకాశపుదెస శిఖరము లెత్తునులే!
ప్రజానీకం అవహేళన చేస్తుంది
గ్రహతారావళి జ్వలత్ దీధితిని
అగణ్యమౌ మరుత్తులను గణించాలని చూస్తుంది ప్రజ.

రాయ్‌కవి నేతాజీ సుభాస్ చంద్రబోసు నిర్మించిన అజాద్‌హింద్ ఫౌజు నుద్దేశించి, ప్రశంసా పూర్వకంగా దీర్ఘకావ్యం రచించాడు. 1943 లో వంగదేశ క్షామం తీవ్రంగా ఉద్వేగం కలిగించగా, కన్నడంలో ముగలిరాసిన ' అన్న ' వంటి నవలలూ, ఉత్సాహదాయకమయిన కథానికలూ, వచ్చినవి. ముగలి, గోవిందపాయిచేత భావగేయాత్మక చకితభావం అనిపిస్తాడు :— " కలిమిభాగ్యము కలిగి అకటితో చస్తున్నాం మేము. జీవం కలిగిన శ్వాసించే శవాలవలె మేము బ్రతుకుతున్నాం."

స్వాతంత్ర్య సిద్ధివల్ల హృదయాలన్నీ భావోద్రేకంతో జల్లుమన్నవి. రమారమి ప్రతి కవీ అకస్మికంగా కవితాగానం చేసినవాడే. నవల, నాటకము కవిత్వంతోపోటిచేస్తూ స్వాతంత్ర సంఘటనను ప్రశంసిస్తూనో, లేదా వ్యాఖ్యానించడానికో బయలు దేరాయి. అద్యరచించిన 'శోకచక్ర' నాటకంలాగ, దక్షిణ కన్నడమునుంచి కవులు ' ఉద్ఘోష ' అనే పేరుతో భావగేయకవితా సంకలనం ప్రకటించారు.స్వాతంత్ర్యోత్సవంచేసుకొంటూ. అయితే భావోన్నతిని విమోహభ్రాంతిని పొగొట్టె నీడవంటిదేదో అవరించింది. వినాయకకవి భరతమాతను ముఖద్వయంగల ఇటలీదేశపు ద్వారదేశ జేనసు దేవతవలె, విచారంతో ఆలోకించినాడు.

' ఓ ఉపాధిద్వయ సంభూత వ్యథా!
ద్వైతజీవ ప్రణయోద్భవ బాధా!
సంకీర్ణ శ్లిష్ట పథమ్మిది
ద్వైతభావ వికీర్ణ పథమిది!'

గాంధీమహాత్ముని జన్మోత్సవవేళ బేంద్రేకవి అన్నాడు :—" ఈనాడైనా చెబుదాం మనము నిజం. శేషించిన వత్సరమంతా అసత్యానికి పూర్తిగా మనము అంకితం అవుతాము!" చిత్తల్‌కవి అంటాడు :—

'దీపికావిరాజమాన స్తంభాలు స్వాతంత్ర్యావతరణం ప్రకటిస్తున్నవి. అయితే కారుపొగలుకక్కే యీ రాక్షసి బొగ్గుపొగ గొట్టాలను, మానవ జీవాలను ఇంధనంచేసే వీటిని నే నెలా మరిచిపోను ?''

గాంధివధ ప్రజల అంతరాత్మను వేగించి వారిలో పురుషార్థ విషయ సంబంధమయిన నవ్యభావచింతన కలిగించింది. కన్నడకవులు జాతిజనకునకు హృదయాలను కలచే భావగీతికా సంపుటాన్ని భక్తి శ్రద్ధలతో అర్పించారు. హేమంతకవి జాతియైక్య నిర్మాత అయిన వల్లభభాయ్ పటేలును ఉద్దేశించి కరుణాకలిత మయిన విషాదకావ్యము రచించాడు. నిర్మాణాత్మక సామరస్య కర్మయోగంవైపు క్రమంగా కవులు తిరిగినారు. అదే సంస్తంభనకు ఒక్కటే పరిష్కారమార్గం అని తలచారు. అడిగ అంటాడు : ''మిత్రమా, ఇంకా ఇక్కడ ఉన్నదితోట, ఆశచిగిర్చింది. వికీర్ణకంటక శిలాశకలాలకింద భూసారము బంగారము. దీనికిందనే బుద్బుదాల ఆట.'' వినాయక కవి భావిస్తాడు భరతమాత చెబుతున్నట్లు —

నా పిల్లల్లారా నమ్మండి
భక్తులు దేహంలో అవతరించారిందుకే
నిర్మూలించండి దుఃఖాన్ని పుడమినుండి
సమత్వ సమతాలోకనలను సింహాపీఠి నిలపండి
ఈనాడు నాటిన స్వేచ్ఛావల్లరి, స్వేచ్ఛాభావార్థం సుమించదా
వెలుగులో కుసుమించదా ?

## నవోద్యమ మూలసూత్రము

నవ్యయుగంలో భావవైఖరిని ఉల్లేఖించాలని అధికంగా కవిత్వాన్నే స్వీకరించాను. ఇతర సాహిత్య ప్రక్రియల్లోకూడా అధికంగా కృషి జరిగింది. అయితే ఈ అధ్యాయశేషం యావత్తూ, ఉజ్జీవనం అనే పేరుతో వ్యవహరింపబడుతున్న నవ్యభావ జీవితోద్యమ మూలసూత్రాలను విపులీకరించ దలచుకొన్నాను.

ఈ సాహిత్య సృష్టిచేసినవారూ, చేస్తున్నవారున్నూ, విభిన్నమైన జీవనోపాధులు కలవారు, వివిధ మతానుయాయులున్నూ, వారిలో

హిందువులు, ఉత్తంగివంటి క్రైస్తవులు, అక్బర్‌అలీవంటి ముసల్మానులున్నూ ఉన్నారు. వారిలో జైనులు, లింగాయతులు, బ్రాహ్మణులు, ఒక్కలిగలు, రెడ్లున్నూ ఉన్నారు. వారి అధ్యయన వ్యాసంగము బహుముఖంగా ఉంది. షరీఫ్‌సాహెబ్ కన్నడపు అ, ఆ లైనా నేర్చాడో లేదో, కైలాసం వంటివారు కొందరు ఉత్తమాంగ్ల విశ్వవిద్యాలయాల్లో అవకాశం ఉన్నంతవరకూ ఉన్నత విద్యావ్యాసంగము చేసినవా రున్నారు. ప్రాథమికోపాధ్యాయులు బి. యల్. కామేశ్వర్‌వంటివారూ ఉంటూనే ఉన్నారు. ఉన్నతపాఠశాలోపాధ్యాయులు బసవనాల్ వంటివారు ఉంటూనే ఉన్నారు. లాయర్లు హొన్నపూర్మఠ వంటివారు, గుమాస్తాలు దేశాయి దత్తమూర్తి సదృశులు, వ్యాయామ శిక్షకులు ముగ్దనవంటివారు, గోవిందపాయిలాటి గ్రామీణ భూస్వాములున్నూ ఉన్నారు సారస్వత రంగంలో. క్రైస్తవమత ప్రచారకులు, పురోహితులు, మఠాధిపతులు, సన్యాసులుకూడా సాహిత్యకృషి చేస్తున్నారు. పత్రికా లేఖకులు, దుకాణదారులు, వెంకటశ్రేష్ఠి, వారివంటివారు, స్కూళ్ళ ఇన్స్పెక్టరులు, పంజెమంగేష్‌రావు వంటివారు, విశ్వవిద్యాలయాల్లో ఆచార్యులు (ప్రస్తుతం ప్రముఖరచయితల శ్రేణి ఇది) మాస్తివంటి పౌరోద్యోగులు, శివరాం వంటి చికిత్సకులున్నూ, సాహిత్యకృషి చేస్తున్నారు. సారస్వత వ్యాసంగంలో రాజకీయాందోళనకారులు యస్. శర్మవంటివారు బాధ్యతాయుతోన్నత పదవీస్థితులు ఆర్. ఆర్. దివాకర్ (బీహార్ గవర్నరుగా ఉండెను,) వంటివారున్నారు. కన్నడసాహిత్యగణ రాజ్యంలో ఛాసరు వ్రాసిన కాంటర్‌బరీ యాత్రికులవంటి భిన్నవర్గీయులు వివిధోపాధులు కలవారున్నారు. మారుతము వీచి, తదీయోల్లాసపు అమృతాగ్నిచే సంచారగాయకుని పెదవులను స్పర్శచేస్తుంది. కదలకకూర్చుండే విద్వాంసుణ్ణి స్పృశిస్తుంది. కొందరు సాహిత్యాన్నే జీవికగా పెట్టుకొన్న కరంతు. ఎ. యన్. కృష్ణరాయ సదృశు లున్నారు.

ఇటువంటి నవ్యరచనా విశిష్ట లక్షణాలు వ్యక్తిత్వావిష్కరణం మానవాత్మీయతా పవిత్రతలున్నూ వ్యక్తిత్వమును ద్యోతకంచేసి సాహిత్యము కృతకృత్య మవుతుందనే సత్యము, రచయితకు అకస్మికభావంగా తోచింది. ఈ అనుభవ గోచరమయిన దానివల్ల నవ్యరచయిత

భావోన్మత్తుడైనాడు భావగీతికలు, వ్యాసాలు, నవలలూ, నాటకాలున్నూ వ్యష్టిజీవ శాఖను సముజ్జ్వలింపచేశాయి. ఇటీవలనే కవి వ్యష్టిగతా వరణంనుంచి విడివడి తన హృదయ ప్రకటన వైభవంకన్న, కవితా శిల్పి తనలోని విశ్వమానవతను వ్యక్తముచేయ యత్నించసాగినాడు.

ఈ రచయితలున్నూ ప్రకృతిని నవ్యాలోకం చేసినారు. ఆధునిక శతారంభందాకా కన్నడ సాహిత్యంలో ప్రపంచ విఖ్యాతమయిన జోగ్‌జలపాతం కావ్యవస్తువు కాకపోవడం ఆశ్చర్యకరం. అయితే ఆధునిక కర్ణాటభాష తదీయ నిర్ఝర స్వనాలతో పూర్ణంగా ముఝుంకరించింది. ఆధునిక కన్నడ కవితలో కాల్పనిక భావోద్రేకంతో, ప్రకృత్యాలోకనం పూర్ణంగా సిద్ధించింది. రమణీయ ప్రకృతి దృశ్యం ప్రతిదిన్నీ, కర్ణాటక కవితాభావచిత్ర ప్రపంచంలో ఒక అంశగా పరిణమిస్తూనే ఉంది. చాలా భావగేయాలకూ, వ్యాసాలకూ, కర్ణాటక స్థాపత్య శిలావాస్తువులు కథావస్తువులైనాయి. సహ్యాద్రిని వీక్షించి హర్షపులకితుడై పుట్టప్పకవి గీతాగానము చేసినాడు. బేంద్రే ఉషశ్శాంతి భావచిత్రణం చేసినాడు. సీతారామయ్య వివృతపథాన్ని, జలయంత్రోద్ధూత శీకరకాసారాన్నీ వర్ణించి నాడు. వినాయక కవి సముద్రపుటుదాత్త గంభీర భీషణతలను చిత్రించి నాడు. పి. టి. యన్. కవి కృత్తికానక్షత్రకూట వర్ణనంలో విశ్వరోదసిలో సంచరిస్తున్న తారలను శాశ్వత ప్రశ్న అడుగుతున్నాడు. కన్నడ కవితలో పొగగొట్టపు ఘూంకారధ్వని, విద్యుత్‌యంత్రనినాదం కూడా చెవుల బడుతూనే ఉన్నాయి. ఇతరసాహిత్య ప్రక్రియల్లోకూడా ఈ కావ్యవస్తువులను రచయితలు స్వీకరించారని చెప్పవలసిన అవసరములేదు.

జాతీయత మరొక ప్రధాన కావ్యవస్తువుగా ఉంటూనే ఉంది. బేంద్రేకవి రచించిన 'ముప్పదిమూడుకోట్ల ప్రజాగేయం' అన్నది ఒకానొక అద్భుత స్వరమేళనం. ఆయన రచించిన 'స్వప్నాలోకనం' లో జాతిహృదయ స్వరూపిణియైన పుడమి తల్లినీ, స్వాపికుడై గుర్తిస్తాడు; భీతితో చకితుడైనాడు తనను ఆమె ప్రశ్నించగా "నీవు మానవుణ్ణి అని నిరూపించుకో. నా వేదికపై ఆత్మబలిదానం చేసుకో" అని. 'తరుణ తపస్వి' అన్నకావ్యంలో బాహ్యస్వేచ్ఛకు మానసికస్వేచ్ఛ ముందుగా ఆవశ్యకమని కవి చెబుతున్నాడు. సంప్రదాయక దృష్టి ప్రేమ విషయం

లో శృంగారపరమో లేదా నైతికమోకాని ఆధ్యాత్మికంగా ఉండేదికాదు. అయితే ఇప్పుడది చాలా నవలల్లో నాటకాల్లో కావ్యాల్లో ఒక వ్యక్తి మరి యొక వ్యక్తిలో మానవాత్మను శోధన చేయడముగా చిత్రితమైనది. అపారమూ వైవిధ్యమూగల స్త్రీపురుషపాత్రోన్మీలనం కవితావ్యాపం గంలో గోచరిస్తున్నది. సామాజిక న్యాయవిషయం కూడా కావ్యవస్తువై అధికంగా హృదయాలను ఉద్ఘాత లూగించింది. బేంద్రే 'తిరిపెపుజోలె' లో భారతదేశంలో లక్షలకొద్దీ మూకజీవాల మర్మచ్ఛేదక బాధను, భావో ద్గారగేయరూపంలో వ్యక్తం చేసినాడు. 'అంధ కనకం చేస్తున్న నాట్యం' అన్నకావ్యంలో బేంద్రే పెట్టుబడిదారీ విధానాన్ని భీషణరోషంతో విచా రణ చేస్తాడు:—

'ఆలయంలో అది గంటలను గణగణ మ్రోయించింది.
ప్రాసాదాంతర వాయులీన వేణువులను కమ్మని స్వరాలు పలికించింది.
విపణి వాటిలో ధనరాసుల సంగీతం పలికించింది.
వెర్రివెర్రిగా తూలితూలి నాట్యం చేసింది.

అంధ కనకం అవనీ తలాన విలువునా పడింది, వినోదం పరాకోటిని ప్రాపించినప్పుడే రాజరత్నకవి 'రత్నగేయాలు' వ్యవహార కర్ణాటక భాషలో నుడికారపు సొగసుతో, సమాజంలోని అసమత్వాన్ని అన్యా యాన్ని ప్రకటించాడు. మాస్తి తన 'తిరుపాణి' అనే గేయనాటికలో ఇతి వృత్తం హరిజన భక్తుడు ఆళ్వారు కావడానికి సంబంధించింది. 'జలా గారం', 'ఉద్ధర'వంటి చాలా పటువైన నాటకాల్లోనూ, 'చోమనదుడి' వంటి నవలల్లోనూ అస్పృశ్యత కథావస్తువు. ఖండాంతర పరిస్థితివల్ల ఉద్రిక్తుడైన కన్నడ కవి దోషారోపణచేస్తూ జరగబోయేది చెబుతాడు. అలా పుట్టప్ప 'కోయిల సోవియట్ రష్యా' లోనూ, బేంద్రే 'రుద్రవీణ' లోనూ జోస్యం చెబుతున్నారు.

"పుడమి మరల అగ్ని పర్వతాయమానమైంది.
మహీధరాలు హుటాహుటిని ప్రక్కలైనవి.
అనకట్టలు పరీవాహాలను అరికట్టలేవు.
అరుణ పృథ్వీ దాహశాంతికది వృథా.
న్యాయపీఠము తలక్రిందులైంది.

సింహాసనాలు చితా భస్మ కలశాలు
మానవ మస్తిష్కం వెనుకకు
మతాలు శాఖలు చేరుకొన్నవి."

భావగేయాల్లో కథానికల్లో, నవలల్లో, నాటకాల్లోనూ, అధిభౌతిక భావన ప్రముఖంగా గోచరిస్తున్నది. శ్రీ రాసిన 'శుక్రగీత', మధుర చెన్నకృతమైన 'నా ప్రియుడు', బేంద్రేకృత 'జీవితఖడ్గం', మాస్తి రాసిన 'ఉష' అనే ఏకాంకిక, గోకకు రచించిన 'జీవన సామరస్యం' వంటి నవల, కరంతు రచించిన 'ముక్తద్వారం' వంటి సంగీతరూపకాలు ఈ స్వభావాన్నే నిరూపిస్తున్నాయి. ఉజ్జీవన ప్రధాన స్వభావం ఇదే.

మరొక విశిష్ట లక్షణం పౌరాణిక గాథలనూ, పాత్రలనూ, మానవీయము చేయడం. దానికి ఫలితం పురాణంలో రావణునివంటి ప్రతినాయకుల పక్షం వహించి సమర్థించడం, పుట్టప్ప రాసిన రామాయణంలో, ని. కె. వి. కృత 'మండోదరి' లో, ఆద్య కవి రచించిన 'నిరుత్తరకుమార' లోని 'ఉత్తరకుమారుని' లోనూ, కాన వస్తుంది. ఆధునిక కన్నడ కవితలో నవలలో రూపకంవంటి అన్యసాహిత్య ప్రక్రియల్లో శిల్పలక్షణం, తదీయ భావోద్రేకం, సఫలతాసిద్ధి పొందుతూ కావ్యవస్తువు లవుతున్నాయి. అందుకు కొన్ని తార్కాణాలు - మాస్తికృత 'సుబ్బన్న', ఎ. యన్. కృష్ణరాయని 'సంధ్యారాగము', గోకకు రచించిన 'కళోపాసక', విమర్శక వైద్యుడు', కైలాసం రచించిన 'శూర్పణఖ', ఆద్యరచితమైన 'పూర్వరంగం' 'సంపుష్టరామాయణం', పి. టి. యన్. కృత 'రససరస్వతి'న్నీ-

## అష్టోపనదం

సజీవాధునిక కర్ణాటక సాహితీ సంగమంలో ఎనిమిది ఉపనదులు వచ్చి చేరుతున్నాయి. ఆధునిక భారతీయ సాహిత్యా లన్నింటిలో ఈ నవ్య ధోరణులు గోచరిస్తున్నాయి. అది ఈ భారతీయోజ్జీవనము సుసంపన్నమనీ సర్వతోవ్యాప్తమనీ నిరూపిస్తున్నది. వీటిలో కొన్ని నవ్యయుగావతరణంలోనే రూపొందినవి. తక్కినవి వాటి సమగ్రజీవిత సరణిలో శక్తినికూడ తీసికొన్నది. అవి పరస్పరం సంఘర్షణతో

ఉన్నట్టు పైకి కనబడవచ్చును. అయితే జీవితం వైరుధ్యాలనూ, వైపరీత్యాలనూ, అతిక్రమించి తనలో సామరస్యం చేసుకొంటుంది. వాటి సమ్మేళనంలో వాటిని అవలోకన చేయడం, నవ్యోద్యమ సంశ్లిష్ట తను సర్వవ్యాపకమయిన ఏకత్వాన్ని గ్రహించడమన్నమాట.

ప్రథమకూటంలో పరిహాసకౌశలంగల రచయితలు లేక యదార్థ వాదులు, తత్క్రిందైన కవులున్నూ, గుప్తమైన అదర్శదృక్పథంతో మానవులలోటుపాట్లను గర్హిస్తూ తీర్పు తీరుస్తారు. కైలాసం, కరంతు, కస్తూరి, బీచి, ఆద్య, అడిగ, కట్టిమణి, వి. జి. భట్టువంటి రచయితలు మన బృహదజ్ఞానాన్ని, మూఢవిశ్వాసాన్ని, చూచి, వెక్కిరిస్తారు. మన దైనందిన జీవితంలో మన నటనల్లోగల బోలు తనాన్ని, మన సామాజిక రాజకీయ మతధార్మిక వ్యవస్థల దోషభూయిష్ఠతనూ, ఆ గ్రంథకారులు బహిర్గతం చేస్తున్నారు. వారు ఆదర్శప్రాయమైన కాగితపు పడవల్లో పయనించేందుకు అంగీకరించరు. అయితే వారుకూడా తమ ప్రత్యేక రీతుల్లో సంప్రదాయకంకానీ, అసాంప్రదాయికమైన వ్యక్తిత్వంలోని స్నిగ్ధ సౌజన్య, హేతుమతా మాధుర్యాది గుణోన్మీలనం చేస్తారు. అంతవరకు వారు మానవవాదులే, అన్యసాహిత్యమార్గానుయాయులుకూడా, తరుచుగా యథార్థవాదుల భావానుకూల్యతలో భాగస్వాములే. అయితే వారి వ్యక్తిత్వపు ప్రధానోద్దేశ్యం అదికాదు. కొందరీ యదార్థవాదులు డి. హెచ్ లారెన్సువలెనో, లేదా టి. యస్. ఇలియట్ పద్ధతిగానో, విచారపడుతూనో గర్హిస్తూనో భావి వినాశం చెప్పవచ్చును. వారి ఆక్రందనాలూ, లేదా నిరాశాభావోద్వేగతరంగం ఆధునికాంగ్లేయ సాహితీపరుల లఘూచ్చారణా విరామాలను గ్రహించి యుండవచ్చును. కాని భారతదేశంలో బాధలుండగా భారతీయ రచయితలు క్లేశాన్నీ నైరాశ్యాన్నీ, నైష్ఫల్యాన్నీ అన్యులవద్ద అభ్యసించవలసిన అవశ్యకతలేదు. కన్నడంలో నవలలూ, నాటకాలూ, మన సామాజిక జీవితంలోని వ్యత్యాసాలపై, భీషణ విషాదపేలవచ్ఛాయను ప్రసరింప చేస్తున్నాయి. బేంద్రే తన నాటకములో 'సంకులాభాస'లో నాయికా సంబంధమైన వైవాహిక సమస్యా పరిష్కారం ఇలా చేయవలసివస్తుంది. "పెళ్ళిచేసుకొన్నవాళ్ళే పద్గతిపొందడం నిజమయితే ఆమె సూక్ష్మదేహానికి స్వర్గారోహణం అన

వసరం. శాశ్వతనరకబంధంలో ఉన్నా ఆమెఆత్మ ఆనందంగాఉంటుంది. ఆమెకు పునర్జన్మవస్తే ఆమెకూ ఆ తల్లితండ్రులకూ శాంతి ఉండదు.'' అశ్వమేథంలో ఉన్నంతక్లేశమును వివాహంలో అద్యకవి అవలోకిస్తున్నాడు. ''ఇక్కడే ఈ భూతలాన వెంకప్పకూతురు కమల, ఆమె పెళ్ళి అస్తవ్యస్తము కావడానికి ఈ అడగడమే మొదటి యెత్తు. ఆమెకు శాశ్వతంగా ఆతిథ్యమిచ్చే యువకుడు ఆమెను దారిలో ఆపి వెంటనే పెళ్ళి చేసుకొనుగాక !'' అత్తగారు, వితంతువు, విద్యావతి అయిన కన్య, సమిష్టి కుటుంబపద్ధతి, వ్యభిచారం, శార్పుకత్తెలు — ఇవి ఇతివృత్తాలు చాలా నాటకాలకూ నవలలకున్నూ. కైలాసం రచించిన 'శాలు-గట్టి', అద్యకృత 'సరస్వతి సర్కస్', యన్. కె. రాసిన 'పానశాల' అనే నాటకాల్లో ఆధునిక విద్యా సమస్యలు ప్రదర్శింపబడ్డాయి. 'మృత్యునాటకం' లో బేంద్రే జమీందారీ విధానంలో దోషా లెన్నినాడు. కైలాసం తన 'హోంరూలు' 'స్వపరిపాలనం' అన్న నాటకాల్లో సంస్కారశూన్యమయిన ప్రజాతంత్రమును మునిసిపలు కౌన్సిలర్లకోసం ఏర్పడిన నిబంధనాలతో దులిపివేసినాడు. ''ఎన్నికయితే స్థానికంగా ఏ యిద్దరు కౌన్సిలర్లూ ఒక్కవీధిలో నివసించరాదు. ఎంతమంది కౌన్సిలర్లున్నారో కార్పరేషఌలో కనీసం అన్ని పరిశుభ్రమైన వీధులుండవని పన్నులు చెల్లించేవారికి హామీ అది.

ఆ తర్వాత అభ్యుదయవాద సమితు లున్నాయి. సామాజిక పునర్నిర్మాణంలో సమస్యలు వారికి ధ్యేయాలు. దినకరదేశాయి, యన్. చొడమణి, అర్చిక, వెంకన్న, కులకుంద శివరావులకు జాతీయ, ఖండాంతర ప్రకరణాల రెండింటిలో గాఢ సామాజిక చైతన్యం ఉన్నది. వారిలో కొందరు సిద్ధాంతాలను తీవ్రంగా అవలంబించి మార్క్సువాదంలో నిండా మునిగినారు. కాని మార్క్సుసిద్ధాంతం ఖండాంతరాల్లో స్టాలినీయవాదంగాను, ప్రస్తుతం స్టాలిఌ వ్యతిరేకవాదంగానూ మారి, రెండు పక్షాల వల్లనూ సతమతమవుతున్నది. గ్రంథరచయితలు చాలమంది లక్ష్యప్రాయ సంక్షేమాత్మక రాష్ట్రభావనచేసి, అందుకు విలంబనం సహించలేక పోతున్నారు. రచయితలు సామ్యవాదాన్ని ఉద్రేకంతో కాంక్షిస్తూ, సమర్థిస్తూ, శోభా దరిద్రాణ జీవితదృశ్యాలను చాలా చిత్రించారు.

ఖేంద్రె 'ముష్టివాళ్ళు అంటువ్యాధి,' రాజరత్నకృత 'నరకంలో వ్యాయం,' రమాకాంతుని 'కల్కి' న్నీ సామ్యవాద రచనలు మన యదార్థవాదులు హేళనాత్మక రచయితలు సామ్యవాదంలో స్ఫుటమైన వ్యవస్థను దర్శించారు.

మూడో ఉపనది సంప్రదాయవాదులది. వారు సుప్రతిష్ఠితాలయిన తమ మతాల్లోని పురుషార్థాల్లో విశ్వాసముకలవారు. వారు తమకు లబ్ధమైనకాలాన్నీ, ఉన్నశక్తినీ, తమ మత ధర్మ వివరణకో, తత్సంబంధమైన సాహిత్యం అన్వేషించి, పునః అవాసం దానికి కల్పించడానికి సిద్ధమైనారు. మతస్వాములు ముఖ్యంగా ఈ క్షేత్రంలో కృషిచేస్తున్నారు. కొందరు గ్రంథకర్తలు అమూల్యకృషిచేశారు. ఈ క్షేత్రంలో, గ్రంథ సమీక్షలో, లిఖితప్రతుల సంపాదనంలో అలాంటివారు యఫ్. జీ. హలకట్టి. ఆర్. యస్. పంచముఖి ప్రభృతులు, మరికొందరు స్వధర్మం కాని బౌద్ధం వంటి అన్యధర్మంలో కృషిచేశారు రాజరత్నం వంటివారు. అయితే ఈ ధోరణిలో రచన సృజనాత్మకంకాదు. సూక్ష్మ పమీక్షాత్మకం. మనము జీవిస్తున్న క్రాంతియుగంలో సంప్రదాయిక మత ధర్మంవల్ల బావోద్దీపనం, దానివల్ల శక్తిన్నీ కలగదు. అందుకు భిన్నంగా అది అభిమానమౌఢ్యంగా, సుంకుచితబుద్ధిగా కఠినమవుతుంది, దానికి అన్యభావ సంసర్గం వ్యతిరేకంగా అనుగుణంగా సమస్థాయిలో లేనప్పుడు, కాని అదృష్టవశాత్తు కర్ణాటకంలో చిత్రంగా శతాబ్దాలనుంచీ భిన్నమతధర్మాలు పరిపుష్ట మవుతూనేఉన్నాయి. జైనం, వీరశైవం, వైష్ణవం, శ్రీవైష్ణవం, అద్వైతవాదాలన్నింటికీ పురాతనశాఖలు కన్నడసాహిత్యంలో ఉండనే ఉన్నవి. ఇస్లాం క్రైస్తవ ధర్మలతలున్నూ బాగా పాదుకొన్నవి. ఈ మతధర్మాల వివరణం చేస్తే అది అమూల్యం; అది నవ్యసామరస్యానికి పహాయకారి కాగలదు స్పర్థకూ వివాదకూ అది దారితీయకపోతే.

సుప్రతిష్ఠిత మతధార్మిక సంప్రదాయాల ప్రత్యవాయాలవల్ల — మత ధార్మిక విశ్వాసంలేని మానవ వాదులైన నాలుగోకోవకు చెందిన రచయితలు వచ్చినారు. ఈ సరణికి తార్కాణాలుగా ఆద్యకృత 'నిరుత్తర కుమారం', వి. జి. భట్టు రాసిన పద్యాలు, ఆర్. శర్మ రచించిన 'హృదయగీతల'ను పేర్కొనవలెను. డి. వి. జి. ఏ మత దార్శనికతలో

విశ్వాసం లేక సందేహబుద్ధి అయినవాడు కూడా, మర్మయోగ వ్యాసంగం కలిగి, 'కగ్గ' కావ్యంలో అద్భుతంగా కవితారూపమయిన ధార్మిక సందిగ్ధతర్కాన్ని వ్యక్తం చేసినాడు. పాశ్చాత్య దేశాల్లో విశిష్టలక్షణంగల మానవ వాదము, మర్మయోగపుటవధిలో ఉన్నది. అయితే అది అధికంగా జ్ఞాన విచారణాత్మకం కావడంచేత ఆత్మార్పణను నిగ్రహిస్తుంది. అది మనసులోని అడుగు పొరలనూ, బుద్ధిలతకు మారాకు హత్తించే వ్యాపారంలోనూ అన్వేషిస్తుంది. ఫ్రాయిడ్, జంగ్ పద్ధతిగా, ఐన్‌స్టీన్‌వలె శాస్త్రీయ రీతిలోనూ — మూలం ఏదయినా, మానవవాద రచయితలైన సీతారామయ్య, యస్. వి. రంగన్న; వి. యన్. మూర్తి రావు, కాశ్యప ప్రభృతులు అపూర్వ కోమల కరుణార్ద్ర వృత్తి, అచంచల ఋజుత్వ, సుకుమార భావుకతా లక్షణలక్షితులు: సీతారామయ్య కర్ణాటక భూమిని ప్రీతిస్నిగ్ధులై, వర్ణిస్తున్నాడు. నిజ కవితావదూటియొక్క ఆగమన చాంచల్యాన్ని, కవి మృదుహాసంతో పలుకుతున్నాడు. మతమౌఢ్యంవల్ల అంధులయిన హిందువులనూ, ముసల్మానులనుకూడా, రక్షిస్తూ ప్రాణాలర్పించిన ఒకానొక విద్యార్థిని హార్దికంగా కవి ప్రశంసిస్తున్నాడు. భౌతిక విజ్ఞానశాస్త్ర ప్రయోగ శాలలో కాంతి పరిశోధన అజ్ఞానుల తమస్సును తేజోమయం చేస్తుందనీ, ఆప్రయోగాలే పండితులకు అంధతమస్సున్నూ కాగలదనీ, అతడెరుగును.

అయిదో రకపు రచయితలు కవితాత్మ కలవారేకాక, మత ధార్మిక స్వభావులు — మాస్తి, పి. టి. నరసింహాచారి, గోవిందపాయ్, దేవడు, సలి, కర్కి, ఇంచల్, ఎక్కుండి అలాంటివారు. సంప్రదాయాలు, కోవెలలు, పురాణ మహాత్మ్యాదిగాథలున్నూ వారికి ప్రీతిదాయకాలు. అయితే వారి అనుభూతి, సూక్ష్మమై యథార్థమై, మన హృదయాలను చూఱగొంటుంది. కొందరు వారిలో విశ్వాసాలను వైఖరీ వాగ్రూపంగా వచించరు. కాని అన్యులు తమ విశ్వాసాలను ప్రకటిస్తారు. వారికి మానవాత్మ చైతన్యంలో కేవలం ఒకానొక తేజో బిందువేకాదు, పాంచ భౌతిక మృత్తులో అది అమరమైన చిదగ్నికణం కూడాను. ఈ దృష్టితో వారు జీవితాన్నీ, ప్రకృతినీ, జీవుణ్ణి అవలోకిస్తారు.

అనంతరం వచ్చే రచయితలకు సౌందర్యానంద సంపదున్మేషం

వారికి అవలీల. పుట్టప్ప, ఆనంద కవులవంటి వారికి జీవితం విశ్వ సౌందర్యంలో ఆత్మయానం. పుట్టప్పకవికి పరమేశ్వరుడుకూడా సౌందర్యపారవశ్యస్వము. శిల్పాన్నీ, జీవితాన్నీ, హాయిగా సమీకరించి పుట్టప్ప సుసంపన్నమైన అనుభూతితో జీవిస్తున్నాడు. కవితా 'కళా సుందరి' కమరెప్పల అర్థవర్తులాకృతికి అతన్ని వశ్యం చేసుకొనే ఆకర్షణ శక్తి ఉన్నది. అతని రసికత అతి సరళముకాదు. అతడు శ్రీరామ కృష్ణ, వివేకానంద, అరవిందయోగీంద్ర ప్రభావ భావితుడైనాడని అతని రామాయణ కావ్యనిర్మితిలో అంతరార్థద్యోతకమయిన రూపకాతి శయోక్తివల్ల, విదిత మవుతున్నది.

ఏకమహాలక్ష్య సంజీవితమై, నైతిక, విచారణాత్మకము లేదా దార్శనిక మార్గరచనకూడా ఉన్నదని చెప్పకతప్పదు. హొన్న పూర్ణధ, తారానాధ, దివాకర, బుద్ధిహాలమధులు ఈ కోవలోవారు. వీరివి నైతిక సామాజిక వికాసము దృష్టిలోపెట్టుకొని వేస్తున్న రచనలు.

జ్ఞానయోగమార్గం అవలంబించిన రచయిత లున్నారు. శ్రీ అర వింద ప్రభావ భావితమయినవి పుట్టప్పరచనలు. ఈ సాహిత్యసామి తేయుల హృదయ దీపకళికా సముజ్జ్వలనానికి అరవిందయోగప్రభావం ప్రధానం. శ్రీ అరవిందులతత్త్వము సహేతుక విచారణాత్మకంగా జడచైతన్యములకు, వ్యష్టిసమాజములకు, తర్కసహజ జ్ఞానములకు చేసిన సమన్వయము. ఆయన తత్త్వము, సమగ్ర పురుషార్థమితిలో పరస్పర వ్యతిరేకాలయిన హేతువాద మర్మయోగములనూ, రసికతా సామ్యవాదాలనూ, ప్రవృత్తి నిదిధ్యాసలను సమరస పరుస్తున్నది. ఈ సరస సమన్వయంవల్ల బేంద్రేమధురచెన్న, గోకక్, ముగలి ప్రభృతులు అరవింద తత్త్వాకృష్టులు అయినారు. వారి చైతన్యంలోని వ్యష్టి జీవ సామాజిక పరిణామాలనే ద్వైతానికి సామరస్యం ఇంకోవిధంగా సాధ్యంకాదు. వీరు ఒక్కొక్కరూ వ్యక్తిగతంగా అనేక తీరులుగా ప్రతి స్పందితులవుతున్నారు. వ్యష్టి జీవాత్మకంగా ప్రధానంగా, మధురచెన్న పరిణమించినాడు. కవి తన గేయానికి మూలస్రోతస్సు తన అగాధ మైన అంతస్సులో అన్వేషించాలని తలచినాడు.

'చకచ్ఛకిత సౌదామినివలె దూరవర్తినీ నీ వెవ్వతెవే ?

క్షణక్షణం పరుగులెత్తెదవు—నాకాశ్చర్యము
తళతళ ఇక్కడ మిలమిల అక్కడ
వెలుగేసుందరి నీ వెవ్వతవే ?

అదినుంచీ పరిణామాత్మక ద్వైతభావం అధికంగా ఉన్నవాడు బేంద్రేకవి.

నాలో కల దొక వెర్రికోర్కె బహుకాలంనుంచీ
వలిపెంపు సుతారపుమబ్బుల తలగడ మొత్తముపై
స్మరణవ్యథనే పూర్తిగరోసి పరుండామని '

అనే కాల్పనిక భావోద్రిక్త భావచిత్రణ రూపించినకవి, నిజహృదయాంతర చిత్కాంతులతో, వర్ణాలతో, ఉత్తేజితుడయిన వాడల్లా, ఇలా కూడా రచన చేయగలడు :—

తిండిలేక పగమొంది, పోషణలేమి ఎదుగలేని
నిరుపేదలలో గొంతు పెల్లుబుకుతున్నది
భయం గొలుపుతూ గర్జిస్తున్నది, కూటికి వారాక్రోశిస్తున్నప్పుడు—
పుడమిలోన పాతివేస్తాం దేవుణ్ణి
దర్శిస్తాం ఆయన గోరి రాతిరి వేళ !
మానవుల మతాలకు అగ్గి రగిల్చి
ఆయన సమాధికి హారతులిస్తాం
మా యెడందలను ఊపి ఊపి
మృత్యు మృదంగం ధ్వనింపచేస్తాం !
ఆర్తరావముల హా హా రవాల
వెంటవెంటనే తరుముకు వస్తాము !
చచ్చీ చావక ఉన్మాదంతో
మహావిశ్వం ముద్దము చేస్తాం.

ఈ ఎనిమిది కూటాల రచయితల కూటాలవంటివే భారతప్రాంతీయ భాషా రాష్ట్రాల్లో ఉన్నాయి. భారతీయోజ్జీవనం ఈ మూసల్లోనే ప్రస్ఫుతమౌతున్నది. కొద్దితర తమ భేదాలున్నా. ప్రపంచంలో సంస్కృతి ప్రచార సాఫల్యానికి, అది సుసంపన్నము, బహుముఖమున్నా అయిన ఈ పమున్మేషంతో భారతదేశం ప్రపంచసంస్కృతి తన ప్రత్యేకపంచేశం

ఇస్తుంది. ప్రతి రచయిత విశ్వాసాలూ నిజపరిసర పరిస్థితులవల్ల, స్వభావముచేతనూ, భావితమవుతాయి. ఏ విశ్వాసాలయినా యథార్థాను భవ గోచరాలయితే, ఆప్రత్యయాలన్నీ సమంగా సాహిత్యంలో సుసంగతా లవుతాయి; అవి అతని రచనను అసంగతం చేయలేవు. గ్రంథకర్తలో నిగ్గును తేల్చడం అతని తత్త్వ ప్రతిపాదనను అనుసరించికాదు; అతని చైతన్యంలోని జ్వలత్ దీప శిఖాభాన తైక్ష్ణ్యమునుబట్టి, కోటును తగల్చ డానికి టోపీ తగల్చడానికి ఉపయుక్తమయ్యే మేకువంటిది తత్వ శాస్త్రము. ఆ మేకూ, ఆ ఆధారం కాదు కావలసింది. ఆ టోపీ ఆ కోటు లేదా పలురంగుల కోటో అదీ ముఖ్యము.

అయితే నిశితంగా పరిశీలిస్తే, యథార్థం తప్పక ప్రకటిత మవు తుంది. ఈ సాహిత్య మార్గాల కృషి యావత్తూ సమ్మిళితమవుతున్నది. సంపన్న నవజీవనంలో, సవ్యసంశ్లిష్ట వ్యష్టి సమిష్ట్యా లోకంలో ఏకా కృతి చెందుతున్నది. యథార్థవాదంవల్ల సమాజపు పునాదులు క్షాళిత మవుతవి. అజ్ఞానాన్నీ, మోసాన్నీ, మూఢవిశ్వాసాన్నీ యథార్థవాదము నిర్మూలిస్తుంది. దానివల్ల వ్యక్తిలో అచంచల ఋజుత్వమూ, శీల సమ గ్రత ప్రవృద్ధమవుతవి. సమ్యక్ సంస్పృష్టమైన అభ్యుదయవాదము, నిర్నిరోధ స్వతంత్రవ్యక్తి వికాసోన్నతికి అవకాశ మొసగు పునర్వ్య వస్థీకృతమగు సమాజము, పునర్నిర్మిత సాంఘికాదర్శమును సమర్థి స్తుంది. మన ప్రజలకు పరంపరా ప్రాప్తమయిన మూలధార్మిక విశ్వాసాలను అసంవృతం చేయడంలోనూ, ప్రతి దానిలో ప్రధాన విషయ సమైక్యము సిద్ధింపచేయడంలోనూ, సంప్ర దాయవాదం పరాయణమయతే, మనసుకు ప్రసన్నత నిచ్చే హేతువాదము సిద్ధాంత ప్రోద్బలాన్ని నిరోధించి, విశృంఖలమైన, వివృత చక్షువుతో అనుభవాన్నీ చైతన్యాన్నీ ఉత్తేజపరచడానికి, జిజ్ఞాసను రేకెత్తిస్తుంది. నైతిక ధార్మికవాదము క్రమబద్ధమైన సామాజికా దర్శం కోసం, వ్యక్తి శిక్షణకోసం ఏర్పడింది. మానవవాదము మన ప్రజానీ కంలో హృదయ మేధస్సులకు అపూర్వసుకుమార భావుకత్వం కలిగి స్తుంది. రసికతావాదము వారిలో సౌందర్య ప్రీతిని పాదుకొలుపుతుంది. జీవకేంద్రకంగానూ, విశ్వవ్యాప్తంగానూ, జ్ఞానయోగము వారికి సుసం

వన్నమైన సూక్ష్మేంద్రియ గ్రాహత కలిగించి, ఉచ్చతరసత్ భూమికల నిచ్చి వ్యష్టి జీవ వికాసోన్నతికి పరిమితులేర్పరచక, సంకల్ప వికల్పాత్మక మనస్సుకు మారుగ బుద్ధిని ఏర్పరచి, చిత్తవృత్తి పరమాత్మయందు లీనముకాగా, పుడమిపై నవస్వర్గము నిర్మించే రహస్య శక్తిని మానవుడికి ద్యోతకము చేస్తుంది. మరేదీకాదు ఇదే భారతీయోజ్జీవన లక్ష్యమూ, సాధనమున్నూ, అవుతున్నది. భిన్నకేంద్రాలనుండి ప్రవర్తిల్లిన ఏతద్బహుముఖ ప్రవృత్తికి సాహిత్యము స్వచ్ఛ ప్రకాశకసాధనము. కాని ఈ భిన్నత్వములో ఏకత్వం ఉన్నది. ఇది భారతీయ జీవనం ప్రావించు నవ్యసం శ్లిష్టైక్యస్వరమేళనము.

ఆధునిక కర్ణాటక సాహిత్యము ఈ సంశ్లిష్టమైన అగాధాలను అన్నింటినీ మ్రోయించిందని చెప్పలేము; లేదా జ్ఞాన పర్వప్వహ్నాదిలో సంవేదనం ప్రవేశించిందని చెప్పడానికి వీలులేదు. ఈనాడు మన సాహిత్యము నవ్య సమన్వయానికై యత్నిస్తున్నది. యావత్ భారత దేశంలో వలెనే; దాని ఆరంభము జంకుతోకూడి యుండుగాక! ప్రత్యేక సౌందర్యాన్వేషణ యాత్రలో ఇటునుండి అటు అటునుండి ఇటు ఎన్ని మార్పులైనా ఉండుగాక!

## ఆకరగ్రంథ జాతము


A History of Kanarese Literature.
*by E. P. Rice*

The Heritage of Karnataka,
*By Dr. R. S. Mugali*

Populer Culture in Karnataka.
*By Masti. Venkatesha Iyangar*

Literature in the Modern Indian Langueges,
*Edited by V. K. Gokak—Publications division, Ministry of Information, Govt. of India*

Linguistic Survey of India.
*By G. A. Grierson Vol IV, pp. 362—384*

# కాశ్మీర సాహిత్యము

పి. యన్. పుష్ప

## ఉపోద్ఘాతము

ఆధునిక కాశ్మీర సాహిత్యము గత అర్ధశతాబ్దిలో బాల ప్రౌఢిమతో పెరిగిన బిడ్డ లేదా కాశ్మీరంలో సామాజిక సంస్కృతి వికాసము అకాల పక్వమైందని అనవలెను. భారతదేశంలో శతాబ్దికాలంలో ప్రముఖ సాహిత్యాలు సాధించగలిగినది. కాశ్మీరములో మూడుదశాబ్దాలకన్న స్వల్ప కాలంలో, గుణవిశిష్టంగా సాహిత్యము పరిపాకము పొందడానికి యత్నించింది. ఆరు శతాబ్దాలపైగా సంచితమైన సుదీర్ఘ సంస్కృత పారశీక సంప్రదాయసాహిత్యపు సౌష్ఠవమైన వారసత్వము, నిస్సందేహంగా కాశ్మీర సాహిత్యానికి కలదు. అయితే అది రాజభాషగా ఎన్నడూ లేదు. లౌకిక సాహిత్యానికి సాధనగా కాశ్మీరభాషకు (15 క్రీ. శ) జైన్-ఉల్-అబిదీన్ వంటి విదగ్ధుడు ఉదారపోషణ కల్పించినా, అది సుల్తానులరాజభాష అయిన పారశీకభాషనువిడిచి స్వతంత్రంగా శక్తివంతంగా ప్రవృద్ధము కాలేదు. బంగాళీ; గుజరాతీ, మరాఠీవంటి ఆధునిక భారతీయభాషలు ప్రాంతీయ అపభ్రంశ ప్రాకృతాలనుండి ఉద్భవించినట్లు, కాశ్మీరభాషకూడా అపభ్రంశమునుండే ఉదయించినా, దానికి రావలసిన మాన్యత రాలేదు. విదగ్ధులుకూడా ఆ భాషను వాడడానికి సిగ్గుపడేవారు. కాకపోతే కృతకంగా గాన యోగ్యమయిన కృతులకు మాత్రము ఆ భాష ఉపయోగించినారు, అధికంగా పారశీకపు ఒరవళ్ళను గుడ్డిగా అనుకరిస్తూ. అనంతరం పాలకులు భాషాసాహిత్యాలతో ప్రమేయము పెట్టుకోక చూపిన ఉదాసీనతవల్ల సాహిత్యశిల్పి అవకాశము తీసుకోవలసింది. అయితే రాజకీయంగా శాంతిభద్రతలు చాలా కాలం లేకపోవడంచేత, సాహితీవేత్తకు సృజనావకాశము కలుగలేదు.

ఆదిలో కాశ్మీరభాష ఆధ్యాత్మిక మర్మయోగాత్మకమైనప్పటికీ, అకృత్రిమ ప్రజానీక భావవ్యక్తీకరణానికి అనుకూలించక తప్పలేదు. క్రీ. శ. 13 శతాబ్దిలో శితికంఠుడు జనామోదము కలిగించే తాంత్రిక స్తోత్రరచన చేయడానికి 'సర్వగోచర దేశభాష' అయిన కాశ్మీరభాష బాగా అనుకూలమైనదని దానివైపుకే మొగ్గినాడు. ఇలా ఉన్నప్పటికీ, ప్రాథమికంగా సంస్కృతంతోనూ, కాశ్మీర భాషకూ సంబంధం ఉన్నది.

సంస్కృత పారశీక ఉరుదూభాషలు ఏకాధికారము చలాయించినా, కాశ్మీరభాష వివిధదశల్లో రుద్ధగతులతో సాగింది, మనగలిగింది. ఆ యా భాషల్లోంచి స్వీకరించడానికి అర్హమైన దాన్ని స్వీకరించింది. భావనాశక్తి అవగాహన చేసుకొన్నది. అందుచేతనే అది నిలవగలిగింది. సహజంగా నేడు కాశ్మీర భాష గోచరిస్తుందేకాని, హైందవకాశ్మీరి, ముసల్మాను కాశ్మీరి అనే భేదము గ్రియర్సన్ పరిశీలించి నటువంటిది కనబడదు. కాశ్మీరీయుడికి కనిపించేది కాశ్మీరభాష మాత్రమే. కాకపోతే ప్రాంతీయాలవల్ల. భాషా వ్యత్యాసాలు కొన్ని వచ్చాయి, అంతేకాని మతాన్ని అనుసరించికాదు. ప్రజానీకం రకరకాల వృత్తులు అవలంబించడంవల్ల, దాన్నిబట్టి ఊహాపోహలు పలుకుబడులూ మారుతూ ఉంటాయి. నగర జానపద వ్యవహార భేదాలవల్ల కాశ్మీర భాషలో ప్రాంతీయాలు వచ్చాయి. శ్రీనగరానికి ఉత్తరాన మారజ్ వాస్తవ్యుల భాషకూ, శ్రీనగరానికి దక్షిణాన కామరాజ వాస్తవ్యుల భాషకూ కించిత్ తారతమ్యము ఉన్నది. దానితో పోల్చినప్పుడు హైందవకాశ్మీర, ముసల్మాను కాశ్మీరములనే వాటి భేదము అతిస్వల్పమగుటచే గమనార్హము కాదు.

ఇప్పటికి కొద్దికాలం క్రిందటివరకూ ప్రాథమిక పాఠశాలల్లో కాశ్మీరభాష కనీసం పాఠ్యవిషయంగా నయినాలేదు. ఇందుకు విచారించాలి. అందుచేతనే కాశ్మీరంలో పత్త్రికా ప్రకాశనం వృద్ధికరంగా లేదు. వచనరచన గుణవిశిష్టంగా నిలవ తొక్కుకోడానికి చూడాలి. దీనికి సృజనాత్మక ప్రజ్ఞాలోపం కాదు కారణం. ముద్రణ సౌకర్యాలు లేకపోవడం కారణం. దానికితోడు పాఠకలోకముకూడా అంతంతగానే

ఉన్నది. దేశభాష అధ్యయనం చేస్తే, జీవిక నడిచే దారిలేక పోవడం వల్ల, కాశ్మీరభాష పఠన పాఠనాల్లోలేదు.

కాశ్మీరభాషలోనే ఆ నుడికారంలోనే జీవము ప్రజల జీవితాన్ని పూర్ణంగా ఔచిత్యంతో చిత్రించడం సాధ్యమా అనే సందేహమక్కరలేదు. ఈ ప్రశ్నకు గట్టిగా అవును అని సమాధానమియ్యడానికి కథానికల్లోనూ, అప్పుడప్పుడు అచ్చయిన వచన రచనల్లోనూ అవకాశం దొరుకుతుంది. అక్తార్‌మొహిద్దీన్ రచించిన 'సత్‌సంగార్', సప్తశృంగాలు, ఘనౌన్న త్యాన్ని చూపింది, సోమనాథ్‌జుత్‌షి, ఉమేకౌశల్, రోషన్, నదీమ్, పార్వన్ ప్రభృతులు సాహిత్యంలో పరిశోధన చేసిన తరువాత. ఇటీవల కామిక్, అలీమహమ్మద్‌లోనే ప్రభృతులు (తాజ్‌బేగమువలె) సాహిత్య క్షేత్రంలో అగ్రగాముల ఆశలు దృఢపరుస్తున్నారు. నాటకరచనలోకూడా వర్ధమాను లున్నారు. వారు పుష్కర్‌ఖాన్, అలీమహమ్మద్‌లోనే, కామిక్, జుత్‌షి, రోషన్‌వంటివారు. జగన్నాధ్ వలీ (తన 'జూన్' లో, హబాఖటూన్‌మీద), మొహిద్ - దీన్ - హాజినీ (తన (శిన్త్‌సుంద్‌గర) నాటకరచనకు మార్గదర్శకులయినారు. ముప్పయ్యేళ్ళకు పైౖ కాలము క్రిందట పౌరాణిక హరిశ్చంద్ర కధను, సతబ్ కహవత్' (సత్యపు గీటు రాయి) అనే నాటకాన్ని, నందలాల్‌కౌల్ మండలూ రచించినాడు. అప్పుడు సామాజిక నాటకాలు ఆడాలని కాశ్మీరీయ నాటకరంగ స్థాపనకు ప్రయ త్నాలు జరిగినవి. మళ్ళా బహుకాలానికి ' కునికథ్ ' (ఒకటే గాథ) అనే పేరుతో సామాజిక నాటకాలు మూడేళ్ళ క్రిందట అచ్చయినవి. అయితే దురదృష్టవశాన కాశ్మీరభాషలో మొదటి నవల ఇంకా అచ్చు కావలసి ఉన్నది. ఈ ధోరణిలో సాగించిన సాహిత్యరచనలు ఇంకా అముద్రితం గానే ఉన్నవి. నవలాకర్తలు కనీసము మూడు నవలలు (అఖ్తార్, కామిక్, లో నేల ఒక్కొక్కపుస్తకము) ప్రకటించడానికి అవస్థపడు తున్నారు. అవి అచ్చయితే నిజంగా నవలాశాఖలో సరస సాహిత్యా రంభమన్నమాట.

ఈ రచనలు సంవిధానములోనూ, నిర్మాణంలోనూ అభివృద్ధిని కనబరచలేదు. అయితే వాటి ఇతివృత్తం కాశ్మీరంలో నవజీవనోదయాన్ని సూచిస్తూ ఆ మట్టిలోని పరిమళముగుబాళింపచేస్తుంది. సంచారక రాజ

క్రియవాది, జాగృతి పొందుతున్నరైతు, అంతరించిపోతున్న దళారి, చెమటోడ్చిపాటుపడే కార్మికుడు, చురుకుగా పడవనడిపేవాడు. దుర్బల చిత్తులైన గుమస్తా, విలాసంగా కులాసాగా కాలంగడిపే సోమరిపోతు, వినయపతులైన దయనీయ స్త్రీలు - అందరూ స్వేచ్ఛవ్యవాయువు పీలుస్తూ పరివర్తనశీలమయిన ప్రపంచంలో, నూతన సమస్యల్లో కలగ చేసుకొంటున్నారు. నిస్సందేహంగా ఇటువంటి రచనకు ఉజ్జ్వల భవిష్యత్తున్నది అని ఉత్సాహపడుతున్నారు అయితే రచనలు చాలావరకు ఇహ జీవితంలోని విషాదవాస్తవంతో కూడినవి. ప్రస్తుత కాశ్మీర కవిత్వంలో స్పష్టంగా ముదావహమైన ఇదే ధోరణి కనబడుతుంది.

## గత పారంపర్యం

మందగతిలో ఇంకా పారాడుచున్న కాశ్మీరగద్యవలెకాక, కాశ్మీర పద్యకవితకు అధికోన్నతీ, విశిష్టగుణమున్నూ సంక్రమించినవి. కాశ్మీర పద్యసాహిత్య సంప్రదాయం 13 శతాబ్దినాటిది. అప్పుడు శితికంఠుడు 'సర్వప్రజావగాహన' కలిగేభాషనే ఎన్నికచేశాడు. తన 'మహానయప్రకాశ' రచనా సందర్భంలో, నిజానికి ప్రజాభాషను తొలిసారి జనప్రీతిగల మతవిజ్ఞానాన్ని వ్యక్తీకరించడానికి అనుకూలమయిన ధని దానిని అవలంబించివారు. అయితే శీఘ్రమే అది అన్య సాహిత్య వ్యాపంగాలుకూడా చేయసాగింది. తత్కాలీన కాశ్మీరము రాజకీయ సంక్షోభంవల్ల చిక్కులు పడింది. శైవసిద్ధాంతమునకు ముసల్మాను ఘర్మయోగులచేత ప్రోక్తమయిన సూఫీతత్వంతో తప్పనిసరిగా కలిగిన సంబంధంవల్ల నవ్యసామాజిక సాంస్కృతిక విధానాలు ఏర్పడ్డవి. మాత్నమైన ఈ సమన్వయం లాల్‌దేద్ (14 క్రి. శ) సూక్తులలో సువ్యక్తమైంది. ప్రబోధాత్మక పద్యకవిత్వం చెప్పిన షేక్‌నూర్‌ఉద్‌దీన (నందఋషి) అనే ఆమె సమకాలిక రచయితలోనూ, ఈ సమన్వయము గోచరిస్తుంది. లాల్‌దేద్‌వల్లు వాక్కుల్లో మర్మయోగాత్మక కాల్పనిక భావం బ్రహ్మభావంగా ప్రజ్ఞాన ఘనమవుతుంది. సృష్టిలో అంతర్యామిగా ఉండికూడా సమస్తాన్నీ అతిక్రమించే ఈ ప్రజ్ఞాన ఘనబ్రహ్మలో విషయి విషయాల విశిష్టమయిన ఓతప్రోతమయిన అల్లిక ఉన్నది.

నందఋషి చెప్పిన కవిత్వంలో భౌతికాధ్యాత్మిక సామరస్యం గాఢంగా వ్యక్తంచేస్తున్నారు. ఈ కవియోగులిద్దరూ కబీర్ ఆగమనానికి దారి చూపినారు: అంతరమైన శిక్షణావశ్యకతను దృఢంగా చెప్పినారు. ఆధ్యాత్మికమయిన ఔదాసీన్యమూ బాహ్యాచారాలమీద సమరధాటినీ, చూపినారు. హైందవ ఇస్లాము ధర్మాలు వారి కవిత్వంలో ఉభయ సామాన్యమైన నుడికారంలో వ్యక్తమైనాయి. ఆధ్యాత్మికమైన ఏకత్వము సాంఘిక సమత్వమూ, మానవ సౌభ్రాత్రమూ — సర్వసిద్ధాంతాలనూ, వర్ణాశ్రమాలనూ విచ్ఛేదంచేసే ఉద్రేకంతో — ఉద్బోధితమైనాయి.

అనంతరం ఈ సాహిత్యవికాసానికి పారశీకపు 'మస్నవీ' అనుకూలమయిన సంవిధానాన్ని వీర్పరచింది. మహమ్మద్‌గమీ మర్మయోగ సంప్రదాయాన్ని కొత్తదారిలోకి మలచినాడు. యూసఫ్‌జులేఖా, లైలామజునూ, గుల్‌రేజ్‌వంటి పారశీక మహాకావ్యాలు, కాశ్మీర పాత్రలతో రూపకాతిశయోక్తిగల అద్భుత సాహసగాథలవలె, ఓజస్సుగల స్వతంత్ర రచనలవలె సహృదయులకు తోచాయి. హీమల్ సాహిత్య శిల్పానికి ఉజ్జ్వలదృష్టాంతం. దాని కథనం వలీ ఉల్లామతూకృషి, దాని భావగేయాలు జరీఫ్‌కవి ప్రతిభా సముల్బణఫలితము. కాని అద్భుతంగా సౌష్ఠవంగా ఇద్దరికృషీ సమన్వయమైంది ఈ కావ్యంలో.

గత రెండు శతాబ్దాల్లో దీర్ఘకథన కావ్యాలమీద వెట్టి అధికమై ఉండేది. అలాంటి కావ్యరచనాప్రయత్నాలు అప్పటికీ బహుశతాబ్దాల క్రిందటనే సాగినవి. 15 వ శతాబ్దిలో సంస్కార ప్రియుడైన జైన్ ఉల్ ఆబ్‌దీన్ సుల్తాన్ కొలువులో, కవులు ఫిర్ - దూసీకృతమైన 'షానామా' ను కాశ్మీర భాషానువాదము చేయడమేకాక, 'బాణాసురవధ' అనే మహాకావ్యాన్ని, 'జైనచరిత్ర' అనే జీవిత కథాకావ్యాన్ని, 'జైనవిలాస' మనే నాటకాన్ని కాశ్మీర భాషలోనే రచించినారు. ఆ కవితా పోషకుడు మరణించడంతో గ్రంథాలు ఆనాటివి ఖిలమైనట్టు కనబడుతుంది. 19 వ శతాబ్దిలో ఈ సంప్రదాయం తిరిగి తలయెత్తింది. మహమ్మద్‌గమీ మర్మయోగాత్మక, కాల్పనిక భావోద్రిక్త రచనల నిమిత్తము ఈ సంప్రదాయము పాటించినారు. శివకృష్ణులకు సంబంధించిన జానపద సంప్రదాయంవల్ల భావోద్రేకముచెంది, పరమానందుడు ఈ సంప్ర

దాయానికి నూతనజ్జీవము కూర్చినాడు. ఆయన రచించిన రాధాస్వయం వరము, సుదామచరితము, శివలగ్నము అనే మహాకావ్యాల్లో వైష్ణవో ద్రిక్తత శైవత్యాగమున్నూ మేళవించాయి. వానిలో పురాణసంబంధ మైన ఇతి వృత్తాలు స్వీకరించినా, అవి సమాజహృదయాన్ని చూఱ గొన్నవి. 18 శతాబ్దిలోని ప్రకాశరామ కురిగమి రచించిన 'రామావతార చరితము' చాలకాలము కిందటనే ప్రజామోదము పొందింది. 19 శతాబ్ద ములో వహబ్‌పరీ రచించిన ఐతిహాసిక కథన కావ్యమున్నూ కొత్తదారి తొక్కినది

లాల్‌దేద్ షణితుల్లో అదివరకే భావగీతాసరణి ఉన్మీలితమై హబఖటూన్, అర్నిమల్ కవుల ఉద్రిక్త కావ్యాలాపాల్లో సంపుల్లమైంది. నిజానికి 16 శతాబ్దిలో హబఖటూన్ సాహితీ సంప్రదాయమును (ఆమె యూసఫ్‌షాహచక్ యొక్క ప్రియురాలు, నేర్పుకలది.) సృజనాత్మక సాహితీ ప్రవృత్తినీ ఉద్ధరించినది. రైతాంగంలోని ఒక యువతి రాజ్ఞీవైభవాన్ని పొందింది. ఆమెవల్ల ఇహజీవనోల్లాసం కాశ్మీర భావగీతాల్లో వెల్లివిరిసింది. ఆమె గీతాలాపాల్లో ఆమె కరుణార్ద్రహృదయం పొంగిపోయింది, మధుర మందహాసంతో, అశ్రుఝరులతో, అసలు ఆ యుగమే ఆమె గీతాలాపాలతో మురుమ్మరించగా, 18 శతాబ్దిలో అర్నిమల్ అనే బ్రాహ్మణ పతి పరిత్యక్త, పారశీకకవయిత్రి కాశ్మీర భాషలో అతి సుందర భావ గీతాలు రచించింది. ఆత్మాశ్రయ, ఆత్మాంతర భావో ద్రిక్తురాలై అప్రయత్నంగా, భావకవితాలాపనం చేసింది. అనంతరం ఆసరణి భక్తిగా పరిణమించింది. తత్ఫలితంగా 'లీలా–నాట' అనేవి ఆవిర్భ వించినవి. కృష్ణరజదన్, నజీం జానపదగీతికా ధోరణి అవలంబించి సంపన్నంగా కవిత్వము చెప్పినారు. అయితే ఈ నాటివరకూ మర్మయో గాత్మక భావగీతాత్మకత, అవ్యాహతంగా ప్రవహించి ప్రవహించి, (జిందాకౌల్) మాష్టర్ జీ [1] కవిలో ఆధ్యాత్మిక మానవ వాదంగా పదా కోటిని ప్రాపించింది.

---

1 స్మరన్ అనే పద్యకావ్యం సాహిత్య అకాడమీ వారి పారితోషికం 1956 లో పొందింది —సంపా.

కాశ్మీర కవిత్వంలో సూటిగా సమకాలీన జీవితము గత శతాబ్దాంతంలోనే ప్రతిబింబింపసాగింది. మఖ్‌బూల్‌క్రలవారీ, వాహబ్ పరీలు హేళనాత్మక రచనచేసి, ప్రస్తుతం మనము వాస్తవిక కవిత్వమని అంటున్న దానికి మార్గము ఏర్పరచినారు ఆయుగములో చాలమంది కవికుమారులు సాహిత్య ప్రక్రియలను, అవహేళన, వ్యంగ్యచిత్రణ, హేళనానుకరణ, విషాద సుఖసమ్మిళిత నాటకము, గేయగీతి, జానపద నాట్యగీతి, గజలు వంటివానిని అవలంబించినారు. రసూలు మీర్‌కవి ఘజల్ ఇంతకు పూర్వంలేని విషయాసక్తిని, వీడని మాధుర్యాన్ని కూర్చినాడు. మీర్ రచించిన గజలు కవిత మహ్‌జూరును (1885—1952) ప్రోత్సహించినవి. మహ్‌జూరు ఆధునిక కాశ్మీర కవిత్వానికి అగ్రగామి.

## సమకాలిక దశ

గత రెండున్నర దశాబ్దాలనుంచీ సాగుతున్న కవితలో, కాశ్మీరీయుల సామాజిక రాజకీయ జాగృతి, జమీన్‌దారులవల్ల అనుభవిస్తున్న దాస్య విచ్ఛేదనకు వారు చేసిన మహాసంఘర్షణమున్నూ ప్రతిఫలించాయి. నవకాశ్మీరంకోసం ప్రజానీకంలో రేకెత్తిన చైతన్యంతో, కన్నకలలు కూడా ఆ కవితలో భాసించాయి, నిద్రాణమైన ప్రజలను మేలుకొలిపి, చైతన్యోదయము కలిగించిన ప్రథమ కవి నిజంగా మహజూరు. ఆయన దేశభక్తితో జాతీయ భావముతో కావ్యగానము చేసి కాశ్మీర కవితకు, నవ్యధోరణినీ, దృష్టినీ, కలిగించినాడు. అనూచానంగా కవులు వాడే గుల్ (గులాబి), బుల్‌బుల్ (కోయిల), బంభర్ (తుమ్మెద), అతి పరిమళముగల 'యాంబర్‌జాల' కుసుమము వంటి భావప్రతీకాలను కవులు నవ్యదృష్టితో ఉద్బుద్ధమవుతున్న భావానికి అవశ్యకమయిన తీరులో వీక్షించినారు. మహజూరు నవ్యసాంకేతిక పద్ధతి నవ్యభావానుకూలంగా ఏర్పరచినాడు. ఆ భావప్రతీకలనే రక్షణవల్లనే, అధికారులుచేసే నిషేధాలను తప్పించుకో గలిగినాడు. జమీందారుల నిరంకుశత్వమునుంచి ప్రజలను సామాజికంగా రాజకీయంగా, మానవచైతన్యంతో జాగరితులను చేయడానికి అతడు చేసిన యత్నానికి నవ్యప్రతీకలు లేనిదే అతడు చెరసాలలో పడకుండా తప్పించుకోడం

ఎలా సాధ్యమవుతుంది ? అయనకు సమకాలికుడూ, చిన్నవాడునూ అయిన, అబ్దుల్ అహ్మద్ అజాద్ వ్యంగ్యవైఖరిలోకాక, భావాన్ని సూటిగా చెబుతాడు. అయన పద్యము జాతీయ భావోద్రిక్తమై ఓజోమయమై ఉంటుంది, అతడు మత మౌఢ్యాన్ని, కులద్వేషాన్ని జాతీయ ప్రాంతీయ భావ సంకుచితత్వాన్ని - అంతేకాదు, అన్నిరకాల ప్రత్యేకాభిమానాలనూ, (తనది తప్ప) శక్తివంతంగా చెండాడినాడు వ్యక్తి విచక్షణలేని వర్గరహిత సమాజ స్థాపనకై ప్రజలధాటితో ఉద్బోధన చేసినాడు.

ఆ రోజుల్లో కాశ్మీరము అమానుషమైన బాధలు పడింది. సామంతుల రాజరికంవల్ల, సామ్రాజ్య ప్రతినిధిగల రాష్ట్రం కావడంచేతనూ, ద్వంద్వ ప్రభుత్వంవల్లనూ, ప్రజలు బాధపడుతూన్నవారిని తీవ్రంగా నిరోధించవలసివచ్చింది. ఈ సంఘర్షణలోని 'వీరుల'ను గూర్చి తన 'మగర్‌కరవాన్‌సోన్' అనే గీతంలో అరీఫ్ కావ్యగానము చేసినాడు. (అయితే మన బిడారులగుంపు స్వేచ్ఛగా పట్టుదలగా ముందుకు సాగిపోతూనే ఉన్నది.) కాశ్మీర సాహిత్య వాతావరణము యావత్తూ క్రాంతికి. సంబంధించిన ఉత్సాహమువల్ల శక్తి ప్రేరితమైంది. ఫలితంగా కూలీకవి ఆసీ జమీన్‌దారీ విధానపు మహాభారముమోసి, హాహాకారాలు చేస్తున్న కర్మకారుల కష్టాలనూ, దుఃఖాలనూ చిత్రించగా, మాష్టర్‌జీ మర్మయోగి గాఢమూ, సరళమూ, అధునికమూ, అయిన ధోరణిలో కేవలం అమరకాంక్ష, అమర ప్రశ్నలేకాక కాలవాహినిని తరింపచేసి, వర్గరహితమై ఐక్యప్రాయమైన మానవ సమాజములోకి సాంసారికంగా కులాన్ని, జాతీయ అంతర్జాతీయ జీవితమునూ సమ్మిశ్రితిలో సమరసపడిన సమాజములోకి వెళ్ళాలని కావ్యగీతాగానము చేసినాడు.

అడవిజాతులదాడి స్వాతంత్ర్య సంఘర్షణను విద్యుత్ప్రేరితంచేసి ప్రజా ప్రతిఘటనగా పరిణమింపచేసింది ఆ సమయంలో సాహిత్యం ఆ స్థితిలోఉన్నది. కాశ్మీరంలో 1947 సంవత్సరపు శిశిరము రాజకీయ జీవితాన్ని పూర్తిగా మార్పుచేయడమేకాక, దేశంలో సర్వోత్తమ పారస్వత సంస్కృతి సంప్రదాయాలనుకూడా పునః శక్తివంతము చేసింది.

ఆ నవ్య సాంస్కృతికోద్యమ సంధానకర్తలలో నదిమ్‌కవి ఒకా

నొక అగ్రగామి. ఆయన భవిష్యత్తులో ప్రబలవిశ్వాసి ఆయన వర్ధమాన కాశ్మీరయువకవి. ఆయనకు రోషన్, రాహి, ప్రేమీ ప్రభృతులగు తరుణకవి బృందము తోడయింది. అప్పటికే సాహిత్యకృషిచేసిన ఆరిఫ్, అరీజ్, అంబర్దార్, ఫజిల్‌వంటి కవులుకూడా నవ్యకవితామార్గానికి అనుకూలురైనారు. రచనోత్సాహులు చాలానుంది నవ్యాశయాలనూ, ఆకాంక్షలనూ. జన్మభూమి భావిస్థితి ప్రమాదకరంగా సందిగ్ధావస్థలో ఉన్నప్పుడు దాన్ని నేపధ్యముగాచేసి, కవిత్వము చెప్పినారు. కవులందరినీ ఆశీర్వదించడానికి మహజూర్ కవీంద్రు డున్నాడు.

ఆ అడవిజాతులదాడిని వ్యతిరేకిస్తూ కాశ్మీరంలో ప్రజలకోపం తరంగాలై పొంగింది. దేశభక్తి కవిత్వంగా పొంగులెత్తి, సమాజవ్యతిరేకశక్తులనూ ప్రజాతంత్ర వ్యతిరేక శక్తులను, ప్రతిఘటించే సర్వప్రజాశక్తులనూ సంఘటితముచేసింది. రాజకీయ ఆర్థిక, దాస్యబంధ విముక్తికై ప్రజల నవ్యనిశ్చితాన్ని విశిష్టంగా చూపుతూ నదీమ్‌కవి 'స్వచ్ఛం నా యౌవ్వనం' అని రచించినాడు. ఆ సమయాన కాశ్మీరంలో ఆంతరంగికంగా శాంతి సామరస్యాలు అత్యావశ్యకాలు. అందుకుగాను కవి స్పందించి ఉద్యమాన్ని శక్తివంతముచేస్తూ, దేశీయ సాంస్కృతిక పారంపర్యం సమస్తం అమూల్యమైనదని గట్టిగా చెప్పినాడు. ఆయన తన దేశీయ ప్రజలకు వ్యవసాయ సంస్కరణ ప్రాముఖ్యాన్ని, అన్యాయపు వడ్డీలను, వ్యవసాయక ఋణాలను విమోచనచేయడంవంటి అవసర విధానాలనుగూర్చి కవిత్వము చెప్పినాడు. కృషికుడు భవిష్యత్తులో వహించవలసిన నూతన పాత్రను గూర్చి దృఢంగా చెప్పినాడు.

'పుడమి తల్లి నొసట హాలికుడు ఏటేటా కొత్త అదృష్టరేఖను లిఖిస్తాడు. నాగలితో, గాయపడిన ధరణిని మళ్ళీ పొందేందుకు, ఆమెనుదుట కోపరేఖలు, వదనసీమ వళులను ఆమెకంటి మసక తెఱను పారదోలేటందుకు' కవి కర్షకుణ్ణి పిలుస్తాడు.

పవనము కవితో ఇలా అంటుంది :—

"గులాబి క్రోధారుణ వీక్షణాలు తిలకించాను. నిర్ఝరాలకు నవశక్తివిప్లవోద్ధూతమైంది. పూలతో గడ్డి ఉత్సాహంగా పంతగిస్తున్నది. నిత్యమూ పరుగులెత్తే జలపాతం కొత్త పట్టుదల నేను గ్రహించాను.

తమాల తరువు శిలవలె ప్రధిమతో ఉండడం చూచాను. గడ్డిపోచలు లేచి నిలిచాయి.''

ఆయన ఎడద ప్రకృతిలో ఉల్లాసం గమనించి గంతులువేస్తుంది ;

''సానువులనుండి జలపాతం ముత్తియంపు జిలుగు తళతళలాడు మేలిముసుగుతో వేబోక నిదురలేచింది. చందమామ సన్నగిల్ల శిలపై యౌవనోద్దాముణ్ణి, తరుణుణ్ణి అనుభవించి సంతసించాలని వచ్చింది.'' కాని కవికి చాలా బాధగా ఉంది 'కార్మికుడి వాటా కాజేసి, ఆసామీ సొమ్ము చేసుకొని, విపణికీ విపణికీ సగర్వంగా తిరిగి, మానవ మాంసము అమ్మచూపుతున్నాడు.''

రాష్ట్రంలో నూతనార్థికాభివృద్ధిని సూచించే లక్షణం-కార్మిక సమస్యను ఇతి వృత్తంగా కవులు స్వీకరించడం, గతించిన కొన్నేళ్ళ నుంచి జానపద సాహిత్యరూపాలైన, చేలూడ్చే సమయంలో పాటలు, ఊయెల పాటలు, జోలపాటలు, కూలీల పదాలమీద జనప్రీతి అధికంగా ఉంటూ వచ్చింది. రోషన్ సొగసుగా కాశ్మీరంలో అందాల ఋతువుల శబలిత వర్ణాలకు మురిసి స్వాప్నిక కల్పనలు చేసి చక్కని కావ్యాలు రచించాడు. వాటిలో సామాన్య మానవుడు తన తన బహుముఖ ప్రవృత్తిలో ఉండికూడా శాంతి సంపదల కోసం గాఢకృషిచేయడం మనకు గోచరిస్తుంది ప్రేమికూడా కర్మకారుల జీవితము బహుముఖాల పరికించినాడు కలుపుతీసే పాటలు, ఊడుపులపాటలు, మహస్సూలుపాటలు, పసుపుకొమ్ములు ఏరే పాటలు ముఖ్యంగా హాయిగా ఉంటాయి. 'హమూద్' (పంటకారు) అనే అతని నృత్యగేయంలో మారిపోయిన రైతాంగం, అద్భుతల యావేశం చిత్రించాడు.

సంధియుగము ఎప్పుడూ చీకాకు కలిగిస్తుంది; విసిగిస్తుంది. ప్రజలు తమ అభివృద్ధి తగినంత శీఘ్రంగా లేదని అశాంతులై ఉంటారు. అందుచేత అది భ్రమానిరాసం కలిగించి ఉండడంలో ఆశ్చర్యంలేదు. నవ్యవ్యవస్థకావాలని గగ్గోలు పెట్టిన కవులంతా ఒకానొక సమయంలో విఫలులై నిట్టూర్చినవారే. సామాన్య మానవుడుపడే యాతన, సామాజిక దోషాలవల్ల తీవ్రమైంది. ఆ యాతనకు అంతర్విభాగాలున్న రాజ్యతంత్రపు తెలివిమాలిన పనులు తోడయినాయి. అందుచేత కవి ఎలుగెత్తి

చీకటి బజారును, అవినీతిని, గర్హించినాడు. కీ శే మహజూరు కవి రచించిన కొన్ని గజలులు, ఆరీఫ్‌కవి రచించిన చతుష్పాద ఛందోయుత కవిత్వము యావత్తూ, తీవ్రఅవహేళనతో, 'పురాతన వ్యవస్థ' కు సంబంధించి పోకుండా నిలిచిన చిహ్నాలను, నిస్పృహమాటంగా చేసిన సమీక్షతో, నిండిఉన్నది. మహజూర్ కవి కొత్తగా పొందిన స్వాతంత్ర్యాన్ని ఇలా ఎగతాళిచేసినాడు.

'ఈ స్వాతంత్ర్య మొక దివ్యాప్సరస'
ప్రతి గుమ్మము చుట్టూ ఆమె తిరగవలసిందేనా ?
అంతేకాదు ఆమె ఒకటి రెండు లోగిళ్ళల్లో సరసమాడుతుందా...
ప్రజలు దుఃఖితులు; ప్రభుత్వాధికారులు పెళ్ళికొడుకుల్లాగ
స్వేచ్ఛావధువుతో సరాగాలు ఆడుతూ ఆనందిస్తున్నారు !

రోషన్ కవి స్వపక్ష త్యాగము చేసిన పొరుబోతులను, తన పద్యాల్లో తీవ్రంగా గర్హించినాడు. ఒక కావ్యంలో స్వధర్మంకోసం జీవితం త్యాగం చేసినవాని తల్లి దుఃఖితురాలై కపటులను బైటపెడుతుంది. మోసగాళ్ళు ఏటేటా తన కుమారుని సమాధిచుట్టూచేరి, చాలా ఆర్భాటంగా పూవులు చల్లుతారు. కుమారుని అమరమయిన ఆత్మకు నివేదిస్తుంది వారు స్వేచ్ఛ అనే నెపంతో దగా చేశారనీ, సమరం సగం సగంలో చాలించి, ఇల్లుపట్టి పురాతన వ్యవస్థ అనే తలగడను ఆనుకొని విశ్రాంతి తీసుకొంటున్నారనీ 'భ్రమ' అనే తీవ్రకావ్యంలో కవి భారత దేశమునుంచి కాశ్మీరాన్ని ఛేదించి వేయమనే కుత్సితుల దౌష్ట్యమునూ పటాపంచలు చేయ నిశ్చితులయిన కాశ్మీరీయుల సంకల్పాన్ని, గాఢంగా, వ్యక్తము చేసినాడు.

కాశ్మీర భవితవ్య విషయంలో భద్రతా సమితి నిర్ణయం చేయక పోవడంచేత, ప్రజాక్షేమం సందిగ్ధము కావడంచేతనూ, అస్థిమిత మనోభావాన్ని, కథావస్తువుగా కవులు కశ్మీరకవిత్వంలో స్వీకరించారు కవి ఫలితాలు అవగాహనచేసుకొంటూ ఉత్సుకుడై, మెలకువతో పరివర్తనాలను కనిపెడుతూనే ఉన్నాడు. కవి తాను కలలు కన్న నవ్యకాశ్మీర నిర్మాణము చేసేయత్నము విఫలముకాకుండా ఉండడానికి విశ్వశాంతి అవసరమని చిత్తశుద్ధితో వాంఛించినాడు;

అందుచేత యుద్ధఘోషను గర్హించినాడు. హృదయాన్ని కదల్చివేసే శాంతికామన ప్రకటించడంలో కాశ్మీరభాష న్యాయంగా గర్విస్తున్నది. శాంతికావలసినది ఆదర్శముగా కాదు. ప్రత్యక్షరూపంగా సిద్ధించవలె. ఆ ఆదర్శము విశ్వమంతా సామాన్య మానవుడికి అత్యావశ్యకము. కాశ్మీరకవి ప్రస్తుత కర్తవ్యమును ఇలా భావించి కవితారూపంగా ఘోషిస్తున్నాడు :—

'నే నీ నాడు పాడను ...

వలపుమత్తని హాయిగొలిపే పూలపాటను, కోయలపాటనుకానీ, జలపాతం పాటనుకానీ, విరికలువపాటనైనా, మంచుసోనల హరితగాన మైనా పాడను, ఎందుకంటే ఈనాడు, ఎందుకంటే ఈనాడు...హేమంత ఋతు విషనిశ్వాసము, వాసంత సమీరమును తరుముతున్నది. మానవు డోమరి ఉద్యమించినాడు తోటిమానవుణ్ణి ఆహుతిగొనగా. అందుకే నేనీ నాడు పయనిస్తాను, పయనిస్తాను, మార్గమేర్పరుస్తాను నేను — అవ రోధాలను అన్నింటినీ ఆటంకాలను అన్నింటినీ చదునుచేసి సమంచేసి వేస్తాను. శత్రువును, దారిదోపిడివాణ్ని ఎదుర్కొంటాను. చేతులెత్త మంటాను వాణ్ని. సుత్తె, కొడవలి, కలాన్నిపూని దృఢనిశ్చయంతో గమిస్తాను, స్థానంనుంచి మరోస్థానం".

యుద్ధ ప్రచారకులను సవాలుచేయడానికి ప్రజల ఉద్రిక్తభావము కొన్ని శాంతిపద్యాలు రూపముధరించింది. అయితే కొన్ని పద్యరచనలు ఏ వృత్తిచేస్తున్నవారయినా సామాన్య ప్రజానీకము నిర్మాణాత్మక కర్తవ్యోన్ముఖము కావాలనీ, శాంతిప్రచారము ఆవశ్యకమనీ స్పష్టముచేసి నవి నదీమ్, రోషన్, రహీ, కమిల్ ఇదే కావ్యవస్తువు స్వీకరించి సంపన్నమైన ప్రకృతి నేపథ్యము ఏర్పరచి, విస్తృత గృహస్థ జాతీయ జీవిత దృశ్యాలను వివృతము చేసినారు.

నిజానికి ఇటీవల కాశ్మీర కవిత్వంలో, క్షేమంకరమైన అనుకూల భవిష్యత్తు లభ్యమయితే, సామాన్య మానవుడు ఏమి సాధించగలడనే భావము ప్రధానముగా ఉంటున్నది. అందువల్ల కవి, చక్రవాళంలో సూర్యుడు యుగయుగాల తమస్సును పటాపంచలుచేసి నవ్యమానవో దయము కావిస్తున్న దృశ్యభావనచేసి, కావ్యగానము చేస్తున్నాడు.

రాహి కవి అడుగుతున్నాడు :—

'తమస్సు, తటిత్తు తుఫానులు ఎలా నిలుస్తాయి ? సూర్యోదయమైనప్పుడు ? ఉదయ కిరణాలు ప్రసరించేటప్పుడు ?'

'సుందర వసంత సంగీత స్వరమేళ ప్రతినినాదము చేసినప్పుడు పాలిన హేమంతము వడవడ వణకి పోతుంది.' తనకు సమకాలికులైన పెద్ద కవులకన్న మిన్నగా, రాహికవి రసికజన ప్రీతి కలిగించ గలిగినాడు; కాశ్మీరదేశీయ గజలు ఛందస్సును ప్రయోగించి కృత కృత్యుడైనాడు. మహజూర్, అజాద్, మాష్టర్‌జీ కవుల గజలు కవితలో, నవ్యసామాజిక రాజకీయాభిరుచి కలిగించినారు. కామిలకవి ఇక్బాల్ శైలిలో గజలు రచించి, బావోద్రేకాన్ని బుద్ధిప్రేరితము చేసినాడు. ఆయన రచించిన 'మస్‌మలర్' (మాధ్వీకతరంగాలు) అనే కావ్య సముచ్చయము సామాన్య కావ్యశిల్పముకన్న మిన్న, ఆయన వర్ధిష్ణువుగా కనబడుతున్నాడు.

గజలు ఛందస్సేకాదు కొత్తరూపంతో ప్రయోగంలోకి వచ్చింది. నవ్యదృక్పథంలో మలచ బడిందిన్నీ, సమకాలీన కాశ్మీర కవిత్వంలో అన్ని ఛందస్సులనూ కవులు విస్తృతంగా వాడినారు; పురాతనమైన వాటికి నవ్యమైనవి చేర్చినారు. అందుకు దృష్టాంతంగా చూడండి. కవులు వఖ్య, రుబాయ్, మస్నవీ, దోహా, సదరీతులూ, జానపద ఛందస్సులూ కాక, సానెట్‌కూడా వాడి కొంత కృత కృత్యులయినారు. నృత్య సంగీత నాటిక, రేడియో పద్య నాటికలుకూడా ఎక్కువగా స్వేచ్ఛా ఛందోపయోగానికీ, ఇతర ఛందస్సుల కల్పనలకూ, అవకాశాలు గాలించడానికీ, సాయపడ్డవి. కాశ్మీర భాషకు స్వేచ్ఛాఛందస్సు సంపన్న స్వరైక్యం, మృదువైన అచ్చుల విధానం వల్లనూ, బాగా అనుకూలించింది.

నృత్యసంగీతనాటిక, పద్యనాటికలు కాశ్మీరభాషలో నవ్యముగా ఉద్భవించాయి. నదీమ్‌కవి చాలా నేర్పుగా పురాతన జానపద గాథలను స్వీకరించి, సంగీతగేయ నాటికగా మలచగలిగినాడు. హేమంతము వల్లనూ అతని మిత్రులవల్ల భ్రమరానికీ, 'యాంబరజాల' కుసుమానికీ వియోగము రాగా, ఆ హేమంతము గడచిన తరువాత వాటి పునస్స

మాగమమును కవి వర్ణించినాడు. అందులో ఆయన విధ్వంసక శక్తులపై చివరకు సృజనాత్మక శక్తుల విజయాన్ని,ప్రతీకకల్పన చేసినాడు. ఆ కవి కుతంత్రపరులపట్టునుండి కాశ్మీర విముక్తిని రూపకాతిశయోక్తిలో స్ఫురింపచేసినాడు. కామిలకవి రచించిన 'రవరూపి' కూడా అదే రీతిగా వసంతముచే శిశిర పరాజయాన్ని చిత్రించినాడు. ఇటీవల ప్రసారితమైన 'హీమక్ నగరాయ్' అనే సంగీతనాటికను నదీమ్, రోషన్ కవులు కలిసి రచించారు. ఇతివృత్తము కాశ్మీర జానపదగాథ. మానవత్వము న్యూనమైనప్పుడు కవులు దాన్ని మానవీయము చేయడానికి 'నాగరక' విధానాలవల్ల కాదనీ యథార్థమై, మహోత్కృష్టమై రమణీయమైన ప్రేమ మూలమవుతుందనే భావమును ప్రదర్శించినాడు.

ఈ రీతిగా కాశ్మీరకవిత్వంలో సరికొత్త ధోరణి ప్రతీకవాదమువైపు మరలింది విశిష్టంగా. అయినా భావగోపనము అధికము; వాచ్యముగా చెప్పడం తక్కువ, లాక్షణికత అధికమయినప్పుడు, పద్యము సాహిత్యపు సాముగరిడీగా మారిపోతుంది. మొత్తంమీద ప్రస్తుత లోకవృత్తము మీద అభిరుచి, ఉజ్జ్వల భవిష్యత్తు దెస, ఆశ, నవ్యకాశ్మీరసాహితీ స్వభావంగా కనబడుతున్నది. నిస్సందేహంగా ఆధునిక సారస్వతం ప్రస్తుతలోకంతో పరితోషంతో, సమస్యలతో, సుఖదుఃఖాలతో, చిరునవ్వులతో, నిట్టూర్పులతో, ఆశలతో విఫలత్వంతో, నిర్భరమైంది కాని సారస్వతము భవిష్యత్తుపై ప్రస్తుత తరము వారిహక్కులను గమనిస్తూ ఆశపెట్టుకొన్నది.

వృద్ధిలోకివస్తున్న కాశ్మీరీయవచనము వాస్తవిక జీవితానికి సన్నిహితంగా అతి విశిష్టంగా ఆరంభమై, లక్ష్యప్రాయమైన నవ్యతా సాధనకు పూనుకొన్నది. కాశ్మీరభాషలో ప్రతికారచన వృద్ధిపొందినప్పుడు వ్యాసము, సాహిత్యసమీక్షలూ, నిర్లక్ష్యము చేయబడిన ఇతర కాశ్మీరసాహిత్య శాఖలున్నూ, ప్రముఖమవుతమని ఆశించవచ్చును. కాశ్మీరంలో రాజకీయంగా అనిశ్చితంగా ఆర్థికమైన అవ్యవస్థా నేడు తొలిగిపోయినవికనుక ఇంక కాశ్మీరసాహిత్యము శాంతంగా నవ్యక్షేత్రాలుశోధించి, కళాలాలిత్య సంవలితమైన వ్యక్తీకరణకు ఎందుకు సాధన చేయకూడదు? ఉజ్జ్వల వాస్తవికధోరణి, కళ, సమాజోన్నతికి

అని ప్రవృద్ధమవుతున్న దృఢభావము స్పష్టక్రియారూపంలో ఆకార ప్రకారాలు ధరించాలి. వస్తువులో ఇతివృత్తకల్పనలో, నవ్యతకోసమై పాకులాడుతున్న వెఱ్ఱి ఆసక్తి, శీఘ్రంగా మందగిస్తున్నది. ఆ నవ్యతా సక్తి ఇకమీద, కేంద్రీకృత శిల్పచాతుర్యములో తెన్నులుతీసి, సాభి ప్రాయమైన కృషిగా పరిణమించాలి. కాశ్మీరంలో ప్రస్తుతతరములోని సాహిత్యశిల్పుల కర్తవ్య మిదే.

ఆకర గ్రంథజాతము


Essays on Kashmiri Grammar
*By G. R. Grierson, Thacker Spink & Co., Calcutta.*

Dictionary of the Kashmiri Language
*By G. R. Grierson; London*

Hatim's Tales
*Edited by Skin & Grierson; London*

Kashmir Sabdamrtam
*By Iswara Kaul; A. S. B., Calcutta*

Dictionary of Kashmiri Proverbs
*By J. H. Knowes; London*

Lalla Vakyani
*Edited by G. R. Grierson; London*

Siva Parinaya
*By Krishna Razdon, Edited by G. R. Grierson A. S B., Calcutta*

Ramavatara-Charitha
*By Prakash Ram Edited by Grierson; A. S.B.; Calcutta*

Parmananda-Sukti-Sara
*Edited by Masterji, Srinagar*

Kashmiri Lyrics
*Compiled & translated by J. L. Kaul, Srinagar*
Linguistic Survey of India
*By G. A. Grierson, Val. VIII, pt 2, pp 233-341*

# గుజరాతీ సాహిత్యము

యన్. సుఖ్‌లాల్ ఝవేరీ

## పీ ఠి క

భారతదేశపు పశ్చిమతీర ప్రాంతంలో గుజరాతు ప్రజానీకభాష గుజరాతీ, ప్రస్తుతము గుజరాతు అని వ్యవహారంలోఉన్న ప్రాంతంలో సౌరాష్ట్ర. కచ్ఛపములున్నవి. అక్కడ ప్రజ ఒకకోటి యాభైలక్షలపైగా ఉంటారు. గుజరాతీభాష సంస్కృతంనుంచీ, శౌరసేనీప్రాకృతము, ఘూర్జర అపభ్రంశాల, అవాంతర దశలనుంచీ ఉద్భవించింది. 1200 క్రీ. శ. నుంచీ గుజరాతీభాష ఆరంభమైంది. విశిష్టరూపం వహించి, అయితే ఆ నామంతో వ్యవహరింపబడింది 17 శతాబ్దిలో, ఘూర్జరరాష్ట్రం విర్పాటయిన తరువాతనే.

ఆధునిక ఘూర్జర సాహిత్య జనకుడుగా యదార్థంగా నర్మదా శంకర కవి, పరిగణింపబడుతున్నాడు. (ప్రసిద్ధంగా నర్మద్ అని అంటారు ఆయనను.) నర్మద కవికి పూర్వము సాహిత్యమంటూ లేదని కాదు. ఘూర్జర కవితకు నరసింహమెహతా, ఆంగ్లకవిత్వానికి ఛాసరు వంటివాడు. నరసింహ మెహతాకు పూర్వంకూడా గుజరాతీ సాహిత్యం ఉండనేఉంది. క్రీ. శ. 1414 నుంచి 1852 వరకూ అనగా నాలుగు శతాబ్దాలపాటు గుజరాతులో అనేకమంది కవులుండేవారు. వారిలో కనీసము ఆరుగురు కవులు ఘూర్జర గ్రంథకారులలో ప్రథమశ్రేణిలో, స్థానం సుస్థాపితం చేసికొన్నారు.

15 శతాబ్దిలో మన సాహిత్యంలో, నరసింహ మెహతా, మీరాబాయి అనే ప్రముఖ ఘూర్జర భక్త కవిద్వయం ఉండేది. 17 శతాబ్దిలో శేముషీ విభవోపేతులయిన కవిత్రయము వారుండేవారు. అఖో, ప్రేమానంద, శమల – అఖో కవి స్వర్ణకారుడు, హేళనాత్మక రచనా ప్రవీణుడు,

తీవ్రవిమర్శకుడు, నిర్భయంగా దోషాలను ఎత్తి చూపగలవాడు. ఆఖ్యాన కవి అయిన ప్రేమానందుడు, గుజరాతీ కవితలో వివిధరస పోషణలో ప్రవీణుడు. శమలుడు గతాను గతికమార్గం అతిక్రమించి, ప్రాచీన గ్రంథకారుల్లో ప్రథమ గణ్యుడైనాడు. రసాన్విత కథాకావ్య రచనలో. 18 శతాబ్దపు ఉత్తరార్ధంలో గుజరాతులో 'గర్బిల'నే శ్రవణ పేయ భావగీతా రచనచేసి, అమరభావ కవిగా దయారాముడు సాహిత్యంలో స్థానము సంపాదించినాడు ఆ కవి షట్కమేకాక మధ్యమ కాలిక గుజరాతీ కవుల్లో 'భలాన'. ధారావాహికంగా స్వేచ్ఛగా ఆకర్షణీయమైన అనువాద సంప్రదాయం ఏర్పరిచినవాడు. పద్మనాభకవి కాన్హదా – దే – ప్రబంధంలో ఇతిహాసిక వీరరసపోషకుడు. భీమకవి భాగవతపురాణములోవలె అద్భుతమైన కృష్ణలీలాగానము చేసినాడు. ధీరో, భోజో కవుల జీవితము నిష్ప్రయోజనమనే భావాన్ని వక్కాణించారు. స్వామి నారాయణ శాఖీయులయిన కవులు దైవత్వాన్ని, మోక్షాన్ని పొందడానికీ, ధర్మసాధనకూ శరీరము ప్రధానమనీ ఆవశ్యకమనీ పదేపదే వక్కాణించినారు.

కాని చాలాకాలం అనగా నాలుగు శతాబ్దాలు కవిత ఐహిక సత్యానికీ, విస్తృత జీవితానికీ దూరమై నిలచింది. కవులు ప్రేమగానం చేశారు. అయితే రాధాకృష్ణుల దివ్యప్రేమ మాత్రమే కవులు గానంచేశారు. ఏ శాఖకూ చెందని కావ్యాలాపము చేస్తే అదిసామాన్యంగా స్వాప్నిక భావనగా ఉంటూవచ్చింది. జ్ఞాన భక్తి వైరాగ్యాల సంప్రదాయక గతాను గతిక మార్గంలోనే కవితా స్రోతస్విని ప్రవహించి, ఘనీభవించి, 18 శతాబ్దాంతంలో నిర్జీవమైంది.

రమారమి 18 శతాబ్దాంతంలో, ఘూర్జర ప్రజాజీవితం కూడా ఉల్లాసం లేక స్తబ్ధమై, చైతన్య స్పంద రహితమైపోయింది. 1799 లో సూరత్ నవాబు మరణించడంతో, ఆ యేడే కలకత్తాదగ్గర సిరాంపూర్‌లో తొలిసారిగా క్రైస్తవ మిషనరీ పాఠశాల ప్రారంభించడంతోనూ, ప్రాచీన వ్యవస్థమారి నవీనమార్గం ప్రారంభమైంది. 1818 నుంచీ 1857 వరకూ భారతదేశంలో బ్రిటీషు ప్రభుత్వాధికారము క్రమ క్రమంగా గాఢంగా నిదానంగా వేళ్ళు పాతుకొనిపోతూ వచ్చింది.

## పాశ్చాత్య ప్రభావము

బ్రిటీషుపాలనతోపాటు పాశ్చాత్యనాగరకతా వాహిని ధాటీగా వచ్చింది. శాస్త్రవిజ్ఞానంవల్ల వచ్చిన నవీన సాధనాలు దూరదూరాలను దగ్గర చేయడంతోటే, ప్రజల మనోదిక్చక్ర వాళము విస్తృతమైంది. స్థానిక రాజకీయాందోళన సమసి పోయింది. గుజరాతీ యువజనులు సమాజసంస్కార ప్రవృత్తిలో నిమగ్నులై నిరక్షరాస్యతను, మూఢ విశ్వాసాన్ని, బాల్యవివాహాలను, బాలవైధవ్యాన్ని, వివాహాలలో విపరీత వయోవ్యత్యాసమువంటి సమస్యలను, పరిష్కరించడానికి బద్ధ కంకణులైనారు. వారికి ఆదర్శము పాశ్చాత్య ప్రపంచమే.

(1833 - 1886) లోని సాహిత్యమునకు నర్మద కవి విశిష్ట ప్రాతినిధ్యము వహించినాడు. అందుచేత అనాటి సాహిత్య యుగంలో, ప్రప్రథమంగా పూర్ణంగా విశృంఖలంగా కవితలో, ఆత్మాశ్రయత్వము విహారముచేసింది. ఐతిహాసిక రసాత్మక ఆఖ్యాయిక, సమాజాన్ని అధిక్షేపించే హేళనాత్మక రచన, రూపకాతిశయోక్తి, వ్యాసము జీవితకథ, స్వీయకథ. రూపకము, సాహిత్య సమీక్షాత్మక వచన రచన లుద్భవమై వికాసము పొందినవి.

1886 లో నర్మదకవి మరణంతో, (1855 – 1907) కవి గోవర్ధనరావు యుగము ఆరంభమైంది. ఆ యుగంలోనే ప్రాక్పశ్చిమ ఖండాల ఉత్తమ సంస్కృతి సమన్వయ ప్రయత్నం సాగింది ఈ సంస్కృతి సమన్వయం కేవలం యాంత్రిక మేళనంకాదు. కాని సమన్వయానికి ప్రాగ్దేశీయ సంస్కృతే ఆధారము. ఆవశ్యకమయిన సంస్కృతిని పాశ్చాత్య సీమలనుండి తెచ్చుకొని ప్రతిష్ఠించుకొన్నాము. ఆ యుగము యోచనా పరులది. వారు ఉదాత్త గభీరత, సమతా బుద్ధి కల మనీషులు. మానవుని యోచనలకు కర్మలకు మార్గదర్శకమైనది హేతువది – అంతేకాని, జిజ్ఞాసారహిత విశ్వాసము కానీ, కేవల సంప్రదాయంకానీ, కాదనీ, వారు నిశ్చయానికి వచ్చినారు. ఈ దృక్పథంతోనే సంస్కర్తలు ఆనాటి మూలాధార సమస్యలను వేరు చేసి, ఒకవంక సనాతనులను చకితులనుచేయకయు వేరొకవంక యువ

కులను చూచి అసహ్యించుకొని తరిమివేయకయు ఉండేవిధానం ఆలోచించినారు.

ఈ యుగంలో (1886—1914) వచనములో కథానిక, ఖండ కావ్యము, పద్యకృతులలో సానెట్ విషాదపద్యకావ్యాలూ ఉద్భవించినవి. సరస్వతీచంద్ర అనే నాలుగు సంపుటాల నవల, గుజరాతీ భాషలో ఉన్న ఒక్క హాస్యరసాత్మక నవల, 'భద్రంభద్ర' అనేది ఉద్భవించింది. వ్యాసము రూపకము వాకోవాక్యము, లేఖ వంటి గద్యసాహిత్య ప్రక్రియలు వృద్ధిచెందినవి. ప్రామాణిక సంస్కృతాను వాదాలవల్ల, ఆంగ్ల మహాగ్రంథానువాదాల వల్లనూ, సాహిత్యము సంపన్నమైంది. గుజరాతీ నాటకరంగము వృద్ధిచెంది, ఉన్నతస్థాయిని చేరింది. ఈ యుగంలోనే, నానాలాల్, కాంత్, కలాపి, బల్వంత్‌రాయ్, నరసింహరావుల కవిత్వం వల్ల సంపన్నమైంది సాహిత్యయుగం. ఈ కాలంలోనే గుజరాతీ భాషలో బ్లాంక్ ఛందస్సులో అనేకరీతుల్లో సాహిత్య ప్రయోగాలు జరిగినవి శబ్దశాస్త్రం, ఐతిహాసికశోధన, వ్యాకరణం, ఛందస్సు, సాహిత్య సమీక్షాక్షేత్రాలలో అమూల్య కృషి జరిగిందీ యుగంలోనే. మణిలాల్ ద్వివేదీ, ఆనందశంకర్, కేశవలాలు ధ్రువ ప్రభృతులు ఈ యుగానికి ప్రతినిధులు.

## గాంధీయుగము

1914 సంవత్సరములో గుజరాతీ సారస్వతానికి అదృష్టము పట్టింది ఆ యేడే గాంధీమహాత్ముడు ఆఫ్రికానుంచి స్వదేశానికి తిరిగి వచ్చినాడు. భరతఖండంలో కొద్ది మాసాల్లోనే క్రమంగా వాతావరణం ఉత్తేజితమైంది. దేశంలో గాంధీమహాత్మునివల్ల హోమురూలు ఉద్యమం వల్ల, జలియన్‌వాలాబాగ్ సంఘటన వల్లనూ, బయట ప్రథమ ప్రపంచ యుద్ధానంతర ఫలితాలవల్ల, సుదూరంలో రష్యావిప్లవంచేతనూ, గుజరాతులో జీవసారము భావోద్రిక్తమై పొంగిపోయింది. ఘూర్జర హృదయము, స్వాతంత్ర్యభావంతో, కేవలం రాజకీయ రంగంలోనేకాక, ఆర్థిక మత సామాజిక సాహిత్య క్షేత్రాల్లోనూ ఉద్దీపితమైంది. నవజీవితోత్సాహంతో గుజరాతు స్పందించింది.

సాహిత్యరంగంలో, ఈ యుగంలో, ప్రముఖ సాహితీ వేత్తల జయంతులూ, వర్ధంతులూ, సాహిత్యగోష్ఠులూ, శరదుత్సవాలు, వసంతోత్సవాలు, కళాప్రదర్శనలూ, వాగ్వివర్ధినీ సభలూ, జానపదగేయకుతూహలాయత్త చిత్తుల సమావేశాలూ జరిగినవి. ఔత్సాహిక నాటకరంగం కూడా ఉద్భవించింది.

గాంధీశకంలో రచయిత భిన్న దృక్కోణాల్లో జీవితాన్ని ఆలోకించినాడు. ఆర్థిక అసమానత కంటగింపుగా సహించడానికి వీలులేకుండా అతనికి తోచింది. ఆర్తదీనజనసేవ గ్రామోద్ధరణ, అస్పృశ్యతా నివారణం వీటిపై గాంధీమహాత్ముని ఉపదేశాలవల్ల రచయిత భావోద్రిక్తుడై కల వాళ్ళను గురించి ఆలోచించక భారతజన పదాల్లోని నిరక్షరాస్యులవైపు దృష్టికేంద్రీకరించినాడు.

సృజనాత్మక గద్యవాఙ్మయ ప్రక్రియను తీసుకొన్నప్పుడు, గాంధీశకములో రచయిత కళారసైక దృష్టిలో విశేషశ్రద్ధతో రచనలు సాగించినాడు. గత యుగంలో నవలలకన్న, ఈ యుగంలో నవలలు కథా వస్తువులో, శైలిలో, వేరుగా ఉన్నవి. ఈ యుగంలో సాహిత్యంలో, స్వతంత్ర శాఖగా కథానిక, అభివృద్ధి చెందింది. సామాన్య విషయక వ్యాసాలు, ఏకాంకికలు, స్వగత భాషణాలు, దినచర్యలు ఉద్భవించినవి. జానపద వాఙ్మయ పరిశోధనము, శిశుసాహిత్యము, శాస్త్రీయ విజ్ఞానం, అర్థశాస్త్రం, కృషిశాస్త్రం, ఇత్యాదులు అతి విస్తృతంగా ఈ యుగంలో వృద్ధిచెందినవి. కథావస్తువు విస్తృతమైనది. శైలి, విషయ ప్రస్తారము కూడా సంపూర్ణంగా మార్పు చెందినవి. గోవర్ధన యుగ సాహిత్య శైలి ఇంచుమించుగా కృత్రిమాలంకృతం, రచయితలు సామాన్యంగా మహా విద్వాంసులకోసము రచనచేసేవారు. గాంధీశకంలో అతిశబ్దదోషము, అతిశయోక్తులులేని సరళభాష. వచనశైలి సహజ ప్రసన్న సూక్ష్మానుభవాన్ని వ్యక్తీకరింప కలిగినది వాడుకలోకి వచ్చింది. గాంధీశక సాహిత్యం ఉన్నతశ్రేణి ప్రజలకే కాక ప్రజానీకానికికూడా సంబంధించింది.

ఈ యుగములో కవితాక్షేత్రంలో రసగర్భిత ఖండకావ్యము, సానెట్, హేళనాత్మక అనుకరణము, విషాదాంతకావ్యము, పద్యరూప

సంవాదము, ముక్తకము అనే సాహిత్యరూపాలు ఉద్భవించి పరిపుష్ట మైనవి. ఈ సాహిత్య ప్రక్రియలన్నింటిలో ఆఖ్యాన శైలిలో రచింపబడ్డ హేళన కావ్యాలను ప్రత్యేకంగా పేర్కొనాలి.

గాంధీశకములో ప్రకృతి ప్రణయము భగవంతుడు అనే వస్తువు లను మాత్రమే స్వీకరించి కవి సీమాబద్ధుడు కాలేదు. విశ్వప్రేమము, విశ్వజనీన సౌభ్రాత్రమును ఉద్దేశించి కావ్యగానాలుచేసినాడు. అతనికి మృత్యువుకుకూడా జీవనాకృతిలో స్థానమున్నది. సౌందర్యమువలె వస్తు శ్రేణిలో కరుణకూ, శోకానికీ, కూడా తావున్నదని అతనికి గోచరించింది.

1914 సంవత్సరం వరకు సముచిత కావ్యవస్తువులుగా, మేఘము, చంద్రుడు, పర్వతాలు, తారలు, పద్మము, కోయిలవంటి సుందరాద్భుత విషయాలు సామాన్యంగా పరిగణింపబడేవి. ఇప్పుడు దీనికి విరుద్ధంగా 'పంది' మీద, 'పాకీ' వాడిమీద, కృత్రిమ కుసుమాలమీద, ముురుగు దోమ మీద, పేడకుప్ప మీద, పారవేసిన మామిడిటెంక మీద, బూట్‌పాలిష్ చేసే పిల్లవాడివంటి విషయాల మీద, పద్యాలురాశారు. కవి కావ్యోన్నత్యము, ఘనత, విషయము మీదనే ఆధారపడిఉండదనీ, కావ్యవస్తువును స్వీకరించి పోషించడంలోనూ, అవలంబించే దృక్పథం లోనూ, ఉంటుందనీ గ్రహించినాడు. కొంతకాలం కొందరు నవ్యత కోసమే నవ్యతా సంపాదనకు యత్నించినారు. నిరంతరం విశ్వ జనీనమవుతున్న విస్తృత మానవకరుణా దృష్టిని బట్టి, కొంతవరకు నవ్యత అవశ్యకమైంది. ఆధునిక సాహిత్యంలో వాస్తవికత—ఒక్కొక్క ప్పుడు దురవగాహత, జుగుప్సలుకూడా—సామాన్య లక్షణమైంది.

## స్వాతంత్ర్యం—అనంతరం—

సుదీర్ఘ భారతేతిహాసంలో 1947 ఆగష్టు 15 నవ్యోజ్జ్వల ఘట్టము. ఐనా. గుజరాతీ సాహిత్యంలో స్వాతంత్ర్య పూర్వమనీ, స్వాతంత్ర్యానం తర యుగమనీ భేదము అంత సూక్ష్మంగా పాటించి, స్వాతంత్ర్యసిద్ధి తరువాత నవయుగంగా వర్ణించవలసిన అవసరంలేదు. కవులు, నవలా రచయితలు, కథానికాకారులు, నాటకకర్తలు, వ్యాసకర్తలు, — 1947 సంవత్సరానికి పూర్వము సాహిత్యరంగములో ప్రాబల్యముకలిగిన

రచయితలే ఇంకా సారస్వతక్షేత్రంలో వ్యాసంగంచేస్తూ, ప్రముఖపాత్ర వహిస్తూ ఉన్నారు.

స్వాతంత్ర్య పూర్వయుగ కవిత్వము, సామాన్యంగా స్వాతంత్ర్య సిద్ధికై తపనతో తనరారుతూ ఉండేది. గుజరాతీకవి దానితో సంపూర్ణంగా వివశుడయ్యేవాడు. స్వేచ్ఛాపిపాస అతని కవితకు మూల సూత్రం. అతనిగేయాలు, భావకవిత, ద్విపదలవంటి దేశీయ ఛందస్సులో చెప్పినగాథలు', దీర్ఘకథానక కావ్యాలు, యోచన విలపితకావ్యాలన్నీ, ఏతద్భావో త్తేజితాలే. కవి ఇతిహాస పురాణాలలో సన్నివేశాలూ, ఇతివృత్తాలూ, స్వాతంత్ర్య మహాకాంక్షను ప్రతిబింబింప చేయడానికి అనుకూలమైనవాటిని, ఎన్నుకొనేవాడు. కవికి లక్ష్యము విశదము. మానవుని యావచ్ఛక్తులూ ఏకగమ్యాన్నే నిర్దేశించినవి.

స్వాతంత్ర్య సంపాదనానంతరయుగంలో స్వాతంత్ర్యప్రోద్బలము స్వేచ్ఛాపిపాసలేవు. ప్రస్తుతము అతనిదృష్టి నిమగ్నముకావడానికి, ప్రత్యేకమైన లక్ష్యమంటూ లేకపోయింది. దేశంలో జాతీయ పునర్నిర్మాణానికి మహోద్యమాలు సాగుతూ ఉన్నవి. అయితే ఎందుకోగాని అవి కవిని ఉత్సాహోద్రిక్తుణ్ణి చేయలేకపోతున్నవి. అందుకు కారణాలు వెతకడానికి ఇది తగినతావుకాదు. గుజరాతకవి పాతికేళ్లకిందట పారతంత్ర్య శృంఖలాలను విచ్ఛేదము చేయడానికి స్వాతంత్ర్యశంఖారావం ఆలించి కార్యశూరుడైనట్టు, సమకాలిక కవి ప్రస్తుతోద్యమాలవల్ల ప్రేరితుడు కాక, ఆనాటి తీవ్రక్రియాశక్తిని కోలుపోయినాడని చెప్పక తప్పదు.

కావ్యవస్తు విషయము తీసుకొన్నప్పుడు సర్వజగత్తునూ కవి స్పృశించాలని యత్నించాడు. గుజరాతీకవిత్వంలో, ఉత్తమమూ, ఉన్నతమూ అయిన అంశాలు చుంబితవిషయాలుకాగా, లలితలలితమైన సౌందర్యసారాన్ని కవి అవగాహనచేసుకొన్నాడు. గాంధీయయుగంలోని గుజరాతీకవికి, అధునాతనకవికీ బహుముఖ జీవితాభివ్యక్తీకరణం యావత్తూ, పవిత్రమూ, సమ్మాననార్హమూ అయింది.

పాతికేళ్ళకిందట కవిత్వానికీ, సంగీతానికీ, సంబంధము విచ్ఛిన్నమయ్యే సమయంలో, సంగీతం కవితాపాటవానికి దోహదం కాదనే అభిమతం కొందరిది. అదృష్టవశాన కవులీ భ్రమనుండి శీఘ్రమే విముక్తులై

వారు సుందరగేయ రచనలు కేవల సంస్కృత ఛందంలో చెప్పిన పద్య కావ్యాలతో పాటు, సాగిస్తూ ఉన్నారు. ఆధునిక గుజరాతీ కవులు గేయ కవితా రచనలో కృతకృత్యులైనారు. సమకాలిక కవిత్వం, ప్రౌఢ సంస్కృత ఛందాన్ని త్యజించి, అధికంగా సంగీత గేయరచనల వైపు మొగ్గుతున్నది.

దీర్ఘ కథనాత్మక కావ్యాలుకానీ, మననాత్మక కావ్యధోరణులు కానీ, కవికి ఈ పరిస్థితుల్లో హృదయ సంవాదము కాలేకపోయినవి. సూక్ష్మమై అమూర్తమైన యోచనావిష్కారానికి, గేయము ఉపకరించ లేదు. అయితే గేయంవల్ల రసభావ నిష్పత్తి బాగా కలుగుతుంది. తాత్కాలికంగా గుజరాతికవి మహా కావ్యరచన మానివేసినట్టు కనబడుతున్నది. అందుకు కారణం ఆరచనకు అనుకూలమైన బ్లాంక్‌వర్సువంటి ఛందస్సు లేకపోవడమని అనడం తగదని నా అభిప్రాయం. మహాకావ్యరచనా ప్రతిభకల కవి మనకు రాలేదని అంగీకరించడమే బావ్యం.

కావ్యక్షేత్రంలో ప్రాచీనులయిన ఉమాశంకర్ జోషీ, సుందరం, సుందరజీబేతాయ్ ఇంకా రచనా వ్యాసంగంలోనే ఉన్నారు. ప్రస్తుత తరంలో బహుశః ఉమాశంకర్ సర్వతోముఖ ప్రజ్ఞకల రచయిత. కొన్ని మాసాల కిందట 'వసంతవర్ష' అనే ఐదవకావ్య సంపుటాన్ని వెలువరించి నాడు. ఆ సంపుటిలో కొన్నిగేయాలు బావుక హృదయోద్గారాలు. కవి ప్రకృతిలో వివిధ దశలను అవగాహన చేసుకొని, సుఖదుఃఖాలకు వివశుడై, భావగీతికా రామణీయకంతో, రచనచేసినాడు. సుందరకవికృత 'యాత్ర' కొన్నేళ్ళకిందట ప్రకటితమైంది. ఆ కావ్యంలో కవియొక్క ఆత్మ పరిణతి గోచరిస్తుంది. ఆయన 'వసుధ' నిప్పుడు అంటిపెట్టుకొని ఉండలేదు; ఆత్మీయ మర్మయోగానుభవ పథంలో ఒక యాత్రికుడైనాడు. ఉమాశంకర్ పుడమి తల్లి అందానికి ముగ్ధుడై భావగీతికా రచన చేసినాడు. సుందరకవి అంతరసౌందర్యాలోకనం చేసి దార్శనిక భూమిలో పైపైకి ఎగిరిపోతాడు. ఇద్దరూ పరమ సత్యాన్వేషకులే. అయితే ఒకరు సుందరాకృతిలో మరొకరు యోగసాధనద్వారా అనుసంధానము చేయదలచినారు. బేటాయ్‌కవి రచించిన 'విశేషాంజలి'లో, సమతా గంభీరతా సంయమమూ కవియొక్క ఆత్మీయతలో విశేషంగా

గోచరిస్తాయి. ఆ తరములోనే చెప్పుకోతగిన మరికొందరు కవులు, 'స్నేహరశ్మి' పూజలాల్, కర్షణదాస్‌మణెక్, కృష్ణలాల్ శ్రీధరణి, ప్రభృతులు.

కొత్తతరంలో చెప్పతగినకవులు, రాజేంద్రషాహ్, నిరంజన్‌భగత్, బాలముకుందదవే, వేణీభాయ్ పురోహిత్, ఉశనస ప్రభృతులు. వారు గుజరాతులో నవ్యకవిత్వ ప్రాతినిధ్యము వహించారు. రాజేంద్రునిలో సుసంపన్న భావచిత్రణం, సుస్పష్టాలోకనంవల్ల నిరంజనునిలో అపూర్వ లయావగాహనంవల్ల, గతానుగతికం కాని పద్ధతిలో ఇతి వృత్తాన్ని ధైర్యంగా స్వీకరించడంవల్ల, బాలముకుందునిలో మాధుర్యం వల్ల, వేణీభాయిలో మధుర ప్రసన్నతవల్ల, ఉశనసలో రూపచిత్రణ వల్ల, నవ్యకవులుగా ప్రాతినిధ్యం వహించారు. మకరందదవే, ప్రజారామ్, జయంతపాఠక్, పినాకిసిఠాకూర్, ప్రియకాంతమణియార్ ఇత్యాది కవులుకూడా ఇంకా ఇతరులతోపాటు సమకాలిక కావ్యక్షేత్రంలో ప్రముఖులైనారు.

సంపూర్ణ హృదయోత్సాహానికి విశేషాలంబనం లేకపోవడంవల్ల, గుజరాతీ యువ కవి ఈ నాడు ప్రణయము, ప్రకృతి, వంటి పురాతన ఇతి వృత్తాల వైపుకే, మరొకసారి మొగ్గినాడు. అతని తరుణప్రేమ గాఢోద్రిక్తమూ, మధురమూ, స్వచ్ఛమూ అయింది. ఉభయనిష్ఠం అయినా కాకపోయినా, అతనిప్రేమ విషాదాంతముకానిది. మానవ హృదయాంతరాళంలో, ఆ ప్రేమ ఇంకా లోతులు చూడవలసి ఉంటుంది.

ప్రస్తుత కాలపు కవి అద్భుతంగా ఛందస్సుమీద, లయమీద, ప్రభుత్వాన్ని చూపినాడు. అతని శబ్దజాలము సుసంపన్నము. కవి లయాన్విత పద్యగమనంలో పరిపక్వత లేనివాడుకాడు. కాని అతడు సంస్కృత పదప్రయోగంలో అప్పుడప్పుడు తికమకలు పడుతున్నాడు: ఆయనపదాలు అసంపూర్ణమయిన అభిధానము కలవి. ఆయన రచనలో ఒక్కొక్కసారి హాస్యము జాలువారుతుంది. ఆయన పద్యంలో శబ్ద చమత్కృతి మాత్రమే ఉంటుంది. ఒక్కొక్కసారి పద్యంలో లయాన్విత ఛందోమాధుర్యం మాత్రం ఉట్టిపడుతుంది. ఇతరమేమీ ఉండదు. మరొక్కసారి ఆయన కవితాలోకము పరిణతిపూర్ణము కాకపూర్వమే,

హఠాత్తుగా అంతమవుతుంది. ఇంకోసారి కవి ఒక ముక్తకమో, ఒకసూక్తి తన్న, మించిపోవడం, దుర్ఘటమవుతుంది. ప్రకృష్ట సుదీర్ఘ కావ్య బంధాలు, భావసంపన్నమై, భావచిత్రణ, భావదర్శనములు కలవి, ఏసాహిత్యంలో అయినా నైనందిన వ్యావహారిక విషయాలు కావు. అవి గుజారాతీ కవిత్వంలో అల్పముకావడంచేత మనము బాధపడరాదు. అయితే ఒక విషయము గమనార్హముకాక తప్పదు. అధునిక కవిత్వము సర్వసామాన్యంగా లఘువుగా, మధురంగా, శ్రవ్యంగా, ప్రపన్నంగానూ ఉంటుంది. ప్రస్తుత కవిత్వము గభీరతా వైశాల్యములూ, దైర్ఘ్యమూ, అనేక పరిమాణాలను ఇంకా పుణికిపుచ్చుకోవాలి. తత్త్వ దర్శనానికి సంబంధించినంతవరకూ ప్రస్తుతతరంవారు నవ్యతను ఇంకా సంపాదించలేదు.

నాట్యరూపకము ఈనాడు వర్ధిల్లుతున్న సారస్వత ప్రక్రియలలో అత్యద్భుతమైనది. నాట్యరూపకమని అనగానే అది సర్వాంగ సౌష్ఠవమైన రూపకమూకాదు, సుదీర్ఘకథనాత్మక కావ్యమూకాదు. అందులో ఏకనాటకీయ సన్నివేశమే స్వీకరింపబడుతుంది. అది జీవన రహస్య గర్భితము. పద్యరూప వాకోవాక్యంగా ప్రకటితమవుతుంది. 'ప్రాచీన' అనే సంపుటంలో ఉమాశంకరజోషి ఈ విశిష్ట సాహిత్య ప్రక్రియలో సర్వాంగసుందరమై ఆదర్శప్రాయమైనవి కొన్ని ప్రసాదించాడు.

గుజరాతులో సామాన్యంగా 'నృత్యరూపకమని' చెప్పబడే మరొక సాహిత్య ప్రక్రియ ఉన్నది. ఆ సాహిత్యరూపావిర్భావముకూడా ఇటీవలనే గేయసమన్వితమై, గేయానికీ గేయానికీ మధ్య, గద్య వ్యాఖ్యానంతోనూ, అనుష్టుప్ ఛందంతోనూ అనుసంధింపబడుతుంది. ఆ నృత్య రూపకంలో ఇతివృత్తం సామాన్యంగా పౌరాణికమో, ఐతిహాసికమో లేదా అభూత కల్పనాత్మకమో అవుతుంది. గేయాలు, భిన్నమనో భావాలు సువ్యక్తం చేయడానికో, లేదా కథావస్తు పరిణతిలో ముఖ్యమైన దశలను తెలియ జేయడానికో, వీలుగా ఉంటాయి. ఈ నృత్య రూపకం జేగీయమానం కావడం, దానిలో గర్భితమైన కావ్యగుణాధిక్యతనుబట్టికాదు. ఆ రూపకం సుందర మానవాహార్యకం, తౌర్యత్రికాన్ని బట్టి పరిపాకము పొందుతుంది. సంస్కృతి మహోత్సవాల్లో, విద్యా

సంస్థల్లో, వార్షిక సమ్మేళనాల్లో, రంగస్థలాన నృత్యరూపక ప్రదర్శన ఇంచుమించుగా ఒకపరిపాటి అయింది. వాటి లక్ష్యము సర్వజనామోదము. అయితే ఈ ప్రదర్శనాల్లో నృత్యాలుకానీ, సంగీతంకానీ, శుద్ధప్రౌఢ మార్గానికి సంబంధించవు.

కవి సమ్మేళనాలూ, ముషాయిరాలు, సాహిత్యగోష్ఠులూ (ఆ సాహిత్యసమావేశాల్లో కవులు కావ్యగానాలు చేస్తారు.) జనప్రీతిని కలిగిస్తూ ఉంటున్నవి. కవులు కవిసమ్మేళనాల్లో సంస్కృత ఛందస్సుల్లో మాత్రా చందస్సుల్లో కావ్యరచనలు వినిపిస్తున్నారు కవులు ముషాయిరాలలో ఉరుదూగజలు శైలిలోచేసిన కావ్యాలు వినిపిస్తున్నారు. ఇవి ప్రజాబాహుళ్యానికి కవితాభినివేశము కలిగించగల సాహిత్య వ్యాసంగాలు. అయితే వీటివల్ల ఉదాత్త కావ్యరసాస్వాదన పాటవమూ, అభిరుచీ, మానవుడికి ఎంతవరకు కలుగుతుందో సందేహమే. కవులు అలాంటి సాహిత్యగోష్ఠులలో వెంటనే వినియోగ పడేందుకుగాను, కావ్యఖండాలు రచించి చదువుతారు. ఆ సమావేశాలలో కావ్యపఠనము జరుగుతూ వుంటే సహజంగా భిన్నభావాన్ని ద్యోతకంచేసే సూక్ష్మశబ్దశక్తి అవగాహన చేసుకోడానికి, మననానికి, సముచితాస్వాదనకూ, ఏకాగ్రత, శ్రోతలకు కుదరదు. ఆ సభల్లో కమ్మగా గొంతెత్తి శ్రావ్యంగా పద్యం చదివితే, శబ్దచమత్కారము చూపితే, ఆ కావ్యరచన సఫలమవుతుంది. కవి సమ్మేళనంలోనో, ముషాయిరాలోనో సదస్యుల ఆమోదం పొందిన కావ్యము, అచ్చుపడిన తరువాత సామర్థ్యమూ, వివేచన కలవాళ్ళు పఠిస్తే, సభలో కలిగిన రంజనము కలగక పోవడము తరుచుగా ఉంటుంది.

## నవల

గుజరాతీ సాహిత్యంలో అధిక ప్రజామోదం పొందిన సాహిత్యారూపము బహుశః నవల అయినప్పటికీ, నవలారచనా సంవిధానంలో కొత్తగా వచ్చిన అభివృద్ధి అంటూ ఏమీలేదు. గుజరాతీ భాషలో నవల జనప్రీతి కలిగించేది అయినప్పటికీ, దానితోపాటు గుణసౌష్ఠవం లేదనడానికి అదేతార్కాణం. ముష్షీ, రమణలాల్ దేశాయ్, ఝవేర్‌చంద్

మేఘాణీ, గుణ్వంతరాయ్ ఆచార్య, ధూమకేతు, చునీలాల్—వి-షా వంటి వెనకటి తరంవారు; అధునికుల్లో పన్నాలాల్‌పటేల్, దర్శక్, ఈశ్వర్ పెటలీకర్, చునీలాల్ మదియా, సోవన్, పీతాంబర్ పటేలు, సారంగ్‌బరాత్ ప్రభృతులయిన, గుజరాతీ నవలాకారులు చాలామంది ఉన్నారు. వారందరూ జనప్రీతి ఇంచుమించుగా పొందినవారే. కొందరి గ్రంథాలు ఎక్కువగా అమ్ముడు పోతాయికూడాను. విశ్వ జనీనస్థాయి, ప్రమాణాలను దూరంగా ఉంచి ఆలోచించినా, గుజరాతీ సాహిత్యంలో ఉదాత్తంగా, సౌష్ఠవంగా, వచ్చిన నవలలు పరిమితము. రమణలాల్‌దేశాయ్, ఝవేర్‌చంద్ మేఘాణీలు గతించారు. మున్షీ తారుణ్యాన్ని అతిక్రమించలేక పోతున్నాడు. పన్నాలాలుపటేలు, దర్శన్ 'మనుభాయ్ పంచోలీ' అనే గ్రంథకర్తలిద్దరూ గుజరాతీ నవలాసాహిత్యాన్ని ప్రధానంగా సుసంపన్నము చేసినారు. పన్నాలాలు గుజరాతీ జానపదజీవితాన్ని మొత్తంమీద సౌష్ఠవంగా చిత్రించినాడు. ఆయన గ్రామీణజీవితంలో నిగ్గును గ్రహించి, పాటుపడే కృషికుల సరళజీవితము, వారి రాగద్వేషమేళనము, ఉచ్చనీచాలు, అనురాగ కాఠిన్యాలు, ఋజుత్వ కుతంత్రాలతోకూడినట్టిన్ని, కరుణామయమూ భావతీవ్రత కలిగించే యావత్ప్రపంచాన్ని, చిత్రించినాడు. ఆయన 'మానిలాజీవ్' 'మన్వీపీభవాయ్' అనేవి అద్భుత రచనలు; వాటిని మరవడానికి గుజరాతు మనసార అంగీకరించదు. అయితే ఆయన పట్టణజీవితసీమల్లో అడుగుపెట్టి రచనచేయబోతే దారితెలియని కొత్తవాడైపోతాడు.

మరొక ప్రఖ్యాత నవలారచయిత 'దర్శక'. ఆయన మహావిద్వాంసుడూ,విదగ్ధుడూ,ఆలోచనాశీలి-అంతేకాక కథానికాకారుడున్నూ. జీవిత తత్త్వాన్ని నవలలద్వారా రచయిత ద్యోతకము చేస్తాడు. జీవితతత్త్వ ప్రతిపాదకాలైనవి కనుక ఆయన నవలలు విశిష్టతను పొందినవి. ఈశ్వర పెట్లీకర్ గుజరాతులో చరోతార్‌లోని. పత్తేదారుల మూర్తి చిత్రణాన్ని ప్రావీణ్యంతో నిర్వహించినాడు. అందుచేత ప్రత్యేకంగా ఆయనను పేర్కొనాలి.

ఐతిహాసిక నవలా రచనలో గతకాలాన్ని మహోజ్జ్వలంగా ఆకర్ష

ణీయముగా చిత్రించే మానసిక స్వభావము గోచరిస్తున్నది. బ్రిటీషువారి ఆధిపత్యంలో గతచరిత్రను రమణీయశిల్పంతో చిత్రించడాన్ని సహజంగా ప్రోత్సహించేవారు. స్వాతంత్ర్య సమరభాగంగా వ్యక్తిగౌరవ భావం పెంపుచేసే తలంపుతో. గతము సర్వసామాన్యంగా మహోన్నతమూ, పూజార్హమున్నూ అయింది. ఝవేర్‌చంద్‌మేఘాణీవంటి రచయితల చేతుల్లో పూర్వకాలం మహోన్నతంగా సంస్కృతిపూర్ణంగా చిత్రితమైంది. రచయితలకు ప్రాచీనయుగము భావోద్రేక కారణమైంది. ఆ పురాతనయుగంలోకి సమకాలికసమస్యలు సామాజిక రాజకీయస్థితిగతులను చొప్పించి మున్షీవంటి రచయితలు పర్యాలోచన చేసినారు. ధూమకేతువువంటి గ్రంథకర్తలు ఉత్సాహాతిశయంచేత ఒక్కొక్కసారి లక్ష్యాన్నిదాటిపోయి, ప్రాచీనకాలంలో సన్నివేశాలూ, స్వభావాలూ, రమణీయంగా అయథార్థంగా, చిత్రించినారు. రచయితలు గతకాల చిత్రణలో సజీవమయిన ఒక జీవన విధానాన్ని వాస్తవికంగాచూపి, తద్వారా ప్రస్తుత జీవితపరిణామము పొందుపరచడానికి యత్నముచేసిన వారు లేరనే చెప్పవలె.

ఐతిహాసిక దర్శనము కొంచెము ఇంచుమించుగా వ్యాఖ్యానంమీద ఆధారపడింది. ఒక నాణెమో, ఒక శిలాఖండమో, ఖిలమైన పురాతన లిఖిత గ్రంథప్రతి కానీ, ఏదో కొంచెము లభ్యమయితే చాలు. దృక్పథం యావత్తూ మారిపోవచ్చును. అందువేత ఐతిహాసిక నిర్ణయం ఇదమిత్థమని రూఢిగా చెప్పడం అసంభవం. అయినప్పటికీ వ్యక్తులవలె దేశాలుకూడా తమ ప్రతిచ్ఛాయలను ఉన్నదున్నట్లు చూడాలని ఇష్టపడతాయి. ఆ ప్రతిచ్ఛాయల్లో వారు కోరునంత సుందరంగా కనబడకపోవచ్చును. పైగా వారు వికృతంగా కనబడవచ్చును. అయినా అవి వారి ప్రతిచ్ఛాయలే. ఆ ఛాయా ప్రతికృతులు తమ సజీవ ఆత్మీయ జీవితభాగ స్మరణలు. అందుచేత కుటుంబంలోని 'అల్బము'లో, వాటి స్థానము ఉండనే ఉన్నది.

గతాన్ని కనుకట్టుగా చిత్రించాలని ఉద్దేశించిన గుజరాతీ నవలా రచయిత, సమకాలిక సమాజాన్ని సామాన్యంగా విమర్శనాత్మక దృష్టి కలవాడై, హేయంగా చూస్తాడు. ప్రస్తుత కాలము నిర్జీవంగా, నీరసంగా,

కనబడడానికి ప్రాచీనమంటే వ్యామోహము కావచ్చును. లేదా రచయిత చుట్టూ ఉండే ప్రజల అల్పత్వంవల్ల విసుగుచెంది, గతకాలమువైపు దృష్టిమరల్చి, ఔదార్య, ధైర్య, ఘనగాంభీర్య వీక్షణం చేయాలని మురిసిపోతాడు. నిజము చెప్పవలసివస్తే ప్రస్తుతస్థితిగతులు తుచ్ఛములు కావు. 1914 లో దక్షిణాఫ్రికానుంచి మహాత్ముడు మాతృదేశానికి విచ్చేసినప్పటినుంచీ, గుజరాతులో జీవసారము పూర్తిగా రూపాంతరము పొందింది. సాహిత్య సంస్కృతులలో, ధైర్య సహవాలలో, శౌర్యత్యాగ సాహసాల్లో, గుజరాతురాష్ట్రానికీ పాలుపంచుకొనే యోగ్యత ఉన్నది. ఈ గ్రంథరచనలనుబట్టి గుజరాతీ రచయితకు, సమకాలిక సమాజాన్నిగూర్చి కనబడే ఇట్టి దృక్పథము, తనచుట్టూ మోసమేచూసి రోసే లక్షణము, అతని ఉన్నతోన్నతమైన ఆదర్శము లవే నిరూపిస్తుంది. అంతేకాని నేటి గుజరాతుల జీవితము అధమంగా ఉన్నదనుకొనరాదు

## చిన్నకథ

కథానిక అనే ఒకానొక సాహిత్యప్రక్రియ రూపొంది అరవయ్యేళ్ళయింది. నాటకము, నవల, బ్లాంక్‌ఛందస్సు తొలియత్నాల తరువాత చాలాకాలానికి కథానిక వచ్చింది. అయినప్పటికీ గుజరాతులో అది గాఢంగా పాతుకు పోయింది. నవలను ఒక్కదాన్ని మినహాయిస్తే ఒక్క కథానికా సాహిత్యరూపమే రచయితకూ, పాఠకుడికిన్నీ, అత్యంత ప్రీతిపాత్రము కాగల్గింది.

పెద్దలకోవలోని రచయితలలో ధూమకేతువు, ఇటీవల నవలా రచనలోకి దిగినాడు. అతను రచించిన తరువాత కథలు అతనికి అధికంగా యశస్సును సంపాదించి పెట్టేవికావు, 'తణఖా' లో రెండు భాగాలు పేరుతెచ్చినట్టుగా. ఝువేర్‌చంద్ మేఘాణీ, రామనారాయణపాఠక్ (ద్విరేఫ) మనకు దూరమైపోయారు! మున్షీ కథలు వ్రాయడం మానివేసినట్టే. ధనశుకలాల్ మెహతా, ఉమాశంకర్ జోషి (వాసుకి), సుందరం (త్రిశూల్) కూడా కథలు వ్రాయడంలేదు. మిగిలిన వాళ్ళల్లో గులాబ్‌దాస్‌బ్రోకర్, పన్నాలాల్‌పటేలు ఇంకా కథానికా క్షేత్రంలో ఉన్నారు. గులాబ్‌దాస్ బ్రోకరు అద్భుతంగా మానవప్రకృతిని పరి

శిలించి, పైకి సరళంగా, సామాన్యంగా గోచరించే జీవితానుభవంలో నుంచి సుందర విషయాలు కల్పన చేసినాడు. జానపద జీవిత చిత్రణలో పన్నాలాల్ పటేల్ ఇంకా సిద్ధహస్తుడే.

వారి-తరువాత వచ్చిన రచయితలలో జయంతి దలాల్ కథానికా రూపవస్తువులకు సంబంధించిన సాహస ప్రయోగాలు ఇంకాచేస్తూనే ఉన్నారు. ఆయనది నిశిత పరిశీలనమూ, తీవ్రహేళనమున్నూ. వినోదినీ నీలకంఠ ఆలేఖ్యమువలె తీర్చిదిద్దే నేర్పుకలది. ఈశ్వర పెట్లీకర్ రచనలో సారళ్యము హృదయాన్ని కదల్చివేస్తుంది. చున్నీలాల్ మదియా ఈ బృందంలో అపరిమితంగా వ్రాస్తున్నాడు గల్పికలు. కిసాన్‌సింహచావడా సౌందర్యా కృష్టుడు కాకుండా ఉండలేడు. వీ రంతా కథానికాక్షేత్రంలో కృషి చేస్తూనే ఉన్నారు.

ఇటీవల కొత్తరచయితలలో ఈ క్రిందిపేర్లు గమనార్హాలు. కేతన్ మున్షీ మార్చి 1956 లో విషాదమరణము పొందినాడు. వేణీబాయ్ పురోహిత్, రమణలాల్‌పఠక్, శివకుమారజోషీ ప్రభృతు లున్నారు.

కథానికా సంవిధానము బాగా అనుసరించగా ఇటీవల కొన్నేళ్ళ నుంచీ వాస్తవకథారచనకూడా గుజరాతులో పరిపాటి అయింది. వాస్తవిక జీవిత నాటకము శిల్పసౌష్ఠవంగా ప్రదర్శించడమే రచయిత ఉద్దేశ్యము, యత్నమున్నూ. యథార్థకథలు ఝవేర్‌చంద్‌మేఘాణీ, కిసాన్ సింహచావడా, గులాబ్‌దాస్‌బోచార్, జి. పి మవలంకరులు రచించారు. ఆ కథలలో రచయితల ఉద్దేశ్యము ఇంద్రియకల్లోల కల్పనంకాక మానవ ప్రకృతిలోని ఔదార్యమూ గుణోన్నతీ చిత్రించడమే.

గుజరాతీభాషలో సామాన్య కథాకారుణ్ణి ఆకర్షించిన కథావస్తువు, సమాజములోని చెడుగు. కొత్తగా రచన ఆరంభించి పైకివస్తున్న కథారచయితలను దారిద్ర్యము, నిరక్షరాస్యత, అసూయ, కాముక ప్రసక్తివంటి విషయాలు కథావస్తువులై ఆకర్షించినవి. అక్కడక్కడా యాత్రాసాహసాలు, వేట, వ్యావహారిక సత్యదూరమైన కథావస్తువులను తీసుకొని చేసిన రచనలు, గోచరిస్తాయి. అయితే అవిస్వల్పం. 1942 నాటి మహోద్యమము, మానవ ప్రేరేపితమైన వంగదేశంలో కాటకం, స్వాతంత్ర్యోపలబ్ధి, దేశవిభజన, తత్ఫలితంగా ఉన్మూలిత మానవ విషా

దాంత ఘోరగాథ, ప్రథమ పంచవర్షీయ ప్రణాళిక, జాతి మేల్కొని సాహసంగా త్రాణ తెచ్చుకోడానికి సాధనచేయడం – మాతృదేశంలో విజృంభణలు, ద్వితీయ ప్రపంచసంగ్రామమువల్ల వినాశము, విదేశాల్లో తత్ఫలితాలవంటివి, ప్రవీణులయిన గుజరాతీ కథానికాకారుల భావనాశక్తిని గాఢంగా సముచితంగా చలింపచేయవలసి ఉన్నవి.

భారతదేశంలో గుజరాతీయులు అమిత సాహసోపేతులు. ప్రాచీన కాలంనుంచీ వారు విదేశాల్లో ప్రపంచంలో మూలమూలలా వ్యాపించి స్థావరాలు ఏర్పరచుకొన్నారు. మానవ నివాసానికి అయోగ్యమైన ప్రమాదభరిత ప్రాంతాల్లోకూడా చొచ్చుకొని స్థిరవాసము కల్పించుకొన్నవాళ్ళలో ప్రథములు. కేవలం వాణిజ్యజీవులుకనుక – వారి వర్తక రక్షణకు ఏ ఇంపీరియల్ ప్రిఫరెన్స్ లేకపోగా-మానవసంబంధం కలుపుకోడంలో ప్రవీణులయినారు. ఏ పరిసరాలకయినా అనుకూలంగా జీవించగల అమిత సామర్థ్యము వాళ్ళకున్నది. అయినా గుజరాతుకు సంబంధించని ప్రాంతాలనూ, మనుష్యులను గురించి రచించిన కథలు అంతగాలేవు. ఇది గుణదోషాలు తర్కించేచోటుకాదు. అయితే ఈ విశిష్టత ఒక్క గుజరాతీయులకేనా ఉన్నది, అనే విషయంకూడా నేను విచారణ చేయను. ఉన్నపరిస్థితులు ఉన్నట్లు, వ్యాఖ్యానించకుండా పొందుపరచడమే నా ఉద్దేశము.

## రూపకము

నవల, చిన్నకథలవలె రంగస్థలారంభ వికాసాలుకూడా ముఖ్యంగా బ్రిటిష ప్రభావమువల్లనే వచ్చినవి. ఆదినుంచీ గుజరాతీయ రూపకము, ఆంగ్లసంస్కృత నాటక లక్షణ సమ్మిశ్రణంవల్ల ఉద్భవమైంది. సంస్కృత నాటక ప్రభావం ఎక్కువ లేకపోగా, ముఖ్యంగా ఆంగ్లనాటకకర్త, షేక్స్పియరు ప్రభావము అధికము.

ఆదిలో కొన్నిసంవత్సరాలనుంచీ ప్రముఖ సాహితీపరులు రంగశాలకోసం నాటకరచన చేసే అలవాటు పడినారు. కాని చాలాకాలము సాహితీగుణ విశిష్టమైన నాటకానికీ, రంగానుకూల నాటకానికీ, సంపూర్ణంగా సంబంధం తెగిపోయింది. సాహితీవేత్తలని ఖ్యాతి ఆర్జించిన వారి

దృష్టి రంగాను కూలంగాలేదు. రంగాను కూలంగా నాటకాలు వ్రాసే వారికి, సాహిత్యాభిరుచి పన్నగిల్లిపోయింది. పాతికేళ్ళనాడు సాహిత్య సౌష్ఠవముగల నాటకద్వయాన్ని, ప్రముఖులైన నటులు ప్రదర్శించారు. కాని అది రచయితలూ, నటులూ, పరస్పరం ఒకరికొప మొకరు తమతమ గౌరవ స్థానములలోనుండి దిగివచ్చినట్లు చేసిన ప్రయత్నమే సాహిత్యము రంగశాలకు దూరమైపోయింది.

కాని వేగంగా కాలము మారిపోతున్నది. సినీమావంటి ఇతర ఆకర్షణీయ వినోదాల ధాటికి నిలువగలగడానికి, నటన వృత్తిగా పెట్టు కొన్నవారు, మారుతున్న పరిస్థితులకు అనుకూలంగా సిద్ధమైనారు. సమ కాలిక లోకవృత్తము తీసుకొని నాటకాలు కొందరు రచించారు.

స్త్రీ పాత్రలను నిర్వహించడానికి స్త్రీలకు ప్రోద్బలం ఇచ్చినారు. నాట్యసంగీతకాల ప్రదర్శనలో నవ్యకల్పనలు చేసినారు. సుదీర్ఘ సంపూర్ణ నాటక ప్రయోగానికి బదులుగా వృత్తిగా పెట్టుకొన్న నాటక సంఘాలవారు రెండుమూడు ఏకాంక నాటికలు ప్రదర్శించారుకూడా. అయితే యీ ఏకాంక నాటికా ప్రయోగము వారిపోషకుల ఆమోదాన్ని పొందలేదు. అందుచేత నటులు పురాతన మార్గము తిరిగి ఆరంభించారు.

1914 లో ఔత్సాహిక నాటక రంగము ఆవిర్భవించింది. చంద్ర వదన్ మెహతా, కె. యం. మున్షీ ప్రభృతులు నాటకాలు ఆడటంవల్ల జనామోదం కలిగింది. వారు నాటకకళకు అపారమైన సేవచేసినారు. విద్యాధికులలో అభిరుచి కలిగించినారు. ఔత్సాహిక నాటకరంగము జనామోదం పొందేటట్లు చేయడంలో వారు సామాన్యస్థాయిని మించి పైకిపోలేదు. వారు ఆడిననాటకాలు చాలావరకు ఇంద్రియ సంక్షోభం కలిగించే చవకబారు చెత్తనాటకాలో, లేదా అసందర్భపు అవకతవక ప్రహసనాలో. ఇలా కొన్నేళ్ళు సాగింది.

ఈలోగా ఔత్సాహిక నాటకోద్యమము త్వరితమై సాగింది. అహ మ్మదాబాద్, సూరత్‌వంటి పట్టణాల్లో కార్యక్రమాలు ఉమ్మరంగా నడిచి నవి నాటకప్రదర్శనలో, రంగశాలా సంవిధానంలో, అభినివేశము కల వాళ్లు సమితులుగా ఏర్పడినారు. కొత్తనాటకాలూ, ప్రహసనాలూ ఛమ త్కారంగా వ్రాశారు. ఆంగ్లభాషనుంచో, వంగభాషనుంచో అను

వాదాలూ - అనుకరణాలూ ప్రోత్సహింపబడుతూ వచ్చాయి. అతి త్వరగా ఔత్సాహిక నాటకరంగం నిలవతొక్కుకొన్నది.

గత కొన్ని సంవత్సరాలనుంచీ గుజరాతులో ఔత్సాహిక నాటక రంగాభ్యుదయం అద్భుతంగా ఉంది. నాట్యకళాసామర్థ్యము తీసు కొన్నప్పుడు ఉదాత్తస్థాయికే వచ్చింది. నాటక ప్రయోగవిధానంలో కూడా ఉచ్చస్థాయి వచ్చింది. సామాజికులుకూడా సమీక్షాదక్షులు వివే చన కలవారవుతున్నారు. ఔత్సాహికరంగానికి తటస్థించిన విషమ సమస్య మంచిరచనలు కొరవడడమే. సామాన్యంగా పాఠశాలల్లో కళాశాలల్లోనూ, ప్రహసనాలూ, సామాన్య హాస్యము జాలువారే నాటి కలు ప్రదర్శించడానికి ఉత్సాహపడతారు. తక్కిన నాటక సమాజాలు తరుచుగా అనువాదాలు, అన్యభాషానుకరణాలమీద ఆధారపడతాయి. గుజరాతులో ప్రథమగణ్యమైన స్వతంత్ర నాటకరచనకు లోటు ఏర్ప డింది. ఆ అనువాదాలూ, అనుకరణాలూ సాహిత్యంలో ఉత్తమమైనవే కావలసిన అవసరంలేదు. శక్తిసామర్థ్యాలుగల ఔత్సాహిక నాటకరంగం ఇంతకంటె ఉత్తమ నాటకాలు పొందడానికి యోగ్యమైఉన్నది.

సాహిత్యశ్రేణిలో చేరగల నాటకాలు, సంపూర్ణనాటకాలు ఇంచు మించుగా అంతరించిపోయినవి. 1914 లో ప్రకటితమైన 'రాయ్ నో-పర్వత్' అనే నాటకానంతరం గుజరాతులో సాహితీగుణ సౌష్ఠవంగల నాటకప్రదర్శనమే జరగలేదు. నానాలాలు భావగీతాత్మక నాటికను సాహిత్యంలో వెలయింపచేదామనుకొన్నాడు. అయితే అది గుజరాతులో పెరగలేకపోయింది. రచయితలు పద్యనాటికారచనలో ప్రశంసార్హమైన ప్రయత్నాలు చేశారు. అయితే గుజరాతులో ఏకాంకనాటిక నాటక సాహి త్యంలో సుసంపన్నమైన అంగమైంది. భటుబాయ్ ఉమర్‌వాడియా, యశ్వంతపాండ్య, ప్రాణజీవన్‌పాఠక్ మొదటిసారిగా గుజరాతీ సాహి త్యంలో ఏకాంకికను ప్రవేశపెట్టినప్పటినుంచీ, ఆ సాహిత్యప్రక్రియ చెప్పుకోతగిన విజయము సాధించింది. ఆ కృతిలోనూ, కథావస్తువు లోను, ఏకాంకిక సుసంపన్న వైవిధ్యంకలది. ఉమాశంకర్‌జోషి గుజ రాతులో జానపద జీవితపు వెలుగునీడలు బాగా చూపినాడు. 'సపకాభర' అనే దానిలో విషాదాంతమే స్త్రీ జీవితమని, 'షాహిద్ అనే బిజన్‌నటకో'

అనే నాటికలో ప్రస్తుత నాగరికతలోని కుతంత్రాన్నీ, హేయాన్నీచిత్రించినాడు. గులాబ్‌దాస్‌బ్రోచర్ మానవస్వభావ ప్రవృత్తిలో గల మర్మాన్ని విప్పి, మనోవిజ్ఞానముచూపినాడు. జయన్తిదలాల్ స్వభావసిద్ధమయిన హేళనాత్మకధోరణిలో, సమకాలిక సామాజిక రాజ్యనైతికమైన విస్పారమైన అంతస్సును చూపినాడు. చునేలాల్ తుదియా భాషమీద అధికారికమైన పాటవాన్ని చూపుతూ, పాఠకులను ఒకసారి భావోద్వేగ కల్పనాత్మక రమణీయ దేశములోకి, ఒక్కొక్కసారి కేవలము వాస్తవిక ప్రపంచంలోకి తీసుకొని వెళ్ళుతాడు. గుజరాతీయ ఏకాంక నాటికలోహాస్యకరుణాది వ్యక్తీకరణము సర్వతోముఖంగా ఉండి పరిపూర్ణతపొందింది.

## స్వీయకథ, జీవితకథ

గుజరాతీ సాహిత్యంలో స్వాతంత్ర్య యుద్ధానంతర కాలంలో అద్భుతంగా ప్రవృద్ధమైన సాహిత్యప్రక్రియ, స్వీయజీవితకథా రచన. సాహిత్యవేత్తలయిన పెద్దలంతా–మున్షీ, రమణలాల్ దేశాయ్, ధూమకేతు, ధన్‌సుఖలాల్ మెహతా–స్వీయచరిత్రలు రచించినవారే. చంద్రవదనమెహతా, చంపషి ఉద్దేషీకూడా స్వవిషయము చాలా చెప్పుకొన్నవారే. నిజంగా స్వీయకథలు ఉల్లాసంగా ఉంటాయి. సంపన్నమైన కథావస్తు విశేషంవల్ల కొన్ని, మరికొన్ని రచనా విధానంవల్లనూ, బాగుంటాయి. అయితే ప్రముఖమైన స్వీయజీవితకథలు మూడున్నాయి. అవి నానాభాయ్ భట్టు, ఇందులాల్ యాజ్ఞిక్, ప్రభుదాసగాంధీ చరిత్రలు. నానాభాయ్ కృతమైన 'చంతర్ అనేఘడ్‌తర్' అనే రచన గొప్పది. అది ప్రసన్నమై నిష్కపటమై, ఋజువై, పాఠక హృదయాలను కదిలిస్తుంది. ఇందులాల్‌యాజ్ఞిక్ స్వీయచరిత్ర లక్ష్యప్రాయమైన సాహిత్య శైలిలో లేకపోయినా, 1892 నుంచీ 1921 వరకూ గుజరాతులోని జీవితాన్ని చిత్రించింది. ఆ యుగంలో లోకప్రవృత్తితో సంబంధము కలవాడు కావడంచేత ఇందులాల్ స్వీయచరిత్ర వ్రాయడానికి నిజంగా అర్హుడూ, ప్రామాణికుడున్నూ. ఆయన వ్యక్తిగత సంస్మరణలు ముఖ్యంగా తన పత్నికి సంబంధించినవి, బాగా వ్రాసినాడు. అది ఇంపుగా ఉండడం చేత పేర్కొనడానికి తగినది, వాటిలో ఆత్మపరిశీలనము, మహాత్ముని

'సత్య ప్రయోగ కథ' తో పోల్చడానికి తగినది. అయితే జీవిత చరిత్రలు మూడింటిలో, ప్రభుదాసగాంధీ రచించిన 'జీవన్‌మన్ పరోధ' చాలా గొప్పది. ఆ గ్రంథంలో రచయిత పొందిన వికాసదశలు విశేషంగా వివరింపబడ్డవి. అయితే గ్రంథకర్త మనలను ఫోనిక్సు ఆశ్రమకాలానికి తీసుకొని పోతాడు. అనగా గాంధి సత్యాహింసా ప్రయోగాలుచేస్తూ ఉన్నకాలమది. అవే తుదకాయనను అద్భుత మటనగా చేయగలిగినవి. అంతేకాక ఈ పుస్తకము పసివాళ్ళ మనోవికాసాన్నీ, వక్రబుద్ధినీ బాగా చూపింది. తన వ్యక్తిగత మూల్యాన్ని అంచనా వేసేటప్పుడు, ఈ గ్రంథకర్త అతినమ్రత చూపినాడు. అయితే ప్రకృతిని పాటవముతో చిత్రణ చేయడంలోనూ, మానవస్వభావమును బాగా అవగాహన చేసుకోడంలోనూ, ఆయన ప్రావీణ్యము చూపినాడు. ఆది నైపుణ్యాంగల ఏ రచయితకైనా గణ్యతను సంపాదించి పెడతాయి.

గుజరాతులో జీవితకథా సాహిత్యంకూడా అభివృద్ధి మార్గాన్ని అందుకొంటున్నది. మహాత్ముని జీవితచరిత్ర చాలామంది ఉల్లేఖించినారు. అయితే నరహరి పరేఖ్ వ్రాసిన 'సర్దారు వల్లభభాయ్' జీవిత గాథ. కాంతిలాల్‌షా కృతమైన 'ధక్కర్ బాబా' బబలుబాయి మెహతా రచించిన 'రవిశంకర్ మహారాజ' జీవిత చరిత్రలను ప్రత్యేకంగా పేర్కొనాలి.

సమకాలిక సాహిత్యంలో దినచర్య రచనకూడా ఒక అంగం. ఒకతీరుగా నరసింహారావు వటియా రచించిన దినచర్యలో, సన్నివేశాలు లేక పోయినా భిన్నకోణాల్లోంచి జీవితా లోకనం చేయడం జరిగింది. ఇంకోతీరుగాచూస్తే ఆ దినచర్యవల్ల మానవుడు, నిరంతర నిర్దాక్షిణ్య విధిధాటికిఓర్చి, ధీరుడు కావడం కనబడుతుంది. మనుబెన్‌గాంధీకూడా ఆగాఖాన్ ప్రాసాదంలోనూ, నౌకాళీలోనూ, మహాత్ముని దైనందిన ప్రవృత్తిని ఉల్లేఖించి ప్రకటించింది. [1]అయితే గుజరాతీ సాహిత్యంలో

1 1955 లో సాహిత్యఅకాడమీవారి పారితోషికంగా అందుకొన్నది. స్వాతంత్ర్యానంతర కాలంలో ప్రఖ్యాతమైన సాహితీగుణ విశేషముగల రచనగా ఎన్నికచేయబడింది సంపా.

దినచర్య రచనల్లో 'మహదేవ్ భాయ్-నీ-డయరీ' అయిదు భాగాల్లో ప్రకటితమైనది, ఉత్తమంగా పేర్కొనాలి. ఆ మహాగ్రంథంలో వ్యక్తి త్రయ జీవితం సజీవంగా చిత్రితమైంది. అద్భుతమైన మహాత్ముని జీవిత మున్నది. నిరాడంబర దేశభక్తుడూ, నర్మగర్భ ఛలోక్తి ప్రయోక్తగా, సర్దారు పటేలు గోచరిస్తాడు. గ్రంథకర్త మహదేవదేశాయి మృదు భాషిగా, స్వార్థరహితుడై, సంస్కృతి సంపన్నుడైనట్టు, గ్రంథంవల్ల విశదమవుతున్నది.

## వ్యాసరచన, పత్రికా లేఖనము

ఆత్మీయతా ద్యోతక వ్యాసరచన గుజరాతీయ సృజనాత్మక సాహిత్యంలో అల్పంగా ఉంది. కాకాకలేల్కరు ప్రభృతులు తప్ప తక్కిన రచయితలు సాహిత్య వ్యాసరచనలో ఉదాసీను లయినారు. ఈ ప్రస్తుత తరంలో ఆత్మీయతా ప్రతీతిగల సౌష్ఠవమైన వ్యాసరచనకు ఒక్క రచయితకూడా పూనుకోలేదు.

హాస్యము జాలువారే వ్యాసావళి విషయంలో, రచయితలు ఉదాసీనులుగాలేరు. నిజానికి గుజరాతులో హాస్యరచయితలు అంతగాలేరు. అయితే రచనచేసే కొద్దిమంది ప్రవీణులూ ఉచ్చకోటిలోవారే. ప్రాచీనులలో జ్యోతీంద్రదావే, ఆధునికులలో వకుళ త్రిపాఠీ, నవనీత్ సేవకుల పేర్లు ముఖ్యంగా చెప్పవలసి ఉంటుంది. ఇటీవల జ్యోతీంద్రుని రచనలో పునరుక్తి, యోచనాత్మక అభిభాషణమున్నూ గోచరిస్తాయి. ఇప్పటికీ ఆయనే గుజరాతీలో ఉత్తమ హాస్యరచయిత అని నిస్సందేహంగా చెప్పాలి. ఆయనలో సౌజన్యం, సర్వతోముఖ ప్రజ్ఞా, పక్షపాత రాహిత్యం కనపడతాయి. ఆయనలో సద్యోచమత్కారం, హాస్యం, హేళన గోచరమవుతున్నాయి. అల్పానల్ప శ్రేణుల్లో హాస్యం జాలువారేటట్టు చేయగలడు. వకుళత్రిపాఠీ హాస్యము స్వచ్ఛంగా, సంపన్నంగా ఉంటుంది. ఒక విషయాన్నో ఒక సన్నివేశాన్నో ఆభాస సమేత దృక్కోణం నుంచి వీక్షించడంవల్ల, రచనలో హాస్యము జాలువారుతుంది. నవనీతుని 'సప్త తంత్ర-నీ-వకో' అనే అవహేళనాత్మక వ్యాసావళి

ప్రశంసార్హము. సమకాలిక లోకప్రవృత్తినిచూచి, రచయిత కొంత తీవ్రంగా కొంతహాస్యంగా హేళనచేసినాడు.

గుజరాతులో పత్రికాలేఖనంకూడా సాహిత్యానికి అమూల్యమైన సేవచేస్తున్నది. ఇంచుమించుగా బాధ్యతగల దైనిక పత్రికలన్నింటిలో వారపత్రికల్లోనూ చాలాకాలంనుంచీ సాహిత్యగోష్ఠి, చర్చలూ, గ్రంథ సమీక్షలు, సారస్వతానుబంధాలుగా, ప్రకటిత మవుతూనే ఉన్నవి. పాఠకులకు సాహిత్యానుబంధాలు రుచిగా ఉంటున్నవి. అవి వారి అభిరుచికి ప్రోద్బలకంగానూ ఉంటున్నవి. మాసపత్రికలు, త్రైమాసిక పత్రికలుకూడా యథాశక్తిగా సారస్వత సేవచేసినవి. ఆధునిక పత్రికల్లో 'సంస్కృతి', సాంస్కృతికంగా, సాహిత్యదృష్ట్యా ఉత్తమ సాహిత్య మాసపత్రిక. 'కుమార్' కేవలం మాసపత్రికేకాక అది విద్యా సంస్థవంటిది కూడాను. గత ముప్పయ్యేళ్ళనుంచీ పాఠకుల మనసునూ, శీలాన్నీ, తీర్చిదిద్దడానికి కంకణము కట్టుకొన్నది. అఖండ ఆనందపత్రిక, పుట్టినప్పట్నించీ, పదేళ్లబట్టీ, బహుళ ప్రచారము ఏ గుజరాతీ పత్రికలకు లేనంతగా పొందింది. గుజరాతీ మాసపత్రికలలో ఈ మూడింటిని పేర్కొనాలి. అలాగే జన్మభూమి అనే దైనికపత్రిక విషయము చెప్పక తప్పదు. ఈ పత్రికయొక్క హేతుబద్ధమైన ఉదార విభాగమువల్ల గుజరాతీలో నవీన రాజకీయచైతన్యం సంస్కారాలు కలిగినవి.

అగ్రేసరంగా ఉన్న గుజరాతీపత్రికల ప్రత్యేకత హేళనాత్మక కావ్యాలు ప్రకటించడము. 1942 లో క్విట్ఇండియా ఉద్యమంవల్ల హేళనాత్మక కావ్యవికాసం కలిగింది. వేదికలమీద ఉపన్యాసాలకూ పత్రికలద్వారాను భావవ్యక్తీకరణకు చాలా పరిమితులు విధించడంవల్ల ప్రభుత్వ పరిపాలనావిధానాన్ని విమర్శించే వీలే లేకపోయింది. అందుచేత హాస్యం, హేళనమూలంగా పాలనావిధానంలోని అవకతవకలను. బహిరంగపరచడానికి వీలయింది. కర్షణదాస్‌మణిక్ గుజరాతులో ప్రథము డిందుకు. ఈ ప్రయోజనంకోసం మధ్యమకాలిక ఆఖ్యానము ఉపయోగపడుతుందని గ్రహించినాడు. 'వైశంపాయనీవాణి' అనే అపహేళనాత్మక వీరకావ్యం అద్భుత చమత్కృతిలో బ్రిటీషుప్రభు

త్వము వారి కుతంత్రతమునూ, అననురూపితమూ, అల్పత్వమునూ, ఆ కాలపు వారి అనుచరులనూ, చిత్రించి, పత్రికాలేఖన రూపముగా విజయము సాధించింది. ఇటువంటి కావ్యశిల్పాన్ని వ్యాప్తికితెచ్చిన మణిక్కనకు అనుయాయులు చాలామంది ఏర్పడినారు. ఇప్పటికి గుజరాతీ దైనికపత్రికలు 'జన్మభూమి', 'గుజరాత్‌సమాచార్' 'సందేశ', 'లోకసత్త' పత్రికల్లో అటువంటి హేళనాత్మక కవిత్వము వదలకుండ ప్రకటిత మౌతూనే వుంది.

## పార్శీ రచయితలు

గుజరాతీ రచయితలేకాకుండా పార్శీలుకూడా సారస్వతక్షేత్రమును యథాశక్తి దోహదముచేశారు. వారిలో కొంతమంది ప్రామాణికమైన గుజరాతీ భాషలో కవిత్వము చెప్పినారు. కొందరు కథానికలు రచించినారు. గుజరాతీ రచయితగా అట్టివారు తమ గుణవిశేషాన్నిబట్టి గౌరవం సంపాదించారు. తక్కినవారు ఏదోవిధంగా ఏకాంతజీవితం గడుపుతూ బాషాపవిత్రతను, నుడికారాన్ని లెక్క చేయకుండా రచిస్తున్నారు. వారు తమతమ సామాజికుల అభిరుచికి తగినట్టు రచనలు చేశారు. అయినా వారి భాష గుజరాతీయే. గుజరాతీలోనే కథలూ, నవలలూ, నాటకాలూ, కవిత్వము, వ్యాసాలూ, సంపాదకీయాలు వ్రాసి పఠితృ జనామోదము పొందినారు.

## రచయిత్రులు

స్త్రీలుకూడా సమకాలిక గుజరాతీ సాహిత్యాన్ని ఉల్లాసకర రచనలతో దోహదము చేశారు. వినోదినీ నీలకంఠనుగూర్చి ఇదివరలో చెప్పినాను. లభుబెన్‌మెహతా, కుందనిక కపాడియా, ధిరుబెన్‌పటేల్, గీతాపరీఖ్ (నీకవడియా) ప్రముఖులు.

## అనువాదాలు

సమకాలిక గుజరాతీ సాహిత్యంలో అనువాదాలూ అనుకరణలూ చాలా ఉన్నాయి. షేక్స్పియర్, ఇబ్సెన్, టాల్‌స్టాయ్, విక్టర్‌యూగో,

మొపాసా, చెకోవ్, గోర్కి, ఎమర్సన్, ప్లేటో, షా ప్రభృతులైన వైదేశిక రచయితలు, రవీంద్రనాథ్, బంకిమచంద్ర, శరచ్చంద్ర, ప్రేమ్‌చంద్, ఖండేకర్, సానేగురూజీ, అత్రి వంటి భారతీయ రచయితలూ వారి గ్రంథానువాదాల ద్వారా గుజరాతీ పాఠకలోకానికి పరిచితులైనారు.

గుజరాతీబాషలోకి విశ్వనాథభట్టు టాల్‌స్టాయ్ రచనల్లో ముఖ్యమైనవి అనువదించినాడు. 'యుద్ధము-శాంతి' అనే బృహద్గ్రంథం జయంతి దలాల్ యిటీవల అనువదించినాడు. టాల్‌స్టాయ్‌తప్ప ఇతర ప్రపంచ రచయితల గ్రంథాలు సమగ్రంగా సౌష్ఠవంగా గుజరాతీలో అనువదింపబడలేదు. అమరకవులయిన హోమర్, వర్జిల్, దాంతే, మిల్టన్, గెధే, గ్రీకుల ప్రౌఢ నాటకాలనూ అనువదించాలి.

ఇంతవరకూ నవలలూ, కథానికలే అన్యసాహిత్యాలనుండి అనువదింపబడ్డవి. అనగా వాణిజ్య తత్పరత, కలుషిత సాహిత్యాభిరుచిన్నీ, ఇటువంటి ప్రవృత్తికి మూల కారణము.

## వైజ్ఞానిక సాహిత్యము

శక్తిదాయకమైన సాహితినుంచి, వైజ్ఞానిక సాహిత్యంవైపు మళ్ళితే, గుజరాతీలో అమూల్య సారస్వత ప్రవృత్తి కొంత గోచరిస్తుంది. అహమ్మదాబాదులో గుజరాతీ విద్యాసభ, బరోడాలో మహారాజ శాయజీరాయ విశ్వవిద్యాలయం, సూరతులో చునీలాల్ గాంధీ పరిశోధన సంస్థ, బొంబాయిలో భారతీయ విద్యాభవనము, ఫోర్బ్సు గుజరాతీసభ వంటివి పురాతన లిఖిత ప్రతులను ప్రమాణ గ్రంథాలను ప్రకటించినవి. ఆ పుస్తకాలు గుజరాతీ భాషాచరిత్ర పఠనానికి కావలసిన ఉపయోగ దాయక విషయాలను సమకూర్చినవి. కొన్ని సంవత్సరాల కిందట ప్రకటితమయిన సుందరకవికృత 'అర్వాచీన కవిత', రామనారాయణ పాఠకుని 'బృహత్ పింగళ్'[1] అనే కృతులు మహాకృషిఫలాలు. వానిలో కనిపించే

---

[1] 1956 లో సాహిత్య అకాడమీ గుజరాతీ సాహిత్యానికి పారితోషిక మిచ్చింది.—సంపా.

చక్కని అవగాహన, పరిణత నిర్ణయము. స్వతంత్రధోరణి, ఏ భాష కయినా ఏ సాహిత్యాని కయినా అలంకారాలే.

విశేషకృషి సారస్వత సమీక్షాక్షేత్రాల్లో సాగుతున్నది విష్ణు ప్రసాద్ త్రివేదీ, దోలారాయ్ మాన్‌కడ్, జె. ఇ. సంజన, విశ్వనాథభట్, విజయరాయ వైద్య, అనంతరాయ్‌రావల్ విమర్శకులై కృషిచేస్తున్నారు. అపారంగా దార్శనికమైన వ్యాసంగం చేస్తున్నవారు, కీ. శే కిశోరీలాల్ మష్రూవాలా, పండిత శుక్లజీలు, ఇతిహాసిక పరిశోధన మునిజన విజయులు, హరిప్రసాదశాస్త్రి ప్రభృతులు చేస్తున్నారు. కీ. శే. దుర్గాశంకరశాస్త్రికృషికి తోడుగా, శబ్దశాస్త్రంలో, భాషాతత్వంలో, భోగిలాల్ సందేసర, బేచరదాస పండితులు, హరిభల్లభ భయానీ, ప్రబోధపండితులు కృషిచేస్తున్నారు. కాని ఇవన్నీ ఇంతవరకూ పరిశోధనాపత్రికల్లో అప్పుడప్పుడూ వ్యాసాలుగా ఉల్లేఖించడంమూలంగా మాత్రమే సాగుతున్నవి. సాహిత్య సమీక్షాత్మక గ్రంథం, సాకల్యంగా చర్చిస్తూ సమగ్రతతో ప్రామాణికంగా ఉల్లేఖించినది ఒక్కటిలేదు. ఇదేరీతిగా సమగ్ర వ్యాకరణము సంస్కృతాన్ని ఆధారంచేసిగానీ,ఆంగ్లాన్నిఆధారంచేసిగాని వ్రాసినవి కాక భాషాప్రయోగాల ఆధారంతో వ్రాసింది ఏ ఒక్కటీరాలేదు.

బహుకాలంకిందట నరసింహరావు దివటియా రచించిన గుజరాతీ భాషాసాహిత్యం అన్న భాగద్వయాత్మక గ్రంథము వచ్చింది. ఆ తరువాత నవీనంగా సశాస్త్రీయంగా, కూలంకషంగా అధ్యయనంచేసి, ఆ ఫలితాలను పొందుపరుస్తూ ఏ ఒక్కపుస్తకమూరాలేదు. నరసింహరావు పుస్తకమైనా, అనేక నవీన పరిశోధనల దృష్ట్యా, సంస్కరింపబడనూ లేదు. ప్రమాణబద్ధమై విపుల విషయాలతో గుజరాతీ సాహిత్యచరిత్ర, ఆంగ్లంలో సెయింట్స్‌బరీవలెనో, లెజియస్‌వలెనో, కెజమియన్‌వలెనో వ్రాయవలసిన అవసరం ఎంతయినా ఉన్నది.

నిజానికి స్వాతంత్ర్యోపలబ్ధి తరువాతకాలంలోనే భాషాసాహిత్య వికాసానికి అనుకూల వాతావరణము ఏర్పడింది. రాష్ట్ర కేంద్రప్రభుత్వాలు ముందుకువచ్చి సాహితీ గుణసౌష్ఠవాన్ని గుర్తిస్తూ ధనరూపంగా పారితోషికా లిస్తున్నవి. విశ్వవిద్యాలయాల స్థాపనంకూడ భాషా సాహిత్యాలను సక్రమంగా సశాస్త్రీయంగా అధ్యయనం చేయ

దానికి ప్రోత్సహించింది. గుజరాతుసాహిత్య వాతావరణంలో భిన్న భాషల, — జాతీయ వైదేశికభాషల, నిరంతర విస్తృత సంబంధాల వల్ల — వాటి ప్రభావము అనుభవ గోచరమవుతున్నది. గుజరాతులో ప్రస్తుతం సామాన్య రచయితకూడా కేవలం గుజరాతీ, గుజరాతీ సార స్వతం అనే సంకుచితసీమల్లో యోచించడం మానుకొన్నాడు. అతడు సర్వవిశాల దిక్చక్ర వాళాలను తిలకిస్తున్నాడు.

అధునిక గుజరాతీ రచయితకూడా ప్రపంచంలో ఇతర దేశీయ రచయితలవలెనే విషమస్థితిలో కృషిచేస్తున్నాడు. కవి చెప్పినమాటల్లో చెప్పవలెనంటే అతడు "మృతప్రపంచానికీ, శక్తిరహిత అనుత్పన్న ప్రపంచానికీ, మధ్య సంచరిస్తున్నాడు." 'రేపు' అనే దానిలో అణు, ఉదజనిబాంబులవల్ల, అతడి విశ్వాసం ఛిన్నాభిన్నమై పోతున్నది. అలాగే జీవితపురుషార్థాల విషయంలోనూ. అందుచేత అతడి కర్తవ్యము కొండ ఎక్కడంవలె కష్టసాధ్యంగా కనబడుతున్నది. అతను మొదట జీవిత పురుషార్థాలపట్ల నిజవిశ్వాసాన్ని బలిష్ఠముచేసికొంటూ, నూతన శక్తి తెచ్చుకోవాలి. అనంతరం అతను అప్రయత్నంగా వికస్వర సుస్వరంలో మృతప్రాయుల ఎడదల్లో ప్రతి స్పందనాలు మురుమ్మరించేటట్టు గానం చేయాలి.

## ఆకర గ్రంథజాతము


Mile Stones in Gujarati Literature,
*by K. M. Jhaveri.*

Further Mile stones in Gujarati Literature,
*by K. M. Jahveri.*

Present State of Gujarati Literature,
*by K. M. Jhaveri.*

Gujarat and its Literature, *by K. M. Munshi.*

Linguistic Survey of India, *by G. A. Grierson,*
*Vol IX PT 2, pp. 323-477*

# తమిళ సాహిత్యము

టి. పి. మీనాక్షి సుందరము

## నేపథ్యభూమి

దక్షిణ భారతంలోని ప్రస్తుత మద్రాసు రాష్ట్రంలోనూ, సింహళంలో ఉత్తర తూర్పు మండలాల్లోనూ ప్రధానంగా వ్యవహారంలో ఉన్న భాష తమిళము. పై చెప్పిన ప్రాంతాలనుండి దక్షిణ తూర్పు ఆఫ్రికాలకు, బర్మా, మలయా, దూరప్రాచ్యాలకు నివాసార్థం వెళ్ళినవారి భాష కూడా తమిళమే. ద్రావిడ కుటుంబానికి చెందిన భాషల్లో తెలుగు, కన్నడము, మలయాళములలో నిశ్చయంగా అతిపురాతనమైనది. ఈ కుటుంబానికి చెందిన ప్రాంతీయభాషలు తుళు, కొడగు, తోడ, కోట, దక్షిణ భారతంలోనూ, గోండి, ఒరాన్, మ ర్తి, రాజమహల్, కుయ్, కురుక్ మధ్య భారతంలోనూ, ఒరిస్సాలోనూ దూరంలో బెలూచిస్థానంలోని బ్రాహుయీలు. ఫాదర్ హీరాస్ పండితుని ఊహ సరియైనదే అయితే బహుశః ద్రావిడకుటుంబానికి చెందిన భాషలకూ, మొహంజదరో నాగరకతకూ, సుదూరానుబంధాలు ఉండేవన్నమాట.

విద్వాంసుల మతప్రకారం తమిళభాషలో తొలిగ్రంథము, తొల్కాప్పియమ్ అనే వ్యాకరణము, అగస్త్యశిష్యప్రోక్తమని సంప్రదాయం ఉన్నది. సంస్కృతగ్రంథ పరిశీలనమువల్ల, తమిళ సంస్కృత సంసర్గము కనీసము క్రీ. పూ. 4 శతాబ్దిలోని వరరుచి వలె పురాతనము. జైన బౌద్ధ ప్రభావం ఒకానొకప్పుడు తమిళ దేశంలో బాగా ఉండేది. మతవాణిజ్యాలవల్ల ఉత్తరదక్షిణాలు సఫలంగా సన్నిహితమైనాయి. ఈ సంస్కృతిద్వయ సమ్మేళన ఫలంగా, క్రీ. పూ. 3 శతాబ్దిలో దక్షిణ దేశంలోని బ్రాహ్మీగుహాశాసనాలు, తమిళప్రాకృత

సాంకర్యభాషలో ఉల్లేఖింపబడ్డవి. బహుశః సింహళదేశీయ ప్రభావం కూడా వీటిలో గోచరించవచ్చును.

తమిళభాషా శౌరాతన్య విషయంలో సంగం సారస్వతంలో, యవనుల ప్రసక్తి గోచరిస్తున్నది. దానికితోడు గ్రీకురచయితలు కూర్చిన సాక్ష్యమును బతపరచగానూ, అరికమేడులో శిధిలాల త్రవ్వకాలవల్లనూ, సంగం సాహిత్య యుగము రమారమి క్రీ. శ. ప్రథమ శతాబ్ది లోనిదని సూచింపబడుతున్నది. సంగమయుగ సాహిత్యము విస్తృతంగా భావగేయ సముచ్చయాల్లోనూ, ప్రేమగౌరవ భావోద్దీపవంతో రచించిన దీర్ఘనాటకీయ పద్య స్వగతాలలోనూ ఉన్నది. వీటికితోడుగా 'సిలప్పదికారం' (కాలిఅందె) 'మణిమేకలై' (మణిమేఖల) అనే మహాబౌద్ధకావ్యమూ, ప్రశస్తాలు. వీటికి తోడుగా అమరకృతిగా 'కురళ్' సంగమయుగాంతంలోనూ, లేదా అనంతర యుగారంభంలోనో అనగా పల్లవయుగందాకా వ్యాప్తమయిన నీతిసూక్తియుగంలోనో, విరచితమై ఉండవచ్చును. జైనబౌద్ధ ప్రాబల్యాన్ని నిరోధిస్తూ హైందవ ధర్మము జాగరితమైంది సంగమ యుగాంతంలో. అది శైవ నాయనారుల, వైష్ణవాళ్వారుల హృదయనిర్మితదైవోన్మాదసంభరిత కవిత్వంలో, చిత్రమధుర వాగ్ఝరిగా పొంగులెత్తిన కవిత్వంలో మహోన్నత సాఫల్యం పొందింది. మహోన్నత హైందవదేవాలయాలు స్వర్గసూచక గోపురాలు, స్థపతుల కళానైపుణితో విలసిల్లి నట్టు హైందవధర్మము జాగరితమైంది. నాయనారులు (ప్రసిద్ధులు మణిక్క వాచకర్, అప్పార్), అళ్వారులు (ముఖ్యంగా నమ్మాళ్వార్, శ్రీ ఆండాళ్). ప్రజానీకానికి భక్తి ప్రపత్తినీ, సంపూర్ణ సమర్పణమునూ ప్రబోధించినారు. ఈనాటికీ వారి కవిత తమిళదేశంలో భక్తులందరి పెదవులపై విలసిల్లుతూ ఉన్నది. తరువాత మహా కావ్యయుగ రచయితలు వచ్చినారు. వారందరూ చోళసామ్రాజ్య యుగములోనివారు. ఈ కావ్యధోరణిలో కంబన్ రామాయణమువంటి మహోన్నత సాహిత్యం ప్రభవించింది, అశేష ప్రజామోదము పొందింది. ఇప్పటికీ అది యావన్మంది హృదయాలనూ చూఱగొన్నది. ఆ సాహిత్యాన్ని తమిళ మహా కావ్యాలుగా ప్రజలుతలచి మురిసిపోతున్నారు.

అనంతరం దార్శనిక సిద్ధాంతయుగం వచ్చింది. ఆ కాలంలో తమిళదేశమునుండి శంకర రామానుజులు వచ్చారనే విషయము మనం మరువకూడదు. వారికి తమిళభాషవచ్చును. వేదాంత, శైవసిద్ధాంత, శ్రీ వైష్ణవ తత్త్వాలు శాస్త్రబద్ధమైనాయి. ఆ సారస్వతమంతా నిస్సందేహంగా సంస్కృతంలోనే ఉన్నది. అయితే తమిళంలోకూడా తత్వ సాహిత్యం తరువాత ప్రవృద్ధమైంది. మేకందర్, అరుల్‌నంది, ఉమావతి, పిళ్ళై లోకాచార్య, వేదాంత దేశికులు, మనవాళ మహామునులను ఈ సందర్భంలో పేర్కొనవలసి ఉంటుంది. ఈ వ్యాఖ్యానయుగంలో, ప్రాచీన కవిత్వం ఒక జీవశక్తిగా సాగిపోగా, జనసామాన్యానికి సుబోధం కావడానికి,తమిళ సంస్కృత మిశ్రితమై,ప్రయోజనాపేక్షతో మణిప్రవాళ శైలిని తత్వవివరణకు వినియోగించినారు. అందులకు ప్రసిద్ధమైన ఉదాహరణము వేదాంతదేశికుల రహస్యత్రయ సారము! తమిళ కవిత గంభీరమై, కొంత వైదేశికమైన సంస్కృతప్రభావంవల్ల ప్రభావితమై వర్ధిల్లింది. తమిళ సంస్కృతస్రవంతీద్వయం ఏకమై సమ్మిళితమైంది. ఈ భాషాద్వయ దాంపత్యంవల్ల కీర్తనలు గానయోగ్యంగా ఉద్భవించాయి. ఆధునిక కర్ణాటక సంగీతము ఆ రెండు భాషా సరణులవల్ల ప్రవృద్ధమైనదే. అనంతరకాలంలో భక్తుల భక్తికవిత్వం నానా మత సార లక్షణలక్షితమై విలసిల్లినది. ఒకవంక ఆ కాలంలో పాళియగాళ్ళు అనే చిన్న జమీందారులు అశ్లీల కవిత్వాలతో సంతృప్తులు చేయబడినారు. స్థలపురాణములు జనామోదము పొందినవి. జానపద నాటకాల్లో 'కురవ', 'పల్లవుల' వంటి నిమ్న ప్రజాజీవితం చిత్రితమైంది. ఆ జానపద నాటకాలు, కవిత్వం, సంగీతం, నాట్యం సరసంగా సమ్మిశ్రితాలై సాహిత్యంలో కొంత వైశిష్ట్యమును సంపాదించుకొన్నవి.

## ఆధునికయుగము

క్రైస్తవమత ప్రచారకులు దళిత పీడిత ప్రజలకూ, పసివాళ్ళకూ క్రైస్తవ ధర్మబోధ చేయాలని ఆదుర్దా పడినారు. అందుకోసం వ్యావహారిక తమిళభాషాభివృద్ధికిగాను వారిలో ఉత్సాహము రేకెత్తింది.

కవిత్వం పురాతన మవుతూ జనామోదము కలిగించలేక మడికారముగా జనవ్యవహారంలోకి రాలేదు. 19 శతాబ్దిలో పాశ్చాత్యుల అభ్యుదయ దృష్టిరావడంతోపాటు, తమిళులు ఆధునిక భావద్యోతక గ్రంథ పరంప రను అనువదించడానికీ, సాహిత్యధోరణులు అనుకరించడానికిన్నీ యత్నించినారు. పత్రికా ప్రకటన నెలకొల్పినారు. వారు పాశ్చాత్య రీతిలో విద్యాసంస్థలను ఏర్పరచి అనుకరించినారు. పాలనవ్యవహా రాల్లో తమిళమునకు బదులు, ఆంగ్లము ఛలామణీ అయింది. 20 శతా బ్దితో స్వాతంత్ర్యయుగము ఆరంభమైంది; సామాన్య మానవ ప్రసక్తి అధికమైంది. సూరత్ కాంగ్రెసుకు సుబ్రహ్మణ్యభారతి కవి వెళ్ళినాడు. తదారభ్య స్వాతంత్ర్యానికి నాందీప్రస్తావన జరిగింది.

అధునిక జీవితమునుండి వర్ణము, భావము నవ్యతమిళ సాహి త్యము స్వీకరిస్తున్నది; సామాజికాదర్శములనుకూడా సాహిత్యము భావోద్దీపితము చేస్తున్నది. 20 శతాబ్దములో ఆసియా ఖండానికి జాగృతి కలిగింది. దానిలక్షణము జాతీయ స్వాతంత్ర్యమునకై సంఘర్షణమూ, నవజీవనమున్నూ. ఆధునిక తమిళ సాహిత్యములో ఉత్తమమైనవి జాతీయగేయములే. తమిళ సాహిత్యముయొక్క స్వీయప్రజ్ఞకు తగి నట్టుగ ఆ జాతీయగేయాలు భక్తి భావోద్రేక పూర్ణములు. అవి భక్త కవుల అగాధ మర్మయోగానుభూతిని వ్యక్తపరుస్తూ, విశ్వజనీనమైన ఔన్నత్యమును అందుకొంటున్నవి. ఆ భక్తిగేయాలు పరిశుద్ధ, ద్వేష రహిత దయాప్రేమా పూర్ణములు. అవి విశాలములై సుదూర దిగంతా లను స్పృశించినట్లుండును. అక్కడ ద్వేషకటుత్వములు లేనేలేవని కాదు; సామ్రాజ్యవాదమంటే నిరంతర ద్వేషము ఎప్పుడూ ఉన్నది. శక్తియొక్క అనగా భారతజననియొక్క బలిపీఠముపై రక్తాన్ని ప్రతి హింసకు అనగా బలిదానమునకు ఉచ్చైశ్శ్రీనాదముచేసే, ఖడ్గగానంగా క్రాంతిశక్తులు ఆరంభమైనాయి. జనరంజక గేయఫణితుల్లో జనప్రీతి దాయకమైన జానపదగేయాల్లోని నాటకీయ సన్నివేశాలను మనస్మర ణకు తెచ్చేపాటల్లో, మితవాదులున్నూ, బ్రిటీషువారున్నూ అపహాస్యంగా చిత్రింపబడినారు. ఆ పాటలలో పాలకపాలితుల తరతరాల స్తబ్ధతకూడా చిత్రితమైంది. ఉత్తమ కవిత్వంలో మాత్రం ద్వేషలేశం లేదు. నర్మ

గర్భ హాస్యం అవహేళనకు దృష్టాంతముగా అందులో ఉన్నది.

తమిళుడికి ఎప్పుడూ ప్రహ్లాదుని మార్గము, అప్పార్ అనే దాక్షిణాత్య ప్రథమ మహాసత్యాగ్రహి చేసిన నిర్ఘోషమున్నూ హృదయ సంవాదములు. 'మేము ఎవ్వరికీ తొత్తులముకాము. మాకు మరణ భయములేదు.' అనే నినాదము, పల్లవరాజశక్తిని అధికారమునూ, ప్రతిఘటిస్తూ అప్పార్‌చేసినాడు. అందువల్ల గాంధీమహాత్ముడు వెంటనే వీరపూజోచితమూర్తి కావడంలో ఆశ్చర్యములేదు. మహాత్ముడు సాగించిన అహింసాసమరంలో అరవలు దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహ కాలము నుంచీ ముఖ్యంగా పాల్గొన్నారు. గాంధీశకములో ఆయన, సత్యాగ్రహమువల్ల తమిళదేశ హృదయాన్ని స్పృశించగా, ఆ భావోద్రేకము వల్ల తమిళ గేయాలుద్భవించాయి.

భారతి ఏ తజ్జాతీయ మహాకవి. తనలో సహజంగా ఉద్భవించిన మతధార్మిక మర్మయోగంతో నిరపేక్ష మహావిశ్వజనీనశక్తిని చిత్త ప్రణిధానంగా, ఆయన దేశభక్తిని గానంచేసినాడు. ఆయన కవిత సాఫీగా సాగిపోతుంది. ఆ కవిత్వంలో ద్వైతభావంకానీ, లేదా ఒకే పద్యంలో అపశ్రుతికానీ, లేక మాతృభూమి యెడగల భక్తివైభవము మొదలు బ్రహ్మానంద పర్యంతము, కవితాధారవాకలై ప్రవహించింది. అక్కడ దేశభక్తి ఒకానొక మతోద్దిష్ట విధ్యుక్తధర్మంగా పరిణమిస్తుంది. స్వాతంత్ర్యోద్యమంకూడా జగజ్జననీ దివ్యనాటకంలో విజయప్రాప్తి సునిశ్చితంకాగా, అదొక నిత్యతాండవం అవుతుంది. కవి దళితపీడిత ప్రజానీకంతో స్వేచ్ఛాగానంచేస్తూ, సమస్త దుఃఖప్రధ్వంసంకోసం స్వేచ్ఛాతాండవంచేస్తూ పాడుతాడు. ఆ గేయం ప్రవక్తృధోరణిలో ఎంత దివ్యంగా ముఖరిత మవుతున్నది! ఈ దేశంలో నిజంగా స్వాతంత్ర్యోదయానికి పూర్వము, పాతికేళ్ళనాడు రచించిన గీతం అది!

తమిళులకు ఈ మాతృదేశము రెండు విధాలుగా గోచరిస్తుంది. భారతజగన్మాతగా విస్తృతాలోకనలోనూ, సమీపదృష్టిలో తమిళభూమి గానూ గోచరిస్తుంది. ప్రస్తుత దశాబ్దంలో భాషాప్రయుక్త రాష్ట్రావతరణ సందర్భంలో వారి ఇటీవలి ధోరణిలో తమిళ ప్రాంతీయత గాఢమైంది. ఉత్తమ జాతీయ గీతాలలో తమిళదేశం సంస్కృతిని ద్యోతకం చేస్తు

న్నదేకాని, భౌగోళిక పరిమిత ఖండాన్నికాదు. ప్రస్తుతకాలంలో ఈ భౌగోళిక ఖండ భావనను విస్మరించడానికి వీలులేదు.

తమిళదేశంకన్న తమిళభాషకు అధికంగా దేవతాత్వము వారు ఆరోపణ చేశారు. ఇది ప్రాచీనదేశీయ సంప్రదాయము. తమిళులు సహజంగా తమభాషను శివ లేక విష్ణు లేదా శక్తి అవతారంగా లేదా కేవల మూర్తిగా తలపోస్తారు. ప్రతి మానవుడి రక్తనాళంలో మాతృభక్తి జలజల ప్రవహిస్తుంది. అయితే తమిళహృదయంలో ఇతిహాస సంప్రదాయశక్తులఫలితంగా, అది మతధార్మికోత్సాహంగా రూపొందుతుంది; ఒక్కొక్క సమయంలో మూఢాభిమానసీమలను స్పృశిస్తుంది; తన తరతరాల పురాతన భాషాస్వాతంత్ర్యము దురాక్రమణకు లేశమాత్రమైనా గురియయినప్పుడు, అతడు తన భాషలోనే చదువుకోవాలి; కోర్టు కచేరీలలో న్యాయవిచారణ, శాసనసభలలో ప్రసంగం చేయడం, రాష్ట్రపాలన వ్యవహారం తన మాతృభాషలోనే సాగాలి. కవి చెప్పినట్టు స్వాతంత్ర్యస్వేచ్ఛా శబ్దమాధుర్యంలో అతి శక్తివంతంగా ఉత్తేజకంగా ద్యోతకమయ్యే భావాలతో, భాషాస్వాతంత్ర్యగానం ఒకటి, తమిళుడికి ముఖ్యము. అయనకు సంకుచిత ప్రాంతీయ భావావేశంలో విశ్వాసం లేదు. కాని తనభాషకు స్వాతంత్ర్యాన్ని ప్రేరేపించే సజీవ విశ్వజనీనతలో విశ్వాసం ఆతనికి ఉన్నది. ఈ నేపథ్యరంగాన్ని తిలకిస్తేగాని, తమిళ భాషావైభవ ప్రశస్తి ఉద్ఘాటించే ఇటీవలి కవిత్వం అధికంగా ఆనందించడానికీ, సంపూర్ణవైశిష్ట్యం అవగాహన చేసుకోడానికి వీలుండదు. అప్పుడప్పుడు, దురదృష్టవశాన, సైనికావేశోన్మత్తతకు సమీపంగా, ప్రతిధ్వనులు ఎవరిచెవికైనా సోకకపోవు.

ఆధునిక విధానంలో ఆదర్శాన్ని మూర్తరూపంలో, చూపడం ముఖ్యం. ప్రజానీకంతో, దానికి ప్రమేయం. 'కలకాలం న్యాయవిశిష్టమైన తమిళము నిలవాలి. గుణవంతులైన తమిళులు చాలకాలం జీవించాలి.' అంటూ కవిగానము చేస్తాడు. సుఖసమాజమునకు దారిద్ర్యం, వ్యాధి, అజ్ఞానంనుంచి విముక్తము కావడం ఆదర్శం. 'కలకాలం ఈ సమాజం నిలవాలి.' అని ఒక ప్రఖ్యాత తగీతములోని పల్లవి. 'ఒక వ్యక్తికి కూడులేకపోతే, జగత్తును నాశనంచేదాము' అని కవి ఆక్రో

శిస్తున్నాడు. విధినిగురించి ముసలివాగుడు పనికిరాదు. సంక్షేమ రాజ్యనిర్మాణంలో విశ్వాసం తిరువళ్లువార్ అంత పురాతనం. తమిళ పురాణాల్లో సుందరంగా వర్ణితమైన సుందర ఆదర్శరాజ్యముయొక్క దీర్ఘస్వప్నముకాదు, ఇప్పటిది. అది రాజకీయ్యంగా, సామాజిక సంస్కరణగా, ఉపలభ్యము కావాలి. ఇక్కడనే సామాన్య మానవోదయం, రాజయుగాస్తమయమున్నూ సంభవించాయి. ఇదే నిజమైన ప్రజా తంత్రరాజ్యము. ఇది యదార్థ స్వాతంత్ర్యం, సమత్వం సమానుల సౌభ్రాత్రం. కేవలమూ రాజకీయస్వాతంత్ర్యముకాదు కోరేది. సామాజిక ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సమంగా కావాలని గట్టిగా చెబుతున్నారు. స్వేచ్ఛ, లైంగిక సమానత్వం జాతిసమానత్వం కావాలని ఘోషిస్తున్నారు. స్వేచ్ఛాసమాజనిర్మాణానికిగల బాధ్యతను కవిత్వం అంగీకరిస్తున్నది. అయితే ఒక్కొక్కసారి విషపూరిత ప్రచారానికి, హైడ్‌పార్క్ ఉపన్యాస ధోరణికి కవిత దిగజారిపోతున్నది. ఆత్మగౌరవం ప్రశంసింపబడుతున్నది. అయితే అది తరుచుగా అన్యులకు అవమానము కలిగించే గిల్లికజ్జాగా మారుతున్నది. బహుశః అలాంటి వికృతి యావజ్జగత్తు నవ్యవిధానంలో, పరివర్తనమయ్యే సమయంలో తప్పనిసరి అవుతుందేమో!

## ప్రజాతంత్రము, సాహిత్యము

ప్రాథమిక విద్యావ్యాప్తి, వార్తా పత్త్రికా పఠనం అలవాటుగా వృద్ధికావడం, రేడియో, దూరవాణి, చవుకబారు పత్త్రికా ప్రకటనం, రాజకీయ ప్రచారం, వయోజనుల వోటింగు హక్కున్నూ-ఇవన్నీ సాహిత్యంలో ప్రతిబింబిస్తాయి. సాహిత్యము ఇప్పుడిక కేవలము కొద్దిమంది పండితులకోసంకాదు; అది సర్వప్రజకూ ఉపాదేయముకావాలి. అనగా కావ్యరసాస్వాదన ప్రథమదశలోనైనా కొంత న్యూనముకాక తప్పదు; రసజ్ఞత కొంత తగ్గుతుంది. వ్యావహారిక భాషకూ సాహిత్యభాషకూ మధ్య, భేదం పోగొట్టడానికి సేతువును నిర్మించాలి. ప్రాచీన ఛందస్సులు కొత్తరూపాలు ధరించాలి, లేదా రూపుమారిపోవాలి. జానపద గేయ నాటకాల ఫణితులు నెమ్మదిగా ప్రముఖమవుతాయి. భారతీకవి

మర్మయోగ జాతీయ మహాకావ్య రచనకు అవి సముచిత వ్యక్తీకరణ సాధనాలని ఋజువుచేసినాడు. అలాగ సాహిత్య ప్రజాస్వామ్యము సుప్రతిష్ఠితమైంది.

## సిద్ధులు

తమిళదేశంలోని సర్వమత సారమెరిగిన భక్తయోగులు, రాబోయే ఈ పరివర్తనము సూచించేవారుకూడాను. భారతికవి మర్మయోగి. యదార్థమర్మయోగి కావడంచేత సర్వత్ర ఈశావాస్యంగా దర్శిస్తాడు. సర్వప్రజాతంత్రానికి అనుకూలంగా ఈశ్వరుడు మానవుడిలో సన్నిహిత సంబంధము పెట్టుకొన్నాడు. 'ఈశ్వరుడు నాభృత్యుడు—' నిజంగా అది అతిధీరవచనము.— 'నా ప్రియ నా తండ్రి, నా తల్లి, నా పాలకుడు—' అలా కవి గానముచేస్తాడు. ఇది ఆళ్వారులవలె ప్రాచీనము. అయితే ప్రతిమానవుడిలో పరమేశ్వరుణ్ణి దర్శించవలసిన ప్రజాతంత్ర యుగంలో అది ముఖ్యమవుతున్నది. అతని ప్రజాతంత్రభావన మహోజ్జ్వలం. ఆత్మయొక్క దేహాంతరప్రాప్తి సిద్ధాంత ఫలితంగా సామాన్యప్రజ సంతతమూ విశ్వసించింది, పశుపక్ష్యాదు లన్నీ సోదర సోదరీమణులవలె సమానులని. అది సర్వజీవ ప్రజాస్వామ్యంలో ఒకానొక విశ్వాసం. పరమేశ్వరుడు భక్తికోటిన్ని, నానారూపాల్లో చరించే జగత్తులో. పశువులూ మానవుడున్నూ సహకారజీవనం గడిపే, ప్రజాతంత్రంలో సామాన్యమానవుల విశ్వాసమది. గోమాత, శుకకుమారి, శ్వానభ్రాత, అన్నవి కేవలం అలంకారిక పదాలుకావు. కాని అవి సజీవసత్యాలు, ఫ్రాన్సిస్ భక్తుడికీ, సుబ్రహ్మణ్య భారతికిన్నీ. భారతికి కుక్కమొరుగుడు, గుడిగంట, బిచ్చగానిపిలుపు - అన్నీ దివ్యగాన సమములు. ఆయన శిశుగీతాల్లో ఆధ్యాత్మిక సమతాభావన ప్రచురితమైంది. భారతీకవీంద్రుని కోయిల పాటలో మహామర్మయోగాత్మక రూపకాతిశయోక్తి ఉన్నది. పైకి ఆ పాట అస్పష్టంగా, గహనంగా ఉన్నా, సందర్భముతెలిస్తే, భావం బోధపడుతుంది.

'కవిత్వం కవిత్వంకోసం' అన్నది అర్థసత్యం. కవికి ఒక

లక్ష్యమూ, ప్రయోజనమూ ఉంటవి. భారతీయ సిద్ధాంతరీత్యా, మానవుడు పురుషార్థములమీద దృష్టినిలపక తప్పదు; కావ్యానందం విస్మరించకపోయినా. కవిత్వం కాంతాసమ్మితంగా చెవులో గుసగుసలాడుతుంది, ప్రియుణ్ణి వశ్యంచేసుకొని. అతన్ని పురుషార్థాలవైపు మరలుస్తుంది. అందుచేత తమిళకవిత్వంలో ఉదాత్తపురుషార్థ దృష్టిని కవులు విస్మరించలేదు; వారి తీపు ధర్మాశక్తి తగ్గలేదు. సామాన్యంగా సామాజిక నవజీవనానికి ఆధునికయుగంలో తమిళసాహిత్యంలో ధార్మికోత్సాహ తీవ్రత ఉన్నది. నేడు ముఖ్యంగా సామాన్యమానవుడిమీద సాహిత్యదృష్టి నిలిచింది. దీని స్వభావంలో జ్ఞానప్రభకన్న, కేవలం వేడిమిని జనింపచేసే ప్రమాదం ఉన్నది. ఒక్కొక్కసారి ప్రచారమే సాహిత్యంగా భాసిస్తుంది. భారతీయ సాహిత్యంలో కవితాచ్ఛాదనతో ఉపదేశాత్మకత రూపొందే ప్రమాదము ఎప్పుడూ ఉండనే ఉన్నది. మంత్రాలవంటి నేటి నినాదాలవల్ల ఆధునికయుగంలో, వశీకరణ విధానంలో, హృదయాన్ని చూఱగొనే, యత్నంకూడా ఉన్నది. స్వేచ్ఛ, సమానత్వం, ప్రేమ, దేశభక్తి, మాతృభూమి, మాతృభాష – ఈ భావాలు స్వయంగా సుందరములు; అయితే అవి దోషదూషితాలు కావడానికి వీలున్నది: ఔత్సుక్యదాయకమైన సన్నివేశంవల్ల చాలామంది చాలా పద్యాలు చదువుతున్నారు, పాడుతున్నారు. వాటిలో కవిత్వోద్దీప్తి ఉన్నందునకాదు. ప్రజాసామాన్యానికి ఆ పద్యపఠనం ఇష్టం. అదొక మోజు లేదా సరదా. భావాతిరేకత విశృంఖలంగా, కవితావగుంఠనంలో అవలీలగా, ప్రజను కుమార్గాన నడిపిస్తుంది. సామాన్య మానవుడు, సామాన్య పరిచిత విషయమున్నూ, కావ్యవస్తువైనమాత్రాన్న అశ్లీలాన్నీ అథమ విషయలాలసనూ మహోన్నతంగా స్తుతించడము కాదు. చవుకబారు పత్రికల ప్రకటనయుగంలో ఈ ప్రమాదంవల్ల ఇతర రకాల సాహిత్యాలకు విపణిలో చోటు లేకపోయింది.

మాట్లాడేరీతిగా రచన సాగించాలనే పట్టుదల కనబడుతున్నది. వైదుష్యమును ఆడంబరంగా చూపడం సహజ మరణం పొందాలి. అయితే ప్రాంతీయ సామాజికులవల్ల, బెబిలుగోపురంలో నానాభాషలవలె, వైవిధ్యం ఏర్పడుతుంది వ్యావహారికభాషలో. రేడియో, వార్తాపత్రిక,

రాజకీయవచోధార, విద్యావ్యాపనం, అదృష్టవశాన ప్రామాణికభాషను కొంతవరకు ప్రోత్సహిస్తున్నవి. అందుచేత ఆధునిక తమిళ కావ్యభాష ప్రాచీన మహాకావ్య భాషకాదు. ప్రాంతీయ వ్యవహారికభాషకూడా కాదు. ప్రాంతీయభాషలో గాథలల్లి కవులు గానంచేసినా, పురాతన జానపద గేయాలను అనుకరిస్తూ, పద్యరచనలుచేసినా, బహుశ వీటిలోకూడా అల్లియరస్సానిమాలై, దేశింగురాజన్ కత్తైల సంప్రదాయం అవిచ్ఛిన్నంగా ఉంది. ఇవి కొంతవరకు జనప్రీతిపొందినవి. అయితే ఆంధ్ర దేశంలో ఉన్నంతగా వ్యావహారిక భాషావిషయంలో, తమిళదేశంలో ఉద్యమము పట్టుదలగాలేదు. బహుశ పాశ్చాత్య ప్రభావంవల్ల స్వేచ్ఛా ఛందస్సు, కావ్యధోరణిలో కొంతవరకూ వచనరచన, వ్యవహారంలోకి వచ్చినవి.

అద్యతన భూతకాలానికి వ్యతిరేకంగా, సాహిత్యోజ్జీవనం ఒకానొక విప్లవం. అది ప్రాచీనమైన గత వైభవోద్ధరణం. పాంచాలి, బిల్హణ, బుద్ధులగాథలు ప్రస్తుతకాలానికి సందేశాన్ని ఇస్తాయి. కవులు ఈ గాథలను మళ్ళీ సరికొత్తగా రచించారు. స్వాతంత్ర్యము, దేశభక్తి, వీరనారీత్వము, సజీవమతమువంటి ఆధునికయుగ నవ్యాదర్శాలను గట్టిగా వచించే కథా కథనా లవి.

సమకాలిక సాహిత్యరీతుల్లో హాస్యమొకటి. ప్రాచీన రూపకము విదూషకుణ్ణి మినహాయిస్తే, హాస్యరహితమై విషయతీవ్రత ఉదాత్తత కలది. ఆధునికహాస్యం అధికంగా పత్రికారచనలో, ప్రస్తుతవృత్తాంతాలను, ప్రముఖ వ్యక్తులనూ సమీక్షచేయడంలో జాలువారుతున్నది. ప్రస్తుత సాహిత్యంమీద హాస్యప్రభావం తక్కువగాలేదు. కథానికలు, పద్యాలు, వ్యాసాలు హాస్యంతో జాలువారుతూ, కమ్మగా ఇంపుగా ఉంటాయి. తనను ఆవరించిన బాధలు ఎన్నిఉన్నా, విషయసంసర్గం లేని మహాపురుషుల భావ నిర్లిప్తతతో ఏకమైనదే, నిజమైన హాస్యము. వ్యాధిగ్రస్తుడైనా, కవిమణి ఇటువంటి ఋషులతాత్త్వికదృక్పథాన్ని వృద్ధిచేసుకొంటూ, తనహాస్యంలో తనశరీరంమీద వ్రణాలూ, గ్రంథులూ, తనకు ప్రీతిపాత్రుడైన విస్ఫోటవ్రణరాజేంద్రుని ముక్తామణుల కానుకలుగా, భావనచేస్తాడు.

ప్రస్తుత శతాబ్దములో శిశువిద్యాసక్తి కనబడుతున్నది. మాతృభాషలోనే ఆటపాటలమూలంగా సంపూర్ణ సృజనాత్మక ప్రవృత్తిద్వారా అనుష్ఠానాత్మక విజ్ఞానమూలంగా, విద్యాబోధ సాగవలెనని పట్టుదల ఉన్నది. పసివాళ్ళ శారీరక మానసిక వయోనుకూలంగా, పాఠ్యపుస్తకాలు శ్రేణీవిభాగము చేసినారు. ప్రాచీన సంప్రదాయములో శిశుసాహిత్యమూ, కవిత్వమూ ఉన్నవి. నేటిక్రొత్తప్రయత్నాలవల్ల పసివాళ్ళకు అనుకూలమైన తీరుగా, భాషలో దాగిఉన్న శక్తులు సరికొత్తవి ద్యోతకమైనాయి. కొన్నిజోలపాటలు, శిశువులకోసం రచించిన పాటలు, నిజంగా సాహిత్యంలో సొగసైన మణులు. ఇక్కడకూడా సుబ్రహ్మణ్యభారతీ, కవిమణులే మార్గము చూపినారు.

## పత్రికారచనా ప్రభావము

సాహిత్యముపై పత్త్రికా లేఖన ప్రభావమును విస్మరించడానికి వీలులేదు. దైనికపత్త్రికలు, వారపత్రికలు మాసపత్త్రికలూ, సాహిత్యము కాకపోవచ్చును. అయితే మరొక తీరుగా ఆలోచిస్తే, పత్త్రికాలేఖనం రకరకాల సాహిత్యాలకు ఒకానొక కార్ఖానా. ఆధునిక రచయితలకు ప్రథమంలో, సాహిత్యవ్యాసంగానికి తరిఫీదు పత్త్రికాలేఖనం కల్పిస్తుంది. తమిళ దైనిక పత్త్రికలు జనామోదము కలిగించే తమిళములో అద్యతన సంఘటనలు, భావాలు, కల్పనలున్ను, వ్యక్తము చేయడానికి పూనుకొన్నవి. దైనిక పత్త్రికా ప్రకటనకు కొన్నివిమిషాల ముందుగా వచ్చిన తంతివార్తలునుబట్టి, నవీన లోకవృత్తము సరళమైన జనామోదము కలిగించే భాషలో వ్యక్తముచేయవలె.

ప్రసిద్ధ నవలా రచయిత, 'కల్కి' చెప్పినాడు; కీర్తిశేషుడైన టి. వి. కల్యాణ సుందర మొదలియారు జాతీయ స్వాతంత్ర్యం నిమిత్తం పత్త్రికారంగంలో అడుగుపెట్టకపూర్వం, పత్రికలు సంస్కృతోద్భవ శబ్దాలతో సమాసాలు బిగించి పత్త్రికా రచన సాగించి, అడంబర వైదుష్యంతో మురిసిపోయేవి. ఆయన ప్రభావంవల్ల పత్త్రికల్లో భాష, దేశీయమై, స్వతస్సిద్ధప్రజ్ఞాను కూలమైన పోకడపోయింది. ప్రస్తుత కాలంలో పరిశుద్ధతావాదులు ఒక ఉద్యమం లేవదీసి, అన్యదేశీయాలన్నూ,

సంస్కృత పదాలనుకూడా పూర్తిగా తీసివేయాలనే, అతి ధోరణి సాగించినారు. కాకపోతే దానివల్ల భాషామూలాలను స్పృశించనివాటిని, తవ్వి తెలిసికొనేందుకు అవకాశం కలిగింది. ఆ ఉద్యమ లక్షణం సంస్కృత వ్యతిరేకతగాను, కులభేదోద్యమంగానూ భావించడం న్యాయం కాదు. అది కేవలం వ్యతిరేకతకు పూనుకోక, భాషాభివృద్ధిని సాధించాలని ఉద్దేశిస్తున్నది. అయితే ఇతరరంగాలవలె మహాసామరస్యం ఆధునిక కాలంలో ప్రధాన లక్షణం. వ్యావహారికభాష, ఒక్కొక్కసారి ప్రాంతీయపు 'యాస', పత్రికారచనపై దాడిచేస్తున్నాయి. అయితే అవి గట్టిగా పాదుకోలేకపోతున్నాయి. తమిళ పత్రికాలేఖనలో సామ్యావస్థ సిద్ధించిందని అప్పుడే చెప్పలేము.

## సాహిత్యము - ఒకవృత్తి

20 శతాబ్దిలో మరొక ముఖ్యధోరణి, తమిళసాహిత్యంలో కనబడుతున్నది. సాహిత్యమును బ్రతుకుతెరువుగా చేసుకోడం ఉన్నది. అంతే కాని అది వినోదవ్యాసంగంకాదు. కవికూడా ఉద్యోగానికి యత్నిస్తాడు. ఆస్థానకవికావడానికికాదు. కాని ఏ సినిమాస్టూడియోలో చిత్రాలకో, పద్యాలు అల్లడానికో మరొక తావులో ఏదో రచనచేసి జీవించడానికో, యత్నిస్తాడు. మోగించేవాడికి ధనమిచ్చేవాడు తనకు కావలసిన స్వరం పలికించమంటాడు. ఇలాంటి ఘర్షణకు లోనయినా, షేక్స్పియర్ మహా శేముషీధురంధరుడై నిలవ తొక్కుకొన్నాడు. నిజాభిరుచికి అనుకూలంగా, గట్టిరాతిని శిల్పి మలచుకొంటాడు. అలాగే రచయితకూడా ప్రజాభిరుచిని ముడిపదార్థంగా స్వీకరించి, దానినుండి నవ్యసుందర శిల్పాకృతులను గండరిస్తాడు. భక్తయోగకవులకు సాహిత్యస్వాతంత్ర్యం ఉన్నకాలంలోకూడా రచయిత తన పరిసరాన్ని చూడకుండా కళ్ళు మూసుకోలేదు. సాహిత్యసమస్య ఆర్థికసమస్యవల్ల, ప్రభావితం కాదని అనడం పూర్తిగా సహేతుకంకాదు. సాహిత్యపోషకుడయిన ఏదో ఒక వ్యక్తిచూపే ఆదరణమీద, కవి ఆధారపడడంలేదు. సామాన్య పాఠక జనాభిరుచిని ఇప్పుడు అతడు నిర్లక్ష్యము చేయడానికి వీలులేదు. జనానీకాన్ని సంతృప్తి పరచవలెననే ఔత్సుక్యమున్నది. కాని కవులు

కేవల స్తుతిపరాయణు లవుతారనే భయంమాత్రం లేదు. అనుకొన్నంత అధ్వాన్న పరిస్థితులులేవు. సహృదయులైన జనామోదమనే శక్తి ఒకటి ఉన్నది. ఆధునిక యుగరచయితలు నవ్యవిధాన నిర్మాతలేకాని, ప్రాచీన పద్ధతికి దాసులుకారు. భారతదేశపు రాజప్రతినిధిగా ఉన్న శ్రీమాన్ రాజగోపాలాచార్యులవారి వంటి రాజకీయనాయకులు ప్రముఖ గ్రంథకర్తకావడం ముదావహం.

## శాస్త్రీయ దృక్పథము

ప్రధానంగా ఇది వైజ్ఞానిక యుగము. ఇది ప్రకృతి మర్మాలలోకి, అంతర్నిహిత శక్తులలోకి చొచ్చుకొని పోతున్నది. వైజ్ఞానిక శాస్త్రాభిరుచి విశ్వజనీనమైంది. శిల్పలక్ష్యాలు తత్ప్రభావ భావితముకాకుండా పూర్తిగా ఉండవు. Constable అన్నట్టు 'ఆలేఖ్యశిల్పము ఒక విజ్ఞాన శాస్త్రము. ప్రకృతి సూత్ర పరిశీలనవలె దానినికూడా అభ్యసించాలి. ప్రకృతి దృశ్య చిత్రణమును ఎందుకు నిసర్గతత్త్వశాస్త్రశాఖగా భావించకూడదు? చిత్తరువులు ప్రయోగ సముద్భవాలు కదా!' అలాగయితే కొన్ని కథానికలు, పద్యాలున్నూ అలాంటి ప్రయోగములు ఎందుకు కావు. అని ఎవరయినా ఆశ్చర్యపడవచ్చును. విజ్ఞానశాస్త్ర పాఠ్యగ్రంథాలు సాహిత్యానికి కేవలం వ్యతిరేకం. ఐనా, టిండాల్, హక్స్లే, రసెల్‌వంటి మనీషుల సాహిత్యేతర గ్రంథాలు జన ప్రీతి పొంది, పారస్పర్యోన్నతి పొందినవి. అలాంటి గ్రంథాలు తమిళంలో లేవు. అయితే కేవలం లేవనడానికి వీలులేదు. రాజగోపాలాచార్యుల "వృక్ష ప్రపంచంలో ప్రేమ", 'వీధిబడిలో రసాయనశాస్త్రం' ఉత్తమ గ్రంథాలు. అయితే అవి వైజ్ఞానిక ప్రపంచానికి పీఠికల వంటివి. 'పరమాణు పురాణ' మును ప్రొఫెసర్ రాజేశ్వరి వర్ణించింది. వైజ్ఞానిక శాస్త్రమూ, అణుచరిత్రమున్నూ అయిన ఆ గ్రంథము, పురాణక్రమంలో చదువుకోవచ్చునని డాక్టర్ కె. యస్. కృష్ణన్ అన్నారు. ఇతర ఆధునిక విషయాలపై జనామోదము కలిగించే రీతిలో విపుల వ్యాఖ్యాన గ్రంథాలున్నవి. వాటికి విశ్వవిద్యాలయ రాష్ట్రీయ ప్రభుత్వ పారితోషికాలు వచ్చినవి. శాస్త్రీయ భావవ్యక్తీకరణకుగాను తమిళం చాలా అను

కూలంగా ఉన్నదని ఇటీవల ప్రకటించిన 'తమిళ విజ్ఞానకోశం' వల్ల విశదమవుతున్నది.

ఈ విజ్ఞాన శాస్త్రాభిరుచి విస్తృత నవీన హేతువాద సరణిలో ఒక అంశమే. దాని మరొక లక్షణము అర్థరహితమైన ఆచారాన్నీ, కర్మకలాపాన్నీ, మూఢవిశ్వాసాలనూ, జాత్యహంకారాన్నీ, మతసహన రాహిత్యాన్నీ, ప్రతిఘటించడము. దురదృష్టవశాన కొందరు సంస్కర్తలు తాము ప్రతిఘటించే ప్రతివిషయంతో పొరపాటున సాహిత్యాన్ని ఏకము చేసివేస్తారు. ముఖ్యంగా వారి ప్రత్యర్థులు తమ ప్రయోజనానుకూలంగా తమిళ సాహిత్యాన్ని ఉదహరిస్తూ వ్యాఖ్యానిస్తున్నప్పుడు ఐతిహ్య మూల్యం, సాహిత్యాన్ని సరియైన దృష్టితో సమీపించడం, రసభావాలను వ్యక్తంచేసేభాష, శిల్పమూల్యం, విజ్ఞాన శాస్త్రీయ లేదా ఐతిహాసిక యాథార్థ్యం, సాహిత్య దృష్టిలో లేదా రసజ్ఞుల దృష్టిలో సత్యము అనే విషయాలు అవగాహన కావడము సులభముకాదు. దాని ఫలితంగా సాహిత్యాస్వాదనకు నీహారంతో కల్లోలంతో వర్తమాన వాతావరణము కలుషితమౌనేమో అని బెదరు కొలుపుతున్నది.

## విమర్శన, వ్యాసము

సాహిత్య సమీక్షకూ, శిల్పానికిన్నీ ఉన్న మూల సూత్రాలు విశదంగా బోధపరుచుకోవలసిన ఆవశ్యకత ఏర్పడింది. ప్రస్తుతకాలంలో ప్రాచీన అర్వాచీన పద్ధతులమధ్య విజ్ఞానశాస్త్ర మతాలమధ్య ఐతిహాసిక సంప్రదాయాలమధ్య, హేతువాద సాహిత్యాలమధ్య. విస్తృతమవుతున్న అఖాతానికి, ఆధునిక తమిళవచనరచనకు జనకుడైన స్వర్గీయ టి. వి. కళ్యాణసుందర మొదలియార్ సేతువు నిర్మించినాడు. విపులానందస్వామి మరొక మహావ్యక్తి. టి. కె. చిదంబరనాథ మొదలియారు తన సహజ ప్రజ్ఞపై ఆధారపడి, తమిళ కవులను వ్యాఖ్యానించి వారి కవిత మనకు సాక్షాత్కారమయ్యేలాగ చేసినాడు. సుబ్రహ్మణ్య భారతి కవీంద్రుని స్వరాలు ఉదాసీనంగా విస్మరించినట్టిన్నీ, ప్రకృతి, సాహిత్యసీమల సౌందర్యాన్ని ప్రకాశవంతంచేసే మెరుపుతీగెలవంటివి. ఆయన సమీక్ష ఆత్మాశ్రయము.

అది ఆయన ఓజోమయ ఆలోకనానుభవమునుండి వచ్చింది. కవిమణి, అన్యులున్నూ అతన్ని అనుసరిస్తూ, తమిళ సాహిత్యంలో తమ కావ్యాను భూతిని ఆధునిక ధోరణిలో పద్యంలో వ్యక్తము చేశారు. మరియమలై ఆదిగళు ప్రాచీనకావ్య రసాస్వాదనం కొత్తతీరులో చేయడం చూపి వాడు. ఆయన కవుల కృతులతో పూర్తిగా తాదాత్మ్యము పొంది అడిసన్, మెకాలేలు ఏర్పరిచిన సాహిత్య సమీక్షా సూత్రాలను ప్రయో గించివాడు. ఆయన శైలి సరళము, మధురమూ ధారాశుద్ధికలది. ఆయనకు గాఢంగా రాగద్వేషాలు ఉండడంచేత రచనలు కొంత దూషితాలయినా. ఆయన వ్యక్తిత్వమును ప్రకటిస్తున్నందున, అవి చక్కని సారస్వత ఖండాలయినవి.

సాహిత్యశ్రేణిలో వ్యాసమొక ప్రక్రియ. ఆ వ్యాసరచన జీవితం వలె నానాత్వము కలదే అయినా అది సాహిత్యమే. కథానికలు రాక పూర్వము పత్రికలనిండా వ్యాసాలు అచ్చుపడేవి. ఇటీవల ఆకాశవాణి భాషణ వ్యాసస్థానాన్ని ఆక్రమించింది. తమిళులున్న సర్వప్రదేశాల్లో ఆకాశవాణికి విస్తృతావకాశం ఏర్పడింది. సంగీతం, బాషణలు, గోష్ఠి, కార్యక్రమాలు, చర్చావేదికలు, కవితా గోష్ఠులు, నాటికలూ యథా క్రమంలో కాలనిర్ణయాను సారంగా ప్రసారమవుతాయి. ఇది గ్రంథ కారులకు నూతనానుభవం, నిర్ణీత కాలానికి అనుకూలంగా రచన చేయ వలసిన అవశ్యకత ఉన్నది. ఇంతకు పూర్వం ఇటువంటి నియమాన్ని రచయితలు ఎరగరు. కవికి సామాజికులు ప్రత్యక్షంగా గోచరించరు, వారి అనుభవాలనుబట్టి శిల్పాన్ని మలచుకోడానికి. ఆవరణ బద్ధమైన అవకాశంలో, ఏకాంతంగా ఉన్న కవి జడయంత్రాన్ని చూచేసరికి, ఉత్సాహం యావత్తూ నీరయి పోతుంది. వక్త కేవలం తన భావనా శక్తిపై పూర్తిగా ఆధారపడాలి. బహుశః శ్రోతలు కుటుంబ చక్రంలో ఆసీనులై వినబోతారు. వారికి ఆకాశ బాషణం పరిచితమయిన ఇష్టా గోష్ఠిగాఉన్నా గంభీరంగానూ, జనప్రీతిగాఉన్నా అశ్లీలం లేకుండానూ ఉండవలె. ఇటువంటి సాహిత్యం శ్రవణ సమయంలో అవగాహన. కావలసి ఉంటుంది. ఆకాశవాణి రూపములో వినబడేవి కంఠస్వరం, శబ్దమూ మాత్రమే. వాటిలో పాత్రల వాక్యాలనూ ఆత్మీయతలనూ,

వివిధ దృశ్యాలనూ, విభిన్న దృశ్యాలనూ, భావాలను ప్రత్యేకించడానికి లేదా అభినయాన్ని దృశ్యాన్ని పరిసరాన్ని, దృశ్యారంభాన్ని, అంత్యాన్ని లేదా పాత్ర ప్రవేశ నిష్క్రమణాలను సూచించడానికిన్నీ మరేమీ ఉండవు. శబ్దసంకేతము, ఉచ్చరించిన శబ్దము యొక్క ప్రతీయ మానార్థశక్తి, శబ్దోచ్చారణలో సూక్ష్మగమకం విభిన్నపద సంఘటన, వాక్యనిర్మాణం, సంగీతవైచిత్రి, కొట్టవచ్చినట్టు కనబడే అభ్యాసాలూ— అన్నీ నవ్యంగా గుర్తింపబడ్డాయి ప్రయోగింపబడ్డాయి. వీటివల్ల తమిళములో నూతన శబ్దశక్తులు ద్యోతక మవుతున్నాయి. హోమరు కవి కూడా పొరపాటు పడవచ్చును. కాని ఆకాశవాణిలో ప్రసారముచేసే వ్యక్తి పొరపడరాదు. తప్పని సరిగా అతడు శ్రోతల దృష్టిని ఆకర్షించాలి. లేకపోతే శ్రోత ప్రసారపుమీట (స్విచ్) తీసివేస్తాడు.

## రూపకము

దృశ్యకావ్యము మానవుడివలె ప్రాచీనము. తమిళంలో కేవల రూపకం సంగీతమూ, నాట్యమూ కవిత్వమున్నూ మేళవించిన ప్రక్రియ. మలయాళం అన్యప్రాంతాల్లోవలెకాక భాగవత కలాపం'లో తప్పితే, వీధి నాటకాన్ని ఉద్ధరించాలనే యత్నం ఉన్నట్టు కనబడదు. సుందరంపిళ్ళై మనోన్మణియమ్ అనే పద్యనాటిక రచించినాడు. అందులో సుదీర్ఘమైన అంతర్నాటకంలో శివకామి చరిత్రకు సంబంధించిన మంచి కవిత్వం రంగశాలకోసంకాదు. అకవళ్ ఛందస్సులో పద్యనాటికలు వ్రాసేవారు వ్రాస్తున్నారు, మనోన్మణియంతో సమంగా ఉన్నతస్థాయికి చేరక పోయినా— సారస్వత పితామహుడు, సంబంధ మొదలియార్ యాభై పైగా నాటకాలు రచించాడు. అన్నింటినీ రంగశాలలో ప్రయోగించ వచ్చును కాని సాహిత్య దృష్టిలో వాటికి ఉన్నతస్థాయిలేదు. ఆయన నాటకాలు ఇతరప్రాంతాలలోవలెగాక కేవలం వాస్తవికతకూ కాముక చిత్తసమాధానానికిన్నీ దూరమై ఆరోగ్యవంతమైన మధ్యమార్గంలో ఉంటవి ఒక్కొక్కసారి ఆరోగ్యదాయకమైన సంస్కరణ, నవ్యదృక్పథ మున్నూ, పవలార్ రచించిన 'కదరిన్ వెర్రి' వంటి నాటకాలలోవలె ప్రచారంలోలేదు. కేవల ప్రచారపాత్రధారి అభిరుచిని పురస్కరించు

కొని, ప్రస్తుత లోకవృత్త సంబంధమైన అసంబద్ధోపన్యాసాలు చేస్తాడు. ప్రాచీన వీధినాటకాల్లో హాస్యగాడి వచోధోరణులనుంచి వచ్చిన పారంపర్యాన్ని భూమికాధారి అనుసరిస్తున్నాడు. కొన్ని రకాల రాజకీయ, సామాజిక సభలలో మతసంప్రదాయాన్ని పౌరాణిక కథలనూ, ఇతర సాహిత్యాన్నీ, రేఖామాత్రంగా అవహేళనచేసే నాటకాలు జనామోదంగా ఉంటున్నాయి. ఈ నాటకాలు వర్తమాన సామాజిక చిత్తములకు గిలిగింతలు పెట్టాలనే ఉబలాటాన్ని నిగ్రహించుకొని, యదార్థమైన సాహిత్యసృష్టిని విశ్వజనీన స్థాయిలో సంకల్పించ గలిగితే, ఆ రచయితలు ఒకనాటికయినా 'షా', ఇబ్సెనులతో పోటీచేయవచ్చునేమో. ఆరోగ్యదాయకమైన అపహాస్యం, అర్థప్రతీతి కావ్యరసాస్వాదనాభావుకత, నర్మహాస్యాలకు బదులుగా, ఒక్కొక్కసారి తీవ్రమైన పరదూషణ, జుగుప్సాకరమైన ప్రచారం, నీచమైన కాముకత మోటు హాస్యమూ ప్రయోగించ బడుతున్నవి.

కాలానుసారంగా నాటకాల్లో సామాన్య మానవుడు నాయకుడవుతున్నాడు. బాలనట సమాజ సంప్రదాయం ఇంకా క్షీణించి పోలేదు; మన నాటకాల్లో సంగీత నాట్యాలు ఇంకా ప్రధానాంశాలుగా ఉన్నాయి. నాటక శిల్పంలో వచోధారాధోరణి గాఢప్రభావం కలిగిస్తుంది. అయితే మితిమిరితే వాగ్ఝరివల్ల నాటకం భావాతిరేకమై సంయమం తప్పి నీరసపడుతుంది. ఇది సామాజికుల దోషంకాదు. అయితే ఆ దోషం సంధానకర్తలది. ప్రజల కామలిప్సకూ, భయానక సన్నివేశాలకోసం తహతహ లాడరనే విషయం అవ్వాయ్ అనే తమిళకవయిత్రి, రాజరాజచోళ చక్రవర్తి అనే రూపకాల విజయంవల్ల విశదమవుతున్నది. ఈ నాటకాలలో తమిళ కవితకూ తమిళ జనానీకానికీ కల ఆదర్శాలు ప్రతిబింబింపబడినవి. ఈ నాటకాలు ఒక్కొక్కసారి వర్తమానాన్ని భూతకాలంలోకి తీసుకొని పోయినా అవి భావరూపాలు.

నాటకాన్ని సినీమా నాశనం చేయలేదు. అయితే సహజంగా దాని ప్రభావం విస్తృతమూ శక్తివంతమున్నూ. ఛాయాగ్రాహక యంత్ర చమత్కారం, ఛాయాచిత్రగ్రహణ ప్రావీణ్యం యోగుల అష్టసిద్ధులను కూడా విశదంగా ప్రదర్శనీయం చేస్తున్నది. ఆధిభౌతికం మరొకసారి

రూపకంలో అవతరించిందని చెప్పడానికి సంబంధ మొదలియారు రచించిన 'మనోహర' కథానుకరణం వెండితెరమీది కెక్కడము నిదర్శనము. అసాధ్యము ఏదీలేదు. తెరమీద ప్రదర్శించడానికనితేలింది. సామాజిక రూపకాలను ఎన్నిక చేయాలని, పౌరాణిక ఐతిహాసిక కథలను విసర్జించడములేదు. ఒకానొక నవ్యసరణి ఆధునిక చిత్రలేఖనాన్ని, జానపదగాథల్లో నల్లతంగళ్ అనగా గుణవతి సోదరివంటి పురాతన నాయికానాయకులను స్మరణకు తెస్తుంది. దాని ఫలితంగా కథయావత్తూ ఆదర్శమైన వదినగారి బాంధవ్యం లేదా మాతృప్రేమ చుట్టూ కేంద్రీకృత మవుతున్నది. పూర్వము అవాంతర కథలు హాస్యం జాలువారుతూ మూలకథకు అతుకులుగా నిబద్ధమయ్యేవి. అయితే అదృష్టవశాన అవి ఈ రోజుల్లో మూలకథలో కలసిపోతున్నవి. నాట్యసంగీతాలు తమిళంలోని వెండితెరకు కేవల ప్రాణం. సినీమారంగంలో అతివేలమైపోతున్నది అలంకృత భాషణం, అతిగా నటించడమున్నూ. నాటకంలో కనపడే ధోరణులు టాకీల్లోనూ గోచరిస్తున్నాయి.

తమిళ సంగీతానికి యోగ్యమయిన స్థానం ఇవ్వాలని ఒక ఉద్యమం బయలుదేరింది. గత దశాబ్దాంతం వరకూ సంగీత వినోదాల్లో ఒకటో రెండో తమిళ గేయాలకంటే పాడేవారుకాదు. నవోద్యమం అజ్ఞాతంగా ఉన్న చాలా పురాతన తమిళ కీర్తనలను, ఒకప్పుడు ఈ దేశంలో జనామోదం పొందిన వాటిని, ఉద్ధరించింది. నవ్యకృతులను ప్రోత్సహించింది ఈ ఉద్యమం. ఆధునిక యుగంలో ఉత్తమ కవులు సహృదయులకు రసాస్వాదన కలిగిస్తున్నారు. అయినా ఒక ఫిర్యాదు ఉన్నది, ఆ పాటలు ఇహానికి సంబంధించినవి కావని, అనేక విషయాలపై నవ్యగేయాలు కుక్కగొడుగుల్లాగ ఉత్పత్తిన్నవి. వాటి భాష తమిళమే అయినా, సంగీతంమాత్రం కర్ణాటకం కానీ, దాక్షిణాత్యం కానీ, తమిళము కానీ కాదు. అవి ఉదాత్త స్థాయికి చెందవు. ఏసంగీత సంప్రదాయంలోనైనా జనప్రీతి కలిగించే గేయఫణితులు ముఖ్యంగా హిందూస్థానీ సినీమాపాటల వరసలు—కర్ణాటకం కాదు—కొత్తరకపు పాటలు సంగీతానికీ చెందవు, కవిత్వమూకాదు. కాకపోతే అవి జోల పాటలు 'డడాడడా' పాటలు, 'ఉద్దైదప్పు' వరసలుగా ఆలోచిస్తే.

సినీమాలో ఉన్నప్పుడు ఆ పాటలువింటూ సామాజికులంతా శైశవంలోకి పోయి, దేవమానవ గాథలను స్మరింపచేసే సాహసాలను ఆనందిస్తారని భావిస్తే, అవి పిల్లల పాటలుగా చెల్లుబాటు కావచ్చును.

## నవల - కథానిక

ఆధునిక యుగంలో వచన మహాకావ్యం నవల. ఎన్నోనవలలు ఆ స్థాయిని అందుకోలేకపోయినా తమిళంలో వైదేశిక నవలలకు అనుకరణాలు, అనువాదాలున్నూ విస్తారంగా ఉన్నవి. పాశ్చాత్య మహాగ్రంథాలు టాల్‌స్టాయివీ, హార్డీవంటివిన్నీ కొన్ని భారతీయ భాషల్లోని నవలలున్నూ అనువదింపబడ్డాయి. బంకిమచంద్రుడి వంగనవల 'ఆనందమఠ'ము చాలాకాలం కిందటనే తమిళంలోకి వచ్చింది. దురదృష్టవశాత్తు అనువాదాలు అనుకరణలు చేయబడినవన్నీ, మహాగ్రంథాలని అనడానికి వీలులేదు. ప్రముఖ రచయిత మరియమలై ఆదిగళ్‌వంటివాడు 'Soldier's wife' అనే నవలను తన ధోరణిలో అనుకరించినాడు. తమిళ భాషలో షర్‌లాక్ హోమ్సు అవతరించినాడు. అపరాధ శోధక నవలలు స్వతంత్రమైనవీ, అనువాదాలూ జనామోదము పొందినవి.

మొత్తంమీద నాటకానికీ, కథానికకూ చెప్పిన లక్షణమే, నవలా విషయంలోనూ సరిపోతుంది. కాల్పనిక భావోద్వేగ ధోరణిలో (రొమాంటిక్) కథ అల్లి 'కల్కి' వంటి నవలా రచయితలు ఐతిహాసిక నవలలు రచించారు. వాటిలో పల్లవ చోళ సామ్రాజ్యవర్ణనలూ, తత్కాలీన ప్రజాజీవనం విపులంగా ఉంటవి. మనస్తత్వ ప్రధానమైన నవలల్లో, దాని అస్థిపంజరం పాపం అనే చేతనాగారంలో ఉండగా, శిల్పంలో ప్రయోగాత్మక దృష్టి విశదమవుతుంది. కాని బహుశః ఆ రచన ఎవరికీ తృప్తికరంకాదు. స్వాతంత్ర్యోద్యమంవల్ల కొన్ని నవలలు ఐతిహాసిక నవలలకన్న గుణవిశిష్టంగా ఉదయించాయి. బహుశః ఇక్కడ కూడా నవలల్లో ఆదర్శరాజ్యం, 'భవిష్యత్తులో జగత్తు' వంటివి వచ్చాయి. భారతికవి ఊహావిహారం చేశాడు తన 'మనోరథం' తో.

చిన్నకథలు వచనంలో సానెట్లవంటివి. ఇక్కడకూడా రవీంద్రుని

గ్రంథానువాదాలు, అన్య భారతీయ రచయితల పుస్తకాలు. పాశ్చాత్య రచనలకున్నూ తమిళానువాదాలు వచ్చాయి. తమిళంలో స్వతంత్ర కథలకు ఆంగ్లానువాదాలు రాగా చదువుకొని, ఆనందిస్తున్నారు. అన్య ప్రాంతీయ భాషల్లోనూ తమిళకథలకు అనువాదాలు వచ్చాయి. మరియవై వంటివారు పిల్లలకోసం కథలు వ్రాశారు. భారతి 'నవతంత్ర కత్తయిక్కల్' పురాతనధోరణిలో, నవ్యభావాలతో కాల్పనికభావ దృక్పథంతో రచించాడు. కథానిక విలక్షణశిల్పంతో, ఆధునిక సంవిధాన చాతుర్యంతో, వి. వి యస్. అయ్యర్ ఆరంభించినాడు. నవ్యభావవ్యక్తీకరణకు కథానిక ఒక సాధన. నవోద్యమాలకు ఆదిమిత్రము. 'పుతుమయి - పిత్తన్' లో కథానిక కవిత్వంతో పోటీచేస్తుంది. ఆయన నుడికారపుసొంపు, వచనగమనం, వ్యంగ్యస్ఫూర్తి, దృక్పథం రమణీయం. బహుశః తమిళంలో మరొక సాహిత్యం సంఖ్యాబాహుళ్యంలోగాని గుణవైవిధ్యంతోకాని ఉత్పన్నంకాదేమో కథానికవలె, భాష, ఇతివృత్తాలకు సంబంధించిన సామాన్య సమీక్ష నాటకానికీ, నవలకూ, కథానికలకూ సమంగా అన్వయిస్తుంది.

ఇటీవల తమిళ సాహిత్యంలో ప్రజాతంత్రాత్మకమైన ఆధునిక పక్షపాతంతో, నవ్యరీతులు గోచరిస్తున్నాయి. తమిళసాహిత్యం భారత ప్రాంతాలతోనూ, విశాల ప్రపంచంతోనూ, ముఖ్యంగా పాశ్చాత్యలోకంతో సంసర్గము నిత్యం పెంపొందించుకొంటూ, వైజ్ఞానిక హేతువాదాత్మక భావభావిత మవుతున్నది. నవ జాగృతివల్ల సజీవులై ఆధునిక తమిళ రచయితలు ధీరులై, దృఢ విశ్వాసంతో, తమిళభాషయొక్క అజ్ఞాతమయిన అగాధాలను గాలిస్తున్నారు. వారు సాహిత్యార్ణవంలోనుంచి ఆనందంతో ఉపరితలానికి విచిత్రమైన వ్యంగ్య భావన, హాస్య, కరుణ కవితాశక్తులతో వస్తున్నారు. అప్పుడప్పుడు జడద్రవ్యంనుంచి దుర్గంధముకూడా వ్యాపింపచేస్తూ వస్తున్నారుగాక!

1. A. History of Tamil Literature,
*By M. S. Puranalingam Pillai*

2. History of Tamil Language and Literature,
*By S. Vaiyapuri Pillai*
౩. Hymns of the Tamil Saivite Saints,
*By F. Kingsbury & G. E Phillips*
4. Hymns of the Aluwars,
*by J. S. M. Hooper*
5. Tamil Literature,
*By Fransis Kingsbury*
6. Subrahmania Bharati, Patriot & Poet
*By P. Mahadevan*
7. Bharat Milap (from Tamil Ramayama of Kamban), *By C. Rajagopalachari*
8. History of Grammatical Theories in Tamil & their relation to the Grammatical Literature in Sanskrit, *By Dr. P. S. Subrahmanya* Sastry
9. Leaves from Kamban,
*By Prof. A. Srinivasa Raghavan*

# తెలుగు సాహిత్యము

కె. రామకోటేశ్వరరావు

## పూర్వరంగము

దక్షిణ భారతదేశంలో తెలుగుబాష మూడుకోట్లకు మించిన ప్రజానీకము వ్యవహరించే భాష. సంయుక్త భారతదేశంలో భాషాకుటుంబాలలో తెలుగు రెండవ పెద్దభాష. తెలుగనీ, ఆంధ్రమనీ ఈ భాషను అంటారు. తెలుగు దేశమనీ, ఆంధ్రదేశమనీ ప్రాంతమును అంటారు. 'ద్రావిడ భాషల తులనాత్మకాధ్యయనము' అనే గ్రంథాన్ని, ఒక శతాబ్దికిందట ఉల్లేఖించిన బిషప్ కాల్డువెల్ నాటినుంచీ, ఆర్య-ద్రవిడ భాషాభేదం పాటించడం, కన్నడ, తమిళ, మళయాళభాషలతోపాటు, ద్రవిడభాషా కుటుంబములో తెలుగును చేర్చడమున్నూ, విద్వాంసులకు పరిపాటియై పోయింది. ఈ భాషాభేద సిద్ధాంతమునుంచి మానవుల తెగలలోకూడా వ్యత్యాసాలు పరిణమించాయి.

అయితే డాక్టర్ చిలుకూరి నారాయణరావు మున్నగువారు ఆంధ్రము పైశాచీ ప్రాకృతమునుండి ఉద్భవించెనందురు. పైశాచీ ప్రాకృతములో ఆంధ్రసాతవాహన ప్రభువయిన హాలుడు, 'గాథాసప్తశతి'ని సంతరించినాడు. అనేక శతాబ్దాలనుంచీ సంస్కృత శబ్దాలను, సంస్కృతోద్భవ పదాలను గ్రాంధిక రచనలోను, వ్యావహారిక భాషలోనూ, అధికాంశము ప్రయోగిస్తూనే ఉన్నాము. 'కేవల ద్రవిడ' శబ్ద ప్రయోగం చేయాలని ప్రయత్నిస్తే, అది చివరకు అగ్రాహ్యతకు దారితీస్తుంది. కన్నడభాషా విషయంలోకూడా ఇది నిజము. ఉత్తర దక్షిణ భారతాల మధ్య, ఈ భాషా కుటుంబాలురెండూ, భారతీయ సంస్కృతి సామరస్యసిద్ధికి అనుకూలంగా ఉన్నాయి.

నన్నయభట్టారకుడు సంస్కృత మహాభారతాంధ్రీకరణకు పూను కోకపూర్వం, ఏనాడో ఎక్కువగా గేయాల్లోనూ, కాల్పనిక కథలుగానూ, చాలాసాహిత్యము ఉండేది. కాని నన్నయ్యతో ఆంధ్రమహాగ్రంథరచన ప్రారంభమైంది. ఆ సారస్వతము రాజులూ, దండనాయకులూ మొద లయిన వారి పోషణలో, వెల్లివిరిసింది. యావదాంధ్రములో కవి గణ్యత సంపాదించినాడు. 11 శతాబ్దినుంచీ 15 శతాబ్ది పర్యంతము తెలుగు కవులు సంస్కృతపురాణేతిహాసాల్లోని విజ్ఞానాన్నీ, కవిత్వాన్నీ, ప్రజా నీకానికి సన్నిహితము చేసినారు. ఇప్పటికీ తెలుగువారి జీవితానికి ఒరవడి దిద్దినవి కవిత్రయ [1] (నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగడ) కృత మైన ఆంధ్రమహాభారతము, పోతన్న ఆంధ్రభాగవతమున్నూ, శ్రీనా థుడు రచించిన ఆంధ్ర నైషధకావ్యం కొంతవరకు తత్కాలీనాంధ్ర సారస్వతానికి అమూల్యమైన ఉపస్కారకం.

15 శతాబ్దినుంచి 17 శతాబ్దివరకూ విజయనగరసామ్రాజ్యము జేగీయమానంగా ఉన్నకాలంలో, 'ప్రబంధ' మనే నూతనసాహిత్య ప్రక్రియ స్వతంత్రమైన ఆకార ప్రకారాలతో, సముద్భవమైంది. శ్రీకృష్ణ దేవరాయలవారి ఆస్థానకవీశ్వరుడైన అల్లసానిపెద్దన ప్రబంధ మార్గ దర్శకుడై, మనుచరిత్ర రచించినాడు. శ్రీకృష్ణరాయలు, రామరాజ భూషణుడు, తెనాలి రామకృష్ణుడు, పింగళి సూరనార్య ప్రభృతులు, పెద్దనకు అనుయాయులైనారు. ప్రబంధలక్షణము ఇట్టిది:- అది పద్య గద్యాత్మకమై, సుదీర్ఘమైన ఆఖ్యానము. మహారాజపురుషుల జీవితాలో, ప్రాచీన లేదా మధ్యమ కాలీన భారతదేశంలోని దివ్యనాయికా నాయక వృత్తమో, ప్రబంధములోని ఇతివృత్తం. కథాకథనంలో విశిష్టచాతుర్యం వర్ణనలో భావనావిశేషం. నానాఛందోరీతులు, అవలంబించడంచేత భార తీయ సాహిత్యాలలో ప్రబంధకవితాసరణి విశిష్టమైనది. తంజాపురిలో, మధురలో నాయక రాజవల్లభుల దేవిడీలలో, ఆంధ్రసాహితి యక్షగాన పద, నాటకవైఖరులకు సన్నిహితంగా విరాజిల్లింది. తెలుగు పలు కులు అజంతములు కావడంచేత, సంస్కృతమిశ్రమాన్ని పొందగల

[1] కవిత్రయమువారు సంస్కృత మహాభారతాన్ని ఖండశః అనువదించారు.

సౌలభ్యం ఉండడంవల్లనూ, భాషతీయనై సంగీతానికి చాలా అను వుగా ఉన్నది.

సంస్కృతముద్వారా ఆంధ్రుల సంగీత సాహిత్యకృషి ప్రశంస నీయము, ఆలంకారికులైన విద్యానాథ జగన్నాథ పండితరాయలు. వ్యాఖ్యాతలైన కాటయ, వేమభూపాలుడు, మల్లినాథసూరి, భక్తులూ వాగ్గేయ కారకులున్నూ అయిన లీలాశుక నారాయణతీర్థులవారున్నూ యావద్భారత సంస్కృతి వికాసానికి ప్రముఖపాత్రలు వహించినారు. తెలుగులో వాగ్గేయ కారకులైన అన్నమాచార్యులు, క్షేత్రయ్య, త్యాగ రాజస్వామిన్నీ ప్రఖ్యాతులు. విశిష్టనాట్య ప్రయోగ ప్రదర్శకు లయిన కూచిపూడివారు అన్యభాషీయ ప్రాంతాలలోనూ సమాదరణ పొందినారు.

## మార్గదర్శకుడు

గోదావరి తటాన తూర్పు చాళుక్య మహీవల్లభుడు రాజరాజు రాజమహేంద్ర ఇత్యాది నామాలవల్ల విదితుడు. ఆయన ఆస్థానంలో నన్నయ భట్టారకుడు ప్రప్రథమాంధ్ర మహోదాత్త కృతియైన ఆంధ్ర మహాభారతమును రచించినాడు. అది వేయి సంవత్సరాలనాటి గాథ. విధి వైచిత్రివల్ల ఆ స్థానంలోనే పందొమ్మిదో శతాబ్ది తుదిలో, ఆంధ్ర సాహిత్యోజ్జీవనం కలిగింది. [1]వీరేశలింగంపంతులు, చిలకమర్తి లక్ష్మీ నరసింహము, వసురాయకవి పునః జ్యోతివి వెలిగించినారు. సంప్ర దాయక సంస్కృతి బ్రిటీషు పాలనా ఫలితంగా మరుగుపడిపోయింది. అయితే కళాశాలలు విశ్వవిద్యాలయాలున్నూ స్థాపితము కావడంచేత, వివిన్న నాగరకతలతో సఫలమైన సంసర్గం తెలుగుబాషకు ఏర్పడింది. పాశ్చాత్యుల సాహిత్య విజ్ఞాన శాస్త్రాలవల్ల ఆంధ్రదేశంలోని మనీషు లకు నవ్యాలోకము కలిగింది—భారతదేశంలో అన్యభాషా కుటుంబాలలో కలిగినట్లు. దానిప్రభావంవల్ల చకితులై ఆంధ్రపండితులూ, కవులూ, నవ్యవాతావరణంలో పెరిగి, తమ ఆంధ్ర సారస్వతాన్ని, సంపన్నము చేసినారు.

---

[1] రాజమండ్రి, లేదా రాజమహేంద్రవరము

అన్ని విధములా వీరేశలింగం పంతులు మార్గదర్శకు డైనాడు. ప్రముఖంగా సామాజిక సంస్కర్తగా, గతానుగతికమైన ఆచారాలకు ఎదురు తిరిగినవాడై, తాను చేబట్టిన మహత్కార్య సంసిద్ధికై ఖడ్గ ప్రాయమైన నవ్యలేఖినిని, సరళ వచన రచనా విధానంతో, అవలీలగా నడపినాడు. సామాజికమైన అన్యాయాన్ని చూచినప్పుడు, తపన చెందడం ఆయన వ్యక్తి లక్షణం. విగ్రహ ధ్వంసనోత్సాహం ఆయనలో ఉరకలెత్తగా, ఏ ప్రాచీన వ్యవస్థకానీ, ఏ ప్రజాసామాన్య మతవిశ్వాసము కానీ పవిత్రంగా నిలవ తొక్కుకోలేకపోయింది. సమకాలిక జీవితాన్ని చూచిన ఆయనకు సానుభూతితో అవగాహన చేసుకొనే శక్తిలేదు. అయితే ఆ ప్రజ్ఞ వీరేశలింగంగారి యువమిత్రుడూ, తోడిపోరుడున్నూ అయిన లక్ష్మీనరసింహంగారికి ఉండేది. కాని సాహిత్యసరణిలో జీవిత చరిత్ర, సమీక్ష, నవల, నాటకము, శాస్త్రవిజ్ఞానం, రాజనైతికవ్యాసాలు, పత్రికాలేఖనం, ప్రబోధాత్మక రచన, స్వీయ జీవిత కథారచనలన్నింటికీ ఆయన కారణభూతుడు.

ఆయుగంలో దిగ్దంతులైన సింహపురీయులైన వేదం వేంకటరాయ శాస్త్రిగారు, బళ్ళారివాసులు ధర్మవరం కృష్ణమాచార్యులుగారు, మచిలీపట్టణ వాస్తవ్యులు జంటకవులు దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, విజయనగరపురీయులు గురజాడ అప్పారావు గారున్నూ ఉద్భవించినారు. తరువాత తరంలో గేయ గీతికారచయితలకు అప్పారావు మార్గదర్శకుడైనాడు. ఆ గేయకవులలో బసవరాజు అప్పారావు, అడివి బాపిరాజు, నండూరి సుబ్బారావుగార్లు ఇహలీల చాలించినారు. తిరుపతి వేంకటకవులు 19 శతాబ్దారంభపు క్షీణప్రాయ ప్రబంధరచనా విధానంనుంచి, తెలుగు కవిత్వాన్ని సముద్ధరించినారు. వారు మహా మండలేశ్వరులు, రాజస్థానాలు, పండితులచేతులనుంచి కవితాకన్యను బంధముక్తను చేసినారు. వారు మార్గానుకూల్యత కలిగించగా, రాయప్రోలు సుబ్బారావు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగార్లు ముక్త కంఠంతో, భావగీతాగానము చేసినారు. తిరుపతివారి 'బుద్ధచరిత్రము'నే దీర్ఘకావ్యము ప్రసన్న పద్యాత్మకమై, భావచిత్ర సంపన్నమై, ప్రముఖమూ సౌష్ఠవమున్నూ, అయినది. మహా భారతకథలను స్వీకరించి,

వారు రచించిన నాటకములు 'పాండవోద్యోగ విజయములు' కాలపరీక్షకు నిలిచినవి.

## భావకవిత్వము

దక్షిణ భారతదేశంలో అన్యభాషా కూటాలకన్న, కొంత ముందుగానే తెలుగువారిమీద 1905 నాటి జాతీయోద్యమము, బంకించంద్ర రవీంద్రులు ప్రాతినిధ్యంవహించిన వంగసారస్వత ప్రభావాలున్నూ ప్రసరించినవి. తెలుగువారు తద్భావ భావితులైనారు. వీరేశలింగం పంతులు తరమువారు 17 శతాబ్దము మొదట 19 శతాబ్దిలోని ఆంగ్ల సాహిత్యంలో ప్రీతికలవారై, అప్పుడప్పుడు భావోద్దీపనకు ప్రౌఢ సంస్కృత సాహిత్యాన్ని ఆస్వాదించేవారు. అలాగే కృష్ణశాస్త్రి తరమువారు 19, 20 శతాబ్దాల ఆరంభంలోని ఐరోపీయ సాహిత్యమువల్లనూ, సమకాలిక సాహిత్యమువల్లనూ, గాఢంగా ప్రభావితులైనారు.

ప్రథమ ప్రపంచ సంగ్రామకాలంలో కళాశాలల్లో అధ్యయనము చేస్తున్న తరుణ విద్యార్థులు 1915-1935 సంవత్సర మధ్యకాలంలో ఉత్తమకృతులు రచించినారు. మన సాహిత్య చరిత్రలో ఆ దశాబ్దాలు రెండింటినీ, ఏథెన్సులోని పెరికిల్సు, ఇంగ్లండులోని ఎలిజబెత్తు లేదా భారత దేశంలో కృష్ణరాయల యుగాలతో పోల్చవచ్చును. రచయితలు భావకవిత కాల్పనిక భావోద్రిక్తగేయాలు, నవల, కథానిక, నాటకము వంటి ప్రధానసాహిత్య ప్రక్రియలతో, ఆంధ్రసరస్వతిని అలంకృతను చేసినారు. ఆ కవుల భావాభివ్యక్తికి భావకవిత్వమే అభిమాన విశేషమైంది. ప్రౌఢ భారతీయ కవిత్వంలో కవీంద్రుని వ్యక్తిత్వము, సహృదయ పాఠకుని చిత్తానికి ఎప్పుడోకాని హత్తుకోదు. పురాణేతి హాసాలలో భక్తుల పరమేశ్వరార్పిత చిత్తవృత్తి, శతకములున్నూ ఆత్మాశ్రయ కవిత్వానికి అతిసన్నిహితత్వాన్ని, ద్యోతకము చేస్తవి. కవి నిజసుఖ దుఃఖాను భూతిని, రసభావ తన్మయతను, ఆవిష్కరిస్తాడు, మన సాహిత్యానికి ఇది వినూత్నము.

ఈ భావకవుల ప్రధానాకాంక్ష ప్రియాన్వేషణం. కవికి వెంటనే తన ప్రియురాలు రమణీయతా పూర్ణమైన ప్రేమతీర్థానికి పథప్రదర్శిని

అయిన తారగా భాసిస్తుంది. భావకవుల దృష్టికి స్త్రీ ఒకానొక దివ్యమూర్తి. ఆమె తటిల్లేఖా సదృశ, నీహారస్నపితోషస్సు, లేదా మహార్ణవలాస్యమానపిత ఫేనంగా భాసిస్తుంది. ప్రేమకు ఆలంబన విషయమును లక్ష్యప్రాయంగాచేసి, జడశరీరాన్ని అతిక్రమించిన, ఆమె హృదయలావణ్య లాలిత్యాలతో సహృదయునికి మనసును తరుముకొనివచ్చే వర్ణనతో, భావకవులు తెలుగు కవితకు ఉదాత్త స్థాయిని కూర్చినారు.

రాయప్రోలు సుబ్బారాయకవి రచించిన 'తృణకంకణము', 'స్వప్నకుమార' ఖండకావ్యాలలో ప్లేటో ప్రతిపాదించిన మహాప్రణయము ఇతివృత్తము. అబ్బూరి రామకృష్ణరావుగారు రచించిన 'మల్లికాంబ' లోనూ అదే వస్తువు గోచరిస్తుంది. మట్టిలో పుట్టిన అల్పుడైన ప్రణయి, దివ్యాప్సరోంగనకై గాఢంగా తపిస్తాడు. ఈ వేదన నైరాశ్యజనితమై కృష్ణశాస్త్రిగారి భావగేయ కవితలో, 'ఊర్వశి' లో ప్రధానముగా భాసిస్తుంది. ఆత్మేశ్వరీ సంయోగమునకైన మహాహృదయవేదనాకాంక్ష, శివశంకరశాస్త్రిగారి 'హృదయేశ్వరి' అనే కావ్యంలో, ప్రతిబింబితమైంది. వేదుల సత్యనారాయణశాస్త్రిగారు 'దీపావళి' లో ప్రేమార్ణవయాత్రాపథికుడు కావాలని గాఢంగా కాంక్షచేస్తారు. నాయని సుబ్బారావుగారు ప్రవాహమధ్యాన పెళుసైన తన పడవ ముక్కచెక్కలై పోతుందని భీతిచెందుతారు. కాని భగ్నఫలకశకలాలు తన చితాగ్నికి ఉపకరిస్తాయి. ఈ కవి గణములో ఇంచుమించు ఏకాకిగా నాయని, తుదిలో కవితాగానము విజయస్వరముతో మేళవించినాడు. ఆయన ప్రేమ సిద్ధించింది. ఇహపరాలను ముడిపెట్టి చివరకు కృతకృత్యుడైనాడు.

## సాహితీసమితి - శివశంకరశాస్త్రి

ఈ కవులలో రాయప్రోలు సుబ్బారావుగారు మొట్టమొదటివాడు. కాని సాహితీసమితి వ్యవస్థాపకులయిన శివశంకరశాస్త్రిగారు, మహారాష్ట్రములో అనంతరకాలంలోని 'రవికిరణమండలి', కర్ణాటకములోని 'గెలియరగుంపు' వలె, రచయితలనుచేర్చి, చాలామందికి సాహితీసౌహార్ద్రత కలిగించినారు. శాస్త్రిగారు సంస్కృత విద్వాంసులు, సమ

కాలికాంగ్ల సాహిత్యాన్నీ, భారతీయ సాహిత్యాలనూ, భాషలనూ, మూడు నాలిగింటిని కూలంకషంగా, అవలోడనముచేసిన శివశంకర శాస్త్రిగారు ఆంధ్రకవులకూ కథానికారచయితలకూ, సారస్వత వ్యాస రచయితలకూ అగ్రసోదరుడు 'అన్నగార' యినాడు. సాహిత్య భావ వ్యక్తీకరణానికీ, వ్యావహారి కాంధ్రోద్యమానికీ, పూనిక ఇచ్చినవారు గిడుగు రామమూర్తి పంతులుగారు. కాని సాహితీసమితివల్ల, వ్యావహారిక భాషోద్యమానికి విజయము సంప్రాప్తమైంది. దానికి కారణము రచయితలు కేవలము వాడుకభాషను అవలంబించడమే. ద్వితీయ ప్రపంచసంగ్రామానికి పూర్వం సుమారు పాతికసంవత్సరాలకాలంలో కలకాలం నిలువగల పద్యాలుగాని. గేయాలుగాని, వచనరచనగాని పుట్టడానికి కారకులు సాహితీసమితిలోని ప్రజ్ఞావంతులగు సామితేయులే. అందుకు సామితేయులకూ, వారిని మెచ్చిన సహృదయులకూ, వారి అనుయాయులకూ గణ్యత ఇవ్వక తప్పదు.

## గేయరచయితలు

పద్యరచన చేయగలవారయినా గేయాన్నే స్వీకరించిన వారున్నారు. నలభైయేళ్ళ కిందటసంగతి–నిన్నటి విషయమనిపిస్తుంది. జ్ఞాతులయిన బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావుగార్లు లా కాలేజీలో క్రైస్తవ కలాశాలలో మద్రాసులో చదువుతూ ఉండేవారు. వారిద్దరికీ గురజాడ అప్పారావుగారి గేయాలన్నా, గీతాఖ్యాయికలన్నా, చెడ్డపిచ్చి – వారు గేయరచనచేసి, తోడివిద్యార్థులలో కుతూహలమున్న వాళ్ళనుచేర్చి, శ్రవణపేయంగాపాడి, కళ్ళు చెమ్మగిల్లేలట్టు చేసేవారు. బసవరాజు అప్పారావుగారి 'పెలయేటిగాన'ముతో, నండూరివారి 'యెంకి పాటల'తో, కవితావేశంవల్ల ప్రజల్లో తుపానురేగింది. ఈనాడు ప్రతివారి పెదవులమీద, ఆ పాటలు విరిసినవి. అప్పారాయకవి చెప్పదలచుకొన్నది 'ఎదమెత నౌటకై సొదగుందరా కొంత', అంతటితో 'మదిగల అహమెల్ల మాసిపోవునురా' అని. అనగా ప్రతివాడూ వేదన పొందితే కాని, హృదయమార్దవము కలగదు. నండూరి సుబ్బారావుగారి జానపద ప్రేమికులు యెంకి, నాయుడుబావలు. ఇద్దరూ మెత్తనివారు,

నెమ్మదయినవారు. ప్రణయ ప్రబంధాలలో రాజవంశీయులయిన నాయికా నాయకుల్లాగ, వారిద్దరూ గాఢంగా పరస్పరం ప్రేమించుకొంటారు. ప్రేమికుడు, నాయుడుబావ స్వల్పసందేహంతో యెంకిని పలకరిస్తాడు :—

"ఎక్కడుంటావే వెలుగులపిల్లా ?". అమాయికంగా పిల్ల సమాధానం ఇస్తుంది :—

"నీ నీడలోనె మేడకడతా నాయుడుబావా" అని.

అడివి బాపిరాజు (మృ. 1952) ఆలేఖ్యశిల్పి, కవి, గేయరచయిత. కొంతకాలానికి కథానికలవల్ల, నవలలవల్ల, ఖ్యాతిచెందినాడు. రాజమహేంద్రవరంలో ప్రభుత్వ కలాశాలా ప్రధానాచార్యులయిన ఆస్వాల్డు కూల్డ్రేగారు బాపిరాజుగారిని గ్రంథరచయితగా ప్రోత్సహించారు. విదగ్ధుడైన ఈ ఆంగ్లేయశిల్పి, కవి, కథాకారుడున్నూ, తన సాంగత్యం వల్ల శిష్యులను శిల్పులను చేసినాడు. కూల్డ్రేగారి ప్రభావము బాపిరాజు కవికొండల వెంకటరావు, ప్రసిద్ధ చిత్రశిల్పి అయిన దామెర్ల రామారావు గార్లమీదనూ, ఆ కాలంలోని అన్యయువకులపైనా ప్రసరించింది. ఒక శతాబ్దికిందట, ఆంధ్రులకు ఉత్తేజము కలగడానికీ, సాంస్కృతికమైన ఉజ్జీవనానికీ కారణభూతులు ఆచార్య కూల్డ్రే, సివిల్ సర్వీస్‌లో ఉన్న సి. పి. బ్రౌన్ దొరలు. బాపిరాజుగారి ఉపజ్ఞ సర్వతోముఖమైనా, ఆయనకు గేయరచన అభిమానము. ఆయన గేయాలు భావోద్రిక్తములై, శ్రోతలను ఉన్నతస్థాయికి తీసుకుపోతాయి. అందుకు దృష్టాంతం 'ఉప్పొంగిపోయింది గోదావరి, తాను గుప్పున్న యెగసింది గోదావరీ' అనేగేయం. ఆ గేయం గగనపథానికి ఉవ్వెత్తుగా పొంగిపొరలుతున్నది.

## విశ్వనాథ, పింగళి

'కోకిలమ్మ పెళ్ళి' లోనూ, విశ్వనాథ సత్యనారాయణగారు గేయాలద్వారా కాల్పనిక భావోద్రిక్తమైన ప్రకృతి గాథలనూ, ఆమె కోమల చిత్తవృత్తులనూ వ్యక్తము చేయగా, ఆ ప్రయోజనమును సాధించేటందుకు, దువ్వూరి రామిరెడ్డిగారు సొగసుగా పద్యాలు శోషహించినాడు. ఉజ్జీవన కారకులలో విశ్వనాథకు ఉన్నత స్థానం ఉన్నది. ఆయన ఇంచుమించుగా అన్ని సాహిత్యప్రక్రియలను చేపట్టి, అనగా

కావ్యధోరణి, కాల్పనిక భావోద్రిక్తగేయం (రొమాంటిక్‌సాంగ్), ఆఖ్యాయిక, కథానిక, సమీక్షాత్మక వ్యాసమువంటి వాటిల్లో ఘనత సాధించినాడు. ఆయన రచనల్లో సంపన్నత ఓజస్సులు మొరటుతనమున్నూ సంయోగించినవి. 'గిరికుమారుడు' అనే పేరుతో ఆయన చాలాసొగసుగా, ప్రణయ కవిత్వము చెప్పినాడు. దేశభక్తి భరితమైన ఆయన 'ఆంధ్ర ప్రశస్తి' సారస్వత గౌరవాన్ని అందుకొన్నది.

పింగళి లక్ష్మీకాంతము, కాటూరి వేంకటేశ్వరరావుగార్లు 'తొలకరి' అనే చిన్నపద్యసంపుటిని, డాక్టర్ సి. ఆర్. రెడ్డిగారి మెప్పుతో ప్రకటించి, సాహిత్యజీవితము ఆరంభించినారు. ఆరంభ జీవితంలోని వర్ధనాశీలము 'సౌందరనంద' మహాకావ్యంలో సఫలమైంది. ఆ కావ్యము బౌద్ధయుగమును స్మరణకు తెస్తుంది. ఆ గ్రంధమునకు సంపూర్ణమైన ఆకార ప్రకారాలవల్లనూ, ఉదాత్తరస పోషణచేతనూ, సౌష్ఠవమయిన మహాకావ్యత్వము సిద్ధించింది

ఈ రీతిగా ప్రణయమూ, ప్రకృతిన్నీ, తత్కాలీన కవులకు ప్రధాన కావ్యవస్తువులైనవి. అయితే వైదేశిక పాలనను ప్రతిఘటించిన కాలములో, ప్రధానంగా దేశభక్తి, కవుల భావుకతా పూర్ణతకు ముఖ్య లక్షణం. వారు విశ్వవిశాలమైన ఆలోకముగల కలలుకనే స్వాప్నికులు; ఆ కవులు సామాన్య ప్రవృత్తిలో కేవలం పాలుపంచుకోక పోయినా, మానవాళియెడల కారుణ్యము వ్యాప్తము చేసుకొన్నారు. వారు పద సంఘటనలో, ఛందస్సుల్లో మార్గదేశి సాహిత్యాల అగాథ వ్యత్యాసాలను ఏకముచేసే సేతువు నిర్మించాలని కాంక్షచేసినారు.

## వామమార్గానికి మొగ్గు

1935 అనంతరం ఆంధ్రకవిత్వంలో వామమార్గానికి మొగ్గుదల వచ్చింది. (శ్రీ శ్రీ) శ్రీరంగం శ్రీనివాసరావుగారు రాయప్రోలువారూ ఆరంభించిన కాల్పనిక భావోద్యమాన్ని వ్యతిరేకించి, విప్లవము తెచ్చినారు. శ్రీనివాసరావుగారు 'మరోప్రపంచం, మరోప్రపంచం' అనే గేయం గానం చేశారు. ఆ ప్రపంచంలో ఘర్మజలం, శ్రమ, కర్షక కార్మికుల హక్కులను, న్యాయమునూ, సాధించడానికి దారితీస్తవి.

తాజమహలు వైభవాన్ని ప్రశంస చేయడం అర్థరహితం. దానినిర్మాణము సాధ్యము కావడానికి పీడిత శ్రామికుల విషయం ఆలోచించు. రసలాలిత్యము ప్రకృతిలోని సుందర చిత్తవృత్తుల్లో తదారాధనానంద పారవశ్యమున్నూ, ఇకమీద కావ్యవస్తువులుకావు. ఈ కొత్త ముఠా పాశ్చాత్య దేశాల్లోని ఇంప్రషనిస్టుల, అధివాస్తవికుల మాంత్రికమాయకు వశ్యమైంది. ఈ నవ్యులు లాక్షణిక ఛందోరీతులను, కాల్పనికభావవాదులు అధికంగా వాడిన గీతచ్ఛందంతోపాటు, విచ్ఛిన్నముచేయ తలచినారు వారికి అభిమానమైనది స్వేచ్ఛాఛందస్సు. రాజకీయ స్వాతంత్ర్యం ఉద్భవించడంలో ఆర్థికమైన తృప్తి లేకపోవడంచేతనూ, భ్రమ తొలగిపోగా పరకలహానికి మార్గము ఏర్పడింది. అటులే ఈ వామపక్షానికి మొగ్గు చూపినకవులకు భిన్నంగా, మల్లవరపు విశ్వేశ్వరరావు, పిలకా గణపతి శాస్త్రిగార్లు. రాయప్రోలు కృష్ణశాస్త్రీయ సంప్రదాయబద్ధులైనారు. చెళ్లపిళ్ళ వేంకటశాస్త్రిగారికి సాక్షాత్తుశిష్యులైన మాధవపెద్ది బుచ్చిసుందర రామశాస్త్రిగారు తమ 'పంచవటి' కావ్యంలో, భక్తకవిగా ప్రజ్ఞావిశేషము ప్రదర్శించినారు.

## నవ్య మహాకావ్య సంప్రదాయవాదులు

ఇటీవలనే కవులు మహాకావ్య సంప్రదాయ మనే నవ్యోద్యమం పునః సాగించినారు. ఈ విషయము మనము గమనించవచ్చును. ఈ శతాబ్దారంభంలో ప్రచలితమైన కాల్పనిక భావోద్వేగవాదానికి (రోమాంటిసిజమ్) వ్యతిరేకంగా వామపక్షీయులూ, అధివాస్తవికులున్నూ, విప్లవము తెచ్చినట్టు నవీన మహాకావ్య సంప్రదాయ మార్గగాములలో యశ. రామకృష్ణమాచార్యులు, జంధ్యాల పాపయ్యశాస్త్రి, గుఱ్ఱము జాషువాగార్లవంటి కవులు 1935 నుంచి 1950 వరకు ఉన్న అధివాస్తవికతా ప్రయోజనాన్ని ప్రశ్నించినారు. సంఘర్షణకన్న సామరస్యమే వారి లక్ష్యము. పఠాభి, ఆరుద్రగార్ల అల్లకల్లోల స్వేచ్ఛాఛందము, నవీన మహాకావ్య సంప్రదాయాను సారులకు రుచించలేదు. యుద్ధానంతరం జడచైతన్యాలకు, ఆదర్శవాస్తవిక వాదాలకూ మధ్య సామ్యావస్థ ఏర్పడక తప్పదు. కృష్ణమాచార్యులుగారు, ఆయన తోడి

కవులున్నా ఈ పామరస్యాన్ని సంఘటింపచేస్తున్నవారమని చెప్పు కొంటున్నారు. అధివాస్తవికులు (స్రియలిస్టు) కాల్పనిక భావవాదు లను నిర్లక్ష్యంగాచూచి, వారిని 'పలాయనవాదుల'ని అంటున్నారు. మహాకావ్య మార్గానుగాములు అధివాస్తవికులను ప్రశ్నిస్తున్నారు, ఈ నిరంతర వర్గఘర్షణ ప్రబోధం ఎక్కడికి దారితీస్తుందని? ప్రజాదారిద్ర్యం బాధలూ అనుభవించేమాట నిజం అయితే ద్వేషమాత్సర్యములతో సంకలితమైన గీతాలాపనము, మానవులను దుఃఖముక్తులను చేయ గలుగుతుందా అని ప్రశ్న. వర్గసంఘర్షణ, పోరాటమూ తప్పనిసరేనా? కావ్యప్రయోజనము రాజకీయార్థిక విప్లవానికి సాధనం కావడమేనా? ఇవి ప్రస్తుత సమస్యలు. నవ్య మహాకావ్యమార్గానుసారులయిన కవులు కవిత్వానికి సంపూర్ణ సౌందర్య సత్య సంకేతరూపమైన గౌరవస్థాయిని, తిరిగి ఇనుమడింపచేయాలని ఉత్సుకులై ఉన్నారు. ఈ మహాకావ్య సంప్రదాయమార్గమును పునః అధిగమించడము విశ్వనాథవారి 'రామా యణ కల్పవృక్ష' రచనవల్ల ధ్రువపడుతున్నది. అలాగే గడియారం శేషశాస్త్రిగారు శివాజీని నాయకుణ్ణిచేసి, 'శివభారతము' రచించినారు. ప్రస్తుతం మనకు ఈ రెండు మహాకావ్యాలూ, మహాకావ్య మార్గంలో నిలచి రచించినవి కనుక నిలవవచ్చునేమో.

## కథానిక

కథానిక ఆధునికరూప సమకాలిక దృశ్యంగా గురజాడ అప్పా రావుగారివల్ల యాభైసంవత్సరాలకు పూర్వమే ఆవిర్భవించింది. అయితే కథానిక అనంతరం కొన్ని సంవత్సరాలకు వికాసమూ ఔన్నత్యమూ సాహిత్యంలో సంపాదించడానికి, చింతాదీక్షితులుగారి అధ్వర్యంలో వచ్చిన రచయితలు కారణభూతులు. దీక్షితుల కథల్లో స్త్రీ పురుష పాత్రలు సానుభూతితోనూ, హాస్యపూరితంగానూ, చిత్రింపబడ్డాయి. కన్నడభాషలో కథారచయిత అయిన మస్తి వేంకటేశ అయ్యంగారి కథలవలె ఉంటాయి దీక్షితుల కథలు. ఇరుగు పొరుగు ప్రాంతీయు లయినా ఒకరి సాహిత్య వ్యాసంగము మరొకరికి విదితముకాదు. ఇద్దరూ కథానికా శిల్పులు. వారిశిల్ప ప్రావీణ్యము గోపనంలో ఉన్నది. కథా

కథనము సరళము; తానంతట తాను చెప్పుకొనిపోతూ ఉన్నట్టుగా కథ ఉంటుంది. కాని కథాసమాప్తి అనివార్యముగా బాసిస్తుంది మధ్యమ వర్గము వారి గృహజీవిత కథా చిత్రణలో మునిమాణిక్యం నరసింహా రావుగారు సిద్ధహస్తులు. ప్రత్యేక సన్నివేశాలలో హాస్యపోషణ చేయ-డంలో ఆయన తప్పక కృతకృత్యుడయినాడు. ఆయన కథలలో 'కాంతం' అనే నాయిక సాదువు, అనురాగవతి అయిన గృహిణి. అయినా ఆమె స్వతంత్రేచ్ఛకలది. తనవలె భర్తకూడా తెలివిగలవా డయితే అందు కామె తరుచుగా చకితురాలవుతుంది. గుడిపాటి వెంకట చలంగారు గౌరవము కోలుపోయిన స్త్రీవిషయము మహాశక్తి వంతంగా వ్రాస్తారు. ఆయన కేవలం యథార్థవాదంలో విశేషంగా లైంగిక విష యాన్ని చిత్రించడంలో విశ్వాసము కలవారు. ఒక్కొక్కప్పుడు ఆయన కేవలమూ యథా సంభవమైన దాన్ని వాస్తవమని భ్రమపడతారు. కథానికలలో చాలా విశేషాలు చిత్రించగా, శిల్పసౌష్ఠవము మొక్కపో తున్నది. మంచి కథానికా రచయితలు తెలుగులో అసంఖ్యాకు లున్నారు. సంఖ్య ఇంకా పెరుగుతూనే ఉన్నది. మహిళా రచయితలలో కనుపర్తి వరలక్ష్మమ్మ, ఇల్లిందల సరస్వతీదేవి, మాలతీ చందూరు గారలు విఖ్యాతలు. కథానికా రచనలో ఉన్నతస్థాయిని ఆంధ్రసాహిత్యము సాధించింది అని అనడానికి మూడేళ్ళకిందట పా. పద్మరాజుగారు ప్రపంచకథల స్పర్ధలో రెండో బహుమానము అందుకొనడము నిదర్శనము. సామాన్యంగా బాపిరాజుగారి కథలు శిల్పుల జీవితాలు, వారి రమ్యాలోకానికి సంబంధించినవి. ఆయన రచించిన 'శైలబాల' శిల్పి కలలుకన్న ఒకా నొక అభినేత్రి. ఆ కథానిక ఉత్కృష్ట రచన.

## నవల

తెలుగుభాషలో ప్రప్రథమం నవల రచించినవారు వీరేశలింగం పంతులు. గత శతాబ్దాంతంలో ఆయన 'రాజశేఖర చరిత్రము' రచించి ప్రకటించినాడు. ఆ నవలలో మధ్యమ వర్గ బ్రాహ్మణ కుటుంబము చిత్రితమైంది. ఇంటి పెద్ద అనేకకష్టాలూ సుఖాలూ

అనుభవిస్తాడు. కాని చివరకు ఆయన జీవితము జోగియమానం అవుతుంది. ఆ నవలను ఒక ఆంగ్లేయుడు అనువదించినాడు. వీరేశలింగంగారి అనుయాయి నవలాక్షేత్రంలో చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, ఆయన ఐతిహాసిక నవలలు జనప్రీతిని పొందినవి. అయితే ఆయన యశస్సు ప్రధానంగా సమకాలిక ఆంధ్రజీవిత చిత్రణ గల 'రామచంద్ర విజయము'నే నవలపై ఆధారపడినది. ఆయన అద్భుతగా రమేశచంద్రదత్తుని 'తాళ్ళచెరువు' - 'Lake of Palms' అన్న ఆంగ్ల నవలను అనువదించి వంగీయుల జీవితమూ, వారి కాంక్షలనూ, ఆ కాలములోని తెలుగు తరమువారికి వ్యక్తముచేసినారు. ఇటువంటి చక్కని అనువాదములు వేంకట పార్వతీశ్వరకవులు వంగభాష నుండి ఎన్నో చేసినారు. వాటిలో బంకిం చంద్రచటోపాధ్యాయుని గొప్ప నవలలను అనువదించినారు. తరువాత కొంతకాలం రచయితల దృష్టి అపరాధ పరిశోధక నవలలమీదికి పోయింది. ఇంతలో ఉన్నవ లక్ష్మీనారాయణగారు (1921) [1] 'మాలపల్లి' అనే నవల రచనచేసినారు. అది గాంధీయుగమునాటి మహా గద్యకావ్యం.

ఆధునికకాలంలో విశ్వనాథ సత్యనారాయణ, అడివి బాపిరాజు గార్లు మహా నవలాకారులుగా ఇద్దరూ ఆంధ్రుల అనురాగము చూరగొన్నారు. 1934 లో ఆంధ్ర విశ్వవిద్యాలయము. విశ్వనాథుని 'వేయిపడగల'కూ, బాపిరాజుగారి 'నారాయణరావు'కూ ద్విభాకరించి పారితోషికం ఇచ్చింది. విశ్వనాథకు సంప్రదాయంలోని వర్ణాశ్రమధర్మ జీవనాశక్తిపరత్వమున్నది. ప్రధానంగా 'వేయిపడగల'లో ఆశ్రమ ధర్మాలు అడుగంటిపోతున్న సమాజాన్ని, ఆయన చిత్రించినాడు. నవలా రచయితముందు తరాలవారు సనాతనాచార సంప్రదాయాలు, సమాజములో అంతస్తులవారి ఊహాపోహలు అనుభవాలూ తెలిసికొని, ఉపయోగము పొందడానికి పొందుపరిచినాడు. ఆయన అతి విస్తృత చిత్రణముచేస్తూ విపులవిజ్ఞానము ప్రదర్శిస్తూ, రచనచేసినా ఎందుకో

---

1 ఈ నవలకు హిందీ అనువాదము సిద్ధమవుతున్నది. త్వరలో సాహిత్య అకాడమీ ప్రచురిస్తుంది.

గాని శిల్పములో ఐక్యము సాధించలేక పోయినారు. అన్నకలో భిన్నాంగములకు సముచితమైన పూర్ణత్వము ఘటింపచేయలేక పోయినారు. బాపిరాజు సౌందర్యప్రణయి; ఆశావాది. రచన సంతతమూ హ్లాదైకమయంగా ఫలావాప్తితో సమాప్తమవుతూ, ఉంటుంది. శిల్పదృష్టినిబట్టి బాపిరాజుగారి రచనలో అధికతరమైన లావణ్య సమగ్రత గోచరిస్తుంది.

మరొక ప్రముఖ నవలాకారుడు నోరి నరసింహశాస్త్రిగారు. ఆయన 'నారాయణభట్టు', 'రుద్రమదేవి' అనే ఆఖ్యాయికలలో తూర్పు చాళుక్యులనాటి కాకతీయులనాటి జీవితాన్ని చిత్రించినారు. ఆయన సామాజిక ఐతిహాసిక నవలా రచయితగా కృతకృత్యులైనారు. యువ రచయితలలో ప్రముఖులు బుచ్చిబాబుగారు. (ఆయన అసలుపేరు శివరాజు వెంకట సుబ్బారావుగారు) 'చివరకు మిగిలేది' అనే నవలలో ఆధునిక పారిశ్రామిక యుగసంఘర్షణలు, పట్టణ జీవితాందోళనం, స్త్రీపురుష లైంగిక సంబంధాలలోని పరిహాసమునూ ప్రతిబింబింపచేసినారు. పాత్రోన్మీలనలో, సంభాషణలో, కథాకథన సంవిధానంలో, బుచ్చిబాబుగారు ముందుకు వెళ్ళినారు, రచనలో అంతర్వాహినిగా ఆశారాహిత్యం ఉన్నప్పటికీ.

ఐరోపియ భాషలనుంచి, వంగ హిందీ భాషలనుంచి ముఖ్యంగా శరత్, ప్రేమచంద్ నవలలకు అనువాదాలు కుప్పతెప్పలుగా వస్తున్నాయి. అయితే ఆ అనువాదాల్లో తెలుగు వచనము ఉదాత్తగుణోపేతము కాదని నిష్కర్షచేయాలి.

## రూపక రచయితలు

ప్రధాన పట్టణాల్లో సంస్కారముగల ఔత్సాహికులవల్ల ఆధునిక నాటిక, ప్రయోగాను కూలంగా, గతశతాబ్దాల్లో నింగిపందిరికింద ఆడే యక్షగానాలకన్న విశిష్టంగా అస్తిత్వాన్ని పొందింది. వచనము, పద్యము, గేయము ఎక్కువగా వాడేవారు. పౌరాణికంగానో ఐతిహాసికంగానో లేదా సామాజికంగానో ఇతివృత్తాలుండేవి. ఆంధ్రదేశంలో హరిప్రసాదరావు, టి. రాఘవాచారి, స్థానం నరసింహరావుగార్లవంటి మహానటులు ఉద్భవించినారు. మహానాటక కర్తలయిన ధర్మవరం కృష్ణమాచార్యులు,

వేదము వేంకటరాయశాస్త్రి, పానుగంటి లక్ష్మీనరసింహారావు, గురజాడ అప్పారావులవంటివారు గతించినమీదట, దీర్ఘమై సమగ్ర ప్రదర్శన పటువైన నాటకాలు వ్రాసినవారులేరు. నాటకాంతంలో సామాజికుడు అనుకోడముకద్దు. "ఎంత చక్కని నటన అయితే నాటకంలో పస లేదు।" అని. విశ్వనాథవారి 'నర్తనశాల', వేలూరి చంద్రశేఖరము గారి 'కాంచనమాల' మంచి సాహిత్యఖండాలు కాని, నటులకు ప్రయోగాను కూలంగాలేవు; ప్రజాభిరుచికీ సరిపోలేదు.

గమనవేగంవల్ల సామాజిక సాహిత్యోత్సవాల్లో పద్యోవినోదము సంఘటింపచేసే ఏకాంకికలు పెద్దనాటకాలను తోసిరాజన్నవి. సినీమా వల్ల ఏకాంకికనుకూడా ప్రజలు ఉదాసీనంతో చూస్తున్నారు. ఏకాంక నాటికారచయితలు ప్రముఖులున్నారు. ప్రధాన న్యాయమూరులు, రాజమన్నార్, నార్ల వెంకటేశ్వరరావు, ముద్దుకృష్ణ, ఆచార్య ఆత్రేయ గారు నవీనాంధ్ర నాటకరంగానుకూలంగా, అమూల్యమైన ఏకాంకికలు రచించినారు. వారు సాహితీసౌష్ఠవమున్న రూపకాలు పఠనయోగ్యమైనవీ, ప్రయోగార్హత కలవిన్నీ మనకు ప్రసాదించారు.

## వైజ్ఞానిక సాహిత్యము

తెలుగుభాషలో, గద్యపద్యాల్లో ఉండే సృజనాత్మక సాహిత్యం కన్న వేరుగా, విజ్ఞానసంపన్నమైన సాహిత్యం అధికంగా వచ్చింది. రాజనీతి, విజ్ఞానశాస్త్రము, సామాజిక శాస్త్రము, అర్థికశాస్త్రము, ఇతిహాసమునకున్నూ సంబంధించిన గ్రంథాలు ఉన్నతస్థాయిని పొందినవి. కొమర్రాజు లక్ష్మణరావు, చిలుకూరి వీరభద్రరావు, భావరాజు వేంకటకృష్ణ రావు మల్లంపల్లి సోమశేఖరశర్మగార్ల ఐతిహాసిక రచనలు సాహిత్యోన్నతిని పొందినవి.

శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారి స్వీయ జీవితకథ ఉదాత్త వ్యక్తిప్రకాశకమై, మానవహృదయాన్ని ఉఱ్ఱూతలూపే గ్రంథము. శయ్యా సరళమూ ఓజోవంతమున్నూ ఆకర్షణీయమున్నూ. ఉన్నతశ్రేణికి చెందిన పత్రికాలేఖనము వర్ధమానాంధ్ర రచయితలకు ఉత్సాహోద్దీపనం కలిగించే మూలకందముగా ఉంటూనే ఉన్నది. సృజనాత్మక

సాహితీసంపన్నమైన పత్త్రికలు అనేకము అచ్చవుతూనే ఉన్నవి. పత్రికా ప్రచురితాలయిన పద్యగేయ కథానికలున్నూ సంపుటాలుగా అనంతరం వెలువడుతూ ఉన్నవి. పత్రికాసంపాదకులలో కృష్ణాపత్రికా సంపాదకులు ముట్నూరి కృష్ణరావుగారి వచనరచన అద్భుతము. వారి సాహిత్య తత్వశాస్త్రం, లలితకళావిజ్ఞాన సంబంధమైన వివిధవ్యాసాలు 'సమీక్ష' అనే గ్రంథ సంపుటముగా ప్రకటితమైనవి.

## వర్తమానదశ

వర్తమాన సాహితీదృశ్యాన్ని సింహావలోకనం చేసి. వ్యాసాన్ని ముగిస్తాను. గుణవిశిష్టమైన ఖండకావ్యాలు వస్తూనే ఉన్నాయి. దేవరకొండ బాలగంగాధరతిలకుగారు 'ఆరోజుల్లో' అనే కావ్యము రచించారు. ఆయన తొలినాటిజీవన కారుణ్యంలో కన్న కలలనూ, నాటి జీవితామోద భరాన్ని వ్యక్తముచేసినారు. గతకాలపు స్మృతిశకలము స్మరణకు తెచ్చుకోగలిగితే ప్రస్తుతము జీవించడానికి యోగ్యతఉన్నదని ఆ కావ్యము అంతము చేసినాడు. ఇది విశిష్టభావము. పంతుల శ్రీరామశాస్త్రిగారి కథానికలు రేడియోశ్రవ్యనాటికలు వ్రాయడంలో సమర్థులు. 'మానవుడు' అనే పద్యకథ రచించినాడు. ఒక కన్నపుదొంగ స్వవిషయము చెబుతాడు. అందుచేత ఈ పద్యఖండము ఓజస్సుతో ఉన్నది. ఆ దొంగ గంట వ్యవధిలో చిత్రమైన మానసికానుభవాలకు లోనవుతాడు. తలవనితలంపుగా వాడు ఆత్మహత్య చేసికోబోతున్న ఒకస్త్రీని రక్షిస్తాడు. విద్వాన్ విశ్వము 'పెన్నేటిపాట' అనే దీర్ఘఖండకావ్యము రచించినాడు. అది రాయలసీమలోని గ్రామీణ జీవిత చిత్రణము. కవి నిరంతరము లేమితో పెనగులాడు గ్రామీణుల జీవిత వాతావరణము చిత్రించినాడు. కావ్యములోని భాష ప్రాంతీయము. అది తెలుగు కవిత్వానికి అమూల్య రచన. అయితే కావ్యమును ముగిస్తూ కవి ఉపదేశికుడవుతాడు. ఆయన ధనవంతులు హృదయ శూన్యులనీ, పేదల రక్తమాంసాలతో ఐశ్వర్యవంతులైనారనీ, ఆడిపోసుకొంటాడు.

పి. శ్రీరాములు రెడ్డిగారు కంబరామాయణము, సిలప్పదికారము అనే తమిళ మహాకావ్యాలను ధారాశుద్ధిగా పద్యానువాదము చేసినారు.

ఈ కృషి అమూల్యము. ఇందువల్ల తమిళులూ, ఆంధ్రులూ, పరస్పరమూ, సన్నిహితులు కాగలరు.

తెలంగాణమునుంచి రెండుకావ్యాలు అచ్చుపడ్డాయి. ఈ కావ్యద్వయానికి వైశిష్ట్యము ఉన్నది. 'నాగార్జున సాగర' మనే గేయ కావ్యమును సి. నారాయణ రెడ్డిగారు రచించారు. తరతరాలనుంచీ వస్తున్న సత్యసౌందర్యాల ఘర్షణ, నిజానికీ కర్తవ్య ధర్మానికీ ప్రణయానికీగల ఘర్షణ—కవి సుందరాత్మీయ కావ్యవైఖరిలో, ఈ విషయము అభివ్యక్తము చేసినాడు. శాంతిశ్రీ పద్మదేవుని ప్రేమిస్తుంది. అతడు శిల్పి. ఆమె ప్రేమకూ, ధర్మనిర్వహణానికీ మధ్య ఘర్షణలో నలిగిపోతుంది. తుల్యబలాలు నిర్ణీతము కాలేక పోయినవి. పద్మదేవుడు విజయపురిని విడిచివెళ్ళినాడు. అనంతరము స్వప్నాంతర స్వప్నంలో శాంతిశ్రీ నాగార్జున సాగరమును ఆలోకన చేస్తుంది. ప్రేమికుల ప్రణయము ఫలావాప్తి రహితముకాగా, అది ఉబికి ఉబికి వాకలై వరదలై సాగరాకారాకారితమైంది. ఇది కావ్యంలో ధ్వన్యాత్మకంగా ఉన్నది. ఇదిగొప్ప ఖండకావ్యం. దాశరథిగారి దేశభక్తి వాసనాత్మకంగా ఆరంభమై, రస స్థాయిని ప్రాప్తించింది. తాదృశ పద్యఖండికలను 'మహాంధ్రోదయము' గా కవి సంతరించినారు. యువకుడు దాశరథి విశాలాంధ్రము కలలుగాకన్న కవి యని చెప్పకతప్పదు; ఆంధ్రతెలంగాణ రాష్ట్రైక్యము కేవలం సిద్ధించక పూర్వమే, హృదయద్వయైక్యం సాధించినారు. దేశభక్తి కవిత్వమే కాక 'మంజీర', 'సౌమ్యలక్ష్మి' వంటి భావగేయాత్మక కావ్యాలుకూడా ఆ సంపుటిలో ఉన్నవి.

సినీమావల్ల కొన్నేళ్ళపాటు మరుగుపడిన రంగానుకూల నాటకము, తెలుగులో నెమ్మదిగా పైకిరాసాగింది. ఔత్సాహిక నటసమితుల్లో, సర్వసామాన్యంగా విద్యార్థులూ నాటకాలంటే చెవికోసుకొనేవారూ ఉంటారు. సాంస్కృతిక వారోత్సవాల్లో కార్యక్రమాల్లో ఒక అంశంగా, వచనంలో ఏకాంకికల ప్రదర్శనం ఏర్పాటుచేస్తూ ఉంటారు. అందుచేత వారు గణ్యులు. గత దశాబ్దాల్లో దీర్ఘ సంపూర్ణ నాటకము పద్యగేయాత్మకమై సామాజికులను ఇప్పటికీ ఆకర్షిస్తూనే ఉన్నది. అయితే పౌరాణికము ఐతిహాసికమున్నూ అయిన ఇతివృత్తాలతో, నవ్యనాటకాలు విరివిగా

ఎవరూ వ్రాయడంలేదు. కావ్యాల్లో కథానికల్లో మాదిరిగానే నేటినాట కాల్లోకూడా కథావస్తువులు పౌనఃపున్యమై విసుగు పుట్టిస్తాయి. పేద రైతు జీతము చాలీచాలని గుమాస్తా, పరువు తక్కువ కొంపల్లో స్త్రీకి ఆశ్రయప్రాప్తి. ముఖ్యంగా రిక్షావాలా, వీళ్ళకు సంబంధించిన లోక వృత్తం నాటకాల్లో అమితం. కథానికలోవలె ఒక అబ్బాయి ఒక అమ్మా యితో సమావేశము కావడంవంటి ఇతివృత్తాలు ఎలాగయినా అంతగా తరుచుగా నాటకాల్లోలేవు. ఆధునిక నాటక రచయితలు కొన్నికొన్ని విష యాల్లో, దృక్పథాల్లో, ప్రచారము చేయడం తప్పనిసరిగా భావిస్తున్నారు. అయితే నాటక ప్రధానోద్దేశ్యమునూ స్ఫుటం చేయడం కాకుండా సన్ని వేశక్రమంలోనూ కథావస్తువును ప్రపంచించడంలోనూ, భావాలను వ్యక్తము చేయవచ్చునవే సంగతి నాటక రచయితలు గమనించడం లేదు. రేడియో శ్రవ్యనాటికతో రంగానుకూల నాటికలూ గుణవిశిష్టాలుగా ఇటీవల వచ్చినవి. మొక్కపాటి నరసింహశాస్త్రిగారు ఒకానొక అను భవశాలి అయిన ప్రముఖ రచయిత. ఆయన 'అనశ్వరం' అనే నాటిక రచించినారు. సంప్రదాయక హైందవ సమాజంలో నూతన శక్తులు ఉద్భవము కావచ్చుననీ, వాటిని అవగాహన చేసుకొని జీర్ణించుకొనునవే కాని, హిందూసమాజము అవిచ్ఛేద్యమనీ నాటికలో వ్యంగ్యముగా చెప్పినారు. భట్టిప్రోలు కృష్ణమూర్తిగారు ఉన్నత స్థాయిలో 'రిక్షావాలా' అనే రేడియోనాటకము రచించారు. అందులో కథావస్తువు కరుణ రసజనకం. రిక్షావాడు చిన్నపిల్లనుచూచి వాత్సల్య వ్యామోహితుడు అవుతాడు. చివరకు ఆ పిల్ల అతని మనుమరాలుగా పరిణమిస్తుంది. అయితే ఆ గ్రహింపు ఆలస్యంగా కలగడంవల్ల కుటుం బంలో అందరూ తిరిగి కలుసుకోడానికి అవకాశం పోతుంది. ఆరుద్ర గారు రచించిన 'పాలభంజిక'లో కథ దానంతట అది వృద్ధి కానీయ కుండా ఉండే, సంవిధానమును విమర్శించినారు. ప్రతిమలువులో నటుడు, గాయకుడు, కవి, నిర్మాతలవల్ల కథకు తిరుగుళ్లు విడ్పడతాయి. బెల్లంకొండ రామదాసుగారు 'అతిధి' అనే నాటిక రచించి కృతార్థు లైనారు. సంభాషణలతోపాటు అభినయమున్నూ, అద్భుతంగా సంయ మము పొందినవి. ఇందుచేత నాటకీయమైన నిర్వహణ ఉద్దీపితమైంది.

వాటిక సూక్ష్మంగా పరిహాసాత్మకంగా ఉంది. ఎందుకనగా: నాయకుడు ఆదర్శవాదిగా ప్రజాహృదయము చూరగొనాలని యత్నించగా ఆ ప్రజలే అతన్ని చంపివేస్తారు.

కథానిక సాహిత్య ప్రక్రియగా, ప్రస్తుతం అధిక జనామోదంకలిగి స్తున్నది. దైనిక సాప్తాహిక ఉచ్చకోటికిచెందిన మాసిక పత్రికల్లో, వందలాది కథలు వస్తున్నాయి. అయితే సర్వసామాన్యంగా గుణము అంతగా లేకపోవడంవల్ల, ఆ కథలు ఒకస్థాయికిరావు కథావస్తువులు చర్విత చర్వణము కావడమేకాక, కథారచయితల తెనుగు వచనము బాగా తృప్తిగా ఉండడంలేదు. ఆకారప్రకారాల విషయంలో సాహితీ సంవిధానములో రచయితలు అశ్రద్ధచూపడంవల్ల, కథానికకు నాశనం తప్పదు. సాహిత్యపు పోటీలవల్ల తరుచుగా ప్రథమశ్రేణికిచెందిన, కథలు వస్తున్నాయి. ప్రముఖ సాహిత్య మాసపత్రికలు ఉన్నత ప్రమాణము నిలవ బెట్టుతున్నవి. తెన్నేటి సూరిగారు రచించిన 'భారతి' కొమ్మూరి వేణుగోపాలరావుగారి 'సూర్యోదయం', బుచ్చిబాబుగారి 'నిరంతరత్రయం', దిగుమర్తి రామారావుగారి 'మేము ముగ్గురం,' వి. సీతాదేవిగారి 'మారిపోయినమనిషి' అన్న కథలు శయ్యలోనూ, సంవిధానదృష్టిలోనూ గుణవిశిష్టాలు. డాక్టర్. వి. యన్. శర్మగారు స్టీఫన్‌జ్వీగ్ రచించిన జర్మన్ కథను తెనిగించినారు. అది శిల్పఖండ. ప్రావీణ్యానికి సంబంధించిన కథ. 'మాయదారిచిత్రాలు'. అనేది చెప్పుకో తగ్గ కథ. మునిమాణిక్యము తొల్లింటి కథల్లో కాంతాన్ని నాయికనుచేసి, ప్రస్తుతకథల్లో ఆమె విజ్ఞానానుభవంతో పండిన వార్ధకాన్ని చిత్రించి నాడు.

సారస్వత కళాసమీక్షా క్షేత్రంలో తెలుగులో వాంఛనీయమైన ఉత్తమ రచనలు ప్రస్తుత కాలంలో ఉన్నవి. ఉన్నతస్థాయిలో ఉన్న మాసిక, సాప్తాహిక, దైనిక అనుబంధ, పత్రికల్లో సంప్రదాయానుసారంగా, సౌష్ఠవ సుందరమైన సమీక్ష, సమకాలిక సారస్వత విమర్శ, సాహిత్య శిల్పసిద్ధాంతముల మూల్య నిర్ణయాలను పాఠకులు చూడ గలరు వెనుకటితరంలో డాక్టర్ సి. ఆర్ రెడ్డిగారు, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు, పింగళి లక్ష్మీకాంతముగారువంటి విద్వాంసుల సమీక్షా

కృషిని అవిచ్ఛిన్నంగా ఆధునికులు సాగిస్తూనే ఉన్నారు. ఎ. వి. యల్. నరసింహరావుగారు నిశితమైన లోచూపుతో, ఆంధ్రాంగ్ల నవలా సాహిత్యాన్ని తులనాత్మకంగా సమీక్షించినారు. పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు అలంకారిక వాదాలూ, రసానంద స్వరూప విషయాలను గురించి ఉపజ్ఞా సమన్వితమైన సమీక్షాత్మక వ్యాస పరంపర రచించినారు. పారనంది జగన్నాథ స్వామిగారి 'కళోపాసన' లో సృజనాత్మక శిల్పసూత్రాలను గురించి చర్చించినారు. భారతీయ శిల్పానికి, ఆ లేఖ్య శిల్పాధ్యయనానికిన్నీ చక్కని పీఠికా ప్రాయంగా డాక్టర్ సి. సత్యనారాయణగారు 'భారతీయకళ' జి. వేంకటేశ్వరరావుగారు, 'గృహాలంకరణము', డా. మారేమండ రామారావుగారు 'నాగార్జున కొండ' ను గూర్చి గ్రంథాలు రచించారు. ఈ గ్రంథాలలో వచనము సరళమై సొగసైనది. పుస్తకాల అచ్చూ, చిత్రపటాలున్నూ కంటికి ఇంపుగా ఉన్నవి.

అన్య భారతీయ భాషాసారస్వతాన్ని గురించి వ్యాఖ్యాన పూర్వక సమీక్ష వికాసము చెందడం శుభావహం. కర్ణ రాజశేషగిరిరావుగారు జయశంకర్ ప్రసాద్ రచించిన 'కామాయనీ' అనే హిందీ మహాకావ్యాన్ని గురించిన వ్యాసమునూ, వంగీయకవి అయిన నజ్రుల్ ఇస్లామ్ గురించి రహమాన్ వ్యాసమునూ ప్రత్యేకంగా పేర్కొనాలి.

మహాసారస్వతము ఉద్భవము కావడానికీ, సూక్ష్మంగా దాన్ని ఆస్వాదించడానికిన్నీ, సృజనాత్మక సాహిత్య సమీక్షా సూత్రాలను ఆకళింపు చేసుకోవాలి. పైన చెప్పిన కొందరు విమర్శకులు చేసిన అమూల్య సారస్వత సమీక్షకు సహృదయుడు కృతజ్ఞుడవుతాడు.

ఆంధ్రసాహితి గొప్పది. అది ప్రవర్ధమాన మవుతున్నది. సంస్కృతాంధ్రాలకు పూర్ణంగా పొత్తు కలగడంచేత దానికి మాధుర్య సౌందర్యాలు చేకూరినవి. అందువల్లనే త్యాగయ్య కృతులకు విశ్వజనీన ఖ్యాతి వచ్చింది. శతాబ్దాలనుండి చేస్తున్న కృషినీ, ప్రధాన భారతీయ భాషాసాహిత్య చరిత్రగా వ్రాయవలసినప్పుడు, ఆంధ్రసాహితికి గౌరవ స్థానం ఉంటుంది. నన్నయ భట్టారకుని నుండి మనతరముదాకా వచ్చిన సాహిత్య సంప్రదాయము అవిచ్ఛిన్నంగా వస్తూనే ఉన్నది.

Telugu Literature
*By P. Chenchaiah, & Rajah, M. Bhujanga Rao*
Telugu Literature
*By P. T. Raju*
A Hand Book of Telugu Literature
*By K. Sita Ramaiah, M. A*
A Historical Sketch of Telugu Literature
*By T. Raja Gopala Rao*
The Songs of Thyagaraja
*By Dr. Ch. Narayana Rao, M. A., Ph D.*
The Novel in Telugu Literature
*By Prof. V. N. Bhushan, M. A.*
Modern Telugu Poetry (Anthology)
*Edited by Smt. A. Chaya Devi*
Linguistic Survey of India
*By A. Grierson, Vol, 4 P P. 576—618*

# పంజాబీ సాహిత్యము

ఖుశ్వంత్ సింగ్

## పరిచయము

**భా**రతదేశంలోనూ, పాకిస్తాన్‌లోనూ వుంటున్న హిందువులు, ముసల్మానులు, శిఖులూ, రెండుకోట్లమంది పైగా మాట్లాడుతున్న భాష, పంజాబీ. అందువల్ల దాని సాహిత్య పారంపర్యములో మత విశ్వాస త్రయముగల వారి రచనలూ, వాడుకచేస్తున్న అరబ్బీ, దేవనాగరి, గురుముఖీ అనే మూడు లిపులూ వున్నవి. పంజాబీసాహితీ పారంపర్యము, తత్ఫలితంగా అరబ్బీ, ఫార్సీ, ఉర్దూ సంస్కృతోద్భవములైన లిపులద్వారా, ప్రయోగింపబడుతున్న భాషల్లోని భావాలవల్ల సంపన్నమవుతున్నది. ఈ ఘటకలశములోని సమ్మిశ్రిత పరిమళము వివిధభాషా భేదాలవల్ల అధికంగా గుబాళించగా పంజాబీభాషకు చిత్రమైన బలమూ, ఓజస్సూ వచ్చింది.

ఏ భాషకయినా కాలనిర్ణయము చేయడము సులభసాధ్యముకాదు. ముఖ్యంగా పారంపర్యవైవిధ్యంగల పంజాబీభాషా విషయములోనూ అంతే. కొంతమంది, విద్వాంసుల మతాన్నిబట్టి, ఆ భాష 12 శతాబ్ది నాటిది. మరికొందరు పండితులు దాన్ని ఇంకా ప్రాచీన కాలికమని అంటారు. ప్రమాణగ్రంథాలు, రికార్డులూ లేకపోవడంవల్ల, గుర్తింపబడిన గ్రంథాలనుబట్టి, సమకాలిక రచయితలపై ప్రభావాలనుబట్టి జాగ్రతగా కాలనిర్ణయారంభము చేయవచ్చును. అట్టి రచయితలను రెండువర్గాలుగా విభజించవచ్చును. వారు ముసల్మాను సూఫీలు, శిఖు గురువులూ, ఈ రెండువర్గాలూ 15 శతాబ్దినుండి ఆరంభమైనవే. ఈ ప్రవాహాలు రెండున్నూ ప్రాచీనకాలంలో కలిసి పంజాబీభాషకు తల్లిదండ్రులవలె మూలకారణము లైనాయి.

## సూఫీలు

ముసల్మాను దండయాత్రలను సన్నిహితంగా అనుసరించి సూఫీలు భారతదేశంలో అడుగుపెట్టినా, వారి ప్రభావమూ, సంస్కృతి, భారతీయులపై ముద్రితము కావడానికి కొంతకాలంపాటు అనుకూల్యతకు ఎదురు చూడవలసివచ్చింది. సూఫీలు భారతీయులభాష, ఆచార వ్యవహారాలు అవగాహన చేసికోవలసివచ్చింది. అవగాహన చేసుకొన్న తరువాత స్వమతోత్సాహము చాలావరకు ఉపశమించింది. అప్పటికి ఆ సూఫీలు తమవి కాకపోయినా అన్య విశ్వాసాలయినా, ధర్మాలయినా అంగీకరించడానికి అభిముఖులైనారు. పంజాబులో సూఫీల ప్రధాన స్థావరం పాక్‌పట్టన్. ఇది ముల్తానుకు దగ్గరలో ఉంది. మతాలోచన పై వారి ప్రభావము ఈ ప్రాంతంలో స్పష్టంగా ఉంది. శిఖుగురువుల్లో, ముఖ్యంగా గురునానకు, సూఫీల మతగ్రంథాలు పూజ్యభావంతో పఠించినారు. భక్తి ఉద్యమానికిచెందిన భక్తజీవితాలను శిఖులు అధ్యయనం చేసినంతగానే.పరమేశ్వరుడికీ మానవుడికీ ఉన్న సంబంధము, ప్రేయసీ ప్రియులమధ్య ఉన్న సంబంధమువలెనే మాయవల్ల వియోగము కలిగినట్లుగా సూఫీలు ఆలోకనచేస్తారు. తీవ్రకామన, అనురాగంవల్లనే వియోగాన్ని జయించవచ్చును. ఇదే ఇతివృత్తము సదా సూఫీల రచనల్లో చాలవరకు వ్యక్తమవుతున్నది. బుల్హేషాయొక్క బహుళ ప్రచారం పొందిన పద్యభావం అందుకు ఉదాహరణంగా గనునార్హము.

'ప్రేమ సతతమ్మొక క్రొత్తయూట
శ్రుతి సూక్తులకు నేను విసిగిపోతి
కొరాను అధ్యయనమ్ము రుచింపదు.
ప్రార్థన అసలే విసుగెత్తించును
ప్రణామముతో ఫాలము గాయమయ్యె
హైందవ తీర్థాలలో మక్కాయాత్రలో
గోచరింప డీశ్వరుడు నాకు
రాగమెరిగిన మనుజుడే చూచుజ్యోతి'

శిఖు గురువుల రచనావళిలో ఈ వృత్తమే మాటిమాటికి గోచ

రిస్తుంది. పంజాబులో మహాగ్రంథత్రయమైన 'హీర్‌రంఝ', 'ససిపున్నూ' 'సోహ్ని మహీవల్' లో కూడా ఇదే ప్రధానభావం. ఆ కావ్యరచనల్లో జీవితమంతా వియోగతాపంతో సమాగమకాంక్షతో అలమటించేదిగానూ, మరణంలో ప్రేయసీప్రియుల సమాగమము, కలిగినట్లే మనకు గోచరిస్తాయి. సజీవుడై సమకాలికుడై కవిశేఖరుడైన బాయ్‌వీర్‌సింగ్ కవితలో ఈ భావావేశపు ప్రతిధ్వనాలే వినబడతాయి.

సూఫీలు గ్రామవాసులు. వారి కవితలో పదములు జనపదాల్లో వ్యవహారములో ఉన్నవి. అవి ఔత్సుక్యజనకాలు. రైతుల దైనందిన జీవితం, చెఱుదున్నడం, నూలు నేయడం, మజ్జిగ చేయడం, పాలు తీయడం, అవిభక్తకుటుంబ జీవన వాహినిలో ఎదురెదురుగా తరంగాలు రావడం, బాంధవ్యంలో సహోదరుల మధ్యనో, భార్యాభర్తల మధ్యనో గిల్లికజ్జాలు, అత్తగార్ల కోడంటికమో, కోడళ్ళు పుట్టిళ్ళకోసం వాచిపోవడం-ఇటువంటి జీవితంలోంచి సూఫీకవులు ఉపమా రూపకాలంకారలకు కావలసిన సామగ్రి సేకరించారు. శిఖుగురువుల్లో ముఖ్యంగా గురునానకు సుపరిచితాలయిన క్రీడావినోదాలూ, సన్నివేశాలూ తన సందేశాన్ని లోకానికి అందీయడానికి బాగా ఉపయోగ పరుచుకొన్నాడు.

సూఫీకవులు కాఫీబారామహ, శిహర్ఫీ అనే కావ్యభేదాలను ప్రచారం చేసి పంజాబీ సాహిత్యంమీద జనప్రీతి కలిగించారు. ఇది వారి సాహితీ వైశిష్ట్యము. కాఫీకావ్యము పారశీక కవులకు సుపరిచితము. ఈనాడు ఉరుదూ కవితలో ఈ ఛందస్సు బాగా వాడుకలో ఉన్నది. బారామాహ (పన్నెండుమాసాలు) అనే కావ్యభేదము మూలంగా స్వేచ్ఛగా ఋతుసంహార సౌందర్యం వర్ణించారు. ఏ విషయ వ్యక్తీకరణ కయినా బారామాహ్ అవలీలగా ఉపయోగపడుతుంది. పంజాబీ కవితలో ప్రకృతి వర్ణనా సంపన్నతకు మూలము ఈ బారామహల్ కవిత చెప్పడమే. వారిస్‌షాహ్ 'హీర్‌రంఝ' అన్న తన మహాకావ్యంలోనూ, 'ఆదిగ్రంథం' లో సంతరింపబడిన గురునానకు రచించినది పంజాబీభాషలో ఉన్నవాటిలోకల్లా బహుశః అతిసుందరాలు. (దురదృష్టవశాన సమకాలిక కవులు ఈ కావ్యభేద వినియోగము విడిచిపెట్టినారు.) పంజాబీలో శిహర్ఫీ అనే కావ్యబంధము విశిష్టమైనది; వర్ణమాలలోని ఒక్కొక్క

అక్షరంతో వరుసగా అందులో పద్యాలూ ఆరంభిస్తాయి. శిఖుగురువులు ఈ కావ్యపద్ధతిని వినియోగించినా, ఈ సాహిత్య ప్రక్రియ వారి అనంతరం పరిత్యక్తమైంది. దాన్ని ఎవరూ ఉద్ధరించలేదు.

## శిఖు గురువులు

చాలమంది శిఖుగురువులు పద్యరచన చేసినారు. నానకు, అంగద, అమరదాస, రామదాస, అర్జున, తేజబహాదూరుల కృతులు గ్రంథసాహెబులో నిక్షిప్తమైనవి. ప్రథమ గురువయిన నానకు, పంచమగురువైన అర్జునుడి రచనలున్నూ, శిఖుపవిత్ర గ్రంథములో ప్రముఖమైనవి.

## గురునానక్

(1469-1539) గురునానకు కావ్యరచనద్వారా ప్రబోధము చేసినాడు. అందుచేత ఆయన కవిత ఉపదేశాత్మకము. అది జీవిత తత్త్వ వివరణము. జిజ్ఞాసువులకు కావలసిన జీవిత సాధనా విధానముకూడా అందులో ఉన్నది. ఉపదేశాత్మక కవిత చాలవరకు ప్రయోజనాపేక్షతో ఉండడంవల్ల సంకుచితము. అయితే గురునానకు కవితలో భావ వ్యక్తీకరణలో విస్తారమైన స్వాతంత్ర్యము ఉట్టిపడుతున్నది. పంజాబులో జానపద సౌందర్యము పండిన వరిచేలు, ఉషస్సువిరియడం, పక్షులు మేల్కొనడం, వనాంతరాల్లో లేళ్ళ అందాల పరుగులు, ఋతుపవనంలో గంభీర జలదాలు, వానకారులో సంగీతం, ఇవన్నీ ఆధ్యాత్మిక కవితావేశానికి ఉద్దీపనాలు అయినవి. సామాన్యతోదృష్టవిషయము కవిచక్షువుకు గభీరభావ ప్రతీకమై నైతికంగా విశిష్టమవుతున్నది

'మనం గురువుచే చోదితమవుతున్నాం, దున్నే రైతువల్ల ఎద్దుల జతలాగ పుడమి మన కాగితపు పుట. దానిమీద నాగేటి చాళ్ళవలె మన కర్మలు లిఖితాలు. దున్నేరైతు విత్తనాలు చల్లినట్టు మనం శ్రమజల కణాలు కురిపిస్తాం. మనం చేసుకొన్నదానికి చేసుకొన్నంత అనుభవిస్తాం. కర్మఫలం కొంత మనం అనుభవిస్తాం, ఇతరులకు కొంత ఇస్తాం. ఓ నానక్! ఇదే యదార్థ జీవితపథం.'

గురునానకు రచించిన గ్రంథము 'జప్‌సాహెబ్' అనగా ఉదయ ప్రార్థన మతధర్మాసక్తి విశిష్టంగా ఈ పద్యభావములో చూడవచ్చును. ఇటు వంటి ఆధ్యాత్మికౌత్సుక్యము ఆయన కవితలో దాదాపు అంతటా ఉన్నది.

'ఒక్కనాల్కకు బదులు నూరువేలువాల్కలు నాకుంటే,
ఆ నూరువేలను ఇరవైరెట్లుగా గుణిస్తే
ఒక్క నూరువేలసార్లు జపిస్తాను, పదేపదే జపిస్తాను
భువనాలకు అన్నింటికి ఒక్కడె ప్రభువని.
దారి ఇదే పరమేశ్వరమందిరం చేరుకోడానికి
మెట్లు ఇవే పరమేశ్వరుమందిరం ఆరోహించుటకు
ఈ దారిన పరమేశ్వరమందిరానికి ఆరోహించి
ఈశ్వరయోగము పొందుము.
స్వర్గీతారవళులచే ప్రాకెడు మాయెడందలు జల్లుమనును.

ప్రాకులాడే మా బోంట్ల కందరికీ యెదందలోని కోరిక పైకెగసి పోవలెననే ఓ నానక్! ఆతని కారుణ్యమొక్కటి సఫలమ్మగు. శేషిం చిన దంతా వాచారంభము, మరి అన్నృతము.'

అర్జునగురువు (1563-1606) ఈ గాథ రసభావాలనే తన కవితలో వ్యక్తముచేసినాడు. ఆయన పద్యములు జాతిరత్నములవంటి పదములతో శోహాళించినాడు. యమకాను ప్రాసలవల్ల గీతామాధుర్యము మనసును వెంటాడుతుంది. 'సుఖమని' అనే ఆయన చెప్పిన గీతము బాగా ప్రమోదము పొందింది. పంజాబీకవు లందరిలో అర్జున గురువు దేవుల గేయాలు నిస్సందేహంగా ప్రజానీకం గానము చేస్తుంది.

పంజాబీసాహిత్యంలో 'గ్రంథసాహెబ్' ఉత్తమకృతి. గ్రంథసంకలనంచేయడంలో అర్జునగురువులే అధికంగా శ్రమించారు. ఆయనకు చేదోడువాదోడుగా సమకాలికరచయిత భాయ్ గురుదాస్‌కూడా ఉన్నాడు. ఆ మహాగ్రంథంలో కొన్నివేల పద్యా లున్నాయి. గురువులు ఆరుగురు చేసిన రచనలేకాక, భక్తి ఉద్యమానికి సంబంధించిన చాలమంది భక్తకవుల రచనావళిలో కొన్ని ఏర్చికూర్చి గ్రంథసంకలనము చేశారు అర్జున గురుదేవులు. ఆ భక్తి గీతాలభాష మాత్రము అవి ఉద్భవించిన ప్రాంతాల ఉన్నభాషతో పూర్తిగా సరిపోతూ ఉండదు.

గురుగోవిందసింగ్ (1666-1708) బహుశః శిఖుగురువుల్లో గురుగోవిందసింగ్ మహావిద్వాంసుడు. ఆయనకు హైందవ పురాణేతిహాసములు, ఇస్లామీయ తత్త్వశాస్త్రమూ కరతలామలకములు. ఆయన లలిత కళాపోషకుడు. గురుగోవిందుల దర్బారులో యాభై ఇద్దరు కవులుండేవారు. ఆయన గీర్వాణ, పారసీక, పంజాబీ భాషారచయిత. ఆయన తన పూర్వులవలెకాక భగవన్మహిమాభివర్ణనతోనే పద్యరచన చేసి తృప్తిపడలేదు. ఆయన కృతుల్లో నైతిక రాజకీయ విశిష్టతకూడా ఉన్నది. ఆయన తన అనుయాయుల్లో శౌర్యోత్తేజము కలిగించి, ప్రసిద్ధమైన 'జఫర్నామా' లో ఓజోమయంగా కవిత్వము చెప్పినాడు. జఫర్నామా ఔరంగజేబు చక్రవర్తికి రాసిన విజయలేఖ. ఆయన రచించిన 'జప్‌సాహెబ్' ఇప్పటికీ అతని అనుచరులకు ఉత్సాహోద్దీపన జనకంగా ఉన్నది. గురుగోవింద కృతు లన్నింటినీ అతని సమకాలికుడయిన మణిసింగ్ సంకలితము చేసినాడు.

గోవిందసింహుని రచనా పటిమకు ఈ క్రిందిపంక్తులు తార్కాణం:- "నిత్యపరమేశ్వరా! మాకు నీవే సంత్రాణ కవచము. త్రిప్పెడు మా కత్తి కఠారు, ఖడ్గము నీవే మా రక్షకుడవు. కాలరహిత, మృత్యురహిత స్వర్లోక ప్రభువా! మాది ఓటమిలేని చిక్కని ఉక్కు, సత్తువ కాలమెదిరింపక పలాయనము చేయును. కాని ముఖ్యంగా ఉక్కువంటి నీవే మాధీరత్రాతవు, సర్వశక్తిశాలీ, రక్షింపుము నీ భృత్యుని."

శిఖుగురువులు పదిమంది గతించిన మీదట, గురువుల జీవిత కథా సాహిత్యం వారి సమకాలికులయినవారు, విషయం విపులంగా సేకరించగలవారు, కుప్పతిప్పలుగా రచించారు. ఈ జీవిత గాథలను 'జనంసఖిస్' అని అంటారు. అవి చారిత్రకంగా అమూల్య రచనలు. ఆ కాలంలో చరిత్రకారులు :— సేవారామ, రామకోయిల్, సంతోష్‌సింగ్ రతన్, సింగ్‌భంగ్, జ్ఞాన్‌సింగు ప్రభృతులు. అధికారము కొరకు పోరాటములో సతమతమవుతున్న రోజులలో గానిప్రభుత్వము చేసిన కొద్దికాలములోగాని శిఖులు సాహిత్యసృష్టి చేయలేదు. అప్పుడు వారిదృష్టి పంజాబీమీదకన్న, పారసీకభాషమీదనే ఉండేది. అయితే వారు విజయయాత్రామగ్నులై, రాష్ట్రాన్ని సుప్రతిష్ఠితం చేసుకొనే

సమయాన బుల్లేషాహ్ (1680–1758), వరిస్‌షాహ్ (1735–1798) అనే ఇద్దరు ముసల్మానుకవులు కమ్మని పంజాబీకవిత కాల్పనిక భావోద్వేగంతో, నిగూఢ మర్మయోగాత్మకంగా చెప్పినారు. బుల్లేషాహ్ రచించిన 'కాఫిన్' వారిస్ షాహ్‌కృత 'హీర్‌రంఝు' అనే మహా కావ్యాలు జనప్రీతి పొందినవి. రాష్ట్రమంతా ప్రతిపల్లెలో వారిపద్యాలు జనులు పాడుకొంటూ ఉంటారు. వారి కవితా ప్రభావము తరతరాల నుంచీ పంజాబీ రచయితలమీద ప్రసరిస్తూనే ఉన్నది.

## సమకాలిక పంజాబీరచన

బ్రిటీషువారి ఆక్రమణానంతరము రమారమి అర్ధశతాబ్దివరకూ, భారతదేశంలో సాహిత్యసృష్టి జరుగలేదు. రాజకీయమైన పరివర్తన ఫలితాలవల్ల తేరుకొని, పాశ్చాత్యుల విలువలకు అనుగుణంగా జీవిత సన్నాహము చేసుకోడానికి చాలా సంవత్సరాలు పట్టింది. ఆదిలో ఆంగ్ల పాలకులు ప్రాగ్దేశీయ సంస్కృతి నిరుపయోగకరమనీ ఐరోపీయ విజ్ఞానం అవలంబించడమూ, అనుసరించడమున్నూ, ఉత్తమోత్తమమనీ విశ్వసించారు. భారతీయులలో ఒక తరమువారు ఈ ఉద్దేశాన్ని ఆమోదించి ఆంగ్లమానసపుత్రులై, భారతీయ సంప్రదాయ వైదుష్యాలతో, యావత్ సంబంధాన్ని తెగతెంపులు చేసుకొన్నారు. ఆ తరువాత తరము వారు జరిగిన దోషము తెలుసుకొని ప్రాచీనగ్రంథాల ధూళిదులిపి, పురా భారతీయ సంస్కృతిని భద్రముచేయ బూనుకొన్నారు. యావద్భారతంలో పురాతన సంస్కృతీ రక్షణకార్యకలాపాలు కొనసాగినవి. పాశ్చాత్య సంస్కార ప్రభావితమయిన రాష్ట్రాల్లో పంజాబు చివరకు మిగిలింది. అందుచేత ఆ ప్రభావాన్ని దులిపివేసుకోడానికికూడా పంజాబు అన్నిరాష్ట్రాలకన్న ఆలస్యం చేసింది. అందుచేత పంజాబులో సాహిత్యోజ్జీవనం తక్కిన భారతదేశంలోకన్న ఆలస్యంగా సంభవించింది.

సంయుక్తానంతర పంజాబీరచన, రమారమి 'సింగ్‌సభ' ఉద్యమము. దాని అనంతరం అకాలీ ఉద్యమము. కమ్యూనిస్టు ఉద్యమం వల్ల ఏర్పడిన సామాజిక రాజకీయ పరివర్తనాలకు అనుగుణంగా సాగింది. సాహిత్యసృష్టిలో ఉద్యమ నాయకులు ఎదుర్కొన్న సమ

స్యలు ముద్రితాలైనవి. అయితే కొందరు రచయితలు మాత్రం సామాజిక రాజకీయ సమస్యలను విస్మరించి కేవలం రచనకోసం సాహిత్య సృష్టి చేసినారు.

## సింగ్ సభారచయితలు

సింగ్‌సభోద్యమము వారి సాహిత్యము శిఖుమతానికి ముఖ్య దోహదమైంది. దీనికి భాయ్‌వీర్‌సింగు కారకుడు. ఆయన పంజాబీ భాషయెడల ప్రజలకు పునః అభిరుచి కలిగించినాడు. ఇప్లాయన పంజాబీ భాషా చరిత్రలో సీమానిర్ణయం చేసినాడు. ఆయన జనన కాలము 1872. 84 ఏళ్ళు జీవించినాడు. జీవించిఉన్న వాళ్ళల్లోనే మృతులైన వాళ్ళల్లో కాని ఏ భారతీయ రచయిత ఇంత అధికంగా సాహిత్యసృష్టి చేయలేదు. ఆయన కృతులు అమరిస్తే బ్రిటీషు విజ్ఞానకోశంవలె 24 సంపుటాలకు సరిపోయేచోటు సరిపోతుంది. ఇంతవరకూ ఆయన రచనకు విరామము లేదు. ఆ కవీశ్వరుడు, అఖ్యాయికలు, కవిత్వము, పవిత్రగ్రంథాలపై భాష్యాలున్నూ శరపరంపరలుగా రచించినాడు.

వీర్‌సింగ్ 19 శతాబ్దాంతంలో రచనకు పూనుకొన్నాడు. తత్కాలీన సామాజిక రాజకీయ పరిస్థితులను అవగాహన చేసుకొని ఆ దృష్టితో ఆయన గ్రంథాలను చూడవలసి ఉంటుంది. పంజాబీయులు తమ పూర్వుల సాహిత్య కృషి విలువ విషయంలో సందేహపడుతున్న సమయంలో, భాయ్‌వీర్‌సింగ్ రచించిన నవలలు లక్షలాది ప్రజల హృదయాన్ని చూరగొన్నవి. ఆంగ్ల చరిత్ర కారులు శిఖులపాలన మొరటుగా అవినీతికరంగా ఉండేదని ప్రచారంచేస్తూ, దాని స్థానంలో తమ 'విజ్ఞానుల' పాలన ప్రారంభమైందని ప్రకటింపసాగినారు, సంస్కృత విద్వాంసులు శిఖుమతాన్ని హీనంగా చూచినారు; వైదికమతానికి అది హీనమయిన అనుకరణమనీ, శిఖుల బాహ్యాచారాలను రాక్షసమనీ, వెక్కిరించినారు. వీర్‌సింగ్ రచించిన 'సుందరి', 'విజయసింహుడు', సత్యంతకౌర్', 'బాబానౌధ్‌సింగ్', వంటి నవలల్లో ప్రధానమైన ఇతివృత్తము శిఖుల శౌర్యసాహసాలూ, మత నైతికోన్నతిన్నీ, వాటిల్లోందుకు వ్యత్యాసంగా పఠాణ, మొగలాయీ పాలకుల ప్రజాపీడనం

ప్రజాదాస్యమూ చిత్రింపబడ్డవి. శిఖులు వీర్‌సింగ్ నవలలను ఉత్సాహంతో, కృతజ్ఞతతో, తెగచదివేవారు. అయితే అప్పటి అభిరుచి మారిపోవడంవల్ల ఆయన నవలలకున్న ప్రజామోదము తగ్గిపోయింది. ఈనాటి పాఠకుడికి అవి అంతగా రుచించవు. ఆ నవలలకు చారిత్రకంగా విలువ ఇవ్వవలసిందే కాని సాహిత్యంలోమాత్రం కాదు.

వీర్‌సింగ్ ఆఖ్యాయికారచన విరమించి అనువాదరచన ఆరంభించినాడు. పవిత్రమత గ్రంథాలపై భాష్యవివరణలు, చిన్న పుస్తకాల రూపంలోనూ, 'ఖాల్సాసమాచార్' అనే వారపత్రికలోనూ ప్రచురించినాడు. వాటితోపాటు ఆయన కావ్యరచనలుకూడా చేసినాడు. తద్వారా పంజాబీకవుల్లో మహోదాత్త స్థానము ఆయనకు లభించింది.

వీర్‌సింగ్ యతి ప్రాసలను విడిచి స్వేచ్ఛగా తొలిసారి బ్లాంక్‌ఛందస్సులో ప్రయోగాలు చేసినాడు. 'రాణాసూరత్‌సింగ్' అనే దీర్ఘకావ్యము 1905 లో ప్రచురించినాడు. యథాప్రకారంగా కావ్యంలో ఇతివృత్తము మతవిషయకమే. ఆయనకున్న లాక్షణికప్రజ్ఞ, భాషమీద ఆయనకున్న ప్రభుత్వం ఆకర్షణీయం. పంజాబీభాషలో ఇదివరలో ఎవరూ ఈ ఛందంలో కవితచెప్పి కృతకృత్యులు కాలేదు. వీర్‌సింగ్ ఎక్కడా ఉత్తమస్థాయితగ్గని కలకాలం మనగలిగినకావ్యం అల్లినాడు. కావ్యం యమకానుప్రాసలు, ధ్వన్యను కరణాలతో శ్రవణపేయంగా వైషయికానందాన్ని కలిగిస్తుంది. వాసంత దినాంతంలాగ, దాని తర్వాత వీర్‌సింగ్ శిఖుమత స్థాపకుడైన నానకు, అంతిమ గురువైన గోవిందసింహుల జీవితగాథారచన చేసినాడు. 'కల్గీధర్ చమత్కార్' అనే పేరుతో గోవింద గురువుల జీవితకథ తొలిసారి ప్రకటితమైంది ఆ తర్వాత మూడేళ్ళకు గురువానకు 'చమత్కార్' వచ్చింది.

ఈ జీవితచరిత్ర రచనలమధ్యలో వీర్‌సింగ్, పంజాబీలో కనీవినీ ఎరగని చిన్నచిన్నఛందస్సుల్లో ఎన్నో కవితాసముచ్చయాలు ప్రకటించినాడు. వీటిల్లో ప్రజామోదము బాగాపొందిన కావ్యాలు (ఓమార్‌ఖయ్యామ్ చదివిన రసికులు ఎరిగిన) రుబాయత్ అనే చతుష్పాదఛందంలో విరచితాలు. ఈ కృతుల్లో తత్త్వాన్నీ, మర్మయోగాన్ని విశ్లేషించినాడు. జీవేశ్వరుల ప్రేమా, ఆధ్యాత్మిక వైషయిక ఆనందాలూ, నైతిక దివ్య

జీవితాలూ చిత్రవర్ణ శబలితంగాఉంది సుందరాద్భుతసీమల్లో సంచరిస్తాము. పద్యములో ఎప్పుడూ అనుస్యూతంగా వినమ్రభావము, ఇంచుమించుగా బాధను కాంక్షిస్తున్నట్లుగా ఉంటుంది.

"నన్ను కొమ్మనుంచితుంచి, స్వీకరించి పరిమళరుచి అనుభవించి విసిరిపారేశావు. పరిత్యక్తనై పాదాహతినొచ్చి, ధూళిపాలైవాను. నాకు జ్ఞాపకము ఉన్నదొక్కటే. అది నీస్పర్శ. దాన్ని కృతజ్ఞతతో స్మరిస్తున్నాను.

## తరుచుగా ఉల్లేఖిస్తూ ఉంటా రీ పద్యాలను

'కలలో నాదరి చేరినావు. నా కౌగిట నిన్ను చేర్ప గంతేసివాను' కాని అది స్వప్నము. నిన్ను బంధింపలేకపోతిని. ఆవేదనలో నా బాహువులకు వ్యధ. అంత నీ పాదాలుపట్టి శిరస్సుంచి ప్రణమిల్లుటకు పరుగు పెట్టినాను. ఇదికూడా నా కందలేదు. నీవో మరి ఉన్నతుడవు. నేనోమరి అథఃస్థితుడను.'

వీర్‌సింగ్ హేతువాదముకంటె విశ్వాసము గొప్పదని మరొకపద్యంలో వ్యక్తము చేసినాడు.

"నేను నా మనసును భిక్షాపాత్రగా చేసితిని. వాడవాడ తిరిపెమెత్తినాను దివ్యజ్ఞానంకోసం. పండితుల లోగిళ్లకడరాలిన కణాలను ఏరి పాత్ర నింపినాను. అది భారమయింది. నేనోమరి పండితుణ్ణని గర్వము కలిగింది. జలదపథాలలో విహరింప యత్నించితిని. భూతలంమీదనే బోర్లపడితిని. ఒకనాడు గురుసన్నిధి కేగినాను. ఉపాయనంగా భిక్షాపాత్ర ఆయనమ్రోల ఉంచినాను.

'మురికి – మురికి ?' అని అన్నా డతడు. దాన్ని క్రిందుమీదు చేసినాడు. నా శకటాలన్నింటినీ విసిరివేసినాడు. సైకతముతో నా భిక్షాపాత్రతోమి నీటితో కడిగినాడు. పాండితీ కశ్మలాన్నికడిగి వేసినాడు.

చాలమంది రచయితలకు షష్టిపూర్తి అయ్యేసరికి కల్పనాశక్తి తరిగిపోతుంది. వీర్‌సింగ్ కవీశ్వరుని విషయంలోమాత్రం అలాకాదు. ఆకస్మికావేశోద్భూత హృదయంతో కవితచెప్పి, నిజభావోద్రేక జ్వాలా కీలల్లో భస్మసాత్కృతమయ్యే కవులకోవలో వీర్‌సింగ్ చేరడు. ఆయన

జీవితమూ, కవనమూ, రెండు పవిత్ర సంప్రదాయకములు. ఆయనభాష శుద్ధము; భావము రుచిరము; భావాభివ్యక్తి కోమలార్ద్రము. అందు చేతనే తప్పనిసరిగా అది కలకాలము మనగలది. ఆ కవీంద్రుని 'మెరే సంయాంజీవో' అనే మహాకావ్యం సముచితసమ్మానం సాహిత్య అకాడమీ వారివల్ల పొందింది. ఉత్తమకావ్యంగా గణనీయమైంది. పంజాబీ బాష మాట్లాడనివారితోగూడా వీర్‌సింగ్ ప్రథితయశుడైనాడు. ఆయన కృతులకు సమర్థులయిన అనువాదకులు అవశ్యము కావాలి.

భాయ్ వీర్‌సింగుకు సమకాలికులలో గతించినవారు నలుగురు గణనీయులు. శిఖ్ఖుమతానికి సంబంధించిన చక్కని విజ్ఞానకోశాన్ని కహన్‌సింగ్ సంకలితము చేసినాడు. 'మేజీ' పత్రికాసంపాదకుడైన చరణ్‌సింగ్ పంజాబీ గద్యపద్యరచనలో హాస్యం ప్రవేశపెట్టినాడు. లాక్షణికశైలివిడిచి స్వేచ్ఛగా అద్భుతంగా బ్లాంక్‌ఛందస్సులో అపరిచితాలయిన ఇతివృత్తాలు స్వీకరించి కవిత చెప్పినాడు.. వీర్‌సింగుకు ప్రతిభలో ద్వితీయుడనిపించుకొన్నవాడు ధనిరాం 'చత్రీక్'. ఆయన కావ్య సముచ్చయాల్లో 'చందన్‌వారి', 'కేసర్‌కియరీ', 'నవన్‌జహాన్', 'సూఫీఖనా' అనే కృతులు సుందర భావగీతాత్మకాలు, పంజాబీ వ్యావహారిక భాషా విలసితాలున్నూ.

యువకుల తరములోకూడా పద్యరచనే ప్రముఖమైన సాహిత్య వ్యక్తీకరణముగా ఉన్నది. ఒకమాసము దాటుతుందోలేదో ఇట్టే కొత్తగా కవి పుట్టుకొనివస్తాడు. వార్తాపత్రికలూ, మాసపత్రికలూ పద్యకవిత్వానికే ఎక్కువ ప్రాధాన్యము ఇస్తున్నవి. పంజాబికవితాగోష్ఠులు ప్రజానీకాన్ని ఆకర్షిస్తున్నవి మత రాజకీయ సభలకన్న. ఈ నవ్యకవిత చాలవరకు గుణవంతంగా ఉండదు. సామాన్య కవులకన్న ఇద్దరుకవులు మోహన్‌సింగ్, అమృతాప్రీతమ్ భిన్నంగాఉన్నారు. మోహన్‌సింగ్ 'పుంజ్‌దరియా' అనే మాసపత్రికకు సంపాదకుడై 'సవాపత్ర', 'కుసుంబ్రా', 'అధవతే' అన్న రచనలవల్ల వర్ధిష్ణువుగా ఉన్నాడు. తరుణ కవిసోటిలో సముచితార్హత సంపాదించి వారిలో ఉత్తమకవిగా గణనీయుడైనాడు. ఆయన తరువాత రచించిన కృతుల్లో ముఖ్యంగా 'కుఛ్‌సబ్' అనే రచన విభజనానంతరం ప్రకటితమైంది. అవి వామపక్షానికి గాఢంగా మొగ్గు

చూపుతున్నవి. కావ్యత్వముకన్న రాజకీయ భావోద్రేకానికి ప్రాధాన్యం ఇవ్వడమనేవ్యాధి కనబడుతున్నది. ఈ రుగ్మతవల్ల చాలమంది యువ రచయితలు 'అభ్యుదయ' వాదులమనే ముద్రవేసుకొని బాధపడినారు. మోహన్‌సింగ్ విషయంలో మార్క్సుతత్వం మొదట వెల్లువగాపొంగి తరువాత శమించి అధములపక్షంవహించి వారిని కార్యశూరులుకమ్మని ప్రబోధించడంతో పర్యవసిస్తున్నది. అతనికి తొలినాటి రచనల్లోని అప్రయత్న రచనారామణీయకత తిరిగి లభ్యమైంది. అతని సాహిత్యసృష్టి ఉదాత్తస్థాయిలోనే సాగేపక్షంలో మనభాషలో మహాకవుల్లో ఒకరు కావచ్చును. అతనికి ఇంకా జీవించవలసిన వయసుకూడా చాలా ఉంది. ఇటీవల ప్రకటితమై ప్రసిద్ధికిరాని గజలులో తన 'విప్లవాత్మక' భావోద్రేకం ఇట్లా వ్యక్తం చేసినాడు .

'ఘటంలోపలి కారు సలుపువిచ్చింది
తెల్లని పాలవెన్నెల వెలుగు వొలికిస్తూ;
సమయమిదే ఉషస్సుమాట పలుకుటకు
రేయి పిచ్చాపాటీ విడుచుటకు,
నేను సమ్మతిస్తాను శిశిరస్పర్శచే కించిత్
తరుపత్రసారము హరించింది
పోయినదానికి విషాదముచెందకు,
కొత్తఆశ చిగురించినింపు నీ యెదిని
ఎంతకాలము పురాతన స్వర్లోకపుకప్పుపై
సోమరిగా కలలుకంటావు ప్రియా ?
రా, మరి, మనము పుడమి అలకలు ముద్దుగ సవరింతాము
రావోమరి మాటాడుకొందము ఏదోమనదగ్గర విషయము.'

(పాకిస్తాన్, భారత, రెండు పంజాబురాష్ట్రాల్లోనూ కవయిత్రి, అమృతాప్రీతమ్ సాహిత్యపరుల అభిమానానికి పాత్రురాలైంది. ఆమె అభ్యుదయవాదిని కాదు. ఆమెకు ఒక సందేశమంటూ లేదు. లోకానికి అందీయడానికి కవనార్థం కవిత చెప్పడమేకాని వేరేకారణంలేదు. ఆమె విదుషికాదు. అయితే ఆ కవయిత్రి కవిత్వము స్వభావసరళమై అంచంతో ఉట్టిపడుతూ, యోచనమృగ్యమైనా హృదయంగమముగా ఉంటుంది-

ఆమె కవితా రచనల్లో మృదువైన జానపద ద్విపదరీతి అధికంగా గోచరిస్తుంది. ఒక్కొక్కసారి జాతిరత్నాలవంటి పలుకులు కులుకుతూ కవితాలక్ష్యానికీ, ప్రధానమయిన ఇతివృత్తానికీ. ఆమె దూరమై పోయిపోయి, అయోమయంలో పడుతుంది. ఒక పద్యంలో, ఆమెకు ప్రీతిపాత్రమైన పద్యంలో ప్రియుడు ప్రేయసిని పిలుస్తున్నాడు.

' మేలుకొనవే నా ప్రియా! నీ కన్నులు బరువయ్యెను
గతకాలపుకలలచే, పరిమళాలు మలయానిలమల్లగ
(అందుకుచే నీ విట్టారుపు ?)
వెన్నెలలేనిరాతిరి కారు నలుపుమంది
తరళ తారకలు నీ ముంగురులకు కాంతినొసంగుగావుత. '

పాకిస్తాన్ సరిహద్దుదాటి అమృతాప్రీతమ్ కావ్య మొకటి విజయయాత్రచేసింది. ఆ కావ్యఖండం ఆమె వారిస్‌షాహాను సంబోధిస్తూచేసిన రచన వారిస్‌షాహ్ హిందువులూ, శిఖ్ఖులూ, ముసల్మానులూ, అందరూ హాయిగా సోదరులవలె కలిసి రాష్ట్రవిభజనకు పూర్వము మెలగిన దినాలకు ప్రతీక ఐనాడు. రాష్ట్రవిభజనమూ దానితో హత్యలూ, ఆమెను వేధించగా, 'ఆ ఆవేదన కావ్యరూపంచెందింది. ఆమె వారిస్‌షాహాను ఉద్దేశించి సమాధినుంచిలేచి తన మాతృభూమిలో జరుగుతున్న విధ్వంసాన్ని చూడమని హెచ్చరిస్తున్నది.

నీ పాంచాల స్థితి చూడవయ్యా! మరి లేవయ్యా! ఓ ఆర్తి హరా! కేదారమ్ములు కంకాళమ్ముల రాసులు! చీనాబు నదమ్మున రక్తము ప్రవహించెడి ఏ చేత విషజలమునె పొలాలు దున్నుట కుపయోగింతురో, ఆ చేతనె విషకలితమయ్యె మన పంచనదము ' అమృతా ప్రియతమ్ కవితామార్గము జనప్రీతి పొందింది అవలీలగా. తరుచుగా ఆ కవయిత్రి కావ్యగుణము న్యూనము చేసుకోడానికైనా సిద్ధపడి, ప్రశస్తికై యత్నిస్తుంది. (ఆమె పద్యాలన్నిటిలో రమారమి పద్యపు ఎత్తుగడ సామాన్యంగా, దివ్యంగా ఉంటుంది. ఆ తరువాత పంక్తులు దిగనారి దిగజారిపోతాయి) కాని ఆమె తరుణ కవయిత్రి. వృద్ధిలోకి రావలసిన రచయిత్రి. పంజాబు ఆ కవయిత్రి మీద మహాకాంక్షలు పెట్టుకొన్నది. తక్కిన భాషల వలెనే పంజాబీ సాహిత్యంలోనూ నవ్య కవితా ధోరణు

లున్నాయి. నవ్యులు ఛందో బందోబస్తులు నిరాకరించి. చేస్తున్న సాహిత్య ప్రక్రియలు సామాన్య పాఠకులకు దురవగాహంగా ఉంటున్నాయి. ఈ రీతి రచన తాత్కాలికమే. గుణలేశమేదైనా ఉంటే అదే నిలుస్తుంది. గుణలేశమువల్ల అర్హత సంపాదించుకొన్న కావ్యకృతులు రచించిన వాడు ప్రియతం సింగ్ సఫీర్ అనే లాయరు. ప్రస్తుతం ఆయన కూడా కొంతకాలంనుంచీ తూష్ణీంభావము వహించినాడు.

వచన రచనవైపు మరలుదాము. గురుభక్షసింగ్ పంజాబీ వచన రచనాదక్షులలో ప్రముఖుడు. ఆయన ఇంజనీయరుగా జీవితం ఆరంభించి, అధిక విద్యా వ్యాసంగానికి అమెరికా సంయుక్త రాష్ట్రాలకు వెళ్ళినాడు. ఆయన స్వదేశముచేరి ఇంజనీయర్ వృత్తి విడిచి ఆధునికతా వ్యాప్తికి ప్రచారకుడైనాడు. ఆయన మాసపత్రిక ఆరంభించి, తన భావాలు 'ప్రీత్‌లరి' లో ప్రచురించినాడు. ఆయన ప్రీత్‌నగర్ అనే సమాజకేంద్రము భారత పాకిస్తాన్ సరిహద్దున స్థాపించి, దానిని సంస్కృతి కేంద్రంగా చేసినాడు. 'నన్‌విన్ పథరీ జిందగి' అనే వ్యాస సంపుటివల్ల గురుభక్షసింగుకు ఉత్తమ వ్యాసకర్తగా పంజాబీ వచన రచయితగా ఖ్యాతివచ్చింది. సామ్యవాద లక్షణాలు కలిగిన, పలువురు రచయితలకు ఆయన భావోద్దీపనం కలిగిస్తున్నాడు. వారిలో ఆయన కుమారుడు తేజసింగుకూడా ఒకడు. వారిద్దరూ చీనా, తూర్పు ఐరోపా, సోవియట్‌రష్యా దేశాటనంచేసి శాంతిసభల్లో పాల్గొన్నారు. వారి రచనలు చాలవరకు ప్రచారక సాహిత్యంగాఉన్నా నిస్సందేహంగా గుణసౌష్టవంకలిగి విదేశ సంచారానుభూతితో, వైదేశిక సాహితీరీతులను ప్రతిబింబిస్తున్నవి.

పంజాబీనవల చెప్పతగిన ఏ విశిష్టతనూ సంతరించుకోలేదు. ప్రతి మాసమూ కుప్పతిప్పలుగా నవలలు వ్రాసేవారు వ్రాస్తున్నారు. అవి అచ్చవుతూనే వున్నాయి. భాయ్ వీర్‌సింగ్‌వంటివాడు, పద్యకవితా ప్రావీణ్యమున్నవాడుకూడా, సలక్షణమైన ఆఖ్యాయికారచన చేయలేక పోయినాడు. యువరచయితల్లో 'దుగ్గల్' వంటివాడు దీర్ఘకథానికలతోనో, అవేపాత్రలతో కథానికాపరంపర సాగిస్తూనో, నవలలని అనిపించడానికి రచిస్తున్నాడు. దరిదాపు నలభై నవలలవరకూ నానక్‌సింగ్ రచన

చేసి, పంజాబీ నవలాకారులలో ఎక్కువ ఖ్యాతిపొందినాడు. 'చిత్త లహరా' 'ఆదమ్‌ఖోర్' అన్న ఆయన నవలలు రెండూ ఉత్తమములు. "ఆదమ్‌ఖోర్' అన్న నవల సాహిత్య అకాదమీ ఆధ్వర్యాన భారతీయ భాషల్లోకి అనువదింపబడుతున్నది. నాకక్‌సింగ్ తన రచనలద్వారా సంఘసంస్కారము వ్యాప్తిచేయ దలచుకొన్నాడు. ఆయన కథానికలు ఔత్సుక్యజనకాలు. అయితే ఆయన భాష కేవలము పంజాబీభాషకాక, ఆంగ్లపద ప్రయోగబలంతో కూడుకోవడంవల్ల రుచిగా ఉండదు. పంజాబీపదాలు లభ్యమవుతున్నప్పుడుకూడా వైదేశికపదాలు వేస్తాడు. యువకథారచయితల్లో ఇద్దరు రచనాశిల్పము వృద్ధిచేసుకొంటే సిద్ధ హస్తులు కాగలరు. వారు సురీందర్‌సింగ్ నరూలా, జస్వంతసింగ్ 'కవ్వార్' జస్వంతుని 'పురాణ్‌మషి' అనే గ్రంథమువల్ల ఆయన వృద్ధి లోకి రాగలవాడని చెప్పవచ్చును.

కథానికా రచనలో పంజాబీ రచయితలు సృజనాత్మక సాహిత్య సృష్టిలో కృతకృత్యులైనారు. పత్రికాముఖంగా లోకవిదితమయ్యే చిన్నకథలు ఉత్తమస్థాయిలో గోచరిస్తున్నాయి. దీనికికారణం లేకపో లేదు. ఈ సాహిత్యరంగంలో అగ్రేసరుడయిన శాంతసింగ్‌శెఖాఁ ఐరో పీయ అమెరికా కథాకారుల శిల్ప సంవిధానం అవలంబించినాడు. సూటిగా కథాకథనం చేసేపద్ధతిలేదు. ఐతిహ్యము, కొద్దిగాచెప్పడం, సన్నివేశకల్పన, మనస్తత్వము. వ్యంగ్యము అనే రచనావిధానాలు నేర్పుగా ఉపయోగించుకొన్నారు. చిన్నకథలలో దిట్ట అనిపించుకొన్న కర్తర్‌సింగ్‌దుగ్గల్ రచనాకీలకాన్ని శెఖన్‌దగ్గర స్వీకరించినాడు. దుగ్గల్ ప్రావీణ్యంతో కథానికలో రావల్‌పిండిమండలంలో వ్యవహారంలోఉన్న ప్రాంతీయభాషను ఉపయోగించి అద్భుతమైన అనుభూతి కల్పిస్తాడు. ఆయన పరశ్శతంగా కథానికలు రచించాడు. వాటిల్లో 'స్వేర్‌సర్'; 'నవఘర్' గణనీయాలు. ఆయన పంజాబురాష్ట్ర విభజనవల్ల వచ్చిన కష్ట పరంపరలు ఇతివృత్తంగా స్వీకరించి నవలలుకూడా రచించినాడు. కాని ఇవన్నీ ఏకాండంగా గ్రథనంచేసిన కథానికలనే లోగడ చెప్పి నాము. ఆయన రచించిన 'నహ్లాతేమన్' కొన్నేళ్లదాకా పంజాబీనవలా సాహిత్యంతో సీమాంతచిహ్నముగా ఉంటుంది. అందులో రైతాంగపు

బ్రతుకు చాలా నేర్పుగా చిత్రించినాడు. జానపద శాంతవాతావరణం మహా విషాదస్థాయికి మారిపోతుంది. ప్రజలు మతముపేర కుత్తుకలు నరుక్కొంటారు. ఆయన ఈ ఇతివృత్తాన్ని మహాకౌశలంగా తీర్చిదిద్దినాడు. ఆ నవలాకారుడు సంకుచితమత పక్షపాతము ఏమీ లేకుండా హాయిగా, స్వేచ్ఛగా, గ్రంథరచనచేసినాడు. ఆయన తరువాతకాలంలో రచించిన 'లరాట్‌నహిన్' అనే నవలలో పై చెప్పబడిన ప్రమాణంలో తటస్థచిత్రణం గోచరిస్తుంది. దుగ్గల్‌కవితా రంగంలోకికూడా, చొరవ చేసినా, కవిగా అంతగా ఖ్యాతిలేదు. ఆయన నాటకాలు రంగానికెక్క లేదు. అయితే ఆయనవి చాలా నాటకాలు రేడియోలో ప్రసారితమైనాయి. ఏ పంజాబీకవి రాసినవీ ఆయన నాటికలవలె ప్రసారితము కాలేదు.

కథానికలు వ్రాయడంలో కృతకృత్యుడయిన మరొక రచయిత, కుల్వంతసింగ్ విర్క్. ఉత్తరపాంచాల ప్రాంతీయభాషా రచనవల్ల దుగ్గల్ సాధించగలిగినది. విర్క్, లాహోర్‌లోనూ, దాని చుట్టుపక్కల మాట్లాడే ప్రాంతీయభాషలో సాధించగలిగినాడు. దుగ్గల్‌ప్రభావము అతని రచనలో గోచరించినా, ఆయన సృష్టిచేసిన పాత్రలూ, ఇతివృత్తములూ, ఓజోద్వేగముగల ప్రాంతమునుండి స్వీకరించినవి. అందువల్ల ఆయనరచనలో అధికతరంగా పురుషకారం ఉన్నదేకాని చిలకబడిన భావోద్రేకము లేదు.

పంజాబీ సాహిత్యప్రక్రియలో రూపకరచనను గ్రంథకర్తలు నిర్లక్ష్యము చేసినారు. సుసజ్జితమైన రంగశాల అంటూ ఒకటి లేక పోవడం కారణం. నాటకములు పాఠకులు చదువుకొని ఆనందించవలసిందే, లేదా అవి రేడియోలో ప్రసారితం కావాలి. ఈ రెండింటివల్ల నాటకకళకు పూర్తిగా న్యాయము జరగదు. పోనీ ఔత్సాహిక నటులు ఏ పాఠశాలల్లోనో, కళాశాలల్లోనో, హఠాత్తుగా నాటకం ఆడవలెనని గజ్జె కట్టినా, ప్రయోజనంలేదు. అయినా ప్రొఫెసర్ ఐ జి నందా కృత సుఖాంతనాటకాల్లో ఉక్తి చమత్కారపు సాము గరిడీలవల్ల హాస్యము జాలువారుతున్నది. పంజాబీ సాహితీవేత్తలు ఇప్పటికీ ఆ నాటకాల విషయము ప్రశంసిస్తూ ఉంటారు. కొందరు నూతన సంవిధానంతో నాటకాలు రంగాన ప్రయోగించాలని అప్పుడప్పుడు ప్రయత్నాలు

చేసినారు. గురుదయాళ్‌సింగ్ ఖోస్లా పిల్లలకోసం చిన్న నాటికలు రచించడంలో ప్రావీణ్యంకోసం యత్నించినాడు. ఆయన శిశుపాఠశాల ల్లోంచి బాలనటులను తయారు చేసినాడు. బల్వంతగర్గీ నాటక కర్తగా లోకవిదితుడై, వామపక్ష సిద్ధాంతాలతో సంబంధము కల్పించుకొంటూ వస్తున్నాడు బహుకాలంనుంచీ. ఆయన ఇటీవలనే సోవియట్ రష్యా, యూరపుదేశాలు పర్యటనంచేసి, రంగశాల విషయం సాకల్యంగా గ్రహించి స్వదేశానికి తిరిగివచ్చినాడు. ఆయన నాటకాల్లో భావోద్రేకం రాజకీయ ప్రయోజనమున్నూ ఉంటవి. ఆయనచేసిన హేళనలో ఒకానొక ఉద్దేశం ఉంటుంది. ఆయన ఉపదేశాన్ని ఉద్ఘాటించడానికి కొంత కటువుగా హాస్యం ఉపయోగ పరుచుకొన్నాడు. గర్గీ పాటియాలా ప్రాంతీయ పంజాబీ భాషను ప్రయోగించడముచేతనూ, అతని నాటకాలకు గ్రామీణమైన కథావస్తువులతోపాటు, పటుత్వం వచ్చింది. ఆయన నాటకాలు ఎవరిమటుకువారు చదువుకొని ఆనందించవలసిన దురదృష్టం కలిగింది. అందుకు కారణం రాజకీయ వర్గాలవారే కాని ఇతరులు నాటకాలను రంగప్రదర్శన చేయకపోవటం. పక్షపాత రహితంగా నాటికలు లేకపోవడంచేత అవి రేడియోలో ప్రసారితము కావు. ఆయన ఇటీవల నవలా రచనకు కూడా పూనుకొన్నాడు.

## భవిష్యత్తులో అభివృద్ధి

సిక్కు రాజకీయ నాయకులు చాలామంది ఎప్పుడో ఒకప్పుడు పద్యమో గద్యమో వ్రాయడానికి ప్రయత్నించినవారే. ఇదే విచిత్ర విషయము. గురుముఖసింగ్ ' ముసాఫిర్ ', రాష్ట్రీయ కాంగ్రెసు అధ్యక్షుడు, చాలా కవితా ప్రావీణ్యము కలవాడు. మాస్టర్ తారాసింగ్ పాశ్చాత్య సంప్రదాయాను సారంగా బిల్‌కోడి, దేవిక్రోకెట్‌వంటి పాత్రల పేర్లకు మారుగా శిఖుపాత్రలు ప్రవేశపెట్టి, అతి స్వేచ్ఛగా కొంతనవలా రచన చేసినాడు. మీరు నమ్ముతారో నమ్మరో కాని సోహన్‌సింగ్, కమ్యూనిస్టు నాయకుడు, మతగ్రంథాలపై ప్రసిద్ధమైన భాష్యాలు వ్రాశాడు. పంజాబీభాషను, తద్భాషా ప్రయుక్తప్రాంత సీమను, పంజాబీపరిషత్తునూ, ప్రభుత్వం అంగీకరించాలంటూ, అందరూ

సంయుక్తముగా కోరడానికిగల కారణాల్లో బహుశః ఒకకారణం, ఇక్కడ సాహితీవైదుష్యానికి అంతా అదృష్టవశాన ప్రాధాన్యం ఇవ్వడమే. అయితే భవిష్యత్తులో ఏమిటా అభ్యుదయం అని ఎవరయినా అడగ వచ్చును.

ప్రభుత్వాంగీకారముద్ర పడిన మాత్రాన సాహిత్యసృష్టి జరగదు. పంజాబురాష్ట్ర విభజనవల్ల బాషాప్రయుక్తభాగం కొంతనష్టములు నందుటచేతనూ, పాకిస్తాన్‌లో ఉరుదూను రాష్ట్రభాషగా అంగీకరించడం చేతనూ, బారత దేశంలో హిందీకి పోషణ ఇవ్వడంవల్లనూ, దానికి కలిగిన నష్టము ముందు ముందు కొంతవరకు పరిహారము కాగలదు. కొన్ని సంవత్సరాలపాటు గురుముఖీలిపిని ఉపయోగించే శిఖు రచయితల మీదనే పంజాబీసాహిత్యం ఆధారపడి ఉంటుంది. ప్రాంతీయ నుడికారాలు అదృశ్యమయి ఏకాకారమైన భాష వ్యాప్తం కావడముతోనే, జానపదమైన పాటవము కొంతభాష కోలుపోతుంది. ఈ నిర్బంధపు ప్రభావాలను ఎదుర్కోడానికి అన్యభాషల్లోని మహాగ్రంథాలను అనువదించాలి. అప్పుడు రెండవరకపు చెత్తపుస్తకాల స్థానం అవి పొందుతవి. ముందు పంజాబీలో వ్రాసిన పుస్తకాలే ప్రధానంగా పాఠశాలల్లో కళాశాలల్లో పాఠ్యపుస్తకా లవుతున్నాయి. ఇప్పుడు దానివల్ల సాహితీ ప్రమాణము తగ్గుతున్నది; భావనాశక్తి రహిత రచనలకు ఆధారము ఏర్పడుతున్నది. సముచిత ప్రతిఫలం తక్కువ కావడముచేత పంజాబీయులు అన్యభాషల్లో రచనకు పూనుకొన్నారు. వాళ్ళను ప్రోత్సహించాలి మాతృబాషలో రచన చేయడానికి, (రాజేందర్‌సింగ్ బేడీ ఉరుదూలో వ్రాసిన కథానికలు ప్రథమస్థాయిలో గణ్యతపొందినవి.) పంజాబీ పత్రికలు, పరీక్షలకు చదివే కుర్రకారుకోసం అధికంగా ఉపయుక్తము కావడము నుంచి విముక్తి పొందాలి. అయితే మంచి పత్రికలు కొన్ని లేక పోలేదు. పెప్సు, పంజాబు ప్రభుత్వాలు సాహిత్యానికి ప్రోద్బలము ఇస్తున్నాయి. హర్‌కిషన్‌సింగ్ 'పంజాబీ సాహిత్య' అనే ఉత్తమస్థాయిగల పత్రికను చాలా కాలమునుంచి జలంధర్‌నుంచి నడుపుతున్నాడు. ముఖ్యంగా పంజాబీయుల్లోంచి చిత్తశుద్ధిగల విమర్శకులు బయలుదేరి సృజనాత్మక రచయితకు సాయపడాలి; చెత్తపుస్తకాలు చదవకుండా

జాగరూకతలేని పాఠకులకూ సాయపడాలి. ఇంతకు పూర్వం పంజాబీ సాహితీ ప్రపంచము సంకుచితమై ఉండేది. ఇంతవరకూ రచయితలు వెనకనుంచి అధిక్షేపం చేయటమో, అన్యోన్యము రచనలను పొగడు కొనడమో చేస్తున్నారు. ప్రస్తుతం సాహితీ ప్రపంచంలో గుణదోషాలు వివేచనచేసేవారువస్తే గుణభూయిష్ఠమైన రచనలువచ్చి ఉజ్జీవనం సాగుతుంది. అట్టి పంజాబీసాహిత్యోజ్జీవనంకోసము నిరీక్షిస్తున్నాము.

## ఆకర గ్రంథజాతము

History of Punjabi Literature
*By Dr. Mohan Singh*
Introduction to the study of Punjabi Literature
*By Dr. Mohan Singh*
Punjabi Sufi Poets
*By Lazwanti Ramakrishna*
The Sikhs
*By Khusvant Singh*
Linguistic Survey of India
*By A. G. Grierson, Vol 9, Pt I pp. 607—823*

# వంగ సాహిత్యము

కాజీ అబ్దుల్ వదుద్

## పూర్వస్థితి

సమర్థులైన విద్వాంసుల మతరీత్యా వంగభాష, తక్కిన అస్సామీయ, ఒరియా, మైధిలీ భాషలతోపాటు, హైందవ–ఐరోపీయ మహాభాషా కుటుంబముయొక్క భారతీయశాఖ అయిన పూర్వప్రాకృతం నుంచి ఉద్భవించింది. అది విలక్షణ రూపములతో విలసిల్లేటప్పుడు క్రమశః శబ్దజాలంలో, భావాలలో, భావచిత్రణంలోనూ నిజానికి అనేకమైన ఆర్యేతరాంశాలు తనలో లీనము చేసికొన్నది.

ఇప్పటికి తెలిసినంతవరకు 'చర్యా' గేయాలు వంగసారస్వతంలో ప్రాచీనతమ మైనవి. 1916 లో నేపాలులో సంస్థాన గ్రంథాలయంలో విఖ్యాత భారతీయ సంస్కృతి శోధకులైన మహామహోపాధ్యాయ హర ప్రసాదశాస్త్రిగారు 'చర్యా' గేయాలను కనుక్కొన్నారు. వాటి కాలము క్రీ. శ. 1000–1200 మధ్య కాలమని సామాన్యాభిప్రాయం. అయినా కొందరు చర్యాగేయాలు అష్టమ శతాబ్దిలోవని బాగా ప్రాచీనకాలానికి నెట్టివేశారు. ఆ గేయాలు కేవలమూ సారస్వతగేయ రచనలు కావు; మహాయాన బౌద్ధ సంప్రదాయాచార్యులు యోగసాధకులకు మార్గము చూపే సాంకేతికమైన ఉపదేశాలే రవీంద్రనాథఠాకూర్ మానవుడి మతాన్ని గురించి చేసిన హిబ్బర్టు అభిభాషణాల్లో, 19 శతాబ్దిలో బావుల్ అనే దేశదిమ్మరులైన మర్మయోగుల గేయాలకూ చర్యాగేయాలకూ చిత్రమైన పోలికలున్నవని తెల్పినాడు.

ఆదిలో వంగభూమియావత్తూ, బౌద్ధమయమైఉంది సేనరాజుల కాలంలో క్రీ. శ. 1000–1200 హైందవధర్మం ప్రధానంగా స్వీకరించింది. మన ప్రాచీన మహాకావ్యంవంటి 'శూన్యపురాణ' ములో

మన ప్రాచీన మహాకావ్యంవంటి ఒకానొక కథనంలోని కొన్ని పంక్తుల వల్ల బౌద్ధుల్ని బ్రాహ్మణ సనాతన ధర్మోద్ధారకులు హింసించినట్టూ, బౌద్ధులు తుర్కీయ విజేతలను స్వేచ్ఛాప్రదాతలనుగా భావించినట్టు అనుకోవలసివచ్చింది. ఆ కారణాలవల్ల వంగదేశంలో అసంఖ్యాకంగా ఉన్న ముసల్మాను ప్రజలు, హిందువులతోపాటు, ప్రాచీన బౌద్ధకుటుంబాల్లో ఉద్భవించినవారని అనుకొంటారు.

ప్రాచీన వంగభాషలో కవి కంకణబిరుదాంకితుడైన ముకుంద రామ చక్రవర్తి 'చండీమంగళ్' అనే దీర్ఘకావ్యం క్రీ. శ. 6 శతాబ్ది ప్రాంతంలో రచించినాడు. ఆయన సమకాలిక సమాజంలోని స్త్రీపురుష స్వభావాలూ, సన్నివేశాలూ, ఉదాత్తంగా విలక్షణంగా, యథాతథంగా చిత్రించినాడు. గ్రంథవాహాన్నిబట్టి చండీదేవతా పూజావిధానము ఎలా ఆచరణలోకి వచ్చిందో మనము తెలిసికోవచ్చును. దాని పేరును బట్టే అది విచారణాత్మకమూ, దార్శనికమూ, కావడంవల్ల పాఠకులకు ఉత్సాహం కలిగించదు. అయితే అలాంటి ప్రతిబంధకాలున్నా, అది నిజంగా మహాకావ్యమే అందులో సహృదయ హృదయామోదము కలిగించే మానవాభిరుచుల వైవిధ్యము ప్రతిబింబిస్తున్నది.

చండీమంగళమ్ తరువాత గాని, దానితోపాటుగాని వైష్ణవ భావ గేయాలు పేర్కొనతగినవి. విద్యాపతి, చండీదాస, జ్ఞానదాస, గోవింద దాస కవులు, రాధాకృష్ణుల ప్రణయాన్ని సుందరగేయరూపంలో రచించినారు నిజానికి [1] వైష్ణవ పదావళి వంగీయులకేకాక భావసంపదగల కవిత్వాన్ని మెచ్చే వారందరికీ మనోహరమే. ఆపదావళిలో కొన్ని ఉత్తమోత్తమ గేయాలు అపూర్వ ప్రేమ భక్తిరసానంద తన్మయత్వము కలవి. అవి ఏ ప్రసిద్ధ సాహిత్యంలోని ఉత్తమ లౌకికాలౌకిక ప్రణయ గేయాలకైనా పాటిరాగలవు, చైతన్య మహాప్రభువు తన జీవిత ప్రభావం వల్ల ఆ యుగాన్ని ఉద్దీపింప చేశారనుట గమనార్హము. ఆయనను

---

1 వీటిలో కొన్ని భావగేయాలను ఏర్చి కూర్చి 'వైష్ణవ పదావళి' అనే పేరుతో పీఠికతో డా. సుకుమార సేన్ సంపాదకత్వాన సాహిత్య అకాడెమీ ప్రచురించింది.

గురించి రచించిన అనేక జీవిత చరిత్రలన్నింటిలో బృందావనదాస, కృష్ణదాస, కవిరాజుల రచనలు రెండూ స్మరణీయమైనవి.

వైష్ణవ రచనల అనంతరం చెప్పుకోతగ్గవి కృత్తివాసుని రామాయణము, కాశీరామదాస కృత మహాభారతమున్నూ, రమారమి 16 వ శతాబ్దారంభంలో రామాయణము, ఆ శతాబ్దాంతంలో మహాభారతము రచింపబడ్డవి. ఆ ప్రాచీన మహాకావ్యాలు నిశ్చయంగా నేటికీ ప్రజాభిమానము పొందుతున్నవి. ఆ ప్రాచీన ఇతిహాసాలు లలితఛందోగమనం వల్ల, సరళమైన గాథ కరుణరసంవల్లా, గొప్ప నీతి బోధవల్లనూ ఇప్పటికీ గౌరవనీయములే.

17 వ శతాబ్దిలో దౌలత్‌కాజీ, సయ్యద్ అలౌల్ అనే ముసల్మాను కవులు అరకాన్ ముగరాజులయు, వారి సంస్థానాధిపతులయు పోషణ క్రింద ఉండేవారు. దౌలత్‌కాజీ బాగా సమర్థుడు. కాని చిన్నవయసులోనే చనిపోయినాడు అలౌల్ వృద్ధాప్యంవచ్చేదాకా జీవించాడు. అతనిలో వైదుష్యం కవితాశక్తిన్నీ మేళవించినవి. ఆ ముసల్మాను కవులిద్దరూ చేసిన వంగ సాహిత్యసేవ విశిష్టమైనది. అలౌకికమైన దివ్య స్త్రీ పురుషుల ప్రణయ గాథలతో నిండిఉన్న ఆ కాలపు వాతావరణంలో వారు ఐహికప్రేమ విశేషంగా చిత్రించి దాని ప్రాధాన్యము నిరూపించారు.

వారి తర్వాత 18 వ శతాబ్దిలో భారతచంద్రుడు అవతరించినాడు. ఆయన అంతకంటె లాలిత్యంగల కవితాశిల్పి; రమారమి ఒక శతాబ్ది పాటు బహుళ ప్రజామోదము పొందినాడు. కాని ఉపజ్ఞా మేధస్సులున్న వాడయినా, ఆయనకు దేనికి ఎంత ప్రాధాన్యము ఇవ్వవలెనో తెలియదు. క్షీణప్రాయమవుతున్న యుగంలో ఆయన వాసికెక్కినాడు. భారత చంద్రుని అడుగుజాడల్లోనే రామప్రసాదకవి అవతరించినాడు. ఆయన కొంత కాలముపాటు భారత చంద్రుణ్ణి అనుకరించి రచనలుచేసినాడు. అయితే ఆయన కృతకృత్యుడు కాలేదు. ఐతే కాళీజగన్మాతృవాత్సల్యం మహోదాత్తంగా భక్తిభావభరితంగాచేసిన ఆయన గేయరచనలు ఉన్నతశ్రేణి లోనివి. వాటివల్ల ఇంచుమించుగా అన్నిశ్రేణుల వంగీయుల హృదయాలను ఎక్కువగా చూరగొన్నాడు.

## 19 శతాబ్ది

మన పంథోమ్మిదోశతాబ్ది ప్రారంభంనాటికి బ్రిటీషువారి ప్రాభవ గౌరవాలు సుప్రతిష్ఠితాలయినవి. అది ముఖ్యంగా మారుతున్నయుగం. 19 శతాబ్ది ప్రథమార్థంలో ఈశ్వరగుప్తుడు యుగప్రాతినిధ్యము వహించిన కవి. ఉన్నత కవితాప్రావీణ్యము కలవాడు కాకపోయినా ఆయన తనచుట్టూఉన్న విషయ ప్రపంచాన్ని నిశితంగా పరిశీలించి, దాన్ని చురుకుగా, పద్యాలలో కనబరుస్తాడు. ఆయన ప్రజాప్రీతి పాత్రుడైనాడు. మన ఆధునిక సాహిత్యానికి దారితీసిన అగ్రగాములైన రంగలాల్, దీనబంధు, బంకిమచంద్రులు ఈశ్వరగుప్తుని క్రిందనే ప్రథమదశకు తయారైరి.

సుసంపన్నమైన మా జానపద గాథలనూ జానపద గేయ సారస్వతాన్నీ పేర్కొనక తప్పదు. ఆ జానపద సాహిత్యము కొంత అనువాదము [1] ఆంగ్లభాషానువాదము ప్రస్తుతము లభ్యమవుతున్నది. దేశీయ సారస్వతము, కాలగతివల్ల ఆకార ప్రకారంలో మార్పువచ్చినా అది నిస్సందేహంగా పురాతనమైంది. ఆ జానపద సారస్వతంలోని విశిష్ట సారస్వతగుణాలను బారతేతరులుకూడా గుర్తించినారు.

పందొమ్మిదో శతాబ్దికిపూర్వం చెప్పుకోతగిన వంశీయ వచన వాఙ్మయములేదు. ఆ శతాబ్దాదిలో ఫోర్టువిలియం కలాశాల స్థాపితమైంది. విలియంకేరీ, మృత్యుంజయా విద్యాలంకారులు మన వచనానికి ఒక రూపము ఇవ్వడానికి యత్నించినారు. ఉద్యోగుల ఉపయోగంకోసము వారి శిక్షణనిమిత్తము వారు పాఠ్యగ్రంథరచన ఆరంభించినారు. ఆ ప్రయత్నములో కొంతవరకు వారు కృతకృత్యులైనారు. అయితే నిజంగా ఓజస్సుతో కళకళలాడే ప్రథమ వచనరచన, రాజా రామమోహన్‌రాయలు లేఖినివల్ల ఉద్భవించింది. అయన మత నైతిక సామాజికాచార వ్యవహారాల్లో సంపూర్ణంగా సంస్కారం ప్రబోధిస్తూ చిన్నచిన్న పుస్తకాలు ప్రకటించినాడు. ఆయన బుద్ధి నిశితసూక్ష్మము;

---

1 కలకత్తా విశ్వవిద్యాలయం మైమన్‌సింగ్ జానపద గేయాలను, పూర్వ వంగీయ గేయాలనూ ప్రచురించింది.

ఓజోవంతము సమరసమైనదిన్నీ అయితే ఆయనది ఆ కాలానికి ముందు చూపు. ఎక్కువమంది వంగీయులు ఆయన గొప్పదనము గుర్తించక ఉదాసీనులైనారు. అయితే 19 వ శతాబ్దినాటి ప్రజ్ఞావంతులైన వంగవాసులు కొద్దిమంది మాత్రము రామమోహనరాయల జ్ఞానాచరణలవల్ల ప్రబోధితులై, వారికి తోచిన మార్గాల్లో దేశాభ్యుదయం చేసినారు. నిజానికి 19 వ శతాబ్దిలో వంగ సారస్వతోద్ధరణకు ప్రధానంగా రామమోహన రాయల ఉద్దేశాలూ యత్నాలే కారణము. అది మనదేశ చరిత్రలో బ్రిటిషుయుగంనాటి ఒకానొక మహాఘటన. నవీన సంస్కృతి రూపొందించిన వారిలో మహోన్నతుడగు రవీంద్రనాథుడు రామమోహనుని భావాలకు ఋణపడినవాడు.

సర్వతోముఖమైన సంస్కర్తఐన రామమోహనరాయలు విద్యావిధానములోకూడా తీవ్రమైన మార్పుకావలెనని ప్రబోధించినాడు. 1817 లో స్థాపితమయిన హైందవ కళాశాలలో ఆంగ్లభాషా సాహిత్యాలు, కొన్ని ఆధునికశాస్త్రాలు అధ్యాపనంలో ఉన్నా, ఆయన అనుకొన్న స్థాయిని అందుకోలేక పోయినవి. అందుకు కారణము ధర్మబోధ, భారతీయ భాషలు, తత్త్వశాస్త్రాధ్యయనమున్నూ, అందుకోలేకపోవడమే. అయినప్పటికీ హైందవకలాశాల దాని తీరులో బాగానే పనిచేసి, యోచనాపరులయిన 'తరుణవంగీయు' లనే బృందాన్ని తయారు చేసింది. ఆయువజనానికి రామమోహనరాయలయు, ఆయన అనుయాయులయు సంస్కారాచరణలు తృప్తిని ఇవ్వలేకపోయినవి. వారి కవి మందముగా తోచినవి ఆ యువజనులు ప్రాగ్దేశీయములైనవి పెకలించి వాటిస్థానే పాశ్చాత్య విషయాలు అతివేగంగా సర్వేసర్వత్రా స్థాపన చేయాలని తహతహలాడినారు. ఆ రెండు వర్గాల్లోనూ ఉత్తమశ్రేణికి చెందినవారు, నిష్కపటమూ ప్రశంసార్హమూఐన స్థిరశీలంకలిగి గాఢదేశభక్తులై ఉండేవారు—వారివారి విభిన్నమార్గాల్లో, రామమోహనుని అనుయాయులలో, 'తత్త్వబోధినీ'[1] శాఖీయులైన సమర్థులయిన కొందరి చేతుల్లో వంగభాషలో

---

[1] అక్షయకుమారద ., ఈశ్వరచంద్ర విద్యాసాగర్, మహర్షి దేవేంద్ర నాధఠాకూర్ ప్రముఖులు సమితిలో—

వచన రచన, శ్రమమే మరింత అభ్యుదయం పొందింది కాని తరుణ వంగీయులవల్లనే ఆధునిక వంగసాహిత్యం. ఆకారంలోనూ, ఇతివృత్తం లోనూ నవ్యత్వంకలది ఉద్భవమైంది. తరుణ, వంగీయ బృందంలో ఆ కాలంలో అగ్రేసరుడైనవాడు మైకేలు మధుసూదనదత్తు; అదివరకల్లా ఆంగ్లభాషలో కవితచెప్పి తద్వారా యశస్సు ఆర్జించాలని కలలు కన్న వాడు. క్రైస్తవం స్వీకరించి, ఐరోపీయభాషల్లో ప్రాచీనార్వాచీనములైన వాటన్నిటినీ తన అభ్యుదయానికీ ఆటంక రహితంగా ఉండుటకై అభ్యాసవంపట్టి, పాటవము సంపాయించినవాడు మైకేలుమధు సూదనదత్తు తుదకు నవ్యవంగ సాహిత్యంలో ప్రథమ మహాకవియై దాని స్థాపకుడనే పూజ్యతపొందినవాడు. మన భారత దేశానికీ ఐరోపా ఖండానికీ మధ్య ఉండిన అఖాతానికి సేతువు ఏర్పరచి రెండు ఖండా లకూ ఆయన దృఢబంధము కూర్చినాడు. పాశ్చాత్య లోకము మనకు పరాయికాదనీ. బహుకాలము తెలియక పోయినా ఆయన ప్రతిభవల్ల అందరమూ కావలసిన వాళ్ళమే అనీ గ్రహించుకోగలిగినాము. అది వంగసారస్వత వికాసానికి లాభదాయకమే; కాని అసమర్థులయినవారికి ప్రమాదము వాటిల్లే అవకాశము లేకపోలేదు. బంకించంద్రచట్టోపాధ్యా యుడు కూడా తర్వాతికాలంలో 'తరుణవంగీయుడే' ఆయన తనప్రథమ దశలో ఆంగ్లంలో 'రాజమోహనుని భార్య అనే ఆఖ్యాయికను (నవల) ను మొదట రచించినాడు. అట్టివాడు తరువాత మారిపోయి వంగభాషలోనే శక్తివంతమైన నవలలు పుంఖాను పుంఖంగా రచనచేసి, కొద్దికాలంలోనే సాహితీవరుల్లో అగ్రేసరుడని, ప్రథమ నవ్యవంగ వచన రచనా ప్రవీణు డనీ, ప్రశంసపొందినాడు.

జీవితపు మలిదశలో బంకించంద్రుణ్ణి జాతీయ పునర్నిర్మాణ సమస్య ఆకర్షించింది. ఆ యుగములో ఎన్నోకారణాలవల్ల హైందవ జాతీయ భావము జన్మించింది. బ్రిటీషు పరిపాలకులకు విద్యావంతు లయిన హిందువుల దినదిన ప్రవృద్ధమాన మహాకాంక్షల్ని గుర్తించ డానికి సుతరాం ఇష్టంలేకపోయింది. అందుచేత భారతీయుల ఆత్మగౌరవ భావానికీ, స్వావలంబనానికీ, దెబ్బతగిలింది. టాడ్ రచించిన రాజస్థాన కథావళి అనే అద్భుత గ్రంథ ప్రభావము వారి దేశభక్తికి దోహదం

చేసింది. జాతీయ రంగశాల ఏర్పడి మనస్సులను ఉద్రేకలూపి పార వశ్యంలో ముంచెత్తే కృతక సన్నివేశ పరంపరతో కూడిన నాటక ప్రదర్శనాలు ప్రారంభమైనవి. సనాతన హిందూమతాన్నీ, తత్త్వ శాస్త్రాన్నీ, దివ్యజ్ఞాన సామాజికురాలయిన బ్లావెట్‌స్కీ సతి, ఇతర పాశ్చాత్య విద్వాంసులూ ప్రశంసింపసాగినారు. ఆ పరిస్థితులు జాతీయ తకు దోహదాన్ని కలిగించినవి. బంకిమచంద్రుడు సామాన్యంగా బావో ద్వేశంతో కరిగిపోయే చిత్తముగలవాడు కాకపోయినా, ఆయన ఆ కాలపు దేశభక్తి బావోద్రేకానికి వివశుడైనాడు. ఆయన హైందవజాతీయ వాదిగా, దేశభక్తుడుగా ప్రబల ప్రసిద్ధి సాధించాడు; అయితే నిజానికి ఆయన తనకున్న ఉత్తమశక్తిని పోగొట్టుకున్నాడు. జీవితచరమదశలో ఆయన రచించిన నవలల్లో పూర్తిగా గుణాలు లేవనడానికి వీలులేదు. కాని తీవ్రమైన లోపాలున్నవి. ఆయన తన కాలంలోని క్లిష్టమైన దేశీయ జాతీయ సమస్యల్ని ఎదుర్కోలేకపోవడమే దానికి కారణము.

[1] ఆయన తత్త్వదృష్టిలో అయోమయత ఉన్నా, ఆయనకున్న దేశభక్తి, తన దేశము పతనావస్థ పొందినందుకు కలిగిన నిర్వేదమూ తీవ్రమైన వనుటకు సందేహములేదు. అవి కొంతకాలముపాటు జాతీయ జీవనమునకు సృజనశక్తిని ఉత్పాదనం చేసినవి. బంకిమచంద్రుని జాతీయోత్థానాత్మక బావాలు ఆరోజుల్లో హేమచంద్ర, నవీన చంద్రులకు ఉద్దీపనం కలిగించి వారికి గొప్ప యశస్సు తెచ్చినవి. అనంతరం వారిద్దరి పేరు ప్రఖ్యాతులు తగ్గినవి. ఉన్నతోద్యోగియైన రమేశచంద్ర దత్తు బంకిమచంద్రుని అనుయాయులలోనివాడే ఆయన చరిత్రాత్మక నవ లలు సాంఘిక నవలలు చాలారచించినాడు. కాని అర్థిక శాస్త్రవేత్తగా ఆయన ఈనాడు స్మరణీయుడు. బిహారిలాల్ చక్రవర్తి, సురేంద్రనాథ మజుందారులు ఆకాలపు కవులు. వారికప్పుడు అంతప్రసిద్ధిరాలేదు.

---

[1] ఆయన 'ధర్మతత్త్వం' లో వంగదేశంలో ముసల్మానుల సాంస్కృతిక స్థితిని ఉద్దేశించి బంకించంద్రుని సమీక్ష. ఆయన వంగ కృషికుల దుస్థితి పరిశీలించి పరిష్కారం చూపలేదు. అందుకు కారణము జాతీయార్థిక విధానాన్ని కల్లోల పరచ దలచుకోక పోవడమే.

కాని క్రమేణ సాహితీపాటవంవల్ల పేరులోకి వచ్చినారు. బిహారిలాల్ ప్రకృతిని ప్రజలను అధికంగా ప్రేమించినవాడు. చాలా నిరాడంబర జీవనం గడిపాడు. యౌవనంలో రవీంద్రనాథునిమీద ఆయన ప్రభావం బాగా ఉండేది.

హైందవ జాతీయత వికాసోన్ముఖ మవుతున్న వాతావరణంలో రవీంద్రనాథుడు పెరిగినాడు. రెండు ముఖ్యకారణాలవల్ల ఆయన జాతీయభావ భావితుడు కాలేదు. మొదటి కారణం శైశవంనుంచీ ఆయన కవిత్వం మహాకవుల రచనలవల్ల దీప్తమైంది. ఆయనకు ముఖ్యంగా కాళి దాస, జయదేవుల కావ్యాలు వైష్ణవకవులు, బైరన్, షెల్లీ, వర్డ్సువర్త్, కీట్సు, బ్రౌనింగ్‌కవుల కావ్యాలంటే మహాప్రీతి. రెండో కారణం ఆయన మహాకులీనుడు. నిరాడంబరమైన గాఢ జాతీయవాదుల వంగడంలో వాడు. బిహారిలాల్ చక్రవర్తి కవి ప్రభావాలు యువ రవీంద్రునిమీద ప్రసరించి ఆ లక్షణాలను గాఢముగా చేసినవి.

రవీంద్రనాథుడు ఉదారమై జాగృతమైన మేధస్సు, దయాంతః కరణము కలిగి ముఖ్యముగా ప్రకృతికవిగా పెరిగినాడు. ఇరవయ్యేళ్ళ వయస్సు వచ్చునప్పటికి కళ కళకోసమనే కోవలోచేరి పూర్ణవికాసము గల కవి అయినాడు. కావ్యశిల్పంలో ప్రావీణ్యం సంపాయించి, భావో ద్వేగ పూరితంగా గేయాలు, నాటికలు, కథానికలు, వ్యాసాలు ఎనిమి దేళ్ళు శరపరంపరగా రచించినాడు. తరువాత ఆయనకు జీవిత యాథార్థ్యం శోధించి చూడాలనే తహతహ పుట్టింది. ఆయన తత్ఫలి తంగా ప్రకృతిపై అధికప్రీతితోపాటు సత్యశివంకరుడైన పరమేశ్వరుని కోసం తీవ్ర తపనపడినాడు. దేశభక్తి, జాతీయభావాలు ఆయనలో విశిష్టరూపం పొందినవి. ఆయన స్వార్థత్యాగశీలముగల నిజమైన హైందవ జాతీయవాది అయినాడు అయితే ఆయనకూ బంకించంద్రునికీ, ఆయన వర్గానికీ ఒక్క భేదం ఉన్నది. రవీంద్రునిదృష్టి అనాడు వ్యవ హారంలోఉన్న హైందవ జీవితము మీదికిపోక, ఉపనిషత్తుల్లోనూ, బౌద్ధములోనూ, ప్రతిపాదితమైన మహోన్నత జీవిత పరమార్థమువైపు ప్రసరించింది. తన దేశీయులు ఉత్కృష్ట లక్ష్యంతో నవజీవనం గడ పాలనీ, అధికారతృష్ణా, భోగపరాయణత్వంకల పాశ్చాత్యుల ప్రభావానికి

వ్యామోహితులు కాకుండా నవజీవనము గడపాలని రవీంద్రుని అభి మతము. ఇది 1900 సంవత్సరంనాటికి ఆయనకు నలభైయేళ్ళు నిండి నప్పటి ఆయనస్థితి. అప్పటికే ఆయన గొప్ప కవుల ఉన్నతస్థాయిని అందుకొన్నాడు ఏ రీతిగా పరీక్షించినా. ఆయన చిత్తశుద్ధి ఆయన ఇతో ధికమైన అభ్యుదయ పరంపరను సూచించింది. అయితే తన వంగ రాష్ట్రంలో ఆయన యశస్సు సువ్యాప్తం కాలేదు; రాష్ట్రసీమలుదాటి ఆయనకీర్తి పాకిపోలేదు.

## 20 వ శతాబ్ది

ఇరవయ్యో శతాబ్ది – వంగసాహిత్యములో, రవీంద్రనాథుని 'నైవేద్య 'మనే భక్తి రసాత్మకకావ్యంతో, ఆరంభమైంది. ఈ కావ్యం పద్యశత సముచ్చయం. ఈశ్వరానుభూతిగల కవిచైతన్యము, నిత్య జీవిత విధానములోని పవిత్రత, రెండువిధాల దురదృష్టదశలో ఉన్న మాతృభూమియెడ కర్తవ్యం, (దంభంగల వైదేశిక విజేతుల చేతుల్లోనూ శ్రద్ధారహితులూ అజ్ఞానులైన పుత్రులవల్లా, దేశమాత అదృష్టహీన) కావ్యంలో విషయాలు. నిజంగా నైవేద్యము గొప్పకావ్యం. భారతజాతికి మానవలోకానికి, ఆయన అర్పించిన కానుకల్లో అత్యుత్తమమైనది. ఈ గ్రంథంలో [1] స్వదేశాభిమానంతో విఱ్ఱవీగి, విదేశద్వేషంగల పాశ్చాత్య నాగరికతకు భావిపతనము కవీంద్రుడు భావించివాడు. ఆ కావ్యము తర్వాత రచించిన కావ్యాలవల్లనే ఆయనకు 1913 లో ప్రపంచఖ్యాతి వచ్చినది

1905 లో లార్డుకర్జన్ రాజప్రతినిధిగా ఉండగా వంగరాష్ట్ర విభ జన జరిగింది. వంగవాసులు దృఢంగా నిలిచినారు. ఏ మాత్రం లొంగి పోక ఆ ప్రబల ప్రతిరోధంలోని ఆధ్యాత్మికత, రవీంద్రునిలో సముజ్జ్వ లంగా ప్రతిఫలించింది. ఆ కవీంద్రుని గేయాలు, ఉపన్యాసాలు, ఇది

---

1 పద్యంలో చివరపంక్తులు ఇలా నడుస్తాయి. తిలకించండి జాతీయతను: మి తిదెసదుడుకుగా పరిక్రమిస్తున్నది. శిలలు మునిగిన సంద్రపుదెస; స్వార్థాధిక్యమనే నరకు భారంతో

వరకు ఎవ్వరూలేని అపూర్వరీతిలో వంగప్రజను ఆవేశపూరితం చేసినవి. ఆయన జాతీయజీవితంలో ప్రతి అంశంలో స్వయం సహాయాన్ని గురించి ప్రబోధించినాడు. అయితే బ్రిటీషువారిమీద ద్వేషాన్ని రగులుకొలిపే ఒక్క పదముకూడా ఆయన ప్రయోగించలేదు. ఆ గేయాల్లో ఉపన్యాసాల్లో ఇప్పటికీ రుచిపోలేదు. కేవలము దేశభక్తివల్ల ఉత్తేజితుడై రచించిన గేయాలు కాకపోవడమే అందుకు కారణం. దేశభక్తి, భగవదాకారా కారితమైన దివ్య చైతన్యోద్దీపనంవల్ల గేయకవిత ఆయనలో పొంగులెత్తింది ఇతర మహాశిల్పులవలె రవీంద్రుడుకూడా స్త్రీ పురుష పాత్రలు కమనీయంగా స్మరణీయంగా చిత్రించినాడు. కాని ఆయన రచనా పరంపరలో ఉత్కృష్టమైన గుణం ఘనంగా తన ఆత్మీయతను ద్యోతకంచేసి కృతకృత్యుడౌటయే ఆది సత్యంవల్లనూ, జీవనానందం వల్లనూ, ఉత్తేజము పొందిన సాత్త్వికకోమల చైతన్యము నిరంతరం అద్భుతంగా విస్తృతమైన ఆత్మీయత.

వంగదేశ విభజనవల్ల వ్యాప్తమైన విదేశవస్త్ర బహిష్కరణం, స్వదేశీ ఉద్యమాలూ, రవీంద్రుని హృదయతంత్రుల్ని ఆనందస్థాయిలో మేళవించలేక పోయినవి. పైగా ఆ ఉద్యమాలు భయానక రౌద్ర విప్లవానికి దారితీయడంవల్ల ఆయన దాన్ని ఆమోదించలేక పోయినాడు. అందుచేత ఆ ఉద్యమంలో తనకున్న సంబంధం సహజంగా తెగిపోయింది. ఈ మహా విపత్తువల్ల ఆయన హృదయం చాలా బాధపడింది. అయితే ఆయనలో పారమార్థికంగా చైతన్య స్పందనం గాఢమైంది. స్వదేశీ ఉద్యమంలో సన్నిహిత సంబంధం ఏర్పడి నప్పటినుంచీ, ఆయనలో హైందవ జాతీయత సుశిశాల మవుతూ వచ్చింది. అధికార నియంత్రిత ప్రకృతీ, ధర్మపరం మన్యత్వములు ఎంత అమాయికంగా గాని సమర్థనీయాలుగాని కన బడినా వాటి ఫలితం ఎంత నిమ్నశ్రేణిదో గ్రహించడానికి ఆయనకు ఎక్కువ కాలంపట్టలేదు. బాధమూలంగా పూర్ణపారిశుద్ధ్యము ఫలించింది. ఆయన జాతీయతకు ఇకనుంచీ అంతర్జాతీయత పర్యాయపదమైంది. సహజంగా రవీంద్రుణ్ణి లోకము అపార్థము చేసుకొన్నది. నిజమైన జాతీయ మహాకాంక్షలకు అంతర్జాతీయ భావము విరుద్ధముకాదు. అదే సరియైన

న్యాయసమ్మతమైన వారు ఆధారపడ దగినది. ఈ అంతర్జాతీయ భావము భగవద్విశ్వాసంవల్ల కలగక తప్పలేదు. ఆయన కొన్ని సంవత్సరాల తరువాత జపాన్, అమెరికా ఖండాంతరాల్లో జాతీయతను గూర్చి మహోపన్యాసాలు చేసినప్పుడు, ఈ విషయంలో ఆయన గాఢ విశ్వాసాన్ని లోకము గ్రహించింది. ఆయన తత్కాలానికి సంబంధించిన విచిత్రమైన సంకటాలుచూచి, పొరపాటుపడని యథార్థ హృదయం కలవాడని, అనంతర ప్రపంచ సంఘటనలవల్ల ఋజువైంది.

ఇరవయ్యో శతాబ్దారంభానికి అప్పటి కప్పుడే రవీంద్రుడు కవి శేఖరుడై సారముగల సాహిత్యగ్రంథాలు పరశ్శతంగా రచించాడు. అయితే ఆయన యశస్సు విశాలంగా వ్యాప్తముకాలేదు. ఆయన అసాధారణ కవితా రామణీయకానికి ముగ్ధులైన స్నిగ్ధులు అమయాయులు కొందరుండేవారు. రవీంద్రుడు స్వదేశీ ఉద్యమంలో పాల్గొడంవల్ల ఆయనపేరు ప్రసిద్ధమైనది; ఆయన ప్రతిభ విశేషంగా గుర్తించిన సాహితీపరులు చాలమంది ఏర్పడినారు. భౌతికంగా మసంపన్నము కాని వంగదేశ జీవనము శాంతంగా గోచరించడంవల్ల అధ్యాత్మికంగా ఆదర్శప్రాయమైనట్లు ఆ సాహితీపరులు చిత్రించారు. ఆ రచయితలలో అర్థగౌరవమూలేదు; రసపుష్టి అంతకన్నలేదు. వాళ్ళుకాకపోతే రవీంద్ర కవీంద్రుని కవితా శిల్పానికి నకళ్ళుతీసి పఠన యోగ్యాలయిన కావ్యాలు రచించారు. రవీంద్రుని సమకాలిక కవులలో, దేవేంద్రనాథసేన్ అక్షయకుమార్‌బరల్, ద్విజేంద్రలాలురాయ్ స్మరణీయులు. రవీంద్రుని తర్వాతివారిలో సత్యేంద్రనాథదత్తు ఎక్కువ ప్రసిద్ధుడు. అతడు వంగ భాషను అద్భుతంగా మలచి, ధారావాహికంగా రచన చేయడంలో కౌశలం చూపించినాడు. కరుణానిధాన బెనర్జీ, జతీంద్రనాథసేన్‌గుప్త, మోతిలాల్ మజుందార్‌కూడా, పేరు పొందిన రచయితలే. కరుణానిధానుడు ప్రకృతిని ఉపాసించిన ప్రణయి. ఆయనకు గత కాలమంటే ప్రీతి. యతీంద్రనాథుడు మోతీలాలు, వైజ్ఞానిక నిరాశావాదులు. అప్పటి వారిలో కుముదరంజన మల్లిక్, కాళిదాసరాయ్, అధికంగా ప్రజా మోదము పొందినారు.

కథా రచనాక్షేత్రంలో రవీంద్రుణ్ణి, అదిలో అనుసరించిన వాళ్లల్లో

ప్రభాత్‌కుమారముఖర్జీ రచించిన హాస్యకథలు, ప్రజలు అధికంగా చదివే వారు. చారు చంద్రబెనర్జీ, సౌరీంద్ర మోహన్‌ముఖర్జీలుకూడా కొంత ప్రజామోదము పొందినవారే. రవీంద్రుని మానవవాదంవల్ల, శిల్పం వల్ల, బాగా ప్రభావితుడైన శరచ్చంద్ర చట్టోపాధ్యాయుడు 19 వ శతాబ్ది తుదిలోనే రచన ఆరంబించినాడు. కాని 1913 సంవత్సరానికి ముందు అతడు తన రచనలు ప్రచురించడానికి సమ్మతించలేదు. అయన సాహితీరంగంలో ప్రవేశించగానే అద్భుతంగా విజయధ్వజ మెత్తినాడు. 1938 లో జీవితము చాలించేవరకూ విజయము సాధిస్తూ ఉండెను. ఆయన ఆదిలో శరచ్చం దుడు పాటవముకల వాస్తవికవాది అనే పేరు పొందినాడు. అందువల్ల పాఠకలోకంవల్ల ఆయన బహుళా దరం పొందినాడు. మరియొకవంక వృద్ధులాయన రచనను గట్టిగా దూషింప సాగినారు. వంగసాహిత్య సంప్రదాయంలో వాస్తవికత కొత్త కావడమే దానికి కారణం. కాని కొద్దికాలంలోనే విమర్శకులందరినోళ్ళు కట్టుపడ్డవి. వాళ్ళు శాంతించడానికి కారణం, తమ వాదము లోపభూయిష్ఠమైందని గుర్తించడంవల్ల కాదు. తమ విమర్శలు ఆలకించేవారు లేకపోవడంవల్లనే వారు ఊరుకోక తప్పలేదు. ఏ ఆధునిక వంగ రచయిత, ఆయనవలె అధిక ప్రజామోదము పొందలేదు. బంకిం చంద్ర రవీంద్రులుకూడా అంత లోకప్రీతి పొందలేదు. వ్యతిరేకంగా ఎలుగెత్తే వాళ్ళుంటున్నా, ఇప్పటికీ శరచ్చంద్రుని గ్రంథాలు పాఠకులు విస్తారంగా చదువుతూ ఉంటారు.

శరత్‌బాబు సుమారు అర్థశతాబ్దమైంది వంగ పాఠకలోకాన్ని వశం చేసికొని. ఉద్వేగరహితులమై ఆయననుగురించి ఇప్పుడు ఆకళింపుచేసికోడానికి మనము యుక్తమైనస్థితిలో ఉన్నాము. ఆ రచయితకున్న పరిమితులు మనకు తెలుసును. అయన కాల్పనిక భావనాశక్తిగల సంపన్నమతిమంతుడు కాడు. ఆయనకున్న అభినివేశాలుకూడా అంతగా విపులమైనవికావు. ఆయన తరుచుగా వాస్తవికతకు విరుద్ధంగా రస భావోద్వేగము ప్రకటిస్తాడు. ఇలాంటి తీవ్రమైన లోపాలున్నప్పటికీ. శరత్‌బాబుకున్న ప్రజామోదంకానీ, విశిష్టతకానీ, బహుళః ఎన్నటికీ తరిగిపోదు. దానికి కారణమిది. ఆయన రకరకాలుగా బాధపడ్డాడు

స్వయంగా లేదా ఆరోపించుకొన్నాడు. ఈ బాధ బాగా చిత్రించాడు. మంచి రచయితలకు ఉండవలసిన వాస్తవికత ఇదే. ఆయన ఉన్నత స్థాయిలో ఆదర్శవాదికూడాను. ఆయన హృదయాంతరంలో ఒకానొక విశ్వాసం ఉన్నది. మానవుడు సహజంగా అందమైనవాడు, గొప్పవాడు. అతనిదోషాలూ, పాపాలూ, పరాజయాలూ, బాహిరమయిన దూళి వంటివి. క్షణంలో ధూళినిదులిపితే, మానవుడు స్వీయతేజస్సుతో, యథాస్థితిలో ఉంటాడు.

శరచ్చంద్రుని ఈ దృక్పదం బావతన్మయశావాదంగా కొందరు తలచవచ్చును. కాని అది ద్రఢిమవల్ల సముద్భూతమైంది. అది ఆయన విశ్వాసము: అది మానవునిలో సతతమూ ఉండే వస్తువు; అయితే దుష్టవిశ్వాసాలూ సిద్ధాంతాలూ లేకపోలేదు; అయితే మంచివైనా చెడువయినా వాటిని గణించక తప్పదు. అదృష్టవశాన శరత్‌బాబు విశ్వాసం గొప్పదే. ఆయన రచనాశిల్పం అంత బాగా ఉండడానికి కారణం అదిఉదాత్త విశ్వాసంతో సంఘటితమైంది, కావడమే. అతని దౌర్బల్యం లెక్కకురాదు. సాహిత్యంలో విలువను నిర్ణయించేందుకు దోషాలకన్న సద్గుణాలే మిన్నలు.

శరచ్చంద్రుని అవతరణానంతరం కొన్నేళ్ళకు, వంగ పాఠక లోకానికి మరొక వాస్తవికుడు లభ్యమైనాడు. ఆయన డాక్టర్ నరేశ చంద్రసేన్‌గుప్త, మహా ధర్మ శాస్త్రవేత్తకూడాను. ఆయనకూ బహుళ పాఠకలోకం ఉండేది. అయితే ఆయనమీద జనప్రీతి తగ్గింది. నవలల్లో వివిధ విషయాలుండడంచేత ప్రజాదృష్టిని ఆకర్షించినాడు. ఆయన సృష్టిచేసిన పాత్రలు చాలవరకు భావప్రతీకలు. అందుచేత వాటి రూపురేఖలు త్వరలో మాసిపోయినవి.

1919లో రసభావోద్రేక పూరిత కథానికా రచయితగా, కాజీనజ్‌రుల్ ఇస్లాం కలకత్తాలో సారస్వత క్షేత్రంలో ప్రవేశించినాడు. అప్పటికి ఆయన కేవలం ఇరవయ్యేళ్ళ యువకుడు. ఆయన పండితుణ్ణని ఏమీ నటనచేయలేదు. కాని ఆయన కథానికలు ముఖ్యంగా యువపాఠకుల్నీ, రచయితల్నీ ఆకర్షించినవి. ఆ కథాకారుని రచనలోని మహోల్లాసము, యువకుల్నీ, వృద్ధుల్నీకూడా ఆకర్షించింది. అది రాజకీయాసక్తి, అనగా

ఖిలాఫత్, కాంగ్రెస్ ఉద్యమాలవల్ల, జనానీకానికిఉన్న కాలం. నజ్రుల్ ఉత్సాహపరవశుడైనది, ముఖ్యంగా వంగదేశంలో స్వదేశీ ఉద్యమం వల్లనూ, హింసావాదుల సాహస కార్యాలవల్లనూ, ఆయనకు అద్భుతావేశం కలిగింది; ఆయన మనసుకు ఉద్యమము రుచించింది. నవ్య వాతావరణంవల్ల ఆ కవి భావన ఉత్తేజితంకాగా వీరగీతాలు, కావ్యాలూ, రచించి వెంటనే జనామోదము పొందినాడు. రెండేళ్ళు గడిచాక 'విద్రోహి' అనే విఖ్యాత కావ్యరచనచేసి, హఠాత్తుగా వంగదేశంలోనేకాక, యావద్భారతదేశ వ్యాప్తమైన యశస్సు గడించినాడు. కావ్యరచనలవల్ల ఆయనకు కారాగారవాసం ప్రాప్తమైంది. అక్కడ మండలం రోజులు నిరాహారదీక్ష సాగించిన శూరుడు ఆ కవి!

స్వేచ్ఛాసమరంలో ఆయన ప్రబల శక్తిగాఉన్నాడు. ఆయన ప్రధానాయుధాలు కావ్యాలూ, గేయాలున్నూ, హింస, అన్యాయం ఏ రూపంలోఉన్నా ఆయన గర్హించినాడు; ప్రజాకవిగా ప్రముఖుడైనాడు. గజల్వంటి ప్రణయగేయాలు, ఆధ్యాత్మిక గేయాలుకూడా రచన చేసినాడు. పరిమితంగా నవలలూ, నాటకాలూ, ఆయన లేఖిని నుంచి ఉద్భవించినవి. ఐనా ఆయన కీర్తి కావ్యాలవల్లా, గేయాలవల్లనే సుప్రతిష్ఠితమైంది.

నజ్రుల్ ప్రజామోదం ఉచ్చస్థాయిలో పొందుతున్నప్పుడు, ఆయన కవితలో గుణాలను కొందరు విమర్శకులు తూర్పార పట్టినారు. ఇప్పటికీ అలాంటి తీవ్రవిమర్శ ఉండనేఉంది. ఆ కావ్యరచనలో లోపాలు లేక పోలేదు. తరుచుగా అపరిణతి కావ్యాల్లో ప్రకటిత మవుతూ ఉంటుంది. పదప్రయోగ కౌశలం లేకపోవడంవల్ల, ఆయన భావం గాఢంగా హత్తుకోదు. ఇలాంటి లోపాలున్నప్పటికీ, గొప్పగుణాల్లో మనము గమనించ వలసినవి రెండు. ఆయన నిర్భయమైనవాడు. మనచుట్టూఉన్న పతిత మానవాళిలో కవి అంతులేని విశ్వాసము కలవాడు. ఆ కావ్యాల్లో ఆయన దౌర్బల్యం ముద్రితమైతే, ఆ కవితా ఖండాల్లోనే ఆ మహాత్ముని అపూర్వ భావనాద్యుతులుకూడా గోచరిస్తవి. చికిత్సలేని రుజాపీడితుడై నజ్రుల్ పదిహేనేళ్ళనుంచి మృతప్రాయుడై ఉన్నాడు. అయితే ఏటేటా తూర్పు పశ్చిమ వంగ సీమల్లో, అసంఖ్యాక స్త్రీ పురు

మలు ఆ కవిని ఆదరార్ద్రచిత్తులై, స్మరిస్తూ ఉంటారు. వాల్టు విట్‌మనలాగ, నజ్రూల్ కేవలం ప్రజాకవి ప్రజాతంత్రకవి. ఆ కవీంద్రుని లో పొంగులెత్తే తుంగతరంగ రసభావాలు, ప్రజలు అవగాహన చేసికొన్నారు. ఆయన కావ్యాలు ప్రజలసొత్తు కావడంచేత మన దేశీయులు ఉన్నతిచెందినకొద్దీ చెమ్మగిల్లిన నయనాలతో ఈ కవిని స్మరిస్తారు.

నజ్రుల్ ఇస్లామ్ తరువాత, కవిగా విశేష ప్రతిష్ఠ గడించినవాడు జాసిముద్దీన. ఆయన గ్రామీణకవి కూడాను. వంగసారస్వతంలో జానపద సాహిత్యం సుసంపన్నం. జానపదసాహితివల్ల ఈ కవికి భావోద్దీపనం కలిగింది. బ్రిటిషుశకానికి పూర్వం ఉన్న వంగసాహిత్యంలో కూడా వంగీయ ముసల్మానులు కొంత సాహిత్యకృషి చేశారు. 17 శతాబ్దినాటి దౌలత్‌కాజీ అలౌల్ కవులనుగూర్చి లోగడ చెప్పినాము. ప్రసిద్ధ ముసల్మాన కవులు మరికొందరుండేవారు. బావుల్ కవులలో ముసల్మానులు బహుశః అగ్రేసరులు. ముసల్మాను ప్రభువులూ, జమీనదారులూ, బెంగాలీ సాహిత్యాన్ని అధికంగా పోషించారు. వారి దేశభాషాపోషణమే ఆయుగలక్షణంగా కొందరు తలచినారు. దానికి కారణం 'ప్రజలభాష' అభ్యసించడానికి బ్రాహ్మణులకుండిన ఏవగింపే. అయితే 19 వ శతాబ్దిలో ఉద్భవమయిన మన సాహిత్యంలో ముసల్మానుల కృషి అంత కనబడదు. ఆ శతాబ్దిలో అగ్రేసరులైన సాహితీపరులలో ముసల్మానుసంఘమునుంచి వచ్చినవారు లేరు. ఈ వైపరీత్యాన్ని ఇలా సమర్థించవచ్చును. సోదర కూటానికి నూతన కాలంలో నవ్యనాయకత్వము కావలసివచ్చింది. అయితే దురదృష్ట వశాన అట్టిది లభించలేదు. దానికి వ్యతిరేకంగా వహాబీసిద్ధాంతం తన 'ఇస్లాంయొక్క పనాతనస్వచ్ఛత సంపాదించాలి' అనే నినాదంతో జాగరూకులయిన కొందరిదృష్టిని రాజకీయ కారణాలవల్ల ప్రబలంగా ఆకర్షించింది. తత్ఫలితంగా భారతీయ ముసల్మానులు ఆంగ్లవిద్యకు అర్ధశతాబ్దంపాటు దూరస్థులైనారు. వారిలో చాలామంది 1857 లో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో. బ్రిటిషు సమరభాటిని సాయుధంగా ఎదుర్కొన్నారు. ముసల్మానుసంఘానికి వినాశము వచ్చింది. ఆ నాటి నాయకులు వంగదేశంలోని నవాబ్ అబ్దుల్ లతీఫ్‌ఖాన్‌బహద్దర్, ఉత్తర

ప్రదేశంలోని పర్‌పయ్యద్ అహ్మదులు ఈ విపత్తుగుర్తించి, ఆంగ్లవిద్య ముసల్మానులకు ఆవశ్యకమని ప్రబోధించి, వారి ఆదాయవృద్ధి మార్గాలు చూపకలిగినారు. అయితే అత్యావశ్యకమైన వైజ్ఞానిక ఆధ్యాత్మిక పునర్వ్యవస్థీకరణంమాత్రం చేయలేక పోయారు. వంగరాష్ట్రీయ ముసల్మానులు ఆవశ్యకమైన పునర్వ్యవస్థీకరణకై గుణపాఠాలు, ప్రాపంచిక సంఘటనలనుబట్టి, ముఖ్యంగా వంగరాష్ట్రంలో స్వదేశీ ఉద్యమంవల్ల, నేర్చుకోడం మొదలు పెట్టినారు. ఆ ఉద్యమంలో 19 వ శతాబ్దము ఆకర్షణీయమైన ఉజ్జీవనము పొందింది - అందుచేత వంగ దేశీయ ముసల్మానులలో సాహిత్యారాధకులుగా బేగంరోరియా (శ్రీమతి ఆర్. యస్. హుసెయినుసతి) కాజీ ఇమ్దాదుల్ హక్ లత్‌ఫక్ రహమానులు చెప్పకోతగినవారు. ఇరవయ్యోశతాబ్దిలో ప్రథమ దశకంలోనుంచే వచ్చారు వారు అవిరళంగా రచనలు చేయలేదు. కాని రచనా గుణాల వల్ల వారు స్మరణీయులు. వారు మనస్ఫూర్తిగా మానవవాదులు. వారు భావము గాఢంగావ్యక్తము చేయ గలిగినారు.

మేము నజ్రూల్ఇస్లాం విషయము చెప్పినాము. ఆయన అనంతరం కొన్నేళ్లదాకా తూర్పు వంగ రాష్ట్రంలో ఢాకాలో విశ్వవిద్యాలయ సీమలో, ముసల్మాను సాహిత్య సమితి ఏర్పడింది. వారి ప్రధాన సూత్రం 'యోచనాస్వాతంత్ర్యం', వారి సమితి స్థాపనకు ప్రోత్సాహము, తుర్కిలో కమాల్‌పాషా సంస్కరణాలవల్ల, రామమోహనరాయ్, ఆయన అనుయాయులయిన రవీంద్రనాథ. ప్రమథచౌదరీలవల్ల. విఖ్యాత సూఫీలవల్ల, మహమ్మద్ ప్రవక్త వల్లనూ, ఢాకాలో మహమ్మదీయ కళా శాలలోను విశ్వవిద్యాలయంలోను విద్యార్థులకు సమితితో సాంస్కృతిక సంబంధంవల్ల సాహిత్య కృషిజరిగింది. రాష్ట్రమంతటా ఉన్న ముస ల్మానులలో విద్యాధికులు సాహితీ సమితిని ఆదరించారు. కాని కొలది కాలానికి పూర్వాచార పరాయణులైన వాళ్ళు తీవ్రంగా సమితి కృషిని ప్రతిఘటించారు. సమితి తృతీయ వార్షికోత్సవం, తర్వాత ఢాకా విశ్వ విద్యాలయంలోని ముసల్మానుహాలులో సమితి సభలుకూడా నిషేధింప బడినవి. శేషించిన కథ కొద్దికాకపోయినా సులభంగా చెప్పవచ్చును. మత వైషమ్యము తీవ్రమై, భారతదేశ విభజనకు దారి తీసిన రోజులవి.

ముసల్మాను సాహితీసమితి సభ్యులలో కొంతమంది ఉత్సాహంగా గ్రంథ రచనలు ఇంకా సాగిస్తూనే ఉన్నారు.

ఢాకాలో ముసల్మాను హేతువాదులుద్భవించిన సంవత్సరాల్లోనే, కొంత ప్రావీణ్యముగల యువరచయితలు 'అతినవ్యులు' అనే పేరుతో సాక్షాత్కరించారు. ఆ సమితిలో గోకుల్‌నాగ్, ప్రేమేంద్రమిత్ర, జీవనానందదాస్ [1] బుద్ధదేవబోస్, అచింత్యసేన్ గుప్తలు, ప్రముఖులు. ప్రేమేంద్రమిత్ర ఈ అతినవ్యుల సాహిత్య సిద్ధాంతం ఇట్లా సువ్యక్తం చేశాడు :-

'నేను కవిని, కమ్మరులకు కాంస్యకారులకు, దారుకర్మకారులకు, రోజు కూలీలకు పతితులకూ దళితులకూ నేను కవిని'.

బుద్ధదేవబోస్ అచింత్యసేన్ గుప్తలు అప్పట్లో ఫ్రాయిడ్ అనుయాయిలు అనగా మనోవిశ్లేషణ వాదులుగా చెప్పుకొన్నారు. అతరుణ వయస్సులోనే వారు చాలా రచనలుచేసారు. వారు తమ పంథాను గురించి ఘోషించారు. ఈ అతినవ్యుల ధోరణిచూచి రవీంద్రనాథుని మనసు వికలమైంది. వాటితో ఆయన ఘర్షణపడినమీదట ఉభయులూ కారాలు మిరియాలు నూరుకొన్నారు, అయితే సద్యఃఫలితం మాత్రం ఏమీ కలగలేదు, కాని ఔచిత్యమెరిగిన రవీంద్రుడు కావ్యగుణాలు ఎవరిలోఉన్నా మెచ్చుకొని గుర్తించగలవాడు. ఆయన వాదోపవాదాలు అతిగా సాగనీయలేదు. అతడు నవీనంగా రచించిన నవలల్లో కథానికల్లో అతినవ్యులు ఉల్లాసంగా గమనించారు, తమ ప్రభావము రవీంద్రుని మీద ఉన్నదని. అయితే కవీంద్రుడైన రవీంద్రుడు అతినవ్యులకు వారు మురిసిపోయే కవితావస్తువులను ఎంత హృదయంగమంగా పోషించవచ్చునో చూపించ యత్నించినాడు. అతి నవీనులు మాత్రం రవీంద్రకవీంద్రుని సుకుమార రామణీయకానికి చాలా దూరంగా ఉండిపోయినారు.

---

[1] దురదృష్టవశాన త్వరలోనే ఇతని జీవితం సమాప్తమైంది. అతని కావ్య సంపుటి 'శ్రేష్ఠకవితా' అన్నదానికి సాహిత్య అకాడెమీ 1955 లో బహుమతి ఇచ్చింది. —సంపా

అయినా వారిలో కనీసం ముగ్గురుమాత్రం పైకి రాగలిగినారు. జీవనానందదాసుని కవిత్వంలో శాంతమూ, ప్రకృతిలో లీనత, ప్రేమేంద్ర మిత్రరచనలో కాల్పనికభావోద్రేకమూ, బుద్ధదేవబోసులో మధురచైతన్యంగల కవితా ప్రావీణ్యమూ, గోచరిస్తాయి. నవ్యసాహితీ వరులకు మిత్రుడై, స్వభావంలో స్వల్పంగా భిన్నత్వంగల అజిత్‌దత్తు కూడా. యౌవనము, ప్రేమ, ప్రకృతినీ, కావ్యవస్తువులుగా స్వీకరించి చక్కగా కవిత చెప్పినాడు నవ్య కవిత్రయాన్ని అనుసరిస్తూ వచ్చిన సుధీంద్రనాథదత్తు, విష్ణుదేవ, అమియచక్రవర్తి, అనే కవుల్లో సుధీంద్ర దత్తు శబ్దప్రయోగకౌశలంలో, బుద్ధిలోను విశిష్టుడు. ప్రేమేంద్రమిత్రను మినహాయిస్తే, బహుశః అతినవ్యుల సాహిత్యకృషిలో సారము పరిశీలిస్తే, వారికి రవీంద్రునితోగాని మరే వంగీయకవితో సంబంధము అంతగా లేదని విశదమవుతుంది. వారికీ ఆధునికాంగ్ల ఖండాంతర కవులకూ సంబంధము అహంకారంలోనూ, ప్రస్తుత ప్రపంచముచూచి తీవ్రంగా రోతపడడంలోనూ ఉన్నది. వారికీ రవీంద్రునికీ, ప్రధానంగా దృక్పథంలో భేదం ఉన్నది. రవీంద్రుడు భోగవిలాసాలతో దంత హర్మ్యంలో నివాసం చేయకపోయినా, నిరాశావాది కాలేదు ఆయన ముఖ్యంగా నిరహంకారి. ఈ విధానంగా నవ్యవంగసాహిత్యంలో జీవనంలో అతినవ్యుల స్థానము విశదమవుతున్నది. రచనావిధానంలోకూడా వారికి రవీంద్రుడికీ చాలాభేదం. వారి అనుయాయులు ఎక్కువమంది లేరు. భవిష్యత్తులో సాహిత్యక్షేత్రంలో వారి స్థానము ఇదమిత్థమని ప్రస్తుతం చెప్పడం కష్టం. నిస్సందేహంగా వారు శక్తివంతులే, వారికి ప్రధానంగా అహంకారం బాగా వ్యామోహము కలిగిస్తుంది. సహృదయ హృదయామోదము కలిగిస్తాయేమో వారి రచనలు కొంతకాలంపాటు చూడాలి. తరుణకవుల్లో నరేశగుహా, దినేశదాస్, గోవిందచక్రవర్తులు కొంత ఖ్యాతి సంపాదించినారు.

మన అతినవ్యకవులు అధికంగా ఆధునిక జీవనాయాసాన్ని చూపుతారు. అయితే ఎక్కువమంది ఆధునిక నవలారచయితలూ, కథానికా రచయితల విషయంలో, ఆమాట అనడానికి వీలులేదు. ముఖ్యంగా రవీంద్ర శరచ్చంద్రుల సంప్రదాయాలు ఆధునిక వంగ

నవలా కథాకారులు అనుసరిస్తున్నారు. శరచ్చంద్రుని తరువాత విభూతిభూషణ్ బెనర్జీ నవలలూ, కథానికలూ [1]'ఆరణ్యక', 'పథేర్ పాంచాలీ' వంటి రచనలతో వంగనవలా సాహితిని అలంకరించినాడు. 'పథేర్‌పాంచాలీ' నవల వెండితెరమీదికెక్కి, అంతర్జాతీయ ఖ్యాతి ఆర్జించుకొన్నది. విభూతిభూషణ్ ప్రకృతిని ప్రేమించినాడు. ఇప్పుడుపోతున్న అమాయిక కోమల గ్రామీణ జీవితం, నాగరకతా ప్రభావంలేని జీవితం, ఆయనకు ప్రీతి. నవీనుల నవలల్లో జీవితానికీ వ్యక్తికీమధ్య ఏర్పడే ఘర్షణ ఇతివృత్తంగా చిత్రింపబడుతున్నది. ఇలాంటి చిత్రణ విభూతిభూషణుణ్ణి ఆకర్షించలేదు. అందుచేత ఆయనను ఆధునికుల్లో చేర్చడానికి వీలులేదు. కానీ 'నవ్యతా' ముద్రలేని గొప్పశిల్పి ప్రకృతికీ మానవుడికీ ఉన్న దైనందిన జీవన సన్నిహితత్వమూ, హృదయ మార్దవమూ, అతడుబాగా ప్రదర్శించినాడు.

విభూతిభూషణ బెనర్జీని మినహాయిస్తే శరచ్చంద్రుని తరువాత వచ్చిన నవలాకథానికా రచయితలను మూడు శ్రేణులకింద విభజించవచ్చును మొదటి శ్రేణిలోవారు రవీంద్ర శరచ్చంద్రుల్ని అనుసరిస్తున్నవారు, రెండవశ్రేణిలోవారు కవితారచనలోకూడా అతినవ్యులై, నవలారచనలోనూ అదేస్వభావము చూపకపోలేదు. మూడోశ్రేణిలో వారు వామపక్షీయులు. ప్రథమ శ్రేణిలో ప్రముఖులు—శైలజానంద ముఖర్జీ. ప్రేమేంద్రమిత్ర, మహబూబుల్ ఆలం (చిటగాంగ్‌నివాసి), వనఫూల్, అనందశంకరరాయ్ తారాశంకర్ బంధోపాధ్యాయ, సరోజరాయ చౌధరీ, విభూతిభూషణ్ ముఖోపాధ్యాయ, సుబోధ్‌ఘోష్, నారాయణ్‌గంగోపాధ్యాయ, సతీనాథ్‌బాదురీ, నరేంద్రమిత్ర, ఆశాపూర్ణాదేవి ప్రభృతులు. మణిక్‌బంధోపాధ్యాయకు సంప్రదాయమార్గంలో పేరువచ్చింది. కాని తరువాత ఆయన వామమార్గంలో చేరినాడు. శైలజానంద చక్కని రచనాచాతురి కలవాడు. సంగీయుల విశాల జీవితంలో సన్నిహిత సంబంధం ఉన్నవాడు. ప్రాచీన మానవ కూటాల జీవితము అద్భు

[1] ఈ నవలను సాహిత్యఅకాడెమీ ఎన్నికచేసి ప్రాంతీయ భాషానువాదాలు చేయిస్తున్నది — సంపా.

తంగా చిత్రించాడు. ప్రేమేంద్రమిత్ర నిమ్నజీవులతో గాఢపరిచయము కలవాడు. ఆయన బహుశః అద్భుత సుందరస్వప్నాలు, రానున్న పరిణామాన్నీ భావనచేయడంవల్ల కథానికల్లో సామర్థ్యము గోచరిస్తున్నది. మహబూబ్ ఆలమ్ రచనల్లో ఉత్తమగ్రంథం, మోమెనేర్ జబానబందీ ఒక విశ్వాపి చేసిన దోషాలను అంగీకరించడం కథావస్తువు. జీవితాన్ని రంగుటద్దాల్లోంచి చూడలేదాయన; ఉన్నది ఉన్నట్టుగా ఆలోకించినాడు. ఆయనచేసిన రచనలు కొంచమే. ఆయన ఏ విషయాన్ని తీసుకొన్నా మూలములోకి వెళ్ళవలెనని ఉత్సాహపడతాడు. కథానికల్లో అధికంగా శిల్పచమత్కారము చూపించినాడు. అధునికుల్లో బహుశః అనందశంకర రాయ్ మహాకాంక్షగల నవలాకారుడని చెప్పవచ్చును. ఆరుభాగాల్లో పెద్ద నవల రచించినాడు. అట్లే అతి విస్తృతకం మరొక నవల అరంభించినాడు.ఆయన రచనల్లో ఉత్తమమైనది, 'మోన్‌పబన్' అనే కథానికా సముచ్చయం. అందులో మనోజ్ఞమై, సూక్ష్మమైన, పాత్రోన్మీలనం గోచరిస్తుంది. నవీన నవలా నిర్మాతల్లో బహుజనామోదము పొందగలిగినాడు, తారాశంకర్ బంద్యోపాధ్యాయ. ఆయన ప్రాంతీయ జీవితాన్ని విస్తృతంగా చిత్రించి కృతకృత్యుడు కాగలిగినాడు. అయనకు వచ్చిన జనప్రీతికి కారణం ఛాయాచిత్రంలాగ రచనా శిల్పము కానరావడం. ఇటీవల పాత్రోన్మీలనం సూక్ష్మంగా చేస్తున్నాడు. సరోజరాయ్‌చౌదరి ఫార్‌సిట్ భాగావలె కుటుంబచరిత్రను కథావస్తువుగా స్వీకరించి నవలా రచనచేసినాడు. విభూతిభూషణ్ ముఖోపాధ్యాయ మంచి హాస్య రచయిత సుబోధఘోష్ విలక్షణంగా పాత్ర సృష్టి చేయగలడు నారాయణ గంగోపాధ్యాయ బాధిత మానవ జీవితాన్ని కళ్ళకు కట్టినట్టు చిత్రిస్తాడు సతీనాథ్ బహాదురి మానసిక స్వభావ విశ్లేషణం చేస్తాడు. నరేంద్రమిత్ర దైనందిన వంగజీవితాన్ని ప్రేమతో సానుభూతితో ఆలోకిస్తాడు. ఆశాపూర్ణాదేవి అతి సూక్ష్మంగా జీవిత వక్రోక్తిని పరిశీలించి ప్రధానంగా వంగీయుల మధ్యమ వర్గమును చిత్రిస్తున్నది. రచనలో ఏకాంత ప్రీతిగల స్త్రీహృదయాన్ని, హేయమైనదాన్ని గర్హించి నిర్లిప్తంగాఉండే వనితాహృదయాన్ని, చూపడం ఆమెకు ప్రీతి. కాల్పనికభావవాదులలో ప్రేమేంద్రమిత్ర, బుద్ధదేవబోస్,

అచింత్యసేణగుప్త, మనీంద్రలాల్‌బోస్. మనోజబోస్, ప్రబోధకుమార సన్యాల్ ప్రముఖవ్యక్తులు. వారిలో ప్రేమేంద్రమిత్ర ముఖ్యంగా కథానికా రచయితగా అరితేరినాడు. రవీంద్ర శరచ్చంద్రుల అనంతరం కథారచనలో బహుశః అయననే దిట్ట అని చెప్పవచ్చును. ఆపిమ్‌రాయ్ కాల్పనిక భావోద్రేక రచనలో యువకుడు, వర్ధిష్ణువు.

మణిక్‌బంద్యోపాధ్యాయ వామపక్షీయులకు నాయకుడు. 'పుతుల్ నచేర్ ఇతి కథా' అనే నవలవల్ల, ఆయన యశస్సు సంపాదించినాడు; అందులో రచనాశిల్పం చూపించినాడు. జీవిత దృక్పథంలో భ్రమా రహితుడు. అయినా ఆయన స్త్రీపురుష పాత్రలు ప్రేమిస్తారు; అందులో ఒక రకమైన సిద్ధి పొందుతారు. వామపక్షంలోచేరి చేసిన రచనల్లో ఆయన ఉన్నతి చేరుకొన్నట్టు కనబడదు. అయితే ఆయనకున్న విషాదము మరింత విశదంగా కానవస్తున్నది. మన వామ పక్షీయులు నవలా రచనలో సిద్ధహస్తులు కాలేక పోయినారు. మణిక్‌బంద్యోపాధ్యాయ అనంతరం అమరేంద్రఘోషను చెప్పాలి. ఆయన రచన 'చార్‌కషమ్' మన కాలంలో చెప్పుకోతగ్గ రచన. అది ఐరోపీయ సాహిత్యంలోని 'Growth of the Soil' అన్న రచనకు ప్రతి. ఘోషను వామ పక్షీయుడని అనడంకన్న మానవవాది అని చెప్పాలి. అలాగే మరి కొందరు యువకులు వామపక్షీయులున్నారు. వారికి ప్రస్తుత జీవితంతో సన్నిహిత పరిచయం ఉన్నట్టున్నది. వారిలో సమరేష్‌బసు. గోలం కుద్దున్ చెప్పుకోతగ్గ రచయితలు, గోపాల్‌హల్దారు నవలాత్రయం 'ఏకదా' 'అన్యదిన్' 'అపుర్‌ఏక్‌దిన్' – ప్రధానంగా భావసంపన్నం; అని వామపక్షీయ రచనలలో చెప్పుకోతగినవి.

ఇంతవరకూ పద్యకావ్యరచనలోకూడా సిద్ధహస్తులైన వామ పక్షీయులులేరు. కాకపోతే తరుణవయస్సులో చనిపోయిన సుకాన్త భట్టాచార్యుణ్ణి కవిగా ఎన్నికచేయవచ్చును. ఆయనను వామమార్గంలో వాడని అనడంకన్న అధికంగా మానవవాదిగా చెప్పాలి. మన వామ మార్గీయుల్లో యువకవుల్లో సుభాష్‌ముఖర్జీ, మణీంద్రరాయ్, పూర్ణేందు పత్రులను, ప్రత్యేకించాలి; సాహిత్యకృషిలో చిత్తశుద్ధి కలిగినవారు; వృద్ధిలోకి రాగలవారు.

ఆధునిక సాహిత్యంలో విశిష్టరీతుల్లో సారస్వత వ్యాసంగంచేసిన రచయిత్రులపేర్లు గమనార్హాలు స్వర్ణకుమారీదేవి, గిరీంద్రమోహినీదేవి, మిస్ కుమారీదేవి, కామినీరాయ్, ప్రియంవదాదేవి, రోకియాబేగం, నిరుపమాదేవి, అన్నపూర్ణాదేవి, సీతాదేవి, శాంతాదేవి, లీలామజుందార్, మైత్రేయీదేవి, ప్రతిభాబోస్, బేగం సూఫియాకమాల్, ప్రభావతీదేవి, బేగంషాంస్ ఉన్నహర్, మహమ్మద్ ఖతూన్‌సిద్దికీ, రాధారాణీదేవి, ఆశా పూర్ణాదేవి, వాణీరాయి ప్రభృతులు.

మన బాలసాహిత్యంకూడా ప్రత్యేకంగా పేర్కొనతగింది రామాయణం, మహాభారతాలకు వలె మన ప్రాచీన జానపదసాహిత్యాలకూ పసివాళ్ళను ఆకర్షించగల లక్షణాలున్నవి. ఆధునికుల చేతుల్లో ప్రాచీన గ్రంథాలు విశేషంగా రూపొందినవి. శిశువునుగురించి రవీంద్రుడు రచించినపద్యాలు ప్రపంచ ప్రశంస పొందినవి అయన తరువాత భారతీయశిల్ప సముత్తేజానికి అగ్రేసరుడైన అవనీంద్రనాథ ఠాకూరు, దక్షిణరంజన్ మిత్రమజుందారు, ఉపేంద్ర కిశోర్‌రాయ్‌చౌదరీ యోగీంద్రనాథవసు, సుకుమారరాయ్, సుఖలతారావు, సుధీంద్రల్‌వసువులు పేర్కొన తగినవారు.

కావ్య నవలారచనలలో ఆధునిక వంగసాహిత్యము సుసంపన్నంగా ఉందని మనము తెలిసికొన్నాము. కాని దురదృష్టవశాత్తు నాటకము ఉన్నతస్థాయిని అందుకోలేదు. దీన బంధుమిత్ర కృత 'నీల దర్పణము' లో 1860 లో రూపక రచన బాగా ఆరంభమైంది. అయితే భావోద్వేగాన్ని విశృంఖలంగా రెచ్చగొట్టే నాటకాలు అభ్యుదయమార్గానికి అడ్డువచ్చినవి. ఆ అవరోధము తొలగలేదు. గిరీశచంద్రఘోషు, ద్విజేంద్రలాల్‌రాయ్ అనేవారు ప్రఖ్యాత నాటకకర్తలు. వారి నాటకాలు ఉద్వేగపూరితాలు. రవీంద్రుని రూపకాలు ప్రత్యేకమయిన కోవలోవి. చాలవరకు అవి సాహిత్యాలంకారాలు. అయితే కొన్నింటిని మినహాయిస్తే అవి ప్రజానాటకాలస్థానాన్ని పొందలేవు.

వ్యాసరచనలో వంగభాష ఉన్నత స్థాయిని చేరుకొన్నది. రవీంద్ర ప్రమథ చౌదరీలు వ్యాసరచనా క్షేత్రంలో ప్రముఖులు. ఇంకా ప్రసిద్ధులైన రచయితలు, భూదేవముఖోపాధ్యాయ, విపినచంద్రపాల్,

రామేంద్రసుందర త్రివేది, శశాంకమోహన్‌సేన్, మోతీలాల్ మజుందార్, అతుల్‌చంద్రగుప్త, ధూర్జటీ ప్రసాద ముఖోపాధ్యాయ, గోపాల హల్దార్, ఆనందశంకరరాయ్, హుమయూన్ కబీర్, శ్రీకుమార్ బెనర్జీ. ప్రమదనాథబిశీ, అబుసయ్యద్ అయుబ్, బుద్ధదేవబోస్, ఖాజీమోతహార్ హుసేన్, సంజయభట్టాచార్య, సయ్యద్ మోతిహార్, హుసేన్‌చౌదరీ, శివ నారాయణరే ప్రభృతులు. జీవిత కధారచయితలు బాగా రాసినవా రున్నారు. కాని వారి సంఖ్య తక్కువ. సుకుమార సాహిత్యకులుగా జబర్‌సయ్యద్, ముస్తబాఅలీలు అనే ఆధునికు లిద్దరు అధికజనా మోదము పొందినారు. విఖ్యాత హాస్యరచయితగా పరశురాం, ఒక ప్రత్యేకమయిన కోవ ఏర్పరచు కొన్నాడు

డాక్టర్ దినేశ్‌చంద్రసేన్, డా. సుకుమారసేన్, సజనీకాంతదాస్, సాహిత్య చరిత్రకారులుగా ఖ్యాతిగడించినవారు డా. సునీతికుమార ఛటర్జీ, డా. మహమ్మద్ షహీదుల్లా మనవంగశబ్ద శాస్త్రకారులలో ప్రసిద్ధులు.

ఆచార్య క్షితిమోహన్‌సేన్, రేజౌల్‌కరీములు హిందూ ముసల్మాను మహాసంస్కృతీ సమన్వయ కారులు.

ఆధునిక వంగసాహిత్యంలో మతగ్రంధాలు విశిష్టంగా ఉన్నవి. ప్రసిద్ధులు కొందరిపేర్లు–మహర్షి దేవేంద్రనాథఠాకూరు, బ్రహ్మానంద కేశవచంద్రసేన్, అశ్వినీకుమారదత్తు, రవీంద్రనాథ ఠాకూరులు.

అనువాద సాహిత్యం మనకు బాగాస్వల్పం. ప్రపంచ ఖ్యాతిగల మహాగ్రంధానువాదాలు మనకు తక్కువగా ఉన్నవి. కాని ఇటీవల యువరచయితలు కొందరు సాహిత్యానువాదానికి ప్రబలంగా పూను కొన్నారు. రవీంద్రుడు తన జీవిత పశ్చిమార్థంలో వచనరచనచేసి వంగభాషావికాసం అధికంగా సమకూర్చినారు. ప్రతిక్షేత్రంలో వచన రచనకు యువకులకు మార్గదర్శకంగా, సహాయకారిగా, పూర్వాలు నిక్షేపించిన పొత్తున్నది. సాహిత్యమేకాక దర్శనాలూ, ఇతిహాస గ్రంథాలూ పరిమితంగా ఉన్నవి.

ఇటీవలనే కొంత ఆలస్యంగా సామాజిక విజ్ఞానశాస్త్రీయ గ్రంధ రచనలు ఆరంభమైనవి. యువరచయితలు కొంతమంది తీవ్రంగా పూను

కొన్నారు వైజ్ఞానిక రచనలకు. పారస్వతాభివృద్ధికి దోహదంగా పఠనాలయాలు, గ్రంథాలయాలు అధికంగా స్థాపితమవుతున్నవి.

విశ్వకోశమనే ప్రాచీనమైన సౌష్ఠవ విజ్ఞానకోశము మాకున్నది. నూతనంగా విజ్ఞానకోశములు రావలసి ఉన్నవి. ఇవి చాలా అవసరము. మంచి పదకోశాలు మాకున్నవి.

తూర్పుపాకిస్తాను వంగీయులలో, దేశభక్తులూ, యోచనా పరులయిన యువరచయితలు పురోగమిస్తున్నారు. ఇది చెప్పకోతగ్గ విశేషం. వారంతా పహాబీయ పరిస్థితికి బాగాదూరమైనారు. శాంతి, మంచిపరిపాలనంవల్ల కలిగే ఉద్దీప్తితో, భవిష్యత్తులో సాహిత్య క్షేత్రంలో, నూత్న ఔన్నత్యాన్ని అందుకోగలరని ఆశించవచ్చును.

## ఆకర గ్రంధజాతము

(అంగ్లంలోఉన్న కొన్ని ముఖ్యమైన గ్రంథాలే ఇవ్వబడినవి. పమగ్రంగా అకర గ్రంధజాతాన్ని తెలుసుకోడానికి డాక్టర్ సుకుమార సేన్ కృత వంగసాహిత్య చరిత్రను చూడవలె. దానిని సాహిత్య అకాడెమీ త్వరలో ప్రచురిస్తున్నది.)

1. 'The origin and development of the Bengali Language.'
   *By Dr. Sunitikumar Chetterji.*
2. 'History of Bengali Language'
   *by Dr. Dinesh Chandra Sen*
3. 'Vaishnava Lyrics' Translated into English
   *by Surendra nath Kumar, Nandalal Datta and J. A. Chapman.*
4. 'History of Bengali literature' in the 19th Century, 1800 - 1825
   *by Dr. S. K. De.*
5. 'Eastern Bengali Ballads'-Calcutta university.
6. 'Bengali Literature.'

*by A. S. Roy and Lila Ray.*
7. 'History of the Bengali Drama.'
*by Dr. P. G. Guha Thakurta*
8. 'History of Bengali Literature.'
*by Dr. Sukumar Sen*
9. 'An Acre of Green Grass.'
*by Buddha Deva Bose*
10. 'Linguistic Survey of India.'
*by G. A. Grierson Vol V, Part I, pp. 1–391*

# మహారాష్ట్ర సాహిత్యము

యం. వి. రాజాధ్యక్ష

## ఉపోద్ఘాతము

రమారమి వేయి సంవత్సరాల నాటిది మహారాష్ట్రభాష. మహారాష్ట్ర సాహిత్యము తరువాత రెండు వందల సంవత్సరాలకు ప్రారంభమైంది. సామాజికమైన ఆవశ్యక ప్రేరణచే క్రొత్తగా పుట్టిన భాష, సాహితీ సాధనముగా త్వరితగతితో పరిణమించింది. ఒకానొక ఆధ్యాత్మిక ప్రజాతంత్రము, వైఖరీవాక్కు నిమిత్తము తపిస్తూ ఉండేది. దానికి కర్మపరాయణుడైన పూజారి ఉపయోగపడడు. అందుచేత అతని సంస్కృతమున్నూ ఆవశ్యకముకాదు. ఈశ్వరమానవులమధ్య, మానవుడికీ మానవుడికీ అంతరములో, కృత్రిమమైన అవరోధము అది సహించదు. ఒకానొక మహోన్నత భక్త కవి పరంపరగా జ్ఞానేశ్వర (1271 - 1296), నామదేవ (1270 - 1350), ఏకనాథ (1533 - 1599), తుకారాం (1608 - 1649), రామదాస (1608 - 1681) స్వాములు అవతరించి, ప్రజలతో ప్రజాభాషలో పలికినారు; వారు ప్రజలలో జాతీయ భావమును, భాషకు శక్తినీ కలిగించినారు. జ్ఞానేశ్వరుని శైలి సుసంపన్నమైనది. అది ఎంత అప్రయత్నంగా కనిపించినా పడబోసిన వైదుష్యంవల్ల. సృష్టిచేసినట్టిది. తుకారామునిది ఆదేశములో ప్రచరితమయిన నుడికారపుసొంపు కలది; అది భావలాలిత్యమూ ప్రతిఘటననూ ప్రకటించడానికీ, సమానంగా సమర్థమైనది. ఇంతకు పూర్వము పన్నెండు పదమూడు శతాబ్దాలలో ముకుందరాజు, మహానుభావులు అనేవారు, సనాతన వైదిక సంప్రదాయం వ్యతిరేకులు, ఆత్మవిశ్వాసముతో భాష ప్రయోగించినారు.

అయితే మతేతరమైన ప్రేరణకూడా బహుకాలం అణగివుండడం సాధ్యంకాదు. పురాణ పునః కథనంలో ఆప్రేరణ వ్యక్తమైంది. అందుకు దృష్టాంతంగా ఏకనాథుడు రామాయణ భాగవతాలను ఉద్బోధనకు ఉపయోగించుకోవడం. ఆయనకు పాత్రుడైన ముక్తేశ్వర్ (15 4-1645) ప్రాచీన పురాణాలను అధికంగా సాహిత్యంకోసం వినియోగించినాడు. విశద శబ్దచిత్రాలను సృజించినాడు జాగరూకుడై సంస్కృతాలంకారికులవద్ద నేర్చిన లావణ్యాన్ని అలవరచినాడు. అయినా తప్పని సరిగా మహారాష్ట్రకవితను, సంస్కృత లాక్షణికుల ఆకారప్రాకారము, గట్టిగా పిడికిటపట్టింది. దానికికారణం క్రమంగా రెండు శతాబ్దాలపాటు ఒకరితరువాత ఒకరి చొప్పున పండితకవులు తమ ప్రాచీన లాక్షణిక సంవిధాన శిల్పాడంబరమే కళగా భావించడమే. 17 వ శతాబ్దిలో వామనుడు రఘునాథుడు, 18 వ శతాబ్దిలో మోరోపంతు, విశేష ఖ్యాతులైన విద్వత్కవులు. వారు సామాన్య పాఠకలోకానికి ఉపయోగపడరు. సామాన్యమానవుడు వీరపూజాత్మక భావపూర్ణమైన జానపద దేశీయ కవితనూ, శృంగార రసాత్మకమైన 'లావణి' లను కాంక్షిస్తాడు. ఎలాగయినప్పటికీ భక్తకవి పారంపర్యము, ఈనాటకీ అవిచ్ఛిన్నమై సాగుతూ, అలసిసొలసినవారికి ఆశాశాంతు లొనగూరుస్తున్నది.

వచనము చాలా నెమ్మదిగా పైకివచ్చింది. మహానుభావులు వచనాన్ని వినియోగించుకొన్నారు. అయితే వారు దాన్ని సూత్రప్రమాణ బద్ధముచేసినారు. మహారాష్ట్రీయాస్థానాల్లో కైఫీయతు రచయితలు, దిన చర్య రచయితలు, లేఖారచయితలున్నూ: వ్యవహారంకోసం వచనరచన చేసినారు. కాని 19 వ శతాబ్దిలో ముద్రణయంత్ర సౌలభ్యంవల్ల, నూతనంగాఏర్పడిన ప్రభుత్వవ్యవస్థకూ విద్యావ్యాసంగానికి ఆవశ్యకము కావడంచేత, వచనానికి నూతన ప్రయోజనమూ స్థానమూ వచ్చినవి. అందువల్ల త్వరలోనే పద్యకావ్యములకన్న మిన్నగా, వచన గ్రంథాలు సంఖ్యలో బహుళంగా వచ్చినవి. కొత్తగా అలవరచుకొన్న ఆంగ్లవైదుష్యాన్నే అధికంగా వ్యాప్తిచేయడానికి పత్రికలు స్థాపితమైనాయి. ప్రాచీనతకూ నవ్యప్రభావమునకూ కలిగిన ఘర్షణచేపుట్టిన వాదప్రతివాదాల ప్రచారానికి ఆ పత్రికలు పటుతర సాధనాలైనవి.

జి. హెచ్. దేశముఖ్ (లోకహితవాది), జ్యోతీ రావుపులే వంటి వ్యక్తులు మన, క్షీణప్రాయ సామాజిక వ్యవస్థను చిత్తశుద్ధితో, వచోధారా వాహికంగా విమర్శిస్తూ రచనలు చేసినారు. మహారాష్ట్ర భాషలో 1857 లో మొదటి నవల 'యమునా పర్యటన'ను బాబాపదుమాజీ రచించినాడు. ఆ గ్రంథము సామాజిక సంస్కరణాన్ని ఉద్దేశించింది. కాల్పనిక భావాతిరేకంతో ఆడంబర మాత్రంగా కొన్ని నవలలు సాహిత్య క్షేత్రమును ముంచెత్తినవి. అది కవితా పుష్టిగల సాహిత్యయుగము కాదు. అధికంగా తత్కాల కృషి స్వభావము ఏదో కొంత పద్యరచనా ప్రయత్నాలు మాత్రమే. అయితే అందులోకూడా నిశ్చలమైన ఉపరితలం క్రింద అసంతృప్తి కదిలింది. పాతగడ్డలో నవ్యత వేళ్ళు తన్నుతున్నది.

## 1885 - 1920 కవిత్వము

1885 లో 'కేశవసుత' ప్రకటించిన ప్రథమ కావ్యంతోనూ, హరి నారాయణ ఆప్తే (1864 - 1919) ప్రచురించిన ప్రథమ నవలతోనూ, నూతన సాహిత్య ప్రక్రియలురాగా, ఆధునిక మహారాష్ట్ర సాహిత్యం ఆరంభమైంది. కేశవసుత, ఆప్తేలు నూతన సాహిత్య మార్గదర్శకు లయినారు. ఈ తీరుగా సాహిత్యాభివ్యక్తమైన నవ్యోజ్జీవనమునకు నేపథ్య భూమి శ్లిష్టమైంది. ఆ ఉజ్జీవనంలో ఎన్నో భిన్న స్రవంతులు మిళితమైనవి. పాశ్చాత్య ప్రభావము, ముఖ్యంగా ఆంగ్ల సాహిత్యంలోని కాల్పనిక భావోద్వేగుల ప్రేరణవల్ల ప్రధానంగా ఒకానొక ఉదారదృష్టి, ఐరోపీయ జాతీయతో ద్దీపనమూ ఉన్నది. బ్రిటీమవారి ఆధిపత్యాన్ని, పాశ్చాత్యులందరినీ సహించలేని భావంవల్ల, గతాన్ని, అందులో ముఖ్యంగా గత మహారాష్ట్ర వైభవాన్ని ఉజ్జ్వలంగా కీర్తించడం వంటిది మిళితమైనది. వంగదేశోజ్జీవనంలో అంతగా సంశ్లిష్టము కాకున్న అట్టిదేఐన బ్రహ్మసమాజోద్యమంకూడా, బహుశః మరొక ప్రభావము కావచ్చును.

కేశవసుతుని విప్లవము కేవలము సాహిత్య పరమైందికాదు. అది సాహిత్యరూపరేఖా శబ్ద సంఘటన ప్రయోగాలనుమించి పోయింది. అది ఆత్మాశ్రయత్వము కూర్చడాన్నికూడా మించిపోయింది కేశవసుతుడు

కవిత్వాన్ని ఆందోళనకు ఉపయోగించినాడు. ఆయన కవితను మన జీవితములోని కాలుష్యాన్నిక్షాళనచేసే నిమిత్తం, ప్రబల సాధనంగా వినియోగించినాడు. అంతకంటెకూడా ఏవో అశాంతి రేగి ఉద్భవించిన భావగేయాలు ఆత్మకు అందీ అందకుండ ఆనందాన్ని వ్యక్తము చేస్తాయి. కవులకు కవిగా ఆయన తనతరంలో మహాకవులకు చాలా మందికి ఉత్తేజము కలిగించినాడు. అయితే తన ప్రభావమువల్ల తనను అనుసరించిన ఏ కవి వ్యక్తిత్వాన్నీ, ఆయన సంకుచితమూ, పరిచ్ఛిన్నమూ, చేయలేదు. ఆయన కవితా పద్ధతిని అనుసరించిన ఏ కవినీ సంకుచితుడు కాలేదు. పూజ్యుడగు నారాయణ వామనతిలక్ (1865 - 1919) గృహజీవనములోను ప్రకృతిలోను కలస్నిగ్ధ సౌందర్యమును, విభావానుభావాను భూతితో చిత్రించి వాటిలో పసి వారికిఉండే విశ్వాసంతో, ఆత్మశాంతి కలిగించగల ఒక్కదైవీసంపదను అన్వేషించినాడు. వినాయకుని (1872 – 1904) మానసిక వేదన వ్యక్తిత్వంలోని భిన్నత్వంవల్ల కలిగింది. సంప్రదాయక నీతికి, శరీరేంద్రియ దౌర్బల్యానికీ, అంతరంలో కలిగిన అపశ్రుతివల్ల, దోషము ఆచరిస్తున్నాననే భావం ఏర్పడుతుంది. ఆ భావమును మరుగుపరచాలని ప్రయత్నపూర్వకంగా, తన కవితలో గత వైభవాన్ని లాక్షణిక, భావాతిరేక రూపక ధోరణిలో చిత్రించినాడు. ఇటువంటి అపశ్రుతే, అంత సులభంగా నిశ్చితము కానట్టి రామగణేశ గడకారి (1885 - 1919) - గోవిందరాజకవులిద్దరి నాటకాల్లో కవిత్వంలో ప్రతిబింబించింది. అసంగతద్వయాన్ని సహజీవనం చేయించడానికి ఆకాలపు విద్యావంతుల్లో కొందరు అనుకోకుండా చేసినవిఫల యత్నమున్నూ, వారి రచనల్లో ప్రతిబింబించింది. ఆ ప్రయత్నాలలో ఒకటి అంగర్‌కార్, కేశవసుత వంటి అభ్యుదయవాదులు చేసినదీ, ఇంకొకటి తిలక్, చిపులంకర్ ప్రభృతులవంటి పూర్వోద్ధరణవాదులు చేసినది. గడకారీ సనాతనాచార పరాయణతను దయనీయంగా కడుపు చెక్కలయ్యే హాస్యంతో హేళనచేసినాడు తనవ్యాసాల్లో. రంగంమీద సనాతనాచార నీతినియమాలను వెక్కిరించడానికి ఆయనకు వీలయింది. అతిగా చేయాలి అంగీకారయోగ్యం కావడానికి తనకైనా. అందుచేత భావాతిరేక రూపకము

ఆయన భాషాప్రావీణ్యంవల్ల అధికంగా ఉద్దీప్తమైంది. నాటకకర్తగా కవిగానూ గడకారికి వచ్చిన ఖ్యాతికి మూలకారణం ఈ భావాతిరేక రూపకము, అందులోని హాస్యమూ, అన్నిటికన్న సామాజికులకు సమ్మోహనము కలిగించే శైలిన్నీ. ఆ రూపకాలు, పాఠకులకు తమ నీరస జీవితాలనుంచి న్నీ గ్రంథకారునకు శ్రుతి కలియక భగ్నమైన ఆత్మలో నుంచే తప్పించుకోడానికి అవకాశం కలిగిస్తాయి బాలకవికూడా (1890-1915) విశుద్ధ గీతాత్మకశానందం సహృదయుడికి కలిగించ గలిగినా, తన జీవితాంతంలో ఏదో భగ్నాశయచ్ఛాయల్లో చరించినాడు. సుందర స్వప్న ప్రపంచమునకు అతడు శిశువువలె ఆత్మార్పణం చేయడంవల్ల పుట్టిన విశిష్ట భావగీతికా జగత్తు విచ్ఛిన్నం కావడం ఆరంభించిన సమయంలో అదృష్టవశాత్తుగా మృత్యువు ఆ యువకవిని తీసికొని పోయింది. 'బీ'-నారాయణ మురళీధరగుప్తేకు (1872-1947)-'కేశవ సుతు'నితో చాలాదగ్గర పోలికఉన్నది. ముఖ్యంగా సామాజికంగాను పారస్వతంలోనూ సంప్రదాయం కలిగించే బాధను తీవ్రంగా ప్రతిఘటించడంలో అయితే అతని స్వల్ప పారస్వత కృషి అతని షష్టిపూర్తినాటి వరకూ అజ్ఞాతంగా ఉండిపోయింది. అతనివలెకాక, భాస్కర రామచంద్ర తాంబే (1874-1941) జనప్రీతి అధికంగా పొందినాడు. ముఖ్యంగా 1920 తరువాతనుంచీ సర్వసామాన్యంగా అతనినే అన్యులు అనుకరించడం సాగించారు. గీతారచన గుణవిశిష్టమూ, శయ్యాఆకర్షణీయమూ, సంప్రదాయక భావచిత్రణము అప్రయత్నంగా ఉపలబ్ధము కావడం వల్లనూ, అతడట్లు కృతకృత్యుడైనాడు. తాంబే మధ్యభారతవాసి. తమ్మూలంగా కవి తన కవిత్వానికి భూస్వామ్య యుగమునాటి కాల్పనిక భావోద్వేగ దృశ్య నిర్మాణముతోపాటు వియోగవ్యధ వంటి భావము జత కూర్చినాడు. అందుచే దానికి ఆకర్షణ కలిగింది. కేశవసుతుడియు, అతని అనుయాయుల తరువాత ఇది తిరిగి పలాయనవాదాన్నే ఆశ్రయించింది. ఆ కాలంలో మరొక మహాకవి చంద్రశేఖర్ అతడు సంస్కృత కవితాకృష్టుడు కావడంవల్ల జాగరూకుడై శిల్పాకృతి మూలంగా, సొగసులు వెలయించడముతో తనిసినాడు. విద్వత్కవులు ఈ వెనుక చూపును బలపరచినారు. అధిపత్యంకోసం ఘర్షణపడుతూ, ఇప్పటికీ ఈ కావ్య

రీతులు రెండూ సాగుతూనే ఉన్నాయి. సర్వతోముఖమైన ఈ ఘర్షణ సాహిత్యరంగంలో ఈ విధంగా వెలసింది.

——నాటకము——

1843 లో జనించినది. అది శైశవమునాటి మహారాష్ట్ర నాటక రంగము. లిఖితముకాని నాటకాలనుంచి ఎప్పుడూ ఒకరేఉండే ప్రఖ్యాత పాత్రవర్గంనుంచి త్వరలోనే విడివడి వర్ధిల్లింది. బి. పి. కిర్లోస్కర్ (1843-1885) అనే నిర్మాత, పాత్రధారి, నాటకకర్త ఒక్కడివల్ల అది తొలిసారిగా సమగ్రరూపం ధరించింది. 1887 లో ఆయన రచించిన 'సుభద్ర' నాటకము ఇన్నేళ్ళనుంచీ ఒక మహాకర్షణగా ఉంటున్నది. అయితే ప్రధానంగా దాని ఆకర్షణ సంగీత ప్రధిమనుబట్టి. జి. బి. దేవల్ (1854-1916) కిర్లోస్కరును తన 'గురువు'గా అంగీకరించి నాడు. అయితే ఆయన పంథా ఆయనే సృజించుకొన్నాడు. దేవలకృత నాటక సప్తకంలో ఆరు నాటకాలు సంస్కృతాంగ్ల మాతృకలకు శుద్ధాను కరణాలు. సప్తమ నాటకం 'శారద'. ఈ నాటకము రచన తోనూ పాత్రోన్మీలనముతోను వాస్తవికతవల్ల, ఉక్తి ప్రత్యుక్తిచాతుర్యం వల్లా, నేటికి ఆకర్షిస్తున్నది. అయినా దాని ఇతివృత్తం—ఒక వృద్ధుడు తారుణ్యవతి అయిన నవోఢను కన్యాశుల్కమున కొనుటే పేలవమైంది. దేవల్ నాటకములలోనూ కె. పి. ఖండిల్‌కర్ (1872-1948) తొలి కృతులలోనూ వ్యక్తమైన నాటకీయ గుణాలు స్థిరంగా పాదుకుంటే మహారాష్ట్ర రంగభూమి ఈ శతాబ్దపు మొదటి రెండు దశాబ్దాల్లో వృద్ధి పొందేదే. కాని వాణిజ్యరీత్యా లాభదాయకము కావడమే ప్రధాన మైనందున అట్టిది జరుగలేదు. వృద్ధిపొందినది సంగీతమే. అదియు ఉన్నత మార్గము పట్టింది. ఖండ్లికర్ రచించిన (1910) కీచకవధ రాజకీయార్థవ్యక్తిగల రాజకీయ రూపకాతిశయోక్తి ప్రధానమైన నాటకం కాబట్టి విజయవంతమైంది. అందులో తిలక్, కర్జన్ ప్రభృతులు క్రమంగా భీమ కీచకులుగా పాత్రలైనారు. ప్రభుత్వమువల్ల ఆ నాటకము నిషేధింపబడింది. ఆయన ఐతిహాసిక నాటకాల్లోనూ అటువంటి ఓజస్సున్నది, కొంత షేక్స్పియరునుంచి తెచ్చుకొన్నప్పటికీ. అయితే షేక్స్పియరు

కాని గుణాలకన్న, అవగుణాలను అనగా కథావస్తు జటిలత, అసందర్భంగా తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదంగా, హాస్యమున్నూ, ఎక్కువగా నాటకకర్త ప్రవేశపెట్టి మంచివాటిని పాడుచేసినాడు. ఖండిల్‌కర్ నాటక రచయితగా దిగజారినాడు. ఆయన పౌరాణిక కథా వస్తువులను స్వాదువుగా చేయాలని ఆధునిక రాజనీతిని ప్రవేశపెట్టి అంతకంతకు నీరసము చేసినాడు. ఆ నాటకాలను రంగశాలలో నిలవ బెట్టి రక్షించింది సంగీతం. శ్రీపాదకృష్ణకోల్‌హట్‌కర్ (1871-1934) హేళనాత్మకమైన సుఖాంత నాటకరచనను, కాల్పనిక భావోద్రేక ప్రహేళికలద్వారా యత్నించినాడు. చివరకు హేళన, రొమాన్సు రెండూ విఫలమైనాయి. ఆయన చేసిన సామాజిక సంస్కరణ ప్రయత్నాలు ఆయన నాటకాలకన్న వ్యంగ్య హేళనాత్మక వ్యాసాలవల్ల ఎక్కువ సఫలమైనవి. ఆయన నాటకంలో హాస్యం స్వయం సమృద్ధమై కథాగమనాన్ని ఆటంక పరిచింది. ఆయనను తన గురువుగా అంగీకరించిన, గడకారీ పైనచెప్పినట్టు అధికతరంగా విజయము సాధించినాడు. అతడు రొమాన్సునూ హాస్యాన్నీ చక్కగా మేళవించి పాత్రోన్మీలనంచేస్తూ అడ్డులేకుండా మంచి వచన శైలిని నడిపించినాడు. గడకారీ నాటకాలలో అసందర్భాల అతివేలతవల్ల అపహాస్యం పాలైనవి. కాని నాటకంలో రచయిత చూపిన ప్రజ్ఞ, తాత్పర్యఫలమున్నూ అవహపించే వాళ్లకు తత్తరపాటు కలిగించాయి. నరసింహ చింతామణి కేల్కారుకు (1872-1947) గల సామర్థ్యము పరిమితమే-ఐనా అది ఆయన నాటక పంచకంలో సఫలంగా మేళవించింది. వాటిలో మూడు నాటకాల ఇతివృత్తము చరిత్రాత్మకము. రెండు నాటకాల కథావస్తువు పౌరాణికమున్నూ, ఆధునిక మహారాష్ట్ర నాటకరంగ ప్రథమదశకుచెందిన ప్రఖ్యాత నాటకకారులు వీరు. వారిలోను, మరికొంద రితరులలోను కొందరు షేక్స్పియరు నాటకానువాదాలు నేర్పుతో చేసినారు. రంగశాలకు వివిధశక్తులు సంక్రమించాయి. అయితే వాస్తవికత వాటిలో మృగ్యం, లేదా అప్రధానం. రంగభూమిని సంగీతము దురాక్రమణచేయగా వాస్తవికత పూర్తిగా పరాజితముకాకపోతే ఆత్మ రక్షణకోసం యత్నించే సామాన్య సామా

జికుని వినోదానికి లోటులేదు. అతనికి కావలసినంతగా పౌరాణికనీతి ఐతిహాసికనీతీ ఉన్నవి. అందుచేత వాస్తవిక లేదనిపించలేదు. చివరకు వాసుదేవశాస్త్రిగారే చరిత్రకారుడని ఖ్యాతిచెందినవాడుకూడా, తన ఇతిహాసిక నాటకాలలోనుంచి రొమాన్సును దూరముచేయలేకపోయినాడు. ఆయన కాల్పనిక భావోద్వేగీకరణము ఎలాగయినప్పటికీ, వినోదముకోసము కల్పితమైందికాదు; రాజనీతి ప్రబోధించడంకోసం ఏర్పడింది. మహారాష్ట్రానికీ, భారతదేశానికీ, కళంకం ఆపాదించడానికి చూచే బ్రిటీషు చరిత్రకారుడికి, తగిన సమాధానము, రంగభూమి ఈ విధంగా చెప్పింది. నవల అంతకన్న ధాటిగా, సమాధానం చెప్పింది.

## నవల

హరినారాయణఆప్టే (1864-1919) తో నవల ఆకస్మికంగా రచనా పరిపాకము పొందింది. ఆయన మొదటినవల 'మధ్లీస్థితి' 18 5 లో ఆరంభమైంది. మధ్యమవర్గ జీవితాన్ని స్పృశిస్తూ తర్వాత కొన్ని నవలలు వచ్చాయి. వాటిలో ఉత్తమమైంది 'పణ్‌లక్ష్యత్‌కోణ్ ఘేటో?' (1890-93) ఆ నవలలో కథావస్తువు బాలవితంతువుకు సంబంధించినది. హృదయాన్ని కదిలించేదిన్నీ. ఆయన ఉత్సాహము ప్రధానంగా ఐతిహాసిక కాల్పనిక భావోద్రేకదాయక నవలలమీదికి పోక ముందు రచించిన సామాజికనవల అది. అందులో రచయితలోవచ్చిన మార్పు పాఠకుడిలోనూ, ప్రతిఫలించింది. ఆప్టే, అగర్కర్‌నుంచి సామాజిక సంస్కరణోత్సాహాన్నీ తరుణోత్సాహాన్నీ, గ్రహించినాడు. దానిని రానడేనుంచి ఆకళింపుచేసికొన్న సంప్రదాయ సంస్కరణలకు సామరస్యము చేకూర్చ అన్వేషణతో జోడించి మితమార్గంలో పెట్టినాడు. నవలాకారులు మహారాష్ట్ర రాజపుత్ర చరిత్రలలోనుంచి కథావస్తువులు స్వీకరించి రొమాన్సుతో మేళవించడం చిక్కుతోకూడిన సామరస్యానికి ముసుగువేయాలనే. అయితే రోమాన్సును చేర్చడానికి కారణము రాజనీతినీ, ధర్మాన్నీ, ప్రబోధించడంకోసమే. చాలమంది రచయితల విషయంలో ఇది యదార్థము. అతి శుద్ధ జాతీయవాది తృప్తి కోసమూ, రూపకాతిశయోక్తికోసమూ, రోమాన్సుమీద ఆధారపడ

వలసి వచ్చింది. సామాన్య పాఠకుడు ఆ వశాన్నే ఉన్నాడు. అసలు సమస్యలే లేవని సామాన్యపాఠకుడు తృప్తిపడడము చేతనో, లేదా వాటి విషయము ఆలోచించుకోకుండా ఉండడము చేతనో అతనికి సామాజిక సమస్యలంటే ఓరిమిలేదు. కావలసినంత ఇతిహాసంతో తనివి తీరిన తరువాత, మార్పుకోసము సామాజిక సమస్యలు పరిశీలించు డానికి అతడు సిద్ధపడినాడు. గ్రంథకర్తలు అతని తృపికోసం మెప్పు కోసం రొమాన్సుతో సమస్యలను కప్పిపుచ్చినారు! ఆప్టే శిల్పములో హెచ్చుతగ్గు లున్నవి. అనువృత్తంగా గ్రంథప్రచురణ చేయడంవల్ల కాబోలు, ఆయన కథా కల్పనలో చలనహీనములై పిష్టపేషణంగా ఉంటాయి. కాని భావైక్యం పాత్రోన్మీలనపాటవమూ, అధికం కావడం చేత కథానిర్మాణంలో లోపాలు సర్దుకుపోయినవి ఆప్టేకు ప్రాప్తించిన ఘనతవల్ల చాలమంది రచయితలును ఆ సాహిత్యశాఖ ఆకర్షించింది. ఐనా కొంతకాలంపాటు ఆయనతో పోల్చదగినవారు సన్నిహితంగా ఎవరూ గోచరించలేదు. 1909 నుంచీ నవలారచన చేస్తున్న నారాయణ హరి ఆప్టే గృహజీవితములో లోపాలమీద ధాటిచూపక పూర్వం, కొంత కాలం ఐతిహాసిక కాల్పనిక భావోద్రిక్తుడై నవలలు రచించినాడు. 'నాథ మాధవ్' అనే డి. యం పిశాలే (1882-1928) అందుకు వ్యతిరేకంగా సమకాలిక జీవితానికి సంబంధించిన సామాన్య నవలారచనచేసి తరు వాత చారిత్రక నవలాక్షేత్రంలో ప్రవేశించినాడు. ఆయన గత కాలాన్ని అతి విశదంగా పాఠకులకు కళ్ళకు కట్టేలాగ కదా కథనాపాటవంతో పునస్సృష్టిచేసినాడు. సామాన్యపాఠకుడు వాటిలో అసంగతంగా ఆధునిక వస్తుకా భంగము చొప్పించడాన్ని, గుణలాలిత్య రాహిత్యాన్ని గమనించ లేనంతగా, ఆయన గతకాలాన్ని స్ఫుటంగా చిత్రించినాడు. సి. పి. వైద్య, యస్, యం. పరంజపే, సి. జి. భానువంటి విద్వన్నవలా కారుల చేతుల్లో చరిత్ర కొంత క్షేమంగా ఉన్నది. అయితే తత్కాలీన స్వభావాన్ని బట్టి, తదనుకూలంగా కొంత కాల్పనిక భావోద్రేకాన్ని ధర్మ బోధనూ, వారు ఇతి వృత్తంలో మేళవించి, పలుచన చేయకతప్పలేదు. గతకాలము వర్తమానము మీద విరుచుకొని పడుతూ, అధికమవుతూ ఉండగా, కాల్పనిక భావోద్రేకము వాస్తవికతను కల్లోలము చేయగా,

గుర్జర్, మిత్ర, భాషేలు–బంకిమచంద్ర, శరచ్చంద్ర, ప్రభాత కుమార ముఖోపాధ్యాయుల నవలలను మహారాష్ట్రభాషలో అనువదించి, దాన్ని నిలబెట్టేందుకు ఎలాగో కొంత ఊతగా రచించినారు ధర్మ నిష్ఠురమైన ఆ యుగంలో నవలను,– తక్కువ సాహిత్యంలాగ, అల్పంగా విలువలేని చెత్తగా పాఠకుల మనసులను పాడుచేసేదిగా ఆ కాలపువారు భావించి వారు పాఠకలోకానికి వికాసము కలిగించి నప్పుడే నవల తనస్థాయిని వృద్ధిచేసుకోగలుగుతుంది. అందుకు గతాన్ని ప్రస్ఫుటంచేసి ప్రబోధం చేయడంకన్న, నవల చేయగలిగిందిలేదు. ఆ ప్రబోధమయినా లాంఛన ప్రాయమే. వి. యం. జోషి రచించిన (1915) 'రాగిణి' అనే నవలలో తర్కబుద్ధితో వివాదపడే స్త్రీ పురుషులు శీలనైతిక సమస్యలను పరిశీలించేట్లుచేసి, ఉత్తమస్థాయిలో ప్రబోధము చేసినాడు. ఆయన నవలా క్షేత్రంలో తర్వాత తర్వాత నవ్యసీమలుచూపి, అధికతర విశ్వాసంతో, పరిపాకంతో, అన్వేషించినాడు.

## హేతువాదాత్మకవచనము

యథార్థాన్ని కాంక్షించే ఆయుగంలో, హేతువాదాత్మక వచన రచన, సాధించవలసిన ఉత్తమ సాహిత్యంగా, పరిగణింపబడింది. ఈ యుగారంభంలో సామాజిక సంస్కరణం వివాదంగా చెలరేగి ఓజోమయ వచనరచనకు, ప్రోత్సాహము కలిగింది. గోపాల్, గణేశ్, అగర్కర్ (1856–1895), లోకమాన్య బాలగంగాధర తిలక్ (1856–1920, మహాశయులు కలిసి 'కేసరి' పత్త్రికా స్థాపన చేసినారు. అది వారపత్త్రిక. తిలక్ చేతుల్లో వివేచనాత్మక జాతీయభావ ప్రతీకంగా ధాటీగా ఉండబోతున్నదా పత్త్రిక. సామాజిక రాజకీయ సంస్కరణావశ్యకతను వెంటనే గుర్తించవలెనా వద్దా అనే విషయంలో అభిప్రాయ భేదంవల్ల వారిద్దరూ చీలిపోయినారు. అగర్కార్ 'సుధాకర' పత్త్రిక పెట్టి, ధైర్యంగా సామాజిక సంస్కరణము కోసము నిలిచి, జనప్రీతిదాయకము కాని సమస్యను చేబట్టి మహావరోధాలను తృణప్రాయము చేసినాడు. అతని ప్రచారస్వభావములో కళ్ళకుకట్టే వేడుక లేక పోయినా, అగర్కార్ శౌర్యమువల్ల సామాజిక సంస్కరణకు చాలా

పుష్టిన్నీ గౌరవమున్నూ చేకూరింది. ఆయన శైలిలో ఆయన మహోదార గుణములు ప్రతిబింబించినవి. తిలక్ శైలిలో ముఖ్యంగా ఉన్నదే శక్తి. ఆయన సంస్కరణలను అంగీకరించని సంప్రదాయ వాదుల పక్షము చేరడంవల్ల, అప్పటినుంచీ సంస్కరణలకు విముఖుడైనట్లు పరిగణింపబడినాడు. సంప్రదాయానికీ, సంస్కరణలకూ, మధ్య చెలరేగిన వివాదములో గుణాగుణ ప్రసక్తినీ, పోరాడిన ఆ ప్రముఖ పాత్రలను అటుంచగా, వాదములోని సత్యాసత్యములను గ్రహించగల ప్రాజ్ఞత చాలామంది పాఠకుల్లో మేలుకొన్నది. సామాన్యంగా అధిక సంఖ్యాకులు సంప్రదాయవాదుల పక్షమే ఉండకతప్పదు. అయితే సంస్కర్తలు :తప్పనిసరిగా సామాజికాంతఃకరణంలో చొచ్చుకొని ఎలాగో నెమ్మదిగా. కనబడకుండా చిత్తశుద్ధితో, ఆత్మపరీక్షను పురికొల్పినారు.

తిలక్‌మహాశయుని రాజకీయోన్నతి ఆయన వచన రచనా ప్రావీణ్య ప్రతిష్ఠను మరుగుపరిచింది. భారమని పాఠకుడికి తోచని మహావైదుష్యంవల్ల ఆయనవచనం సంపన్నమైనది. తిలక్ మహాశయుడు ఆడంబరములేని ఉదాత్తత వచనానికి కూర్చినాడు. ఆయన వక్కాణించవలసిన అవసరాన్నిబట్టి నిష్ఠురంగా ఎత్తిపొడవగలడు. విష్ణుశాస్త్రి ఛిపులంకర్ (1850-1882) తిలకుతో తొలిదినాల్లో సహకరించిన వాళ్ళలో ఒకానొక వచన రచయితగా ఖ్యాతితెచ్చుకొన్నవాడు. ఆయన తన వచనము ధాటీగా సమాజ సంస్కరణను ఖండించడానికి వినియోగ పరచినాడు. ఆయన శైలి ప్రయత్నపూర్వకంగా అలంకారికమూ వాక్యవిన్యాసము శ్లిష్టమైనదిన్నీ. అయితే అది నిందాగర్భితము! ఆ వచనము జాతీయభావాన్ని ఉజ్జ్వలతలూపడానికి ఉపకరించింది. ఛిపులుంకర్ వ్యాసాలు చాలకాలం సనాతనోద్ధారకులకు పవిత్రంగా పరిగణించేవారు. శివరాం మహాదేవపరంజపే (1864-1929) వచోధారాపాటవంగా ప్రాయమైంది ఇంచుమించుగా. ఆయనకూడా సనాతనోద్ధారకుడే అయితే ఆయన తన శక్తులను వైదేశికపాలకులపై వ్యతిరేకంగా ప్రయోగించి, అవహేళనతో వారిని ఎత్తిపొడుచుటకు ప్రబల సాధనంగా వ్యాసరచనచేయగా, ఆ రచనను తుదకు ప్రభుత్వము నిషేధించింది.

లోకమాన్యతిలక్ మహాశయునికి యన్. సి. కేల్కారుకన్న అతి సన్ని హితుడు ఎవరూలేరు. ఆయన తిలక్ అనంతరం, కేసరి పత్రికాసంపా దకుడైనాడు. కేస్కర్ విద్వాంసుడు, సర్వతోముఖ ప్రజ్ఞగల పత్రికా లేఖకుడున్నూ. ఆయనలో పరిమితశక్తులు మృదువుగా మిళితమైనవి. ఆయన కృషిచేయని వచన సాహిత్య ప్రక్రియ అంటూలేదు. ఆయన విశదంగా, జనాంగీకారంగా, ఆ యా సాహిత్యరూపాలు అవలంబించి, రచన చేసినాడు. ఎలాగయినా ఆయన సాహిత్యకృషి అనంతరకాలము నకు చెందినది. కొన్నివిధాలచూస్తే ప్రథమదశక లక్షణము కలిగిన దిన్నీ. అచ్యుత బల్వంత్ కోల్హాట్‌కర్ విషయంలో (1379–193.) నూ ఇదే చెప్పవలసి ఉంటుంది. అతడు ఎన్నోవిషయాలలో కేల్కారువంటి వాడు కాకపోవడమేకాక పైగా ఆయనకు తీవ్రవ్యతిరేకి. ఐనా ధార్మికుల న్యాయసమ్మతదృష్టికి ఆయన వ్యతిరేకుడైనాడు,కాని త్వరితంగా వర్ధిల్లు తున్న నిమ్న సామాజిక పాఠకశ్రేణి ఆయనను మెచ్చుకొన్నది. ముఖ్యంగా ఆయనచేసిన విచక్షణాసుందరమైన పత్రికాలేఖనాన్ని. ఆ కాలపు పత్రికాలేఖన పద్ధతికి అది విరుద్ధము. కళానైపుణ్యంతో ఉత్సా హంతో, ఆయన రచనచేసినాడు. అయితే రచనలో సంయమములేదు. ఆయన సామాన్య పాఠకలోకానికి పత్రికాపఠనము అలవరిచినాడు. అయితే శైలీవిన్యాసంలో స్వాదుత్వాన్ని, పాడుచేసినాడు. వాస్త వము తెలిసికోవలెననే ఇటువంటి కాలంలో జీవిత కథారచన విరా జిల్లుతుందని ఎవరయినా భావించవచ్చును. అయితే అలా జరగలేదు. యత్‌కించిత్ జరిగినా అది ప్రముఖమూ, ప్రజ్ఞాసమన్వితమూ కాదు. అయినప్పటికీ జీవితచరిత్ర రచయితలిద్దరు విశిష్టంగా కనపడుతున్నారు. స్వాభావికరచనా పాటమువల్ల. రామాబాయిరానడే ప్రఖ్యాతుడైన తన భర్త, యం. జి. రానడే మహనీయుని జీవితచరిత్ర, ఆత్మప్రకర్షలేకుండా అత్యంత సన్నిహితంగా చిత్రించింది. డాక్టర్ డి. కె. కార్వేమహిళా విద్యాభివృద్ధికిగాను తాను పడినకష్టాలూ చేసినకృషినీ ఉల్లేఖించినాడు.

## =1920–1945 కవిత్వము=

1920 సంవత్సరకాలంలో స్తబ్ధత గోచరించింది. లోకమాన్య

తిలక్ మహాశయుని సామాజిక రాజకీయ వారసత్వానికి ఉత్తరాధి కారులయిన వాళ్ళు వెంటనే సంస్కరణకు విముఖులైనారు. ముడతలుపడి దృష్టి మందగించగా- సమాజ సంస్కర్తలు కొద్దిపాటిమార్పులు ప్రవేశ పెట్టి తృప్తిపడవలెననుకొన్నారు. గాఢ సమస్యలను పరిష్కరించక, స్థూలంగా సామరస్యము కల్పించాలని సంస్కర్తలు యత్నించినారు. ఆ యుగము స్వల్పసూనవునిది. ఆ స్వల్పస్వప్నాలనుంచి కాల్పనిక భావయుగ సృష్టిజరిగింది. స్వల్పంగా అతను పెట్టుకొన్నమొరలు, అర్థ విషాదభంగిమలు దాల్చినవి. అతను ప్రతివిషయాన్ని సరళము చేసి, నీటుగా అరలుగా విభజించి, వాటికి సొగసుగా చీటీలు అంటించినాడు. ఆకారమేర్పడింది కనుక వస్తువు అంగీకృతమైనట్టు గణింపబడింది. సుందరపదయోజనతో స్వల్ప సంవిధానకౌశలముతో, రచయిత పార వశ్యము చెందగా, ఆయనతోపాటు విమర్శకుడున్నూ, పొంగిపోయి వాడు. అందుచేత అమాయకుడైన పాఠకుడూ, ఉబ్బితబ్బిబై పోయివాడు.

ఇది అందరి విషయంలో యదార్థముకాదు. కొంత బాగా రచన చేయగలవారు, కొంతవరకూ చక్కగా విమర్శనచేయగాలవారున్నూ, ఆ క్షీణ విధానాలను ప్రతిఘటించివారు. ప్రతిఘటనాశక్తులు కూడుకొని 1930 లో బహువిధానాల్లో నవ్యమైన ఇతివృత్తాలను నవ్యసాహిత్య ప్రక్రియలనూ అన్వేషించినవి. 1920 దశకాంతంలోవచ్చిన ఆర్థిక మాంద్యమూ కార్మికోద్యమోదయం, అన్నిటికన్నమిన్నగా గాంధిమహాత్ముడు 1930-31 లో నడిపిన జాతీయసమరము, అవరోధాలను నిర్మూలించి కనీసం కొద్దిమందిలోనైనా నవ్యచైతన్యస్పందనం కలిగించాయి. ప్రధానంగా మధ్యమవర్గమువారే రచయితలు పాఠకులూ. మధ్యమ వర్గము మహాసమస్యలతో పోరాటం చేసింది; సామరస్యం సంఘటింప చేసింది; చివరకు అలసమై పోయింది. వృద్ధాచారపరుల ధర్మోపదేశము యదార్థమైన ఆత్మజిజ్ఞాసను రేకెత్తించడంతో, తన విధిని నిర్వహించినట్లు తృప్తిపడింది. మాధ్యమిక వర్గంలో ఒకశ్రేణి అల్పసంఖ్యాకమైనా, మారుతున్న పరిస్థితులకు తగినట్టుగా ఇప్పుడు ప్రవర్తించింది. యుద్ధానంతర సాహిత్యంలోని భ్రమానిరాసము, నవ్యరూపకము, ఇంగ్లండులో

1930 లో అభ్యుదయకవులున్నూ. ఆ అల్ప సంఖ్యాకులమీద గాఢ ప్రభావం ముద్రించినవి. ఆ కాలంలోఉన్న క్షీణతనుంచి సాహిత్యో ద్ధరణంకొరకు యత్నించినారు. నేటివరకూ ఆ ఉద్ధరణ సాగుతూనే ఉన్నది. ఫలం హెచ్చు తగ్గులుగా ఉంటున్నది. దానికి కారణం సాహిత్య ఉద్ధరణం అనిశ్చిత దశలో సాగుతూ రావడమే.

1920 లో 'రవి కిరణ మండల్' కావ్యక్షేత్రంమీద అధిపత్యం వహించింది. గోవిందాగ్రజును అనుసరించిన కవిత, మితిమీరి దైన్యంచిన జీవితానికి దూరమై, దారితప్పినదాన్ని ఉద్ధరించ యత్నించినారు. మండలివారు తమ అంతఃకరణ ప్రమాణమునుబట్టి శ్రద్ధగా కావ్య కృషి చేశారు కాని, అందువల్లనే అది అతిపేలవమూ, సామాన్యమూ, అయి పోయింది. ప్రతి విషయానికీ ముఖ్యంగా లలిత కళలను సంకుచితం చేసి అవరోధాలు కల్పించే సమాజ స్వభావానికి అనుకూలంగా, వారికి గాఢత్వములోనూ, విశృంఖలతలోనుఉన్న అవిశ్వాసము, సాగి పోయినది కవులు విశేషంగా కావ్య పఠనాలు చేయడంవల్ల వారి కవిత్వం నిస్సారంగా చలామణీ అయింది. ఆ కవితలో తరుచుగా సూటిగా ధర్మోపదేశము ముద్రితమై ఒక్కొక్కసారి స్వల్ప సంస్కరణో ద్బోధకంగాకూడా ఉండేది. ఒక దృష్టాంతముగా ప్రేమ చూడండి, వారి అభిమతంలో సాంసారిక ధర్మగుణంగా పరిగణించడానికి ప్రేమకు కొంత స్థానము అర్హము! స్వచ్ఛతర జానపద వాతావరణంలో ఆ ప్రేమ స్వాభావికంగా వికాసము పొందుతుంది గదా! అందువల్ల నవలనూ కవిత్వాన్ని కొంతకాలము సర్వసామాన్యంగా భావనా విలా సాత్మక జానపద చిత్రణంతో రచయితలు అలంకరించ సాగినారు. కావ్య 'గానం' ఒక ఫాషెణకాగా – కొన్నాళ్ళకు తాంబే కవి మండలి వారు అదే పద్ధతిగావెళ్ళి, మితిమీరి పోయినారు. వారు కవిత్వానికి అప్రధానాలయిన శబ్ద సంగీతమూ, కేవలం బాహ్య శిల్పమున్నూ పోషించినారు. అయితే రవి కిరణమండలి అధికంగా కవితా సంవిధానంలో అత్యుత్సాహాన్ని ప్రేరేపించింది. ఆ కవులు జాగు రూకులై ప్రయోగకౌశల్యము చూపినారు. అవశ్యకమయిన వైవిధ్యాన్ని సంపాదించాలని కావ్యకృషి చేసినారు. ఆ మండలిలో 'యశ్వంత'–

వై. డి పెంఢర్కర్ కవిత్వానికి అమిత జనామోదము కలిగింది. స్వల్పవిషయాలలో విఫలత్వం మనోవైకల్యంవల్ల కవి దుఃఖంతో కావ్యాలాపముచేయగా, సామాన్య సహృదయుడు వాటిలో తన బాధ ప్రతిధ్వనులే ఆకర్షించినాడు. 'గిరీశ్' – యస్. కె. కాణేట్కర్ అతి సామాన్య కథావస్తువులు స్వీకరించి, మృదువుగా అర్థాంతరన్యాసాలు అల్లడం నేర్చినాడు. 'మాదవ్ – జూలియన్' – యం. టి. పట్వర్ధన్ (189౩ – 1939) ప్రణయ భావగీతాలు ఆకర్షణీయంగా ఆరంభించినాడు. వాటిల్లో ముఖ్యంగా పారశీకభాషలోని గజల్వల్ల వైదేశిక విచిత్ర పరిమళము వాసించింది. ఆయనలో ఉత్సాహాంశమించగా సంప్రదాయ వాదిన్నీ, జటిలవిద్వాంసుడున్నూ అయి, శబ్దశుద్ధికీ భావశుద్ధికీ కేవలంగా ప్రయత్నింపసాగినాడు. పి. కె అత్రే రచించిన 'జెందుచీఫెలే' 1925, ఇన్నేళ్ళనుంచీ జనామోదంకలిగిస్తూ ఉన్నది. అందులో కవుల సాహిత్య మార్గాలను నేర్పుగా, చమత్కారంగా, వేళాకోళంగా అనుకరించినాడు. అయితే వివేచనలేకుండా మెచ్చుకొనే పాఠకుడు అసలు విషయాన్ని దాటిపోయి కవిత్వం అంతటినీ వేళాకోళము చేయడానికి ఉత్సాహపడి వాడు 1930 తొలిదినాల్లో తక్కువశ్రేణి కవులను తక్కువశ్రేణి రచయితలు అనుకరించి, అపహసించడమనే, సాహిత్యవ్యాధి వ్యాపించింది. ఆ అపహాస్యానుకరణములవల్ల కవిత్వంమీదనే అల్పదృష్టి ఏర్పడడం చేత కొందరుకవులు ఎదుగుబొదుగులేకుండా చెడినారు; మరికొందరు జిలిబిలిపలుకు తేనెలుట్టిపడు పద్యాలతో పాఠకుని ప్రశంసలు అందుకోడానికి సిద్ధమైనారు.

తాంబే కొంత ఉత్తమకవిత్వం 1920 లో చెప్పినాడు. ఆయన కవిత 1930 నాటికి ఫేషన్ ప్రవేశపెట్టింది. ఆ వ్యామోహములో పడిన కవులు వారివయసు ఎంతయినా యౌవనోదయభావంతో సొగసుగా భావగేయాలు అల్లడం సాగించినారు. వస్తువు అతిస్వల్పమైనా శయ్యమాత్రం అతి సంపన్నంగా ఉండక తప్పదు. గాయకుడికి ఆ భావగేయాలు గానయోగ్యంగా ఉపకరించాయి. అందుచేత తండోపతండాలుగా సామాజికులువిని గేయ పారవశ్యము పొందినారు. తాంబేకవిని అనుకరించినవాళ్ళు ఆయనలోని సూక్ష్మమైన కోమల భావుకతను

గ్రహించుకోలేదు. అనుకరణ కవులు సమ్మోహనాత్మకమయిన జిలిబిలి పలుకుల శయ్యామాధుర్యము యత్నపూర్వకంగా సరళ భావచిత్రణాన్ని సాధించినారు. ఆ కవిత, జీవితానికి దూరమైన, రుచ్యమైన, భావసంభావనాభాసతో, మత్తుకలిగించింది. పదయోజన, రసభావాలున్నూ పాఠకుని బుద్ధికి పనికల్పించకుండానే మూసలో పోయబడి, వారిని కదిలించి వేస్తాయి. దానివల్ల కవికూడా నాజూకుతనానికి అలవాటుపడి సహజ వికాసమును అరికట్టుకొన్నాడు. వృద్ధిలోకిరాగల కుట్టికారు కవుల కిది విషాదాంతము; ఆశలు కొల్పినవారు వృద్ధిపొందలేదు. విమర్శక సంప్రదాయానుసారంగా తాంబేకవికి ఉత్తమ శిష్యుడు, బి. బి. బోర్కరు. ఆయన అంతకన్న అధికుడు. బోర్కరు గోవాప్రాంతీయుడు కావడంచేత ప్రాంతీయ ప్రకృతి సౌందర్య ప్రీతినీ, ఇంద్రియ తర్పణాత్మక భావచిత్రణంవల్ల, వ్యష్టిసుఖపారవశ్యాన్నీ, తాంబే కవియొక్క కవితా పారంపర్యానికి సమకూర్చినాడు. బోర్కరుకవి అనను రూపమైన నైతికాదర్శ వాదమనే రెండవ గుణమును తన కవితా కోదండమునకు చేర్చక, నిజ స్వాభావికమైన ఉపజ్ఞానుసారంగా, లక్ష్యముంచినట్లయితే ఎక్కువ ఖ్యాతి సాధించి ఉండేవాడు

రవి కిరణమండలికి, తాంబే కవితా సమితికిన్నీ వ్యతిరేకముగా ప్రయత్న పూర్వకంగా ఈ యుగంలో కొంత ఉత్తమ కావ్య సృష్టి జరిగింది. అనంతకనేకర్ ఇంచుమించుగా కవిత్వానికి ఉద్వాసన చెప్పినాడు. 1933 లో 'చంద్రాత్' అనే చిన్న కావ్య సంపుటము ప్రకటించిన తదుపరి అయితే అది భిన్నమార్గాలను సంక్షిప్తంగా చూసి పాఠకుడికి జాగరణ కలిగించింది. ఆ కావ్యంలో కలగాపులగంగా, ఔత్సుక్యం కలిగించే ప్రక్రియలు చాలా ఉన్నవి. వెన్నెలవలె చల్లని కవిత పొగగొట్టపు భూంకారము, అవహేళనా పూర్వక కావ్యానుకరణ మున్నూ దానిలో గోచరిస్తాయి. బహుశః అది తాత్కాలికమైన యుగ సంధికి సంబంధించిన నవ్యత కావచ్చును. 'అనిల్' — ఎ. ఆర్. దేశపాండే సునిశ్చిత ప్రయోజనాపేక్షతగల నవ్యత్వమును సుదీర్ఘ ఓజోమయ కవితా జీవనంతో సాధించినాడు. (1932) 'ఫుల్‌వత్' అనే తొల్లింటి ప్రణయ భావగేయాల స్వార్థాశ్రయ సౌకుమార్యంనుంచి,

(1940) 'భగ్నమూర్తి' లోని వ్యుత్పన్నతాద్యోతకమైన ఉద్దీపక ధర్మోద్భోధనద్వారా, (1947) 'పర్‌తేవహ' లోని ఆలోచనా భావ సమన్వయందాకా, సాధించినాడు. ఆయన కవిత్వాన్ని సంప్రదాయకమై, లాక్షణికమైన, కావ్య క్రియలవల్ల వచ్చిన యాంత్రిక జటిలతనుంచి, విముక్తము చేయడానికి స్వేచ్ఛాఛందస్సు ప్రచారముచేసి ప్రతిష్ఠించినాడు. యన్. జి. దేశపాండే రుచిర స్వచ్ఛ భావగీతాత్మకతతో ఒకానొక యథార్థ జానపద చిత్రణాంశముతోనూ. జి హెచ్. దేశపాండె, లోపల కలరూపును గుప్తముచేసిన దార్శనిక విరోధాభాసలను, భావోచిత సంక్షిప్త శైలి మూలంగా భక్తకవుల కవితా పరిమళ రుచినీ, పునః గ్రహించి వ్యక్తము చేయడానికి యత్నించిన్నీ, తత్కాలీన కవితా మార్గాలలోని అర్థశూన్య ప్రలాపాలనుంచి, కవితకు విశ్రాంతి కలిగించినారు. అప్పుడున్న దంభముతోకూడిన జ్ఞానలవ దుర్విదగ్ధతనుండి, సాహిత్య విముక్తిని త్వరితముచేసింది సాహిత్యంమీద ప్రసరించిన 1942 నాటి ఉద్యమ ప్రభావమే. 'కుసుమాగ్రజ' — వి. వి. షిర్‌వాడ్కర్ 1942 లో తన 'విశాఖ' కావ్యంతో జనానీకాన్ని ఉత్తూతలూపి, అసాధారణ యశస్సును సంపాదించినాడు. ఆయన సాహిత్యప్రజ్ఞ ఆ ఉన్నతస్థానంలో ఉంచేదే కాని ఆయనను ఇతర సాహిత్యప్రక్రియలు ఆకర్షించడంవల్ల కవిత్వాన్ని కొంతవరకు ఉదాసీనంగా చూచినాడు. బహుశః కుసుమాగ్రజ సామ్రాజ్య వ్యతిరేకభావంతో చెప్పిన తన కవితలోని ఉజ్జ్వలశక్తిని తిరిగి ప్రాప్తింపలేకపోయాడేమో. ఆయన అసలు స్వాభావిక కావ్యధోరణి శాంతసౌందర్యంకోసం వేదనపడడమే. అయినప్పటికీ ఆయన జయప్రాప్తితో రక్తాన్ని ఉడుకెత్తించి, అశ్రుధారలు కురిపించే భావోద్వేగత త్వరలోనే ఉడికి చల్లారిపోయి తుదిదశలో వచనంగా వికీర్ణము అయినట్టు కనబడుతుంది. కాని అందులో ఇమిడివున్న సవాలుచేసే పోటిమి అనేకశృంఖలాలతో నలిగి తపిస్తున్న కవిత్వానికి మంచిదే అందుకు దృష్టాంతం ఎవరిశిష్యుడూ కాకపోయినా మన్‌మోహన్‌కవే! కొంతమంది యువకవులు అంతకుముందే కావ్యరచనలు ఆరంభించినా పరిస్థితులు మారిపోతున్నవి గమనించి తమకుగల పరిధిలో శాంతంగా పరిపాకము పొందినారు.

## నాటకము

1920 లలో నాటకరంగము పురావైభవంవల్ల మనగలిగింది. కొద్దిమంది నటులకు వచ్చినఖ్యాతి – వారిలో చాలమంది మంచినటులు కాకపోయినా మంచి నాయకులు కావడంచేత – అవిచ్ఛిన్నమైన తత్పురా వైభవంగానే గణింపబడింది. ఆనాటి నాయకులలో ఉత్తములు–వారిలో వాగ్గేయకారులూ పక్కవాద్యములవారూ రంగశాలలో నాటకాలువేసే వారు. సంగీతంకోసం చెవికోసుకొనే మహారాష్ట్రేతర పోషకులనుకూడా ఆకర్షించినారు! వారికి ప్రధానమైనది సంగీతమే. 1930 నాటి తొలి దినాల్లో రూపవాణిచిత్రాలు నాటకసంగీతానికి పోటీగావచ్చి సామాజికు లకు సంగీతమూ వినోదమూ కల్పించినవి. దానితో నాటకప్రయోగం క్షీణించిపోయింది. అది అప్పటికే ఛిన్నాభిన్నమై పతనావస్థలో ఉన్నది. రూపవాణిచిత్రాలు దాని పతనానికి కేవలం నిమిత్తమాత్రమైనవి.

1920 లలో చిన్నకోవలోని నాటకకర్తలు – వారిలో కొందరు క్షణికంగా యశస్సు గడించినారు – నాటకాలు ప్రయోగించి జయము సాధించాలని ప్రాచీన నాటకాలను మార్పు చేర్పులు చేసినారు. ప్రజాభిరుచికి అనుకూలంగా ఐతిహాసిక పౌరాణిక భక్తకవుల రచనలనుండి నాటకాలకు ఉపకరించే ఇతివృత్తాలు సంపాదించి, నాయకులూ ద్రోహులూ సృష్టిచేయబడినారు. లోగడచెప్పిన మహానాటకకారులు ఖాడ్లికర్, కొల్హాట్‌కరులు రంగభూమితోపాటు క్షీణించిపోయినారు. కేల్కారు నాటక కర్త అయినా అన్య విషయోత్సాహము అతన్ని ఆవరించి నాటక కర్తృత్వాన్ని తీసివేసింది. మామావరేర్కర్ ఇప్పుడు స్థాయికి వచ్చాడు. 1907 లోనే ఆయన నాటకము రంగభూమిలో విజయాన్ని పొందింది. వరేర్కరు జీవిత పరిణామము తెలుస్తే చాలావరకు ఆధునిక మహారాష్ట్రీయ నాటకరంగ పరిణామము తెలిసినట్లే. పౌరాణిక నాటకాలతో ఆరంభించి కథావస్తువుతో, రంగసంవిధానంలో కొత్త ప్రయోగాలుచేస్తూ సామాజిక సమస్యలకూ తనకు తెలిసినరీతిగా రంగస్థలాన్ని సామాజిక సమస్యల వ్యాఖ్యానం చేయడానికి ప్రయత్నించాడు. స్వాభావికమూ, అతి మొరటున్నూ, అయిన అతని పాత్రల భాషణము

వచ్చి నాటకీయ సంభాషణంగా చలామణీ అవుతున్న అవాస్తవికతను చాలాభాగం బయటపెట్టింది. ఆయన 40 నాటకాలు వ్రాశాడు. ఇటీవల వ్రాసిన నాటకాలు, 'అపూర్వబంగాళము' (1953), 'భూమికన్యాసీతా' (1955) వంటివి ఆయనలో తరిగిపోని రచనా సామర్థ్యానికి నేటికీ తార్కాణాలు. నాటకరంగము అతనికి కృతజ్ఞత చూపక తప్పదు, ఆయన వాస్తవికతను రంగంలో ప్రవేశపెట్టినందుకూ, దాన్ని విస్తృత పరచి నందుకూ.

'నాట్యమన్వంతర' అనే చిత్తశుద్ధిగల నటబృందం ఐరోపాలోని నవ్యనాటకంవల్ల ఉత్సాహప్రేరితమై, నాటకరంగాన్ని సజీవము చేయాలని చాలా సాహస కార్యానికి పూనుకొన్నది. వారి 'అంథల్యాచీశాల' (1933) అనే నాటకం మొదటిది. అది ఒక్కటే రంగశాలమీద విజయవంతమైంది. యస్. వి. వర్తల్, నార్వేదేశీయ నాటకకారుడయిన జోరన్‌సన్ రచించిన నాటకానికి, 'అంధల్యాచీశాల' అనుకరణము చేసినాడు. అది రంగాన రక్తి కట్టింది. అయితే దానిని ఆస్వాదించగలిగిన వారు కొద్దిమందే. సామాన్యమైన సామాజికుడు బహుశః దానిలోని వైదేశికమైన సాహిత్య వాసనను ప్రతిఘటించి ఉండవచ్చును. ఆ నట బృందం త్వరితంగానే విచ్ఛిన్నమై పోయింది. అయితే యథార్థమైన నవ్య నాటక ప్రయోగముద్వారా, నాటకరంగాన్ని మళ్ళీ శక్తివంతము చేయాలనీ, అధిక సంస్కారంగల సామాజికుల రుచికి తగిన నాటకాలు వేయాలనీ, తీవ్రకాంక్ష పుట్టించికాని ఆ నాటక సమాజము అస్తమించ లేదు. చైతన్య స్పందనలేని నిస్తబ్ధరచయితలు, అమాయికులైనవారు కొందరు ఏకాంకనాటికా రచనలుచేసి, రూపవాణి చేసే ధిక్కారమును ఎదుర్కొడానికి వృథాప్రయత్నము చేసినారు. 'బాలమోహన్ నాటక సమాజపు' పాతవడ్డ ప్రయోగ సంవిధానం, పి. కె. అత్రే అర్థాధునిక నాటకాలున్నూ చిత్రముగా మేళవించి వ్యాపార సరళిలో జయప్రద మైనాయి. అవహేళనాత్మక ప్రహసన లక్షణాన్ని బట్టి, ఏదో చిన్న కథావస్తువు అల్లి, హాస్య మొలికించే పాత్రలను చేర్చి అత్రే లాక్షణికబావాతిరేకనాటకము తయారుచేయగా అది మరింత లాభించింది. అంత ప్రజ్ఞకల హాస్యనాటకకర్త అలా నాటక

రచనచేస్తే, అందులోని గాంభీర్యము ప్రమాదకరంగా అవహేళ నాను కరణకు దగ్గరవుతుంది! నాటక ప్రయోగ విజయపరంపరతో అత్రే పట్టి ప్రహసనాల్లో పడిపోయి, తన అపూర్వ హాస్యకౌశలాన్ని, పాత్రో న్మీలన పాటవాన్ని, శైలినీ వృథాచేసుకొన్నాడు పాపం! ఆ దశాబ్దము అంతమయ్యేసరికి ఎలాగో ఆయన రూపవాణిలోకి పత్రికాలేఖన ప్రవృత్తి లోకి వెళ్ళిపోయినాడు. అంతటితో నాటకరంగము మళ్ళీ పతనమైంది. 1940 ల తొలిదినాల్లో యం, జి. రంగనేకర్ అనే పత్రికావిలేఖరి నాటక రచనా ప్రవృత్తిలోపడి, రంగోద్ధరణము చేసినాడు. ఆయన 'నాట్య నికేతనము' స్థాపించి, సుఖాంతనాటకాలు అందంగా, అగారానికి అను కూలంగా, వినోదాన్ని కలిగించాలనే పరిమితలక్ష్యంతో ప్రయోగించి, ప్రశంసనీయంగా సఫలుడైనాడు. రంగనేకరు రచించిన సుఖాంత నాట కాలు మాధ్యమికవర్గ జీవితానికి సదృశంగా ఉంది ఉత్సాహదాయక మైన సంభాషణతో, కొద్దిపాటలతో కలిపిఉండేవి. శ్రద్ధాళువులుకాని ఆ సామాజికుల ఈ మేళనంతో తృప్తి కలిగించింది. ఆ కాలంలో ఔత్సా హికరంగం అధికంగా పాశ్చాత్యాను కరణాలకు మొగ్గింది. అయితే అందులో జీవమూ స్వాభావికత్వమూ శూన్యం.

## = నవల =

రంగోపజీవుల నాటకరంగ పతనంతో, మాధ్యమిక వర్గవినోదం కోసం, నవల ప్రధాన సాహిత్య ప్రక్రియగా అవతరించింది. తరువాత రూపవాణి ప్రబల ప్రతి కక్షిగారాగా, మడికొట్టుకొన్న పరిశుద్ధతావాదికి అధికంగా అది నిందా లక్ష్యమైంది. అయితే నవల గౌరవప్రజామోదము లనేకాక విశిష్టతనే సాధించింది. నవలారచనలో వైవిధ్యమూ, ఉదాత్త ప్రయోజనమున్నూ. కొద్ది మంచి రచయితలవల్ల వచ్చింది. వి యం. జోషి (1882–1943) 'రాగిణి' అనే వెనుకటి నవలతోపాటు ఇప్పుడు మరి అయిదునవలలు రచించాడు. వాటిలో 'సుశీలేచదేవ్' (1930) అన్ననవల ఉత్తమమైనది. అందులో ఆధునిక విద్యావతికిగల వైజ్ఞానిక దృక్పథ పరిణామాన్ని గురించి గాఢంగా పరిశీలించినాడు. 'ఇందు కలే ఉణి సరళభోలె' (1935) అన్న మరో నవలలో శిల్పానికీ నైతికధర్మా

నికీ, అంతరంలో ఉన్న ఘర్షణ, కొందరి జీవితాలకు అఘాతము ఎలా కలిగిస్తుందో చిత్రింపబడింది. జోషిచేసిన సామాజిక విశ్లేషణలోగల తాత్విక నిర్లిప్తతను, సంశయాత్మక మందస్మితకాంతి ఆవరించింది. డాక్టర్ యశ. వి. కేట్కర్ (1884–1937) రచించిన నవలల్లో నిస్సంగత్వము లేదనవచ్చును. ఆయన లాక్షణికసమ్మతమైన సాహిత్య రూపాలను శైలినీ అన్నింటినీ ప్రతిఘటించి, అధికంగా అనూహ్యామై, అసంభావ్యమైన కథావస్తువులను స్వీకరించి, నవలలు రచించినాడు. డాక్టర్ కేట్కారు సామాజిక శాస్త్రవేత్త కావడంచేత, శాస్త్రీయ సమస్యా పరిష్కారం కోసం నవలను ఒక సాధనంగా చేసికొన్నాడు. ఆయన గజిబిజిగా సామాన్య పాఠకుణ్ణి చకితుణ్ణి చేసివేసినాడు; వివేచనగల పాఠకుణ్ణి స్వీయవ్యాఘాతాలతో తికమక పెట్టినాడు. కాని ఆయన నవలారచనలో ఒకానొక విజ్ఞాన బుద్ధిగత ధీరత్వం ప్రవేశపెట్టినాడు. ఆయన వల్లనూ, జోషివల్లనూ నవల, ఆకస్మికంగా గౌరవస్థానాన్ని తెచ్చుకొని, తాత్కాలిక సామాన్య ప్రజామోదం కలిగించే నవలల అల్పత్వాన్ని బైట పెట్టింది. మామావరోర్కరు నాటకంకన్న, నవలారచన శరపరంపరగా సాగించినాడు. ఇప్పటికి వెరశి 115 నవలలు రచించినాడు. వీటిలో 28 నవలలు అపరాధ పరిశోధకాలు. మిగిలిన వాటిల్లో 58 నవలలు వంగమాతృకలకు అనువాదాలు వాటిలో ముఖ్యంగా శరచ్చంద్రునివి మహా సరళంగా చేసినాడు. స్వతంత్ర నవలల్లో అధికంగా ఆయన సమాజంలో దళిత పతిత కష్టజీవులను కథావస్తువులుగా స్వీకరించినాడు. వారైనా అణగి పడిఉండే వాళ్ళుకారు; స్త్రీపాత్రలు సాధువులు కారు. ఆయన సృష్టిచేసిన స్త్రీ మూర్తులు కయ్యానికి కాలు దువ్వేరకం. అయితే ఆకాలంనాటి నవలల్లో గోచరించే దరిద్రజీవుల, స్త్రీపాత్రల భావాతిరేక చిత్రణంకన్న, స్వచ్ఛంగా విశిష్టంగా వ్యత్యాసము గోచరిస్తుంది అతని పాత్రోన్మీలనంలో.

1926 తరువాత యన్. యస్. ఫాడ్కే, వి. యన్. ఖండేకర్ అనే వారు ఇద్దరు విఖ్యాతులు. వారు ముందు నవలాకారులుగా, కథానికా రచయితలుగానూ, తర్వాత వ్యాసకర్తలు, విమర్శకులుగా, పాఠకలోక ప్రమోదము చూరగొన్నారు. స్థూల విమర్శకులు ఆ రచయితలనుండే

కీలకాన్ని తీసికొని 'కళకళకోస'మనే సిద్ధాంతముతో ఫాడ్కేను, 'కళ జీవితం కోసమ'నే వాదంతో ఖండేకరునూ, ముద్రలువేశారు. మాధ్యమిక వర్గపు పైకోవలో వారి యెడగల సరళానురాగం, ఫాడ్కే నవలల్లో ముఖ్యవిషయం. ఆయన సుస్నిగ్ధంగా ప్రజ్ఞతో విషయ వైవిధ్యాన్ని కల్పన చేసినాడు. శిల్పసౌష్ఠవము తెలిసిన ఫాడ్కే కథా వస్తువును విన్నాణంతో ప్రపంచించినాడు. ఆయన శైలి సొంపైనది. ఆయన కీర్తి గడించినప్పటినుంచీ, విమర్శకులున్నూ, రచయితలున్నూ శైలికి అతిగా ప్రాధాన్యం ఇస్తున్నారు; శైలి ఫాడ్కే రచనా శిల్పంలో ఒకానొక అంశమాత్రం. ఆయనేమీ ఆ విషయం గోపనం చేయలేదు. ఆయన 'ఎలా రచన చేయడం' అనే పుస్తకాల్లో అంతా విశదంగా దాపరికము లేకుండా వివరించినాడు. ఖండేకర్, ముందు కథానికారచనలో ఖ్యాతి గడించిన తరువాత ఫాడ్కేకంటె కొంచెము తర్వాత నవలారంగములో ప్రవేశించి ఫాడ్కే మూలసూత్రాన్ని తనమూలసూత్రంతోసవాలు చేసినాడు. ఖండేకర్ మూలసూత్రంలో ఆదర్శవాదము ఇమిడిఉన్నది. అతడు సృష్టించిన యువకులు చిత్తశుద్ధితో సామాజికముగా రాజకీయముగా సేవచేసినారు. వారా విషయాన్నిగురించి ధారావాహికంగా ప్రసంగించేవారు. వారు ప్రేమలోపడడం సందర్భవశాత్తుగా జరుగుతుంది. ఆ చిత్తశుద్ధి పాఠకుణ్ణి ఉఱ్ఱూతలూపి ఆనందవాది అయిన ఫాడ్కేలోని లోటునుగ్రహించుకొనేటట్టుచేసింది. ఫాడ్కేకూడ తన లోటు సర్దుకొనుటకై తన ప్రేమిక యువతీ యువకులను ఏ గృహాగారంలోనోకాక, రాజకీయసభల్లో సమావేశ మయ్యేటట్లు కల్పింపసాగినాడు. ఈ రచయితలిద్దరూ విడిపడి దూరంగా ఉండిపోయినారు. వారిని మెచ్చేవారుమాత్రం అట్లుకాదు. విచిత్రంగా పైకి గోచరించనా, ఏకకాలంలో ఆ రెండింటితో ఆనందంపొందడము సాధ్యమే. లేదా ఒకదాని తరువాత మరొకటైనా కావచ్చు. ఒకదానికి ఒకటి అనుబంధము. లేదా ఒకదానినుంచి మరొదానికి పలాయనము. ఈ నాటిదాకా వారిద్దరూ బహు సాహిత్యప్రక్రియలు అవలంబించి వ్రాస్తూనే ఉన్నారు. ఇద్దరిలో ఫాడ్కే ఎక్కువ విరివిగా రచన చేసినాడు. అయితే వారితీరులు పాఠకులకు విసుగు జనింపచేస్తున్నాయి. ముఖ్యంగా ఫాడ్కేది. జి. టి. మధుకోల్కార్ నవలల్లో రాజకీయాలు

దర్శించినాడు. అయితే రాజకీయాలు బాగా జీర్ణమైనట్టు తోచదు. ఆయన ఉద్రిక్తశైలికి అది మరొక అలంకారంగా గోచరిస్తుంది. పి. వై. దేశ పాండేలో రాజకీయాలే రచనాసారము. అయితే భావోద్రేకమైనశైలి అతి కావడంచేత, ఆ రాజకీయాలు సంకుచితమై పాఠకుణ్ణి ఊపిరి సలప నీయవు. విశ్రామ్ బెడెక్కరు రచించిన 'రణాంగణ్' (1935) అనే నవలలో పొడవుతున్న ప్రపంచపరిస్థితికీ, ప్రధానపాత్రలకూ మధ్య విశిష్టసంబంధము ప్రదర్శించినాడు. దానిని తేలికగాచూచి పారవేయక పోయినట్లయితే (అలాగేవేశాడు), కుహనా రాజకీయనవలల వ్యాప్తి అటుపిమ్మట తగ్గిపోయి ఉండేది. గతతరంలో రచయితలు ప్రాచీన చరిత్రను 'కాల్పనిక భావోద్రిక్తము చేసినట్లే' ఈ నవలాకారులు కొందరు వర్తమానచరిత్రను కాల్పనిక భావమయము చేసినారు. చాలమంది పాఠకులు దాన్ని వాస్తవికత అనే రాజకీయాలని తలచి ఆస్వాదిస్తున్నారు!

కాని పాఠకుల్లో విమర్శకుల్లో ఒక శాఖవారు అల్పసంఖ్యాకులయి నప్పటికీ, సహనాగరకనవలలను ప్రతిఘటించినారు. కొందరు రచయితలు వారిచే ప్రేరితులై మోజులనుంచి తెంచుకొని సరికొత్తవిధానాలు అన్వేషించడం సాగించారు. రచనకూడా తమ హక్కుగా స్త్రీలు సారస్వత కృషికి ఉపక్రమించినారు. 'విభావరీ షిరూర్కర్' అనే ఉపనామము మాలతీ బేడికర్ సతిదిగా గుర్తించడమూ జరిగింది. అసలు పేరు దాగలేదు. కథానికలూ రెండు నవలలూ (1933 – 35) రచించి, ఆమె భావకల్లోలము కలిగించింది. దానికి కారణం ఉన్నది. అదివరకు ఎవ్వరూ చేయని తీరులో ఆమె తన గ్రంథాలలో జాగృతి పొందిన మహిళల బాధల్లోని సత్యాన్ని, ప్రస్ఫుటము చేసింది. గీతాసానేసతి కూడా అంత ధైర్యంగానే రచన చేసింది. అయితే పాఠకలోకాన్ని అంత కదలించలేక పోయింది 'కృష్ణాబాయి' — ముక్తాబాయి దీక్షితసతి — కమలాబాయి — తిలక్ సతి ధిక్కారస్వభావముతోకాక, చాల ఎక్కువ సూక్ష్మంగా మాధ్యమిక వర్గీయుల గృహజీవనం, కథానికలుగా రచించి నారు. కుసుమావతీ దేశపాండేసతి కోమల భావుకత్వంతో, కవితారచన, సూక్ష్మ సమీక్షాశక్తుల సమత్వంతో రేఖాచిత్రాలు రచించి, సహృదయాహ్లాదము కలిగించింది. ఇంకా కొందరు మహిళా రచయితలు ప్రీతి

దాయకంగా పూర్వాధీరణిలో, వీరపురుషులవలె స్త్రీలను గురించి వ్రాస్తూనే ఉన్నారు. మామూలుమార్గం విడిచిపెట్టి, పురుషుల్లో ఆర్ వి. దివే ప్రముఖుడై, సహ్యాద్రిప్రాంత ఆదివాసుల కథావస్తువుతో, కథా గమన వేగంతో, నవలలు రచించినాడు. అయితే ఆయనకూడా ఇతి వృత్తాన్ని కాల్పనిక భావావకుంఠనంతో కప్పినాడు. సానేగురూజీ (1899 - 1950) కథలూ, నవలలూ, ఉపదేశాత్మకాలూ, భావాతిరేకాలున్నూ అవుతూ, నవ యువకులను ముగ్ధులను చేశాయి. ముఖ్యంగా 1942 సంవత్సరానంతరం ఆ రచనలు చేయడం, కనీసము కొందరినయినా అపరాధ పరిశోధక నవలాభిరుచినుంచి తప్పించి ఉపకరించింది.

కథానిక

కథానిక విశిష్ట సాహిత్య ప్రక్రియగా ఈ యుగంలోనే వచ్చింది. హెచ్. యన్ ఆప్టే, యస్. కె. కోల్హాట్కర్, యన్. సి. కేల్కార్, వి. యస్. గూర్జర్ ప్రభృతులు పూర్వము వ్రాసిన కథలు కేవలము సంక్షిప్తము చేయబడిన నవలవలె, కేవలం కథా కథనాత్మకాలుగా వచ్చినవి. దివాకర కృష్ణుని 'సమాధి - మరి కథా షట్కము' (1923) అన్న కథానికలలో నిర్మాణైక్యము, మనోవిశ్లేషణమున్నూ గోచరిస్తాయి. ఆధునిక కథా సంకలనాలలో అదే మొదటిది. ఖండేకర్, ఫాడ్కేలు తమ తమ విశిష్ట గుణాలతో కథానికను అలరించగా, దశాబ్దాంతంలో కథానికా రూపము స్థిరపడింది. 1930 లలో కథానికా రచనా మార్గములో వైవిధ్యము వచ్చింది. కొందరయినా బుద్ధిపూర్వకముగా ఫాడ్కే, ఖండే కరులను వ్యతిరేకించినారు. వై. జి. జోషి ప్రజామోదము పొందిన రచయితల్లోని అవాస్తవికతను వేళాకోళంచేసూ, గృహజీవనమును చిత్రించిన తనభావాతిరేకకథానికలతోప్రయత్నించాడు, జనామోదముకోసము. వి. వి. బోకిల్ అనే వర్థిష్ణువు కథానికారచన ఆరంభించినాడు. అతిశయంగా ఆలేఖ్యరూప కథాచిత్రణం ద్వారా దయనీయమైన నిమ్నమాధ్యమిక వర్గములో వెన్నెముకలేని, ఆలోచనా పంక సంకలిత బుద్ధిగల యువకుణ్ణి ప్రదర్శించినాడు. కాని రచనలో సంయమమూ, వైవిధ్యమున్నూలేవు. బోకిల్ నవలారచలోవనలెనే

అతిగా హాస్యంతో కథనడిపి, ఉన్నసామర్థ్యము పాడుచేసుకొన్నాడు. అనంతకణేకర్ రచించిన కొన్నికథలు సంయమముకలిగి అవహేళ వాత్మకాలై చాలమందిపాఠకుల్ని మెప్పించలేక వృధా అయినవి. కాని రచయిత దాని నెక్కువ సాగించలేదు. జానపదజీవితం ప్రజాప్రీతి దాయకము కావడానికి కృతకామోదమును కలిగించేకథలను సవరించి, వాటిస్థానే ఓజస్సుతో కథలు పాఠకులకు అందిచ్చినాడు. యస్. యం. మాశే అన్న కథకుడు 'ప్రాంతీయ' కథానికారచనకు చాలమంది కొంతయత్నము చేసినారు. గోవాలోని సహజప్రకృతి సౌందర్యము, అక్కడ పురాతన జీవనధోరణి కొంతమంది రచయితలను ఆకర్షించింది. చాలమంది వాటిని తమ నైతిక విశృంఖలాత్మక కథానికలకు అను కూలమైన నేపథ్యముగా చేసుకొన్నారు. హాస్యరచయితలలో జి. వి. జోషి. పి. కె. అత్రే శ్యామారావు ఓక్ వంటివారు నైపుణ్యముతో చిన్న కథలువ్రాసి వాటిని అప్పుడప్పుడు సాహిత్యరూపమైన హేళనకు సాధ నంగా చేసుకొన్నారు.

## ఆత్మాశ్రయ వ్యాసము — ఇతర వచన రచన

1920లలో ఆలస్యంగా అన్యసాహిత్య ప్రక్రియలకన్న. అంగ్లము నుంచి సూటిగా ఆత్మాశ్రయవ్యాసం ఉద్భవించింది. ఫాడ్కే ఖండేకరు లిద్దరూ మళ్ళా వ్యాసరచనవల్లకూడా పాఠకులమనసులను చూఱ గొన్నారు. ఫాడ్కేవ్యాసాలు పెళుసుగా నీటయినవి. ఖండేకరు రచించి నవి నీటు లేకపోయినా వాటికితగిన అలంకారాలు భావుకత్వము ఆత్మీయతను లుండనే ఉన్నవి. ఫాడ్కే తన రచనావిధానము వివరించినాడు అందు వల్ల ప్రతివాడూ తానుకూడా అట్లు వ్రాయగలనని తలచినాడు. యస్. యం. సంత్ తప్ప ఏ ఒక్కరూ రచన బాగాచేయలేదు. అనంతకేస్కార్ వ్యాసాలు జీవితవ్యాఖ్యలు. సర్వసమ్మతి సూత్రాలను కిందుమీదుచేసి ఆభాసపు. పైపూతను తుడిచివేయాలనుకొన్నాడు. ఆ పద్ధతి అవలీలగా అనుకరణీయము. కాణేకరుకూడా తరుచుగా అనుకరించాడు. అయితే ఎంతోకాలంకాదు. త్వరలోనే ఆయన వ్యాసరచనా ప్రక్రియనువదలిపెట్టి నాడు. కుసుమావతి దేశపాండేసతిని అనుకరించడం కొంత అసాధ్య

మైనపని. అందుకుకారణము ఆమెరచనలో గుర్తించడానికి వీలయిన విచిత్రపుపోకడలు (అలవాట్లు) ఏమీలేవు; ఆమె కవితాభావం భావలాలిత్యం, యదార్థంగా వ్యక్తిగతాలు. సాహిత్య వ్యాసరూపము జనామోదము పొందినా అందులోని అల్పమైన వైచిత్రులు సమసిపోగానే అదీ క్షీణించింది. ఆకాలపు స్వభావాన్ని ఇది ప్రతిబింబిస్తూంది విస్తారమైన ఈ సాహిత్య వ్యాసంగంవల్ల జీవిత కథారచనకు శక్తి చేకూరవలసింది, కాని జరగలేదు. జీవిత కథారచన ఖారాలసమై సాగింది. అయితే ఒకానొక మహోజ్జ్వల స్వీయ జీవిత చరిత్రను 'స్మృతిచిత్రే' (1934 - 36) అనే పేరుతో యన్ డబ్ల్యు. తిలక్ కవి భార్య, లక్ష్మీబాయి తిలక్ రచించింది. ఆమెకు వర్ణమాలయినా తెలియదు, గుణింతము మాట అలా ఉంచుదాం! చమ్పు విషయాలు ఆ యుగంలో చాలామంది రచయితలు మనసుకు పట్టించుకొనేవారు. కాని కొద్దిమంది ఉత్తమంగా ఉదాత్త వచన రచన చేశారు. వి. యం. జోషి, డా. కేట్కర్, యన్. యం. మాఠే, వి. డి. సవర్కారు (ఆయన కవిత కూడా ప్రచారోద్దేశ్యంతో రచించాడు), యస్. డి. జావడేకర్ ప్రభృతులు ప్రముఖవచన రచయితలు. మొత్తంమీద పత్రికాలేఖనం సామాన్యాభిరుచికి అనుగుణంగా సాగింది మంచిరకపు మాసపత్రికలు రావడం కష్టసాధ్యమైంది. గహనమైన సిద్ధాంతాలను ప్రజామోదంకోసం అతి పల్చన అతి తేలిక చేయడం బహుశః తెలివైన పత్రికా లేఖకుడి ప్రమాదకర ప్రలోభనము కావచ్చును. కేట్కర్ అందుకే ప్రలుబ్ధుడైనాడు. ఫాడ్కే పత్రికా రచయిత కాకపోయినా అలాగే అయినాడు. ఇంతకూ అది యుగలక్షణం. సమీక్షావ్యాసంగంకూడా అధికంగా ఉన్నది. అయితే విమర్శకులు బాహిరమూ, యాంత్రికమున్నూ అయిన, సాహిత్యాకార ప్రకారాలనూ సంవిధానాన్నీ చమ్పుగా వివరించినారు. ఆ ప్రవృత్తి చిన్నాభిన్నంగా ఉంది. మరి కొందరు విమర్శకులు సంస్కృతాలంకారికుల కృషినే ఏదో తమకు ఉపయోగించు కోవాలని యత్నించారు. సాహిత్యపరులలో ఒక వర్గమువారు పాశ్చాత్య భాండారమునుంచి సంస్కారాన్ని, తమ సాహిత్య జీవనానికి తెచ్చుకొని, మార్క్సు వాదపు అయస్కాంతంవల్ల ఆకృష్టులైనారు. దానివల్ల ఉత్సా

హంగా వాదము తప్పని సరిగా చెలరేగింది; కొంత పర్యాలోచనకు ప్రోత్సహించింది.

## 1945 — 55

వెనుకటి యుగాంతంలో అప్పటి సాహిత్య విధానాల పై విసుగుదల అధికంకావడం గోచరించింది. నవ్యవైఖరి సాహిత్యములో ఉదయించడానికి, 1942 ఆగష్టు ఉద్యమం, రెండో ప్రపంచయుద్ధం, స్వాతంత్ర్యము సాధించి శిఖరస్థాయికి తెచ్చిన జాగరిత రాజకీయ పరిణామవాహిని – ఇవి విశిష్టమైన నేపధ్యభూమిని విర్చరచినవి. సామాన్య జీవితానికి దూరమై, సురక్షిత ప్రవాసంలో భావాభాసలతో, సంకుచితమైన సాహిత్యానికి బాగా కదలికకలిగింది, ఘూర్ణిల్లింది. మన అవ్యగ్ర విషాదకరమైన, అతుకుల బ్రతుకులను ఆవరించిన అందమైన ఆచ్ఛాదనం, విచ్ఛిన్నమైపోయింది. ఇంక కృత్రిమభంగిమ నిలవలేకపోయింది; నవ్యవైఖరివల్ల కవిత, కథానిక – ఈ సాహిత్య ప్రక్రియలు రెండూ పునః ఉత్తేజితములైనాయి. జీవితంలో వైవిధ్యాన్నీ, అగాధపు లోతులనూ, అన్వేషించడానికి కవిత, కథానికలు, యత్నించాయి. అనుభూతికి నీరసైక్యం ఘటింపచేసిన మేలిముసుగులు, చీల్చివేయబడ్డాయి.

నవ్యకవిత్వం పాఠకుడిలో జాగృతి కలిగించి, కవియొక్క సూక్ష్మానుభవము గోచరించే సహృదయత్వం రావడానికి యత్నించింది. ఆ కవిత్వంలో తొందరపడి అర్థాంతరన్యాసాలంకారాలు కవులు నిబద్ధము చేయలేదు. కవితావస్తువు గాఢంగా ఆత్మాశ్రయమే. ఆలోచన, భావములు సరసంగా మేళనమైనవి. సాహిత్యరూపానికి రావలసిన ఉచితస్థానము వచ్చింది. అందుచేత కవికి ఏ వెర్రి ఆటంకమున్నూలేదు. భావచిత్రణం సునిశ్చితమైంది. అది జీవితానుభవమునుంచి ఉద్భవించింది. శాస్త్రీయ విజ్ఞానంవల్ల ఆకర్షణీయంగా రూపకాలంకారాలు వచ్చాయి. జీవితసత్యం కవికి పరాయికాలేదు. అందుకు దృష్టాంతంగా కామము దాని నైచ్యమూ, దాని సౌందర్యమున్నూ వివృతమైనాయి. అంతఃకరణపు లోపొరనుండి నిరాటంకంగా మానసిక వాసనలు పైకి వచ్చాయి. ఆ కవిత్వంలో, సూక్ష్మంగా చురుకుగా గ్రహించలేని పాఠ

కుడికి గోచరించే అజ్ఞాత గూఢత్వము, అసలా అనుభవస్వభావంలోనే ఉంది. ఆ అనుభవములోనుంచి వచ్చింది కవిత, ఇక భాషావిషయంలో 'నవ్యకవిత్వం' కృత్రిమ కావ్యోచిత 'పదబంధము' కన్న, మాటిగా సజీవమైన వ్యావహారికభాషనే ఎన్నిక చేసింది.

బి. యస్. మర్ఢేకర్ (1907 - 1956) 'కహీకవిత' (1947) తో నవ్య కవితా ప్రభావము పరిపూర్ణతతో తొలిసారిగా అనుభవానికివచ్చింది, పి. యస్. రేగె అంతకుముందు చేసిన రచనలో తత్కవితా వైశిష్ట్యము ముందుగా కొంత గోచరించి నప్పటికీ, మర్ఢేకర్ కవిత్వం కోమల భావు కతగల సహృదయునిది; బాధానిశిత జీవనవైఫల్యంవల్ల మర్మవేదన కలిగిస్తుంది. కాని ఆ కవిత విలపించదు. ఒకానొక సుందరాత్మీయ స్వప్నమూ, తత్ఫలావాప్తికోసం ఒక ఆశా, ఆ కవితలో ఉన్నవి. మర్ఢే కరు భావచిత్రణలో అధికమైనది విజ్ఞానబుద్ధి కాని విషయాసక్తికాదు. రేగెకు అట్లుకాదు. రేగెకవిత స్వీయానుభవోద్రేకపు ఉత్పతన క్షణాలను కమనీయంగా వివరిస్తూ ఆకర్షిస్తుంది. ఆయనకు లోకంలో మానవులు విషయాలు గోచరించవు. కవి పొందిన అనుభూతిలో మాత్రము ఏ వస్తు వైనా సంపన్నమవుతుంది. మర్ఢేకర్, రేగె కవులిద్దరూ అతి శబ్ద ప్రయో గము చేయక, పదిలంగా కొద్ది పదాలు ప్రయోగిస్తారు. వారిలోని కవి తన పద్యాలకు వ్యాఖ్యకు దిగదు. శరచ్చంద్ర ముక్తిబోధ, వింద కరంది కరులు తమ హర్షాతిశయంలో పదప్రయోగముతో ఎక్కువ కళ్ళెముపట్టి, భావచిత్రణము ఎక్కువ విస్తరింప జేస్తారు, ముఖ్యంగా సామాజికాందోళన వ్యక్తంచేసే పద్యాలలో, అదే తీరుగా మంగేష పడ్గోంకర్ శైలిలో బోర్కర్, తాంబేల దగ్గర సాహచర్యంవల్ల సంక్ర మించిన అతి మధుర కవితా ధోరణి, ఇంకా ఉంటూనేఉంది. వసంత బాపట్ కూడా నవ్యమార్గంలో పరిణతి చెందినాడు. అయితే ఆయన తన కవితా స్వభావమును హింసపాలు చేయలేదు. ఇందిరాసంత్ ఇంకా ఎక్కువ మార్దవంగా పరిణామం సాధించింది. ఎందుకంటే ఆమెకు సంబంధించిన భావగీతాత్మకత ఎప్పుడూ అముఖ్యమైనదాన్ని తోసి రాజంటూనేఉంది. వై. డి బావేనవ్యకవితా మార్గములో కొలది కాలము ప్రయత్నపూర్వకంగా రచనచేసి మళ్ళీ చల్లగా జారిపోయినాడు. నవ్య

కవిత్వానికి ప్రతి కవిన్నీ స్వీయ ధోరణి తెచ్చినాడు, దాంతోపాటు కవిత్వంలో మహావైవిధ్యాన్నీ, సంపన్నతనుకూడాను. సామాన్య మానవుడికి ఈ కాలపు కవికి మధ్య, సనాతన విమర్శకుడు, కేవలము దూషణము పనిగా పెట్టుకొనే విమర్శకుడున్నూ, కల్పించిన అవరోధాలను విచ్ఛిన్నము చేయడానికి, కొందరు కవుల కావ్యపఠనాలు కొంతవరకు ఉపకరించినవి. ఈ నూతన వాతావరణము చాలమంది యువతీ యువకుల్ని ఉత్తేజితులను చేసింది. తక్కిన వారికన్న ప్రాచీన కవులలో 'అనిల్' ఈ వినూత్నవాతావరణంవల్ల, అనావృత మనస్కుడై స్పందించినాడు. ఈ వాతావరణానికి దూరంగా, సంపూర్ణంగా, నిర్లిప్తులై ఉన్న కవులు లేరన వచ్చును. అంటే ప్రాచీనతనుండి నవ్యతకు పరుగెత్తుకు వచ్చారని కాదు. జి. డి. మడ్ గుల్కర్ భావగేయాల తరళ సౌందర్యమునకు మూలము ప్రజల సంప్రదాయక కవిత్వములోని పదాలకూర్పులో భావచిత్రణంలో అనగా భక్త కవితలో, జానపద గేయాల్లో ఉన్నది. ఆయన ఔన్నత్యాన్ని అందుకొన్న భావగేయకవి, తన ఓజోమయభావచిత్రణవల్ల తక్కిన కవులు ఎక్కడనుంచో కేవలం అరువు తెచ్చుకొంటారు. ఆయన భావకవితలో ఆకారమూ అంతస్సున్నూ సుష్ఠుగా సామరస్యము పొందినవి. బహినాబాయ్ చౌదరీసతి రచించిన 'బహినాయ్‌చీగానే' (1952) అనే పద్యాల్లో కర్షకవనితకున్న తెలివిడి మన హృదయాలను కదలించేస్తుంది. అటువంటివి చదివినప్పుడు ఈ ప్రాచీనార్వాచీనాలమధ్య తీవ్రమైన భేదమే లేదనిపిస్తుంది. నవ్యకవిత్వానికి, నవ్యకథానికకూ మధ్య గల పొత్తు, బాగా తెచ్చినకథకుడు గంగాధరగాడ్గిల్. ఆయన సాహసంగా సాహిత్య ప్రక్రియలలో ప్రయోగాలుచేసి చూపినవాడు. గాడ్గిల్ విచిత్ర భావ చిత్రణము అనుభవపులోతులను స్పృశిస్తుంది; అది అంతస్సులో ఉన్నట్లు అనుమానించని వ్యాఘాతాలను స్ఫురింపచేస్తుంది. మన స్వరూపం బయటపడుతుంది. సుఖం కోసం మనం అంటిపట్టుకొన్న స్వల్పభ్రమలు బలాత్కారంగా తొలగింపబడతాయి. అరవిందగోఖలే వ్యక్తికీ, పరిసరాలకూ మధ్య ఘర్షణలను, రచనచేస్తాడు. భావే విశేషంగా వ్యక్తిమీదనే దృష్టిని ఏకాగ్రము చేసినాడు అయితే ఆయన వ్యక్తికీ, సమాజానికీ, బాహిరమయిన సంప్ర

దాయధర్మాన్ని ఉద్దేశించినాడు. వెంకటేశ మదగుల్కర్ కథల్లో విశ్వసనీయసత్యము ప్రదర్శించే గ్రామీణులకథలు వ్రాసినాడు. వారిని ఒక వంక దేవతలను చేసేటటు వంటివన్నీ, మరొకవంక భావాతిరేక చిత్రణము చేసి, వారిని దయనీయులనుగా చేసేటటువంటివన్నీ జానపదగాథల అసత్యతను బాగా బహిర్గతము చేసినాడు. ఆయన కథల్లో గ్రామీణులు మానవులు మానవులై సజీవంగా ఉంటారు. వారి విషయంలో ఏ విపుల సిద్ధాంతమునూ రచయిత ప్రతిపాదించడు. ఈ నల్గురు రచయితలు నవ్యకథానికా శిల్ప కారకులుగా గౌరవార్హులు. వారిచేతుల్లో కథానికకు మహా గభీరత్వమూ, వైవిధ్యమున్నూ, వచ్చినవి. డి. బి. మోకాషి శాంత రాములు కూడా, కథలు రచించారు. ఆ కథల్లో సామాన్యంగా చలనం ఉండదు. ఆ చలనానికి వెనుక ఉన్నదే కథ అవుతుంది. నవ్యత వల్ల తప్పనిసరిగా ఆదిలో కలిగే అయిష్టతను దాటి, పాఠకుడు ఇట్టి కథలలో ఔత్సుక్యం పెంపుచేసుకో సాగినాడు. కవిత్వంవలె, కథా సాహిత్య ప్రక్రియకూడా చాలామంది యువరచయితలను, ఆకర్షించింది వారు కథానికారూపంలో శక్తిసామర్థ్యాలు పూర్ణంగా కనుక్కొన్నారు. కొత్తగా ప్రాప్తించిన స్వాతంత్ర్యం గురించి ఎవరికివారు తన విశిష్ట మార్గము ఏర్పరచుకోడానికి ప్రతి రచయితసాధన చేసినాడు. రంజిత్ దేశాయి, డి. యం. మిరాసదార్, మదగుల్కర్‌వలె, గ్రామీణులవరకే చిత్రించడానికి, పరిమితి పెట్టుకున్నారు. సదానంద రేగే యొక్క విలాస భావ చాంచల్యము గాడ్గిలువంటిదే. అయినా అతనికి స్వీయమైన విశిష్టత ఉన్నది. ఇంకా పాత పక్కిలో కథానికా రచన సాగుతూనే ఉన్నది. కొంత అమూల్య కృషి జరిగింది మహదేవశాస్త్రి జోషీ గోవాను గురించి రచించిన కథ లున్నాయి. అప్పుడు సర్వసామాన్యమై నట్లుగా అక్రమ ప్రణయ కథా రచనకు నేపథ్యంగా గోవా ప్రాంతమును చిత్రించడం ఇష్టంలేక పోయింది. ఆయన గోవాకథలు భావాతిరేకమై, సరళ జీవులకూ, దైవభీతిగల ప్రాంతీయ ప్రజలకున్నూ సంబంధించినవి. వారి చిత్తశుద్ధి పాఠక హృదయాన్ని చూరగొంటవి యన్. జి గోరే రేఖాచిత్రాలు చాలవరకు కొంకణ ప్రజలకు సంబంధించినవి. అవి అస్పష్ట భావాతిరేకతగల కథలు. అవి సాహితీగుణ విశిష్టములు.

చిన్న కథవలె నవల అంతగా వర్ధిల్లలేదు. కొంతమంది రచయితలు పరిపక్వతగల సహృదయులను ఆకర్షించాలని నవలారచన కృషి చేసినారు. అయితే అందుకు యుద్ధానికి పూర్వముండిన అవాస్తవికత, భావాతివేలతలో లాలిత్యము లేకపోవడమున్నూ ఇంకా ఉండడమే ఆటంకాలయినవి. అయినా కొందరు ప్రతిభావంతులు లేకపోలేదు. వారిలో యస్. యన్. పెండ్సే రచించిన నాలుగు నవలలు అతని అద్భుత ప్రావీణ్యానికి దృష్టాంతాలు. ఆ నవలల్లో చిత్రించింది అజ్ఞాత కొంకణ ప్రాంతాన్ని, ఆ మండలంలో నీరస జీవితోపరితలమునకు అడుగున గల ఘర్షణలను పెండ్సే స్వీకరించినాడు. అవి నవలల్లో నాటకీయ గుణాన్ని ప్రసాదించినవి. నాటకానికి జీవమును ప్రసాదించాయి. ఓజోమయమైన పాత్రలు. యన్. ఆర్ బివల్‌కార్ మొదటి నవల 'పునీత' (1948) అనేది. భారతదేశ విభజన సందర్భంలో తూర్పు బంగాళంలో బాధలను గురించిన ఈ నవలవల్ల రచయిత వృద్ధికి రాగలడని తేలింది అయితే ఆయన రెండో నవలే, తుదినవల, అందులో అనుకొన్న వికాసము చూపలేదు. విభావరీ శిరూర్‌కర్ (మాలతీ చేడేకర్) 'బలి' లో వాస్తవిక చిత్రణము చేసింది, నేరాలుచేసే జాతి స్థావరాలను గురించి — ఇది అసామాన్య క్షేత్రము. వి. వి. షిర్వోడ్కర్ నవలల్లో (కుసుమాగ్రజ కవి) అతుకని ప్రాచీన నవ్యత్వ మేళనము. నవ్య సామాజిక ప్రకరణమూ, పాతఫక్కీగా కాల్పనిక భావోద్రేకము వైపు మొగ్గూ కనబడుతున్నవి. బి. బి. బోర్కర్ విషయంలోనూ ఇదేచెప్పాలి. ఆయన గోవా ప్రాంతీయ నవలలు రచించాడు. బి. యన్. మర్ధేకర్ కవితారంగములోవలె నవలారచనలో విజృంభించలేదు. అయితే ఆయన 'చైతన్య స్రవంతీ' సంవిధానము నవలారచనలో అవలంబించిన వారిలో ప్రథమ నవలాకారుడు. వసంత కణేట్కర్‌కూడా ఆదే సంవిధానము అవలంబించినాడు. అయితే అంతగా ఆయన కృతకృత్యుడు కాలేదు. జి యన్. దండేకర్ శరపరంపరగా రచన సాగించినాడు. సానే గురూజీ విడిచిపెట్టినచోట ఆయన అందుకొని రచన సాగించినాడు. ఒక స్థాయిలో ఉండదు ఆయన కృతి. సులభమనోవికారాన్నీ, యదార్థమైన రసానుభవాన్నీ సూచించే రేఖచుట్టూ, అటూఇటూతిరుగుతూ ఉంటుంది. ప్రాచీన

రచయితల్లో ఫాడ్కే తన మామూలుధోరణిలో సక్రమంగా నవలారచన చేస్తున్నాడు. అయనకు ఇంకా అనుయాయులు అనేకులున్నారు.

రంగభూమికి సంబంధించిన కృషికూడా అంతగా జరగడంలేదు. పెద్ద పెద్దపట్టణాల్లో ఔత్సాహిక నాటక బృందాలు ధనవ్యయంచేసి, పూని కతో నాటకోత్సవాలుచేసి, క్రియాశక్తి చూపుతున్నవి. ఔత్సాహికుడు ఆధునిక నాటకాలకోసం తపిస్తున్నాడు కాని అవి అలభ్యం. పాత ఫక్కీలో చిత్రంగా వినోదముకల్పించి, నాటకాలువేయడంతో రంగోప జీవులు తృప్తిపడుతున్నారు. ఆ నాటక సమాజాలకు నిలకడలేదు. బొంబాయిలో కార్మికవాసంలో, అవిచ్ఛిన్నంగా నాటకాలు ఆడుతూనే ఉంటారు. అయితే సాహిత్యాభిరుచికలవాళ్ళకు ఆ నాటకాలు దూరమై పోయినవి వాటిల్లో పాతనాటకాల దోషాలు ముప్పాతిక మువ్వీసము ఉంటున్నాయి, గుణాలుమాత్రం లేవు. మామావరోర్కరు కాక, ఆశలు పెట్టుకోదగిన నాటక రచయితలు తక్కువ. సామాజిక సమస్యలను వ్యాఖ్యానించడానికి 'నావాజోగ్' నాటకాన్ని ఉపయోగించినాడు. ముక్తాబాయి, దీక్షితపతికూడా అంతే. అయితే ఆమె స్వీకరించిన సమ స్యలు బహుశః అంత విస్తృతమయినవికావు. వెంకటేశ వకీలుకుగల రూపక రచనాప్రావీణ్యం ముఖ్యంగా సంభాషణలో ఉన్నది. రంగం మీద ప్రయోగించకపోవడంచేత రూపకము నీరసపడిపోతున్నది. ఇదే తక్కిన రచయితల విషయంలోనూ చెప్పగలము. ఔత్సాహిక నాటక రంగంలో ఇద్దరు వర్ధిష్ణువులు పన్నెకెక్కినారు. పి. వై. మరాటె ఐతి హాసిక నాటకోద్ధరణం చేయదలచినాడు. విజయ తెండుల్కర్ ప్రజ్ఞాశాలి. ఆయనకున్న ప్రజ్ఞల్లో పరిహాసవక్రోక్తి ఒకటి. ఈ కాలంలో పి. యల్. దేశపాండె 'తుమల్దారు' అనే నాటకము అద్భుతంగా రచించాడు. గొగొల్ రచించిన గవర్నమెంట్ ఇన్స్పెక్టర్ అన్న నాటకాన్ని అనుక రించి ఇంకా చాలమంది రచయితలున్నారు, ఐరోపీయ నాటకానుకర ణాలు చేసినవాళ్ళు. వారిలో ఒక ప్రముఖుడు అనంత కాణేకర్. జనానికి నాటకాలంటే ప్రీతి నిజంగా ఉంది కాని చక్కని నాటకరంగ వికాసానికి చాలా అవరోధాలున్నాయి. తేలికగా ధనంకోసమో, కీర్తికోసమో నాటక రంగాన్ని కొందరు కొల్లగొడుతూ ఉన్నారు!

అన్యసాహిత్య ప్రక్రియలమాట చెప్పవలసినది ఎక్కువ లేదు. లక్ష్యాశ్రయ వ్యాస రచన గత తరంలో సంవిధానంకోసం సతమత మయ్యే రచయితలవల్ల పాడయిపోయింది. దానికి ఉద్ధరణ జరుగలేదు. అయినా మరొక రూపంలో వ్యాసము — కేవలము ఆత్మాశ్రయమూ క్రమబద్ధమున్నూ కానిది - అయినా సూక్ష్మంగా, ఆత్మీయ రుచితో విషయపూర్ణమై, గాఢమైనది, చక్కగా రచించారు. ఇరావతీ కార్వేసతి, దుర్గాభగవతిన్నీ. ఆర్. బి. జోషియాత్రా లేఖనంలో సిసలయిన వ్యాసా నికి కావలసిన గుణ విశిష్టత ఉన్నది. హాస్యాన్నిగూర్చి వేరుగా వ్రాయ నక్కర్లేదు. ఎందుకంటే వివిధ సాహిత్య ప్రక్రియల్లో గోచరిస్తూనేఉంది. ముఖ్యంగా నవ్యకథానికలో, కాని పి. యల్. దేశపాండే రచించిన పరి హాసము జాలువారే రేఖాచిత్రాలనూ, ప్రహసనాలనూ, ప్రత్యేకంగా పేర్కొనాలి. సాహిత్య సమీక్షా విషయంలో బి. యస్ మరధేకర్ అనన్య సామాన్య రీతిలో, శిల్పపు మూలసూత్రాల్లోకి వెళ్ళినాడు. దాని వల్ల వివాదాలు బయలుదేరినవి. అయితే ఈ వివాదాలవల్లనూ ఇతర వివాదాలవల్లనూ శిల్పికి సమాజానికీగల సంబంధము ఒక ఉత్సాహ జనకమైన వివాదము — తీవ్రపర్యాలోచనాత్మక రచన వచ్చింది. విమర్శ కుడు పూర్వసమ్మతమైన ప్రమాణాలను మనస్ఫూర్తిగా పునః విచా రించి, పునః మూల్య నిర్ణయము చేశాడు. అలా చేసిన విమర్శకులలో కుసుమావతి, దేశపాండేసతి, డి. యల్ కులకర్ణి, డి. కె. బేడెకరు లున్నారు. ఈ వివాదాలు రేగిన స్థాయినిబట్టి భవిష్యత్తులో సాహిత్యానికి ఉన్నతి ఉన్నదని తెలుతున్నది.

ఆకర గ్రంథజాతము

1. A Short History of Marathi Literature.
*By M. K. Nadkarni, Baroda, 1921*
2. History of Modern Marathi Literature. (1800 - 1933).
*By G. C. Bhate, Poona, 1939*

3. The Religious Life of India : Ramdas & Ramdas is Mysore 1928; and II Eknath,. A Marathi Bhakta, 1931.
*By W. S. Deming*
4. The Bhagat Namdev of the Sikhs, Bombay, 1938; Gramatica Marasta, Bombay, 1954; A Paizas de Christo, Bombay, 1940.
*By A. K Priyolkar*
5. The Life and Teaching of Tukaram.
*By J. N Fraser J. F. Edwards; Madras 1922*
6 The Poet Saints of Maharashtra.
*By E. Justion Abbol; Poona, 1932*
7. Ballads of the Marathas.
*By Hary Arbuthnot; Acworth; Woaon, 1894*
8. The Poems of Tukaram.
*By J. R. Fraser and K. B. Marathe; Vol. I, 1909; Vol. II, 1913; Vol. III, 1915*
9. Mysticism in Maharastra
*R. D. Ranade; Poona; 1933*
10. The Christian Purna.
*By Thomas Stephens; edited by L.L. Saldan&co., Mangalore; 1907*
11. Psalms of Maratha Saints.
*By Nicol Macnicol; 1930*
12. Jnyaneswari'
*By Manu Subedar*
13. Lingnistic Survey of India.
*By G. A. Grierson, Vol VII, P.P. 1-371*

# మలయాళ సాహిత్యము

సి. కున్హన్‌రాజా

## ఉపోద్ఘాతము

సుమారు కోటి నలభై లక్షల కేరళ ప్రజలు మాట్లాడేభాష మలయాళము. కేరళ మనే సుందరదేశము పడమటికనుమలకూ, అరేబియాసముద్రపు దక్షిణచివరకునూ, నడుమ సన్నగాఉన్నది. ప్రాచీన గ్రీకులకు ఈ దేశాన్నిగురించి తెలియును. అశోకుని శిలాలేఖనాల్లో, రామాయణ, మహాభారతాల్లో, కాళిదాసునిగ్రంథాల్లో, కేరళదేశ ప్రసక్తి ఉన్నది. కాని క్రీ శ నవమ శతాబ్దమువఱకు కేరళదేశియసారస్వతమంటూ ఉన్నట్టు విదితముకాలేదు. లబ్ధమైన తత్కాలీన సాహిత్యమైనా స్వల్పమూ, కాల విషయంలో సంశయాస్పదంగానూ ఉన్నది. క్రీ. శ. 14 శతాబ్దిలో బహుళ సాహిత్య సమన్వితమై మలయాళము పూర్ణపరిణతిపొందిన భాషగా, ప్రధానంగా 'లీలాతిలక'మనే శబ్దశాస్త్ర గ్రంథములో ఉదాహరింపబడిన వాక్యాలనుబట్టి, మనకు తెలియవస్తున్నది.

తమిళభాషా పరిణామపు మాధ్యమికదశలో మలయాళము తమిళ భాషాశాఖగా భావించే ప్రయత్నము జరిగింది. కాని ఈ సిద్ధాంతాన్ని సమర్థించడానికి తగిన సాక్ష్యమేమీ లేదు. మొదటిసారిగా సాహిత్య సంపన్నమైనభాషగా మలయాళము మనకు గోచరించినపుడు, అపారమైన స్వతంత్ర శబ్దజాలము దాని శబ్దశాస్త్రము ఛందస్సు, అలంకారిక రీతులు అందులో చూడగలము. అనంతరము మలయాళము మీద సంస్కృత ప్రాబల్యము వచ్చినది. చివరకు ఛందస్సుల్లోకూడా సంస్కృతఛందస్సులే ప్రముఖముగా గోచరిస్తున్నవి. అయినప్పటికి విఖ్యాతకవిగా శిల్పులు దేశీయమైన మలయాళఛందస్సులనే గ్రహించి మలయాళభాషలో కలిసిపోయిన సంస్కృతశబ్దాలనుమాత్రమే ప్రయో

గించినారు. మలయాళఛందస్సులలో సరళ స్వచ్ఛంగా మలయాళ కవిత ప్రవృద్ధమవుతూ వచ్చింది. దానితోపాటు కొన్ని మలయాళ సాహిత్యశాఖలు, సంస్కృత ఛందస్సులవల్ల, సంస్కృత శబ్దజాలంవల్ల, ప్రభావితమవుతూ వృద్ధిచెందినవి.

మలయాళ సాహిత్యంలో సంప్రదాయక మహాకావ్య యుగము చెరుస్సేరి కృత 'కృష్ణగాథ' క్రీ॥ శ॥ 15 వ శతాబ్దితో ఆరంభమైనదన వచ్చును. సంప్రదాయక మలయాళమునకు పూర్వయుగములో మూడు విలక్షణమైన సాహిత్యశాఖలు మనకు గోచరిస్తవి. మొదటి రెండుశాఖలు క్రమముగా తమిళ సంస్కృత ప్రభావము కలిగినవి. మూడవశాఖ దేశీ జానపద గేయసాహిత్యము. ఈ సాహిత్య శాఖలవల్ల క్రీ॥ శ॥ 16 వ శతాబ్దిలో ఉన్న ఎజుహట్టచన్ చేతుల్లో, స్థిరమైన మలయాళము సంప్రదాయక గ్రాంధికభాషగా రూపొందినది. మలయాళ సాహిత్యంలో ఎజుహట్టచన్ స్థానాన్ని హిందీభాషలో తులసీదాను, తమిళములో కంబన్‌తో, పోల్చవచ్చును. బహుళప్రజానీకము భక్తి ప్రపత్తితో ఆయన రచించిన అధ్యాత్మరామాయణ మహాభారతాలను పఠిస్తున్నది. ఎజుహట్టచన్ అనేక గ్రంథాలు రచించినాడు. ఆయన రచనలు సాహితీ ప్రౌఢిమతో దార్శనికతతో విశిష్టంగా ఉంటవి.

క్రీ॥ శ॥ 17 వ శతాబ్ద మధ్యమునుంచి సుమారు రెండు శతాబ్దాలు కేరళలో కథాకళీసాహిత్యం ప్రముఖంగా ఉంటూ వసున్నది. కొట్టారక్కర తంపురాన్, కొట్టాయం కేరళవర్మ, ఉన్నాయ్ వారియార్, ఇరయిమాన్ తంపి ఈ క్షేత్రంలో ప్రముఖులు.

మధ్యమకాలిక మలయాళ రచయితల నామావళి సంతటిని ఉల్లేఖించుట అసాధ్యము. అయితే ఎజుహట్టచన్‌తో పోల్చదగిన మరొక మహాప్రతిభాశాలిని పేర్కొనాలి. ఆయనపేరు కంచన్ నంబియార్ క్రీ శ॥ 18 శతాబ్ది పూర్వార్థములో వర్థిల్లినాడు. ఆయన "తుల్లాల్‌పట్టు" అనే సాహిత్య ప్రక్రియను ప్రారంభించి దానిని విస్తరింప చేసిన కేరళదేశ ప్రథమ ప్రజాకవి ఇతి వృత్తాలను పురాణములనుంచి స్వీకరించినాడు. అయితే వాటిని ఆధారం చేసికొని సమాజాన్ని పరామర్శిస్తూ హేళనచేసినాడు. పురాణ గాథలకు స్థానిక వాతావరణం కల్పించి సరళమైన దేశీయరీతిలో

కథనము పొగించినాడు. ఆయన కవితలో సంప్రదాయక గాంభీర్యము ఉదాత్త సాహితీ సౌష్ఠవము మాత్రకాను గుణంగా భావపోషణమున్నూ ఉన్నవి.

## 19 వ శతాబ్ది

కౌటిల్యుని అర్థశాస్త్ర వ్యాఖ్యానాలనుబట్టి క్రీ. శ. 14 వ శతాబ్దారంభములోనే మలయాళంలో ఒక రకమైన వచన రచన ఉన్నమాట వాస్తవము. కాని నవీన వచన రచన, ముఖ్యంగా సాహితీ శైలిలో వచన రచన, 19 వ శతాబ్దిలోనే నెలకొన్నది. ఈ సందర్భములో క్రైస్తవమత ప్రచారకుల యత్నాలను కృతజ్ఞతా పూర్వకంగా స్మరించక తప్పదు. మలయాళభాషలో ఉదారమైన విద్యావ్యాప్తికి, మతధార్మిక నైతిక రచనానువాదాలకు నిజంగా వారు మార్గదర్శకులు.

19 వ శతాబ్ది మధ్యంలో కేరళంలో నవ్య విద్యా ప్రభావం ద్యోతకం కావడం ఆరంభమైంది. నూతన పాఠశాలలకు రకరకాల పాఠ్య పుస్తకాలు కావలసివచ్చినవి దీని సద్యఃఫలితంగా సంస్కృత సాహిత్యంలోని మహాకావ్యానువాదోద్యమం జనరంజకంగా బయలుదేరింది. కవులు సంస్కృత కావ్యశైలిని అనుకరిస్తూ సంప్రదాయకంగా, సౌష్ఠవంగా, రచనకు పూనుకొన్నారు. కాని వారి ఉపజ్ఞాజాతమైన కవిత, సామాన్యులకు దూరమైపోయింది. ఈ సంప్రదాయక మార్గంలో కొంత ప్రౌఢిమ, కాఠిన్యమూ ఉన్నప్పటికీ, ఆ కృతినే ఆరాధిస్తున్న మయూర సందేశకారుడైన కేరళవర్మ (1915 వ మృతి) కలకాలముండే కావ్యరచనలు చేసినాడు.

దీనితోపాటు మరొక నూతన సాహితీమార్గముకూడ బహుళ ప్రజామోదం పొందుతూవచ్చింది. సాహిత్యభావాన్ని అభివ్యక్తం చేయడానికి వ్యావహారికభాషను వాడడమే, ఈ మార్గ లక్షణము. కొడుంగల్లూర్ రాజులు, వెన్మాని, నంబూద్రిపాదులు, ఈ ఉద్యమనాయకులు. కొడుంగల్లూర్ కున్నికుట్టిన్ థంపురాన్, అతని సోదరుడు; దిగ్దంతులైత సంస్కృత పండితులు. ఐనా వారి మలయాళరచనలలో సంస్కృత వ్యాకరణరీత్యా వాక్యనిర్మాణం కన్పడదు. కేరళవర్మరచనలో వాక్య

సరణి సంస్కృతమువలె ఉంటుంది. వెన్మాని ఇంకా ముందుకుపోయి ప్రజల దైనందిన భాషలోనే కవితారచన చేసినాడు. తద్వారా మలయాళసాహిత్యానికి ఓజస్సువచ్చింది. భావాన్ని సూటిగా వ్యక్తము చేయడం సంభవించింది. వారి స్వతంత్రరచనల్లో గుణము ఉదాత్తంగా లేకపోయినా, మలయాళంలో వారు ప్రథమాధునిక రచయితలు.

ఇటువంటిలక్షణమే వచనములోనూ, గోచరిస్తున్నది. సంప్రదాయక సారస్వతోజ్జీవనయుగములో, లభ్యమవుతున్న, క్రీ. శ. 15, 16 శతాబ్దాల వచనరచనలో వలెనే పూర్తిగా సంస్కృతప్రభావముతో, ప్రాచీన మలయాళ సంప్రదాయాలు కనబడుతున్నవి. ఇక్కడకూడా కేరళవర్మ సాహిత్యానికి ప్రమాణము ఏర్పరించినాడు. ఆయన శైలికృతకమై, సురుచిరాలంకార భూయిష్ఠం కావడముచేత, ఆయనను అనుకరించే వారు తక్కువైనప్పటికీ, తిరువనంతపురీయ లేదా దాక్షిణాత్యమార్గము సంస్కృత పక్షాన మొగ్గు చూపుతున్నది. తిరువనంతపురీయులు సంస్కృతపదజాలము ధారాళముగా వాడుకోడమేకాకుండా, ప్రవృద్ధ మవుతున్న భాషకు అస్వాభావికమైనా, సంస్కృతపదాలను ఉపయోగించడంలో, స్వచ్ఛమైన సాహిత్య ప్రామాణ్యము అవసరమని గట్టిగా చెప్పినారు.

కాని ఈ శైలి ప్రజారంజకము కాలేకపోయింది. పత్రికలూ, మాస పత్రికలూ, వచనరచనను రూపొందించే యత్నంచేసి, ఈ సాహిత్యశైలి దైనందిన వ్యవహారానికి అతిభారమని గుర్తించాయి. దీనికితోడుగా వ్యావహారిక వచనరచనకు ఒకానొక నూతన ప్రముఖుడు పూను కొన్నాడు. చందుమీనన్ 'ఇందులేఖ' అనే నవలలో సంప్రదాయిక సాహితీపరుల సిద్ధాంతాలను ధైర్యంతో ఎదుర్కోడమేకాకుండా, గుణ భూయిష్ఠమైన సాహిత్యశైలిలో, వచనరచన, వ్యావహారిక భాషలోనే చేయవచ్చునని చేసి చూపినాడు.

ఒక ప్రముఖవ్యక్తి గద్యపద్యరచనలో మధ్యమార్గము కనుక్కొని భావి మలయాళ భాషావికాసానికి, ప్రాతిపదికను ఏర్పరించినాడు. ఆయన ఏ. ఆర్. రాజరాజవర్మ–వైయాకరణి, కవి, విమర్శకుడున్నూ. ఆయన 'కేరళపాణినీయ' మనే ప్రామాణిక వ్యాకరణము తొలిసారి

మలయాళమునకు సమకూర్చినాడు. ఆయన మలయాళభాషకు ప్రామాణ్యము సంఘటింపచేసినవాడనవచ్చును. అలా చేయడంలో ఆయన కేరళవర్మ అనుసరించిన సంస్కృతీకరణాన్నీ, వెన్మాని యత్నించిన వ్యావహారిక భాషాప్రయోగాన్నీ. విసర్జించినాడు. క్రీ. శ. 1915 తో ఈ ప్రారంభయుగము అంతమైనదనవచ్చును.

స్వతంత్రరచనల్లో గుణసౌష్ఠవం తక్కువైనా, ప్రతిక్షేత్రంలో చాలాకృషి జరిగింది. కనుక, ఈ యుగము ముఖ్యమైనదే. సంస్కృతాంగ్లానువాదాలు చాలా బయలుదేరి, మలయాళసాహిత్యాన్ని విస్తృతము చేసినవి. మహాకావ్యాలు, రూపకాలు, కుమారసంభవము వంటి కావ్యాలు, యథాతథంగా అసంక్షిప్తంగా, చక్కగా అనువాదరూపంలో లభ్యమైనవి. ఆంగ్లంలోని మహాసాహిత్య గ్రంథాలుకూడా అనువదింప బడ్డవి; అయితే ఆ అనువాదములలో సౌష్ఠవము లోపించింది. ఆ యుగం లోనే చందుమీనన్‌గారి 'ఇందులేఖ', 'శారద', సి. వి. రామన్‌పిళ్ళై గారి 'మార్తాండవర్మ' వంటి గొప్ప నవలలు వచ్చాయి. నాటకాలు సంప్రదాయిక లక్షణానుసారంగా రచయితలురాస్తూ, నవ్యమైన ఇతి వృత్తాలుకూడా తీసికొన్నారు. కొచున్నితం పురాన్ 'కళ్యాణి' నాటకంలో సమకాలిక సాంఘికజీవితము స్వీకరించినాడు. మావిలిక్కర కొచ్చిప్పన్ తరకన్ రచించిన 'మరియమ్మ' నాటకంలో క్రైస్తవజీవితము ప్రతి బింబించింది. తక్కిన సాహిత్యాంగాలనుకూడా కవులు ఉదాసీనంగా చూడలేదు. 'కేసరి' అనే ఉపనామంతో కుంజిరామన్ నాయనార్ వంటి ప్రముఖుడు హాస్యజనక లఘువ్యాసాలు రచించి, ఈ సాహిత్యవిధాన మును సారస్వతంలో జనరంజకంగా చిత్రించినాడు. పి. కె నారాయణ పిళ్ళై, అనంతపాయ్‌గార్లు పాశ్చాత్య సమీక్షాప్రమాణాలు ప్రయోగించి, ప్రాచీన కవిసత్తములయు, ఆధునికకవులయు గ్రంథముల సాహిత్య సమీక్షలుచేసి కృతకృత్యులైనారు. ఏతావతా, సర్వాంగసౌష్ఠవంగా మలయాళభాష, రూపొందడానికి ఇది యుగప్రారంభమనవచ్చును. భాషావికాసానికి అవశ్యక పరిస్థితులు జతపడడంవల్ల ఈ యుగంలో కవులు కొత్తదారులు తొక్కినారు. నవ్యసంవిధానాలు, భావాలు, రచనా రూపాలవల్లనూ, సాహిత్యప్రవృత్తికి చాలా ప్రోద్బలంకలిగింది. సంప్ర

చాయక రచనాను వాదాలను మినహాయిస్తే, అపారంగా ప్రవృద్ధమయిన ఈ సాహిత్యం పది కాలాలపాటు నిలిచేదిగా కనబడడంలేదు. రఘు వంశము, నైషధమువంటి మహాకావ్యశైలిలో, వైదుష్యాన్నీ, కావ్య శిల్పాన్నీ, ఆకాలపు మహాకవులు ప్రదర్శించినారు. కాని భవిష్యత్తులో వాటిని బహుశః ఎవరూ చదువలేకపోగా సాహిత్యంలో విచిత్రప్రాయా లవుతవి. కాని ఆ మహాకవులు అద్భుతకృషికి నిదర్శనభూతులై భాషకు ఒకరూపము ప్రసాదించారు.

## ఆధునికయుగము

కుమారన్‌ఆశాన్ ప్రచురించిన 'నళిని' అనే ఖండకావ్యంవల్ల సాహిత్యాభిరుచిలో విప్లవాత్మక పరివర్తనము తొలిసారిగా గోచ రించింది. ఆ ఖండకృతిలో ఇతివృత్తము ప్రేమ అయినప్పటికీ, అది విశిష్టమైనది కుమారన్‌ప్రేమను ఇతివృత్తంగా స్వీకరించి, సూక్ష్మశిల్ప నైపుణితో మలచినాడు. ఆయన ప్రేమవల్ల కలిగిన ఉదాత్త పార మార్థిక జీవితానుభూతిద్వారా, అనురాగానికి 'ఊర్ధ్వపాతనము' (Sublimity) సమకూర్చినాడు. ప్రాచీనుల నిర్జీవశృంగారము, సంస్కృతకవుల శృంగారనాయికల సంచారీస్థాయి భావాలమీద ఆధార పడింది. ఆయన ఆ మార్గానికి భిన్నంగా వెళ్ళినాడు. కేరళవర్మ ప్రవేశ పెట్టిన సంపన్నమైన పదగుంభన సంప్రదాయాన్నికూడా కుమారన్ విడిచిపెట్టి, దానికి బదులుగా సుకుమార శయ్య అవలంబించి, బాహ్య కృతికన్న సూక్ష్మ భావవివేచనము ప్రధానంగా పెట్టుకొన్నాడు.

'నళిని' అనే కావ్యం నవ్య భావ వ్యక్తీకరణకు శ్రీకారంచుట్టినా, ప్రాచీన సాహిత్యశైలి తగ్గిపోవడానికి మరికొన్ని సంవత్సరాలు పట్టింది. అప్పుడు మలయాళ సాహిత్యము ఆధునిక దశలో అడుగుపెట్టింది. ఈ సారస్వతోద్యమానికి ప్రధాన పురుషుడు, వల్లత్తోల్. ఆయన 1915 లో 'ఒరుచిత్రం' అనగా ఒక చిత్తరువు అనే రచన ప్రచురించిన నాటినుంచీ, నవ్యకవితామార్గము ప్రారంభమైంది. వల్లత్తోల్ మహా కావ్య మార్గగాములలో అగ్రగణ్యుడు. అయితే ఆధునిక యుగతత్త్వము వల్ల, ఆయనలో మార్పువచ్చింది. అదివరకే ఆయన వాల్మీకిరామాయణ

ముని యథాతథంగా పద్యానికి పద్యం అనువదించి, ప్రకటించి నాడు; ఆయన అష్టాదశసర్గల్లో 'చిత్రయోగ' మనే మహాకావ్యము ఆ కాలపు ఆచారంప్రకారం చెప్పినాడు. దేశమంతటినీ జాతీయోద్యమం ఉత్తేజపరుస్తున్నప్పుడు, ఆయనలో మార్పు కలిగింది. ప్రథమప్రపంచ సంగ్రామంవల్ల జాతీయోజ్జీవనశక్తులు విజృంభించగా, యావద్భారత దేశంలో మానవులు నవ్యజీవితముకై పరితపించినారు. వల్లత్తోల్ ఈ నవజీవన మహాకాంక్షకు, వ్యాఖ్యాత అయినాడు. సంకుచితత్త్వంలేని జాతీయ శంఖారావము పూరించి మహోదాత్త జాతీయాదర్శ ప్రతిబింబ మును సృజించుకొన్నాడు. అందుకాయన ప్రాచీన మలయాళకవి పరం పర మార్గంలో దేశీయ ఛందస్సులో గ్రహించి, ముందు తానువాడిన సంప్రదాయిక సంస్కృత ఛందస్సులు విడిచిపెట్టినాడు. సుమారు పదేళ్ళపైగా కవితా ప్రతిభవల్ల ఆయన రసపుష్టిగల కావ్యాలను సాహిత్యప్రక్రియాసౌష్ఠవం విడవకుండా కురిపించినాడు. ఆ కవీశ్వరుని కవితాప్రతిభ ప్రముఖమైన ప్రతి జాతీయమైన ఇతివృత్తాన్నీ స్పృశిం చింది. ఆయన సాంఘికంగా ఆర్థికంగాజరిగే అన్యాయాలు సహించలేక పలవిస్తూ, భవిష్యత్తు పిలిచేపిలుపు వినకుండా ఊరుకోలేదు. అయినా వల్లత్తోల్ ఈ యుగంలోకూడ కేవలం జాతీయతనూ, సామాజికమైన అసంతృప్తినీ, వ్యక్తముచేసే కవిత్వముమాత్రమే చెప్పలేదు ఆయన ఉత్కృష్టరచన 'మగ్దలానీమరియం' కూడా ఈ యుగంలో ఫలించిందె. ఆ కావ్యంలో అద్భుతమైన ఆధ్యాత్మికమైన శాంత వాతావరణంలో క్రీస్తును సృష్టిచేసి, మారిమగ్దలానీ జీవితమునూ, ఆమెలోవచ్చిన మార్పునూ కవి కావ్యవస్తువుగా చేసినాడు.

వల్లత్తోల్, కుమారన్ఆశన్, ఉల్లూర్ పరమేశ్వరయ్యర్ అనే ముగ్గురుమూర్తులవల్ల నవ్యోద్యమము వృద్ధిపొందింది. ఉల్లూర్ మంచి విద్వాంసుడు. ఆయన తన ఆరంభజీవితంలో కేరళవర్మ అవలంబించిన సాహితీ సంవిధానాన్నే, తు చ తప్పకుండా అనుసరించి, [1]ఉమ

---

1 ఇతర భారతీయభాషల్లో దీన్ని అనువదింపచేయడానికి సాహిత్య అకా డమీ పూనుకొన్నది. —సంపా.

కేరళమ్ ' అనే కొంత పాటవముగల మహాకావ్య రచన చేసినాడు. ఆయన ప్రాచీన లాక్షణికులమార్గం అనుసరించినా నవీనోద్యమంవల్ల పరవశుడైనాడు. అయితే ఆయన సామాజికవిషయాల్లో పూర్వాచారాల ఉద్ధారకుడు కావడంచేత, సమకాలిక యుగతత్వమును గ్రహించలేక పోయినాడు ఇయనది ఎప్పుడూ పురాతనాన్నిచూచే వెనుకచూపు. ఉల్లూర్ రచనల్లో 'పింగళ ' వంటి బృహత్కావ్యాల్లో, కథావస్తువు ప్రాచీనమైనదే. అందన ఆయన మేరీమాగ్దలీనా అనే కులట మోక్షాన్ని పొందిన ఇతివృత్తంవంటిదే స్వీకరించినాడు. ' కర్ణభూషణము ' లోనూ ఆయన ప్రాచీనతనే అభిమానించినాడు. ఆయన శైలికూడా కేవలం సంస్కృత సమాన భూయిష్ఠము, యత్నపూర్వకము అలంకారశోభిత మున్నూ. అందుచేత ఆయన కృతులు జనామోదము ఎప్పుడూ ఎక్కువగా పొందలేదు.

కుమారన్ ఆశాన్ విషయము తద్భిన్నము. వళ్ళత్తోల్‌కంటె నవ్యోద్యమము అతన్ని ఉఱ్ఱూతలూపింది. అందుచేత కుమారన్ పాటవముతో, ఓజస్సుతో, భావాభివ్యక్తముచేసి, మలయాళ సాహిత్యంలో మహోన్నతస్థానము పొందినాడు. ఆయన తొలిసారిగా చెప్పిన 'వీణపువు' (అనగా ' రాలినపూవు ') అన్న కావ్యంవల్ల, ప్రాచీన సంప్రదాయాన్ని బుద్ధిపూర్వకముగా విసర్జించినట్లు, విశదమవుతున్నది. ఆయన ఆదిలో రచించిన ' నళిని ' ' లీలా ' నామక కావ్యఖండికల్లో సఫలము కాని ప్రేమ ఇతివృత్తము. ఆ రచనల్లో ఆయన కావ్యరచనా ప్రావీణ్యము ఉదాత్తంగా గోచరిస్తుంది. కాని సామాజిక కథావస్తువును స్వీకరించి నప్పుడే ఆయన ప్రతిభ బాగా వాసించింది. కుమారన్ అత్యుత్తమ కావ్యత్రయం ' దురవస్థ ' ' చండాలభిక్షుకి ', ' కరుణ ' అన్న వాటిని రచించాడు. మొదటి రెండుకృతులూ బహుకాలంనుంచీ సంఘంలో హేయంగాచూస్తున్న సమాజాక్రోశంతో ప్రతిధ్వనిస్తున్నవి. ' దురవస్థ ' అనే ఖండకావ్యంలో మోప్లావిప్లవకాలంలో ఒకానొక బ్రాహ్మణ స్త్రీ ఇల్లూవాకిలీ, అయినవాళ్ళనూ కోల్పోయి అస్పృశ్యుడికి భార్య కావలసి వచ్చిన కథను కవి చిత్రించినాడు. అది హృదయాన్ని ద్రవింపజేసే సుందర ఖండకావ్యం. గాఢమైన చిత్తశుద్ధితో భావోద్రేకంతో చెప్పిన

కావ్యమది. 'చింతావిష్టాయయాసీతా' అనే ఖండకృతిలో నారీత్వ పరామర్శ వస్తుంది. సీత యదార్థమానవభావాలను వ్యక్తంచేసింది. సనాతన విమర్శకులు నిశితంగా యీ కావ్యాన్ని విమర్శించారు. కావ్యదృష్టితో చూచినప్పుడు, ఈ కృతి నిస్సంశయంగా ఉత్తమమైంది. ఆయన ఘనంగా సజీవపాత్ర సృష్టి సాధించాడు. ఒక్కొక్కసారి ఆయన శైలి పెడసరంగా ఉంటుంది. అయితే పాత్రపోషణలో తక్కిన కావ్య నిపుణులు ఇద్దరికన్న, కుమారన్ నిశ్చయంగా ఘనుడనే చెప్పాలి.

కావ్యనిర్మాణపారీణులైన ఈ ముగ్గురివల్ల, మలయాళ కవిత్వం మూడు పూవులు ఆరుకాయలుకాచి, వర్తమానమయిన ఔన్నత్యాన్ని అందుకొన్నది. వ్యాసరచనా పరిమితి అతిక్రమించడానికి వీలులేదు కనుక, నవీన కాలంలో ప్రముఖ రచయితలను ప్రస్తావిస్తాను. న్యూన శ్రేణిలోని కవులలో ఎ. జి. బాలకృష్ణ పణిక్కరును, కాల్పనిక భావోద్వేగతలో, అగ్రేసరుడని మొదట పేర్కొనాలి. చిన్న వయసులోనే అతను రాలిపోయినా తన తరము వారిని గాఢంగా ఆకర్షించినాడు. నలప్పట్ నారాయణమీనన్ ఎక్కువ రచనలు చేసిన కవి కాకపోయినా కొన్ని కృతుల్లో ముఖ్యంగా 'కన్నునీర్‌తుళ్ళి' అనే విషాద కావ్యంలో వస్తువు, భార్యమరణము; ఆ కావ్యంలో పదికాలాలపాటు నిలిచే గుణమున్నది. ఆయన అనుభూతి యథార్థమూ, గాఢమూ కావడంవల్ల, కన్నునీర్‌తుళ్ళి జీవనసంబంధమైన ప్రగాఢ సత్యాలను స్పృశిస్తున్నది. ఆయన కావ్యాలన్నిటిలో ఆవికిగల పర్యాలోచనా స్వభావాన్ని చూడవచ్చును. ముఖ్యంగా 'చక్రవాళం' 'ఒరుమనల్‌తరి' (అనగా ఇసుకరేణువు) అన్న కృతుల్లో, ఆయన ప్రజాకవికాడు; సంస్కారంగల కొద్దిమందికే కావ్యము చెప్పినాడు అనిపిస్తాడు.

మరొక ప్రముఖవ్యక్తి చిన్నవయసులోనే రాలిపోయినాడు. ఆయన చంగంపుజెహ కృష్ణపిళ్ళె. ఆయన కవిత్వంలోని సంగీత మాధుర్యం వల్లనూ, భగ్నమనోరథములను కవిత ప్రతిబింబించడం చేతనూ ఆయన సజీవుడై ఉన్నప్పుడే అధికంగా అశేష ప్రజామోదం పొందినాడు. ఆయన 'రమణన్' అనే దీర్ఘమైన జానపద విషాద కావ్యము, ఇడప్పళ్ళి రాఘవన్‌పిళ్ళె అనే ప్రియమిత్రుని ఘోరమరణ

సందర్భంలో రచించినాడు. కవి తొలి ఇరవయ్యేళ్ళ జీవితకాలంలో రచించిన 'రమణన్' అనే కావ్య సౌందర్యము సహృదయులను వెంటాడుతుంది. ఇతివృత్తానికి చక్కగా అనుకూలంగాఉన్న భీషణ రమణీయ గీతికామాధుర్యంవల్ల కవి పాఠకులలో కేవలం పదాలు బాగా వ్యక్తము చేయలేని, నైరాశ్యము కలిగించాడు. చంగంపుజహ అమితంగా రచనచేసినాడు. ఆయన రచనా ప్రభావము ఈ నాటి యువ కవులను ఆలముకొన్నది. ఆయన మిత్రుడు ఇడప్పల్లి బహుళగ్రంథ నిర్మాత కాకపోయినా భవిష్యత్తులో బహుకాలం ఆయన ఉత్తమ కవి తను అత్యుత్సాహంతో కొందరు సహృదయులు ఆస్వాదిస్తారు.

పర్వతో ముఖప్రజ్ఞాశాలి అయిన సర్దార్ కె. యం. పణిక్కరు నవీన గ్రంథ రచయితలలో ఒకరు. నిజానికి ఆయన ఎంత ప్రతిభాశాలి అంటే, తన రాష్ట్రముకాని రాష్ట్రంలో, విదేశీయ రాయబారిగా, చరిత్ర కారుడుగా, ప్రసిద్ధాంగ్ల రచయితగా వన్నెకెక్కినాడు. అయితే కేరళేతర ప్రజలకు ఆయన ప్రముఖ మలయాళకవులలో ఒకరనీ, నాటకకర్తగా, నవలా రచయితగా, విమర్శకుడుగా, సమస్తసాహిత్య ప్రక్రియలూ చేబట్టి, సంపన్నము చేయకుండా ఉండలేదనీ తెలియదు. 'చింతా తరంగిణి', 'పంకిపరిణయం', 'అంబపాలి' అనే కృతులు ప్రత్యే కంగా పేర్కొన తగినవి. 'కుమారసంభవమ్', 'ఇనప్పాటుకల్', 'పతింజముర్రి,' అనేవి ఆయనచేసిన కావ్యానువాదాలు-లాక్షణికధోరణి లోని 'భీష్మన్', 'మండోదరి', 'ధృవస్వామిని' అనే నాటకాలను పేర్కొనవచ్చును. ఆయన శైలి సరళంగా, సొగసుగా, ఉంటుంది. సంస్కృత ద్రవిడ ఛందస్సులు రెండూ ఆయన చెప్పినట్టు వింటవి. పణిక్కర్‌చేసిన వచనరచనలలో 'స్వీయచరిత్ర', 'కేరళసింహము'[11] అనే ఐతిహాసిక నవలలోనూ, చురుకైనబుద్ధి, విస్తృతసంస్కారము, చారిత్రక దృక్పథమున్నూ, ప్రత్యక్షమవుతున్నాయి.

---

[11] ఇటీవల ఇది హిందీలో అనువదింపబడి, సాహిత్య అకాడమీవారిచే ప్రకాశితమైంది. —సంపా.

బాగా వన్నెకెక్కిన కవులలో ఈ యుగంలో జి. శంకర్‌కురుప్ ప్రముఖుడు. కావ్య నిర్మాణశక్తులు ఆయనలో ఈ కాలంలోనే పరిపాకము పొందినవి. ఆయన భావగేయకవిగా, ప్రతీక ద్వారా భావమును స్ఫురింపచేయడం. ప్రధాన సంవిధానంగా ఏర్పరుచుకొన్న కవిగా, ఆధునిక కవికోటిలో ఉన్నతస్థానము పొందినాడు. ఆయన కావ్యరత్నము సానపట్టినతీరుగా ఉన్నది. సానలుతీర్చిన జాతిరత్నాలవంటి పదాలను పోహళించడమేకాక, ఎక్కువగా ప్రతీకలద్వారా భావాభివ్యక్తీకరణం చేయడమే. ఇతరకవులకన్న ఆయనలో విశిష్టత. ఆయన నవీనకాల సామాజికార్థిక ప్రేరణల గాఢప్రభావము పొందినాడు. యువజనాభ్యుదయవాదం ఆయన కవితలో ప్రతిబింబితమైంది. కాని వల్లత్తోల్ వలె ఆయనదృష్టి బహుముఖంగా ఉంటుంది సంస్కృతివిషయంలోనూ నిరవచ్ఛిన్న సంప్రదాయ విషయంలోనూ, భారతీయతనే ఆయన గాఢంగా వక్కాణిస్తూ, సనాతనుడై గోచరిస్తాడు. ఆయన వామపక్ష సామాజిక సిద్ధాంతాలు సోకడంవల్ల, నవ్యుడుగానూ కనబడతాడు.

పూర్వయుగానికిచెందిన కొంతమంది కవులను వేరువేరుగా పేర్కొనాలి. కుందూరు నారాయణమీనన్ ద్విపదకావ్యము నవీన విధానంలో రచించి, కవితను జేగీయమానము చేసినాడు. కవి ఇందులో ప్రజారంజకంగా ఉండే గేయాల్లోని కథలనే, ఇతివృత్తంగా తీసికొన్నాడు. ఆయన సంస్కృత పదజాలము పూర్తిగా విడిచిపెట్టి, (పక్కా) శుద్ధ మలయాళభాషనే ప్రయోగించి, సాహిత్యానికి విశిష్టశోభ కూర్చినాడు. 'కోమప్పన్' అనే కావ్యము ఆయన అద్భుత ప్రజ్ఞాఫలము. కావ్యకథనంలో ఒక్క సంస్కృతపదాన్నికూడా ప్రయోగించకుండా, శాబ్దికంగా సాము గరిడీలు చేయడం అలా దూరంగాఉంచితే, నారాయణమీనన్ కవితలో స్వచ్ఛత ఓజస్సు, సౌందర్యం అపూర్వంగా తీసికొని రాగలిగినాడు కట్టకయత్తిల్ చెరియన్ మాప్పిలాయి అనే మఱొక కవి ప్రాచీన మార్గానికి చెందినవాడు. 'శ్రీ ఏసు విజయ' మనే మహాకావ్యం రచించాడు; పాతనిబంధనలోనిది. క్రీస్తు జీవితంలోనివి ప్రధాన సన్నివేశాలను ఇతి వృత్తంగా స్వీకరించాడు. వడక్కుమకూర్ రాజరాజవర్మ ప్రాచీన కవితా మార్గంలో వాడైనా, ఇంకా పటిష్ఠంగా కావ్యరచనలు

పొగిస్తున్నాడు. ఆయన చాలా మహా కావ్యాలు రచించాడు. వాటిలో రాఘవాభ్యుదయం ఆయన కవితా పటిమను చూపుతుంది.

ఆదినుంచీ మలయాళ సాహిత్యాన్ని కవయిత్రులు తమ రచనలతో పంపూర్తి చేస్తూవచ్చారు. క్రీ. శ. 1915 పూర్వము తోట్టకట్ ఇక్కవు అమ్మ అనే కవయిత్రి గద్యపద్య మిశ్రంగా సంప్రదాయిక మార్గంలో, 'సుభద్రార్జునం' అనే రూపకం రచించింది. దానివల్లనే ఆమెకు ప్రశస్తి వచ్చింది. ఇటీవల కవితాక్షేత్రంలోని నలప్పాట్టు బాలమణి అమ్మ, లలితాంబికా అంతార్జనం, మేరీజాన్ తోట్టమ్, ముతుకులం పార్వతమ్మలు ప్రశంసార్హులు. బాలమణి అమ్మ మాతృత్వాన్ని వర్ణించిన కవయిత్రి. ఆమె కావ్యంలో భావోద్వేగం అధికంగా ఉండడమేకాక భాష, శయ్య, ఔచిత్యము, చాల శ్రద్ధగా నిర్వహించింది.

లలితాంబిక కథానికా రచయిత్రిగా, లోకానికి ఎక్కువగా తెలిసినదయినా కవయిత్రిగాకూడ, వాసికెక్కినది. మేరీజాన్ తోట్టమ్ సాహితీ ప్రపంచంలో కొద్దికాలం జీవితం గడిపి, పరివ్రాజికగా మారి పోయింది. ఆధ్యాత్మిక చిత్తవృత్తి, ఆమె రచనలలో ముఖ్యంగా, "కవితారామము" అనే కవితా సముచ్చయంలో గోచరిస్తుంది. అందుకని 'అంతరంగస్వగతం' అనే కవితాఖండంవల్ల శైలీ పరిపాకము లేకపోయినా, పర్యాలోచనాశీలముగల ఉదాత్త కవయిత్రిగా, ఆమెలోకవిదిత.

## కొత్తమలుపు

సుమారు క్రీ. శ. 1836 లో మలయాళకవిత కొత్తమలుపు తిరగడం ఆరంభించింది. జాతీయోద్యమంవల్ల వచ్చే ఉత్తేజము శమించి పోగా ముఖ్యంగా వామపక్షసంబంధ రాజకీయ తత్త్వమువల్ల, యువకులుద్రిక్తులైనారు. యువజనుల కవితాసిద్ధాంతము ప్రశస్తిలోకి వచ్చింది. ప్రాచీనకవుల రచనల్లోని చిత్తశుద్ధిరాహిత్యాన్ని, స్వీయానుభూతివల్ల ఉద్భవించని కుహనాభావమునూ తీవ్రవిమర్శకులు చీల్చిచెండాడగా, అభ్యుదయ కవితామార్గం అవలంబించిన యువకవులు, ప్రాచీన సాహితీ పరులను ముఖాముఖి సవాలుచేసి 'పురోగమనవాదా'న్ని సారస్వత

రంగంలో ప్రవేశపెట్టినారు. ఈ అభ్యుదయ సారస్వతక్షేత్రంలో విమర్శకాగ్రేసరులు, ఎ. బాలకృష్ణపిళ్ళె, జోసఫ్‌మందాస్సెరి, యం. పి. పాల్ ప్రభృతులు. ఈ పురోగమన మార్గగాములయిన కవుల కృతులు ఉత్తమ కావ్యశ్రేణిలోకిరావు. ముఖ్యంగా కథానిక నవలారచనల్లోనే వీరు కృతకృత్యులైనారు. ఐనా చాలమంది ప్రముఖరచయితలమీద అభ్యుదయప్రభావం ఉన్నదని అందరూ అంగీకరించాలి. అభ్యుదయ కవులు ప్రసిద్ధ గ్రంథకర్తలకు నవ్యదృక్పథంకూడా కలిగించారు. ముఖ్యంగా పల్లత్తోల్, శంకరకురూపుల కావ్యాల్లో అభ్యుదయభావ ప్రభావం విశేషంగాఉంది. కేవల పురోగమనవాదుల్లోకూడా సమర్థులయిన కవులున్నారు. వారిలో యన్. వి. కృష్ణవరియర్, అక్కిట్టం, ఒలప్పమన్న, వాయలార్, రామవర్మ. పి. భాస్కరన్, కేడామంగళం, పప్పుకుట్టి, ఇదాస్సెరి గోవిందనాయర్, ఓ. యన్. వి కురూప్, అను జనులను పేర్కొనవచ్చును.

గత ఇరవయ్యేళ్లనుంచీ అభ్యుదయ భావభావితులుకాని కవులు లేరని అంగీకరించినా, మలయాళ కవితాప్రవంతి ప్రధానవాహినినుండి చీలిపోలేదు, యువకవిమార్గంలో ముగ్గురుకవులు ముఖ్యాలు. వైలోపల్లి శ్రీధర్‌మీనన్, వెన్నికుళమ్ గోపాలకురూప్, పలాయినారాయణన్ నాయరు ప్రముఖకవులు. వీరు అధికంగా అభ్యుదయ భావభావితులే అయినా, మలయాళ సత్ సంప్రదాయపు కోవలోవారే. పాలాయ్ రచించిన 'కేరళంవలరున్ను' (వర్ధమానకేరళ) అన్న కావ్యంలో మహాకావ్య ధోరణిలో ఆధునిక కేరళమును ఇతివృత్తంగా తీసికొన్నాడు. కథలూ, గాథలూ, వ్యక్తులూ, రీతులూ మలయాళ సంబంధమైనవే స్వీకరించి ఏకముఖంచేసి కావ్యములో నిబద్ధముచేసినాడు. ప్రాచీనకావ్యమార్గము ఏ విధంగానూ ఆగిపోలేదు. సి. కున్హిరామన్‌నాయర్, కె కె. రాజా ప్రభృతులు విశేషంగా సంప్రదాయాన్నే అవలంబిస్తున్నారు.

## వచనము

1919 క్రీ॥ శ॥ నుంచి నవ్యయుగంలో వచన వాఙ్మయానికి ముఖ్యంగా పేరువచ్చింది. సి. పి. రామన్‌పిళ్ళె రచించిన 'రామరాజ

బహదూర్' అనే టిప్పుసుల్తాన్ దండయాత్రకు సంబంధించిన రచన వల్లను అప్పన్‌తంపురాన్ రచిత 'రామరాజ బహదూరు' వల్ల కె. ఎం. పణిక్కరుకృత 'కేరళ సింహం' వల్ల ఐతిహాసిక నవల పరిపాకము పొందింది. అంతకన్న ముఖ్యమైనది నవ్యరీతిలో సాగిన సామాజిక నవలాప్రాదుర్భావము. ఈ నవల పరివర్తన శీలమైన సామాజిక వ్యవస్థను చిత్రిస్తున్నది. 'ఇందులేఖ', 'శారద' వంటి నవలలు కాల్పనిక భావోద్వేగ వృష్టిలో లక్ష్యప్రాయమైన రచనలు. అయితే నవ్యసాహిత్య యుగము గత కాలీన కాల్పనిక భావోద్వేగ వాదానికి స్వస్తిచెప్పి, కేవలం వాస్తవికతకోసం ముందడుగు వేసింది. 'అప్ఫహ న్తిమకర్' అనే నవల నంబూద్రి - నాయర్ల సంబంధ బాంధవ్యములను చిత్రించడానికి యత్నించిన ప్రథమ వాస్తవిక నవల. 'బాల్యకాలసఖి' అనే నవల ఈ సాహిత్యక్షేత్రంలో ఎన్నదగినది. కాని వాస్తవికమై సాంఘికమైన నవలను ఉన్నత సాహిత్యస్థాయికి తీసుకు పోగలిగిన రచయిత, తకజహి శివశంకరపిళ్ళై. ఆయన అపూర్వ ప్రజ్ఞావిశేషంతో కథానికా రచయితగా, ఆదిలో యశస్సు గడించినాడు. మలయాళములో ఆ సాహిత్యశాఖలో ఆయన మహాప్రవీణుడు. అయితే 'తోటి యుటిమకన్' అనే గ్రంథమువల్ల నవలా సాహిత్య క్షేత్రంలోకూడా ప్రవేశించి వన్నె కెక్కినాడు. [1] 'రంతితంగాజహి' (రెండు శేర్ల ధాన్యం) అనే నవలలో తేమగా ఉండే అలెప్పి ప్రాంతంలో భూమిలేని కర్షకుని జీవితము ఆయన వివరంగా చిత్రించినారు. పాత్రపోషణ పాటవము, సామాజిక వ్యవస్థను వాస్తవికంగా చిత్రించడం వల్లనూ, ఈ నవల వెంటనే ఉత్తమ సాహిత్య కోటిలో చేరింది. ఆయన ఇటీవల రచించిన నవల [2] 'చెమ్మీన్' లో, అలెప్పిలో బెస్తవారి పేదజీవితం చిత్రింప బడింది. మలయాళంలో ఇది ఉత్తమోత్తమ నవల.

---

[1] ఈ నవల భారతీయ భాషల్లో అనువదింప చేయడానికి సాహిత్య అకాడమీ ఎన్నిక చేసింది. దాని హిందీ అనువాదము 'దొసర్ ధాన్' ప్రచురితమైంది. — సంపా

[2] 1957 లో సాహిత్య అకాడమీ వారి కానుక ఈ నవలకీయబడింది —సం.

తొల్లింటి కథారచయితలలో ఆధునిక కథ, నవలనూ మళ యాళంలో వ్రాసి భాషాసేవ అపారంగా చేసినవారు పి. కేశవదేవ్. అందు కాయన ప్రశంసార్హుడు. ఆయన రచించిన 'ఒడావిల్‌నిన్ను' (మురికి కాలవనుంచి) మలయాళ భాషలోని ఉత్తమ నవలల్లో ఒకటి. యస్. కే. పొట్టెక్కాట్ రాసిన 'విషకన్యక' విశిష్ట గుణోపేతమయిన రచన-జోసెఫ్‌ముందాస్సేరి ' ప్రొఫెసర్ ' అనే నవలలో, ఉపాధ్యాయుని నిరుపేదజీవితము కథావస్తువు. ఈ రచయితకూడా గణనీయుడు. ' కొంతాయుంకురుసుం ' అనే నవలలో ఆయన పేదక్రైస్తవుల మీద చర్చిప్రభావం కథావస్తువుగా చేసినాడు.

మలయాళంలో కథానికారచన ఆదిలోనే పరిపాకము పొందింది. సామాన్యంగా రచనాధోరణి ఉదాత్తంగా ఉంటూ వచ్చింది. కథానికా రచయితలుగా కృతకృత్యులయినవారు చాలామంది ఉన్నారు. అందరి పేర్లూ ఉల్లేఖించడం సాధ్యంకాదు. ఈ సాహిత్యశాఖలో తకాషి నిస్సందే హంగా ప్రవీణుడు. ఆయన కథానికలను మొపాసా, చెహోవ్‌ల రచనలతో పోలి స్తే ఏమాత్రమూ తీసిపోవు. పొంకున్నంవార్కి, కె టి. మహమ్మద్ బషీర్, పి. సి. కుట్టికృష్ణన్, పొట్టెక్కాట్, కోవూర్, కరూర్, సరస్వతి అమ్మ, లలితాంబికా అంతార్జనం, కథానికా రచనలో చెప్పుకోతగినవారు. వార్కి, బషీర్, పొట్టెక్కాట్, కుట్టికృష్ణన ప్రభృతులు వామపక్ష రచ యితలు, అనదగుదురు. వారి కథావస్తువులు ప్రధానంగా సామాజిక సమస్యలూ, సంఘంలోజరిగే అన్యాయాలున్నూ. కుట్టికృష్ణన్ ఉమ్మచ్చు ' అనే నవల గొప్పది. లలితాంబిక నంబూద్రి సమాజంలో అవకతవకలను వర్ణించింది. ఆమె కథానికలు అపూర్వంగా విలువైనవి. ఆమె సంఘజీవితంలో వెలుగులోకిరాని ఒకానొక శాఖవారి జీవితము చిత్రించింది.

## రూపకము

రూపకక్షేత్రంలో సాహిత్యవికాసం స్ఫుటంగా ఉంటున్నది. మల యాళ సాహిత్య సంప్రదాయంలో నాటకము దృశ్యకావ్యంగా పరిగ ణింపబడింది. కాళిదాస, భవభూతి ప్రభృతుల సంప్రదాయం ఇప్పటికీ

క్షీణించిపోలేదు. కాని నూతనోత్సాహ వికాసాలవల్ల పాశ్చాత్యపద్ధతిలో నటనానుకూలమైన రూపకాలు ప్రజామోదము పొందడం ఆరంభించాయి. అయితే నాటకాలన్నీ కేవలము రంగానుకూలంగా రచింపబడ్డవి కనుక సాహిత్యస్థాయిని అందుకోలేవు.

నాటకాల్లో సి. వి. రామన్‌పిళ్ళై రచించిన 'కురుప్పిళ్ళకళరి' (పంతులులేనిబడి) అనే ఉత్తేజకర సాంఘిక సుఖాంతనాటకంలో నాయకుల సామాజికజీవితంలోని అరాజకమూ, కల్లోలమూ, చిత్రింపబడ్డవి. యుగసంధిలోని సమాజముయొక్క అవ్యవస్థ, భావితరము వారిని ఆకర్షిస్తుంది. రంగవికాసానికి దోహదంగా చారిత్రక నాటకాలు ఇ. వి. కృష్ణపిళ్ళై అనే మరొక రచయిత రచించినాడు. కైనిక్కర పద్మనాభ పిళ్ళై 'కల్వరివిలె కల్పపదపం' అనే అద్భుత నాటకంగా క్రీస్తు మనోవేదనను రచన చేసినాడు. యన్. కృష్ణపిళ్ళై, ఇడాశ్శేరి గోవింద నాయర్ కూడా మంచి సాహిత్యసౌష్ఠవముగల ప్రముఖ నాటక కర్తలు. యువనాటక కర్తలలో చలప్పన్ నాయర్, కె. టి. మహమ్మద్, టి. యన్. గోపీనాథన్ నాయర్ చెప్పుకోదగిన రచయితలు.

## విమర్శ

ఈ యుగంలో సాహిత్య విమర్శకూడా అద్భుతంగా వృద్ధి పొందింది. ఆదిలో ఆలంకారికులు సాంప్రదాయక సారస్వతాన్ని ప్రధానంగా సమీక్షచేసి, శ్రేయోదాయక విమర్శనాత్మక సారస్వత వికాసానికి దోహదము చేసినారు. పి. కె. నారాయణపిళ్ళై విమర్శకాగ్రణి అయితే యం. పాల్, మందాశ్శేరి, బాలకృష్ణపిళ్ళై ప్రభృతులవల్ల, మలయాళ సారస్వత సమీక్షలో నవజీవమువచ్చింది యువరచయితలకు మార్గ దర్శకుడై, యం. పి. పాల్ నవల, కథానికా రూప పరిశీలన చేసినాడు. జోసెఫ్ మందాశ్శేరిలో సంప్రదాయక వైదుష్యము, అతి నవీన దృక్పథమున్నూ, సమన్వయమైనవి. ఆయన ప్రధాన ప్రాతినిధ్యం ఆధునికుల తరపున వహించినాడు. ఎ. బాలకృష్ణపిళ్ళై మలయాళంలో ఫ్రెంచి సాహిత్య ప్రక్రియలు ప్రవేశపెట్టినాడు. కేరళములో మొపాసారచనల గాఢ ప్రభావము తీసుకొని రావడానికి ఆయనకు వాటిమీద కల అభి

మానమే కారణము. నవ్యభావ వికాసానికి కుట్టి కృష్ణమరార్, కుర్క్కోట, కూనప్ప, గుప్తన్‌నాయర్ ప్రభృతులు కారకులు

మలయాళ సాహిత్యము అధికంగా ప్రగతి వాద మార్గానుకూలంగా ఉన్నప్పటికీ, ఆధునిక లోక వైజ్ఞానిక రీతులను బాగా అవగాహన చేసి కొని, సుసంపన్నమైంది.

## జీవిత చరిత్ర - యాత్రాది గ్రంథములు

ఇటీవల వచన సారస్వత శాఖలో జీవిత కథారచన విశిష్టంగా పురోగమించింది. పి. కె. పరమేశ్వరన్ నాయర్ రచించిన పి. కె నారాయణపిళ్ళె జీవితచరిత్ర, ఆయనే వ్రాసిన సి. వి రామన్‌పిళ్ళె జీవిత కథ, ఈ సారస్వత క్షేత్రంలో ప్రమాణాలను ఏర్పరించినవి. కేరళవర్మ, రాజరాజవర్మ, ఉల్లూర్ పరమేశ్వర్ అయ్యరుల వ్యష్టి జీవితాలనుగూర్చి మొదట వ్రాయబడిన గ్రంథాలు ప్రశస్తి పూర్ణములై విమర్శన శూన్యములై, వాస్తవిక సత్యదూరములు. పరమేశ్వర్‌నాయరు జీవితకథారచనా శిల్పము తీర్చిదిద్ది, ఆ రచనలో సూక్ష్మవిమర్శనాత్మక తత్వముతోపాటు పరిశోధనమును, సాహితీనిర్మాణ కౌశలమును, ప్రవేశపెట్టినాడు ఐ పి. చాకో, ఎ. డి. హరిశర్మ డాక్టర్ కె. యం. జార్జి ప్రభృతులు ఈ సాహిత్య క్షేత్రంలో విశేషకృషి సల్పినారు.

స్వీయచరిత్రలుకూడా ఆరంభమైనవి. - పి. కె. నారాయణపిళ్ళె రచించిన 'స్మరణమండలమ్' అనే స్వీయ జీవితకథ, సాహిత్యస్థాయిని అందుకొన్నది. ఆయన విమర్శకుడు, కవి, విద్వాంసుడు, అధివక్త, ప్రాడ్వివాకుడుగానూ ప్రసిద్ధుడు. ఆయన స్వీయచరిత్రలో తన ఆరంభ జీవితమును ప్రావీణ్యముతో రచించినాడు. అందులో తిరువనంతపుర పరిస్థితులను విస్తృతంగా అవలోకనచేసినాడు విశిష్టసాహిత్యవిధానంలో వాసికెక్కిన స్వీయచరిత్ర ఇ. వి. కృష్ణపిళ్ళెగారిది. ఆయన జీవితము అవ్యవస్థితమైనా, రచన ఇంపుగాఉన్నది. కృష్ణపిళ్ళె ఈ శతాబ్ది లోని ప్రసిద్ధ హాస్యరచయితలలో ఒకడుగా పేరుపడినాడు. యం. ఆర్. నాయర్ అనే సంజయన్ ఈ సారస్వతక్షేత్రంలో కృష్ణపిళ్ళెతో సమానంగా వన్నెకెక్కినాడు. కె. యం. పణిక్కరు రచించిన ఆత్మకథ,

జి. కేశవన్‌కృత 'జీవితసమరం' కె పి, కేశవమీనన్‌గారి 'కజిహింజ కలంగన్' వంటి గ్రంథాలు చెప్పుకోతగినవి.

ప్రాచీనకాలమునుంచీ యాత్రాసంబంధమయిన గ్రంథాలు మలయాళంలో ఉన్నవి. క్రీ. శ, 18 శతాబ్దిలో క్రైస్తవఫాదిరీ ఐరోపా యాత్రనుగురించి వ్రాశాడు. అది మనకు లభ్యమవుతున్నది. క్రీ శ. 19 శతాబ్దములో యాత్రావిశేషాలు కొన్ని వర్ణిస్తూ పద్యరూపములో రచనచేయడం ఒకమోజు అయింది. కె పి కేశవమీనన్ 'బిలత్తివిశేషం' అనే యాత్రాగ్రంథము యాత్రసాహిత్యంలో నవీనకాలంలో వెలువడిన గుణవిశిష్టమైన ప్రథమ వచనగ్రంథము. ఇందులో గ్రంథకర్త విద్యార్థిగా ఇంగ్లండులోని తన అనుభవాలు వర్ణించినాడు. అయినా పొట్టెక్కాట్ ఇలాంటి గ్రంథరచనలో సిద్ధహస్తుడు ఆయన యాత్రాసాహిత్యములో ఆసియా, ఆఫ్రికా, ఐరోపా ఖండసంచారవర్ణన ఉన్నది. ఆయన దృష్టి ఉత్సాహదాయకవిషయాలవైపు ఉంటుంది. సరళప్రసన్న గద్యశైలిలో ఆయన రచనా ప్రవీణుడు. ఈ సందర్భంలో కె. యం పణిక్కరుకృత 'ఆపత్కరమయ యాత్ర' (యుద్ధకాలప్రయాణవర్ణన, 'చైనాయిలే ఒరుయాత్ర', అనే గ్రంథాలు పేర్కొన తగినవి.

## సారస్వత చరిత్ర

ఇటీవల విద్వాంసులు వాఙ్మయ చరిత్ర రచనకు పూనుకొన్నారు. పి కె. గోవిందపిళ్ళెగారి మలయాళ వాఙ్మయ భాషా చరిత్రలు 19 వ శతాబ్దపు తుది దశకంలో ప్రచురింపబడ్డవి. ఆయన సారస్వత చరిత్రకు మార్గదర్శకుడు. అప్పటినుంచి సారస్వత చరిత్రను గురించి పరిశోధన జరుగుతూవస్తున్నది. ప్రాచీన గ్రంథాలూ, విస్మృత గ్రంథకారులున్నూ, సూర్యాలోకభాగ్యము పొందినారు. 'లీలాతిలక' మనే మలయాళ శబ్దశాస్త్ర, అలంకారశాస్త్ర సంబంధమైన గ్రంథము పరిశోధనవల్ల బహిర్గతమైంది. ఆ గ్రంథము క్రీ॥ శ॥ 15 వ శతాబ్దిలో సంస్కృతములో విరచితమైంది. 'లీలాతిలకము' ప్రాచీన మలయాళ సారస్వత సముచ్చయము. లక్ష్యాలుగా ఆ గ్రంథములో పూర్వరచయితల మళయాళ రచనలు ఉదాహరింపబడినవి. అందుచేత అది పూర్వ మళయాళ

కావ్య సముచ్చయమనదగును. 'ఉన్ని నీలి సందేశం' అనే దూత కావ్యము మేఘదూతవలె ఉంటుంది. అది పదునాలుగో శతాబ్దివాటిది. అదికూడా పరిశోధనవల్ల లభ్యమైంది. 'ఉన్నియతి చరిత్రము', 'ఉన్నియచి చరిత్రము'న్నూ వంటిప్రాచీన గ్రంథాలు గవేషణవల్ల సంప్రాప్తమైనవే. ఉన్ని నీలి సందేశము అయిదుసార్లు పునః పునర్ముద్రితమైంది. గత దశాబ్దములోనే ఇది ఉత్సాహముతో గమనించవలసినది. 'లీలా తిలకము' కూడా పరిష్కృతమై కొన్ని సార్లు అచ్చుపడింది వాటిలో ముఖ్యంగా ఎలంకులం కుంజంపిళ్ళె సురనద కుంజన్‌పిళ్ళెగార్లు ప్రచురించినవి గమనార్హములు. వారు అపారంగా సారస్వత పరిశోధన చేసినారు.

కేవలసారస్వత చరిత్ర రచనా ప్రవీణు లిద్దరు : ఆర్. నారాయణ పణిక్కరు, ఉల్లూరు పరమేశ్వరయ్యరులు. నారాయణ పణిక్కరు ఏడు సంపుటాలుగా కేరళభాషా సాహిత్య చరిత్ర రచించి అపార వైదుష్యము చూపినాడు, ఆయన సిద్ధాంతాలు వివాద గ్రస్తాలయినా. కేరళసాహిత్య చరిత్రను పరమేశ్వరయ్యర్ రచించినాడు. ఆయన మరణానంతరము తిరువనంతపుర విశ్వవిద్యాలయము ఆ గ్రంథముద్రణ చేస్తున్నది. ఇంకాపూర్తికాలేదు. అది కేరళ సాహిత్య చరిత్రే. కాని మళయాళ సాహిత్య చరిత్రకాదు. అనగా అది కేరళీయ సంస్కృతకవుల చరిత్రలు కూడా వర్ణిస్తుంది. వడక్కుమ్‌కూర్ రాజరాజవర్మ కేరళములోని సంస్కృత సారస్వతచరిత్ర విపులముగా రచించినాడు. కాని కాల నిర్ణయ విషయములో రచయితచేసిన తీర్పు అంగీకరించడానికి వీలు లేదు. కాని అది మార్గదర్శకమైన ప్రముఖ రచన.

## భాష, చరిత్ర ఇత్యాది

ఇటీవల మలయాళ భాషావిషయక పరిశోధన, తదితరశోధన మున్నూ బాగా వృద్ధిలోఉన్నవి. ఎ. ఆర్. రాజరాజవర్మ, అత్తూర్ కృష్ణ పిషరోడీ అనే ఇద్దరు ప్రవీణులు పరిశోధనకు కావలసిన కట్టుదిట్టమయిన పునాదులు వేసినారు. డాక్టర్ కె. గోదవర్మ అనే విద్వాంసుడు భాషా శాస్త్రాన్ని గురించి మలయాళంలోని మలయాళేతరపదాల పరిశోధనలు

చేసినాడు. అవి గమనార్హము. డాక్టర్ కె. యం. జార్జి ఆదిమలయాళ భాషాపరిణామాన్ని మలయాళము విశిష్టమైన భాషగానూ, బాగా అవగాహన: చేసుకోడానికిగాను 'రామచరితమ్' అనే గ్రంథములోని భాషా స్వరూపమును అవలోడనము చేసినాడు డాక్టర్ యస్. కె. నాయర్ జానపదరూపకాలనూ జానపదదేశీయ సాహిత్యాన్నీ సంకలనము చేయడంవల్ల మలయాళములో విస్తృతమైన ప్రజాసాహిత్యాన్ని పరిశోధించి ఉద్ధరించినాడు. మలయాళ వ్యావహారిక భాషాస్వరూపాన్ని అవగాహనచేసుకోడానికి, మధ్యయుగాలనాటి సామాజిక జీవన ప్రతిబింబ పరిశీలనకూ, నాయరుచేసిన పరిశోధన చాలా ముఖ్యమైనది

మలయాళసాహిత్యంలో అవాంతరశాఖగా చరిత్రను తీసుకోక, చాలా ఉదాసీనంగా చూచినారు. కె. పి. పద్మనాభమీనన్ రెండుసంపుటాల్లో 'కొచ్చిరాజ్యచరిత్రం' రచించినాడు. అది వినా మలయాళంలో ప్రశంసార్హమైన చారిత్రకరచన లేదనవలె. సి. అచ్యుతమీనన్ ఆంగ్లములో కొచ్చిన్‌రాజ్యచరిత్రవ్రాయగా, దానికి ప్రామాణికమైన మలయాళానువాదం వచ్చింది. ఆంగ్లంలో మలయాళంలో ఒకేసారి ఆ గ్రంథప్రచురణ జరిగింది ఇళంకుళంకుంజన్‌పిళ్ళై కేరళచరిత్రలో అజ్ఞాతయుగాన్నిగురించి వ్రాసినాడు డాక్టర్ గోదవర్మ. తొల్లింటి తామ్రశాసనాలు పరిశీలించినాడు. ఈ సందర్భాన చెప్పదగిన పరిశోధన సంబంధమైన రచనలు ఇంతవరకే.

## పత్రికా రచన

త్వరిత గతిలో మలయాళ వికాసానికి ఆ యా కాలంలో ప్రచురిత మయ్యే పత్రికారచన ముఖ్యమైనది, ప్రత్యేకంగా పేర్కొన దగినదిన్నీ. శతాబ్దారంభము లో ఆది కాలంలో, కందత్తిల్‌వర్గీస్ మాప్పిళ 'మలయాళమనోరమ' అనే పత్రిక నడుపుతూ, ప్రత్యేకంగా సారస్వతానికి ప్రోద్బలం సమకూర్చినాడు. పత్రికలో సారస్వతాను బంధంలో తద్రచనా ప్రకటనకు అవకాశం ఇవ్వడమేకాక, మనోరమా పత్రిక ద్వారా కేరళలో ప్రథమ సాహిత్య సమావేశం చేయించి 'భాషాపోషిణీ సభ' ప్రతిష్ఠ చేయించింది సాహిత్య వ్యాపంగానికి పత్రికలవల్ల చాలా

ప్రోత్సాహము వచ్చింది. 'భాషాపోషిణి' అనే పేరుతో సృజనాత్మక సాహిత్య ప్రవృత్తికోసం పత్రికా ప్రచురణము ఏర్పాటయింది. 'విద్యా వినోదినీ' 'రసికరంజనీ' పత్రికలు సాహిత్య సృష్టికి పేరు పొందినవి. ఆ పత్రికలకు తిరుమారులో విద్వత్సమితి సంపాదక వర్గముగా ఏర్పడింది. కొన్నాళ్ళపాటు వళ్లత్తోల్ 'ఆత్మపోషిణి' పత్రికను నడిపినాడు. 'మంగళోదయ' పత్రికకు అప్పన్ తంబురాన్ ముఖ్యుడు. అద్భుతంగా కృషి చేయగా 'కవన కౌముది' అనే మాసపత్రిక కేవలం కవితారచనకే వినియోగపడింది. పాతిక సంవత్సరాలనుంచి పి. వి. కృష్ణవారియార్ సంపాదకత్వాన ఆ పత్రిక వాసి కెక్కింది ఆ పత్రికలో ప్రతి కవీ పద్యాలు ప్రచురించినవాడే. యువకవుల ప్రథమ కవితా వ్యాసంగానికి ఆ పత్రిక కారణమైంది. వళ్లత్తోల్, ఉళ్లూర్, శంకర కురూప్‌వంటి కవులు తమ రచనలు తప్పనిసరిగా ఆ పత్రికకు పంపే వారు. కౌముదీ పత్రికలోనే వళ్లత్తోల్ 'విలాసలతిక' వంటి ఉత్తమ కావ్యా లెన్నో తొలిసారిగా ప్రచురించినాడు. అందువల్ల ఆ పత్రికకు సాహితీ ప్రతిష్ఠ వచ్చింది. అనంతరకాలంలో ఆ కావ్యాలు మహా కావ్యాలుగా రసిక జనాంగికారముపొందినవి. సమస్త కేరళ సాహిత్య పరిషత్తు కేవలమ సాహిత్య రచనల కోసం పత్రికను నడిపింది. ఆ పత్రికలో ఇతి హాసిక సారస్వత సమీక్షాత్మక వ్యాసాలు, ప్రాచీన కావ్యాలున్నూ అచ్చుపడ్డవి.

ముప్ఫయ్యో పదినుంచీ మాసపత్రికలవల్ల సాహిత్యము రూపు దాల్చలేదు. సాహిత్య వారపత్రికల వల్లను, దైనిక ప్రసిద్ధ వార్తా పత్రికల మూలంగానూ, సారస్వత ప్రవృత్తి సాగింది. కోజికోడ్‌లో 'మాతృభూమి', క్విలాన్‌లో 'మలయాళరాజ్యం' అనే వారపత్రికల వల్లనూ, యువరచయితలకు స్థానం ఏర్పడింది. కేవల సాహిత్య పత్రికలకన్న, దైనిక పత్రికలకు విశేషవ్యాప్తి ఉండడంచేత, గ్రంథకర్తల రచనలు విస్తృత పాఠకలోకానికి అందే అవకాశమున్నది. అందుచేత రచయితలకు ఆ పత్రికలు ప్రోత్సాహకరంగా ఉండేవి.

మలయాళసాహిత్య సింహావలోకనం ముగించేముందు అనువాద సాహిత్యాన్నిగురించి కొంత చెప్పవలసి ఉన్నది. అనువాదము చాల

వరకు సంస్కృతమునుంచే ఈ శతాబ్ది ప్రథమదశకంలో సంస్కృత మహాకావ్యాదులు మలయాళములోనికి అనువదింపబడినవి. ఆంగ్ల భాషలోని ఉత్తమగ్రంథాలుకూడా ఈ శతాబ్దారంభములోనే అనువదింప బడినవి. వంగమాతృకలకు ఆంగ్లానువాదాలు రాగా, వాటిని మల యాళములోనికి తర్జుమాచేసినారు. బంకిమచంద్ర ఛట్టోపాధ్యాయుని నవలల అనువాదాలు రకరకాల ప్రజలు చదవడంవల్ల విశేషవ్యాప్తి వాటికి వచ్చింది. రవీంద్రుని ప్రతిభ, నూతనోత్సాహంతో చేసిన వంగాను వాదాలలో ప్రతిఫలించింది. ప్రథమ ప్రపంచయుద్ధానంతరం అభి రుచులు అధికంగా విస్తారం కావడం ఆరంభించగా ప్రెంచి, రష్యన్. తదితర ఐరోపీయ ఉత్తమగ్రంథానువాదాలు బయలుదేరినవి. మాతృ కలోనుంచి సూటిగా అనువాదాలు చేయకపోయినా, యువరచయితల మనస్సులమీద ఐరోపీయ మహాగ్రంథప్రభావం న్యూనంగా పరిగణించ డానికి వీలులేదు. నమిప్పట్ నారాయణమీనన్ 'లేమిసరబుల్' అనే విక్టర్‌యూగో నవలను అనువదించినాడు. ఇది చెప్పుకోతగినది పి బాల కృష్ణపిళ్ళె మొపాసాకథానికలనూ, సి గోవిందకురూపు టాల్‌స్టాయ్ రచించిన 'రిసరక్షన్' అనే క్షనవలనూ, అనువదించినారు. ఇవి ఎన్న దగినవి. రాజకీయాత్మకమైన మహాత్మగాంధి రచించిన 'సత్యముతోనా ప్రయోగానుభవాలు', జవహరులాల్‌నెహరూ 'స్వీయచరిత్ర'లు మల యాళములోనికి అనువదింపబడినవి. ఆ అనువాదములు సాహిత్య స్థాయిని అందుకొన్నవి. వైదేశికభాషానువాదాలవల్లకూడా మలయాళ భాషకు పుష్టివచ్చింది. ఫిట్జ్‌గెరాల్డు అనువదించిన 'ఒమర్‌ఖయ్యామ్' అనే కావ్యానికి ఏడనువాదాలు మలయాళములో వచ్చినవి. జి. శంకర కురూపు, కె యం. పణిక్కరులుకూడా ఆ అనువాదకర్తలలోవారు. ఒక ముసల్మాన్ మౌల్వీ పవిత్రకురాన్ గ్రంథాన్ని మలయాళములోనికి అనువదించినాడు. వళ్లత్తోల్ అపారంగా అనువాదాలు చేసినాడు. ఆయన వాల్మీకిరామాయణమును అనువదించడమేకాక, ఐదు పురాణములను, కాళిదాసుని శాకుంతలమున్నూ, వత్సరాజ నాటకాలనూ భాసనాటక షట్కాన్ని, ప్రాకృతంలో హాలుడు సంతరించిన 'గాథాసప్తశతి'నీ.

చివరకు [1] 'ఋగ్వేదసంహిత' యావత్తూ, వళ్లత్తోల్ అనువదించినాడు. ఈ సాహిత్యక్షేత్రంలో ఎన్నదగినది శ్రీ వి. వి. చాకో చేసిన పాణినీయ సంస్కృతవ్యాకరణ వ్యాఖ్యానువాదం.

ఈ వ్యాసం ముగించేముందు ఒక ముఖ్యవిషయము గట్టిగా చెప్ప వచ్చును. ఈ శతాబ్దారంభంలో సాహిత్యం కేవలం సంస్కారముస్న శిష్టుఁకోసంగా ఉఁడేది. అగ్రవర్ణుల్లోనే సాహిత్యసాధన నిబద్ధమైఉండేది. ప్రభువుల ఆస్థానాల్లో జమీన్‌దారుల ప్రాపకంలో సాహిత్యము వాసిం చింది ఈ శతాబ్దారంభంలో కేరళవర్మ, రాజరాజవర్మ, కున్హికుట్టన్ తంబురాన్ ప్రభృతులు పాలకకుటుంబాలతో సన్నిహితసంబంధము కల వారు. క్రమేణ సాహిత్యపోషణ విస్తృతమైంది. 1915-1936 మధ్య కాలంలో సాహిత్యము మాధ్యమికవర్గము వారిదిగా పరిణమించింది. ఈ మాధ్యమికవర్గము సామాన్యంగా ఆంగ్లవిద్య నేర్చింది. వీరిది సామాజికంగా, ఆర్థికంగా, సామాన్యంగా, తృప్తికలిగిన దృక్పధము. అయితే మనము లోగడ గమనించినట్టు కుమరన్ ఆశాన్‌వంటివారు మాత్రం సామాజికంగా జరిగే అన్యాయాన్నీ, మరికొందరు రాజకీయ స్వాతంత్ర్యానికి ప్రతికూలమైనవాళ్ళనూ, ప్రతిఘటించి విప్లవం సాగిం చారు 1930 నాటికి ఈస్థితిలో పూర్ణపరివర్తనం వచ్చింది. కవిత రాజ ప్రాసాదాల్లో సెలవుతీసికొని, సుఖసంపన్నమైన మధ్యమవర్గము వారి గృహాలువిడిచి, నిమ్న దళితదరిద్రజీవుల కుటీరాల్లో నివాసముచేసి కొన్నది. చివరకు సాహిత్యం సామాన్యప్రజానీక వారసత్వంగా పరిణ మించింది. కేరళంలో ఇంచుమించుగా విద్య, సార్వజనీనంగా ఉంది. కనీసము అల్పవయస్కుల్లో, భారతదేశమంతటికీ కేరళంలో అక్షరాస్యత గరిష్ఠశాతంలోఉంది. అందువల్ల సాహిత్యము ప్రజానీకానికి అంతకూ సంబంధించిన సామాన్య సంస్కార విషయమవుతుందని అనుకో వచ్చును. ఈనాడు సాహిత్యస్రష్టలైన యువరచయితల్లో, అన్నివర్గా

---

[1] ఈ గ్రంథ ముద్రణకు సాహిత్య అకాడెమీ రూ 15,000 సాహాయ్యం చేసింది.

[2] 1958 లో సాహిత్యఅకాడెమీవారి పారితోషికం పొందింది. —సంపా

లకూ, అన్ని వర్ణాలకూ, ప్రాతినిధ్యం ఉన్నది. సంప్రదాయక పాండితీ స్ఫోరక మహాకావ్యవిలాపాలు అదృశ్యమైనాయి. మయూరసందేశ కావ్యంలోని మధురపదగుంభనము, మనకు హృద్యముగా ఉండడము లేదు. దానిస్థానే ప్రజాజీవితానికి సన్నిహితసంబంధం కలిగినదీ, ఓజస్సుకలదీ, వాస్తవికమైనట్టిన్నీ, రచన వాపిస్తున్నది.

## మలయాళ సాహిత్యము - ఆకరగ్రంథజాతము


*i.* Report of the First All India Writers' Conference, 1945, Volume on the Symposium on Modern Literatures, Essay on Malayalam.

*ii.* Shippley's Encyclopaedia of World Literature (Essay on Malayalam).

*iii.* A Primer of Malayalam Literature. *By T. K. Krishna Menon.*

*iv.* Quest and other Poems. *By G. Sankara Kurup.*

*v.* Tear Drops. *By Nalappat Narayana Menon.*

*vi.* Mary Magdalene; *by Vallathol-Narayana Menon.*

*vii.* Rama Caritam and the Study of Early Malayalam. *By Dr. K. M. George.*

# సంస్కృత సాహిత్యము

డాక్టర్ వి. రాఘవన్

## ఉపోద్ఘాతము

భారతీయుల సంప్రదాయమునకు చెందిన శ్రేష్ఠభాష సంస్కృతము. ఈ భాషా చరిత్ర భారతదేశంలో నాలుగువేల సంవత్సరాలనాటిది. ఋగ్వేదములోని ఋక్కులు ప్రాచీన సాహిత్యము. ఈ ఋగ్వేదము హైందవయూరపీయ సాహిత్యంలో అతి విస్తృతమైన అతి పురాతన శేషము. సంస్కృత ప్రాచీనత లోక విదితము. అయితే అవిచ్ఛిన్నంగా అద్భుతంగా ఆ మహాభాష ఉంటూనేఉన్నది. వైదికఋషి మంత్రాన్ని పూర్వము ఎలా సుస్వరంతో పలికేవాడో అతని మంత్రం ఇప్పటికీ సుస్వరంతో అధ్యయన అధ్యాపనాల్లో ఉన్నది. కాళిదాస భట్ట బాణులు ఏ తీరుగా, మధురంగా, పదలాలిత్యంతో కవిత్వం చెప్పినారో, అదే రీతిలో ఆధునిక సంస్కృత విద్వత్కవి గద్యపద్య రచన చేస్తాడు. వైదిక భాషాభేదాలు, జనప్రీతికరమైన పౌరాణికశైలి, వ్యావహారిక శబ్దాలను విధించే పాణినీయ సూత్రాలు, తొల్లింటి రూపకభాష, అన్నీ సజీవంగా సంస్కృతం వ్యవహారంలో, పలుకుబడిలో ఉన్న ఒకానొక యుగాన్ని నిర్దేశిస్తున్నవి. భాషాభేదాల్లోంచి సాహితీ ప్రమాణము నిర్దిష్టంకాగా, తొల్లింటి ప్రధాన ప్రాకృతాలు సాహిత్యంతో అంతకంతకు అధికంగా ఉపయోగపడుతున్నప్పుడుకూడా, సంస్కృతము ఇంకా అధికారికమైన హోదాతో ఉంటూనే ఉన్నది. అందుచేతనే సంస్కృతాన్ని గురించి ఇటీవలి రచయిత ఇలా పరిశీలించినాడు :— "ప్రథమ వీక్షణంలో విరుద్ధంగా కనబడినా, మాతృభాషగా తన స్థితి కోలు పోయినప్పుడే సంస్కృత భాషకు వ్యుత్పన్నతగలభాషగా, పరిపాలనా విషయక భాషగా,

పూర్ణపరిపక్వత ప్రాప్తించింది" [1] జైనబౌద్ధాలు ప్రాకృత జనోప యోగం కోసము ప్రాకృతాలు ఉపయోగించడం ఆరంభించినవి. కాని సంస్కృతాన్ని ఆ మతాలు తోసివేయలేక చివరకు ఆ భాషనే ఉపయోగించకతప్పలేదు. యోచనా విలసితమై, సంస్కృతి పూర్ణమైన సర్వ సామాన్యభాష కావడంచేత, సంస్కృతం యావద్భారత దేశ భాషగా సుప్రతిష్ఠితమైంది. అది భారతీయ మాతృభాష లన్నింటిలో పెక్కింటికి మాత. పూర్వమేకాక ఇప్పటికీ, గాఢమయిన దేశైక్యమునకు అదే ఆధారము.

పాళి, అర్ధమాగధిభాషల్లో మతధార్మిక సాహిత్యం మొదట ప్రవృద్ధమైన తరువాత, శౌరసేనివంటి మహాశాఖవ సంప్రదాయక ప్రాకృతాల్లో సాహితీ వ్యవసాయంసాగింది శౌరసేనీప్రాకృతము సంస్కృత రూపకాల్లో గోచరిస్తుంది. మహారాష్ట్రీయ ప్రాకృతములో కవితావికాసం కలిగింది. ఈ ప్రాకృత సాహిత్యము సంస్కృత సాహిత్యానికి అనుగుణంగా ఉంది దానితోపాటు వర్ధిల్లడమేకాదు. ఈ భాష లన్నింటి వ్యాకరణములూ సంస్కృతభాషవల్ల నియమబద్ధమైనవి. ఈ ప్రాకృతాలుకూడా తమ సాహిత్యశైలివల్ల ప్రమాణస్థాయి పొందుతున్న కాలంలో వాటి స్థానం, జనప్రీతికలిగిన క్రొత్తక్రొత్త దేశభాషలు ఆదిలో అపభ్రంశమూ, అనంతరం ఉత్తరభారతంలోని ఆధునిక హైందవార్య భాషలున్నూ ఆక్రమించినవి.

ప్రాకృతాల విషయంలో ఎలా జరిగిందో. అదేతీరుగా దక్షిణ భారతీయ భాషలవిషయంలోనూ, అంతే సంభవించింది. సంస్కృత ప్రభావము దక్షిణదేశీయభాషల్లో సాహిత్యోద్ధరణం కావించింది పదములు, భావవ్యక్తీకరణ వైఖరులు, ఇతివృత్తాలు, సాహిత్యధోరణి సంస్కృతమునుంచి తెచ్చుకొని, ఈ భాషలు వృద్ధిపొందినవి. సంస్కృతాధారము చేసుకొని ఈ దేశభాషల్లో మూడు, తమ పదజాలాన్ని విస్తృతం చేసుకొని, సంస్కృతప్రభావం అమితంగా ఎంతవరకైతే పొందాలో,

---

[4] టి, బర్రో The Sanskrit Language, Faber & Faber, London 1955, page. 57

అంతవరకూ పొందగలిగినవి. వాటిలో రెండు దేశభాషల్లో పదసందోహ మంతా సంస్కృతమయమై, విభక్తులుమాత్రము దేశభాషలనుండి చేపిన రచన అయినా మొత్తంమీద, దేశభాషారచనగానే వ్యవహరింప బడుతూ ఉండేవి. రెండు దేశభాషల్లో, జావాద్వీపభాషవలెనే, మణిప్రవాళమనే ఒక కావ్యశైలి యేర్పడింది. ఈ మణిప్రవాళములో కవి సంస్కృత దేశీయభాషలను కళానైపుణితో సరససమ్మేళనము చేసే వాడు. నిజానికి దేశభాషలతోపాటు సంస్కృతానికి ఎంత దగ్గరపొత్తు ఏర్పడింది. అంటే మొన్నమొన్నటిదాకా సంస్కృతంలోని మహా గ్రంథాలు ఎక్కువభాగం తాళపత్రాలమీదను, కాగితాలమీదను దేశ భాషా లిపులలోనే వ్రాయబడి భద్రపరుపబడినవి; ముద్రణము కూడా దేశభాషా లిపులలోనే జరిగేది.

సంస్కృతం తనకున్న విస్తృతికితోడు ఇతోధికంగా రెండువిధాల అమితంగా పెరిగింది. బౌద్ధంద్వారా క్రీ పూ. ప్రథమ శతాబ్దినుండి సంస్కృతము మధ్యాసియా, దూరప్రాచ్యమువరకూ వ్యాపించింది. క్రీ. శ. రెండోశతాబ్దినుండి అది హైందవ సంస్కృతికి సాధనముగా ఉండి ఆగ్నేయాసియాలోని దేశదేశాంతరాలకూ వ్యాపించింది. సంస్కృత మహాకావ్యాలూ, నాటకాలూ, లఘుకావ్యాలూ, ఈ దేశాల్లో వ్యాపించినవి. ఈ దేశాలకు లిపీ, సాహిత్యము, నాట్యకళ, నాటకము, సంగీతము, శిల్పమూ సంస్కృతమువల్ల సిద్ధించినవి. ఈరీతిగా ఏకత్వంతో యావద్భారతఖండాన్నీ సంస్కృతము సుప్రతిష్ఠితము చేయడమేకాకుండా, దూరప్రాచ్యాన్నంతటినీ ఆగ్నేయాసియానూ, సాంస్కృతిక సజాతీయత క్రిందకు తెచ్చింది.

సంస్కృతపు సుదీర్ఘ విస్తృత చరిత్రలో, సంస్కృత సంస్కృతిలో, ప్రతిశాఖలోనూ, అనగా సాహిత్య తత్త్వశాస్త్ర, లలితకళా, విజ్ఞానాల్లో గాఢ కృషి జరిగింది. కేవలం సంఖ్య తీసుకొన్నా, అమితంగా ఉన్న సాహిత్య గ్రంథజాలంలో మితంగానే పుస్తకాలు అచ్చయినవి. శేషించిన అపార గ్రంథ సందోహము భాండారాల్లో తాళపత్రాల్లో, లిఖిత ప్రతి రూపంలోనూ ఉన్నది. చాలాభాగం ఖిలమైపోయింది పోగా, మిగిలిన గ్రంథాలు ప్రపంచ సాహిత్యంలో ఒక అద్భుత శ్రేణీ విభాగానికి

ప్రాతినిధ్యము వహించినవి. వైవిధ్యములో తీసికొన్నా, మానవ ప్రవృత్తిలో బాహ్యమైన ప్రతి విషయాన్నీ. సంస్కృతము పరామర్శించింది. గుణంలో తీసికొన్నా, కల్పనాప్రాతంత్ర్యంలో, కళా విన్యాస వైదగ్ధ్యంలోనూ. సంస్కృతంలో దర్శనాలమూ. కావ్య నాట కాలమూ, తార్కాణంగా ఉల్లేఖించవచ్చును. ఉపనిషత్తులు. గీతవంటి ఉత్కృష్ట గ్రంథాలు భారతీయ సాంస్కృతిక వారసత్వంలో అమూల్య భాగాలు. నిజంగా అవి ఈనాడు ప్రపంచాలోచనలో, గాఢయోచనలో అంశలు అయినవి. సంస్కృతంలో రామాయణ మహాభారత మహా కావ్యాలు దేశభాషా సాహిత్యాలకు భావోద్దీప్తి కలిగించడమేకాక, జాతీయాదర్శాలను అందులో పాత్రలు తీర్చి దిద్దినవి. కాళిదాస శూద్ర కాదుల కావ్యనాటకాలు భారతీయ సారస్వతంలో ఉన్నతోన్నత స్థానంలో ఇప్పటికీ నిలిచినవి. జనామోదముగల వ్యవహార భాషల్లో సాహిత్య ప్రవృత్తి కొన్ని ప్రత్యేకశాఖల్లో మతము, భావగీతము, మహాకావ్యము వంటి వానిలో - మాత్రమే సాగింది. కాని ఎక్కువ భాగము సాహిత్య సమీక్ష, తర్కము, దర్శన శాస్త్రము, ఆయుర్వేదము లలితకళలు, ధర్మశాస్త్రము. ఖగోళవిజ్ఞానము, గణితాదిశాస్త్రాల్లో ప్రావీణ్యము, వైదుష్యమూ, సంస్కృత భాషామూలంగానే సాగింది. ఒక రచయిత భాష కాని. వక్తభాషించే అగ్రగణ్యప్రాంతీయ భాషల్లోని ఒక భాష కానీ వెండితెరమీదికి ఎక్కినప్పుడు. ఉదాత్త భావాలు వ్యక్తము చేసేవి. సంస్కృత శబ్దాలని ఎవడయినా గ్రహించుకొంటాడు. ప్రాంతీయ సాహిత్యము ఎంత ప్రవృద్ధమైనా ప్రాంతీయ భాషారచయితకు ఎంత ఖ్యాతివచ్చినా, ఆ సాహిత్యంకానీ, ఆ గ్రంథకారుడుకానీ, గీర్వాణ సాంస్కృతిక పారంపర్యాన్ని, సంస్కృతంవల్ల అవిచ్ఛిన్నంగా పొందు తున్న సంస్కారసంభారాన్ని వదలుకోడం అసాధ్యం అద్యతన భూత కాలంలో దేశము ఆత్మాన్వేషముతో నూతనజీవము పొందడానికి ప్రధాన కారణము భారతదేశము ప్రాచీన భారతీయ శేముషీవైభవము గ్రహించడమే. ఈ నవ్యాలోకంలో అధికారం సంస్కృతభాషా పారం పర్యము ప్రత్యగ్రంగా గ్రహించడమువల్లనే సాధ్యపడింది. అందుచేత అధికంగా ప్రాంతీయభాషలద్వారానే నవ్యసాహిత్య సముద్భవమయి

నప్పటికీ దాని కంతటికి సంస్కృతమే బావోద్దీప్తికారణంగా ఉంటున్నది.

ప్రౌఢ సంస్కృత సాహిత్యము వైవిధ్యానికీ ఆకృతీ సంపన్నతకూ అద్భుతమైంది. కేవల సాహిత్యం గమనిస్తే సంస్కృతంలో దీర్ఘ మహాకావ్య బంధాలు, ఖండకావ్యాలు, ఉపకావ్యాలు వృద్ధి పొందినవి. వీరరసాత్మకాలు, వర్ణనాత్మకాలూ, భావగేయాత్మకాలున్నూ ఉద్భవించినవి. సంస్కృతంలో ఆలోచనాత్మక, ఉపదేశాత్మక, ఐతిహాసిక, కథనాత్మక కావ్యాలు తరపరంపరలుగా వచ్చినవి కావ్యాలలో అద్భుతంగా వివిధ ఛందస్సులవల్ల సౌందర్యం ప్రకటిత మవుతున్నది. గద్యరచనలోకూడా వృత్తగంధి, కళిక, ఉత్కళికలవల్ల, భాషలోని సంగీత శ్రావ్యతకుగల అవకాశము తరచబడింది. గద్య పద్యాలు అందచందాలను సమ్మేళన చేయగా సంస్కృతములో చంపూ కావ్యం ఉద్భవించింది. సంస్కృత కవులు అనేక రకాల రూపక రచన చేశారు. వీరరస ప్రధానమైన నాటకము, సామాజిక కథావస్తువుతో ప్రకరణము అనే దీర్ఘ రూపకాలు, చిన్న నాటకాలు, ఏకాంకికలు, ప్రహసనము, భాణము, ఐతిహాసిక రాజకీయ మత ధార్మిక రూపకాతిశయోక్తి ప్రధాన నాటకాలు, అనంతర కాలంలో సంస్కృత నాటక రంగంలో వివిధ నాట్యానుకూలమైన ఉపరూపకాలతో, అభివృద్ధి చెందినవి. అన్నిటికన్న మిన్నగా ధర్మమువలెనే రస సిద్ధాంతముకూడా భారతీయ సంస్కృతిని సూచనచేసే కీలక శబ్దాలలో ఒకటి. దీనితోపాటు ధ్వని, ఔచిత్యము, సంస్కృతాలంకారికులు పెట్టిన భిక్ష. ప్రాంతీయ భాషల్లో ఈ సాహిత్య సిద్ధాంతాలను మించిపోగలిగినవి ఏమీ ఉద్భవించలేదు.

## జీవభాష : సంస్కృతము

దీనినిబట్టి సంస్కృతము ప్రాచీన లాక్షణిక ప్రమాణాలను అనుసరించి సంప్రదాయక సాహిత్య ప్రక్రియలను సృష్టిచేస్తూ, తాను ఉన్న తాసనం అధిష్ఠించిందని మనమనుకోరాదు. సంస్కృత భాషా చరిత్రమూ, సమృద్ధమై, సంపన్నమై, వైవిధ్యము కలిగిన సాహిత్యాన్ని విశ్లేషణచేస్తే, ఆ భాషా పరివర్తనాలూ, జనప్రీతిగల మాతృభాషలవల్ల

సంస్కృతం పొందిన ప్రభావమూ తెలియవస్తాయి. సంస్కృతము తన ప్రాకృతాలవల్లనేకాక, తనకు సంపర్కము కలిగిన ఇతర కుటుంబాలకు చెందిన భాషలవల్లకూడా సర్వశాస్త్రాలలోనూ, మార్ఫాలజీ (ఆకారవిపరిణామశాస్త్రం) లోనూ, శబ్దాల్లోనూ, అర్థ విపరిణామంలోనూ, మార్పుపొందింది. కావ్యాలంకార ఛందస్సుల్లో, ఇతివృత్త కల్పనోద్దేశాలలో, గద్యరచనలో, ఆఖ్యాయికల్లో, రంగానుకూలమైన ఉపరూపకాల్లో, భిన్నప్రాంతాల్లోని ప్రాంతీయ సంప్రదాయాలు, ఆకార ప్రకారాలూ, చేరి స స్కృతం వృద్ధిచెందింది. ఆదాన ప్రదానములో ఉదార దృష్టి కలిగిన సంస్కృతము తన ఉనికితోపాటు అన్యభాషల మనుగడకు సహనము చూపించగల పంచశీలలో విశ్వాసము కలిగినదవుతూ, ప్రాంతీయ సంస్కృతులలోని సౌందర్యాంశలను స్వీకరించి సమన్వయము చేసుకొన్నది. సంస్కృతపు ఘనత భారతదేశంలోని అన్ని ప్రాంతాల్లోనూ వర్ధిల్లింది రాజ్యాంగ చట్టము ప్రస్తుతకాలంలో హిందీ రాష్ట్రభాషగాఉండి ఏమి సాధించవలెనని కోరుతున్నదో దాన్ని స్వాభావిక ప్రతిభతో సంస్కృతం, శాంతంగా సాధించినది. అది సాగిసాగి, భిన్నప్రాంతాల్లో పరిపుష్టమై ప్రాంతీయ భాషల్లోఉన్న అమూల్యములయిన వాటిని జీర్ణము చేసుకొన్నది.

సంస్కృత గ్రంథకారులు సమకాలిక లోక వృత్తంతో దగ్గర సంబంధము కల్పించుకొని, సరికొత్త విషయాలతో వారికి గల పరిచయంవల్ల స్వేచ్ఛగా వాటిని వినియోగించుకొన్నారు. ప్రథమదశలో గ్రీకు రోమకదేశాల ప్రభావం మన ఖగోళశాస్త్రంలో ఉండేది. మొగలాయీల పాలనలో గీర్వాణ భాషారచయితలు పారశీక భాషనేర్చి, పారశీక సంస్కృత నిఘంటువులు క్రోడీకరించినారు; పారశీక అరబ్బీ భాషల్లోని గ్రంథాలకు అనువాదాలు చేసినారు. సంస్కృత వేత్తలు లోక సంబంధము లేకుండా ఏకాంత జీవితము గడపలేదు. అయితే, వారు అన్యసంస్కృతిలోని అంశాలను స్వీకరించినా, తమ వ్యక్తిత్వము నిలుపుకొంటూ, తమ రచనల్లో సమన్వయము చేసినారు. మొదట (క్రీ శ. 531–579) ఖోస్రో అనోషర్వాన్‌తో మధ్యప్రాచ్య సంపర్కము ఆరంభమై క్రమంగా అనంతరం ఇస్లామీయ సంస్కృతితో సంబంధాలు

పెట్టుకొన్నారు గీర్వాణ రచయితలు. ఖిలాఫత్ కాలంలో సాంస్కృతిక సంబంధము గాఢమైంది. అప్పుడు ఆయుర్వేదము, గణితమునకు సంబంధించిన సంస్కృత గ్రంథాలు అనువదింపబడి, పశ్చిమదేశాలకు వ్యాప్తమయినవి. నవీన కాలంలో ఐరోపీయ సంబంధాలు, ప్రాచీన భారతదేశానికి ఏథెన్స్, అలెగ్జాండ్రియా, రోమక రాజ్యాలతోగల శేముషీ సంసర్గ పునఃస్వీకరణమే అనవచ్చును.

నవీన కాలంలో హైందవ యూరపీయ సంబంధము ఉభయ ఖండాల్లోనూ సమాన ప్రాధాన్యం వహిస్తూ ఉన్నది. యూరపుఖండంలో ఉజ్జీవనయుగము తర్వాత, పాశ్చాత్య భావప్రపంచంలో పాశ్చాత్యులు సంస్కృత విజ్ఞాన దర్శనం చేయడం అత్యంత ప్రాధాన్యం వహించింది. భారతదేశానికి సంబంధించినంతవరకూ, ఈ సంస్కృతి దర్శనము రెండు విధాల ఫలించింది. మొదట భారతీయులు ఆధునిక విద్యావ్యాప్తివల్ల మేలుకొని తమ సాంస్కృతిక పారంపర్య పరమార్థలను నవ్యంగా గ్రహించ గలిగినారు. దానికితోడు పాశ్చాత్యులైన భారతీయ విజ్ఞానులు భారతదేశంలో సారస్వత సాంస్కృతికమైన ఉజ్జీవనం కలిగించినారు. రెండవఫలితం—సంప్రదాయకమైన విద్యాసంస్థల్లో పరిషత్తుల్లో పాశ్చాత్యభావ విన్యాస వైఖరులవల్ల, జీవితవిధానాలవల్ల పరివర్తనం ప్రాప్తించింది. సంస్కృత భాషాధ్యయనమే నవ్యపద్ధతీ సంప్రదాయ పద్ధతీ అనే రెండురూపాలు ధరించింది. నవ్యపద్ధతి కొత్తగా స్థాపించిన ఇంగ్లీషుస్కూళ్లలోనూ, కళాశాలల్లోనూ, విశ్వవిద్యాలయాలలోనూ సాగుచుండగా సంప్రదాయపద్ధతి పూర్వపు టోలాలలోనూ, పాఠశాలలలోనూ, ఆ ప్రత్యేక పద్ధతిలో బోధించేందుకు ఏర్పడిన సంస్కృత కలాశాలల్లోనూ అధ్యయనం చేయడం సంభవించింది. పాశ్చాత్య భావ పభావము, పాశ్చాత్య సాహిత్యమున్నూ, విద్యాపరిపాలనా విధానాలద్వారా ప్రాచీన నవ్య సంస్కృతవేత్తలలో మార్పు తెచ్చినవి తత్ఫలితంగా ఆధునిక యూరపీయ ప్రభావోదయంవల్ల సంస్కృత సారస్వతము నవ్యమార్గములో ప్రవేశించింది.

సృజనాత్మక సాహిత్యవ్యాసంగము సాగుతున్న మొదటి రోజుల్లో దానిప్రభావంవల్ల సంస్కృత రచన నూతనగాఢప్రేరణపొంది కొంతకాలం

సాగింది. పూర్వము సంస్కృతము భారత జాతీయ భాషగా ఉండేది. నెమ్మది నెమ్మదిగా దాని స్థానంలో యావద్భారత దేశానికి భావ వ్యక్తీకరణకు రాష్ట్రీయభాషగా, ఆంగ్లము అవతరించింది. పూర్వము ప్రాంతీయ భాష మూలంగా సంస్కృతాధ్యయన అధ్యాపనలు జరిగేవి. దానికి మారుగా, ఆంగ్లభాష ఆ స్థానం ఆక్రమించింది. దానివల్ల దైనందిన జీవితంలో సంస్కృతానికి సంబంధము క్రమక్రమంగా తెగిపోయింది. అందువల్ల ప్రస్తుతం సంస్కృతాధ్యయనమంటే పురాతత్త్వ వ్యవహారంగా తయారైనది. సంస్కృత పండితుడు ఆంగ్ల ప్రభావంచేత ప్రేరితుడై ఆదిలో మహోత్సాహంతో సంస్కృత పత్రిక ఆరంభించి, వైదేశిక గ్రంథానువాదముచేసి, నవలలూ, కథానికలూ, రచించినాడు. అలాంటి సంస్కృత విద్వాంసుణ్ణి నవీన కాలంలో నైరాశ్యం ఆవేశించింది. దీన్నిబట్టి సంస్కృతము భావాభివ్యక్తికి సజీవ భాషకాక, క్రమంగా సామాన్యమై అప్రధానమైపోయిన తీరు తెలుసుకో వచ్చును. సంస్కృత పోషకు లయినవారుకూడా, సంస్కృతాధ్యయన అధ్యాపనాలకు ఉత్సాహంతో ప్రోద్బలం ఇచ్చినవారుకూడా, సంస్కృత ములో వ్యుత్పన్నతగల స్వతంత్ర రచనలను హేయంగా చూడసాగిరి. అదృష్టవశాన మళ్ళీ ఈ మధ్య సంస్కృత సాహిత్య వ్యాసంగంలో కొంత ఉల్లాసానికి ఉజ్జీవనం కలుగుతూ ఉన్నది. ఆధునిక విద్యావంతు లయిన సంస్కృత వేత్తల్లోకూడా, సంస్కృత మూలంగానే భావాన్ని వ్యక్తము చేయాలనే, భాషాకృషి బాగా చేయాలనే ఉత్సాహము గోచరిస్తున్నది.

బ్రిటీషు యుగారంభములో సంస్కృతవిద్య యథాపూర్వమైనఊపుతో ఉండేది. సంప్రదాయరీత్యా సంస్కారముపొందిన సంస్కృత విద్వాంసుని ప్రభావం ఇంకా అధికంగాఉండేది. 19శతాబ్దిలో సంస్కృత విద్వాంసుడు కానీ, కొత్తపద్ధతిగా చదువుకొన్న అతని కుమారుడుకానీ, మనుమడు కానీ సంస్కృతములో రచన సాగించేవాడు. వారిలో కొందరు ధారా వాహికంగా విరళంగా, పరిశ్కృతంగా, గ్రంథరచన చేసివేసినారు. గ్రంథాలు అచ్చుకాపడమే సాధారణంగా సారస్వతవ్యాప్తి సాధనం కావడంతోటేనూ, సంస్కృత ప్రచురణలకు తగినంతగా సాధనాలు

వర్ధిల్లకపోగానూ, సంస్కృత సాహిత్యము యావత్తూ తాళీపత్రసంపుటాల్లో నిక్షిప్తమైపోయింది. ఆధునిక సంస్కృత సారస్వతాన్నిగూర్చి సమగ్రంగా ఉల్లేఖించడానికి వీలుకావడంలేదు. అవలోడనం చేయవలసిన గ్రంథాలు అపరిమితంగానూ, అముద్రితంగానూ, దుర్లభంగానూ ఉండడంవల్ల చాలమంది సమకాలిక సంస్కృత గ్రంథకర్తలు సంస్కృతంలో కావ్యనాటక కథానికలు విస్తారంగా రచనచేసి, అచ్చువేసుకొనే ఆశలేక, అభినివేశముగల విశాల సహృదయ పాఠకలోకానికి అందీయలేక ఊరుకుంటున్నారు. అయితే ధారాళంగా లోకానికి తెలియచేసే అవకాశము లేనిమాత్రాన, సంస్కృతంలో సృజనాత్మక సాహిత్యప్రవృత్తి అవిచ్ఛిన్నంగా సాగుతుండలేదని ఎవరూ భ్రమపడరాదు. ఇటీవల ఆధునిక కాలంలోకూడా తగుమాత్రంగా సంస్కృతములో సాహిత్యము ప్రకటితమైంది. అన్యదేశభాషలతో పోల్చిచూస్తే, ఆధునిక సంస్కృత రచన ఏమీ తీసిపోదని చెప్పవచ్చును.

ఈ సందర్భంలో ఒకవిషయం గమనార్హము. సంస్కృత సారస్వత చరిత్రను గురించి రచించిన ప్రసిద్ధగ్రంథాలు 12 శతాబ్దివరకూ విశేషాంశాలను ఉల్లేఖించి, అనంతర శతాబ్దాల్లో జరిగిన సాహిత్యప్రవృత్తి ఏదోకొంతచెప్పి ఊరుకొంటున్నవి. శ్రీమాన్ మాడభూషి కృష్ణమాచార్యులుగారు మాత్రం తమ సంస్కృత వాఙ్మయ చరిత్రలో ఈలోటుచేయక భిన్నప్రాంతాలలోని నవ్యరచయితల రచనలు క్రోడీకరించినారు. కొన్ని సంస్కృత పత్రికల్లో ఆ రచనలు కొన్ని ముద్రితాలయినవి అయితే పత్రికలు ఆగిపోవడమూ పాతసంచికలు అలభ్యము కావడంచేతనూ, నవ్యరచయితలను గురించి అందరికీ తెలియడంలేదు. [1]నేను ఈ వ్యాసంలోవలెనే మరిరెండుచోట్ల ఆధునిక సంస్కృత సారస్వత సింహావలోకనం చేశాను.

---

1 Modern Sanskrit Writings, Adayar Library Bulletin, 1956, and Sanskrit Literature (1700—1937), Journal of the Madras University, Centenary Numbur, 1957.

## పాశ్చాత్య సంపర్కము

సంస్కృత సాహిత్యంలో నూతన ప్రక్రియలు ప్రధానంగా పాశ్చాత్య సాహిత్య సంపర్కమువల్ల సముద్భవించినవి. సంస్కృత పత్రికాస్థాపనంలో, పాశ్చాత్య మహాగ్రంథానువాదాల్లో, కథానికాభివృద్ధిలో, ఖండకావ్యంలో, నవలారచనలో, కథనాత్మక వర్ణనాత్మక వచనరచనలో. సూక్ష్మసమీక్షాత్మకాలైన లఘువ్యాస రచనలో, ఉద్గ్రంథ విమర్శలో, సామాన్యగోష్ఠిలో, సాహిత్యాభినివేశకృషిలో, చరిత్రాత్మక విమర్శలో (పాశ్చాత్య విధానాలపై), ఆధునిక శాస్త్రీయవిజ్ఞాన వివరణలో, నవీనోత్సాహము వ్యక్తమవుతున్నది. దేశంలోనే సంస్కృత వేత్తలు, ప్రాంతీయభాషలలో నూతనంగా వెలువడిన సాహిత్యము చదివి కానీ, లేదా వారే తమ మాతృభాషల్లో రచనలు చేసిగాని, ప్రాంతీయ భాషల్లోని ప్రాచీనములూ, ఆధునికములూ అయిన, మంచి పుస్తకాలను సంస్కృతీకరించారు. సంస్కృతానికీ దేశభాషలకూ విడతీయరాని సంబంధము తిరిగి కల్పిస్తూ. మూడోవిషయం — దేశంలో నవీన సామాజిక రాజకీయోద్యమాలవల్ల సంస్కృత రచయితలు ప్రభావితులైనారు. ఇక్కడనే సరికొత్తపక్కిలో వారు వాఙ్మయసృష్టి చేసినారు. అందుచేతనే సంస్కృతము సజీవమై. అన్వర్థంగా సమకాలికజీవితాన్నీ, ఆలోచననూ వ్యక్తముచేయడానికి మూలమైంది.

ప్రాచీన సంప్రదాయాన్ని అనుసరించే సంస్కృత వైదుష్యము ఉంటూనేఉన్నందున, విద్వాంసులు సనాతన సంప్రదాయమగ్నులై దీర్ఘకావ్యాలు, ఖండకావ్యములు, నాటకములు, మతధార్మిక గ్రంథాలూ వాటిపై వ్యాఖ్యాలూ, శాస్త్రీయగ్రంథాలున్నూ, ప్రాచీన శైలిలో వ్రాస్తూనేఉన్నారు. ఇటీవల దాక్షిణాత్య రచయితలలో ఒకానొకరైన భట్ట శ్రీ నారాయణశాస్త్రి 93 నాటకములూ, రాధామంగళం నారాయణ శాస్త్రి అష్టోత్తర శతగ్రంథములూ, కావ్యకంఠ గణపతిశాస్త్రి ధారావాహికంగా శరపరంపరగా ఎన్నో గ్రంథాలూ రచించారు. వైదుష్యానికి నిలయమైన తావుల్లో మరికొందరు విద్వాంసులు లేఖినికి

విశ్రాంతి ఇవ్వలేదు. పద్యరచనలో పాండిత్యప్రావీణ్యం ప్రదర్శిస్తూ బంధకవిత్వరచన ఇంకా సాగిస్తూనేఉన్నారు 1905 లో మైసూరువారయిన సి.యస్. రామశాస్త్రి 'సీతారావణ సంవాదఝరీ' అనే సీతారావణుల సంవాదము రచించినాడు. రావణుని సంభాషణ శ్లోకాల్లో ఏకాక్షరాన్ని లోపింపచేస్తే సీతాదేవి అతనికి చెప్పే సమాధానమవుతుంది. ప్రాచీన శైలిలో కావ్య నాటకాదులమీద కుప్పతిప్పలుగా [2] వ్యాఖ్యానాలు, ముఖ్యంగా విశ్వవిద్యాలయాలు నిర్ణయించిన పాఠ్యభాగాలమీద ప్రాచీన పండితులు [3] ఆంగ్ల సంస్కృత విద్వాంసులున్నూ రచించినారు. తార్కిక భాష్యశైలిలో దర్శన శాస్త్రాలలో [4] మహామహోపాధ్యాయ అనంతకృష్ణ శాస్త్రి, జయపురవాసులయిన మధుసూదనశర్మవంటి మరికొందరు కాశీ, కలకత్తా, మిధిల, కేరళ ప్రాంతాల్లో రచనలు చేసినారు. ఇంకా నేటి వరకూ అవిచ్ఛిన్నంగా సంప్రదాయాను సారంగా భాష్యశైలిలో సంస్కృత రచనలు సాగుతూనే ఉన్నవి. కాని వాటి వివరాలు ఇవ్వడానికి అవకాశంలేదు

పరిపాలన కోసము బ్రిటీషు పాలకుడు, సంస్కృత విద్వాంసుణ్ణి ధర్మశాస్త్ర క్రోడీకరణము చేయమని నియమించినట్టే, సనాతన సంస్కృత పండితునిచేత బ్రిటీషు సార్వభౌముల ప్రశంసాత్మక

---

1 చూడు-టి. యస్. శ్రీనివాస దేశికాచార్యుని కవిత. మైసూరు సంస్కృత కళాశాలా పత్రికలో 1951 మార్చినుంచి డిసెంబరు- ; మధురానాథశర్మ జయపురవాసి కృతమైన 'జయపురా వైభవకావ్యం' (1947) చిత్ర చత్వర భాగము.

2 నిరోష్ఠ్య దశావతార స్తవ : కర్తా : తట్టి శ్రీనివాసాచార్యులు—తంజాపురి 1900; టి. యస్. శ్రీనివాసదేశికాచార్య—మైసూరు సంస్కృత కళాశాలా పత్రిక 1951 మార్చి—డిసెంబరు.

3 ఉదా : మహామహోపాధ్యాయ, లక్ష్మణసూరి, మదరాసు.

4 ఉదా : యం. ఆర్. కాళే బొంబాయిలో; శారదారంజనరాయ్ కలకత్తాలో; ఆర్యశతకవ్యాఖ్య, ఆనందరంగ చంపూవ్యాఖ్య—ప్రస్తుత వ్యాసరచయితదిన్నీ చెప్పవచ్చును.

కావ్యాలు, మహాకావ్యాలూ, నాటకాలూ వ్రాయించినారు. ప్రాచీనకవి పవరమార, చాళుక్య విజయనగర వంశావళినీ స్తోత్రపూర్వకంగా వర్ణించినట్లు, సంప్రదాయానుసారి అయిన సంస్కృత పండితుడున్నూ బ్రిటీషు చక్రవర్తులను స్తవము చేసినాడు. సార్వభౌమాధికారానికి పొంగిపోయే యీ భక్తిని మనము మెచ్చుకోకపోయినా, కావ్యరచనలకు, నాటకానికీ కావలసిన నూతన మయిన ఇతివృత్తము సంస్కృత కవులకు లభ్యమైంది అనే విషయం గమనించవలె. సందర్భవశాత్తుగా ఇది ఆంగ్లేయ చరిత్ర లేదా భారతదేశాన్ని బ్రిటీషువారు చేసిన విజయమూ, సంస్కృతములో ఈ విధంగా నిక్షిప్తమైనది వాటిలో కొన్ని చరిత్ర రచనలుగానే ఉద్దేశింపబడినవి. 'ఆంగ్రేజ చంద్రికా' అనే గ్రంథాన్ని వినాయకుడూ, మరో రచయిత ఎవరోరాసిన 'ఇతిహాస తమోమణి' అనే రచనలు అట్టి చారిత్రక రచనలకు దృష్టాంతములు. 'నూతనోవంతోత్సవమ్' (కలకత్తాలో 1839) అనేది బర్డ్‌కన్య కృతమైన ఇంగ్లాండుదేశ వర్ణనకు సంస్కృతానువాదము. కుంభకోణంలో 1894 లో త. జాఘరీ వాసులయిన రామస్వామిరాజు బ్రిటీషుహారిమీద వ్రాసిన 'రాజాంగ్ల మహోద్యానం' అనే గ్రంథంలో భారతీయ ప్రముఖుల జీవితాలుకూడా రచించినాడు. తిరుమల బుక్కపట్టణం శ్రీనివాసాచార్యులు ప్రథమ ప్రపంచ యుద్ధాన్ని గురించి తన "ఆంగ్లజర్మనీ యుద్ధ వివరణ" లిఖించినాడు. ప్రేమకావ్యాలలో మునిగితేలే సంస్కృత విద్వాంసులను అష్టమ ఎడ్వర్డు సామ్రాజ్య త్యాగం చేసి, ప్రియురాలిని స్వీకరించిన ప్రణయగాథ మనోహరం కావడంచేత ఆకర్షించింది. ఆ కథ ఇతివృత్తంగా చేసి 1937 లో ఎ. గోపాలయ్యంగార్ 'యదువృద్ధ సౌహృదమ్' అనే కావ్యము రచించినారు.

## ఇతిహాసము - జీవిత చరిత్ర

స్థానిక రాజవంశావళులను గురించి ఇతిహాసిక కావ్యరచనలు సాగుతూనే ఉన్నవి. అయితే నూతన చారిత్రక దృష్టితో బ్రిటీషు యుగం దాకా భారతదేశ చరిత్రను ఉద్దేశించి అనేక రచనలు వచ్చాయన్న విషయము మనము గుర్తించాలి. ఈ చారిత్రక రచన గద్య పద్య

మయంగా, యావద్భారత చరిత్రను ఉద్దేశించో లేదా కొన్ని చారిత్రక ఘట్టాలను తీసికొనిగాని కవులు రచించారు. [1] 'ఇతిహాసదీపిక' అనే గ్రంథము అయిదు అధ్యాయాల్లో మహారాష్ట్ర టిప్పుసుల్తానుల యుద్ధ పరంపరకు సంబంధించింది. 'భారతేతిహాసము' వచనంలో 1948-49 లో కలకత్తాలోని సంస్కృత సాహిత్య పరిషత్పత్రికలో ముద్రితమైంది. మహా మహోపాధ్యాయ టి గణపతిశాస్త్రిగారు 'భారతాను వర్ణనం' అనే భారతచరిత్ర లిఖించారు రామావతార శర్మ కృత 'భారతీయం ఇతి వృత్తమ్' కూడా ఇతిహాసికమే. [2] 'భారతేతివృత్త సారమ్' అనే చారిత్రక గ్రంథమును జయపురీయుడైన లక్ష్మీనాథశాస్త్రి ఉల్లేఖించినాడు. కావ్యకంఠ గణపతిశాస్త్రిగారు భారతేతిహాసాన్ని సింహావలోకనంచేస్తూ, 'భారత సంగ్రహం' [3] రచించారు. కవి కృష్ణకౌర్, శిఖుల ఆదిచరిత్ర [4] 'త్ర్యంకకావ్యం' 16 సర్గలలో రచించినాడు. శ్రీపాదశాస్త్రి హసూర్కర్ 'భారత నరరత్నమాలా' అనే చారిత్రక రచనతో గ్రంథమాల ఆరంభించి, ఇందూర్ (1933) లో 'శిఖాగురు చరితామృతమ్' ప్రచురించినాడు. శ్రీరంగమునుండి ప్రకటితమయ్యే 'సహృదయ' పత్రిక చతుర్థ సంపుటిలో 'గజనీ మహమ్మదు చరిత్ర', ఆ పత్రికలోనే చంద్రగుప్త, అశోక, సంయుక్తవంటి చారిత్రక రచనలు ముద్రితాలు. వారణాసిలోని సంస్కృత 'రత్నాకర' పత్రికలో 1914 లో అలకసుందరుని దండయాత్ర అచ్చుపడింది. 1907 లో కల్లాపురీయ సంస్కృత 'చంద్రికా' పత్రికలో అప్పాశాస్త్రి గారు భారతేతిహాసంలోని యాథార్థ్యం గురించి 'స్వదేశీయకథా' అని ప్రకటించారు. ఆ రచనలో బ్రిటీమ పాలనలోని గుణ అవగుణాలను చర్చించినారు. శ్రీనగరమునుంచి వెలువడిన 'శ్రీ' పత్రికలో కాశ్మీర చరిత్రకు సంబంధించిన కల్హణకవి రచిత 'రాజతరంగిణి' సమగ్రము

---

[1] ముద్రితము; కాలము తెలియదు

[2] చూడు, జయపురావైభవ కావ్యపీఠిక 1947, పుట 40 లో

[3] చూడు పుట 11 ఉమాసహస్ర పీఠిక, శిరసి, ఉత్తరకనరా, 1943

[4] 1935 లో లాహోరులో

కాకపోవడంవల్ల, నేటికాలందాకా చరిత్రను గోవిందరాజాసకుడు రచించినాడు.

ప్రాచీన సాహిత్యంలో ప్రముఖ వ్యక్తుల జీవితకథలు సత్యాసత్యముల సమ్మేళనము. ఆ జీవిత కథలు కావ్యరూపంగా స్తోత్ర శైలిలో, వర్ణన బాహుళ్యంతో, పుష్కలమయి, ఇతిహాసిక విషయాన్ని మరుగు పరచినవి. నవీన చరిత్రల్లో ప్రౌఢశైలికి బదులు కథనాత్మకమైన సరళ శైలిని రచయితలు స్వీకరించారు. రచయిత సన్నివేశాలమీద, ఎక్కువగా జీవితంలో విశేషాంశాలమీద, ఆ దేశ కాలాదుల మీదనూ, దృష్టి కేంద్రీకరించినాడు. ఇటువంటి రచనలు విభిన్న వ్యక్తులను గురించి, గత చరిత్రలో ప్రముఖులైనవారిని గురించి ఐతిహాసికవ్యక్తులను, మాధ్యమిక అధునిక కాలాల్లోని భక్తులను, ప్రస్తుతకాలంలోని ప్రముఖ రాజకీయ నాయకులను గూర్చి వెలువడినవి. రాజకీయనాయకులను ప్రముఖులనుగురించి మరొకచోట పరిశీలనచేదాము. తక్కిన స్వీయచరిత్రలు ప్రస్తుతము అవలోకన చేదాము. జయపురవాసి అయిన అంబికాదత్తవ్యాసకృత 'శివరాజ విజయము' అనే శివాజీచరిత్రను వచనంలో 'సంస్కృత చంద్రిక' అనే పత్రికాసంపుటాలలో (7,8) అనువృత్తంగా అచ్చయింది శ్రీపాద శాస్త్రి హసూర్‌కర్ 'పృథ్వీరాజ', 'శివాజీ' రాణాప్రతాపసింహులను గురించి వచనంలో 'భారత వీరరత్నమాల' అనే గ్రంథమాలలోకూడా ప్రచురించినాడు. (ఇందూర్ 192‍–22) సతారానుంచి 1951 లో సఖారామశాస్త్రిగారు మహాకావ్యరూపములో మహారాణి అహల్యాబాయి చరిత్రను రచించి ప్రకటించినారు. 1938 లో జయపురంలో రామానంద అల్లే కావ్యశైలిలో జయపుర రాజవంశావళి రచించినాడు. మదరాసులో 1938 లో శ్రీ వరవస్తు లక్ష్మీనరసింహస్వామి శాసనశోధనచేసి "చాళుక్యచరిత్ర" ప్రచురించినాడు. అది ఎక్కువ ముఖ్యమైనది. 1939 లో కోల్హాపురంలో వి. ఎ. లట్కర్‌శాస్త్రి ఒక ఇటీవలి కోల్హాపురరాజు జీవిత చరిత్రను గద్యాత్మకంగా, సాహుచరిత్ర అని రచించారు. నాగపురము నుండి వెలువడుతున్న 'సంస్కృత భవితవ్య' అనే పత్రికలో 'భారత రత్నాని' అనే శీర్షికకింద భిన్నప్రాంతీయులయిన ప్రముఖ వ్యక్తులను

గూర్చి చిన్నచిన్నవ్యాసాలు అచ్చుపడినవి. భారతీయ సాహిత్యాలను గురించి పాఠకులకు ఆ పత్రిక పరిచయముచేస్తున్నది. ఇది ప్రశంస నీయము. ఐతిహాసికగాథలను ఆఖ్యాయికా రచనకు వినియోగించు కొంటున్నారు. రచయితలు వేరే ప్రకరణంలో ముమ్ముందు దీనిని చూడ వచ్చును.

దేశంలో భిన్నప్రాంతాల్లోని భక్తుల చరిత్రలను గ్రంథకారులు సర్వసామాన్యంగా పద్యాలలోను, వచనంలోను రచించారు. 1928 లో మైసూరువాసిని అయిన అలమేలమ్మ 'బుద్ధచరితా మృతము' రచించింది. హసూర్కర్ 'భారతసాధు రత్నమాల' అనే గ్రంథమాల ఆరంభించి వల్లభాచార్య రామదాసుల జీవితకథలు వ్రాశారు వచనంలో. కాళీహర దాసవసువు సంస్కృత సాహిత్యపరిషత్ పత్రికలో వచనంలో శ్రీ చైతన్యస్వామి ఆయనకు సమకాలికులయిన అద్వైతా చార్యుల జీవితకథలను ప్రచురించినాడు (1928,29; 1938–39 సం॥) శ్యామారావుసతి 1944—50—53 సంవత్సరాలలో జ్ఞానేశ్వర్, తుకా రాం, రామదాస, మీరాబాయి జీవితగాథలు వస్తువుగా స్వీకరించి పద్యరచన చేసింది. 1946 లో కలకత్తాలో వెలువడిన సంస్కృత సాహిత్యపరిషత్ పత్రికలో 'సత్యానుభవం' అనే శీర్షికకింద సత్య నారాయణను గురించి ఉల్లేఖింపబడింది. 1936 లో మద్రాసులో పూజ్యశ్రీ పరివ్రాజకాచార్య శృంగేరీ నృసింహభారతీస్వామివారిని గూర్చి రాజవల్లభశాస్త్రి కావ్యగానము చేసినాడు. పి. ఉమామహేశ్వర శాస్త్రి 1939 లో 'శ్రీ చంద్రశేఖరవిజయ మహారత్నాకరము' అనే గ్రంథత్రయంలో కామకోటి శంకరాచార్యులవారి జీవితగాథలను, విజయ యాత్రలను గూర్చి రచించినాడు. అలహాబాదులో 1910 లో నవ్య మతాచార్యులైన దయానందునిగూర్చి 'దయానందప్రభావము' అని వామనాచార్యులు, అఖిలానందశర్మ 'దయానంద దిగ్విజయము' రచించారు. 1952 లో అలహాబాదులో గంగాప్రసాద్ ఉపాధ్యాయ 'ఆర్యోదయకావ్యమ్' 21 సర్గలలో మహాకావ్యంగా రచించినాడు. ఈ కావ్యంలో గ్రంథకర్త దయానందుని అవతరణకు పూర్వం ఉన్న చారిత్రకస్థితిని నేపథ్యభూమిగా చిత్రించినాడు. హైందవధర్మ పతనోద్ధ

రణములు, భారతదేశముమీద విదేశీయుల ఆధిపత్యము, స్వాతంత్ర్య సంపాదనమున్నూ, కవి వర్ణించినాడు. కాశ్మీర భక్తులనుగూర్చి శ్రీనగరపత్రిక 'శ్రీ' ప్రకటించింది. 1937లో మద్రాసులో పి పంచాప గేశశాస్త్రి రామకృష్ణ పరమహంస జీవితమును వచనంలో రచించి నాడు. కె. యన్. నాగరాజన్ బెంగుళూరులో 'వివేకానంద చరితమ్' అమృతవాణీ పత్త్రికలోనూ, 1947 లో గ్రంథరూపంలోనూ ప్రకటించి నాడు. కర్ణాటక సంగీతములో వాగ్గేయకార భక్తులైన త్యాగరాజ, ముత్తుస్వామి దీక్షితుల జీవితాలను మహాకావ్యాలుగా రచించారు. కుంభకోణంలో 1937లో సుందరేశశర్మ త్యాగయ్యనుగురించి కావ్యము ప్రకటించినాడు నేను ముత్తుస్వామి దీక్షితులనుగూర్చి కావ్యము రచించాను; కాని అచ్చువేయించలేను. ఆంధ్రదేశంలో సంస్కృతవేత్తలు, ప్రసిద్ధవిద్వాంసులూ అయిన శ్రీ కాశీకృష్ణాచార్య 1957 లో గుంటూరులో వాల్మీకి కథను సరళ వచనంలో, అనేక ఉదంతాలూ గాథలూ చేర్చి, ఉల్లాసదాయకంగా లాక్షణికంగా రచించారు.

హైందవ మతేతర క్షేత్రాల్లో, తిరువనంతపురంలో శ్రీనీలకంఠ శాస్త్రి సంస్కృతవచనంలో 'ఏసుచరిత్రమ్' అనే క్రీస్తు జీవితాన్ని రచించినాడు. గద్వాల్ వాస్తవ్యులయిన శ్రీ గుండేరావు హర్కారీ ఖురాన్‌లో 5 అధ్యాయాలను సంస్కృతానువాదము చేసినారు. (ప్రథమాధ్యాయము ముద్రితము — ఇస్లామియ సంస్కృతి, హైద్రాబాద్ XIX–1945)

విద్వాంసుల జీవితాలు, సాధించిన మహాకార్యాలున్నూ గ్రంథస్థము చేయబడినవి. చంద్రభూషణశర్మ రచించిన 'జీవిత వృత్తాంతము' కాశీ సంస్కృత కళాశాలలోని బేచనరామ పండితుల విషయము (కాశీ 1890), 'విద్వత్ చరిత-పంచకము'ను నారాయణశాస్త్రిఖిస్తే (కాశీ 1928) లిఖించినాడు. అది చంపూకావ్యము. ప్రఖ్యాతులైన అయిదుగురు విద్వాంసుల జీవితాలు వర్ణితాలు. వారు కాశీలో మహామహోపాధ్యాయులైన మానవల్లి గంగాధరశాస్త్రి, కైలాసచంద్ర, దామోదరశాస్త్రి, శివకుమారశాస్త్రి, రామకృష్ణశాస్త్రి (తాత్య, గార్లు. సంస్కృత చందికా' పత్రికలో ప్రాచీన అర్వాచీన విద్వాంసుల

జీవితాలు సంస్కృతవచనంలో విరచితాలు. మహామహోపాధ్యాయ యజ్ఞస్వామిశాస్త్రిగారు తమ పితామహులయిన మ.మ. మన్నారుగుడి త్యాగరాజశాస్త్రి (తంజాపురి 1904) గారి జీవితాన్ని రచించారు. శ్యామారావు 'శంకర జీవనాఖ్యాన'ము (బొంబాయి 1939) తమ తండ్రిగారయిన పరిశోధక విద్వాంసులయిన శంకరపాండురంగ జీవితాన్ని శ్లోక రూపంలో రచించింది. 1955 లో బికనీరులో విద్యాధరశాస్త్రి తమతాత గారి జీవితాన్ని 'హరనామామృత కావ్యం' గా రచిస్తూ, తత్కాలంలో సంస్కృత వైదుష్య విశేషా లుగ్గడించినాడు. లక్నోలో 1955 లో వీరేంద్ర బహదూర్‌సింగ్, విథ్వత్‌సన్యాపి జీవితాన్ని 'బ్రహ్మర్షి విలాసము' లో వ్రాస్తూ సందర్భవశాన గ్రంథకర్త శాస్త్రవైదుష్యము ప్రదర్శించినాడు. దీనానాథ త్రివేది 'పురుషోత్తమశర్మ చతుర్వేది' జీవితాన్ని సంగ్రహంగా లిఖించినాడు. 1950 లో బొంబాయిలో డాక్టర్ వి. యం. కైకిని 'శివకైవల్య చరిత'ను తమ పూర్వీకుని జీవితాన్ని వర్ణిస్తూ, తత్కాలీన చారిత్రక విషయాలను అనగా పండిత కుటుంబాలు తరలిపోవడాన్ని గురించి రచించారు. ఐరోపీయుడైన భారతీయ విజ్ఞాని ఋయార్డైన్ జీవితం సంస్కృతంలో గ్రంథస్థమైంది. బెంగుళూరులోని పద్మరాజ పండితు డా. గ్రంథకర్త.

స్వీయచరిత్ర అనేది (బాణుడు, దండిరచనలు ఉండినా) ఆధునిక రచనాభ్యుదయంగా పేర్కొనాలి. శ్రీ కోరాడ రామచంద్రకవి (1816–1900) 'స్వోదయ కావ్యము' రచించారని అంటారు. అయితే అది అముద్రితం. 'విద్యోదయ' లో దుర్గానందస్వామి స్వీయ జీవితము రచించారు. ఇటీవల ముద్రితమైన గ్రంథాలలో (తిరుచ్చూరు 1950) మలబారులో తపోవనస్వామివారి 'ఈశ్వర దర్శనం' లేదా 'తపోవన చరితమ్' ఒక గ్రంథము. ఆయన హిమాలయాశ్రమంలో సిద్ధిపొందినారు. ఆయన వచన రచన చక్కగా ఉంటుంది.

మంచి విదగ్ధతగల భారతీయ ప్రభువులు కొందరి పాలనలో తమ రాష్ట్రాలు సర్వతోముఖాభివృద్ధి పొందినవి. ఆ ప్రభువులు స్మరణీయులు. వారిలో మహిశూర మహారాజులుంగారైన కీ. శే కృష్ణరాజ వొడయరును గూర్చి మైసూరు మహారాజ సంస్కృత కలాశాలా పత్రికలో పూర్వ

సంచికల్లో ఎన్నో శ్లోకాలు అచ్చయినవి. ఆ కలాశాలాపత్రికలోనే రాళ్ళ వల్లి అనంతకృష్ణశర్మ, నరసింహాచార్య, సింగేరియంగార్ ప్రభృతులు మైసూరు రాష్ట్రంలోని నవ్యలక్షణాలను అనగా విద్యుత్ప్రసారం, కావేరికి ఆనకట్ట, జోగ్‌జలపాతం, కోలారు బంగారుగనులు, హళుకేరి సొరంగము, వంటివాటిని వర్ణించినారు. ప్రస్తుత మహారాజుల మేన మామగారయిన కొచ్చిన్ ప్రభువయిన హెచ్. హెచ్. రామవర్మ మహా సంస్కృత విద్వాంసులు. కున్హన్ వారియరు 1930 లో ఆయనను గురించి 'రామవర్మ విజయము' ఉల్లేఖించినాడు. తిరుచ్చూరులోని ఎ. వి కృష్ణవారియరు 1949 లో 'మాలా' అనే పేరుతో ప్రస్తుత కొచ్చిన్ ప్రభువును గూర్చి రచనచేసినాడు. మహారాజుకూడా సంస్కృత విద్వాంసుడు; అనేక గ్రంథాలు సంప్రదాయానుసారంగా మంచి శైలిలో రచించినాడు. మధురానాథకవిశాస్త్రి (1947) 'జయపురా వైభవం' లో ఆధునిక జయపురాన్నిగూర్చి, సంస్థానము, ప్రభు కుటుంబము, సంస్కృత విద్యాలయము, అక్కడున్న పండిత కుటుంబాలను గూర్చి రచించినాడు.

## విమర్శక దృష్టి

సంస్కృత పాఠ్యక్రమంలో సంస్కృత భాషా శాస్త్ర చరిత్ర పార స్పతమున్నూ చేర్చబడినవి. సంప్రదాయక పాఠశాలల్లోకూడా అధ్యయన క్రమంలోనూ చేర్చబడ్డవి. పండితునికి చారిత్రక విమర్శనా దృక్పథము కలిగించడం ఆవశ్యకం. తులనాత్మక భాషాశాస్త్రం నవీన శాస్త్రీయ పద్ధతిలో, ముఖ్యంగా హైందవ యూరపీయ భాషాశాస్త్రమువకు, సంస్కృత పారస్పత చరిత్రకు ప్రత్యేక సందర్భసహితంగా వచనంలో రచనలు సాగినవి. రాజరాజవర్మ తన 'లఘుపాణినీయం' లో (1913 తిరుచ్చి ద్వి. ముద్రణ) హైందవ యూరపీయ భాషాశాస్త్రానుబంధము చేర్చినాడు. మైసూరులోని మహారాజ సంస్కృతకళాశాలా పత్రికలో 1925-26 సంపుటంలో ఆర్. శ్యామశాస్త్రి 'భాషాతంత్రము' ప్రచురించినారు. 'సహృదయ' పత్రిక III లో 'ఆర్యభాషాచరితము' 1935 లో కలకత్తా లోని సంస్కృత సాహిత్యపరిషత్ పత్రికలో, ద్విజేంద్రనాథ గుహాఠాకూరీ

'దేవభాషా దేవనాగర అక్షరయోః ఉత్పత్తిః' అనే భాషశాస్త్రసంబంధ వ్యాసమున్నూ అచ్చుపడ్డవి. గ్రంథరూపంలో ఆర్. యస్. వేంకటరామ శాస్త్రి, 'భాషాశాస్త్ర ప్రవేశినీ' అనే పుస్తకము (1938, మద్రాసు బాలమనోరమా ముద్రణశాల) ప్రకటితమైంది. యస్. టి. జి. వరదా చార్యులు 'భాషాశాస్త్ర సంగ్రహ'మును (1933లో చిట్టిగూడూరు) ప్రచు రించినారు. ఇలాగే సంస్కృతసాహిత్య చరిత్ర రచనలు బహుముఖాలుగా వచ్చాయి. 'సహృదయ' పత్రిక (తృతీయసంపుటి) లో, ఆర్. శ్రీని వాస రాఘవన్ 'గీర్వాణభాషాభ్యుదయా'న్ని ప్రచురించినాడు. 'మిత్ర గోష్ఠి' పత్రికలో సంస్కృతకవుల విషయము గిరిజా ప్రసాదశర్మ వ్యాస రూపంగా ప్ర టించినాడు. మైసూరు మహారాజావారి సంస్కృత కలా శాలాపత్రికలో రాజగోపాలచక్రవర్తి 'కవికావ్యవిచార'ము ప్రచురించి నాడు. 'ఉద్యానపత్రిక'లో 'సంస్కృతగ్రంథ చరితము' అను వృత్తంగా అచ్చవుతూ వచ్చింది. డా. పి. పి యస్ శాస్త్రి, కె. యల్. వి. శాస్త్రిగార్లు కలిసి మెక్డానల్ రచించిన సంస్కృతవాఙ్మయ చరిత్ర లోని వైదికసాహిత్యచరిత్ర భాగాన్ని 1923 లో అనువదించి పాల ఘాటులో ప్రకటించారు. ఇటీవల పంజాబు విశ్వవిద్యాలయంలో ఆచార్య హంసరాజ అగర్వాలా లూధియానానుండి 1951 లో రెండు సంపుటాల్లో సంస్కృత సాహిత్యచరిత్ర విపులతరంగా రచించినాడు; ప్రచురించి నాడు. ద్విజేంద్రనాథశాస్త్రి (మీరట్ 1957) 'సంస్కృతసాహిత్య విమర్శ' సంస్కృతంలో రచించి ముద్రించారు. చాలామంది విద్వాం సులు, పండితపరిశోధకులు, గ్రంథవిమర్శకులుగా, మహాగ్రంథాలను పరిష్కరించి. విపుల సంస్కృతపీఠికలతో (ఆంగ్లానికి బదులుగా) ప్రచు రించారు. అందుచేత ఆ ప్రతులను వినియోగించుకొనే పాఠకలోక సంఖ్య పెరిగింది. జయపురీయులయిన, మధుసూదనశర్మ వంటివారు, సంస్కృత వ్యాసరూపాల్లో ఇంద్రుడు, చాతుర్వర్ణ్యం, అత్రి, యజ్ఞము వంటి విషయాలనుగూర్చి [1] పరిశోధక వ్యాసాలు రచించారు.

---

[1] ఇంద్రవిజయమ్ 1930, చాతుర్వర్ణ్యశిక్షా 1927, అత్రిఖ్యాతి; 1926 యజ్ఞసరస్వతి : 1946, మహర్షి కులవైభవమ్ 1956.

## సామాజిక తాత్త్వికోద్యమాలు

మనము సింహావలోకనము చేస్తున్న కాలంలోనే సామాజిక, మత ధార్మిక తాత్త్విక రంగాల్లో నవ్యోద్యమాలు సాగినవి. భారతీయులు పాశ్చాత్య జీవిత విధానాలు అధికంగా అవలంబించడంచేత, సముద్రాలు తరించి, విదేశయాత్రలు చేయడం పరిపాటి కావడంతోనే, పాశ్చాత్యులూ, భారతీయ సామాజిక సంస్కర్తలూ ఐక్యకంఠంతో సనాతన హైందవాచార వ్యవహారాలను, బాల్యవివాహం, వైధవ్యం, వర్ణధర్మం, అస్పృశ్యతా విషయాలను విమర్శించి, ధాటి చూపినారు. పండితులు సనాతనులు కావడంచేత వెల్లువుకుతున్న సంస్కరణోద్యమాలను ప్రతిఘటించ దలచుకొని, సముద్రయాత్రా; రజస్వలానంతర వివాహం, విధవా వివాహం వంటివి సంప్రదాయ విరుద్ధాలని దుయ్యబట్టి విమర్శలు [1] రచించారు. సామాజిక మతరంగాల్లో, అస్పష్టోచ్చమైన వైదికమతోద్ధరణకోసం, ఆర్యసమాజం స్థాపితమై, సంస్కృతాధ్యయ

---

* అవి–అబ్ధి నౌయాన మీమాంస; కర్త–కాశీశేష వేంకటాచలశాస్త్రి, బొంబాయి; దుర్వృత్త ధిక్కృతి: అప్పాశాస్త్రి సంస్కృత చంద్రికలో 1907; వివాహసమయ మీమాంస-కర్త, యన్. యస్. అనంత కృష్ణశాస్త్రి 1913; బాలవివాహోని ప్రకాశ, కర్త–రామస్వరూప: (పట్నా 1922) 'ఋతుమతీ వివాహవిధి నిషేధ ప్రమాణాని'— మద్రాసు 1912; పరిణయ మీమాంసా-కర్త, కె. జి. నటేశశాస్త్రి, శ్రీరంగమ్ 1918; వయోనిర్ణయము-కర్త, పి. గణపతిశాస్త్రి కుంభకోణమ్ 1910; వయస్సునుగూర్చి దేవాలయ ప్రవేశాన్ని గురించిన్నీ శ్రీనగర సంస్కృత 'శ్రీ' పత్రిక. అయితే ఉదారదృష్టిగల విద్వాంసులు సంస్కర్తల పక్షము పూనిక ఇచ్చినారు. అందుకు దృష్టాంతము చూడండి:-కాశీచంద్రుడు 'ఉద్ధార చంద్రికా' అనే రచనలో సనాతనులు సముద్రతరణముచేసిన వారి విషయం ఉన్నది. (Bulletin of the R. K. Mission Institute of culture, June 1956, పుట 132)

నానికి ప్రోద్బలం ఇచ్చింది: చాలా పాఠ్యగ్రంథాలు వ్రాయించి, ప్రకటించి, వ్యాప్తిచేసింది. దార్శనిక సాహిత్యం విద్వాంసులు రచిస్తూ, అందులో దయానంద సరస్వతిపై విమర్శలుకూడా చేర్చినారు. స్వాతంత్ర్య పూర్వ, స్వాతంత్ర్యానంతర దినాల్లో, సామాజిక మతాభ్యుదయకర శాసన నిర్మాణానికి సనాతనుల వ్యతిరేకత సాగుతూనే వచ్చింది. సంస్కరణలను చెండాడుతూ, విద్వాంసులు సంస్కృత పత్రికలు ప్రకటించారు. 1951 లో సంస్కృత 'రత్నాకర' పత్రికలో, శివనాథ ఉపాధ్యాయుడు చిన్న నాటకము రచించాడు. అందులో స్త్రీ పాత్రలు రెండు 'హైందవశిక్షాస్మృతి' ని గురించి చర్చ చేస్తాయి. ఆ శిక్షాస్మృతివల్ల, భారతదేశంలో కుటుంబాలలో పాకిస్తాన్ ప్రవేశ పెట్టినట్లు అవుతుందని, కవి, పాత్రలద్వారా చెప్పిస్తాడు. కాని కొందరు సంస్కృత విద్వాంసులు సంస్కరణలను ఆహ్వానించారు. ధర్మశాస్త్ర గ్రంథాలు ఈ యుగంలో ప్రశంసనీయంగా వచ్చాయి. డాక్టర్ భగవాన్ దాస్ 'మానవ ధర్మసారము', మహామహోపాధ్యాయ విశ్వేశ్వరనాథ రియా, జోధపురీయు లయిన వీరు 'ఆర్యవిధానము' లేక 'విశ్వేశ్వర స్మృతి' రచించారు. మొదటి పుస్తకం పూర్తి ప్రతి సంక్షిప్త ప్రతి-రెండుగా లభిస్తున్నది. అందులో అనుష్టుభ్ ఛందస్సు స్వేచ్ఛగా నడుస్తుంది. ఆ గ్రంథంలో దేశభక్తితో, సంస్కృతీ వారసత్వమును గ్రంథకర్త విస్తృత విజ్ఞానంతో భారతేతిహాసాన్ని సింహావలోకనం చేస్తాడు. భారతీయ దర్శనాలను, హైందవ జీవన దృక్పథాన్ని, ఐహికాముష్మికాలనూ పరామర్శించి వర్ణాశ్రమ, స్త్రీ, దేవాలయాది విషయాలకు సంబంధించిన ధర్మశాస్త్ర విధుల యథార్థ విశిష్టతను గ్రహిస్తూ, హైందవ ధర్మాన్ని అన్యధర్మాలతో పోలుస్తూ, హైందవ రాజ్యాల పతనాభ్యుదయాలను పరిశీలిస్తూ, సంస్కృతి వెనుకంజ వేయడానికి కారణం సంఘశక్తి లేదా జాతీయ సమైక్యభావం అభావం కావడం చేతనే, అని గ్రంథకర్త నిర్దేశిస్తాడు. అతి విస్తృతమైన ఆధునిక స్మృతిలో విశ్వేశ్వరనాథ విద్వాంసుడు నవ్యశాస్త్రీయ భూగోళ విజ్ఞానము, చరిత్ర, ఆధునిక ఆరోగ్య శాస్త్రము, జన్మ నిరోధమువంటి విషయాలను చేర్చినాడు.

బౌద్ధజైన మతాలనుంచి హైందవ ధర్మము సురక్షితము కావడానికి, సంస్కృత తత్త్వవేత్తలు ప్రతిపక్షుల ఆధిభౌతిక సిద్ధాంతాలను అవలోడనంచేసి, అవిచ్ఛిన్నంగా శాస్త్రీయక చర్చ సాగిస్తూ, గ్రంథాలు రచించారు తరువాత దురదృష్టవశాన విద్వాంసుడు అన్యోన్య వినాశకరమైన కలహాలతో శక్తి కోలుపోయినాడు. అనేకవాదులకూ అద్వైతులకూ, ఇంద్రియ ప్రత్యక్ష వాదులకూ, ఊహా ప్రపంచ వాదులకూ, ఆస్తికులకూ, నిరపేక్ష సత్తావాదులకూ, ఆస్తికుల్లో అవాంతర శాఖీయులకూ, పరస్పరం వాదము చెలరేగేది. ఇతఃపూర్వం సంస్కృత వేత్త, ప్రతిపక్షమతముల వారిని తన భాషా సాహిత్యాలూ, సిద్ధాంతమూ, బలవంతంగా అధ్యయనం చేసేట్లుగాచేసి, తన పుస్తక ఘటలో అతని వాదాన్ని ఖండించేవాడు. అనంతరకాలంలో పండితుడు ఈ పద్ధతిగా వాదము నిర్వహించలేక పోయినాడు; హైందవ ధర్మాన్ని మొదట ఇస్లామ్, తరువాత క్రైస్తవం ఎదుర్కొగా [1] అందుచేత పారస్వతం ఈ మార్గంలో వృద్ధి కాలేదు. కాలానికి అవశ్యక మయిన భారతీయ తత్త్వ పారస్వతం రాలేకపోయింది. దానికి కారణాలున్నాయి. సామాజిక పరివర్తనం విరుచుకొని మీదికి తరుముకొని వస్తున్నప్పుడు, విద్వాంసుడు ఒక్కడై పోరాటముచేసినాడు. ఓటమి తప్పనిసరిగాఉన్నా, ఇదేతీరుగా కేవలం పాశ్చాత్యసిద్ధాంతాన్ని, చారిత్రక, పరిణామికభావాలనూ, ఎదుర్కొక పండితుడు, పాశ్చాత్యులయిన సంస్కృతవిద్వాంసులు వేదానికి అపార్థములు నిర్ణయముచేస్తూండగా, సంస్కృత సాహిత్యాలంకారిక సిద్ధాంతాలకు దుష్ప్రచారము చేస్తూం

---

1 అయితే అందుకు అపవాదు లేకపోలేదు. ఉదా :- క్రీస్త ధర్మకౌముదీ సమాలోచనా – కర్త వ్రజలాల్ ముఖోపాధ్యాయ (కలకత్తా, 1594). ఇది డా॥ వాలన్‌స్టైన్ హిందూధర్మాన్ని క్రైస్తవ దృష్టితో చేసిన విమర్శకూ, హైందవధర్మాన్ని జాన్‌మూర్ చేసిన విమర్శనకూ 'మత పరీక్షా' అని పండిత నీలకంఠశాస్త్రిగారే, 'శాస్త్రతత్త్వ నిర్ణయము' (ఉజ్జయిని 1951) అనే గ్రంథాలు క్రైస్తవము స్వీకరించడానికి పూర్వము రచించినాడు.

డగా, వాటిని ఖండించి సమాధానాలు ఇయ్యడంతో స్వశక్తి వృథాచేసు కొన్నాడు. హైందవధార్మిక సమాజంలో అయినా నవ్యమత, తాత్త్వికోద్య మాలు ఉద్భవించినప్పుడు. విమర్శనాదృష్టితో వాటిని పరిశీలించిన జాడలు, సారస్వతంలో కానరావు. అందుకుకారణం: ప్రతిపక్షుల్లో తగి నంత భావకల్లోలముకాని, సాహిత్యకృషికానీ లేకపోవడమే కాకపోతే క్వాచిత్కంగా వచ్చిన వ్యతిరేకవిమర్శకులు లేకపోలేదు. వాటిలో ఆర్య సమాజంమీద వచ్చినవిషయము లోగడ గమనించాము. అట్లే మద రాసులోని సుధాధర్మమండలివారు సరికొత్తగా 24 అధ్యాయాల గీతను ప్రకటించగా దానిపై ఖండనను 'నూతన గీతా వైచిత్ర్యవిలాస మనే పేరుతో భగవద్గీతాదాసు' మదరాసు (1917) ప్రకటించాడు.

ఈ కాలంలో సంప్రదాయానుసారులైన విద్వాంసులు షడ్దర్శనా లను నవ్యరీతుల్లో సమీక్షించి, రచనలు చేశారా? చేసినవి కొన్ని ఉన్నాయి. ధైర్యంగా స్వతంత్రంగా కొందరు పండితులు నిలిచినారు. త్రివిశనల్లూరునివాసి, రామసుబ్బశాస్త్రి మంచి విద్వాంసుడు గొప్ప వాడున్నా, ఆయన చాలా స్వతంత్రంగా దర్శనాలమీద వ్యాఖ్యానాలు చేసినాడు. ఆ వ్యాఖ్యాలు కొన్నిసార్లు కల్లోలాన్ని కలిగించాయి కాని అవి బ్రహ్మసూత్రాలలోనూ, శాంకరభాష్యంలోనూ ఉన్న [1] అద్వైత వాదానికే దౌర్బల్యము చేకూర్చ యత్నించినవి. ఇటీవల బెంగుళూరులో వై. సుబ్బారావు అద్వైతములో అవిద్యాస్వరూపమును గురించి నవ్య మతము వివరించినాడు. అందులో శంకర అనుయాయులనుండీ, సామాన్య తార్కిక నిర్మాణమునుంచీ తత్త్వాన్ని రక్షించే ఉద్దేశముతో (బెంగుళూరు 1929) 'మూలావిద్యానిరాసః' అనే తన పరిశోధక గ్రంథము ప్రకటించారు. ఆ గ్రంథములో భావరూపమయిన మూలా విద్య అసంగతమని ఖండించినారు. ఆయన సచ్చిదానంద సరస్వతి

---

1 శాంకరభాష్యంమీద చేసిన వ్యాఖ్యను ఖండించారు గౌరీనాథశాస్త్రి గారు తన 'శాంకరభాష్యగాంభీర్య నిర్ణయఖండన' లో (వాణీవిలాస ప్రెస్). వేంకటరాఘవశాస్త్రిగారు తన 'భాష్య గాంభీర్య నిర్ణయమం డన' లో (1913). రామసుబ్బశాస్త్రిగారి అభిమతాన్ని సమర్థించారు.

అనే పేరుతో ఆశ్రమ స్వీకారానంతరం, శంకరుల 'అధ్యాస' భాష్యం మీద, 'సుగమా' అనే నవ్యవ్యాఖ్య ఉల్లేఖించినారు. (హోళి నరసిపూర్ 1955 లో) కె. వేంకటరత్నముపంతులు 'మార్గదాయిని' లో 'అక్షరసాంఖ్య' మనే నవ్యసిద్ధాంతము ప్రతిపాదించారు. గత శతాబ్ది తుదిలో అప్పయ్యాచార్యులవారు (1901 మృ) 'సాంఖ్యయోగ సముచ్చయము' లేదా 'అనుభవాద్వైతము' అనే నవ్యసిద్ధాంతము వివరిస్తూ చాలాగ్రంథాలు రచించారు.[1] ఈ సిద్ధాంతము భిన్నదార్శనిక సిద్ధాంతాల సార సమన్వయము.

## సహనభావము

సంస్కృత పారంపర్యంలో సహనభావము ఒక అంశము. భిన్న మతాలకు సంబంధించిన తార్కిక వాదభూయిష్ఠమైన భాష్య వ్యాఖ్యాన కిరణాదులద్వారా, సంస్కృతము యోచనాభివృద్ధికి దోహదముచేస్తూనే భిన్నపథాలు అన్నీ ఏకగమ్యానికి తీసికొనిపోతవి అనే అంతర సత్యాన్ని విస్మరించలేదు. ఆధునిక భారతయోచనలో ఈ ఉదాత్తభావావగాహన స్పష్టము చేయబడింది. సమ్మోదముగొలిపే విషయం ఏమిటంటే: ఈ కాలంలో సంస్కృతంలో రచనలుచేసే విద్వాంసుల్లోకూడా, ఇలాంటి సహనభావన చూడవచ్చును. ఏతద్భావభావితమయిన గ్రంథములలో రెండింటిని మేము పాఠకులదృష్టికి తెస్తున్నాము. పొలహం రామశాస్త్రి 'చతుర్మత సామరస్య' మనే విమర్శనాత్మక గ్రంథము (1944 కుంభకోణం) వేదాంతములోని నాలుగు అవాంతరమతాలకూ, ఏ యే అంశాల్లో సాదృశ్యంఉన్నదో చూపుతూ రచించినాడు. మహామహోపాధ్యాయ లక్ష్మీపురం శ్రీనివాసాచార్య కృతమైన 'దర్శనోదయః' కూడా ఈ తీరుగానే చేసిన ప్రధానమయిన సమన్వయాత్మక విస్తృత సంస్కృత గ్రంథము. ఈ గ్రంథరచనలో ఉద్దేశ్యము సంకుచిత శాఖాభేదమును తీసివేసి ఉదారంగా అవగాహన చేసుకోడానికి ప్రోత్సహించడమే.

---

1 చూడు - మదరాసు విశ్వవిద్యాలయమువారి Catalogus Catalogorum I పుట 194-5.

ఆర్యసమాజము భావాలను, ఆదర్శాలనూ విశదముచేస్తూ, చాలా సంస్కృతగ్రంథాలు వ్రాయించింది. అఖిలానందశర్మ ఆర్యసామాజికుడుగా సహజప్రతిభతో ధారావాహికంగా రచనలుచేసినకవి, [1] గ్రంథకర్త.

నవ్యోద్యమాల్లో ఆర్యసమాజం ఒకటి. ఈ సమాజానికీ, సంస్కృతానికీ, ఆ భాషోద్ధరణకూ, సన్నిహితసంబంధం ఉంటూ వచ్చింది. ఈ కోవకుచెందిన గ్రంథకర్తలలోవాడు బ్రహ్మముని పరివ్రాజకుడు, హరద్వారవాసి - 'వేదాంతదర్శన' మనే వేదాన్తసూత్రాలపై నవీన భాష్యం రచించినాడు (హోషియార్‌పూర్ 1954 లో). ఆ భాష్యంలో ఆయన ప్రాచీన భాష్యకారుల వ్యాఖ్యానవిధానాలను ఖండించినాడు. రామకృష్ణవివేకానందుల ఉద్యమంవల్ల కొన్ని స్తోత్రాలు [2] మాత్రం సంస్కృతంలో ఉద్భవించినవి. అయితే ఈ ఉద్యమ సంస్థాపకులయిన మహాపురుషులిద్దరినీ కావ్యవస్తువులుగా తీసుకొని, కొందరు [3] ఖండకావ్యాలు అల్లినారు. అంతకంటె అధికంగా రమణమహర్షి అరవిందయోగుల ఆశ్రమాల్లో ప్రశంసార్హమైన సంస్కృత రచనలు ఉద్భవించాయి. కావ్యకంఠ గణపతిశాస్త్రి, అనంతరం వాసిష్ఠముని, మహాకవి, రమణమహర్షికి భక్తుడై 'రమణగీత' రచించినాడు. 'షడ్దర్శనం' లో రమణుల అద్వైతాన్ని ఛందోమయ కవితారీతిలో విశదంగా చెప్పినాడు. ఆ 'షడ్దర్శనము'పై ఆయన శిష్యుడు, టి. వి. కపాలిశాస్త్రి వ్యాఖ్యచేసినాడు. వి. జగదీశ్వరశాస్త్రి రమణస్తోత్రావళి రచించాడు (తిరువణ్ణామల); కపాలిశాస్త్రిగారి అనంతరం ఆశ్రమప్రవేశము చేసినాడు పుదుచ్చేరిలో. ఆయన సంస్కృతప్రవీణుడు. పుదుచ్చేరినుంచి శాస్త్రిగారు 1952 లో 'సాధనసామ్రాజ్యము' అనే 25 శ్లోకాల్లో అర

---

[1] చూడు - Catalogus Catalogorum I పుట 15-16 ఆయన గ్రంథాలకోసం.

[2] of రామకృష్ణ సహస్రనామస్తోత్రము - కర్త - యం. రామకృష్ణభట్టు 1950 (బెంగుళూరు)

[3] సన్యాసిగీతము - కర్త - వివేకానందుడు - నిత్యానంద భారతిచే సంస్కృతీకరణము.

వింద యోగసాధనముగూర్చిన్నీ, 'అహ్నికస్తవమ్' (1954) అనే స్తోత్రగుచ్ఛాన్ని, ఋగ్వేదసంహితపై 'సిద్ధాంజనం' అనే నవ్య సంస్కృత భాష్యము,[1] అరవింద భావానుసారంగా రచనలు చేసినారు. అరవిందాశ్రమములోని అంబాలాల్‌పురాణీ సరళంగా, స్వచ్ఛంగా, అరవిందుల యోగమును 'పూర్ణయోగ సూత్రాణి' అని వ్రాసిన దర్శనాలవలె సంప్రదాయానుసారంగా సూత్రరచన చేసినాడు.

సంస్కృతంలో గ్రంథకర్తలు తమతమ దృక్పథాలతో తాత్త్విక రచనలు చేసి ప్రకటించినారు. సామాన్యమైన వ్యాసాలు, మత తాత్త్విక వ్యాసాలు, స్వతంత్రాభిప్రాయాలతో రచించినారు. ప్రఖ్యాత విద్వాంసుడూ, పరిశోధకుడూ అయిన మహామహోపాధ్యాయ రామావతారశర్మ భారతీయ తత్త్వ శాస్త్రంలో సంప్రదాయానుసారంగా ఉన్న షడ్దర్శనాలకు తోడు, సప్తమదర్శనాన్ని పరమార్థదర్శన భాష్యముల్లేఖించినాడు. విశ్వవిద్యాలయంలో తత్త్వశాస్త్రాచార్యు లయిన అమరావతీ వాస్తవ్యులయిన జ్వాలాప్రసాద్ సూత్రశైలిలో 'తత్త్వదర్శనము' అనే నవ్య సిద్ధాంతమును ప్రతిపాదించినాడు. దానికి అనుబంధంగా భాష్య రచన చేసినాడు. ఇందులో భారతీయ తత్త్వశాస్త్రాన్నీ, ఆధునిక వైజ్ఞానిక భావాలనూ సమన్వయము చేయాలని యత్నించినాడు. కాని కృతకృత్యుడు కాలేదు. బరోడా వాస్తవ్యులయిన యం. ఏ. ఉపాధ్యాయ పండితులు 'ఈశ్వర స్వరూపం' అనే సిద్ధాంతమును గాంధీయ మతానుసారంగా, వర్ణాశ్రమ ధర్మ నిరసనచేస్తూ, ఒక వివరణము రచించినారు. 1939 లో హృషీకేశంలో పూర్ణానందస్వామి వర్ణాశ్రమ విరహితంగా, సర్వసమ్మోదకరంగా, ఆధునికంగా, సంకుచిత శాఖాభిమాన రహితంగా, ధర్మవైరాగ్య భక్తి యోగాదులను ఉపదేశిస్తూ, గద్యపద్యాత్మకంగా, తత్త్వ శాస్త్రము విశదీకరించినాడు. ఉత్తరప్రదేశ్‌లోని ప్రధాన మంత్రులయిన డాక్టర్ సంపూర్ణానంద్ సంస్కృతాభివృద్ధికి దోహదం చేస్తూ సంస్కృతంలో రచన, భాషణమున్నూ, చేస్తున్నాడు. (1950 బెనారస్). ఆయన తాత్త్విక వ్యాసానికి 'చిద్విలాస' అనే పేరుతో

---

[1] పుదుచ్చేరి 2 భాగాలు 1950 - 51

సంస్కృతీకరణ జరిగింది. అధర్వ వేదాంతర్గత 'వ్రాత్య' కాండకు స్వతంత్రంగా 'శ్రుతిప్రభా' అనే భాష్యము రచించినాడు. కాలడిలోని రామకృష్ణ మఠమునకు సంబంధించిన ఆగమానందస్వామి ఇటీవల సంస్కృతంలో ధర్మస్వరూప విచారణచేస్తూ, ధర్మానికి ఆర్థిక రాజనీతికి గల సంబంధాన్ని పరిశీలించారు.

కళాశాలా పాఠ్యప్రణాళికలో యూరపియ తత్త్వశాస్త్రాధ్యయనం ఉన్నది. ఆ తత్త్వశాస్త్రంలో తర్కము, మనోవిజ్ఞానము, నీతిశాస్త్రము పాశ్చాత్య రచయితలు ఆలోచనచేసిన పద్ధతిగా బోధిస్తున్నారు. ఈ శాస్త్రాలు పాశ్చాత్యులు ఏరీతిగా అవగాహన చేసుకొంటున్నారో, అది పరిశీలించడానికి కొందరు జిజ్ఞాసువులు విద్యాగోష్ఠులు ఏర్పరిచి, పాశ్చాత్య తత్త్వము తెలియని వారికి సంస్కృతంలో వారి రచనలను అనువదించడానికి పూనుకొన్నారు. ఇది మనము గమనించ వలసిన నూతన సాహిత్య ప్రవృత్తి. గత శతాబ్దమధ్యంలో కాశీలోని 'పండిత' పత్రికలో (8, 9, 10) 'జ్ఞాన సిద్ధాంత చంద్రికా' అనే పేరుతో, బెర్క్లే అనే పాశ్చాత్య వేదాంతి రచించిన 'Principles of Human Knowledge' అనే దానికి సంస్కృతానువాదము ప్రచురింపబడింది. 'పండిత' పత్రిక (10) లో Lock రచించిన 'Essay Concorning Human Unders anding' అన్నదానికి, 'విద్వద్వరలోకాభిధ విరచిత మానవీయ జ్ఞాన విషయక శాస్త్రం' అనే సంస్కృతానువాదం ప్రచురితమైంది. ఏరల్ అనే ఆయన Bacon రచించిన Novum Organum అన్న గ్రంథానికి 'బేకనీయ సూత్రవ్యాఖ్యానము' అనే సంస్కృతానువాదము ముద్రితమైంది. మైసూరు మహారాజావారి సంస్కృత కళాశాలాపత్రికలో (1923)[1] డాక్టరు శ్యామశాస్త్రి 'పాశ్చాత్య ప్రమాణతత్త్వము' 'మానస తత్త్వ'ము అనే శీర్షికలతో నవ్య పాశ్చాత్య తర్కమనోవిజ్ఞానశాస్త్ర విషయములు రచించినాడు; ప్రకటించినాడు. ఈ కోవకు చెందిన ఒక పరిశోధకవ్యాసాన్ని. ఇటీవలి

---

[1] కాశీ 1852 ఇటువంటి పుస్తకాలుచూడు R. K. M. Bulletin Institute of culture, June 1956, పుటలు 133-4.

నీతిశాస్త్రమును గురించి పాశ్చాత్యదర్శన ప్రతిపాదిత మయిన దానిని బృందావనవాసి విశ్వేశ్వర సిద్ధాంత శిరోమణి ఉల్లేఖించినారు. ఇది వ్రాతప్రతిగానే ఉన్నది.

## ఆధునిక శాస్త్రీయ విజ్ఞానము

ఆంగ్లభాషాభిజ్ఞులకు ఆధునికశాస్త్ర విజ్ఞానం అందుబాటులో తీసుకురావలసిన ఆవశ్యకతను ఆదినుంచీ సంస్కృతవేత్తలు గ్రహించారు. ఈ ప్రయత్నము ఆర్. అప్పాశాస్త్రిగారి 'సంస్కృత చంద్రికా', 'సహృదయ' వంటి సంస్కృత పత్రికలు చాలా చేశాయి. కొల్హాపురం లోని సంస్కృత చంద్రికలో 'విజ్ఞాన కుసుమం' అనే శీర్షికకింద శాస్త్రవిజ్ఞానము ప్రచురితమైంది. (ఉదా:- ప్రాచీన భూగోళ విజ్ఞానం, జ్యోతిస్తత్వం, ఇత్యాది). 1823, 1828 సంవత్సరాల్లోనే ఇలతూరు రామస్వామిశాస్త్రి, యోగధ్యానమిశ్రగార్లు రేఖాగణితాన్ని గురించి రెండు పుస్తకాలు 'క్షేత్రతత్త్వ దీపిక'లు రచించారు. శ్రీరంగంలో 'సహృదయ' పత్రికలో ఆధునిక శాస్త్రీయ విజ్ఞాన, పదార్థ విజ్ఞాన, రసాయనిక విజ్ఞాన, ఖగోళ వృక్షశాస్త్రాలున్నూ, 'పాశ్చాత్య శాస్త్ర సారము' అనే శీర్షికకింద కొన్ని చిత్రాలతో వ్యాసాలు ముద్రితమైనాయి. (N. S. Vols. II ff.). అప్పాశాస్త్రిగారు ఖగోళ శాస్త్రమునుగూర్చి వ్రాశారు. మైసూరు వాసి సి. వేంకటరమణయ్యగారు (1939) 'సనాతన భౌతిక విజ్ఞానము' అనే ప్రాచీన శాస్త్రవిజ్ఞానము పునఃపరిశీలించి నారు. విఠలశాస్త్రి (1859) 'పంచభూత వాదార్థః' అనే తన గ్రంథంలో హైందవ శాస్త్రసిద్ధమయిన పంచభూతాత్మక రసాయన శాస్త్రము రచించినాడు. బెంగుళూరు మైసూరుల నుంచి ప్రత్యేక విస్తృత గ్రంథాలు 'అంశుబోధినీ శాస్త్ర' అనే పదార్థ విజ్ఞానశాస్త్రం భరద్వాజకృతము, అలాగే అన్య ఋషులు రచించిన గ్రంథాలున్నూ, ప్రకటితాలయినవి. ఆధునిక శాస్త్రీయ విషయాలను స్వీకరించి రచన చేస్తున్నప్పుడు, నూటఅరవై శ్లోకాల్లో (స్రష్ట అయిన మానవుడు, ఫిబ్రవరి 1947) కలకత్తా సాహిత్య పరిషత్ పత్రికలో 'మానవ ప్రాజాపతీయం' అన్న ఖండకావ్యం కూడా ప్రకటితమైంది. ఆ ఖండికలో

రవీంద్రకుమారశర్మ శాస్త్ర విజ్ఞానం చివరకు నిష్ప్రయోజన మని తేల్చివేసివాడు. అందులో కథావస్తు విది. భారతీయ యువకుడూ బుద్ధిశాలీ అయినవాడు జర్మనీ వెళ్ళి శాస్త్రవిజ్ఞాన సంపన్నుడై స్వదేశానికి వచ్చి, తన అభిమతానికి అనుకూలమైన విజమైన స్త్రీ సృష్టి చేయాలనే ఇచ్ఛతో క్రమక్రమముగా స్త్రీని సృజించి ప్రాణం పోసి, గమనం కలిగించి, చివరకు అకస్మికంగా దుఃఖము పాలవు తాడు. 'సంస్కృతమ్' అనే వారపత్రికలో (20–3–1956—17–4–1956) రాజస్థానవాసులు వంశీగోపాల శాస్త్రిగారు విజ్ఞాన దాయకాలైన రెండు కథానికలు సొష్ఠవంగా రచించారు. మొదటి కథ 'చేతనమ్క్వాస్తి ?' (జీవితసూత్రం ఎక్కడ ?), రెండవకథ 'శుక్ర లోక యాత్ర'. మొదటి కథలో జీవిత రహస్యం గ్రహించలేని వైఫ ల్యము కథా వస్తువు. దంగర్ కలాశాల పత్రికలో పరీక్షిత నరపాలుడికీ కలికాలానికి నాటకీయ సంవాదం విద్యాధరశాస్త్రి రచించివాడు. కవి, శుక పరీక్షితుల పమజాన లోకంలో అవతరించలేక విఫలుడౌతాడు. ఆ కలిపురుమడే ఆధునిక శాస్త్ర విజ్ఞానం, రాజనీతి. అనేవాటి సాహా య్యంతో ప్రవేశానికీ, జిగిషకూ యత్నిస్తాడు. ఖగోళ, జ్యోతిష, అయుర్వేదగ్రంథాలు సంస్కృతంలో వస్తున్నాయి. కవిరాజ గణనాథ సేన్ శరీరశాస్త్రం 'ప్రత్యక్ష శారీరం' అనే పేరుతో (కలకత్తా 1919), 'సిద్ధాంత విదానం' అనే రోగవిధానమును గూర్చిన గ్రంథాలు (1924) రచించివాడు. 1926 లో భూదేవముఖర్జీ 'రసజలనిధి' అనే రసాయన శాస్త్రగ్రంథము రచించినాడు. కేరళీయ, తమిళాయుర్వేదీయ వైద్యులు ఇలాంటి గ్రంథాలు వ్రాశారు. ఉదా :- పి. యస్. వారియరు; వి. యన్. వాయర్ (కళ్ళికోట 1938) సూక్ష్మజీవాణు సిద్ధాంత ప్రతిపాదకమైన 'అణుగ్రహ మీమాంస' ను ఉల్లేఖించారు. తిరుచ్చిలో నటరాజశాస్త్రి తమిళాయుర్వేద గ్రంథాన్ని సంస్కృతములో 'సిద్ధవైద్యము, అని రచించాడు. బొంబాయిలో 1954 లో 'స్వాస్థ్యవృత్తం' లో కె. యన్. మస్కర్, యశ. యన్. వాత్వే ఆరోగ్యము, దీర్ఘాయువుముగూర్చి వ్రాశారు. పి. జి. కాశీకర్ (పునహా) 'అయుర్వేదీయ పదార్థ విజ్ఞానం' (1953) అనే అయుర్వేద పృష్ఠభూమి యావత్తూ రచించాడు. 1954లో

తిరుచ్చూరులో పి. యస్. సుబ్బరామపట్టరు 'వార్తా' అనే స్వల్ప గ్రంథంలో అర్థిక వాణిజ్య వ్యవసాయ పశుపోషణాది శాస్త్రీయ విష యాలు రచించారు. కేదారనాథశాస్త్రి పురాతత్త్వ విషయకమైన 'సింధు సభ్యతా' అనే సప్తసింధు లోయలోని నాగరకతను గురించి గ్రంథరచన చేసినాడు. ఈ పురాతత్త్వ విషయాన్ని గురించే శ్రీనగ రంలో సంస్కృత సాహిత్యపరిషత్ పత్రిక 'శ్రీ' లో (VI. III—IV) వ్యాసము ప్రకటించినాడు.

## సంస్కృత మాస పత్రికలు

ప్రథమోత్సాహంలో ప్రేరితులయిన సంస్కృతవేత్తలు సంస్కృత పత్రికలను ఆరంభించవలసిన ఆవశ్యకతను గుర్తించినారు. సంస్కృత పత్రికల సింహావలోకనం నిజంగా దివ్యాలోకం. పత్రికలు చాలా ఉండడమే కాక, సంస్కృతానికి నవ్యచైతన్య దీప్తిని కలిగించడంలో అమూల్య విభిన్నవ్యాసాలవల్ల ప్రముఖపాత్ర వహించాయి. కాశీలో "పండిత' పత్రిక తరువాత ఈ మార్గంలో పథప్రదర్శకాలయిన 'సంస్కృత చంద్రికా' (మొదట ఇది వారపత్రిక), 'సూనృతవాదినీ' పత్రికలతో ఆర్. అప్పాశాస్త్రిగారికి బాగా సంబంధం ఉండేది. వార ణాసిలో ఆరంభమయిన ఎన్నోపత్రికల్లో కొన్ని ఇవి (వాటిలో కొన్ని ఇప్పుడులేవు) 'మిత్రగోష్ఠి' 'వల్లకి' (భారత ధర్మమండలివారి సాధన), "సుప్రభాతం' (సంస్కృత సమ్మేళనం వారిది), 'సంస్కృత రత్నా కరము', అఖిలభారత విద్వత్ పరిషత్తువారి 'పండిత' పత్రికలు— కాశీలో మరి రెండు పత్రికలు ఆరంభమైనాయి :— అవి 'సూక్తిసుధా', 'విద్యారత్నాకరము'. లాహోరునుంచి హృషీకేశభట్టాచార్యుల సంపాద కత్వాన 'విద్యోదయ' పత్రిక వచ్చింది. ఆర్యసమాజ పత్రిక 'ఆర్య సిద్ధాంత' అలహాబాదునుంచి వెలువడింది. బ్రహ్మసమాజ పక్షాన కలకత్తానుంచి 'శ్రుత ప్రకాశికా' ప్రకటితమైంది. దక్షిణ భారతంలో వెలువడిన పత్రికల్లో సగర్వంగా ఆదిలో చెప్పుకోతగ్గ 'సహృదయ', శ్రీరంగంనుంచి ఉదాత్త స్థాయిలో ప్రతిభావంతులయిన ఆర్. కృష్ణమా చార్య, ఆర్. వి. కృష్ణమాచార్యుల సంపాదకత్వాన వెలువడింది. దాని

స్థానం 'ఉద్యాన' పత్రిక ఆక్రమించింది. దాని సంపాదకుడు తిరువయ్యారులోని డి. టి. తాతాచార్యులు. కాంచీపురంనుంచి 'మంజుభాషిణీ' వచ్చేది. చిదంబరంనుంచి 'బ్రహ్మవిద్య', శ్రీ పెరుంబుదూరు నుంచి 'విచక్షణ' ప్రకటింపబడేవి. బెంగుళూరునుంచి రామకృష్ణ భట్టు సంపాదకత్వాన వస్తున్న 'అమృతవాణి' ఆగిపోయింది. ఉత్తర కర్నాటకంనుంచి 'మధురవాణి' మాత్రం ఇంకా వస్తూనే ఉన్నది. దాని ప్రమాణము ఉదాత్తంగా ఉంటున్నది. విభిన్నప్రాంతాల్లో సంస్కృత పత్రికలు ప్రాంతీయ దేశభాషల అనుబంధాలతో వచ్చేవి. (1897) సంస్కృత-కన్నడ భాషాద్వయ పత్రిక, 'కావ్యకల్ప ద్రుమము', వంగరాష్ట్రంనుంచి 'ద్వైభాషికా', గుజరాతునుంచి 'భారత దివాకర', బిహార్‌నుంచి 'మిధిలామోద', వర్ధానుంచి 'బహుశ్రుత' పత్రికలు వచ్చేవి. ఆంగ్లభాషా సమాయుక్త సంస్కృత పత్రికలున్నూ ఉండేవి. మదరాసునుంచి 'లోకానంద దీపికా', పుదుక్కోటనుంచి 'సంస్కృత పత్రికా', బర్ద్వాన్‌నుంచి 'సంస్కృత భారతీ' వచ్చేవి. కె. యం. మున్షీ సంపాదకత్వాన వెలువడుతున్న 'విశ్వపరిషత్' పత్రికలో ఆంగ్ల సంస్కృత భాషల్లో, వ్యాసాలుంటాయి. బహుభాషా ప్రయుక్త ప్రాంతాల్లో కళాశాలా పత్రికల్లో స్వతంత్ర సంస్కృత వ్యాసాలు గోచరిస్తాయి. అవిచ్ఛిన్నంగా వస్తున్న పత్రికల్లో కలకత్తాలోని సంస్కృత సాహిత్య పరిషత్ పత్రికను పేర్కొనాలి. అక్కడే కె. పి. ఛటోపాధ్యాయగారి 'మంజూషా' పత్రిక వెలువడుతున్నది. భిన్నప్రాంతాల్లో సంస్కృత కలాశాలలనుంచి సంస్కృత పత్రికలు ఆరంభమైనాయి. పట్టాంబి సంస్కృత కలాశాలా సంస్కృత పత్రికకు 'విజ్ఞాన చింతామణి'కి సంపాదకుడు, పున్నస్సేరి నీలకంఠశర్మ. తిరువనంతపురీయ సంస్కృత కలాశాల వారు 'శ్రీచిత్ర' కొన్నేళ్ళనుంచీ ప్రచురిస్తున్నారు. మైసూరునుంచి ఇంకా పత్రిక వస్తూనేఉంది. వారణాసి సంస్కృత కలాశాలవారి 'సరస్వతీ సుషమా' చాలా గొప్ప పత్రిక; ఇంకా వస్తూనే ఉంది. దూరస్థమైన సింధు హైదరాబాదనుంచి 'కౌముదీ' పత్రిక వచ్చేది. బిహార్ సంస్కృత అకాదమీ 'సంస్కృత సంజీవనం' ప్రకటిస్తున్నది.

“సంస్కృత” వారపత్త్రిక, ‘సంస్కృత సాకేత’ అయోధ్యనుంచి వస్తూనే ఉన్నాయి. జయపురంనుంచి ‘సంస్కృత రత్నాకర’ స్థానే ‘భారతీ’ పత్త్రిక వెలువడుతున్నది. పిష్టానుంచి ‘దివ్యజ్యోతి’ అనే కొత్త పత్త్రిక ఆరంభమైంది. దర్భాంగానుంచి ‘సురభారతి’ వస్తున్నది. బరోడాలో సంస్కృత విద్వత్ సభవారు ‘సరస్వతీ సౌరభము’ వ్యాప్తి చేస్తున్నారు. శ్రీనగరంనుంచి సంస్కృత సాహిత్య పరిషత్ పత్త్రికగా చాతుర్మాసిక పత్త్రికగా, కొన్ని సంవత్సరాలనుంచీ వస్తున్నది దానిపేరు ‘శ్రీ’, అది వ్యాసరచనకు బాగా పేరు పడ్డది. నాగపుర సంస్కృత ప్రచారిణీ సభవారు సంస్కృత ‘భవితవ్యం’ అనే వార పత్రిక ప్రకటిస్తున్నారు. అది చెప్పుకోతగ్గది ప్రత్యేకంగా. ఆ పత్రికలో విషయాలూ, శైలీ బాగుంటాయి. మరికొన్ని పత్రికలు పుట్టి గిట్టినవి. వాటిపేర్లు - ప్రత్నకమనందినీ. విద్వత్కలా, సంస్కృత భారతి, సంస్కృత మహామండల, కలకత్తాలో సంస్కృత పద్యవాణి, మధురలో సంస్కృతభాసుర, సంస్కృత కాదంబినీ, భవతపురిలో ‘విద్యోదయ’, కొచ్చిన్‌లో ‘అమృత భారతి’, కాశిలో అమర భారతి, అచ్యుత, ప్రయాగ నుండి శారద, మదరాసునుండి వేంకటేశ్వర పత్రికా, ఉషా, ఆర్య ప్రభా పత్రికలు. జయపురీయ సంస్కృత రత్నాకర (1914) సంచికల్లో ఒకదానిలో సంస్కృత పత్రికలమధ్య ఉత్సాహదాయకమైన వాదకీయ సంవాదం ఉన్నది. రత్నాకర, విజ్ఞానచింతామణి, మంజుభాషిణి, సహృదయ, ఉషా, శారదా, ఆర్యప్రభా, విద్యోదయా పత్రికలు సమావేశమై అందులో తమతమ భావాలు పరస్పరం తెలుపుకొంటవి.

ఖండకావ్యాలు, కథానికలూ, దీర్ఘకథలూ. నవలలూ, అనువృతంగా ప్రచురించడమేకాక, ఈ పత్రికాసంపాదకులు స్వేచ్ఛగా సామయిక వృత్తమును, సామాజిక సమస్యలను సవ్యసంస్కరణలను ఉద్దేశించి వ్యాసరూపాల్లో సంపాదకీయాల్లో విచారణ చేసేవారు. ఆ సంస్కృత పత్రికలు తిరగవేస్తే వెంటనే లభ్య మయ్యే చర్చనీయ వ్యాసాల్లో సమస్యలివి - జర్మనీలో విద్య, పేదరిక్షావాడు ఉపకారం కోసం వేదికోలు, భారతదేశంలో పశుతయం. జన్మనిరోదం, జూమ ప్రమాదం, రైతుస్థితి, ప్రస్తుతం కావలసిన విద్య, పరీక్షావిధానంలో

లోపాలు, భారతీయులు, ఐరోపాసంగ్రామం, శాంతికి అణుశక్తి, జాతీయ భావము, అంతర్జాతీయత, హైందవధర్మశాస్త్ర సంస్కరణం వంటివి. ఆ పత్రికల్లో సంక్షిప్త వార్తావళి, నవ్వులు, వినోదాలు కూడా ఉండేవి. సంస్కృత వికాసం కోసం కర్తవ్యాంశాలను గురించి పత్రికల్లో, కొంత తావు ఏర్పాటుచేయకుండా ఉండలేదు. ప్రస్తుతకాలంలో తరుచుగా చర్చనీయాంశాలు అప్పుడూ ఉండేవి :— సంస్కృతము జాతీయభాష, సరళవిధానము సంస్కృతము, సంస్కృతవిద్యావిధానంలో ఐక్యము, సంస్కృతబోధనావిధానాలు, సంస్కృతఘనత, ప్రస్తుతము సంస్కృతానికి పట్టిన గతి, సంస్కృతవిశ్వవిద్యాలయం ఇత్యాదులు. ద్రావిడోద్యమము క్రైస్తవప్రచారమున్నూ చర్చనీయ విషయాలే. అందరికీ అర్థమయ్యే సామాన్య భాషలో గొప్ప వ్యక్తులను గురించి ప్రాంతీయ భాషల్లో ప్రశంసార్హమయిన రచనలనుగూర్చి, పత్రికలు వ్రాసి అంతర రాష్ట్రీయ సంబంధానుబంధము నిర్వహిస్తూ దేశంలో పరస్పరమూ అవగాహనమూ ఏకత్వాన్నీ, పెంపుచేసినవి.

## వ్యాసరచన

పత్రికలో రచనతోపాటు, నెమ్మదిగా సాహిత్యరంగంలో Essay (వ్యాసము) అనే విశిష్టరూపముకూడా వికాసము చెందింది. పాఠశాలలకూ, కళాశాలలకూ పాఠ్య గ్రంథాల అవసరాన్ని పురస్కరించుకొని వ్యాసానికి ఒక రూపము ఏర్పడింది. వ్యాసావళి రచించిన ఇద్దరు వ్యాసకర్తలను మనం ముఖ్యంగా గమనిస్తాము. హంసరాజ అగర్వాల్ (లూధియానా 1955), సంస్కృత ప్రబంధ ప్రదీపము అనే వ్యాస సంపుటి వెలువరించాడు. రెండో వ్యాసరచయిత, శ్రుతికాంతశర్మ. అగర్వాలాగారి వ్యాసాలలో ఆధునిక విషయాలు - నవీన శాస్త్రాభివృద్ధి, కాశ్మీర సమస్య, ఆహారస్థితి, నాలుగేళ్ళ స్వాతంత్ర్యం, ప్రపంచంలో అగ్రరాజ్యాల రాజ్యాంగ రచనలు, సంస్కృత భవిష్యత్తు, హైందవ శిక్షాస్మృతి, భారత భవిష్యత్తు, సంస్కృత బోధనా విధానం, వంటివి ఉన్నవి శ్రుతికాంతశర్మ తన 'లఘునిబంధమణిమాల' లో (లూధియానా 1955) స్వల్ప విషయాలు రచనకు స్వీకరించినాడు. హుక్కా,

గుఱ్ఱానికి సైకిలుకూ సంవాదం, ఫుట్ బాల్ పోటీ, మూడో తరగతి పెట్టెలో రైలు ప్రయాణము, మత రహిత లౌకిక రాష్ట్రము, సంయుక్త రాజ్యసమితి, వోట్లు, స్నేహాలు, రూపవాణి, లక్ష్యం లేని తిరుగుడులో హాయి, విహారయాత్ర, వినోదకాలక్షేపం, క్రీడాసక్తుని మన స్తత్వం వంటివి వ్యాసవిషయాలు. చామరాజేంద్ర సంస్కృత కళాశాలవారు (బెంగుళూరు 1908) 'ప్రబంధ పారిజాతం' అనే వ్యాససంపుటము ప్రచురించారు. అందులో శీర్షికలు కొత్తవీ, పాతవికూడా ఉన్నవి: పంచశీల మహా మహితూరము, జన్మనియంత్రణం, సంయుక్త రాజ్య సమితి, రాణీలక్ష్మీరాయి, తిలక్, గాంధి ఇత్యాదులు. 'గల్ప కుసుమాంజలి,' అని మరొకవ్యాస సంపుటిలో చారిత్రక వ్యాసా లున్నవి.

రేఖావచన అనే సాహిత్యాంగము సర్వాంగ సుందరంగా వృద్ధికి రాలేదు. అయినా ఇక్కడకూడా అప్పాశాస్త్రిగారు కొన్ని ఉత్తరాలు ముద్రించడంవల్ల మార్గదర్శకులైనారు.

## యాత్రావర్ణనాత్మక రచనలు

ప్రాచీన సంస్కృత సాహిత్యంలో ప్రయాణము యాత్రగా, ముఖ్యంగా పుణ్యక్షేత్రాటనంగా పూర్వులు భావించారు. ఈ కాలంలో కూడా ఇటువంటి కోవకు చెందిన రచనలు ఉద్భవించాయి. మహా మహోపాధ్యాయ టి. గణపతిశాస్త్రిగారు 'సేతుయాత్రా వర్ణనము' సంప్రదాయక శైలిలో రచించినా, హైందవాదర్శాలు, సమకాలిక విశే షాలు సమాజములో లోటుపాటులూ వివరించినారు. మధురలో (1937) వి. యస్. రామస్వామిశాస్త్రి అనే అధివక్త 'త్రిబిల్వదళచంపు' వు రచించినాడు. ఆ గ్రంథంలో ఆయన యావద్భారత యాత్రాటనం, క్షేత్రాలు, ఆధునికులకు ఉల్లాసం కలిగించే విశ్వవిద్యాలయాలు, పుర మందిరాలు, పురాతత్త్వవిశేషాలు ఇత్యాదులనుగూర్చి వర్ణించినాడు. 1924 లో సఖారామశాస్త్రి కొంకణయాత్ర రచించినాడు. కాశ్మీరంలో శ్రీ పత్రికలో అమరనాథ యాత్రా[1] వర్ణనం (v. 4) జానపద విహారం,

---

1 చూడు Oriental Literary Digest, Poona II p. 165.

'సరస్వతీయాత్రా' అనే శీర్షిక కింద, చరిత్రాత్మక, భౌగోళిక సాంస్కృతికాభిరుచి కలిగించే స్థలవిషయాలు అచ్చయినవి. అదే పత్రికలో 'సిమ్లా వర్ణన (x iii v). యస్. వి. భట్టాచార్యకృత 'ఉత్తర ఖండ యాత్ర' అనే పేరుతో హిమాలయ క్షేత్రాటనమున్నూ ఉన్నవి. డాక్టర్ బి. వి. హెచ్. చాబ్రా (బెంగుళూరు 1953) 'అమృతవాణి' లో తాను హాలెండుదేశాటనంచేసిన తరువాత ఆదేశాన్ని వర్ణిస్తూ 'వ్యక్త రజన సద శోభా' అనే రచన చేసినాడు. టెహరాన్‌లో సంస్కృతాచార్యుడుగా పని చేసిన డాక్టర్ కున్హన్‌రాజా పారశీకంలోని పెర్సిపోలిసును వర్ణిస్తూ ఖండ కావ్యం రచించినాడు. (చూడు అడయారు గ్రంథాలయ పత్రిక, డిసెం. 1953) ఇటీవల యం. రామకృష్ణభట్టు బెంగుళూరులోని 'అమృతవాణి'కి సంపాదకుడై, కొంతకాలం తూర్పు ఆఫ్రికావెళ్ళి. అక్కడ తన అనుభవ పరంపర ను సుదీర్ఘలేఖారూపంలో 'సంస్కృత భవితవ్యము[1]' లో ప్రచు రించినాడు.

## సాహిత్యాలంకార సమీక్ష

సంస్కృతంలో సాహిత్య సమీక్ష విస్తృతంగా, అలంకార శాస్త్ర ముగా రూపొందినది. ఆంగ్లవిద్యవల్ల పాశ్చాత్య సమీక్షా విధానాలను ప్రయోగించడం, పాత్రోన్మీలనం, శయ్య, కవికావ్యంలో అందజేసే సందేశమూ, సర్వసామాన్యమైనాయి. సంస్కృతంలో కూడా దీర్ఘ వ్యాసరూపంలో ఆస్వాదనాత్మక సమీక్ష ఆవశ్యకమని రచయితలు భావించారు. ఈ పద్ధతి వ్యాసరచన పాశ్చాత్య సాహిత్యంలో ఉన్నది. సంస్కృత పత్రికల్లో ఈ తీరుగా వ్యాసాలు వ్రాశారు. 'సహృదయ' సంపాదకుడయిన ఆర్. కృష్ణమాచార్యుని ప్రోద్బలంవల్ల విమర్శక వ్యాసాలు ప్రత్యేక గ్రంథరూపాల్లో అవతరించాయి. ఆయన ఏకవిష యాత్మక వ్యాసరూపంలో 'రఘువంశ విమర్శ', మేఘదూత విమ ర్శలు (కావ్య గుణాదర్శమాల, శ్రీరంగం 1908, 1915) అచ్చయినవి.

---

[1] శ్రీ భట్టు సంస్కృతంలో ఆ పత్రికలోనే ఆఫ్రికా కథ రచించినాడు. (26—6—'56)

తిరుచ్చివాసి ఎ. వి. గోపాలాచార్యులు ఈ పద్ధతిలో వివరణాత్మక విమర్శవలు చాలా రచించినాడు. గ్రంథకర్త అందులో ఈ కోవకు చెందిన 'సందేశ ద్వయ సారస్వాదినీ' అన్న గ్రంథములో మేఘసందేశ హంస సందేశ కావ్యాల తులనాత్మక విపులాధ్యయనము చేసినాడు. మదరాసు సంస్కృత పరిషత్తువారు ప్రతిసంవత్సరం సంస్కృత కవుల వర్ధంతులు జరుపుతూ సంస్కృత కావ్య నాటక విమర్శలకు ప్రోత్సాహం ఇస్తున్నారు. ఇలాంటి రచనలు చాలా మదరాసులో ప్రాచ్య పరిశోధనకు చెందిన పత్రికలో అచ్చవుతున్నవి.

## కథానిక

సంస్కృతంలో నవీనాభివృద్ధి ప్రముఖంగా కథానికా రచనలో చూడవచ్చును. కేవలం చిన్న కథ సంస్కృతానికి క్రొత్తపోకడకాదు. అయితే ఆకృతిలో నవ్యతకు సంస్కృత రచయితలు, పాశ్చాత్యులకు ఋణపడినారు. నవీనయుగారంభమునుంచి క్రొత్తపద్ధతిగా చిన్న కథలు సంస్కృత మాసపత్రికల్లో అచ్చవుతూ ఉండేవి. వాటి సంఖ్యాబాహుళ్యం నేడు పెరిగింది. నాగపురంలో సంస్కృత భవితవ్య పత్రిక వారు కథానికరచనలో పోటీపెట్టినారు. 24–4–1954 భవితవ్య పత్రికలో పోటీలో ఎన్నికయిన కథలు ఎనిమిదిమాత్రం అచ్చువేశారు. మదరాసులోనూ కథలపోటీ జరిగింది. కథానికలు రచనచేసేవారు చాలా మంది ఉన్నారనీ, నవీన సంవిధానం అవలంబించి కథలు వ్రాయగలరనీ తేలుతున్నది.

ఆధునిక కథానికను తీసుకొనేముందు, రచయితలు సంస్కృత విద్యార్థులకు పఠనీయ విషయమును సరళంగా మనోహరంగా వచనంలో కథలుగా చెప్పవలసిన అవశ్యకతను గుర్తించినారు. ఇందు నిమిత్తము అధికంగా కథాసాహిత్యం ఉత్పన్నమైంది. రచయితలు పురాణకథలను పునః సరళంగా చెప్పినారు. వారు సంస్కృతంలో నీతి కథలు, జనప్రీతి కలిగించే కథలున్నూ, వ్రాసికూర్చినారు. యస్. వెంకటరామశాస్త్రి మదరాసు (1895) 'నూరు ప్రజామోదకథలు, వచన గాథలు', శ్వేతారణ్యం నారాయణయజ్వ 'గద్యకావ్యం' అనే

రెండు వచనకథలు వచ్చినవి. అవి రెండు ఊహాత్మక రచనలు. (కుమారవర్మ, మహామోదం); పి. శివరామశాస్త్రి 'చరిత్రరత్నావళి' (కుంభకోణం 1922, 24) రెండుభాగాల్లో మహాకావ్య పురాణములనుంచి తీసుకొన్న కథావస్తువులు. యన్. నీలకంఠపిళ్ళ (తిరువనంతపురం 1936) 'విశ్వామిత్ర', వెంకటరామశాస్త్రి 'పరశురామచరిత్ర' (ఉద్యాన పత్రికలో 1934 తిరువయ్యూరు) పి. వి. కాణేగారి 'సంస్కృత గద్యావళి' (Macmillan) ప్రచురణ), యం. కె. తిరునారాయణ అయ్యంగార్ 'కథారత్నాకరం' అనే వచనకథలు (బెంగుళూరు 1910), అర్జున మొదలయిన రామకృష్ణభట్టు రచనలు (బెంగుళూరు 1953) ఇవి ఇట్టి కథాశ్రేణికి చెందినవి. ప్రౌఢ సంస్కృత గ్రంథాలను సరళవచనంలో రచనచేసేయత్నము జరిగింది. ఒకవైపున బాణసుబంధుల ప్రౌఢగద్య కృతులు సంక్షిప్తము చేయబడినవి. ఆర్. వి. కృష్ణమాచార్యులు, మహామహోపాధ్యాయ పి. వి. మిరాసీ, వి. వి. శర్మలు సరళంగా సంక్షిప్త రచనలు సాగించినారు. మరొకవైపున భాస కాళిదాసాదుల సంస్కృత నాటక కథలను వి. అనంతాచార్య, వై. మహాలింగశాస్త్రి, కె. యల్. వి. శాస్త్రి. కైలాసనాథ్‌గార్లు వచన కథనాత్మక రూపంలో రచించారు.

సహృదయ పత్రికలో తొల్లింటికథలలో కె. శ్రీనివాసణ 'సాధుమణి' అనే కథలో జాలిగొలిపేరీతిగా గంగాఘట్టంలో మిఠాయి అమ్ముకునే పేదవాడికథ చక్కగా వ్రాశాడు. కలకత్తాలోని సంస్కృతసాహిత్య పరిషత్ పత్రికలో అచ్చయిన వాటిలో భవభూతి విద్యారత్నవ్రాసిన 'లీలా' (1923–24), తరణికాంత చక్రవర్తి 'పుష్పాంజలి' (1924-25), కె. ఆర్. శంకరనారాయణశాస్త్రి 'ఐంద్రజాలిక' (మే 1932), రసమయీ (1933–34), 'భామిన్యాః మదనతాపః' అనే వృద్ధుని పడుచుపెళ్ళాముకథ, ఆర్. రంగాచార్య రాసిన 'ఐ. సి. యస్. అల్లుడు' చెప్పకోతగ్గ కథలు. పి. వి. వరదరాజశర్మగారి కథ 'కస్యాయం అపరాధః' (ఎవరిదీ తప్పు ?) (సంస్కృత సా. ప. పత్రిక ఏప్రిల్ 1937) అనేకథ తక్కిన కథలకన్న విశిష్టమైనది. సౌష్ఠవ సంవిధానానికీ, చక్కని వర్ణనకూ, కథావస్తువు సమాజంలోని సామాన్య దారిద్ర్యం వల్ల ప్రజలు అవినీతికి పాల్పడడము (1937 మే). సంస్కృత

సాహిత్య వ. పత్రికలో 'నగరపాలన పటా' అనే గల్పికను రంగాచార్యులు రచించాడు. అందులో ఒకవృద్ధను మునిసిపల్ కౌన్సిలరుగా నిలుపుతారు. ఆ పత్రికతాలూకు పాతసంచికలలో (1928-29) ఒకదానిలో వేణుధర తర్కతీర్థ రచించిన ఒక గల్పిక ఉన్నది. దానిపేరు 'యమపురీ పర్యటనమ్'. అ దొక ప్రయాణకథ. గ్రంథకర్త స్వప్నంలో యమనగరంలో ప్రయాణముచేస్తూ ఉంటాడు. అయితే యమధర్మరాజుకు అకస్మికంగా కలిగిన సందిగ్ధతవల్ల రచయితగ ప్రయాణము నిలుపుకొంటాడు. యముడికి పట్టుకొన్న సందేహం తన అధికారంగల ప్రాంతం హిందువులవరకేనా లేదా మ్లేచ్ఛప్రాంతంకూడానాఅని. అప్పుడు భారతయాత్రికుడు తన దేశానికి వెనుకకు వెళ్ళిపోవలసివస్తుంది. పండిత పరిషత్తు సదస్సు ఏర్పాటుచేసి సమస్యాపరిష్కారం చేసుకోవలెనని యముడిసలహా. విద్యోదయపత్రికలో 'యమరాజవిచారము' అనే కథ అచ్చయింది.

సంస్కృత 'రత్నాకర' పత్రికలో (1909-48) అచ్చుపడిన కథానికలలో ఈ క్రిందివానిని పేర్కొనవచ్చును. 'పశ్యతోహరః', 'దుఃఖినీబాలా', 'అసమసాహసః', 'అర్వాచీనసభ్యతా', (నేటినాగరకత), 'నీరసప్రణయము', 'సరళ', 'సాక్షి' 'ఆదర్శదంపతీ', 'అయమేవ ప్రేమపరిపాకః', కరుణ, పరెప్ప-వటుక - సంవాదః (కాబోయేమామకూ బ్రహ్మచారికీ సంభాషణ), న్యాయాధికారి, వంటివి- సంస్కృత రత్నాకరపత్రికనుండి రెండుకథలసంగతి చెప్పాలి. 1945 సంవత్సరపు సంపుటంలోని ఒకకథలో విషయం ఇది. అధునిక జీవిత వ్యామోహపునీడలను వెంటాడడంవల్ల శాంతిసుఖాలు స్త్రీలకు కలగదనే గుణపాఠం కథకుడు చెప్పదలచినాడు. 1947 జూన్ సంచికలో ఆదే పత్రికలో 'ధన్యోయం పరీక్షాయుగః' అనే కథలో పరీక్షాపద్ధతివల్ల యదార్థవిజ్ఞానం వృద్ధికాదనేవిషయము కథకుడు చెప్పినాడు. ఈ రచనలు గల్పికలు. సింధు హైదరాబాద్‌లో కౌముదీపత్రికలో రామద్వివేదీ (1944, 45) విశాప ప్రమోదగృహం అనేకథలు వ్రాశాడు. వరశుల్క దోషముసుగూర్చిన ఒక కథానిక 'యేతక' విశ్వేశ్వరదయాళ్ రచించాడు. మంజూషాపత్రికలో (1953 అక్టోబరు) కె. సి. ఛటర్జీ 'మార్జాల

చరిత్ర' అనే కథలో, చీకటిబజారు వర్తకుడు పిల్లినిమించి యుక్తితో ఎలా మోసముచేసింది చక్కగా రచించాడు. 1953 లో శ్యామారావు పతి అయిదు కథానికలు తన సహజ ధోరణిలో అనుష్టుభ్ఛందస్సులో రచించి ప్రకటించింది. ఈ కథలు మొదట ఆంగ్లంలో రచింపబడి అనంతరం సంస్కృతంలో అనువదింపబడ్డాయి. ఆమె కథావస్తువులుగా సర్వసామాన్యంగా సామాజికసంస్కరణం, బాల్యవివాహాలు, బాలవైధవ్యం వంటివి స్వీకరించింది. ఆమె చనిపోయాక ఆమెకథలు పదిహేను, ఒక సంపుటంగా 'కథాముక్తావళి' (బొంబాయి 1954) అనే పేరుతో అచ్చయినవి. ఆమె రచించిన కథాత్రయిలో 'గ్రామజ్యోతి' అనే కథలో గుజరాతీ గ్రామాల్లో సహాయనిరాకరణోద్యమ దినాలు వర్ణింపబడ్డవి. 'సంస్కృత' పత్రికలో (జూలై 1957) 'గహూరా' అనే భారతచరిత్రలో హూణుల నాటికథ చాలా చక్కనిది.

'సర్వజన సంస్కృతమాలా' అనే ప్రచురణ సరళవచనంలో సంస్కృతంలో పాఠ్యవిషయం పాఠకులకు అందీయాలని, కె కృష్ణ సోమయాజి, టాల్స్టాయ్‌రాసినకథను సంస్కృతంలో 'కణోలు ప్తః గృహందహతి' (గుంటూరు 1954) అనువదించి ప్రకటించినాడు. ఎందరో ఈసపు నీతికథలు సంస్కృతములోకి అనువదించినారు.

## నవల

పాశ్చాత్య ప్రభావంవల్ల రూపొంది స్పష్టంగా ఆధునికమని చెప్పగలిగిన ఒకానొక సాహిత్యప్రక్రియకు చెందిన రచన నవల. ప్రస్తుతము దీనిని పరిశీలనచేదాము. ఇక్కడకూడా మనము సాహిత్య పరివర్తనం చూడగలం. కథకులు కథావస్తువులకు, కాదంబరివంటి వాని కథాదిసామగ్రిని విడిచి, సామాజిక జీవితమునే నేపథ్యముగా స్వీకరించినారు. ఈ సాహిత్యప్రక్రియ అనువాదాలవల్ల అనుకరణలవల్ల స్వతంత్ర రచనలవల్లనూ, సంపన్న మవుతున్నది. అప్పాశాస్త్రిగారు బంకిమ చంద్రుని 'లావణ్యమయి'ని అనువదించి, తన 'సంస్కృత చంద్రికా' పత్రికలో, తొలిసారి ప్రచురించారు. (వై. 1907, ధార్వారు 1920, వారణాసి 1947) (ఆయన అన్యరచనలు- దేవి కుముద్వతి, దశ

పరిణతి, మాతృభక్తి. 'లావణ్యమయి' నవలను ప్రత్యేకంగా గ్రంథ రూపంలో ప్రకటించారు శాస్త్రిగారు. (1926 కలకత్తా) ఆ వంగ నవలా కారునిదే ఐన 'కపాలకుండల'ను హరిచరణ్ అనువదించాడు. సంస్కృత చంద్రికాపత్రికలో అప్పాశాస్త్రిగారు 'కృష్ణకాంతస్య నిర్యాణం' అనే అనువాదము ప్రకటించారు. 'ఇందిర' అనే నవలలో కథానాయిక స్వీయ జీవితకథాధోరణిలో చెబుతుంది. సంస్కృతచంద్రి కలో పడిన అనువాదాలలో కొన్ని నవలలు :– నరసింహాచార్య స్వవేకర్ అనువదించిన 'మృత్తికవృషభ కథా', బలభద్రశర్మకృత 'వియోగిని' అనేవి. ఉపేంద్రనాథసేన్ 'పల్లీ చ్ఛవి', 'మకరందికా', 'కుందమాలా' అనే నవలలు రచించారు. హరిదాససిద్ధాంత వాగీశుడు 'సరళ' అనే నవల రచించారు. ఎ. రాజగోపాలచక్రవర్తి 'శైవాలినీ' అన్న [1] వంగ నవలను అనువదించినాడు. ఆయనే మరి రెండు నవలలు వ్రాశారు :– 'కుముదిని', 'విలాసకుమారి సంగర' అనేవి. చింతామణి మాధవ గోళె 'మదనలతికా' అనే నవల రచించారు. (బొంబాయి 1911) సుదీర్ఘకథలు, రసాత్మకమయిన ఆఖ్యాయికలు, కథానకములు వివిధ సంస్కృత పత్రికల్లో అనువృత్తంగా అచ్చయినవి. సహృదయపత్రికలో (III) కల్యాణరామశాస్త్రి 'కనక లతా' అనే ఆఖ్యాయిక చక్కని వచనంలో 90 పుటల్లో రచించినాడు. దీనికి షేక్స్పియరు వ్రాసిన 'ల్యూక్రెసి' అనేది మాతృక. గోపాలశాస్త్రిగారి 'అతిరూపం' (III); పరశురామశర్మ గారి 'విజయినీ' (IV); నారాయణశాస్త్రిగారి 'సీమంతినీ' (VII); చిదంబరశాస్త్రిగారి 'కమలాకుమారి', 'పతీకమలా' (91); ప్రతిభావంతులయిన సంపాదకులు, ఆర్. కృష్ణమాచార్యులుగారి 'సుశీల' (9) అన్నవి ముద్రితాలు.

సంస్కృత సాహిత్యపరిషత్ పత్రికలో ఈ రచనలు ముద్రితాలు :– (1928–29) రేణుదేవీకృత 'రజనీ', 'రాధా', 'దుర్గేశనందినీ' అను (1922–23) రాధారాణి (1930–31) అనేవి బంకిమచంద్రుని వంగ

---

[1] ఇటువంటి రచనలు అన్యములు సత్ గ్రంథకార కృతములు—చూడు :– యం. కృష్ణమాచార్యుల వారి Classical Sanskrit Literature, పుట 678.

మాతృకలకు అనువాదాలు, అదే పత్రికలో 'దత్తా' (1935, అనే నవల కూడా అచ్చయింది. జి. రామాచార్యగారి సంపాదకత్వాన 'మధురవాణి' పత్రికలో 'దేవీవాసంతి' అనే నవల అనువృత్తంగా అచ్చయింది. మైసూరు మహారాజావారి సంస్కృత కళాశాలాపత్రికలో 'కీర్తిసేన' అనే సాహసవీరగాథను కథావస్తువుగా స్వీకరించి (1948—49) యశ. నర సింహాచార్యులు ఆఖ్యాయిక రచించినాడు. కె. కృష్ణమాచార్యగారి 'మందారవతి' (మదరాసు 1929) అనే అఖ్యాయిక బృహత్కథామంజరి లోని ఒకానొక కథను ఆధారముచేసుకొని రచించినాడు. శ్రీశైల తాతా చార్య (మ్మ. 1925) కూడా వంగభాషలోని నవలలను అనువాదము చేయ పూనుకొన్నారు. ఆ అనువాదరచనలు – 'దుర్గేశనందిని' క్షత్రియ రమణి' అనేవి. కావ్యకంఠం గణపతిశాస్త్రిగారు 'పూర్ణ' అనే నవల రచించారు. (పుట 11 ఉమా సహస్రపీఠికలో) కాశీనుంచి విధుశేఖరుల సంపాదకత్వాన వెలువడిన 'మిత్రగోష్ఠి' పత్రికలో 'చంద్రప్రభా' అనే ఆఖ్యాయిక ప్రకటించా రాయన. 'కుముదినీ చంద్ర' అనే నవలను (యోర్ 1920) మేధవ్రతుడు రచించినాడు. నరసింహాచార్యులుగారు సుందర వర్ణనాత్మక కావ్యశైలిలో 'సౌదామని' అనే నవల రచించారు. (నవీనపురి, మదరాసు 1934) మంజూషలో (1950 నవంబరు) గంగో పాధ్యాయ 'సీమసమస్య' అనే కొత్తనవలలో వామపక్షయువకుణ్ణి చిత్రించివారు. చరిత్రాత్మక కథావస్తువులు స్వీకరించి రచించిన నవ లలు కొన్ని :— దేవేంద్రనాథ ఛటోపాధ్యాయవ్రాసిన 'వంగవీర ప్రతా పాదిత్య' (సం. సాహిత్యపరిషత్ పత్రికా 1930–31) అదే పత్రికలో (1932-33) ఇంద్రనాథ వంద్యోపాధ్యాయ 'కృతగౌరచంద్ర' (ఉద్యాన పత్రిక 1955 లో) చోళచరిత్రనుంచి ఆర్. రామమూర్తి 'వీరలబ్ధం పారి తోషికం' అనే నవలలు – చారిత్రకకథలు కొన్ని గమనార్హములు :- 'వీరమతి' (సం. రత్నాకర 1909), 'అత్యాచారిణ। పరిణామః' ముస ల్మాను యుగమునాటి కథావస్తువును ఆధారముచేసికొని 'అతి' వల్ల కలిగే ఫలితాన్నిగురించి సంస్కృత రత్నాకర పత్రిక (1942), దానీ దినేశ్ (సం. రత్నా 1943) అనేవి. సంస్కృత వారపత్రికలో అచ్చయి నవి చారిత్రకాలు కొన్ని - అజంతా (27-3-1956), హీరు (17-1-56)

ద్విరాశ్వమేధయాజీ (27-12-1955) మొదలైనవి. మదరాసులోని ఎ. రాజమ్మాళ్ 'చంద్రమౌళి' అనే ప్రాచీనకాలపు కథ తీసుకొని కథలో నాటకాన్నికూడా ప్రవేశపెట్టింది. డి. టి. తాతాచార్య తమిళనవల 'మేనక'ను, వడువూర్ దొరైస్వామి అయ్యంగారు రచించిన దాన్ని అనువదించినాడు. ఈ నవలాపాఠము ఉద్యానపత్రికలో అచ్చవుతున్నది. హోషియార్‌పూర్ వాసి అయిన శ్రీ జగద్రామశాస్త్రి 'ఛత్రసాల విజయము' అనే నవల రచించారు.

## ఖండకావ్యము

ఆధునిక భారతీయ రచనల మరొకలక్షణము, నిత్యజీవనము ఖండకావ్యముగా రూపొందుట. లౌకిక సంస్కృత సాహిత్య సంప్రదాయంలో ముక్తకాలు, యుగ్మకాలూ, కలాపకాలు, కులకాలు, శతకాలున్నూ, ఉన్నవి. అయితే పాశ్చాత్యసాహిత్య ప్రక్రియగా ఖండకావ్యం పరిమిత పద్యపంక్తులలో పరిమితావరణలో విశిష్టభావాలను పురస్కరించుకొని బయలుదేరింది. ఈ ఖండకావ్యాన్ని అనుసరించి ఆధునిక సంస్కృతకవి కూడా కావ్య సందోహము వెలువరించినాడు. నేటి సంస్కృత కవులు సర్వసామాన్యంగా ఈ సాహిత్య ప్రక్రియద్వారా నిజ భావాలును, వ్యక్తము చేసుకొంటున్నారు. కొందరు కవులు తమ ఖండకావ్య సముచ్చయాలను ప్రకటించారు. అయితే చాలావరకు ఈ పద్ధతి కావ్యరచన పత్రికల్లోనో, వ్రాతప్రతుల్లోనో నిక్షిప్తమైంది. ఆంగ్ల సాహిత్యంనుంచి అనుకరణలు, అనువాదాలుగానూ, ఖండకావ్య రచనలు వచ్చాయి. రామచంద్రాచార్యుల లఘుకావ్యమాలలో (మదరాసు 1924) ఉన్న అనువాద రచనలు :- షేక్స్పియరు రచించిన 'As you like it' లోని మానవుని సప్తదశలకు అనువాదము 'పురుషదశ సప్తకః', రోజర్ కోరికల్లో ఒకానొకటి 'సుమనోరథః', 'Hamlet' నుంచి అనువదించిన 'పితురుపదేశః', Browning కవీశ్వరుని 'All is right with the World' అన్న దానికి అనువాదము 'సాధువాదమంజరి'. వై. మహాలింగశాస్త్రి 'కింకిణీమాల' అనే కావ్యసముచ్చయాన్ని (మదరాసు 1934) లో ప్రకటించారు.

అందులో షేక్స్పియర్, వర్డ్స్వర్తు, షెల్లీ, డాక్టర్ జాన్సన్ ప్రభృతుల అనువాదాలేకాక, ఎన్నోనూతన ఖండికలకు నవ్యలయాన్విత ఛందస్సులు అవలంబించినవి ఉన్నవి. మంచి ఉదాహరణకు 'స్థాణు పరిదేవనమ్ (శివుని వేదన), చదవదగినది. మధురలో 1951 లో వి. సుబ్రహ్మణ్యఅయ్యర్ రచించిన 'పద్య పుష్పాంజలి' లో ఆంగ్లం మంచి అనువాదాలూ, స్వతంత్రాలూ కూడా ఉన్నవి. స్వతంత్ర రచనలకు దృష్టాంతములు, ఋషులు, కవిత, జీవితము, ప్రకృతికళ, శకుంతలా స్వగతము, అద్భుత భారత ఖండము ఇత్యాదులు - మధురలో 1950 లో మహామహోపాధ్యాయ కె. యన్. కృష్ణమూర్తిశాస్త్రి గారి 'ప్రకృతి విలాసం' ప్రకృతి వర్ణనాత్మకం. జతీంద్రనాథ భట్టాచార్యుల 'కాకలి' (కలకత్తా 1933) లో గాంధీ, రవీంద్ర ప్రశస్తులు, సంప్రదాయ ధోరణిలో పద్యాలూ, గేయాలూ ఉన్నవి. ఆచార్య జి. పి. ఝాలాగారి 'సుషమా' (1955 బొంబాయి) అనే కావ్య సముచ్చయంలో హేళన, విషాద కావ్యాలు, వర్ణనలూ ఉన్నాయి. డా॥ బి. పి. హెచ్. ఛాబ్రా (1951 సైక్లోస్టైలుప్రతి) రచించిన 'సువర్ణ బిందు' లో కొన్ని ఖండికలు గమనార్హములు :- చీమ, జీవితంలో సుఖం. యథార్థ మైత్రి, గాంధీ స్తవం (స్తవానికి వైదిక గాయత్రీ ఛందస్సు కవి ప్రయోగించినాడు), మధుర స్మృతులు (అనగా మధురలో పురాతత్వ సంస్కృతి, స్థలపురాణం, సాహిత్య విషయక స్మృతులు.) యస్. బి. వర్ణేకర్ (సర్ది 1956) 'మందోర్మిమాలా' అనే కావ్య సముచ్చయంలో చాలా ఖండికలు వర్ణనాత్మకాలు, ఆలోచనా విలపితాలు, ఉపదేశాత్మక, దేశభక్తి భరితములున్నా. జయపుర వాసులు మధురానాథకవి శాస్త్రి స్పర్శచేయని ఆధునిక కవితా వస్తువు అంటూలేదు. ఆయన కావ్యఖండాలు 'సాహిత్య వైభవము'లో నిబద్ధములు (బొంబాయి 1930) ప్రకృతి కవిత్వంలో అనేక భావోద్రేకాలున్నవి. అన్యాపదేశాలు ఆలోచనాత్మకంగా కొన్ని ఉన్నవి. 'నవయుగ వీధి' అనే భాగంలో ట్రాం, మోటారుకారు, రైలు, ఓడ, విద్యుత్తు, రేడియో, గ్రామోఫోన్, శస్త్రచికిత్స, ఎక్సురే - ఛాయాచిత్ర గ్రహణం, సినీమా, నవ్య శాస్త్రోన్నతి,

పాశ్చాత్య గుణగణా లున్నవి. ఆయన కవితలో భారతీయ రాష్ట్ర వ్యవహారాలుకూడా ప్రతిఫలించాయి.

మేఘసందేశానికి చాలా అనుకరణాలు వచ్చాయి. వాటిలో కొన్ని మాత్రం నవ్యధోరణిలో ఉన్నాయి. అలకానగరంలో యక్షుని జీవితము, అతని ఉద్యోగము, అతని శాపానికి కారణము వివరిస్తూ యక్షుని జీవితము పునః నిర్మించాలనే యత్నాలు కొన్ని జరిగినవి. (మైసూరు 1923 యం. రామశాస్త్రిది 'మేఘప్రతి సందేశమ్'). అంతకుపూర్వం కోరాడ రామచంద్రకవి 'ఘనవృత్తం'లో (మదరాసు 1955) కాళిదాసుని మేఘదౌత్యానంతర గాథ కల్పనచేసి రచించినాడు. మేఘదూత కావ్యానికి హేళనాత్మక కావ్యఖండాలు వచ్చాయి. వాటి విషయము మరొక శీర్షికలో పాఠకులు చూడవచ్చును.

సంస్కృతపత్రికల్లో అచ్చవుతున్న కొన్ని పద్యోదాహరణాలవల్ల కవితావస్తువు ఎంత విస్తృతమవుతున్నదీ చెప్పక తప్పదు. సహృదయ (ii) పత్రికలో కె. కల్యాణి 'భారతీవిలాపము' అనే శీర్షికతో కవి దుఃఖాన్ని ప్రకటించింది—అనగా కావ్యనిర్మాణం, దాని ముద్రణ, దాని సమీక్ష, పఠనపాఠనాలూ, ఆస్వాదనం – వీటన్నింటివల్లా కవి కష్టాలు వర్ణితమైనాయి. సంస్కృతసాహిత్యపరిషత్ పత్రిక (అక్టో 42) లో 'భారతీయ యుద్ధసజ్జా' అనే శీర్షికలో ప్రాచీన అర్వాచీనయుద్ధం, భారతీయుల అంత్యయుద్ధ ప్రయత్నము, ఛందోమయ సంవాదరూపంలో ఉన్నది. ఆ పత్రికలో (1928-29) పులినవిహారి దాసగుప్త 'చర్మగోళక క్రీడ' అని కాలిబంతి ఆటనుగూర్చి వ్రాశాడు. కూర్క సుబ్రహ్మణ్యశాస్త్రి జోగ్ జలపాతమునుగూర్చి మైసూరుమహారాజ సంస్కృత కలాశాలాపత్రికలో (1925) ఖండకావ్యం ప్రకటించినాడు. అప్పాశర్మ 'పంజర బద్ధశుకః' అని పంజరములోని చిలుకనుగూర్చి సంస్కృత చంద్రికాపత్రికలో (1904) చక్కనిశ్లోకాలు రచించినాడు. ఆయన గోల్డుస్మిత్తు వ్రాసిన Deserted Village అనే ఆంగ్ల ఖండకావ్యానికి తన అనువాదం చంద్రికాపత్రికలో ప్రకటించినాడు. దాన్నే పుస్తక రూపంలో 1915 లో ప్రత్యేకంగా ముద్రించినాడు.

పద్యఖండికలు ఏకమై అవిచ్ఛిన్న కథాత్మకమైనవి చిన్నవీ

పెద్దవీ అచ్చయినవి. 'మహీపాయను నీతిచోళః' (1949), 'దేవబస్ది వరదరాజః' (1948) అనే కథానకాలు చోళచరిత్రనుంచీ, శ్రీరంగ దేవాలయ గాథనుంచీ స్వీకరించి ఈ వ్యాసకర్త ప్రకటించినాడు. ప్రస్తుత వ్యాసరచయిత పద్యకథ 'నకదాచిత్ అనీదృశమ్‌జగత్'(జగత్తు ఎప్పుడూ ఇలా ఉండక పోలేదు) అన్నది అముద్రితము. ఈ పద్యకథలో పూర్వ భాగంలో విర్దాక్షిణ్యంగా ఊర్వశీ పరిత్యక్తుడైన పురూరవగాథ, వైదిక కాలములోనిది వర్ణించి, ఉత్తరభాగంలో భారతీయ రాజపుత్రుడు ఆంగ్లేయ భార్యవల్ల భూరిసంపద కోలుపోయి పరిత్యక్తుడైన కథనూ వస్తువుగా కవి స్వీకరించినాడు.

సంస్కృతభాషనుగురించీ, దాని మహిమను ఉద్దేశించీ, చాలా పద్యఖండాలు పత్రికాముఖంగా వెలువడినాయి. నూటఆరు పద్యాల్లో ఇదే విషయము స్వీకరించి ప్రత్యేకంగా దీర్ఘ పద్యఖండాలు ప్రభుదత్త శాస్త్రి 'సంస్కృత వాక్సౌందర్యామృతమ్' (దేహళి 1957) రచించినాడు.

ప్రాచీన ఖండకావ్య ధోరణిలో దీర్ఘ పద్య ఖండాలు కవులు రచిస్తూనే ఉన్నారు. వాటిలో కొన్నింటిలో కథావస్తువును నవ్యంగా తీర్చి దిద్దినారు. బెంగుళూరునుంచి 1944 లో పి. వేంకటరమణయ్య 'కావ్య సముదయము' లో హరిశ్చంద్ర, నాభానేదిష్ట, విశ్వామిత్రాది వైదిక కథలు స్వీకరించి రచనచేసినాడు. డి. యం. కులకర్ణి (సతారా 1952) 'ధారాయశోధారా' అనే ఖండకావ్యము ప్రాచీన భారతేతిహాస సంస్కృతి వైభవ కేంద్రాలయిన వాటిల్లో భోజరాజేంద్రుని ధారా నగరాన్ని గురించి రచించినాడు. విజయనగరవాసి వి. వేంకటనారాయణ రావు 'పద్మినీ చంద్ర సంవాద' మనే శిల చిత్రణకు సంబంధించిన పద్యసంవాదము (1909 కాశీ) ప్రకటించారు. తిరువయ్యారువాసి, మేధ శ్రీ నారాయణశాస్త్రి చాలాగ్రంథాలు రచించారు. వాటిలో జీవిత చతుర్విధ పురుషార్థ ప్రతిపాదకంగా 'చతుర్వర్గ చింతామణి' వంటివి (శ్రీరంగం 1922) ప్రచురించారు. చాలామంది సంస్కృత కవులు ఆలోచనాత్మకంగా ప్రాచీనమైన అన్యాపదేశ శతక ధోరణిలో పటిష్ఠంగా రచనలు చేశారు. మధురానాథశాస్త్రి చేసిన 'అన్యాపదేశాల' విషయం

లోగడ చెప్పాను. వై. మహాలింగశాస్త్రి 'వ్యాజోక్తి రత్నావళి' (తిరువయ్యారు 1953) ఈ కోవలోనిది. జమ్మూవాసి శుకదేవశాస్త్రి "జితమాల చరితం" (లాహోర్‌లో) ఎనిమిది లఘువర్గలలో కవి దరిద్ర బ్రాహ్మణుడైన బాబాజిత్తో, అతని కుమార్తెకూ సంబంధించిన విషాద గాథను కథావస్తువుగా స్వీకరించినాడు. బ్రాహ్మణ బాబా కథ డోగ్రా బావగేయ కవిత్వంలో ప్రసిద్ధం. వై. నాగేశశర్మ (బెంగుళూరు 55) వర్గత్రయాత్మకంగా 'నేత్రోన్మీలనమ్' అనే వాసవదత్త ఉపగుప్తుల బౌద్ధగాథ హిందీవచన మాతృకనుంచి స్వీకరించి కావ్యంగా పంతరించి నాడు.

## హేళన కావ్యము - లలిత కవిత

నవీనయుగంలో హేళన కావ్యానికీ, లలిత కవితకూ, పరికొత్తగా ప్రోద్బలం వస్తున్నది. ఆధునికత కోరే నవ్యరచయితలు సంప్రదాయక మార్గాన్ని హేళనచేయగా సంప్రదాయమార్గాన్ని అవలంబించినవారు నవ్యుల పోకడలను హేళన చేసినారు. భిన్నపక్షాలూ, వాటి నాయకులూ, వారిలో భిన్నాభిప్రాయాలూ, కలహాలూ హేళన కవిత్వానికి కావలసిన కావ్యవస్తువులయినవి. ఈ సాహిత్య ప్రక్రియలో సంస్కృతమును సరదాగా ఉత్సాహజనకంగా కవులు ప్రయోగించినారు. అది గమనించిన వారికి తెలుస్తుంది.

కొందరు ఆధునిక రచయితలు మేఘసందేశ కావ్యరూపాన్ని హాస్య జనక కావ్యరచనకు వినియోగించుకొన్నారు. అటువంటి హేళనకు తార్కాణంగా వీటిని గమనించవచ్చును. పి. ఆర్. సహస్రబుద్ధే రచించిన "కాకదూతం" (ధార్వార్ 1917), యం. ఆర్. రాజగోపాల అయ్యంగారు వ్రాసిన 'కాకదూతం' (అన్నామలై నగర్ సంచిక 1940), పూనా వాసు లయిన కె. వి. కృష్ణమూర్తిశాస్త్రిగారి 'శునకదూతము' (సరస్వతీ సుషమా పత్రిక, వారణాసి 1956) లో ఒక చోరుడు కారాగారంనుంచి సందేశం పంపుతాడు; శునకాన్ని వేడుకుని తన ప్రేయసి దగ్గరికి వార్తను తీసుకొని వెళ్లమంటాడు.

ఉల్లిపాయరుచిలో తట్టుకోలేనంత ఘాటుతనం ఉన్నది. సహ్యా

దయ పత్రికలో (8) ముద్దు విఠలాచార్యులు ఉల్లిపాయ తరపున సవా తనుణ్ణి నిషేధం వర్జించమని అర్థిస్తాడు; 'పలాండుప్రార్థనా' అనే ఖండ కావ్యంలో. జయపురవాసి కృష్ణరామకవి అమూల్యమయిన ఈ వస్తువును గురించి 'పలాండుశతకం' రచించినాడు. చీపురుకట్ట వహించే ఉదాత్తపాత్ర 'మార్జనీ' స్తవంలో ఉన్నది. అనంతల్వారు అనే మేల్కోటలోని శ్రీవైష్ణవ మఠాధిపతులు శతకరూపంలో 'సమ్మార్జనీ వైభవం' సంస్కృతచంద్రికా పత్రికలో రచించారు. దానితోపాటు ఆయనరచించిన వ్యాసము 'చీపురుకట్ట'ను గురించినది. అయిదో సంపుటంలో అచ్చయింది. కవులచేతుల్లో నల్లి, చీమకూడా తప్పించుకోలేక పోయినవి. కె. వి. కృష్ణమూర్తిశాస్త్రి ఎనిమిదిపద్యాలు నల్లిని గురించి 'మత్కుణాష్టకం' రత్నాకరపత్రికలో ప్రచురించినారు. పూనాలోమాదిరిగానే వంగదేశంలోనూ దోమ సమానంగానే రోతపుట్టిస్తుంది. అందుకే సంస్కృత సాహిత్య పరిషత్ పత్రికలో, ఫిబ్రవరి 1928 సంచికలో 'మత్కుణాష్టకము'ను పులినవిహారీ దాసగుప్త రచించినాడు. ప్రాచీన సంస్కృత కవిత్వంలోకూడా దోమకు గౌరవం ఇవ్వడం జరుగుతూ వచ్చింది. సమకాలిక సారస్వతంలో 'ఆత్రేయ' అనే వి. స్వామినాథశర్మ కొన్ని పంక్తులతో మశకమునుగూర్చి అణ్ణామలై నగరసంచికలో కొంతకావ్య ఝుంకారంచేశాడు. తేనీరు, కాఫీ సేవించడంవల్ల వచ్చే సుఖాలూ, దురలవాట్లవల్ల వచ్చే నష్టాలూ కొంతకవిత్వం చెప్పడానికి ఉపకరించాయి, ప్రేరేపించాయి.

పి. ఆర్. సహస్రబుద్ధే తేనీటి గొప్పతనాన్ని 'చాహగీత' అనే కావ్యం చెప్పి గీతార్థత కల్గించినాడు. ఆత్రేయ 16 శ్లోకాల్లో అణ్ణామలై పత్రికలో 'కాఫీషోడశికా' ప్రకటించినాడు. ఈ అద్భుత పానీయాన్ని గూర్చి మరి రెండు పద్యఖండాలు అచ్చుపడ్డాయి. యం. వి. సంపత్కుమారాచార్యుల 'కాఫీపానీయం' (సం. సాహిత్య ప. పత్రిక, ఏప్రిల్ 1941), 'కాఫీత్యాగ ద్వాదశమంజరికా' అనే పద్యఖండం ఆచార్యశంకరుల భజగోవింద శ్లోకచందస్సులో కాఫీ వర్జించమని ప్రజకు హితోపదేశమున్నూ చెప్పుకోతగ్గవి. తేనీటికప్పువైపు మరలితే ఇక్కట్టణించిపోయిగా ఉంటుంది. ఏడుశ్లోకాలలో ఈ తేనీటికప్పులను గురించి కాలి

శ్కార్ వాస్తవ్యులయిన యం. కృష్ణ నంబూద్రిపాద్ ఒక పద్యఖండి కను (3-4-1956) సంస్కృతపత్రికలో ప్రకటించినాడు. అప్పాశర్మ (1906 సం. చంద్రిక)లో 'ఉదరప్రశస్తి' రచించాడు. డి. టి. తాతా చార్యులు చాలా స్వతంత్రంగా భావనచేసి 'కోతుల ఉపవాసం' అనగా 'కపీనాం ఉపవాసః' అనే ఖండకావ్యం రచించారు. ఇందులో నియమ వ్రతాలు ఆచరిస్తున్నట్లు నటించే చపలచిత్తులను కవి హేళన చేసినాడు. మహావీరప్రసాద ద్వివేది ముప్పది ఎనిమిది శ్లోకాల్లో కవ్యాకుబ్జంలోని విప్రులను వేళాకోళముచేస్తూ (సం. చంద్రిక 6) 'కాన్యకుబ్జలీలామృతం' రచించినారు.

నవ్యోద్యమాలను గురించీ, వాటి నాయకులను గురించీ హేళన చేస్తూ కొందరు కవులు కవిత్వం చెప్పినారు. చజ్జూరామ 'దయానందా ష్టకం'లో దయానందుని హేళనచేసినాడు. బంకిమచంద్ర ఛట్టోపాధ్యా యుల మాతృకను సంస్కృతీకరించి 'పశువులసమావేశ' కథలో వేళా కోళంగా నేటి సభలను చూపినాడు. (కుంభకోణం 1925) - శతక రూపంలో పున్నస్సెరి నీలకంఠశర్మ 'సాత్త్విక స్వప్నం' లో 'మధుర వాణి 1097 త్రిచూరు) తొల్లింటి రాజకీయాందోళన కారులను హేళన చేసినాడు. భిన్న భిన్న పక్షాలవారు సిద్ధాంతాల వివాదము చేస్తున్న వారిని పద్యకావ్యంలో పశువుల సభగా హేళనచేసినాడు. సమావేశంలో ఒకవృషభం, శునకం, కోతి, నక్క, చిలుక ఇత్యాదులు అహ్వానోపన్యాసం, ఆరంభోపన్యాసం, అధ్యక్షోపన్యాసాలు చేస్తాయి. 'కాంగ్రెసు గీత' (1908) కల్లోలంగా జరిగిన సూరతు కాంగ్రెసును హేళన చేసిన రచన. నవీనమైన పోకిళ్ళుపోయి సంప్రదాయమూ ఆచారాలూ విడిచి పెట్టినవాళ్లను 'కల్పిత కవి వృత్తాంతాదర్శ పురాణము' లో బాబా దీక్షిత నాటవే అధిక్షేపించినాడు.

## రూపకము

గతానుగతిక సంప్రదాయమార్గంలో ప్రాచీనమైన ఇతివృత్తాలు స్వీకరించి కుప్ప తిప్పలుగా నాటకాలు వ్రాస్తూనే ఉన్నారు. అలాంటి రచయితలలో భట్టశ్రీ నారాయణశాస్త్రి గారొకరు. వీరు 93 నాటకాలు

వ్రాశారు. ఇప్పటికీ ఇంకా అలాంటి నాటకాలు సక్రమంగా వ్రాస్తూనే ఉన్నారు. ప్రాచీన రూపాన్ని కథావస్తువును స్వీకరించినా నవ్య భావాలతో, పోషణతో రచయితలు నవీనాకృతి రూపొందిస్తున్న నాటకాలను గూర్చి ఉట్టంకించక తప్పదు. సంస్కృతంలో అధునిక విద్వాంసులయిన వారు విద్యావంతులున్నా రూపక రచనకు పూనుకొన్నప్పుడు సహజంగా నవ్యత రాకుండా [1] ఉండదు.

ప్రౌఢమైన ప్రాచీన రూపకాలు నవీనమైన ఇతివృత్తాన్ని సూచించాయి. లేదా ఆ మహానాటకాల్లోని సన్నివేశాలు తీసుకొని, రచయితలు నవ్యధోరణిలో నాటికలు పునః నిర్మించే యత్నాలు జరిగినవి. దృష్టాంతముగా చూడండి. మైసూరువాసి జగ్గు వకుళ భూషణము రెండు మూడు అంకాల నాటికలు రచన చేసినాడు. ఆ నాటికల్లో 'ప్రసన్న కాశ్యపీయము' ను (మైసూరు 1951) పేర్కొనాలి. ఆ నాటకంలో శకుంతలా దుష్యంతులు భరత సహితంగా కణ్వాశ్రమానికి రావడం కథావస్తువు. సూరత్‌వాసి జె. టి. పరీఖ్ కూడా ఇదే ఇతి వృత్తంవల్ల ఆకర్షితుడై, 'ఛాయా శాకుంతలం' అనే ఏకాంకిక రచించాడు (సూరత్ 1957). ఆ నాటికలో ఉత్తరరామ చరిత్ర ప్రభావం ప్రముఖంగా గోచరిస్తుంది. అంతరార్థంతో రూపకాతిశయోక్తి ప్రధాన నాటికలను కొందరు రచించారు. అందుకు దృష్టాంతము – 'అధర్మ విపాకః' (సం. చంద్రికా 4 సం.) అనేదాన్ని పి. వేంకట రమణయ్య రచన చేసినాడు. దానితో పాటు ఆయుర్వేద ప్రాశస్త్యాన్ని వెల్లడిస్తూ దీర్ఘమైన రూపకాతిశయోక్తి గల 'జీవసంజీవనీ' [2] నాటకము రచించినాడు

మదరాసులో సంస్కృత అకాడమీవారు యావద్భారత నాటకాల పోటీ జరపగా చాలా నాటకాలు వచ్చాయి పోటీకి. ఆ పోటీలో 'ప్రతి రాజసూయమ్' అనే నాటకం సమ్మానము పొందినది. ఇటీవలనే దాన్ని వై. మహాలింగశాస్త్రి ప్రకటించినాడు. అందులో ఇతివృత్తము– పాండవులను ప్రవాసానికి పంపి దుర్యోధనుడు ప్రతి రాజసూయము

[1] గమనించవలసిన మార్పు – నాటకాల్లో ప్రాకృతాన్ని విడిచివేయడం.

[2] బెంగుళూరు 1949

అచరిస్తాడు. ఇందులోను అముద్రితాలయిన ఆయన ఇతర నాటకాల్లోను ఇతివృత్తాలు పురాతనమైనవే తీసుకొన్నా, నాటకకర్త నవ్యభావాలు రచనల్లో ద్యోతకము చేస్తాడు. ఉద్యానపత్రికలో శాస్త్రిగారు 'కవిప్రాదుర్భావం' అనువృత్తంగా అచ్చువేసినారు. పుస్తకరూపంలోకూడా అది వచ్చింది. (తిరువేలంగాడ్ 1956) ఈ నాటకంలో చిన్న అంకాలు ఏడున్నవి. కథావస్తువు పాతదే అయినా, ఉత్సాహకరంగా ఉంది. కవి ఆవిర్భవిస్తూ వెంటనే అవినీతిని వ్యాపింపచేస్తాడు. మహాలింగశాస్త్రి గారిదే 'ఉభయరూపకం' అనే సామాజిక సుఖాంతనాటిక ఉన్నది. తంజాపురవాసి సుందరేశశర్మ రసపోషణకు అనుకూలమైన బిల్హణ కథకు ప్రతిబింబంవంటి [1] 'ప్రేమవిజయం' రచించి రంగశాలలో ప్రయోగించినారు.

భారతేతిహాసంలో ప్రసిద్ధవ్యక్తులను ఇతివృత్తంగా స్వీకరించి చాలా నాటకాలు వ్రాస్తున్నారు. కథావస్తువులో మార్పు మొదటిసారిగా ఈ నాటికలలో కానవస్తున్నది. ఈ తోవలోచేరిన నాటకాలు - మహామహోపాధ్యాయ మాథురీ ప్రసాదదీక్షితుల మేవాడు రాణా ప్రతాపసింహునిగూర్చిన 'వీరప్రతాప' నాటకము (లాహోరు 1937), యం. యం. యాజ్ఞిక్ నాటికాత్రయం 'సంయోజిత స్వయంవరం', 'ఛత్రపతి సామ్రాజ్యము', 'ప్రతాప విజయము' — ఈ మూడింటిలో గేయాలున్నాయి; సుదర్శనపతి రాసిన 'సింహళ [2] విజయం'లో ఓఢ్రచారిత్రక గాథ కథావస్తువు (గేయసహితంగా-ఓఢ్రంలో), పంచాననతర్క రత్నగారి నాటక 'అమరమంగళమ్ (కాశీ 1939), ప్రేమమోహినీ - రణధీర' అనే విజయానందుని రసమయ నాటకంలో (సం. చంద్రిక 1904) కవి ప్రస్తావన సంప్రదాయము తీసివేసినాడు. ఈ వ్యాపకర్త 'అనార్కలి' నాటకం రచించినాడు. అది అముద్రితము. ఇందులో కథావస్తువు ప్రసిద్ధము. జహాంగీర్ చక్రవర్తి బానిసపిల్లను ప్రేమించినకథను తీసు

---

1 కుంభకోణం 1948

2 ఆంగ్లానువాదంతో బరోడా నుంచి ప్రకటితం 1929 (ఛత్రపతి సామ్రాజ్యం)

కొన్నాడు. శ్యామారావు చనిపోయాక అచ్చయిన సంఘ సంస్కర ణాత్మక రూపకాలున్నవి. వాటిలో [3] 'బాలవిధవ' అనే అంకత్రయిగల వితంతువును గూర్చిన నాటకము ఒకటి. ఒక కొన్ని అపురూపమయిన ఇతి వృత్తాలకు రూపకాకృతి ఇవ్వడం జరిగింది. ఆర్యసమాజ రచయిత అయిన మహావ్రతుడు 'ప్రకృతిసౌందర్యం' అనే నాటిక రచించాడు. (యోక్ 1934) పున్నెస్సెరి నీలకంఠశర్మ 'గైర్వాణీవిజయం' విజ్ఞానచింతామణి పత్రికలో ప్రకటించినాడు. అది ఆయన సంపాదకత్వాన వెలువడే పత్రిక. సంస్కృతభాష ఎలాంటిదుస్థితిలోఉన్నదో, దానికి మహారాజ సంస్కృతకళాశాలలు బిన్నసంస్థానాల్లోవి, సమయానికి తగిన బాషా సాహాయ్యం ఎలాచేస్తున్నది నాటికగా విరచితమైంది. ఇందులో బ్రహ్మ, సరస్వతి, ఋషులు, సంస్కృతము, ఆంగ్లము అన్యభారతీయ భాష లున్నూ పాత్రలుగా ప్రదర్శింపబడ్డవి. ఢిల్లీలో ఇలాటి నాటకాన్నే ప్రభు దత్తశాస్త్రి 'సంస్కృత వాగ్విజయమ్' అయిదు అంకాలలో సంస్కృ తంలో, హిందీలోనూ రచించినాడు. (ఢిల్లీ 1942).

సృజనాత్మక ప్రవృత్తి కొత్తగా పొంగులెత్తుతున్నప్పుడు కాళిదాస శూద్రక, భవభూతులను మెచ్చుకొనే సహృదయులను షేక్స్పియరు ఆకర్షించినాడు. భారతీయ భాషల్లో షెక్స్పియరు రచనలకు లఘు పరి శీలనలు ఉంటూ వచ్చాయి. అయితే ఈ మహా నాటక కర్త రచనలకు సంస్కృతానువాదాలు రాలేదు. 1877 లోనే మదరాసులో శ్రీశైల దీక్షితర్, Comedy of Errors అన్న షేక్స్పియరు నాటకాన్ని 'భ్రాంతి విలాసః' అని సంస్కృతానువాదము చేసినాడు. తిరువనంత పురంలో (1892) రాజరాజవర్మ Othello నాటకాన్ని అనుక రించాడు. 'సహృదయ' లో ఆర్. కృష్ణమాచార్యులు 'Mid Summer Night's Dream' నాటకాన్ని సంస్కృతంలో 'వాసంతికా స్వప్నం' అని ప్రకటించి, వేరే పుస్తకంగానూ వేసినాడు. శ్రీ గుండేరావు హర్కారి, గద్వాలవాసి 'Mid Summer Night's Dream'; 'Hamlet' ల లో కొన్ని అంకాలు సంస్కృతాను వాదము

[3] మంజూష 1955

చేసినాడు. శ్రీ పత్రికలో (8, 3, 4) Mid Summer Night's Dream నాటకానికి మరొక అనువాదం వచ్చింది. ఉద్యాన పత్రికలో ప్రస్తుతం అనువృత్తంగా 'యథాభిమతం' అనే శీర్షికతో 'As You Like It' నాటకానికి అనువాదము పడుతున్నది. విజయనగరవాసి యం. వేంకటరమణాచార్యులుగారు Lamb రచించిన షేక్స్పియరు నాటక కథలను సంస్కృతంలో అనువదించారు. (1933 మద్రాసు). 'సహృదయ' లో చాలా సంచికల్లో Othello, Hamlet మొదలయిన షేక్స్పియర్ నాటక కథల వచనానువాదాలు అచ్చు పడ్డవి. షేక్స్పియరులో నాటకాలలోనుంచి కొంతభాగము పద్యానువాదముచేసినట్లు లోగడ మనము పరిశీలించినాము. ఇతర పాశ్చాత్య రూపకాలు కూడా సంస్కృతములో అనువాదముచేసినారు. జర్మన్ కవీశ్వరుడయిన గెథె రాసిన Faust నాటకాన్ని 'విశ్వమోహన' అనే సంస్కృత రూపకముగా యస్. యన్. తడపత్రీకార్ రచించి Poona Orinenta-list పత్రికలో (14) ప్రచురించినాడు. డా॥ శ్యామాశాస్త్రి Lessing రాసిన 'అమీలియాగెలిట్టీ' అనే నాటకాన్ని అనువదించి, (మై. మ. సం. కలాశాల) పత్రికలో (7, 1931) ప్రకటించినాడు. పి. వేంకటరమణయ్య టెన్నిసన్ రాసిన 'Cup' అనే అంకద్వయాత్మక విషాదాంత నాటకాన్ని అనుకరించి సంస్కృత నాటక లక్షణాల ప్రకారంగా 'కమలా విజయ' నాటకము ప్రకటించినాడు (మైసూరు 1938).

పాశ్చాత్య రూపకాలకు సంస్కృతానువాదాలు రావడమేకాక, లఘుపరిమాణాల్లో ముఖ్యంగా ఏకాంక నాటికారచన పాశ్చాత్యనాటికలను ఒరవళ్ళుగా తీసుకొని నవజీవనంతో ఉద్భవించినవి. ఈ యుగంలో రచయితలు చాలా నాటికలు రచించారు. ప్రాచీనకాలమునుంచీ సంస్కృత రంగాన ప్రహసనాలుకూడా ఆదే అలవాటున్నది. మనకు రెండు మంచి ప్రహసనాలు క్రీ. శ. 7 శతాబ్దినుంచి లభ్యమవుతున్న వి. ఇటీవల వచ్చిన చిన్ననాటకాలలో కొన్ని ప్రహసనాలుకూడా ఉండడం

---

1 చూడు Aryan Path, Dec. 1955 సి. ఆర్. షా. భారతీయ భాషల్లో షేక్స్పియర్ నాటకాలు.

ముదావహం. కళాశాలల సాంవత్సరోత్సవ సందర్భాలలో సామాజికు లకు సమ్మోదము కలిగించడానికి సంస్కృత నాటికల రచనకు, ఏకాంక నాటికారచనకు ప్రోత్సాహముకలిగింది. ఇటీవల కొన్నేళ్ళ నుంచీ ఆలిండియారేడియో సంస్కృతంలో ఏకాంకికులకు నాటకసంవా దాలకూ సహాయము చేస్తున్నది.

ఈ నవీన ఏకాంకనాటికలలో ఇతివృత్తాల వైవిధ్యము చూడ వచ్చును. కథావస్తువు సమకాలిక సమాజానికి సంబంధించినది. వి. కె. తంపి 'సంస్కృతనాటికాత్రయి రసాత్మకము' (తిరువనంతపురం 1924) ఆ గ్రంథములో 'ప్రతిక్రియా', 'వనజ్యోత్స్నా', 'ధర్మస్య సూక్ష్మగతిః' అన్న నాటిక లున్నవి. కథావస్తువులు రాజపుత్ర ముస ల్మాను చరిత్రలనుండి కవి స్వీకరించినాడు. వి.వి. వరదరాజశర్మ వ్రాసిన 'కస్యాహమ్' (ఎవరిదాననునేను ?) (సు. సా. పరి. పత్రిక 1939) అన్న నాటికలో అత్తవారింటికి వచ్చిన కొత్తకోడలి స్వగతం ద్వారా ఆమె పరిస్థితి తెలియవస్తుంది. ఎ. ఆర్. హెబరే 'మనోహరందినం' అనే నాటికను సంస్కృత సాహిత్య పరిషత్పత్రికలో (1941 మార్చి) ప్రకటించినాడు. సామాన్యంగా పిల్లలు శలవుకావాలని అడగడం ఇందులో సన్నివేశం. సీతాదేవి గృహచ్ఛిద్రాలను కథావస్తువుగా తీసుకొని 'అరణ్యరోదనం' అనే నాటిక రచించింది: (మనోరమపత్రిక, బరంపురం సంచిక 3, 1949), ఇంట్లోనూ ఆఫీసులోనూ సర్వసామాన్యానుభవాన్ని తీసుకొని కె. తిరు వేంకటాచార్య 'అమర్షమహిమా' అనే నాటికను చక్కగా రచించారు. (ఉద్రేకపువెల్లువ – అమరవాణి 1951), ముక్కోపి అయిన ఆఫీసరు భార్యతో గుమాస్తాతో జగడమాడుతాడు. ఆ దురాగ్రహం అంతటితో ఆగక గుమాస్తామీదికి, భార్యమీదికీ పోయి అంతటితో ఆగక దాసీ దానిమీదికీ పోతుంది నాటికలో. 'వణిక్సుతా' (వ్యాపారికూతురు, మంజూషా ఆగష్టు 1955) అనే నాటికలో కొంత అసామాన్య కథావస్తు వున్నది. సురేంద్రమోహన్ పంచతీర్థులు వ్రాసిన ఆ నాటికలో ధనాఢ్య వితంతువుతో హైందవధర్మపరుడు, బుద్ధధర్మావలంబి ప్రణయకలాపము సాగించగా ప్రథముడు కృతకృత్యుడయినాడు. శ్యామారావు సతి 'కటు విపాకః' (మంజూషా డిసెం. 1955) అన్ననాటికలో సత్యాగ్రహోద్యమ

దివాల్లో సర్వసామాన్యమైన విషాద సన్నివేశమును కథావస్తువుగా స్వీకరించడం సంభవించింది. కొడుకుకానీ, కూతురుకాని ఉద్యమంలో చేరినప్పుడు ఇల్లు చిందరవందరకావడం, తల్లిదండ్రుల హృదయాలను బాధపెట్టడం, లేదా పోలీసుల హింసాకాండలో ఆ అబ్బాయో అమ్మాయో జీవితాన్ని కోల్పోవడం జరుగుతుంది. ఈ తరువాత విషాద సన్నివేశం, దేశం యావత్తూ అనుభవించింది. దీనినే 'మహా శ్మశానం' అనే ఏకాంకికగా నేర్పుగా, ఓజస్సుతో రచించినది. మూడు చిన్న దృశ్యాలలో విషాదాంత నాటిక (హైదరబాదు సింధు, సెప్టెంబరు 1941) కౌముదీ పత్రికలో ప్రకటితమైంది. భారతదేశ విభజన కాలంలో కలకత్తా వీధులు కంకాళాలతోనిండి, అయిదువందల జనాభాఉన్న పల్లె అయిదు గురిలోకి తగ్గిపోగా, ఒక ముసల్మాను దర్జీకుటుంబమును ఎదుర్కొన్న సమస్య తిండిలేక చావడమో, లేదా చీకటిబజారులో బియ్యపు గింజలు అవి అమ్మిన వాటినికొని గంజికాచుకోవడమో, తప్పనిసరి అయింది. ఒక్క గంజి గుక్కతో మిగిలిపోయిన కూతురు చనిపోయింది.

ఆదివరకే 'స్నుషావిజయం' (కోడలిగెలుపు) అనే నాటికను ఇలత్తూరు సుందరరాజకవి రచించాడు.[1] అది ఏకాంకిక; గత శతాబ్దాంతంలోనిది. సామాజిక గృహజీవితానికి సంబంధించిన కథతోపాటు, హాస్యంకూడా జాలు వారిందని, సంస్కృతంలో మనము తెలుసుకొంటాము. ఒకటి రెండు అంకాలలో స్పష్టంగా ప్రహసనాలనదగినవి, మనకు ప్రస్తుత శతాబ్దిలో చాలా ఉన్నాయి. ప్రాచీనమైన వారిలో ప్రహసనకర్తగా యస్. కె. రామనాథ శాస్త్రిగారొకరు. 'దోల పంచిలక ప్రహసనమే' కాక 'మణిమంజూష' అనే శీర్షికతో దశకుమార చరిత్ర లోని అపహారవర్మ కథలోని అత్యంత సంభ్రమాన్ని కలిగించే ఇతివృత్తం స్వీకరించి, నాటికగా రచించాడు. మదరాసువాసి కె. యల్. వి.

---

[1] ప్రకృత వ్యాసరచయిత తన వ్యాఖ్యతో తన సంపాదకత్వాన Annals of Oriental Research, Madras University 7, 1942 - 43 లో ప్రకటించాడు.

శాస్త్రి ప్రహసనాలు [1] మూడు రచించినాడు :— లీలావిలాసం, చాముండా, విపణికా అనేవి మూడు. మొదటి ప్రహసనములో [2] తల్లితండ్రులు తమ కుమార్తెను వేరే ఇద్దరి పిల్లలకు ఇవ్వవలెనని అనుకొంటారు. ఒకవరుడు పండితుడు. రెండోవాడు తాగుబోతు, నీచుడు. ఆ కన్యయొక్క సోదరుడు తన సహపాఠికి ఇవ్వవలెనని సంకల్పించు కొన్నాడు. ఆ సహపాఠి దొంగల బారినుండి పిల్లను రక్షించగా, సమస్యా పరిష్కారం సులువుగా అవుతుంది. చివరకు సోదరుని సహపాఠినే ఆ కన్య పెళ్ళి చేసుకొంటుంది. 'చాముండా' ప్రహసనంలో సామయిక మైనదీ, సామాజికమైనదిన్నీ కథావస్తువు. అది విశిష్టమైనది. ఆధునిక సౌకర్యాలవల్ల ఉపయోగం పొందదలచుకొనేవాళ్ల విషయంలో గ్రామాల్లో సనాతనులు వ్యతిరేకిస్తారు. ఆధునికాభ్యుదయంవల్ల వారి వ్యతిరేకత క్షీణమవుతుంది. ఒకానొక తరుణ వితంతువు లండన్‌లో డాక్టరై తిరిగి వస్తుంది. పల్లెలో ప్రజావ్యతిరేకతను ఆమె ఎదుర్కోవలసి వస్తుంది. ఆమెకు తలవంపు కలిగించాలని గ్రామీణులు సన్నాగం మొదలుపెట్టినారు. ఆమె గౌరవానికి హానిచేయ తలచుకొన్న వాళ్లల్లో ఒకడి భార్యకు, అకస్మాత్తుగా ఆమె వైద్య సాహాయ్యం చేస్తుంది. ఆమె సేవాపరాయణత్వంవల్ల, త్యాగంవల్లనూ, దూషించేవారిలో మనః పరివర్తనం కలుగుతుంది. వై. మహాలింగశాస్త్రి ప్రహసన ద్వయం రచించినాడు; 'కౌండిన్య ప్రహసనం'లో (మదరాసులో 1930 ముద్రితం — మహారాజ సం. కలా. పత్రిక, మైసూరు) సామాన్యంగా జనామోదం కలిగే లుబ్ధికథను తీసుకొన్నాడు. ఒక పరాన్న భుక్కు చేతుల్లో లుబ్ధాగ్రేసరుడు ప్రహసనంలో ఓడిపోతాడు. 'శృంగార నార దీయ ప్రహసనం'లో పౌరాణిక జీవిత వృత్తంలో మంచి కాముక భావ పరిణామం చూపించినాడు. అకవి 'పల్లీశాల ప్రహసనం'లో (మైసూ-సం. కలా. పత్రిక. మార్చి, జూన్ 1942) సంస్కృత శబ్దాలలో శ్లేష సంభవ సామర్థ్యాన్ని వినియోగించుకొని, ఒకానొక ధీరమాతను సృష్టి

---

[1] సంస్కృత సాహిత్య పరిషత్ పత్రికలో అనువృత్తంగా ప్రకటితం.
[2] పాలఘాటు 1935.

చేసినాడు. ఆమె తన కుమారుణ్ణి చావగొట్టిన బెడిపంతులను స్వయంగా శ్లేషచమత్కారంతో దులిపివేస్తుంది. మహేంద్రమోహన రచించిన 'కాంచనమాల' (మంజూషా ఫి. 1955) నాటికలో ఆ వనితకున్న నగలమీద వెర్రి ఆసక్తి, తత్ఫలితంగా విషాదమున్నూ ఇతివృత్తం. జీవన్యాయతీర్థులు 'పురుషరమణీయః' అనే ప్రహసనంలో (కలకత్తా 1948) అల్లికబిగువులేదు. అయితే 'కుతక్షేమః' (మంజూషా, నవం. 1955) అన్న నాటికలో లోపములేకుండా రచయిత పర్దుకోగలిగినాడు. ఆ నాటికలో ఒక దుర్మార్గుడు చీకటిబజారులో సొమ్ముగడించి, మరో ప్రపంచంలోకూడా కృతకృత్యుడై, చిత్రగుప్తుణ్ణికూడా తనకు నౌకరుగా చేసుకొని, యముణ్ణి మించిపోయిన తెలివితేటలతో జీవితము కొత్తగా కవులు తీసుకొంటాడు. ఆయన రచించిన మరో అంకద్వయిలో ప్రహసనమని పేరుపెట్టిన 'చండతాండవం'లో (కలకత్తా), జీవన్యాయతీర్థులు, స్టాలిన్ హిట్లర్ ముసోలినీ ఇంకా ఇతర మతరహితశక్తులూ, వాటిఘర్షణ, ఆధ్యాత్మిక భారతదేశం ప్రవేశించలేని వాటివైఫల్యమూ, చూపించినాడు. యస్. యన్. కోట్ రచించిన 'మలభవిష్యం (అనుభవ ప్రావీణ్యములేని అవకతవక జ్యోతిష్కుణ్ణిగూర్చి) వైద్యంతెలియని పంచికట్టు వైద్యుణ్ణిగురించి 'లాలావైద్యం' అనే నాటికలు నాగపురంలో ప్రదర్శించగా, ప్రజామోదము పొందినవి. శ్రీ కోట్ రచించిన మరో రెండు సమాజ విమర్శనాత్మక ప్రహసనాలు 'ధ్రువతార', 'హాహంత శారదే' అనేవి.

'శ్రీచిత్ర' అనే తిరువనంతపుర మహారాజ సంస్కృత కలాశాలా పత్రికలో (1942-43) నిరుద్యోగాన్ని గురించి సొష్ఠవంగా 'అలబ్ధ కర్మీయం' అనే నాటిక అచ్చయింది. నాటకకర్త ఆల్వేనివాసి అయిన కె. ఆర్. నాయర్. ఉద్యోగంలేని దరిద్ర సంస్కృతపండితుని దీనావస్థను నాటికలో చూపినాడు. ఆ పండితుడు యుద్ధంలో ఒక ఉద్యోగిగా చేరాలని కృతనిశ్చయుడైనప్పుడు, ఆకస్మికంగా బడిపంతులు పదవి లభించింది ఆయనకు. ఆ పాఠశాల క్షీణించిపోతున్నది. పదిహేనురూపాయల జీతంమీద ఆయన పాఠశాలకు కులపతి అయినాడు. ఆనాటికలో పాత్రలు రూపకాతిశయోక్తిద్వారా, సంస్కృతభాషాసాహిత్యము కల్పనచేయ

ఐడింది. ప్రధాన పాత్ర కవి; భావన కవిగారి భార్య. సంస్కృతభాషామ తల్లి గైర్వాణి. దారిద్ర్యంవల్ల తప్పనిసరిగ జన్మనిరోధము అనుష్ఠించడంవల్ల అతనికి పుట్టిన పిల్లలు, పద్యము కుమారుడూ, అభిరుచి కుమార్తె. 'పాండిత్య తాండవితా' (వల్లరిపత్రిక 1953 లో) అన్న నాటికలో వటుకనాథశర్మ రకరకాల పండితుల సిద్ధాంత రాద్ధాంతాల డాంబికాన్ని బయట పెట్టినాడు. విద్యోదయా పత్రికలో మధుసూదన కావ్యతీర్థులు పండితులను ఉద్దేశించి 'పండిత చరిత ప్రహసన' మును ప్రకటించినాడు. ప్రస్తుత వ్యాసకర్త రచించిన 'ప్రతాపరుద్రీయ విడంబనా' అనే హేళనాత్మక నాటిక అముద్రితంగా ఉన్నది. నాలుగు అంకాలాలలో అనంతరకాలంలోని సంస్కృత కవిత్వంలోని అందాన్ని పాడుచేసే అతిశయోక్తుల అనవస్థాదోషమునుచూపే, కథావస్తువును చమత్కారంగా అల్లినాడు. [1] 'విముక్తి' అనే ప్రకృత వ్యాసకర్త రచించిన మరొక ప్రహసనం ఉన్నది. పూర్తిగా ఇందులో తత్త్వార్థము అంతరార్థముగా కలది. స్వగతమువంటి ప్రాచీన భాణమును వై. మహాలింగశాస్త్రి 'కోతి – మద్దెల' అన్న నీతికథను 'మర్కట – మర్దళికా' అనే నాటికగా రచించినాడు. (మంజూషా సె. న. 1951) చివరకు సంప్రదాయకమైన భాణమువంటి శృంగార రసాత్మక స్వగత మును ఉపరూపకభేదమునుకూడా నవీన సామాజిక స్థితిగతులను, స్త్రీల కొత్తపోకడలను, వారిక్లబ్బులు, వారివేషాలు, ఆటలు, చీట్లపేకలు, టెన్నిసు, సినీమా మొదలయినవిచేర్చి, సుందరేశశర్మ 'శృంగార శేఖర భాణము' (కుంభకోణము 1938) రచించినాడు.

ఏకాంకికలు, నాటకీయగాథలు, ఆలిండియారేడియో ప్రసారం కోసం రచయితలు పంపుతున్నారు. ప్రసారంకోసం ప్రస్తుత వ్యాసకర్త 'రాసలీల' అన్న సంగీత నాటికను భాగవతాన్ని ఆధారం చేసుకొని రచించినాడు; కాళిదాసుని 'కుమారసంభవం' లో మహోపదేశాన్ని వ్యాఖ్యానిస్తూ 'కామశుద్ధిః' అనే రూపకం రచించాడు. సంస్కృత వాఙ్మయ చరిత్రలో విదుషీమణులయిన విజ్జిక, వికటనితంబ, అవంతి

---

[1] అమృతవాణి – బెంగుళూరు; విడిగా 1945 లో ముద్రితము.

సుందరి అనే ముగ్గురు కవయిత్రుల, గాథలను నాటికలుగా రచించి ప్రసారానికి ప్రస్తుత వ్యాసకర్త పంపినాడు; అవి ప్రసారితాలయినాయి.[1]

## ప్రాంతీయ భాషానువాదాలూ - అనుకరణాలూ

ఉపోద్ఘాతంలో సూచించినట్టు, సంస్కృతము దేశభాషా సాహిత్యాలతో సన్నిహిత సంబంధము పెట్టుకొన్నది. ఆధునిక యుగంలో భారతీయ సాహిత్యమును విమర్శనాత్మకంగానూ, చారిత్రకంగానూ, అధ్యయనం చేయడంవల్ల సంస్కృతవేత్తలు ఉద్దీపితులై, తమ ప్రాంతీయ సాహిత్యాల్లో ఉత్తమ రచనలను సంస్కృతంలోకి అనువదించారు. ఈ సంస్కృతానువాదాలు ప్రాచీన నవీన ప్రాంతీయ భాషా సాహిత్యాలకు చేసినవి. ఆధునిక నవలలనూ, కథలనూ భిన్న దేశ భాషలనుంచి సంస్కృతాను వాదముచేసిన విషయము లోగడ చెప్పినాను. ప్రస్తుతము దేశభాషలనుంచి సంస్కృతములో అనువదించబడిన ఖండకావ్యాలూ, ఉపకావ్యాలూ, ఇతర సాహిత్యరచనలూ, పరిశీలన చేద్దాము. తమిళసాహిత్యమునుంచి అతి ప్రాచీనమైన గ్రంథాలు కొన్ని సంస్కృతములోకి వచ్చాయి. శ్రీవైష్ణవ దార్శనికుడయిన వేదాంత దేశికుల అడుగుజాడలనుబట్టి పోయిన కొందరు, సంస్కృతవేత్తలు, దాక్షిణాత్యులు ఆళ్వారుల వైష్ణవసిద్ధాంత ప్రతిపాదకాలయిన గేయాలనుసంస్కృతములోనికి తెచ్చినారు. ఆంధ్రదేశంలో మేదేపల్లి వేంకటరమణాచార్యులుగారు (గీర్వాణ శతగోపసహస్రము), మైసూరువాసులయిన కల్కి లేదా టి. నరసింహ అయ్యంగారు[3] సహస్రగాథారత్నావళి, కాంచీపురవాసులయిన పి. బి. అన్నంగరాచార్యులుగారు[4] వైష్ణవ ప్రబంధాలను కొన్నింటిని పూర్తిగా అనువదించారు. ప్రసిద్ధమయిన తిరుక్కురళును ఇద్దరు సంస్కృతీకరించారు. అప్పావాజపేయి 'సుసీతి

---

[1] అమృతవాణిలో, విడిగా 1946 లో ప్రకటితము

[2] ప్రేక్షణకత్రయీ, మదరాసు 1956

[3] బెంగుళూరు, 1930

[4] కంచి, 1947, 51, 53, 54

కుసుమమాలా' అనే పేరుతో సంస్కృతీకరించినాడు. దానిపై సూక్తి రత్నాకరమనే సంస్కృతవ్యాఖ్య ఇటీవల చక్కగా అనుష్టుభ్ ఛంద స్సుల్లో శంకరసుబ్రహ్మణ్యశాస్త్రి రచించినది. సహృదయలో (XIII) అనువృత్తంగా అచ్చయింది. అదే పత్రికలో కంబరామాయణానికి (XV) ఆస్వాదనాత్మకంగా సమీక్షలూ, తమిళభక్తుడయిన పట్టినత్తారు (13) ను గూర్చిన వ్యాసాలూ అచ్చయినవి. తిరువనంతపుర సంస్కృత కలా శాలలో యస్. నీలకంఠశాస్త్రి సంస్కృతంలో తమిళ కంబరామాయ ణాన్ని శ్లోకరూపంలో అనువదించి 'శ్రీరామచరితమ్' అనే పేరుతో భాగాలుగా ప్రచురించినాడు. కడయక్కుడి సుబ్రహ్మణ్యశాస్త్రి తమి ళములోని ప్రౌఢమూ, నీతిదాయకమున్నూ, అయిన నాలడియారును 'చతుష్పది' అనే పేరుతో సంస్కృతానువాదము చేసినాడు. కేరళంలో నెమ్మారలో పి. నారాయణనాయరు తమిళ మహాకావ్యము 'శిలప్పది కార' మును 'కణ్ణకికోవలమ్' అనే పేరుతో ఆరుసర్గల్లో, సంస్కృత కావ్యంగా అనువదించినాడు (1955 సేలం).

యన్. వేంకటరామశాస్త్రి 'కథాశతకం'లో కథావళి దేశభాషలలో నుంచి స్వీకరించినాడు. (మైసూరు 1898). శేషసూరి సంస్కృతములో 400 సామెతలను చాలావరకు తమిళదేశములోనీ, ఇతర దాక్షిణాత్య ప్రాంతాలలోనీ సేకరించి, అనువదించినాడు. (మైసూ. మహా. సం. కలా. పత్రి 1949) ప్రసిద్ధ తమిళ సాహిత్యవేత్తలనుగూర్చి సంస్కృత గద్యపద్యాల్లో సంక్షిప్తంగా రచనలు చేశారు. అందుకు దృష్టాంతము: బెంగుళూరులో కె. యస్. నాగరాజన్ వైష్ణవభక్తాగణి అయిన ఆండా ళును గురించి (అమృతవాణి 1947) రచించినాడు. వై. మహాలింగ శాస్త్రి 'ద్రావిడార్య సుభాషితస ప్తతిః' అన్న కావ్యంలో అవ్వయారు అనే తమిళవిజ్ఞాని చెప్పిన అమూల్యమైన నీతిపద్యాలను పరి అనువ దించినాడు (తిరువేలంగాడు 1952). దాక్షిణాత్య వాగ్గేయకారకులూ కవులూ తమిళ జానపదగేయాలను ప్రసిద్ధ భక్తిగేయ స్వరసంపుటిని అనుకరిస్తూ, సంస్కృతంలో రచించారు ! - పదవపాటలు, జోలపాటలు, తిరుప్పాగళ్, కుమ్మి, కోలాటపుపాటలు ఇత్యాదులు. ఈ పాటలతో చాలా భాగము వాగ్రూపంగానూ వ్రాతరూపంగానూ భద్రపరచబడి ఉన్నాయి.

కడియక్కుడి సుబ్రహ్మణ్యశాస్త్రి ప్రకటించిన గ్రంథాలలో ఒకదానిలో తమిళ దేశములోని జానపదగేయ ఫణితులను చాలా, కవి వినియోగ పరచుకొన్నాడు. చిట్టిగూడూరులో యస్. టి. జి. వరదాచార్యులుగారు ఆంధ్రభాషలో ప్రసిద్ధమైన వేమన, సుమతి, దాశరథి, కృష్ణ, భాస్కర, కాళహస్తీశ్వర శతకాలకు, సంస్కృతానువాదాలు చేసినారు చిట్టిగూడూరు, మదరాసు 1954, 55, 56. డాక్టర్ గిడుగు వేంకట సీతాపతి తెలుగు భాషలోని కొన్ని చాటుపద్యాలను భరతనాట్యోపయోగ్య ములయిన క్షేత్రయ్య పదాలనూ, గురజాడ అప్పారాయకవి రచించిన 'పూర్ణమ్మ' పాటనూ సంస్కృతములోనికి అనువదించినారు. రాజ మహేంద్రవర యువతీ సంస్కృత కళాశాలలో పండితులయిన వై. మల్లికార్జునరావుగారు తెలుగులో సూరన్న రచించిన కళాపూర్ణో దయ ప్రబంధానికి సంస్కృతంలో వచనానువాదము చేసినారు. కె. యజ్ఞనారాయణ దీక్షితులు అల్లసాని పెద్దనగారి మనుచరిత్ర ప్రబంధ ములో ప్రథమాశ్వాసమును సంస్కృతీకరించినారు.

మలయాళ భాషలో కేరళకవులుగా ప్రసిద్ధులయిన ముగ్గురు ఆధునికులు ఉళ్లూర్ పరమేశ్వరయ్యరు, వల్లత్తోలు నారాయణమీనన్, కుమారన్ ఆశన్, వారి కావ్యాలు, సంస్కృతములోకి ఇ. వి రామన్ నంబూద్రి, యన్. గోపాలపిళ్ళై అనువదించినారు. మలయాళమునుండి [1]సంస్కృతములోకి వచ్చిన [2]అనువాదాలు పేర్కొనదగినవి కొన్ని: చంద్రికా నాటకము (హైదరాబాద 1955), 'కేశవీయం' 'నళిని' అనే ఖండకావ్యాలు. మహారాష్ట్రంలో స్వర్గీయులు సర్వతోముఖ ప్రజ్ఞా వంతులూ, పండితులున్నూ అయిన, యం. ఆర్. తెలాంగ్ రచనలు చాలా లిఖిత ప్రతిరూపములో ఉన్నాయి. వాటిలో జ్ఞానేశ్వరుని పద్య ఖండానికి సంస్కృతానువాదము అచ్చయింది (సం. రత్నాకర, మే 1947). భాగవత సఖారామశాస్త్రి సతారావాసులూ, యం. పి. ఓకా పునహావాసులూ జ్ఞానేశ్వరిని సంస్కృతానువాదము చేశారు. ఓకా

1 మహాకవి కృతయః తిరువనంతపురి 1945, కేరళభాషా వివర్త: 1942.
2 సీతా విచార లహరీ తిరువనంతపురి, 1942.

పండితుల అనువాదమును న్యాయమూర్తులు ఎ. వి. ఖన్విన్‌గారు కొనసాగించినారు. డి. టి. సుక్రికార్ మోరోపంతు రచించిన 'కేకావళి'ని సంస్కృతీకరించారు. (భోర్ 1946). యన్. పి. కేల్కారు రచించిన మహారాష్ట్రభాషలోని 'బలిదానము' అనే నవలను కొల్హాపూరులో లక్కర్‌శాస్త్రి సంస్కృతానువాదము చేసినారు. దాక్షిణాత్య సోదరుల వలె వంగీయ సంస్కృతవేత్తలు పట్టుదలగా సంస్కృత సాహిత్యసృష్టి చేసినారు. 'మేఘనాథవధ' అనే వంగీయ మహాకావ్యం సంస్కృతంలోకి వచ్చింది. (సం. సా. పరి. పత్రిక 1933–34) (నిత్యగోపాల విద్యా వినోదుడు). భాస్కరానందస్వామి చైతన్య మహాప్రభు జీవితానికి సంబంధించిన వంగీయ 'చైతన్య చరితామృతము'ను సంస్కృతంలో అనువదించినారు. (సం. సా. పరి. ప 1954 I భా – వేరే ముద్రణ 1956-57). బంకిమచంద్ర, శరచ్చంద్ర ఛట్టోపాధ్యాయుల ఆఖ్యాయికలు సంస్కృతీకరించినట్టు లోగడ చెప్పినాను. చాలా ఖండకృతులను, వాటితోపాటు రవీంద్రుని లఘు గద్య రచనల్లో కొన్నింటిని పతితకలాల్ దాస్ సంస్కృతంలో పరివర్తనం చేసినారు. 'ఊర్వశీ' 'స్పర్శమణి' 'అభిసారికా', 'అపారదానం', 'నిష్టలోపహారః', 'రాష్ట్రం నః ప్రతిబుధ్యతాం', 'మస్తకవిక్రయః', 'తుచ్ఛక్షతిః' 'స్వర్ణమృగః' ఇవన్నీ మంజూషా (1954–55), 'ప్రతినిధి' (సం. సాహి. ప. పత్రిక. అక్టో 1955), 'పూజార్థినీ' (సం. సా. ప. ప అక్టో. 54) ధీరేంద్రనాథుడు సంస్కృతంలో అనువదించినాడు. 'కచదేవయాని' అనే రవీంద్రుని సంవాదమును యస్. పార్థసారథి సంస్కృతానువాదం చేయగా, దానిని మదరాసు సంస్కృతకలాశాలలో 1924-25 లో ప్రదర్శించినారు. హిందికవితను పట్టుదలగా అనువదించి కృతకృత్యులయినవారు జయపురావాసులు మథురానాథశాస్త్రిగారు. వారు జయపురావైభవం (1947 జయపురం, సాహిత్యవైభవం (జయ 1930), గీతివీధీ (బొంబాయి) అనేకావ్యాలు రచించినవారు. వాటిలో ఛందోగేయరీతులు వ్రజభాష, హిందీ ఉరుదూనుంచి చాలవరకు స్వీకరించినారు. వారి అభిమతం ప్రాంతీయ కావ్య సౌందర్యమును సంస్కృత పండితుడికి తెలియచేయాలని. అయన బిహారీలాల్ రచించిన 'సత్‌సయీ'

అనే సప్తశతిని సంస్కృతీకరించారు. హోషియార్ పురవాసులు జగద్రామశాస్త్రి ప్రస్తుతకాలంలో వ్యవహారంలో ఉన్న ప్రజామోదం పొందిన హిందీగేయ ఫణితులను తన 'సంగీతరామాయణము'లో ఉపయోగించుకొన్నారు. సంస్కృతంలోని 'సూర్యోదయపత్రిక', హిందీలోని ప్రసిద్ధ వ్యాసాలకు సంస్కృతంలో అనువాదాలు ప్రచురిస్తున్నది. విపులానందుడు తులసీదాస కవీంద్రుని ప్రార్థనాగేయాన్ని (అమృతవాణి 1950, కె. తిరువేంకటాచార్య (మైసూరు) తులసీదాసుని 'రామచరితమానసా'న్ని సంస్కృతంలో అనువదించారు. ఇది అముద్రితం. సంస్కృత పత్రికలో (3-4-1956) బొంబాయి గుజరాతీయ మర్మకవయిత్రి అయిన 'నిర్మల' వరపు 'శ్యామ'ను గూర్చిన వ్యాసమూ, రాహుల సాంకృత్యాయనుల 'నిశా' అనేదానికి అనువాదమూ అచ్చయినవి. సాంకృత్యాయనులు క్రీ పూ. 6000 కిందట వోల్గా ఉత్తరతీరాన, ఇండో యూరపీయ పురాతన జీవితాన్ని చిత్రించినవాడు (సంస్కృతం డి. 1957).

ఆధునిక సంస్కృతసారస్వతం సంపన్నము కావడానికి అన్యదేశ భాషాసాహిత్యానువాదాలుకూడా దోహదము చేశాయి. ఆంగ్ల కవిత్వం కొంత సంస్కృతంలో అనువదింపబడిన విషయం ఇతః పూర్వం చెప్పినాను. ఒమార్‌ఖయ్యామ్ రచించిన పారశీకభాషలోని 'రుబయ్యాత్', సంస్కృతవేత్తలనుకూడా పదేపదే ఆకర్షించడం సహజం. 'కపాలకుండలను' సంస్కృతీకరించిన హరిచరణ, విజయనగరవాసులయిన అజ్జాడాదిభట్ల నారాయణదాస మహోదయులున్నూ, ఆ పారశీకకావ్యాన్ని అనువదించిన వారిలో ప్రప్రథములు. అనంతరం అనువదించినవాడు గిరిధరశర్మ (అమరసూక్తి సుధాకరః, జలర్ పత్తన్ 1929); మూడో అనువాదకర్త ఆచార్య యం. ఆర్. రాజగోపాల అయ్యంగార్ (మద్రాసు 1940); నాలుగో అనువాదకుడు పి వి కృష్ణన్‌నాయర్. ఆ రచనపేరు 'మదిరోత్సవః' (తిరుచ్చూరు 1945). ఇటీవల 1956 లో బొంబాయిలో 'భావచషకః' అనే పేరుతో సదాశివ డాంగే సంస్కృతంలో అనువదించాడు. మధ్యప్రాచ్య సాహిత్యానికి కూడా సంస్కృతానువాదాలు వచ్చాయి. వాటిల్లో 'అలీబాబా నఽబై

దొంగల' కథను జి. కె. మోడల్ (లాంగ్‌మన్స్ 1934); అల్లాఉద్దీన్ అద్భుతదీపం' (సహృదయ IV); షేక్‌సాదీ రచించిన 'గులిస్తాన్' 'ప్రసూన వాటికా' అనే అనువాదాన్ని (సం. సా పరి. ప. లో 1923–1924) రామస్వామి, 'పుష్పోద్యానం' అనే పేరుతో రెండు భాగాల్లో గ్రంథరూపంలో ఆర్. వి. గోఖలే అనువదించి ప్రకటించారు. (1935 బెల్గాం). వైదిక సంస్కృతానికి చాలా సన్నిహితంగాఉండే 'అవేస్త' ను సంస్కృతంలో అనువదించడానికి కేవల సంస్కృతవేత్తలు కాక, పార్శీలూ పూనుకొన్నారు. అనువృత్తంగా అర్వాచీన అనువాదాలు 'Collected Samskrit writings of the parsus', ఆధునిక పార్శీరచయితలలో బాషా శాస్త్రవేత్త అయిన డాక్టర్ ఐ. జె. యస్ తారపోరివాలా మంజూషా పత్రికలో అవేస్తమంత్రాలను సంస్కృతీకరించి కొన్ని మచ్చుకు ప్రకటించారు. ప్రసిద్ధ గుజరాతీయకవి, ఎ. యస్. ఖబరదార్ అవేస్తను చాలా సంస్కృతీకరించినాడు. *తన గ్రంథంలో 'New Light on the Gathas of Holy Zarasthushtra'. (బొంబాయి 1951). బౌద్ధానికి అతిసన్నిహితమైన పాలిసాహిత్య చరిత్ర నుండి మహామహోపాధ్యాయ విధుశేఖర భట్టాచార్య 'మిళిందపన్న'ను సంస్కృతంలో పరివర్తనము చేసినారు. (సం. సా. వ. పత్రిక, డిసెం. 1936). మంజూషా పత్రికలో అనువృత్తంగా 'దమ్మపద' కు సంస్కృతానువాదము అచ్చవుతున్నది. (సెప్టెం. 1952). క్రైస్తవ భక్తి గేయాలు, గ్రీక్ భాషనుంచి సామెతలూ ఏర్చి, వాటికి తుల్యమయిన సంస్కృత సామెతలూ అనువాదాలున్నూ ఆర్. ఆన్‌టోయిన్ యస్. జె; కె. సి చటర్జీలు మంజూషా పత్రికలో ప్రకటించారు (సం. 1951, 53) జపానీయ సారస్వతంనుంచి సంస్కృతంలో కొన్ని అనువాదాలు 'మిత్రగోష్ఠి' పత్రికలో ప్రకటితమైనట్టున్నది.

సాహితీపరులయిన సోదరాంగ్ల రచయితల సాహిత్య ప్రావీణ్యమును సంస్కృత రచయితలు సంస్కృతంలో అనువదించారు. ఆంగ్లంలో బి. ఆర్. రాజం అయ్యర్ రచించిన 'Rambles in the Vedanta' అనే రుచికరమైన తత్త్వశాస్త్ర ప్రతి పాదక కథను, వి. శంకర సుబ్రహ్మణ్యశాస్త్రి 'అహోబలీ యస్తాభవితవ్యతయః అనే

పేరుతో సంస్కృతాను వాదము చేశారు. (సహృ. XII). మదరాసులో (అమెమూరు) ఔత్సాహిక నాటకరంగ వ్యవస్థాపకులలో ఒకరైన వి. వి. శ్రీనివాస అయ్యంగారు ఆంగ్లభాషలో అనేక నాటికలు ముదావహంగా రచించారు. వాటిలో ఒకటి సంస్కృతంలో 'దముకుటుంబక్' అనే శీర్షికతో అనువాదమై ఉద్యాన పత్రికలో (Vol 4) అచ్చు పడ్డది. కె. వి కృష్ణస్వామి అయ్యర్ రచించిన 'Uma's Mirror' అన్న ఆంగ్ల పద్య ఖండానికి 'ఉమాదర్శః' అనే సంస్కృతాను వాదాన్ని (బెంగుళూరు 1937) పి వేంకటరామయ్య చేసినాడు. ప్రసిద్ధ హైందవాంగ్ల రచయిత అయిన కె. యస్. వెంకటరమణి రచనల్లో ఒకానొకటి అయిన 'A Day with Sambu' అనే యువజనోపదేశమును వై. మహాలింగశాస్త్రి 'శంభుచర్యోపదేశః' అనే సంస్కృతానువాదము చేశారు (మద్రాసు 1931). శ్రీ అరవిందుల కావ్యరచనల్లో కొన్ని మాత్రమే 'కవితాంజలిః' అనే పేరుతో టి. వి. కపాలిశాస్త్రి అనువదించారు (మద్రాసు 1946).

## జాతీయోద్యమము

జాతీయోద్యమం నిజంగా భారతదేశాన్ని జాగరితము చేసింది; భారతీయాత్మకోసం నవీనాన్వేషణ చేసింది. ఆధునికవిద్యవల్ల సూక్ష్మ సమీక్షాత్మకదృష్టిని అలవరచుకోడంవల్ల భారతేతిహాసాన్ని బాగా చదవడంచేతనూ, భారతీయ పారంపర్యంలో పరమార్థాన్ని నవ్యంగా అలోకనచేయడం సంభవించింది. సంస్కృతాభిజ్ఞుడు ముఖ్యంగా పురాతన భారతీయ వైభవంవైపు దృష్టి మరల్చినాడు. నవ్యాతినవ్యోజ్జీవనం సాధించాలనే గాఢౌత్సుక్యంవల్ల భారతీయ సంస్కృతిలోని పరమ పురుషార్థాలూ, నవనాగరకతలోని భౌతిక స్వరూపస్వభావం, కొత్తమోజుల పెరుగుదల, శీలంలో బలహీనత, పాశ్చాత్యులను అనుకరించే పరప్రత్యయనేయబుద్ధి – వీటన్నింటివల్లా మనసు వెనుకకుమరలగా పునః భారతీయాత్మావలోకనం సంభవించింది. వెంటనే జాతీయత ప్రాముఖ్యం వహించింది. స్వాతంత్ర్యోద్యమం పొడసూపింది. మహానాయకశ్రేణి ఉద్యమాన్ని నడిపించింది. దేశభక్తి, త్యాగశీలము, వచోనైపుణివల్ల నాయ

కులు బుద్ధిమంతులనూ, ప్రజానీకాన్నీ, శిబిరాలు స్థాపించి, సమరం సాగించి ఉత్తరూతలూపినారు. రాజకీయోద్యమాలవల్ల సంస్కృత వేత్తలుకూడా తద్భావోత్తేజితులూ తద్భావ భావితులూ కావడంచేత, వారి రచనల్లో నవజీవచైతన్యం స్పందించింది. నిజంగా నవచైతన్యో ద్దీప్తి సమకాలీన సంస్కృతసాహిత్యంలో ప్రస్ఫుటంగా గోచరిస్తున్నది.

ఈ కోవలోచేరిన ప్రథమసాహిత్యసృష్టి పద్యకవిత. భారతీయమైన ఔన్నత్యాన్ని కవి కలలుకంటూ, దేశము శోచాదర్శిద్రాణమూ, పతనమూ కావడంవల్ల, నిశ్వాసాలువిడుస్తూ, భవిష్యత్తులో జాతీయ పునర్నిర్మా ణావలోకనంచేయడం కవితలో ప్రయత్నం. 'తదతీతంఏవ' (అదంతా గతం, అనే రచనలో అన్నదాచరణ తర్కచూడామణి (సం. చం. సం. 5) భారతీయ వైభవాస్తమయాన్ని స్మరించి విలపించినాడు. మదరాసు నివాసి, పబ్లిక్‌వర్క్సుశాఖ, యం. కె. తాతాచార్య సముద్రతీరాన ఆసీనుడై స్వప్నవిహారంచేస్తూ, భారతదేశీయ సాంస్కృతికోన్నతిని గురించి ఆలోకనంచేస్తాడు; ఆధునికకాలంలో పతనాన్నిచూస్తాడు, తన కావ్యంలో 'భారతీ మనోరథం'లో యస్. టి. జి. వరదాచార్యులుగారు సర్గత్రయాత్మకమైన 'సుమప్రవృత్త' కావ్యంలో గత వైభవానికీ ప్రస్తుత విషాదావస్థకూ వ్యత్యాసాన్ని [1] చిత్రిస్తూ, దిక్చక్రవాళంలో మహాత్ముడు అంధకారాన్ని పటాపంచలు చేస్తున్నట్లు ప్రదర్శించాడు. యం. వి సుబ్రహ్మణ్యయ్యరు దేశభక్తి భావోద్రేకంతో, 25 మందా క్రాంతవృత్తాల్లో అద్భుత భారతీయ సంప్రదాయాల పతనాన్ని స్మరిస్తూ, 'భారత వధూవిషాద' కావ్యంలో విలపిస్తాడు. (సం. సా. ప. ప. 1925-26 కె యస్. కృష్ణమూర్తిశాస్త్రిగారి 'భారతభాగ్యవిపర్యయం' అనే సుదీర్ఘకావ్యంలో ఇదే కథావస్తువు. [2] సహృదయపత్రిక ప్రథమ సంపుటంలో భారతమాతను ఉద్దేశించి చక్కని ఆర్యావృత్తాల్లో, 'భారతీ గీత' అనే కావ్యం ప్రకటితమైంది భారత మాతృస్తవంలేని సంస్కృత పత్రిక అంటూ లేదు. టి. వి. కపాలిశాస్త్రి 'భారతీస్తవం'లో భారత

---

1 చిట్టిగూడూరు 1 మద్రాసు 1937

2 మధుర కాశీలో క్రమశః అచ్చయింది.

మాతృ స్వరూపంలో జగజ్జననీ ప్రతిబింబాన్ని దర్శించినారు. లక్ష్మీ అమ్మాళ్ అనే కవయిత్రి 'భారతీగీత' అనే సర్గత్రయాత్మక కావ్యంలో పురా భారతీయ మహోజ్జ్వల వైభవాన్ని, అస్తమయాన్ని వర్ణిస్తూ, సర్వతోముఖ భారతోద్ధరణకు కుమారులందరూ కంకణము కట్టుకోవలె నని ఉపదేశిస్తున్నది. మోచర్ల రామకృష్ణకవి 'శారదా ప్రసాదము'లో భారతీయ సంస్కృతిని దూషించేవారినిచూచి, తన కలవరపాటు వ్యక్తము చేస్తున్నాడు. పూరీవాసి మహామహోపాధ్యాయ దామోదర శాస్త్రి భారతదేశౌన్నత్యము వర్ణిస్తూ 'భారతగౌరవ' మనే కావ్యము రచించారు.

## ఆధునిక లోకవృత్త ప్రతిబింబము

జాతీయోద్యమ నాయకులకు సంబంధించిన ఇతివృత్తముతో సాహిత్యము బయలుదేరింది. సంస్కృత చంద్రికా పత్రికమొదలు అన్ని పత్రికల్లోనూ నాయకుల జీవితాలు, వారు సాధించిన మహాద్విషయా లున్ను కావ్యరూపంలో ప్రకటితమైనవి. సంస్కృత చంద్రిక పంచమ సంపుటంలో 37 శ్లోకాలలో బాలగంగాధరతిలక్‌గారి అవతరణము వర్ణితమైంది. సహృదయ పత్రికలో గోఖలేమరణాన్నిగూర్చి విషాదాన్ని ప్రకటిస్తూ చేసిన వచన రచన (9, 10) సరోజినీదేవిని గురించి వ్యాస మున్నూ అచ్చయినవి. ఇటీవల లోకమాన్య తిలక్ జయంతులవల్ల నలుగురు రచయితలు సంస్కృతంలో జీవిత చరిత్రలు రచించడానికి ఉత్సాహులయినారు. విద్వాంసుడూ, దేశభక్తుడున్నూ అయిన తిలకు మహాశయుని జీవిత కథను రచించినవారు యం. యస్. అనే, కె. డబ్ల్యు. చితాలే, వాసుదేవశాస్త్రి బగేవడికర్, మధురవాణీ సంపాదకులయిన పండరి నాథాచార్యగలగలిగార్లు. బెంగుళూరు నివాసి శ్రీ నాగరాజన్ దేశభక్తుల జీవితచరిత్రలు 'భారతీయ దేశభక్త చరితమ్' అనే పేరుతో గ్రంథమాలగా ప్రచురించినారు. ఆ జీవితచరిత్రలు తిలక్, ఆండ్రూస్, వివేకానంద, రాధాకృష్ణన ప్రభృతులవి. కురుక్షేత్రంలో 'భిక్షారామ' పండితులు వచనంలో మాళవ్యా, రాజేంద్రప్రసాద్, పటేలు, నెహ్రూల జీవితాలు రచించారు. సంస్కృత పద్యవాణి పత్రికలో కాళీపాదుడు

ప్రసిద్ధ విద్యావేత్తలయిన ఆశుతోష ముఖర్జీగారినిగూర్చి 'ఆశుతోష అవధానము' రచించి ప్రకటించినాడు. వి. సూర్యనారాయణశాస్త్రి ఆంధ్ర పత్రికా సంపాదకులూ, దేశభక్తులూ, కళాపోషకులున్నూ అయిన, కాశీనాథుని నాగేశ్వరరావుగారి జీవిత చరిత్ర రచించినాడు (మదరాసు 1933). లక్ష్మీనారాయణ షణ్భాగే కాంగ్రెసు అధ్యక్షులను వర్ణిస్తూ 'రాష్ట్ర సభాపతి గౌరవ'మని రచించాడు. అందులో ఒక ప్రత్యేక ఖండకావ్యం సుభాస్‌చంద్రబోసునుగూర్చి రచించినాడు. 1935 లో జరిగిన కాంగ్రెసుచూచి జూబిలీ మహోత్సవాన్ని స్మరిస్తూ ఆ గ్రంథరచన చేసినాడు సంస్కృత రత్నాకర పత్రికలో (నవం. 1948) నెహ్రూను గురించి ఒక ఖండకావ్యం ఉన్నది. ఇటీవల నాగపురంలోని యన్. బి. వర్ణేకర్ 'జవాహర్ తరంగిణీ' అనే పద్యశతకం నెహ్రూను గూర్చి ప్రకటించినాడు

రాజకీయప్రవృత్తి. సనాతన మహాత్ముల లక్ష్యాలూ, సంవిధానాలూ సమ్మిళితమైన గాంధీమహాత్ముని వ్యక్తిత్వము సంస్కృత రచయితలను బాగా ఆకర్షించింది. అందుచేత సంస్కృతకవులకు గాంధి నవ్యరామచంద్రుడో, ఆధునికబుద్ధుడో అయి కొత్తగీతల మహాకావ్యాలకూ నాయకుడైనాడు. నవ్యభారతేతిహాసంలో మహాత్ముని సత్యాగ్రహగాథ ఒక అద్భుతాఖ్యాయిక. అది అనేక కావ్యాలకు కథావస్తువు. శ్యామారావు 'సత్యాగ్రహగీత', 'ఉత్తర సత్యాగ్రహగీత' అనే మహాకావ్యరచనలను, ధారావాహికంగా లలితంగా రచించింది. సి. పాండురంగశాస్త్రి 'మధురవాణీ' పత్రికలో 'సత్యాగ్రహకథ' ప్రకటించినాడు. (రోహటక) జజహోరవాసి సత్యదేవ వాసిష్ఠుడు 'సత్యాగ్రహనీతికావ్యం' రచించాడు. తడపత్రీకర్ గాంధీయతత్వ సంగ్రహాన్ని మహాత్మునికి అత్యంతమూ ఉపాదేయమైన భగవద్గీతవలె విరళంగా బాసించేతీరులో, ఉల్లేఖించినాడు. ప్రౌఢ కావ్యమార్గంలో స్వామి భగవదాచార్యులు కాండత్రియాత్మకంగా 'భారత [1] పారిజాతః' 'పారి

1 ద్వితీయ సంపూర్ణ ముద్రణ అహమ్మదాబాదు 1951; చూడు ద్విజేంద్రనాథశాస్త్రి కృత 'స్వరాజ్యవిజయము'.

జాతాపహారః', 'పారిజాతసౌరభః' - భారత కల్పతరువని ద్యోతకము చేసే రచన చేసినాడు. దర్భాంగా వాసులైన పాధుశరణమిశ్రులు 'శ్రీ మద్గాంధీచరితమ్' అనే కావ్యం, ఇరవై సర్గల్లో రచించారు. ఇది వ్రాత ప్రతిగాఉంది. గాంధీయ తత్వవివరణ గ్రంథాల్లో డి. యస్. శర్మగారి 'గాంధీసూత్రాల'ను పేర్కొనక తప్పదు. చిరకాలంనుంచీ ఆదరణ పొందుతున్న సూత్రాలలో రచయిత మహాత్ముని తత్వము నిబద్ధము చేసినాడు. సూత్రాలపై వ్యాఖ్యానప్రాయంగా మహాత్ముని స్వీయ రచనలూ అభిభాషణలూ శర్మగారు ఆంగ్లములోని చేర్చినారు. గాంధీగారిని గురించి, ఉపదేశాలనుగురించి, సంస్కృతపత్రికల్లో, ఖండకావ్యాలు అచ్చయినాయి. కావ్యఖండ సముచ్చయాన్ని 'గాంధీసప్తాహము' అని యస్. కృష్ణభట్టు అమృతవాణి పత్రికలో 1945 లో, ప్రకటించారు. డాక్టరు ఛాబ్రా 'సువర్ణబిందు'వనే కవితా సముచ్చయంలో మహాత్ముణ్ణి వైదికఛందస్సుతో ప్రశంసించడంచేత, ఆయన మహర్షుల పారంపర్యములోనివాడని సూచించినాడు. శ్రీ చింతామణి ద్వారకనాథ దేశముఖ్ ఇటీవలి గాంధిమహాత్ముని భావాలను సంతరించి, 'గాంధీసూక్తి ముక్తావళి'గా ప్రకటించినాడు. ఆయన మహాత్మునిసూక్తులు నూరింటిని ఏరి, వివిధఛందస్సులలో నిబద్ధము చేసినాడు.

స్వాతంత్ర్యసంఘర్షణ కథావస్తువుగాచేసి, కథానికలు వచ్చిన విషయము లోగడ ఉల్లేఖించినాను. ప్రస్తుత వ్యాసరచయిత 'గోవహంవన్న' అనే రైల్వేపాయింట్స్ మనిషిని గురించి స్మారక పద్యకథానకము రచించినాడు[2]. హంవన్న వీరమరణం పొందినాడు; కొందరు తాగుబోతులయిన ఆంగ్లయుద్ధభటుల క్రూరదృష్టికి గురైన, పేదరాలయిన భారత హైందవ స్త్రీ గౌరవం రక్షించబోయి, చనిపోయినాడు. ఈ స్వాతంత్ర్యాపుర్షణ ఇతివృత్తంగా సక్రమమయిన రూపకంగా 'భారత మంగళం' (సం. సా. పరి ప. 1951, విరచితం. ఆ నాటకంలో గణశక్తి అనగా ప్రజానీకపు సంఘటితశక్తికి, చండ జనని, భగవద్గీతాంబ ఉభయపార్శ్వాల పూనిక ఇచ్చినట్లు చూడవచ్చును. గీత ప్రముఖపాత్ర

---

2 అమృతవాణీ 1947: వేరుగా ప్రకటితమైంది.

వహిస్తుంది. మాతృముక్తి పరమప్రయోజనం నాటకంలో. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్యసమరం స్మరిస్తూ, ఇటీవల శతవార్షికోత్సవాలు జరిగినవి. ఇది కథావస్తువుగాచేసి, కొందరు సంస్కృతంలో కావ్య రచన చేశారు. ఉదా: వాసుదేవశాస్త్రి ఒగేవడికర్ వచనంలో 'క్రాంతి యుద్ధ'యు రచించినాడు. క్రాంతివీరులనుగురించి మధురవాణి పత్రికలో 'క్రాంతివీరాణాం అద్భుతకథాః' అనేశీర్షిక అచ్చయింది (మే1957,-

రాజకీయ పరిస్థితులూ, జాతీయప్రాధాన్యంగల సమస్యలూ విచారణచేస్తూ, చాలావ్యాసాలు సంస్కృత పత్రికలో పడ్డవి. సంస్కృత చంద్రికలో 'వైదేశిక - వాణిజ్యం - భారతదేశీయాః ధర్మశ్చ' అనే శీర్షికకింద, పవిత్ర జాతీయాచార వ్యవహారాలనూ, స్వదేశీయ సమస్యనూ మేళవించి, పాశ్చాత్యులు తయారుచేసే వస్తువులను బహిష్కరించాలని, వ్యాసరూపంగా ప్రకటించారు. 'శ్రీ' పత్రికలో (x, iii, iv) 'ఖాదీ' ని గురించిన పద్యాలు అచ్చుపడ్డవి. సం. రత్నాకరపత్రికలో సంస్థానాధీశ్వరులు ప్రజలస్థితీ, రైతులస్థితినీ చక్కబరచాలనీ (1939), ప్రజలకు అధికారాన్ని అప్పగించాలనీ (అక్టో. 1947) వ్యాసాలు అచ్చుపడినవి. సంస్కృత రత్నాకరపత్రికలో (1942) సర్వతోముఖ భారతాభ్యుదయము సాధించేందుకు కర్తవ్యమును 'దేశదాసః' అనే కావ్యం కొద్దిలో ప్రబోధం చేస్తున్నది. ఇటీవల ప్రచలితమవుతున్న వినోబాభావే గారి భూదానోద్యమం 'భూదానచతుః శ్లోకీగీతా' అనే ఖండకావ్యానికి కథావస్తువైంది.

'గాంధీసూత్రా'లు. 'రాష్ట్రస్మృతి' (అహమ్మదాబాదు 1950) వలె గ్రామోద్యమ రచయిత రామారాయలు కొద్దిమాటల్లో సూత్రప్రాయంగా, గద్యరూపంలో, ప్రతి దేశభక్తుడూ జపించవలసిన నైతిక ధర్మాలను నేర్పుగా ఉల్లేఖించినాడు.

స్వాతంత్ర్యోద్యమ సమరయాత్రలకూ, సమావేశాలకూ జాతీయ గేయాలు ఐచ్ఛిక సేవాదళాన్ని, ప్రజానీకాన్ని ఉత్తేజపరచి కార్యోన్ముఖులను చేసేందుకు ఆవశ్యకమైనాయి. కుప్పతిప్పలుగా జాతీయ గేయాలు వచ్చాయి. సంస్కృతంలోనూ కవులు గేయాలు రచించారు. మయూరం విశ్వనాథశాస్త్రి అనే ప్రసిద్ధ దాక్షిణాత్య వాగ్గేయ కారకుడు

అందరికీ అర్థమయ్యే సంస్కృతభాష అవలంబించి 'భారతభజనా' (మద్రాసు 1948) రచించినారు. చాలామంది ప్రజలు గానంచేయ డానికి యోగ్యంగా ఉండడానికి ఔత్తరాహ కర్ణాటక సంగీత సంప్రదాయ సమ్మిశ్రిత గేయఫణితుల్లో, గీతావళిని రచించినారు. మధురానాదశర్మ గారి 'సాహిత్యవైభవ'ములో (దేశగీతిః) జాతీయ గేయాలుకూడా ఉన్నాయి.

స్వాతంత్ర్యోపలబ్ధి సంస్కృత కావ్యరూపంలో ప్రపంచేయడం సంభవించింది. దేవకీనందనశర్మ సంస్కృత రత్నాకరపత్రిక (ఆగ. 1947) లో 'స్వతంత్రభారతము' ప్రకటించినారు. స్వాతంత్ర్య సంపా దనానంతరం ప్రథమ వార్షికోత్సవ సందర్భంలో 'స్వరాజ్యకేతువు' అనే పేరుతో మద్రాసులో హిందూపత్రికలో ప్రస్తుత వ్యాసకర్త ప్రక టించినాడు. కున్హన్‌రాజా అడయారు గ్రంథాలయపత్రికలో (ఫిబ 1950) 'భారతప్రశస్తి'ని ప్రకటించినాడు. బెంగుళూరునివాసి యం. రామకృష్ణభట్టు రచించిన 'స్వాతంత్ర్యజ్యోతి' పేర్కొనదగింది. పండిత ప్రభుదత్తశాస్త్రిగారు జాతీయపతాక చరఖాలను గురించి కవిత్వం చెప్పినారు.

గాంధీమహాత్ముని విషాదాంతము సహజంగా విషాదకావ్యాలకూ దీర్ఘకావ్యాలకున్నూ కథావస్తువైంది. ప్రస్తుత వ్యాసరచయిత వేదాంత కేసరిలో (మద్రాసు 1948, వేరేకూడా) 'మహాత్ము'ణ్ణిగూర్చి రచించి నాడు అమరచంద్రుడు 'మహాత్ము'ణ్ణిగూర్చి సంస్కృత సాహిత్య పరిషత్ పత్రికలో (ఫి. 1948) వ్రాసినాడు. సుధాకరుడు సంస్కృత రత్నాకర పత్రికలో (ఫి. 1948, 'హావిశ్వవంద్యగాంధీ' అనే కవిత ప్రకటించాడు. కె. యల్. వి. శాస్త్రి 'మహాత్మవిజయము'ను (పాల ఘాట్ 1949), జి. సి. ఝాలా, శ్రద్ధాంజలిః,[1] వి. నారాయణనాయర్ 'మహాత్మ నిర్వాణము'[2] న్నూ, బదరీనాథఝా 'శ్లోక శోక శతక ము'ను రచించారు. శ్లోకశతకంలో కవి భారతజాతికి జనకు డయిన

---

1 వందేమాతరంలో - సుషమా 1955 అన్న కావ్యసంపుటిలో.

2 తిరుచ్చూర్ 1954 స్వీయ వ్యాఖ్యతో.

౩మహాత్ముని మరణంవల్ల, యావద్భారతదేశంలో అలముకొన్న అంధకారాన్ని, ప్రజకు సంభవించిన అపారనష్టాన్ని, మహాత్ముడు మన కుపదేశించిన ఆదర్శాలనూ, నాతిసంక్షిప్తంగా వాతి విపులంగా చిత్రించినాడు.

డాక్టరు కున్హన్‌రాజా ప్రోద్బలంవల్ల స్వతంత్రభారత రాజ్యాంగ సూత్రాలకు సంస్కృతానువాదంవచ్చింది. ఆయన రాజ్యాంగసూత్రాలలోని కొన్ని ప్రకరణాలకు సంస్కృతానువాద ప్రతిని చిత్తును సిద్ధము చేసినారు. 'భారత రాష్ట్రసంఘటనా' అనే గ్రంథరూపంలో ఈ క్షేత్రంలో మరొకకృషి జరిగింది. ప్రభుత్వ కార్యవర్గము ఈ కార్యాన్ని తలపెట్టకముందు, విజయవాడలో అధివక్తగాఉన్న జి కృష్ణమూర్తి గారు రాజ్యాంగరచనను సంస్కృతములో అనువదించినారు. రాజ్యాంగ రచనా పరిషత్తువారిచే 8-1-1949 వరకు ఆమోదముపొందిన రాజ్యాంగ సూత్రాలలో ప్రకరణాలను సంస్కృతీకరించారు.

స్వాతంత్ర్యప్రాప్తి తరువాత కాలంలోని రాజకీయఘటనలను అనగా కాశ్మీరంలో నాటకీయధోరణిలో పరిస్థితులు ఆరంభమై, షేక్ అబ్దుల్లా కారాగారబద్ధుడయ్యే పర్యంతం కథావస్తువుగాచేసి, యస్ భీమభట్టు 'కాశ్మీర సంధానసముద్యమ' నాటకము రచించినాడు (అమృతవాణి. బెంగు. X-XII '52-53').

రచయితలు సంస్కృత పత్రికల్లో స్వతంత్రభారత సమస్యలు చాలా చర్చచేస్తున్నారు. కాంగ్రెసువారి పాలనలో లోపాలు, అవినీతి, చీకటిబజారు వ్యవహారం, ఇతరదోషాలు, దేశీయవైదుష్య సంస్కృతుల యెడల నిరాదరణ-ఇవన్నీ 'స్వాతంత్ర్యాభాస' అనే పద్యఖండంలో కవి మనోవిచారం ప్రకటించాడు. ఈ ఖండకావ్యమును సంస్కృత భవితవ్యపత్రికలో (21-౬-1954) పి. కర్మాల్కర్‌శాస్త్రి ప్రచురించినాడు. సంస్కృతమూ దానికి ప్రస్తుతము పట్టిన దురవస్థా అందుకని ఇతివృత్తము విజ్ఞాన చింతామణి పత్రికలో సంస్కృతానికి ఒకవైపు ఆంగ్లమువల్ల, మరొకవైపు దేశభాషలవల్ల సంభవించిన దుస్థితిని గురించి రూపకము ముద్రితమైంది. ఇటువంటినాటకాలు ఇంకా వస్తూనే

౩ దర్భాంగా 1953

ఉన్నాయి. 5 అంకాల్లో సంస్కృతహిందీభాషలు మిళితముచేసి, ప్రభు దత్తశాస్త్రి (ఢిల్లీ 1942) 'సంస్కృత వాగ్విజయ' నాటకం రచించి నాడు. కాశీ కృష్ణాచార్యులుగారు 'భారతీ సప్తకత్రయాన్ని', ఆర్. వి. కృష్ణమాచార్యులుగారు (కుంభకోణం 1920) 'వాణీవిలాపా'న్ని, సంస్కృతానికి పట్టిన దైన్యాన్ని గురించి, సంస్కృత కావ్యధోరణిలో వాపోయినారు. ఏతాదృశకావ్యాలు పత్రికల్లో చాలావచ్చాయి.

సంస్కృత విశ్వదృష్టి ప్రస్తుతం బాయోత్కంఠముగా ఏకాగ్రతతో సాహిత్య అకాదెమీ మీదనూ, సంస్కృత పరిషత్తువారి [1] ఆధ్వర్యాన ఏర్పడిన సంస్కృత కార్యవర్గముమీదనూ నిలిచింది.

ఈ సింహావలోకనంవల్ల సంస్కృతం నిద్రాణమై ఉండలేదనీ, ప్రాచీనుల ప్రౌఢమహాకావ్యమార్గం అనుసరిస్తూ మాత్రమే కావ్యరచన చేయడంలేదనీ, స్పష్టమవుతుంది. పరివర్తన శీలమయిన ప్రపంచంలో సంస్కృతాభిజ్ఞులుకూడా తమ పాత్ర నిర్వహిస్తూ, తమరచనలలో సమ కాలిక లోకవృత్తం ప్రతిబింబింప చేస్తున్నారు. సంస్కృతవేత్తలు లోక వ్యవహారంవల్ల ప్రేరితులై విమర్శిస్తున్నారు; ఉన్నతాశాసౌధాలు నిర్మించుకొంటూనే ఉన్నారు.

## సంస్కృతము - భవిష్యత్తు

సంస్కృతవేత్తలు ప్రాచీన జ్ఞానభాండారమును, అర్వాచీన కళా త్మక నిర్మాణాలనూ, కేవలం భద్రముచేసుకోడమేకాక సంస్కృతాన్ని జీవద్భాషగా చేయడానికి, మహాకృషి చేస్తున్నారు. ఏ. సర్. విలియం జోన్సు, మోక్షమూలర్ చేసిన పరిశీలనలనో, పురావస్తు శోధనలనో, ప్రాచీన వైభవోజ్జ్వల దశను సంస్తుతించడమో, పునఃపునః ఉద్ఘాటనం చేయడం వల్లనో జీవభాషగా సంస్కృతానికి గౌరవం రాదని విజ్ఞులు గ్రహించినారు. సమకాలికలోకంలో వ్యవహరిస్తూ, స్వతంత్ర సృష్టి, స్వతంత్ర ప్రవృత్తిఉన్నప్పుడే, భాషకు గౌరవం లభిస్తుంది. పండితుడి

---

1 ఈ కమీషన్ వారి రిపోర్టు అచ్చవుతున్నది. ప్రభుత్వం దాని శిఫార్సులు పరిశీలిస్తున్నది.

తోపాటు ఆంగ్లవిద్యనేర్చిన సంస్కృతాభిజ్ఞులు కూడా, ప్రస్తుతం స్వేచ్ఛగా సంస్కృతంలో సంభాషణ చేస్తున్నాడు, వ్రాస్తున్నాడు. విశ్వవిద్యాలయ స్థాయిలోనూ, పోస్టుగ్రాడ్యుయేట్ డిగ్రీ పరీక్షల్లో, ప్రశ్నపత్రాల సమాధానాలూ, పరిశోధక వ్యాసాలున్నూ, సంస్కృతంలోనే వ్రాస్తున్నారు. సమావేశాల్లో సంస్కృతం ధారాళంగా ప్రయుక్త మవుతూనే ఉన్నది. సంస్కృతము అభ్యసించడానికి కష్టమైనభాష అనే వాడుక లోకంలో ఉంటున్నది కనుక ఆ అపోహను పోగొట్టేనిమిత్తం సంస్కృతాన్ని సరళము చేయడానికి, బోధనాపద్ధతిని సంస్కరించడానికీ, కృషిజరుగుతూ ఉన్నది. చాలా సంస్కృత గ్రంథాలూ, కరపత్రాలూ, సంస్కృత బోధనా విధానం గురించి అచ్చు వడ్డవి. లోగడ జనసంఖ్యను తేల్చేటప్పుడు సంస్కృతము మాతృభాషగాగల ప్రజలు చాలామంది ఉన్నారని తేలింది. లౌకిక ప్రవృత్తిలో మగ్నులవుతున్న ప్రజానాయకులు, కేంద్ర ప్రభుత్వంలో లోగడ ఆర్థిక మంత్రి వంటివారుకూడా, సంస్కృతంలో స్వతంత్రంగా సాహిత్య సృష్టిచేసే కళాప్రావీణ్యమును పరిపుష్టము చేసుకొంటున్నారు.

పాశ్చాత్య సాహిత్య భావ స్వరూప ప్రభావం, ప్రాంతీయ సాహిత్యాలతో సాన్నిహిత్యము పునః అధికము చేసుకోడం, సమకాలిక భారతీయ లోకవృత్తం ప్రతిబింబించడం, ఆదర్శాలు మహో కాంక్షలతో ఉజ్జ్వలతలూగుతున్న ఆధునిక జాతీయ జీవితంవల్ల ప్రభావితమూ, స్పందితమూ కావడమే సంస్కృతంలోని నవనవోన్మేష ప్రధాన లక్షణము. సంస్కృతం విస్తృతము కావడములో ప్రధానంగా కొన్ని లక్షణాలు అనుస్యూతముగా ఉండవలసినట్లు గోచరించాయి. తక్కిన భారతీయ భాషలలాగ సంస్కృతం కూడా, కొంత ఆంగ్లవైదేశిక పద జాలాన్ని గ్రహించక తప్పదు. సంస్కృతంలో నవ్య రచయితలు మృదువుగా, సుందరంగా, శ్రవణ సుఖంగా, ఉండే శబ్ద జాలమును సృష్టిచేసుకోవాలి. అనుకూలమైన శైలి అవలంబించాలి. సంస్కృత పారంపర్యంలో శాస్త్ర పారిభాషిక సారస్వతం చాలా ఉండటమేకాక, శబ్ద నిర్మాణానికి తులలేని వ్యుత్పత్తి బాహుళ్యం అపారంగాగల ఆధారాలవల్ల, వినూత్న శబ్దాలు సృష్టి చేసుకోవాలి. ఔత్తరాహుల సంస్కృత

పత్రికల్లో నూత్న శబ్దసృష్టి చాలా మొరటుగా వుంటున్నది. అందుకు ఉదాహరణం చూడండి:— 'ప్రభుత్వము యొక్క' అన్న పదానికి 'సర్కారస్య', 'కార్డు'కు కరడః, 'బిల్లు'కు 'బిలమ్' వంటి శబ్దాలు విసర్జనీయాలు. తుల్యార్థదాయక శబ్దాలను, మోటుగా, సృజించుకొంటున్నవాటిని సంస్కృత పత్రికలలోని వ్యాసాలలో చూడవచ్చును. ఉదా:— 'చీకటి బజారు'కు 'కృష్ణాపణము', ఉన్నత విద్యకు 'ఉచ్చ శిక్షణ', అంటించని 'కవరు'కు 'అనావృత పత్ర' మనీ, ఒకదానిలో మరొకటి లీనం కావడానికి 'విలీనీకరణ', అంతకంటె మంచి పర్యాయ పదాలు సృష్టించ వచ్చును. ప్రాంతీయ భాషలు దేశంలో భిన్న ప్రాంతాల్లో శబ్ద పరిణామంలో విశిష్టత కలిగినవి ఉన్నాయి. ఆ ప్రాంతీయ బాషల్లో సంస్కృత తద్భవములూ, తత్సమ శబ్దాలూ భిన్నభిన్నంగా ఉన్నాయి. ఆశబ్దపు నుడికారమూ ప్రయోగమూ గమనించి, ప్రమాణీకరించవలసి ఉంటుంది. భారతదేశంలో ఎన్నో ప్రదేశనామాలూ, 'ఇండియా' అనే శబ్దమునూ ఉపయోగించకూడదు. వాటిని సంస్కృతములో ఎత్తి వ్రాసేటప్పుడు బ్రిటీషువారు ప్రచారము చేసిన శబ్దాల దుష్టవికృతులు వాడకూడదు' ఆంగ్లంలో వాడుకలో ఉన్న ప్రదేశనామాలను కనీసం ఒక్క దాన్నయినా, ఐరోపాఖండ వాసులు అదే తీరుగా ఉచ్చారణ చేయరు, వ్రాయరు ఆంగ్ల వికృతి రూపాలను తీసుకొని సంస్కృత ప్రత్యయాలు వాటికి జోడించి విభక్తులు తగిలిస్తే, చాలారోతగా ఉంటుంది. ఇవి వర్జించాలి.

తమ తమ మాతృభాషల ప్రభావంవల్ల చాలామంది ఔత్తరాహులయిన సంస్కృత వేత్తలు శుద్ధమైన అనుష్టుభ్ఛందోగతి తీసుకొని రాలేకపోతున్నారు: అనుష్టుప్పులో వీలులేనిచోట, సంయుక్తాక్షర ప్రయోగమువల్ల గణభంగ మవుతుందని గమనించరు, ద్వితీయ పాదాంతములోనే హ్రస్వాక్షరాన్ని (లఘువును) గురువుగా పరిగణించవచ్చుననే సంగతి గమనించరు; ద్వితీయ పాదాంతములో అక్షరాలను మాత్రమే తర్వాతిపాదంలో అక్షరంతో సంధించడం అవసరమనే మాట, గమనించరు. సంస్కృతకృషి గాఢంగాచేస్తే పరిశుద్ధమైనది ఏదో చెవికి తెలుస్తుంది. సంస్కృత విద్యావ్యాప్తి మవిశాలము కానప్పుడు,

అధ్యయనము తీవ్రముకానప్పుడు. వ్యాకరణ దోషాలుకూడా విస్తృత సాహిత్య ప్రవృత్తిలో చేరుతవి. కాని ఆశ్చర్యమేమంటే చాలామంది రచయితలు శుద్ధంగానే రచనలు చేస్తున్నారు. సరళమైన ధారావాహిక మైన వచనశైలి వృద్ధిచెందుతూఉన్నది. అది నిజంగా లాభమే. అయితే మడికారము, పదములకూర్పు, అన్వయములో కాస్తోకూస్తో, ఆంగ్ల వాసన కొట్టకతప్పదు. అయితే భాషాస్వరూప స్వభావాలనుగ్రహించి, తదనుకూలంగా రచనచేయాలి. భట్టబాణునికి పూర్వకాలంలోనూ, తొల్లింటి భాష్యరచనాకాలంలోను, దృశ్యకావ్యారంభకాలంలోనూ, పంచ తంత్రాది కథానక సారస్వతసృష్టి జరిగినప్పుడూ, భావగర్భిత పదజాలం ఉండేది. అటువంటి క్లిష్టాన్వయ రహితమైన భాషాశైలిని ప్రస్తుతం మనం పునరుద్ధరించాలి. సాహిత్య ప్రక్రియలలో ఖండకావ్యం, కథ. పరికథ, ఖండకథలు - నాటికానాటకాలూ, వ్యాసము, పరిశోధనాత్మక విచక్షణా త్మక వ్యాసమూ. - వీటన్నింటికి ప్రాచీనగ్రంథాలలో ప్రాతినిధ్యము, వహించే రచనలున్నవి. నేటివి వాటితో బాగుగా కలిసిపోయేటట్లు చేయ డము, తెలికరూపకంలో దృశ్యాలు అనే విభజన ప్రవేశపెట్టడం పాశ్చాత్య నాటకాలనుంచి ఎరువుతెచ్చిన గొప్ప నవ్యకల్పన ఏమీకాదు. అలాంటి లక్షణాలు సంస్కృతనాటకములోని సామాన్యమైన ఆకార ప్రకారంలో ఇమిడిపోయేలాగ చేసుకోవచ్చును. సంస్కృత నాటకాన్ని నవ్యముచేయడం ఆవశ్యకం. అందుకుగాను నాటకంలో వాగ్బాహు ళ్యము తగ్గించి, సజీవ పాత్రోన్మీలనచేసి, కథా సంవిధానంలో నటనకు అవకాశము ఇతోధికంగా కల్పించినట్లయితే సంస్కృతనాటకం విశిష్ట సంవిధానంతో, లాక్షణికంగా, దివ్యంగా, ఉంటుందని మనం మరిచి పోరాదు. పాశ్చాత్యులే విషాదాంత నాటకలక్షణం పురాతనమైన దాన్ని మార్పు చేసుకొంటూవుంటే, టి. యస్. ఇలియట్‌వంటి విమర్శకుడు, నాటకప్రయోజనం భరత ఆనందవర్ధనాదులవలె సిద్ధాంతము చేస్తున్న ప్పుడు, సంస్కృతరచయితలు, పాశ్చాత్యులు చుంబించి విడిచిన, సాహిత్యప్రక్రియలనే అనుకరించడానికి పూర్వము, క్షణం విదానించి యోచించుకోవాలి. సాహిత్య శిల్పప్రావీణ్యానికి కావలసిన పరమార్థం అవగాహనచేసుకొని, జీర్ణించుకొని, కాళిదాసుచూపిన ఒరవడిని అనుస

రిస్తేచాలు. ప్రాచీనమూ నవ్యమూ అవేదాన్నిబట్టి సాహిత్యానికి గణ్యత రాదు. స్వతస్సిద్ధంగా రచనలోనిగుణమే ఆస్వాదనీయం అవుతుంది. శక్తిభద్రుడు చెప్పినట్లు గుణము గణ్యము, కాని దాని అవిర్భావమూలము గురించిన ప్రసక్తే ఉండదు. సంస్కృతము సాహిత్యసృష్టికి అనుకూలమైనభాషగా ఉద్ధరించాలి. ప్రాచీన సాహిత్యానికి నవ్య సాహిత్య సాధనాఫలముకూడా చేర్చాలి.

# సింధీ సాహిత్యము

యల్. హెచ్. అజ్వానీ

## భాష

డాక్టర్ ట్రంప్ తన వ్యాకరణంలో (1872) పరిశీలించినట్లు, సింధీభాష 'కేవల సంస్కృత సంబంధి భాష. ఉత్తర భారతప్రాంతీయ భాషల కన్న సింధీభాష వైదేశిక ప్రభావానికి దూరమై స్వతంత్రమైనది. ప్రాచీన ప్రాకృత వైయ్యాకరణులు అపభ్రంశమును ప్రాకృతాలలో అతినిమ్న మైన భాషగా తలచడానికి కారణాలుండవచ్చును. ఆ అపభ్రంశ భాష నుండి ఆధునిక సింధీభాష ఉద్భవించింది. ఈ సింధీ భాషను సోదర భాషలతో పోల్చిచూస్తే, వ్యాకరణరీత్యా, వాటిల్లో అగ్రస్థానం ఇవ్వవలసి ఉంటుంది.'[1] ఆ విద్వాంసునికన్న పూర్వమే కెప్టెన్ జార్జిస్టాక్ సింధీ వ్యాకరణము రచించినాడు. ఆయన సింధీభాష 'కేవలము విదూషకు లకు తగిన'దనే వారి ప్రయత్నాన్ని గర్హించినాడు. 'సింధీభాష అన్య భాషలకన్న భాషాశాస్త్రవేత్తకు అధికతరమైన ఉత్సాహాన్ని ఇస్తుంది. సర్వనామాలకు బదులు, పదాలకు అంత్యప్రత్యయాలను చేర్చేఅలవాటు, వాటిని ఉపసర్గలు ఆకాంక్ష చేయడమూ, సక్రమమైన కర్మణి ప్రయోగ రూపము, పురుషభేదములేని క్రియాప్రయోగము, ద్విరుక్తణి జంత క్రియలు, మొదలైనవి నేర్చుకొనేవాడు, అన్యభారతీయ భాషలకన్న సింధిని విశిష్ట సౌందర్య సమన్వితమైన భాషగా, గమనిస్తాడు.[2] ప్రస్తు తము వ్యవహారంలో ఉన్న సింధీలిపిని బ్రిటీషు పాలకులు ఒక శతా బ్దము కిందట నిర్మించినారు. ఆ భాషాలిపి అరబ్బీవలె ఉండడంచేత,

---

[1] పీఠిక, పుట 1.

[2] భేరుమల్ మిహిర్‌చంద్-సింధీ భాషావ్యాకరణము (1956) పుట 77.

అది సంస్కృతోద్భవమనే విషయము గుప్తమైంది. ఆ భాష స్వతంత్ర భారతీయ భాషలకు మూలమైన సర్వప్రాకృతాలకన్న అగ్రతమమైనది. ఒకముసల్మాను మౌల్వీ. అబ్దుల్‌కరీం సాండెలో ఇటీవల తాను ప్రకటించిన 'తహో ఖిక్‌లుఘత్ సింధీ' (1955) అనే గ్రంథంలో సింధీ పదాలు చాలాభాగము సంస్కృతోద్భవములని వ్రాసినాడు. అయినప్పటికీ కొన్నివేలపదాలు పారశీక, అరబ్బీ భాషలనుంచి వచ్చి సింధిలో చేరినవి. చాలా పదాలు ద్రావిడ, ప్రాగార్య భాషలనుండి ఉత్పన్నమైనవి. క్రీ శ. 712 లో ముసల్మానుల సమరధాటికి భారతదేశంలో గురిఅయినది మొట్టమొదట సింధురాష్ట్రమే. ఆ దండయాత్రకు పూర్వమే సింధురాష్ట్రము యవన, పారశీక, సిరియా, అఫ్ఘనిస్తాన్ సేనల ధాటికి కూడా గురిఅయింది. సింధువాసుల నాళాల్లో అనేకజాతుల రక్తమున్నది. వారికి అస్పృశ్యతలేదు. విదేశయాత్రలు నిషిద్ధములుకావు. సింధువర్తకులు కొన్నిశతాబ్దాలు మరుభూములుదాటి, సముద్రాలు తరించి, వీఅన్య భారతీయుడూ కనబడని, సైనిక శిబిర సమీపస్థావరాల్లో ఏకాంతంగా నిలవతొక్కుకొన్నారు. సహజంగా వారి భాష అనేక వైదేశిక భాషా మూలములనుండి వచ్చిన పదజాలంతో సంపన్నమైంది.

చరిత్ర కందినంతవరకు సింధువాసులు నాగరకులే అని జగత్ప్రసిద్ధము. ఆ నాగరకత చిహ్నములు సింధీభాషలోనూ సాహిత్యములోనూ నిలిచి ఉండవని భావించడము సహజమే. కాని సింధుచరిత్ర మొహెంజదారోకథ పునఃపునరావృత్తము కావడముగానే ఉన్నది. గతించిన ఒకనాగరకత చిహ్నములు దిబ్బలలో పూడిపోవడమూ, ఆ దిబ్బల మీదనే ఇంకొక కొత్త నాగరకత చిహ్నములు పూడిన దిబ్బలు వేరుకొనడమూ జరుగుతూ ఉన్నది. ఈ విధంగా దిబ్బలమీద దిబ్బలు వేరుకొనడమే లక్షణముగా ఉన్నందున, ఆ నాగరకతల చిహ్నాలతో ఒక్కరాయిగాని, ఒక్కశిల్పఖండముకాని, ఒక్కచిత్తరువుకాని, ఒక్కకావ్యముకాని మిగిలి ఉండక పోవడమే సంభవిస్తున్నది — ఏదో అదృష్టవశాన, వీరాభాలదాస బెనర్జీవంటివాడో, ఎన్నోశతాబ్దాల అనంతరం, పైపొరలు త్రవ్వించి లోతుకుపోయి విస్మృతమైన ప్రాచీన వాగరికతాచిహ్నాలు కొన్నిబయలుపెట్టేవరకూ! తరుచుగా తన ప్రవాహగతులనూ, తీరా

లనూ, గర్భాలనూ మారుస్తున్న సింధునదియే ఈ 'మరుభూమి విజృంభణము' అనదగినదానికి మూలకారణము.

## కవిత్వము షాహ్ - అతని అనుయాయులు

పదిహేనో శతాబ్దాంతం వరకూ సింధీసాహిత్యంలో ప్రామాణిక రచయిత గోచరించక పోవడంలో ఆశ్చర్యంలేదు. అరబ్బీ పాలనలో ఏవో చాటు పద్యాలవంటివి, 'దోదోచనేసర్' వంటి గాథలు, పద్య ప్రహేళికలు, మామూలూ జోస్యాలవంటివి, యుగారంభంలో జనపదాల్లో వ్యవహారంలో ఉండేవి. అయితే మొదటిసారి సింధీకవిత్వం లిఖిత రూపంలో 15వ శతాబ్దాంతములో 'కాజీకజన్' పద్యాలుగా దోహాఛందంలో అవతరించింది. సింధీకవిత్వంలో ఒకలక్షణం విశదంగా గోచరిస్తుంది. 'ప్రియాముఖ వీక్షణము' (అనగా అపరోక్ష బ్రహ్మానుభవము) లేకుండా బాహిరమైన వైదుష్యమూ, భక్తివంటి శక్తులు మహాసముద్ర జలచరరాక్షసులు సాధకుణ్ణి నాశనము చేయాలని దిగలాగివేస్తాయి. అధఃపాతాళానికి; కాజీకజన్‌కవి కృతజ్ఞతా పూర్వకంగా మానసిక జడత్వమునుంచి తనను మేలుకొలిపిన ఒకానొక యోగిని స్మరించినాడు. అందుచేత ముఖ్యమైన సింధీకవితా లక్షణానికి అద్భుతమయిన దృష్టాంతము గోచరిస్తున్నది. హైందవ తత్త్వము, ముసల్మాను విశ్వాసమనే ప్రవాహద్వయము మిళితమై పొంగిపొరలి సూఫీకవితగా జనప్రీతిలో రూపొందినది.

తొలిసారిగా కాజీకజన్ కవితలో ఆధ్యాత్మిక జాగృతివల్ల ఒకానొక సంస్కారము ఏర్పడింది. ఆ ఆధ్యాత్మిక జాగృతికి కారణము భారత దేశంలో కబీరు, చైతన్య, నానకు, తుకారాములవంటి దైవోన్మత్తుల భక్త్యుద్యమము సింధుదేశంలో ఆ ఉద్యమం భీత్‌వాసి అయిన షాహ్ అబ్దుల్ లతీఫ్ (1689-1752)అనే కవీశ్వరునివల్ల ఔన్నత్యము ప్రాప్తించింది. ఆయన 'రిసాలో' అనే కావ్యములు ప్రపంచ సాహితీమణులు. అవి సింధు వాసుల అమూల్య సాహిత్య పారంపర్యం షాహ్ అబ్దుల్ లతీఫ్, అతనిపూర్వులున్నూ, ముఖ్యంగా అతని ముత్తాత షాహ్ అబ్దుల్

కరీంబుర్రీ (1538-1623) రచించిన తాత్త్విక కవితను తన రిసాలోలో చేర్చుకొన్నాడు.

షాహ అబ్దుల్ లతీఫ్‌యొక్క నామైకదేశము షాహ, అనగా రాజు. షాహ్ ప్రకృతి కవి, కథకుడు, మర్మయోగిన్నీ. అన్నీ కలిపి వెరశి ఆయన. ఆయన రచించిన సూరాలు అనగా గేయాధ్యాయాలులో సింధు ప్రాంత ప్రజానీకం మహావాహిని, బెస్తవాళ్ళు, సమీపమరుభూమి, ఒంటెను నడిపేచోదకుడు, ప్రభుప్రాసాదశిఖరము, వల్లీవనితలు, అందరు గుమిగూడే ఊరినూయి, మందిరోద్యానంలో భర్తృదారిక, (పారశీక) సింధుశాఖకు తరలివెళ్ళే ముత్యాల వర్తకుడు, మగ్గందగ్గిర సాలెవాడు, చక్రము దగ్గర కులాలుడు, వానకారులో మురిసిపోయే రైతు, ఆయుధాలకోసం ఎగసిపడే యోధుడూ గోచరిస్తారు. ఈ దృశ్యాల చుట్టూ కవి సింధీయ నాయికలను గాథలలో సృష్టిచేస్తాడు. ఆ నాయికలు ఉదాత్తరమణీయంగా కరుణారస భరితంగా ఉంటారు. అతడు తన సుయిన్, మరుయిన్, సుహ్నిన్, నూరిన్, లైలాన్, మూమక్స్ అనే కల్పనలతో నాయికలనేగాని నాయకులను సృష్టిచేయలేదు. అని పేరుపడ్డ కవిరాజుతో నేస్తము కడతాడు. షాహ్ రచించిన గాథలు గాఢతాత్త్విక విశిష్టాలు. షాహ్ కవీశ్వరుడు మరుభూమిలో కవితా మధుర స్వరాలతో ఒకానొకని శ్రేయసానంద స్వప్న రచన చేయగా, అందులో భౌతికము విలీనముకాగా, ప్రేమికుడు ప్రేమ, ప్రియ అనే త్రిపుటి భావమై, చివరకు నానాత్వ పరివర్తనాలుపోగా శేషించే ఏకాకృతిగా పర్యవసిస్తున్నది. షాహ్‌కవి సరళ పదములవల్ల కొందరు వైదేశికులు భ్రమపడి ఆయన ఏదో స్వల్పకవి అని భావించినారు. సింధువాసులకు షాహకవి విలువ తెలుసును. వారాయనను తులసీదాస, సూరదాస, రూమీ, హాఫీజ్‌వంటి ప్రవీణ గేయకవి కోటిలో, భక్త మర్మయోగకవి శ్రేణిలో ఉంచినారు ఆయన వారికి అవిచ్ఛిన్న భావోద్దీపనానికి, రుచిరానంద స్వచ్ఛతకూ, తరిగిపోని మహానిధానము.

షాహ్ కవీశ్వరునితోపాటు అమరకవులిద్దరూ, మొత్తం కవిత్రయం సింధీసాహిత్యాకాశములో ఉజ్జ్వల తారాగణం. సచల్‌కవి (1739-1826) గృహనామం సర్‌మస్త్. అనగా 'కైపెక్కిన వాడని' అర్థము.

సామీకవి (1743–1850) తన గురువుగారి పేరుతో స్వామిగా పిలవ బడుతున్నాడు. ఈ కవిద్వయంతోకూడా సమానులు ఎవ్వరూలేరు. సచలకవి మనసు ఏకమార్గగామి. ఆయన ప్రతిభ భావగేయ కవిగా ప్రసిద్ధము. ఆయనకు ఏ గాథాలేదు చెప్పడానికి, ఏదృశ్యమూలేదు. కల్పించడానికి. ఆ కవీశ్వరుని అంతఃకరణము ప్రాణేశ్వరీ సాన్నిధ్యము వల్ల పూర్తిగా ఉన్మత్తము కావడముచేత ప్రాపంచిక విషయ భావనే లేదాయనకు. నైమిత్తిక కర్మకూపము ఆయన దృష్టిలో అర్థరహితం. ఆయనచూపు గవాక్షము పొంతమున్న సౌందర్యైక మూర్తిపై నిలిచి నప్పుడు ఆయనకు ప్రార్థనావశ్యకతకాని అధ్యయనావసరం కానీ ఏమున్నది? సచల కవీశ్వరుని కాఫీ ఛందోమాధుర్యం, ఓజస్సూ ఆనందపారవశ్యం కలిగిస్తాయి కనుక అవి ప్రత్యేకశ్రేణిలోవి. సింధు వాసులు అబాల గోపాలం ఇప్పటికీ కాఫీచందాలు గానము చేస్తూ ఉంటారు. సామి రచించిన శ్లోకాలు శాంతరసభరితాలు. వాటిలో ఆత్మ జ్యోతిని ఆలోకనం చేయడానికి అవరోధమయిన అవిద్యను, నిరాసం చేయాలనే వేదాంత సంబంధమైన మోక్షేచ్ఛ గోచరిస్తుంది. షాహ్ సచల్ సామీ కవుల తాత్పర్యము ఒక్కటే. జీవాత్మ పరమాత్మకోసంచేసే అన్వేషణ, కిరణము సూర్యునిలోకి మళ్ళీ చేరడము, బుద్బుదము విచ్ఛి న్నము కావడంతో బిందువూ మహార్ణవమూ ఏకాకారము కావడమూ వారి కవితా తాత్పర్యము.

సింధీ కవితా లక్షణము షాహ్, సచర్, సామీకవులవల్ల నిర్ణీత మైనది, కాని మార్పుచెందడములేదు. సింధీకవిత సూఫీతత్వ గర్భితమై శాఖాభేద వాదానికి దూరమై నానాత్వంలో సంవిదేక చైతన్య నిర్భర మైంది. సింధీకవులకు పరమేశ్వరుని పితృప్రసక్తికాని, మానవుని భ్రాతృ ప్రసక్తికానీ లేదు. వారి విశ్వాసాన్నిబట్టి నేను నీవు అతడు అనేభేద ములు యుష్మదస్మత్ ప్రత్యయభేదములేని ఏకపదార్థమున్నది. ఒకడు మరొకణ్ణి బాధిస్తే తన్నుతాను బాధపెట్టుకొన్నట్లే. ఏరకమైన భేదభావ మైనాసరే, మానవుడి ఆధ్యాత్మికాభ్యుదయానికి ప్రతిబంధకమే. షాహ్ సచల సామీకవుల అనుయాయులలో బహుశః ప్రముఖ కవీంద్రుడయిన బేదిల్ (1814–1873) ఇలా అంటున్నాడు:—"నా పేరు 'బేదిల్'

అనడం వ్యాజం." ఆయనకాంతః ప్రియాసంయోగం ఒక్కటే ఆయన కర్మకాండను కాని ఔచిత్యాన్నికానీ లక్ష్యపెట్టడు. ఆయనకు పిగ్గుశరం. అవమాన భావాలూ లేవు. సింధీకవిత్వంలోని నానామత సారసంగ్రహ పరత్వం సూఫీతత్త్వాలవల్ల, విశ్వాసమౌఢ్య, కులశాఖాభేదవాదాలనుండి స్వేచ్ఛఫలించింది. సూఫీకుల వర్గసంప్రదాయ సిద్ధాంతాలు లేనివాడు. రోహల్ (మృ 1782), దళ్‌పత్ (మృ 1841) ఒకరు. ముసల్మాను రెండవవాడు, హిందువు ఇద్దరూ సిద్ధాంత వర్గభేదమునుండి స్వేచ్ఛను వ్యక్తము చేసినారు. రోహల్ 'రాహ్ ప్రణ్ జీ' అనగా ప్రియురాలిపథము కొసము తదనుకూలంగా అన్నికుల వర్గాలనూ పరిత్యజిస్తున్నాడు. హిందువులూ ముసల్మానులూ విద్వేషమత కారకులనీ నిందారోపణ చేసినాడు. దళపత్‌కవీ అవ్యాజంగా అడుగుతున్నాడు. కాబా దేవమందిరం అయితే, దేవతా నిలయమైన దేవాలయాలను ఎందుకు పరిహరించడం?" ప్రపంచ ప్రజలు వర్గాలుగా విభక్తమైనందుకు కవి సంతప్తుడవుతున్నాడు. సింధుదేశంలో ఉన్న ఈ విశ్వాస మేళనంలో, ఒక్కొక్కసారి ఒక ముసల్మాను కవి పలుకుతాడు, కృష్ణుడు తన ప్రియుడనీ, తాను గోపికననీ. సూఫీకవుల అవిచ్ఛిన్న ప్రవాహము సింధువాసుల దాహము తీర్చింది వారిశాంతికీ, ఆత్మోద్దీప్తికిన్నీ. పైన చెప్పిన ఆరుగురు కవులేకాక అతిస్మరణీయులయిన కవులు హమల్ లాహరీ. మురాద్, దర్యాఖాన్, బేకాస్ (బేదిల్ పుత్రుడు), జీవత్‌సింగులు. సింధీభాషలో సరైకలా ప్రాంతీయములో చాలమందికవులు పద్యరచన చేశారు. వారికవితలో అమాయికత్వం గోచరిస్తుంది. సీమాప్రాంత జానపదుల వ్యవహారంలోఉన్న భాషామాధుర్యము జాలువారుతున్నది.

బ్రిటిషువారు రాకపూర్వం ఉన్న సింధీభాషలోని ఉత్తమ సూఫీ కవిత ఇతివృత్తంలోనేమి, దోహావంటి ఛందాలు అవలంబించడంలోనేమి, హిందీ, పంజాబీ, మరి ఇతర ఔత్తరాహి భాషలతోనూ, సంబంధముకలిగి ఉండేదని అంగీకరించక తప్పదు. 1843లో బ్రిటీషువారు ఆక్రమించాక ఆ సాహిత్య బాంధవ్యం భగ్నమైంది పారశీక భాష రాజభాషగా తొలిగిపోగా, సాహిత్యవేత్తలందరూ సామాన్య భావవ్యక్తీకరణకూ, సుందర రచనకూ మాతృభాషవైపు మొగ్గినారు. అందుచేత

కాసిదవ్‌గజల్, మస్నవీలు, రుబాయీయత్తులు, ముసదస్సులు, మఖమ సీసులతో, ఇంకా అనేక ఛందస్సుల్లో, రూపాల్లో, సింధీసాహిత్య శకోదయ మైంది. బ్రిటీషువారి విజయానికి పూర్వం అక్కడక్కడా సబిత్ ఆలీషా (1740–1810) వంటి ఏ సింధీకవో విషాదకావ్యాలు, స్తోత్రాలుస్నూ సింధీభాషలో పారశీక కవుల పోకడలో రచించేవాడు అయితే ఖలీఫా గుల్‌మహమ్మద్ (1809-1856) సింధీభాషలో తన 'దివాన్' లేదా గజలు కవితా సముచ్చయము ప్రకటించేదాకా పారశీక ఛందమే ప్రాచీనదోహావంటి చరణ ఛందోరూపాలను ఇంచుమించుగా ఆక్రమించింది. గుల్‌కవిని మహాకవిగా చెప్పడానికి వీలులేదు. కాని ఆయన చూపిన మార్గమనుసరించి సింధీకవులు పారశీక ఛందస్సులకై మొగ్గినారు; పారశీక భావచిత్రణవైపు మోజుచూపినారు. చివరకు సింధీకవిత పారశీక నుడికారంతో, ఐతిహ్యాలతో సింధీసాహితి మిశ్రితమైంది. ఆ పారశీకపు కోయిలా గులాబీ, ఆ కంటకం ఆ గులాబీ కీటకమూ కొవ్వువత్తీ, మణికాంతుల మాధ్వీకరసం, చషకవాహుడు, జలపాతము, సురభిళ వని, హరిణీనేత్రాలు, తమాల వృక్షౌన్నత్యం అంతేకాక యూసఫ్ జులేఖాయి, లైలామజునూలు షిరీన్‌ఫరహాదులతో సింధీసారస్వతం నిండిపోయింది. సింధీభాషను పారశీక ఛందోరూపాల్లో మలచడంవల్ల సింధీ సాహిత్యానికి కలిగిన లాభము సందేహాస్పదము. గుర్ కవి అనంతరం ఒక శతాబ్దికాలంవరకు ఏ ఒక్కకవి రచించిన గజలు, రుబాయీయత్, కాసిదన్, ముసదస్ ఛందస్సులు, అనామక సింధీకవులు మోర్యో (1876), లల్లూ (1890), సమాయ్ పున్హూ, రాయ్‌ద్యాచ్, మరూయ్, కమ్‌సేన్ కామరూప్‌వంటి కావ్యగానాలు చేసినవారి కాఫీ, భేయ్యత్‌వై, సుర్‌ఛందాలతో సరితూగలేవు. సింధీమహాకవులు (ఉదా, బేదిక) పారశీకాయిత కవితను సింధీభాషలో రచనచేయ యత్నించినా, ఆ రచనలు ఎవరూ చదవరు. ఇది గమనార్హమైన విషయం. ఆ కవులు స్మరణీయులు కావడానికి కారణము వారి సింధీకాఫీలవల్ల లేదా రుచిర భావగేయాలవల్లనో. సంగి (1851–1924), ఖాకి (లీలారాంసింగ్), మిర్జాకరీబ్‌బేగ్ (1853-1929), హైదర్‌బక్ష్ జటాయ్ (హరిహక్‌దార్ నాయకుడు), షమ్‌సుద్దీణ బుల్‌బుల్ (అతని ప్రథమ గజలు కవిత్వ

సంపుటము (1891 లో ముద్రితము), లేఖరాయ్అజీజ్ (ఇతర రచనలు చదివి రచించినకవి) అనే కొందరి కవులపేర్లు ఒకశతాబ్దమునుంచి పారశీక ధోరణిలో సాగిన సింధీకవితను పరామర్శ చేస్తున్నప్పుడు మన మనసుకు స్ఫురిస్తాయి. ఆ కవు లెవరూ మహాకవులుకారు. ప్రజా మోదము పొందినవాళ్ళుకారు. కాసిం, ఫజల్, వాసిఫ్, కాజీం, ప్రభృతులు సింధీ కవితా సంకలనం, గజలు, కాసీదసుల సముచ్చయమున్నూ చేసినారు. కాని వారి పద్యాలు కవితా సాధనగా గణించవలసిందేకాని అంతకన్న విశేషంలేదు. ఒమార్ ఖయ్యామ్ కవీంద్రుని రుబాయియాత్ అనే చతుష్పాద ఛందములోని కవితను మిర్జాకలీబ్‌బేగ్ అనువదించినాడు; మన్సూర్ రచించిన చిన్నఘనకావ్యం ముసదస్, ఛందస్సులో, అఖోజో రచించిన ముసద్దస్, ఉరుదూకవి హాళీ ధోరణిలో ఉన్నవి: జటాయ్‌కవి సింధునదిని సంబోధించిన ప్రసిద్ధపద్యాలు పారశీక ధోరణిలో చెప్పినవి—ఇవి మాత్రమే పారశీక ధోరణిలో వ్రాసిన కావ్యాలలో మనగలిగినవి. చివరకు పాకిస్థానంలోనూ భారతదేశంలోనూ ఈమధ్య పారశీక ధోరణిలో రచించిన సుగమ కవిత్వ పక్షంలో మొగ్గు కనపడుతున్నది. పాకిస్థానంలో షేక్ అయ్యాజ్ (బగిరచయిత), భారతదేశంలో పరస్రంజియా అనేవారిద్దరూ పారశీక కావ్యప్రక్రియలను భారతదేశంలో పరస్రంజియా అనే వారిద్దరూ పారశీక కావ్యప్రక్రియలను ముఖ్యంగా అవలంబిస్తున్న సాహిత్య శిల్పులు. లేఖరాజ్ అజీజ్ ఇటీవల అబ్‌షర్ (జలపాతము) అనేకావ్యం ప్రకటించినాడు. అయితే అది సింధువాసుల మనసుకు రుచించలేదు. ఆ కావ్యం కృత్రిమంగా అతి భారమయిన పారశీక కవితానుకరణము కావడంచేత వారికి ఇంపుగాలేదు

## సమకాలిక కవిత్వము

నవ్య సింధురాష్ట్రావతరణంతోపాటు సుమారు ముప్పది సంవత్సరాల కిందట మొహెంజదారొ ప్రాచీన నగరము గుర్తింపబడినప్పుడు, సుక్కూరులో ఆనకట్టకట్టగా, సింధీసాహిత్యసమితి, సింధీ ముసల్మాన్ అదబీ సమితులవంటి సాహిత్య సంస్కృతి పరిషత్తులు స్థాపితముకాగా, విశ్వవిద్యాలయములో సింధీభాషను విద్యాప్రణాళికలో చేర్చగా, సమ

కాలిక సింధీకవిత్వోదయానికి మహాద్భుత దశ ప్రాప్తించింది. పారశీక కవితానుకరణ గహనమునుండి సింధీకవితమ ఉద్ధరించి సహజమైన నుడికారమును భావచిత్రణమున్నూ సింధీభాషలు వెలయింప చేసిన గౌరవము కిషన్‌చంద్ బివాస్ (1947 మృ) అనే వినయశీలికి దక్కింది. ఆయన పేదల జీవితాలను ప్రకృతి సౌందర్యమును భావగేయాలుగా పసిపిల్లలకు షిరీన్‌షాయర్, గంగా జూన్ లహ్రూన్‌వంటి పుస్తకాలూ పద్యాలూ ప్రకటించినాడు. బీవాసుకు ఉదాత్త సంవిధాన ప్రావీణ్యం లేదు. ఆయన సంప్రదాయక సింధీకవితను పారశీక ఛందాల్లో సమ్మిళితంచేసి ఉండవచ్చును. అయితే ఆయన వ్యక్తీకరణం స్వచ్ఛంగా, మౌలికంగా, సుష్ఠుగా, ఉంటుంది ఎప్పుడూ. ఆయన సాధించింది ఒకానొక కవితాసమితిని. ఆ సామితేయులయిన కవుల పేర్లివి. హరిదిల్‌గిర్ (సముద్రపుగవ్వలు), హూంద్రాజ్ దుఖయాల్ (సంగీత్‌ఫూల్ జానపద మధుర స్వరాలు) రాంపంజ్వానీ, గోవింద భాటియా ప్రభృతులు కృషి చేసి తమ కవితా గురువుల కావ్యాలను సంతరించి గ్రంథసౌలభ్యము కలిగించినారు. ప్రస్తుత వ్యాసకర్తకు ఆ కవితా సంకలనానికి ఉపోద్ఘాతము జతపరిచి ప్రకటించే సదవకాశము లభించింది. అయితే ఆ కావ్యాల్లో ఉదార సంప్రదాయాన్ని కవులు సాగించినారు.

సమకాలీన సింధీకవిత్వపు అద్భుత లక్షణము ఈ నవ్యోద్యమంలో విద్యార్థులూ, ఉపాధ్యాయులూ, ఆచార్యులూ పాల్గొనడము. యన్. వి. థడనీ 1923 లో పారశీక ఛందములో సింధీపద్యానువాదం చేసినాడు భగవద్గీతకు. అనువాద ప్రావీణ్యము చూపినాడు. ఆ మత గ్రంథాన్నే సంస్కృతోద్భవ భాషనే, స్మరణీయంగా గీతలకు అనువాదము చేసిన వారు మేఘరాజ కల్వానీ, మూర్‌చంద్‌లాలా, చైనారాయ్ బూల్‌చంద్; తుదివాడయినా ఘనంగా స్వేచ్ఛాఛందములో అనువాదము టి. యల్. వాస్వానీ చేసినాడు. వారందరూ సింధీకవితా విధానమును కూర్చినారు. హైదర్‌బక్ష్ జటాయ్ ఇక్‌బాల్‌కవి రచించిన ధోరణిలో షిక్వా అనే పరమేశ్వర నివేదనము రచించగా మతాభిమానంగల మూఢుల్లో తుఫాను చెలరేగింది అయితే ఆయన సింధునదిని చేసిన ఉద్బోధన (లోగడ చెప్పబడిన) అజాదీ పీక్వామ్ అనే స్వాతంత్ర్య గేయాలను (1947)

ప్రజలు ఆయన గజలు పద్యాలను మరచిన తర్వాతకూడా గానము చేయగలరు. జటాయ్‌కవి, గుల్, సంగి కవుల మార్గము మొదట అనుసరించినాడు. ఆ తర్వాత రాజకీయాలలో ఆయన విప్లవవాది; సాహిత్యంలోనూ అంతే. తత్ఫలితంగా నవ్యసింధీకవిత్వ చరిత్రలో ఆయన బీవాసుతో ద్వితీయస్థానం ఆక్రమిస్తాడు. నవ్యశకంలో మరొక కవిని పేర్కొనక తప్పదు. ఆయనపేరు దివాన్‌దాస్ ఆజాద్. ఆయన ఎడ్విన్ ఆర్నాల్డు రచించిన 'లైట్ ఆఫ్ ఏషియా' అన్న ఆంగ్లకావ్యమును 'పూరబ్ సందేశ్' (1937) అనేపేరుతో స్వేచ్ఛానువాదం చేసినారు. ఆకావ్యము సింధీ సహృదయ ప్రీతిపొందింది.

అద్యతన లక్షణం సింధీకవిత్వంలో షాహ్, సచల, సామీకవుల సంప్రదాయ కవితనుగాని సూఫీసంప్రదాయాన్నికాని కేవలం అనుసరించడమూకాదు; పారశీక ఛందస్సులనుకాని, భావచిత్రణనుకాని నిస్సహాయంగాకానీ వైదుష్యస్ఫోరకంగా కానీ, అవలంబించడమూ లేదు కవులు. అయితే నవ్యకవి స్వేచ్ఛాఛందోమార్గం వేరొకటి అధికంగా ఐరోపీయ సారస్వత ధోరణివల్ల ఏర్పరచుకొన్నాడు. ఏతదుద్యమ ప్రారంభకుడు, దయారామ్ గిదుమల్. ఆయన నామము సింధీసాహిత్య చరిత్రలో మహోన్నతమైనది. దయారామ్ గిదుమల్ (1857-1927) విద్వాంసుడూ భక్తుడున్నూ. ముప్పయ్యేళ్ళనాడు 'మనజా ఛాబూక్' (మనస్సు కొరడాలు) అనేపేరుతో దార్శనిక కవిత్వం శరపరంపరగా బృహత్ సంపుటాలుగా రచించాడు. ఆపద్యం స్వేచ్ఛాఛందోరీతిలో సాగింది. వాటి స్వేచ్ఛారీతి కావ్యవస్తువులూ, సారస్వతాభినివేశంలో యోచనాపరులు, కాంక్షాపరులూ అయిన సింధీ యువరచయితలతో విప్లవము తెచ్చినవి. వివిధ రచయితలు సింధీభాషలో స్వేచ్ఛాఛందో పద్ధతి అవలంబించినారు జనప్రీతికోసం. వారు పద్యం, గద్యం, గద్యపద్యంలో అనువాదాలు సాగించినారు. ముఖ్యంగా అలాంటి అనువాదకులు మంఘారాం మాల్కానీ, లాల్‌చంద్ అమర్ డినోమల్, అర్జున్ ఇస్రానీ, హరిరాం మరివాలా (ఆయన 'ఫల-చూంద్' లేదా, రవీంద్రుని 'ఫలాపచయా'నికి అనువాదము గతసంవత్సరము ప్రకటితము) ప్రభృతులు. భారతీయ కవి అయిన నజ్రూల్ ఇస్లామ్ అనే వంగ కవీం

్రుని కావ్యాలను దయోమం షరమణి అనువదించినాడు. అల్లే భారతీయ కవుల కావ్యాలను అనువదించడంలో అనువాదకులు స్వేచ్ఛా ఛందమే అవలంబించే ఉద్యమం కొనసాగించారు;—నారాయణశ్యామ్ (జంట కవుల్లో ఒకరు) 'మక్‌జాపుర' (మంచుజడి) అనేకావ్య ప్రణీత, సానెట్ రచయిత—అయ్యాజ్ అనే సర్వతోముఖ ప్రజ్ఞావంతుడయిన సాహిత్యవేత్త, ప్రఖ్యాతకవిన్నీ. అంచల్, రాహి, గోర్ధన్ మహబూబనీ, ఖయార్‌దాస్‌ఫానీ, 'గుమ్‌నమ్' (బలదేవ్ గ్రజియా), మోతీప్రకాశ్, అర్జన్‌షాద్ అనేకవులు భారతదేశంలోనూ, వై. కె. షేక్, బషీర్ మొరియానీ, బుర్దాసింధీ, అబ్దుల్‌కరింగదాయ్ పాకిస్తానంలోనూ ఉన్నారు. సమకాలీన సింధీకవితలో నిశిత వేదనా భరిత కావ్యఖండికలు చెప్పిన గౌరవము అయ్యాజ్ కవికి ఖయాల్‌దాస్ ఫానీకవికీ వస్తుంది. ఎందుకంటే అయ్యాజ్‌కవి షాహ్ కవీంద్రుణ్ణి సంబోధించి చెప్పిన కవిత, వర్డ్సువర్త్‌కవి "మిల్టన్! ఈ సమయాన నీవు తప్పక ఉండి ఉంటావు" అన్న పంక్తులను జ్ఞప్తికితెస్తుంది; ఖయాల్‌దాస్ ఫానీ రచించిన అతిస్మరణీయమైన "ఓ నా దేశమా!" "ఓ నా దేశమా" అనే జాతీయ భావోద్దీప్తగేయాలు దేశవిభజనలో, ఆయన తప్పని సరిగా మాతృభూమిని విడిచి వేయవలసి వచ్చినప్పుడు వెల్లుబికినవి. అందువల్ల సమకాలీన సింధీకవిత్వంలో వారిద్దరికీ గౌరవము దక్కుతుంది. టి. యల్. వాస్వానీ స్వేచ్ఛా ఛందములో సుదూరము సోకగల ఉపదేశము చేయగా, దానిఫలము సింధువాసుల మానసాల్లో ముద్రితమైంది. వారి అస్వతంత్ర బుద్ధి పారశీక ఛందోభావ చిత్రణలనే వైదుష్య శృంఖలాలనుంచి అధికంగా విముక్తం కావడానికి వాస్వానీ రచన ఉపకరించింది. గద్యపద్య రచనలుచేసి, ప్రజ్ఞచూపి, పాటవము కనబరచిన వర్ధిష్ణువు, తోలారామ్ బలానీ అకాలమరణము పాలైనాడు.

## రూపకము

ఇతర ప్రాంతాలలో కవిత్వమూ రూపకాల్లోనూ చేదోడుగా ప్రవర్తిల్లుతాయి. సింధుదేశంలో కవిత్వము ముందుకుపోగా, నాటకము వెనకంజ వేసింది. సింధువాసుల జానపదనాట్యాల (భగతులు) వల్లకూ

నాటకాలు ఆవిర్భవించలేదు. సింధుప్రాంతంలో రెండు నాటక సమాజాలు మాత్రము పనిచేశాయి. మొదటిది డి. జె. సింధుకళాశాలలో ఔత్సాహిక నటసమితి. అది 19వ శతాబ్దాంతంలో ఆరంభమైంది. రెండవది 'రవీంద్రనాథ సాహిత్య నాటక సమితి'. అది ఈ శతాబ్దిలో మూడవ దశాబ్దిలో ప్రారంభమైంది. మొదటి నాటక సమాజము, షేక్స్పియర్ నాటకానువాదాలను (మీర్జాకలీచ్‌బేగ్ చేసిన 'షాహ్‌ఇలియా' లేక లియర్‌రాజు అన్నది ఉత్తమం), కొన్ని ఎన్నికచేసిన నాటకానువాదాలను అనగా షెరిడన్ రచించిన 'పిజారో' నాటకానికి శివసింగ్ అజ్వానీ 'కనిష్ఠ' అనే ఉత్తమమైన అనుకరణమువంటి వాటిని ప్రదర్శించింది. కొన్ని నాటకాలు రామాయణ మహాభారతాలనుండి స్వీకరింపబడ్డవి. (మీరాంసింగ్ రచించిన ద్రౌపది, రామాయణము, హరిశ్చంద్రల వంటివి). రవీంద్ర సాహిత్య నాటక సమితి 'ఉమర్ మరుయి' అనే నాటకాన్ని లాల్‌చంద్ అమర్‌దినోమల్ రచించినదాన్ని జయప్రదంగా ప్రదర్శించింది ఆ నాటకంలో. కథా వస్తువు షాహ్ కవితనుండి తీసుకొన్నాడు లాల్‌చంద్. ఆ నాటక సమాజములో నిజంగా కె. యస్. దర్యానీ అనే నాటకకారుడు లభించడం విశేషం. ఆయన ఇబ్సెన్ రచించిన Pillars of Society అన్ననాటకాన్ని 'ముల్క్‌జమద్‌బర్ అనే పేరుతో అనువదించాడు. Victim of Starvation అన్న నాటకాన్ని ఖుఖ్‌జోషికార్ అని అనువదించినాడు. మంఘారాం మల్కానీ సామాజిక నాటకాలు రచించినాడు. ఆయన ఏకాంక నాటికా రచనకు మూల పురుషుడు. అయిదు ఏకాంకికలు రచించినాడు. ప్రస్తుతము సజీవులై ఉన్న రూపకకర్తలలో ప్రఖ్యాతుడు. షికార్ పురీ నాటకసమాజాలు సింధీభాషలో నాటకాలు ప్రదర్శించాయి; 'గంతూ' (నటులు) వంటి నాటికా పరంపరను జీతానంద్ నగరానీ రచించిన వాటిని ప్రదర్శించాయి. అయితే ఉర్సానీ రచించిన 'బద్‌నసీబ్‌తరీ' (అదృష్టహీన, తరీ) వలె ఈ నాటకాలు ప్రహసనాలకన్న మేలురకం కాదు.

శాంతంగా గదిలో కూర్చుండి చదువుకొని ఆనందించడానికి యోగ్యమైన నాటకాలలో నిస్సందేహంగా మీర్జాబేగ్ రచించిన 'ఖుర్షీద్' నాటకము ఉత్తమము. 1870 లో దాన్ని రచించినా, నిజంగా అందమైన

పాటలతో దివ్యమైననాటకము. లీలారాం ఫెర్వానీ షాహ్ కవి తీసుకొన్న 'షుక్‌లై లా చనేసుర్' ఇతివృత్తాన్నే కొంతమార్పుచేసి 1936 లో 'హిక రాత్' అనే నాటక రచన చేసినాడు. దయారాం గిడుమల్లుని 'పత సహేలియు' అన్న నాటకములో సంభాషణమూ, కౌరమల్ చందన్ మల్ రత్నావళీ నాటకానువాదమూ (1888) పఠనాపక్తులకు మాత్రం అమూల్యాలు. రాంపజ్ఞానీ రచించిన 'ముమల్‌రాణో' అన్న నాటకము చదువుకోడానికి రంగశాలలో ప్రయోగించడానికిన్నీ అందమైనది. కల్యాణ్ అద్వానీ చేసిన శాకుంతలానువాద విషయంలో అలా చెప్ప డానికి వీలు లేదు.

## వచన రచన

గతశతాబ్దిలోగా సింధీ వచన రచన బాగా ముందుకు సాగి పోయింది. గులాం పలసేఙ రచించిన 'జాంభంబో జమీన్‌దారుగాథ' (1853) వంటి జానపదకథలతో, సాదీ కవీంద్రుని 'గుల్‌ఇస్తాన్'కు అను కరణలతోనూ, కేవల్‌రాం సలమత్‌రాయ్ కృతసూక్తీ, గుల్‌పరంపర వంటి వాటితోనూ, అరేబియన్‌నైట్సు అన్న గాథలను గుల్‌కంద్ (1882) అనేపేరుతో ఆఖుంద్ లత్‌ఫల్లాచేసిన అనుకరణలతోనూ సింధీవచనము అనువాద భూయిష్ఠమై నిలకడ చిక్కించుకొన్నది. ప్రథమార్థ శతాబ్ది (1857-1907) అనువాదయుగము. వైయ్యాకరణులు, నిఘంటు కారులు, ట్రంప్, షర్ట్, స్టాక్, గ్రియర్సన్ ఆంగ్లంలో, ఉద్ధారాం తన్వర్ (వ్యాకరణము), ఝుమాత్‌మల్ నరూమల్ (వైత్పతీ కోశము) సింధీ భాషను ముందుకు తీసుకొని వెళ్ళినారు. అనువాద యుగములో ఇద్దరి పేర్లు ఘనంగా వినవస్తున్నవి. మీర్జాకలీబ్‌బేగ్. విజ్ఞాన సర్వస్వకృషి గ్రంథబాహుళ్యంతో ఆరంభించి 1877 లో బేకన్ రచించిన ఆంగ్ల వ్యాసాలను (మఖాలత్ అల్ హికమత్) అనువదించినాడు. తర్వాత చచ్ నామాను ఆంగ్లంలో అనువదించినాడు. ఇంకా మహాకావ్యాలను సింధీలో భాషాంతరీకరించాడు; ఘజాలీ రచించిన కిమాయీా ఏసాదత్ వంటివి. కౌరోమల్ చందనలాల్ (1844-1916) మహిళా విద్యాభివృద్ధికి అను కూలముగా పత్రరచన ఆరంభించి 'పకోపహా' (1872) వెలువరించి

వాడు. అధికంగా బాలసాహిత్యము కొలంబస్ చరిత్ర, ఆర్యనారీమణుల చరిత్ర, రాధారాణి (బంకిమచంద్రుని మూలము) వంటి అనువాదములు చేసినాడు. జనప్రీతి అధికంగా కలిగించింది జాన్సన్ రచించిన రాస లెస్సుకు చేసిన అనువాదం. అనువాదకులు నవల్రాయ్, ఉద్ధారాములు. (1870). తన్మూలంగా అనువాదసరణి సాగింది నౌవల్‌రాయ్ సోదరుడు హీరానంద్ స్కాట్ రచించిన 'తలిస్మాను' అనువదించినాడు. అనువాదమని అనిపించక స్వతంత్ర గ్రంథమనిపించే అనువాదకుడు, దయారాంగిడుమల్. (యోగదర్శనం, జప్‌సాహెబ్, గీతాజోసార్ ఇత్యాదుల అనువాదాలు). పాఠ్యగ్రంథాను వాదకులు (నందీరాం, నారాయణ్ జగన్నాథ్, బూల్‌చంద్, కోడుమల్ ప్రభృతులు.) వారందరిలో మీర్జా కాలీబ్‌బేగ్, కౌరోమల్‌చందన్‌మల్‌తోపాటు బూల్‌చంద్ కోడుముల్లు పేరు మాత్రము నిలిచింది. అందుకు కారణము ఆయన సొగసైన పదాలకూర్పుతో ఆంగ్లదేశ చరిత్రానువాదము చేసినాడు. వసుమల్ జయరాందాస్ తులసీరామాయణానువాదమూ; కొంత మహాభారతానువాదము మిసిర్ జయకిషన్ మహాకాంక్షతో కృషిచేశారు.

సింధీసాహిత్య పరామర్శచేసే సందర్భాన నలుగురు ప్రముఖ వ్యక్తులు నాలుగు స్తంభాలై సింధీవచన సారస్వత మందిరానికి ఆధారభూతులైనారని వక్కాణింపవలెను. ముగ్గురిపేర్లు లోగడ పేర్కొన్నాము—మీర్జాకాలీబ్‌బేగ్, కౌరోమల్ చందన్‌మల్, దయారాం గిడుమల్-నాలుగోవాడు, పరమానంద మేవారాం. మేవారాం నీతివిమర్శకూ వ్యాసరచయితగా సింధువాసులకు ఎడిసణవంటివాడు. మీర్జాసాహెబ్ (1853-1929) అనువాదకుడుగా అనేక క్షేత్రాల్లో అగ్రగామిగా, మౌలిక రచయితగాకూడా ప్రఖ్యాతుడు. ఆయన రచించిన జీనత్ (1890) సింధీబాషలో మొదటి నవల. అది ప్రీతందాసు రచించిన (1892) 'అజీజ్ భేటా' అనే నవలతోపాటు, నవలా రంగంలో పాత్ర సృష్టిచేసి సింధువాసుల జీవితము చిత్రించిన గౌరవము పంచుకొంటుంది. ఆయన షాహ్ కవీంద్ర కృతులలోని కారకమునుగూర్చి వైదుష్య స్ఫోరకంగా మార్గదర్శకంగా, సింధీభాషలో విమర్శ నాత్మకమైన గ్రంథము చేసినాడు. ఆయన మూడువందలకుపైగా, వివిధ విష

యాలకు సంబంధించిన గ్రంథాలు ఖగోళ, వ్యవసాయ శాస్త్రాలనుంచి ఆరంభించి, జంతుశాస్త్రం, మహిళలదాకా రచించినాడు. కౌరోమల్ చందన్‌మల్ సంపాదకత్వాన వెలువడిన 'సామీజాశ్లోక్' (1885) ప్రతిన్నీ పరిశుద్ధ సింధీభాషలో ఉపదేశాలున్నా. సింధీసాహిత్యానికి అమూల్యోపహారాలు. మీర్జాసాహెబ్ చేసిన ఓమార్‌ఖయ్యాము అనువాదానికి కౌరోమల్ ప్రకటించిన 'సామీజాశ్లోక' గ్రంథానికిన్నీ రచించిన దయారాముని పీఠికలూ, సింధీవచన రచనకు ఉదాత్త ప్రమాణాలను కూర్చినవి. దానికి కారణము భాష ధారావాహికమై ఇంచుమించు మహోన్నతిని అందుకొనుటే. పరమానంద మేవారాం 'జోతి' అనే సాహిత్య పత్రికా సంపాదకత్వం వహించినాడు. 19 శతాబ్ది అంతము నుంచి ఇరవయ్యో శతాబ్ది మధ్యకాలందాకా. సింధీపాఠకలోకానికి ఉత్తమవ్యాస సంకలన ద్వయాన్ని ప్రకటించినాడు. వాటిలో ఒకటి గుల్‌ఫూల్ (గులాబిపువ్వులు) అనేది. 'విచార్' అనే మరొక వ్యాస సంగ్రహం (డి. జె. సింధుకలాశాల పత్రికనుండి ప్రస్తుత రచయిత సంపాదించినది) వచ్చింది. పరమానంద మేవారాం 'Imitation of Christ' అన్న ఆంగ్లగ్రంథాన్ని క్రీస్తుజీపేరవీ' అనే పేరుతో అనువదించినాడు. ఆ వచన గ్రంథము అమూల్యము. ఆయన సింధీ భాషాకోశాన్ని (1910) సంతరించినాడు. అది ఇప్పటికీ ఉత్తమమైనది. పరమానంద మేవారాం మంచి వ్యాస రచయితగా లోకానికి వధూమల్ గంగారామును ప్రసిద్ధికితెచ్చినాడు. ఆయన వ్యాసాలు సామాజిక విషయాలకు సంబంధించినవి.

1907 నుండి 1957 వరకు యాభై సంవత్సరాలలో సింధీ వచన రచనాభివృద్ధి చురుకుగా సాగింది. ముఖ్యంగా తుది దశకంలో. ఈ అర్ధ శతాబ్దిలో మొదటి ఇరవయ్యేళ్ళూ సంసిద్ధతాయుగము, తరువాత ముప్పయ్యేళ్ళూ పరిపూర్తి యుగము లేదా నవ్యసింధూదయంతోపాటు అనుగుణంగా ఉన్న సమకాలిక సింధీసాహిత్య శకము అనవచ్చును. సంసిద్ధతాయుగంలో సింధీవచన రచనా ప్రవీణులు ముగ్గురు మనసుకు స్ఫురిస్తున్నారు. ముగ్గురున్నూ పారశీక భాషలోనూ, సూఫీతత్త్వంలోనూ, విద్వాంసులు. వారు సింధీభాషాప్రియులు కూడాను. నిర్మల

దావ్ ఫత్తేచంద్ ముసల్మానుల్లో మహావిద్వాంసులనుకూడా ఆశ్చర్య చకితులను చేసినాడు తన పారశీక, అరబ్బి, ఇస్లామీయ విజ్ఞానంవల్ల, పత్రికా రచనలోనూ (అయినా) పరోజిని, దలూరాయ్-జీ-నగ్రి అనే గాథలవల్లనూ. ఆయన సింధీభాషలో శిలిత విఘంటువులైనవారికే, అర్థ మయ్యేలాగ వచనరచన చేసినాడు. ఆయన కుమారుడు శోభరాజు తండ్రికి నకలేకాని, తీవ్రత తక్కువ. హైందవ విద్వాంసులలో హరుపద రంగని (ఖడీం), దయోమన్షరమణి అనేవారు. నిర్మల దాసీయ సంప్ర దాయ నిర్వాహకులు. ఫత్తేమహమ్మద్ సిహాని వైద్యుడూ, విద్వాం సుడూ. 'అఖ్‌తబ్‌ఏ అదబ్' (సాహితీ పవిత) అనే గ్రంథమూ, అబుల్ ఫజల్, సిరాత్‌ఏ నబీ (ప్రవక్తలక్షణాలు) అనే గ్రంథాలు మహమ్మదీయ సమీక్షాత్మక వైదుష్యమార్గమును ప్రదర్శించినవి. 1931లో మహమ్మ దీయ అదబీ సమాజస్థాపనతో, సమీక్షాత్మకమైన పాండిత్యము ప్రవృద్ధ మైంది. ముసల్మాన్ అదబీసమాజ విద్వాంసులయిన జోయో, నబీ బక్షు బలూచ్, అస్మాన అన్సారీ, దీన్‌మహమ్మద్ వఫాయివంటి వాళ్ళ వల్ల విద్వత్తుకు ఔన్నత్యం ప్రాప్తించింది. ఫత్తే మహమ్మద్ సిల్‌హానీ హిందూముసల్మానుల ఐక్యము నిమిత్తము చిత్తశుద్ధితో, సాహిత్య సంస్కృతీ క్షేత్రంలో కృషిచేసినాడు. ఆయన వచనము సరళమూ, తీవ్రమైన దిన్నీ.

సింధీవచన చరిత్రలో పైవారికన్న అధికతరం ఖ్యాతి గన్నవాడు, మిర్జాకాలీచ్‌బేగ్‌కన్న తక్కువవాడున్నూ అయిన హోత్‌చంద్ గురు భక్షానీ, షాహ్ కవీంద్రుని కృతులను బృహత్ సంపుటంగా 1924 లో ప్రకటించినాడు. అయితే అది అసంపూర్ణం. కాని తరువాత పరంపరగా వచ్చే రచయితలకు అది ప్రమాణ దర్శకమైంది. అఘాసూఫీ 1930లో సచల సర్‌మస్త కవీంద్రకృతుల సంపుటినీ, దావూద్‌పోత షాహ్ అబ్దుల్ కరీం (1937) కవితాసంపుటినీ, ముస్లిం అదబ్‌సమితి ప్రకటించిన 'గుల్' (1933) లో కవికృతులున్నూ, షాహ్‌వానీ ప్రకటించిన షాహ్ కృతుల సంపుటం (1950), మల్‌సనీ ప్రచురించిన 'బేదిల్' కావ్య సంపుటం (1954), నగ్రానీ సంపాదించిన సామీకావ్య సందోహం (1956)—అన్నీ గురుబక్షానీ చేసిన మహాకృషిని పురస్కరించుకొని

వచ్చినవే. ఆ కావ్య సంపుటాల్లో పీఠికల వచనముకూడా గురుబక్షానీ పద్ధతినే అనుసరించి, రచించారు సంపాదక పరిష్కర్తలు. నూర్‌జహాన్ లోనూ, షాహ్‌లతీఫ్ కావ్య పీఠికలోను (ముఖద్దమాలతీఫ్) లవరీ జాలాల్ లోనూ పారశీక నుడికారంతో నిండినప్పటికీ, ఆ వచనం సింధీరచయితలకు ఉపాదేయం.

## సమకాలిక వచనము

ముప్ఫయేళ్ళ కిందట పైనచెప్పిన నలుగురు విద్వాంసులు తమ జీవితాన్ని అంకితముచేసిన కృషివల్ల (మీర్జామరణం 1929, దయారాం 1927 లో, కౌరోమల్ 1916 లో), వారి ప్రభావంవల్లనూ. సమకాలిక సింధీవచనము పూర్ణమైన ఔన్నత్యాన్ని పొందింది. మనతరంలో సింధీ వచనాన్ని నిలవబెట్టి, పటిష్ఠముచేసి జనప్రీతి కలిగించిన గౌరవము జేత్‌మల్ పరశ్‌రామ్ (మృ 1948), భేరుమల్ మెహర్‌చంద్ (మృ 1950), లాల్‌చంద్ అమర్‌దినోమల్లు (మృ. 1954) లకు దక్కింది. జేతుమల్ పరశ్‌రామ్ యావజ్జీవం దివ్యజ్ఞాన సూఫీ, హిందూ ముసల్మాన్ ఐక్యము ప్రబోధించినాడు. ఆయన షేక్స్‌ప్రియర్ రచించిన సానెట్ కవిత్వంలోకూడా సూఫీ తత్త్వాన్నే దర్శించినాడు! అయన సింధు రాష్ట్రంలో పత్రికల్లో వ్యాసకర్తగా మహోన్నతుడు, షాహ్ లతీఫ్ యొక్క మర్మయోగానికి వ్యాఖ్యాతకూడాను (షాహ్‌కావ్యకథలు). ఆయన ఉత్సాహం సింధుదేశంలోని మర్మయోగులు, భక్తులు, సూఫీల యెడల ఉద్దీప్తమైంది. ఆయన వ్యక్తిత్వములో తీక్ష్ణభాగము మరొక్కటి కూడా ఉన్నది. అది చమ్రాపోష్ గాథల్లో (అజ్ఞాత రచయిత), ధన వంతుల దురాశాకామాలను బహిరంగ పరచినప్పుడు కనబడుతుంది. సింధీసాహిత్యములో ఆయన ప్రప్రథమ సమాజవాది. భేరుమల్ మెహర్ చంద్ సింధీ వైయాకరణి, చరిత్రకారుడున్నూ. ఆయన విమర్శనాశక్తి కలవాడు; కృషిచేయడానికి అపార సామర్థ్యమున్నవాడు. ఆయనకు దేశాటనం మహాప్రీతి. ఆయన 'జోహర్ నజమ్' అనే ప్రథమ సింధీ కవితా సంకలనము చేసినవాడు; షాహ్‌లతీఫ్‌యొక్క యాత్రలను గూర్చి రచించినాడు; 'ఆనంద సుంద్రికా' అనే నవల వ్రాసినాడు.

అపరాధ పరిశోధక నవలలుకూడా రచించినాడు. భేరుమల్ జీవితంలో చేసిన భాషాపరిశోధనలు సింధీవ్యాకరణ రచన, సింధీభాషాచరిత్రము (1941). సింధీ హిందువుల చరిత్రలో ఆయన గవేషణ పూర్తయింది. ఆయన శైలిలో వ్యక్తిగత ధోరణులులేవు; సాఫీగా లలితంగా రచనచేసి వాడు. ఆయన సారస్వతకృషి పరోక్షంగానో, అపరోక్షంగానో, యువ రచయితలకు ఉత్సాహము కలిగించింది. అందుకు దృష్టాంతము చూడండి. అల్లాబచాయో రచించిన (సైర్‌కోహిస్తాన్) కోహిస్తానయాత్రలు (1942) అనే సింధీవచన గ్రంథం రావడానికి కారణం భేరుమల్లుని 'సింధ్ ఓ సైలానీ' అన్నరచన కలిగించిన ప్రోత్సాహమే. తరీఖీమజ్‌మూన్, సింధ్‌జో ఇతిహాస్‌వంటి చారిత్రక రచనలుచేసిన చేతన్ మేరీ వాలావంటివారూ, లేదా సింధీకావ్యచరిత్ర లేక సింధీ సాహిత్య రచయిత అయిన మహమ్మద్ సిద్దిక్ మీమన్, లట్‌ఫల్లా బద్వీవంటివారూ లేదా జీవితచరిత్ర సాహిత్య విమర్శకులవంటి కల్యాణ్ అదవానీ (షాహ్‌పచల్ సామీకవులనుగూర్చి రచించినవారు , వంటివారూ గాంధీ నెహ్రూ ప్రభృతుల జీవిత కథారచయితలున్నూ, భేరుమల్ మహిరచంద్‌వల్ల (గురుబక్షాణీనుండికూడా) చాలా గ్రహించినారు. భేరుమల్ కుమారుడు ప్రభుదాస్ (సలీక్-జో-సఫర్) అనే Pilgrim's Progress కు చేసిన అనువాదంలో చక్కగా తండ్రిగారి వచన శైలిని పట్టినాడు.

భారతదేశంలోనూ, పాకిస్తానంలోనూ లాల్‌చంద్ అమర్ దినోమల్ సింధీసాహిత్య పితామహుడుగా సమ్మానితుడైనాడు. ఆయన మరణం వల్ల (1954 లో) సింధీయులు దుఃఖించినారు. ఆయన సింధుదేశాన్ని ప్రేమించినవాడు; రచయితగా సింధీసారస్వతకృషి ఆరంభించినవాడు మహమ్మద్‌ప్రవక్త జీవితచరిత్ర, షాహ్ లతీఫ్ కవితా విమర్శ, హర్ చోపిడిగాళ్ళగాథ, కొత్తతీరులో 'చోత్-జో-చంద్' అనగా 'చవితినాటి చంద్రుడు' అనే నవలనూ రచించినాడు. 1914 లో ఆయన సింధీ సాహిత్య పరిషత్తును శరణానందహసోమల్లుతో కలసి స్థాపించి దాని ద్వారా సింధీపాఠకుల సాహిత్యాభిరుచిలో మార్పుతెచ్చినాడు. ఆయన రచన ఆరంభము చేసినరోజుకు సింధువాసులకు ఐరోపీయ సాహిత్య విషయంలోనూ, వంగసారస్వతంలోనూ ఆసక్తిఉండేది. సింధీనవలా

సారస్వతము, గులేబకావళి(1887), ముంతాజ్ దంసాజ్‌వంటి మధ్యమ యుగాల గాథలతోనూ 'చంద్రకాంత' వంటి వైచిత్రీగర్భితమైన నవలలు, విచిత్రవ్యక్తులు అలమారులో అస్తిపంజరం ఉండే చిత్రరచనలతోనూ నిండిపోయింది. ఆయన సింధీయులకు సాహిత్యాభిరుచి సరిదిద్ది నిర్మలమైన సాహిత్యాభినివేశము కలిగించినాడు. సింధీయులకు సన్నిహిత జీవిత సంబంధ విషయాల్లోనూ, సింధీభాషయొక్క నుడికారంలోనూ, ఆసక్తి కలిగించినాడు. నిజంగా ఆయన మార్గదర్శకుడు. ఆయన చూపిన దృష్టాంతమువల్ల ఆశానంద మాంతెర, (షాయిర్ గ్రంథకర్త—అది కాల్పనిక భావోద్రిక్తమైన నవల ఉబ్బూతలూపే వచనాలున్నాయి), సేవక్ భోజరాజ్ ('ఆశీర్వాద్', 'దాదాశ్యామ్' అనే జీవిత కథాత్మక నవలా రచయిత), నారాయణ చంఛానీ సామాజిక నవలాకారుడు, విద్య, 'వితంతువు' మొదలైనవి), రామ్ పంజ్వానీ (పద్మ, ఖైదీ, రసిక స్వభావులూ భావుకులయిన వారి రేఖాచిత్రాలనూ రచించినవాడు), మంఘారాం మాల్కానీ (లాల్‌చంద్ అమర్ దినోమల్లుని 'సాదా గులాబ్' నుంచి, రవీంద్రుని రచనా ధోరణి అవలంబించినవాడు) ప్రభృతులు ఎంతో వైవిధ్యము కలవారు అవతరించినారు. ఆయన ప్రభావం నారాయణదాస్ మల్కానీ (అనార్‌దనా, దానిమ్మ గింజలు), తీర్థ వసంత ('చిన్‌గున్' రవ్వలు-జేతమల్ పరశ్‌రామ్‌తో కలిసి చేసిన గ్రంథము) వంటి వ్యాసకర్తల మీదనూ గోచరిస్తున్నది.

లాల్‌చంద్ అమర్ దినోమల్లుని నామము గత వింశతి వర్ష సమకాలిక సింధీసారస్వతముతో, ప్రస్తుత దశాబ్దము సంధానితము చేయబడ్డది. ప్రస్తుత దశాబ్దములో అనేక విషయాల్లో సింధీవచన సారస్వత చరిత్ర అద్భుతము. 1947లో భారత విభజనముతోపాటు సింధీసారస్వత గళము తుత్తునకలై పోతుందేమోనని తోచింది. ఎందుకనగా హిందువులు ఆశ్రయంకోసం రక్షణార్థులైనారు. సింధుదేశంలోని ముసల్మానులపై వలసకై వచ్చిన పరవాసులధాటి రేగినది. కాని ఒకానొక ఆశ్చర్య జనకమైన విషయము సంభవించింది. తరుణులు రచనానుభవము లేకుండా పత్త్రికలు, సారస్వత సమితులున్నూ స్థాపించి, తమ భాషాసాహిత్యాలను ఆశ్చర్యం గొలిపే అమితోత్సాహంతో అవలంబించి

నారు. సింధుదేశంలోని సారస్వతకృషి భారతదేశంలో గతదశాబ్దము నుంచీ అద్భుతం. సింధుదేశంలో సింధీభాషా సాహిత్యాలలో పరిశోధన కోసం పెద్దయెత్తున ఉద్యమం సాగుతూ వస్తున్నది. 'మిహ్రాన్' అనే సాహిత్య పత్త్రికను ఘనంగా చెప్పుకోవలసిఉంటుంది. భారత దేశము లోనూ సామాజిక మనోవిశ్లేషణాత్మక నవల కథానికా రచనలు అత్యద్భుతంగా సాగుతూ వస్తున్నవి. ఆ కథానికలూ నవలలూ తరుచుగా పత్త్రికల్లో పడుతూ ఉంటవి. (వ్రతికలసంఖ్య అపరిమితంగా పెరిగింది). భారతదేశంలో సింధీభాషలో ఉన్న పత్త్రికలలో కనీసం "హింద్ వాసి' అనే ఒక్క వారపత్త్రికకైనా చందాదారులసంఖ్య ఐదు స్థానాల లెక్కలో ఉంటుంది.

ఈ దశాబ్దంలో సాహిత్య వ్యాసంగంలో ఔత్సుక్యదాయకమైన లక్షణం సారస్వతానికి మహిళలు చేస్తున్న సారస్వతకృషి భారతదేశ విభజనకు పూర్వము సాహిత్య క్షేత్త్రంలో 'గులీసదరంగనీ' అనే సింధూవనిత ఒక్కత్తే. ఆమె రచించినవి రవీంద్రుని 'గోరా', అందరూ అమితంగా విమర్శించే 'ఇత్తెహాద్' అనేనవల. (అందులో హైందవకన్య ముసల్మాను యువకుణ్ణి పెళ్ళిచేసుకొన్నది.) ప్రస్తుత కాలంలో మహిళలు బాగా ముందుకు వస్తున్నారు. సింధీభాషా పత్త్రికల్లో పోపతి హీరానందాని ఎక్కువ జనప్రీతి సంపాదించిన రచయిత్త్రి. నిజంగా నవలా రచయిత్త్రులలో కృతకృత్యులైనవాళ్ళల్లో ఆమె ఒక్కతె. సుందరీ ఉత్తం చందానీ కోషన్ (కథానికలు), కిరందాల్ దేవరూన్ (కూలుతున్న గోడలు) అనే సామాజిక నవలలు రచించింది. ఆ నవలలో మనస్తత్వం సింధువాసుల జీవిత పరిజ్ఞానం రచయిత్త్రి చూపింది. గోవిందమల్‌హి శైలిని మినహాయించగా సింధీ నవలా రచయితలందరి శైలికన్న ఆమెశయ్య ప్రసన్నము. గోవిందమల్‌హి రచించిన ఉత్తమ నవల 'పఖియరా మల్‌ఖాన్ విఛ్ఛియా (గుంపునుండి విడిపడిన పక్షులు). ఆ నవలలో సింధీ తీవ్రకరుణగాథ చిత్రితమైంది. ఆయన అడ్డులేకుండా నవలలు 'అంశూ' (అశ్రువులు) నుంచి 'లోక్ అహి బోక్' (1957) దాకా రచించినవాడు. కథాకారుల్లో ఆనందగోలానీ బహుశః ఉత్తమరచయిత, కొంచెము న్యూనంగా అతనికన్న, బాగారచనచేసే

కథారచయితలు డజనులకొద్దీ ఉన్నప్పటికీ అలాంటి రచయితలు సుగన్ అహుజా, కిరత్ బబానీ, ఉత్తమ్, బిహారీచబ్రియా, చావ్లా, గోవింద్ పంజాబీ, తారామీర్ చందానీ, కలాప్రకాశ్, కలారీజ్ సింగానీ, ఈశ్వరీ జోత్వానీలు. ఝుమత్ మల్ భవనానీ సర్వతోముఖ ప్రజ్ఞగల విమర్శకుడు, సాహిత్య రచయిత. ఆయన సింధీభాషలో 'ధోలామరూ'ను అనువదించి, సింధీసాహిత్యసేవ చేసినాడు. పాకిస్థానంలో నలుపురు కథారచయితలు జమాల్అబ్రో, తన్వీర్ అబ్బాసి, షేక్‌రాజ్, అయ్యాజ్‌కదిరీ ఖ్యాతి తెచ్చు కొన్నారు. ఈ దశాబ్దంలో ఇతర ప్రముఖ లేఖకులు రాంపంజ్వానీ, మంఘూరాం మల్కాని. వారిలో పంజ్వానీ 'అహిన అహి' అనే పటువైన కథారచయిత; అందులో భగవద్విశ్వాసమున్న శిల్పికథను ఆయన రచించినాడు. మంఘారామ్ మల్కానీ నాటకకర్త, వ్యాసరచయితకూడాను. ఆయన సాహిత్య చరిత్రను రచించినాడు; 'అదబీ ఉసూలు' అన్న గ్రంథరచయిత. అది సింధీ భాషలో సారస్వత సమీక్షా దిగ్దర్శక గ్రంథము.

1947-57 వరకూ దశాబ్దకాలంలో సాహిత్య వ్యాసంగంలో రెండు ప్రముఖ విషయాలు గమనించాలి. సింధుదేశ భాషాసాహిత్యాల యెడల (ముఖ్యంగా షాహ్) అమితప్రీతి ఒకవిషయము. వాస్తవికంగా లోకాన్ని సమీపించే 'అభ్యుదయ' దృక్పథం రెండవ విషయము. కొంతకాలం యువక రచయితల్లో అనారోగ్యదాయకమయిన కాముక ప్రసక్తి గోచరించింది. అయితే ఈ స్వభావాన్ని ఇప్పుడు జుగుప్సతో చూస్తున్నారు. ప్రస్తుత సింధీరచయితలు ఆత్మ, జాతి, భాషావిషయంలో విశ్వాసము కలవాళ్ళు. ఆ విశ్వాసము భవితవ్యానికి శుభలక్షణము,

సింధీభాషలో బాలసాహిత్యము ఇటీవల వర్ధిల్లింది. సరళ కథలు, పిల్లలకు పద్యాలు, మొదట ప్రైమరీ తరగతుల ఉపయోగార్థం విరచితమయ్యే పాఠ్యపుస్తకాల్లో ప్రకటితమైనవి. ఈ బాల సాహిత్యం కౌరోమల్ చందనమల్ లేఖినినుండి వచ్చింది. భేరుమల్ మిహిరచంద్ పసివాళ్ళ కోసం సంతరించిన పద్యాలు, తరగతుల్లోనేకాక సమాజములోనూ, జన ప్రీతి పొందినవి. ఆయన ముఖ్యంగా కాలస్వరూపుడైన వృద్ధరాజును సంబోధించిన ఆంగ్లపద్యానికి చేసిన అనువాదము ప్రజామోదం

పొందింది. సింధీభాషలో శిశుసాహిత్య రచయితగా ప్రముఖుడైనవాడు, పరమానంద మేవారాం. ఆయన రచించిన జోట్ అన్న పుస్తకం పిల్లలకు వినోదం విజ్ఞానం కలిగించింది. ఆయన పిల్లలకోసం రాసిన సరళ గాధలు దిల్‌బహార్ అనేపేరుతో సంకలితం చేయబడినవి. ఆంగ్లంలో రవీంద్రుని 'క్రిసెంట్‌మూన్', 'పోస్టాఫీస్', బంకిమచంద్రుని కథలున్నూ, ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో ప్రచురితముకాగా, వాటికి సరళ సింధీ పద్య వచనానువాదాలు చాలా వచ్చాయి. అవి పిల్లలకు ఉల్లాసం కలిగించాయి

సింధీభాషలో ప్రత్యేకంగా పసివాళ్ళకోసం తొలిసారిగా వ్యాస పద్యపరంపర సక్రమంగా సాగించింది-బల్‌కన్-జీ-బరీ (అఖిలభారత శిశుసమాజము). ఆ సమాజానికి 'దాదా' (సేవక్ భోజరాజ్). మూడు దశాబ్దాలనుంచీ ఉదాత్తస్థాయిలో బాలసాహిత్య రచనకు ఆ సంఘము కీర్తి నిలుపుకొన్నది. అందులో పసివాళ్ళుకూడా కొందరు రచనలు చేసినారు. అయితే బల్‌కన్-జీ-బరీ లేకపోతే జోలపాటలు, జానపదసింధీ సాహిత్యం, బాలసాహిత్యం సింధీభాషలో లభ్యమయ్యేవికావు. 1930 లో చివర సంవత్సరములో రీవాచంద్‌థడనీ అనే అధివక్త సింధీలో వినోదకరంగా, చిత్రవిచిత్ర అర్థరహిత గేయరచనా ప్రయత్నము సాహసంతో (భగత్ బంభర్, బాబూఅహీ చోర్‌జో) చేసినాడు. (ఒకపాటలో బంభర్ చోరునితండ్రి) అయితే ఈ పాటలన్నీ ప్రస్తుతం అలభ్యం. బాలసాహిత్యశాఖ విశిష్టంగా స్థాపించిన ప్రతిష్ఠ ఫత్తేచంద్‌మంగత్‌రామ్ వాస్వానీ అనే ఒక రెవెన్యూ ఉద్యోగికి దక్కుతుంది. ఆయన మెల్‌హర్‌రామ్ అనే తనసోదరుని పేరుతో, అనంతరం 'సుందర్ సాహిత్యం, అని పేరుపడ్డ రచనలు రచించినాడు. ఫత్తేచంద్రుని మార్గదర్శకమైన సాహితీ వ్యాసంగం అనుకరించే చాలమందిని ఆకర్షించింది. సింధీలో ప్రధానంగా ఉచ్చకోటిలో పసివాళ్ళకోసం కవిత్వం చెప్పినవారు బేవాస్ (కిషన్‌చంద్ ఖత్రీ), ఆయన శిష్యుడు, దఃఖియాల్. దఃఖియాల్ రచించిన గేయాలు సింధుదేశంలో గ్రామాలలో పాడుతూ ఉండేవారు గ్రామీణులు. అయితే అందరికీ ఇప్పుడు తెలుసును ఆ పాటల సంగతి. 1940, 1950 లో సింధీసాహిత్య ప్రముఖులు తమదృష్టిని,

పసివాళ్ళకోసం పుస్తకాలు రాయాలని మరల్చినారు. వారిలో లాల్‌చంద్ అమర్‌దినోమల్ ఎక్కువ పట్టుదల గలవాడు.

సింధీలో సాంకేతిక గ్రంథాలు లేవనవచ్చును. సింధీభాషలో ఒక రచయిత ఆలోపము తీర్చడానికి గ్రంథరచనకు పూనుకొన్నాడు. ఆయనే మీర్జాకరీబ్‌బేగ్. ఆయన కృషి యావత్తూ అధికంగా అనువాదాలు. హరిసింగ్, కోకర్‌దాసులవంటి గ్రంథప్రకాశకులు సాహసంతో గాథవిషయాలకు సంబంధించిన, ముఖ్యంగా వైద్యం, వస్తూత్పత్తి విషయక గ్రంథాలను, ఉరుదూనుంచి అనువదింపజేసి ప్రకటించినారు. అయితే ఆ గ్రంథాలు సాహిత్యశ్రేణిలో చేరవు. సింధీలో ప్రభుత్వ ప్రచురణలు (వ్యవసాయము, అర్థికశాస్త్రము పారిశ్రామికాది విషయాలు) సాహిత్య దృష్టిలో పేలవంగా ఉంటాయి. స్టాక్, ట్రంప్, షర్ట్‌వంటి ఐరోపియనులు మొదటి సింధీ విషయ కర్తలు వారిని అనుసరించి పదాను క్రమణికలు, నిఘంటువులూ నరూమల్, దూల్‌మల్ ఖూల్‌చంద్ వంటివారు రచించినారు. ప్రామాణిక సింధీ శబ్దకోశాన్ని సంతరించినవాడు సర్వతోముఖ ప్రజ్ఞాశాలి, రచయిత, పరమానంద మేవారామ్ అయితే అది అర్థ శతాబ్ది కిందట ప్రకటితం కావడంవల్ల, పునఃసంస్కరణం జరగవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

ఆకరగ్రంథజాతము

Shah Latif. *By Lilaram watanmal*

Sind and Its Sufis.

*By Jethmal Parsram; Theosophical Publishing House, Adyar, Madras, 1924.*

Shah Abdul Latif of Bhit

*By H. T. Sorley, Oxford universiy Press; 1940*

Desert Voices.

*By T. L. Vaswani; Ganesh and Co., Madras*

Linguistic Survey of India.

*By G. A. Grierson, Vol 8, pt. 1 pp. 1-231*

# హిందీ సాహిత్యము

సచ్చిదానంద హీరానంద వాత్స్యాయన్

## చారిత్రక దృక్పథము

ఒకానొక విరోధాభాసంతో ఆరంభించడానికి అంగీకరిస్తే, హిందీ, పారంపర్యంగా అసమ్మతిని గట్టిగా వ్యక్తంచేసే భాష అని ఎవరయినా అంటారు. ప్రాచీన కాలమునుంచీ ఆ భాషలో రచనలు ఎక్కువగా కొన్ని శ్రేణులవారు ఏదో ఒకదానికి తమ ప్రతికూల భావాన్ని వ్యక్తము చేస్తూ ఉండడంతో పుట్టినవి. ఈ అసమ్మతి ఎల్లప్పుడూ అభ్యుదయానికే ద్వారముగా ఉండలేదు. తరుచుగా అది మార్పును నిరోధించే తీవ్ర వాణిగా సంకుచిత దృష్టితో కూడిన ద్వేషంగా, ఉంటూవచ్చింది. ఆరోగ్యదాయకమైన ఒకవాంఛతో నవ్యవిధానాలు అవలంబించడానికి యత్నిస్తే, దానికి వ్యతిరేకంగా అతిగా మనగల విశేషాధికారాన్నో, లేదా జీర్ణసంప్రదాయ సంరక్షణకో, అవిచారితమైన సంకుచిత దృష్టితో ద్వేషముచూపే వాణిగానో, ఉంటూ వచ్చింది. ఆ భాష ఎప్పుడూ అసమ్మతినే తెలియచేసేది. ఒకవిధంగా అర్థముచేసుకొంటే, గ్రంథ కర్త పరిస్థితులకు అనుకూలుడుగానో, ఉపదేష్టగానో, సందేశవాహకుడుగానో, మతవిశ్వాసములతోనో తత్త్వములోనో పరమేశ్వరోపస్థితిలోనో తన మార్గాన్ని వ్యాప్తిచేసే ప్రయాణికుడుగానో, ప్రతినిధిగానో ఉంటూ వచ్చాడు. ఈ వాణి దండయాత్రికునికీ నిరంకుశుడికీ, పవిత్ర మందిరాన్ని అపవిత్రముచేసేవాడికీ, సంయమిడికీ. గేస్తుకూ, ప్రకృతికీ కామకళలకూ, చివరకు సాహిత్యానికీ ఎప్పుడూ వ్యతిరేకమే.

నిస్సందేహంగా, చారిత్రకంగా, కారణాలున్నాయి ఈ విధాన రేఖకు. హిందీ ఐతిహాసిక ఘటనల ఘర్షణకు తట్టుకొన్న ప్రాంతీయ భాషగా ఉండేది. ప్రాకృతాలు లేదా అపభ్రంశ ప్రాంతీయ భాషా

పారంపర్యమునుండి సముద్భవమైనప్పటినుంచీ, హిందీ, సుఖతర జీవనము గడుపుతూ, వినోదాలు అనుభవిస్తూ. విశేషాధికారము చలాయించే వర్గాలు వ్యవహారంలో పెట్టుకొన్న సంస్కృతానికి వ్యతిరేకంగా, ప్రాకృత జనుల కాంక్షలూ రసభావాలను సువ్యక్తము చేయడానికి, క్రమప్రవృద్ధంగా బాధ్యత వహించింది. బౌద్ధయోచనా ప్రభావంవల్ల అది ఋత్విజుల కర్మకలాపాన్ని, జటిలమైన వర్ణవ్యవస్థనూ నిరసించడంతో ఆరంభించి అది శీఘ్రమే అత్యాశ్చర్యజనకంగా బౌద్ధుల తాంత్రిక రహస్యోపాసనలకు వ్యతిరేకంగానూ. వారల సర్వప్రపంచోపశమానికో కాకపోయినా సామాన్య గృహస్థుని బాధ్యతలూ, విధులూ నిరసించడానికో, తప్పించుకోడానికో దారితీసే సంకుల ప్రభావాలకూ ఎదురు తిరిగింది. ఆతతాయుల ఆక్రమణలూ. మత సంఘట్టనమూ, క్రౌర్య అసహనములతోకూడిఉన్నా, ఇస్లాము సాంఘికంగా సామ్యస్వాతంత్ర్య శక్తులకు ప్రాతినిధ్యం వహించడంతో పై ప్రాతికూల్యంలో మార్పులు వచ్చినవి. హిందీభాష సుసంఘటిత ప్రతీకారాభివ్యక్తికి ద్వారమైంది. సంఘర్షణ స్వభావాన్నిబట్టి ప్రతీకారస్వరూపము తప్పని సరిగా నిబద్ధమైంది. స్వధర్మానుష్ఠాన విధులను శాసించి, ఆత్మవిశ్వాసానికి స్వాతంత్ర్యము అంగీకరించిన మతానికీ విశ్వాస విషయములలో ఏమాత్రమూ స్వేచ్ఛఇవ్వక ఆచరణీయ విషయాల్లో విస్తారభేదాలు అంగీకరించని మతానికీ జరిగిన ఘర్షణకు హిందీభాషయే వాణి అయింది. వర్ణాశ్రమ ధర్మాన్ని ప్రగాఢంచేసి, శిలశిక్షణ దృఢపరచి, అన్యులను చొరనియకుండా సామాన్యంగా అంతర్ముఖము కాదలచిన సమాజ భావాన్ని వ్యక్తికరించిరది మధ్యకాలంలో హిందీ. క్రమంగా ఇస్లామ్ ధర్మము వ్యాపించడంతో, ముసల్మాను పాలనం సుప్రతిష్ఠితం కావడంతో, పీడిత ప్రజానీకానికి హిందీ సామాన్యభాష కాజొచ్చింది. ఈ భావము కూడా బ్రిటీషు పాలనలో ' విభజించి పాలించడం ' అనే రాజనీతివల్ల ప్రవృద్ధమైంది. తమ అనుగ్రహ పాత్రులయినవారి ఉరుదూ భాషకు ప్రభుత్వమువారు సదా సహకారము ఇచ్చినారు. బ్రిటీషు పాలకులు ఈ మిథ్యాభావము సృష్టిచేసి ఉరుదూను పోషించినారు. 19 శతాబ్దిలో ఉద్ధరణోద్యమాలు వాటితోపాటు ఉన్మీలితమైన కులతత్త్వమూ ఈ దృక్ప

ధాన్ని ఉద్ధృతము చేసినవి. కాని కులప్రభావాన్ని అతిగా వర్ణించడము అన్యాయము. జాతీయ వికాసం ముందు దాని ప్రభావము చాలా అల్పము. ఈ వికాసంలో సహజంగా సులభంగా హిందీ ప్రధాన వాగ్ద్వార మైంది. [1] నిజానికి ఈ ఉద్ధరణోద్యమము మతసంస్కారాల్లో ప్రము ఖంగా అభివ్యక్తమైనప్పటికీ, మతంతో సంబంధములేని ఒక నవీన సంస్కరణోద్యమంలో అది ఒక అంశమనవచ్చును. ఆర్యసమాజము (1875 స్థాపితం) నిశ్చయంగా గాఢ పవిత్రదృష్టితో వచ్చిన మతోద్ధర ణోద్యమమే; కాని క్రమంగా ఉద్బుద్ధమవుతున్న సంస్కృతి భావము సంప్రదాయము, సమిష్ట్యనుభవము, మహాప్రజానీక సృజనాత్మక ప్రవృత్తినీన్నీ సమ్మిశ్రమై విశాల దృష్టితే శాశ్వత ఫలము కలదయింది.

నా దృష్టిలో భాషాచరిత్రలో హిందీకి తటస్థించిన చిత్రపరిస్థితివల్ల రెండో వైపరీత్యము సిద్ధమైనట్టుగా కనబడుతుంది. ఉనికినిబట్టి 'మధ్య దేశం'లో ఉద్భవించింది కనుక హిందీ భాష ఆదినుంచీ హైందవభావ స్రవంతికి ప్రధాన వాగ్ద్వారము అవుతూనేఉంది. అందుచేత అది సంప్ర దాయంలో జీవంలో నిరంతరం వ్యక్తిత్వపరమైనది. అయినప్పటికీ హిందీసాహిత్యం సామాన్యంగా విశిష్టమయిన వ్యక్తులతో సాధించినది ఏమంతలేదు. అనగా ఆ సాహిత్య చరిత్రలో మహోన్నత విశిష్ట సాహిత్య మహారథులు ప్రత్యేకంగా గోచరించరు; కాని మహోన్నత భావసంచల నాత్మకమైన ఉద్యమాలూ, లేదా వివేకప్రాదుర్భావాలే కనిపిస్తవి- కొందరు గొప్పమూర్తులు గోచరించినా ఆ సాహిత్యము ప్రధానంగా వ్యక్తులవల్లకాక భావవాహినుల వల్లనే పరిపుష్టమైంది.

19 శతాబ్దినుంచే శిల్పి విశిష్టుడూ స్వతంత్రవ్యక్తి అనే పాశ్చాత్య భావము ప్రచారితము కావడముతో సాహిత్య శిల్పియొక్క వ్యక్తి

---

[1] వంగభాషా సాహిత్యమును ఇందువల్ల తగ్గించడంలేదు. వంగదేశంలో ఉజ్జీవనం, ప్రభావాలూ సూటిగాను, అనువాదాలవల్లనూ హిందీ జీర్ణము చేసికొన్నది. అయితే వంగభాషకున్న ప్రాంతీయ పరిమితి, హిందీకిగల సంఖ్యాబాహుళ్యబలం ఈ రెండూ దాని జీవానికి ముఖ్య కారణాలు.

ప్రధానమైంది. నిజానికి కళాకారుడు నిర్వహించవలసిన భూమిక విష యంలో ఆశయంలోనూ మార్పు కలిగింది. చివరకు ఈ మార్పు కళా స్రష్ట—అభివ్యక్తికి కారణభూతమైందనికూడా చెప్పవచ్చును. ఈ శతా బ్దిలో మూడవదశకంలో మార్క్సు అనుయాయుల విమర్శ కళాకారుని స్థితిని పునఃనిర్వచించడానికి యత్నించి, మొదట ఆమోమయంగాను, అనంతరం పక్షనియమప్రకారము అతన్ని అదుపులో పెట్టాలనే కోరిక బహిర్గతం చేసింది. అయితే ఆ యత్నము విఫలమైంది. కనుక పందొ మ్మిదో శతాబ్ది ప్రారంభమునుంచే ఏ తద్భావము ప్రచలితమై ఆమో దము పొందింది. రచనలో రచయిత యొక్క నికరమైన గుణాలు విశిష్ట వ్యక్తిత్వము ప్రతిబింబితం కావాలి. అందుచేత హిందీలో శైలికి ఇటీ వలెనే విలువ యేర్పడింది. బహుశః అలవాటు[1] లేదా తీరుకూడా సమ కాలిక దృగ్విషయమే. ఇదే తక్కిన భారతీయ భాషలకూ వర్తిస్తుంది అని తలంతునుగాని దానిప్రస్తావన నాకిక్కడ ప్రస్తుతం కాదు.

సమకాలిక సాహిత్య సరణులను గ్రహించ వలసినప్పుడు ఈ పర్యాలోచనలు సుసంగతాలు. పారంపర్య స్థితిగతులూ, సాహితీ దృక్పథమున్నూ, ఆలోచించక ఉద్దిష్టరంగంలో సమకాలిక గ్రంథ కారుని కృషిని అంచనా కట్టడం, ప్రస్తుత ప్రచలిత భావాలను శోధించి గుర్తించడం, లేదా ఏ విశిష్ట క్షేత్రంలోనైనా, సాహిత్యకారులు సాధిం చిన ఫలితాలను పరీక్షించడమున్నూ వీలుకాదు. సమకాలిక రచనను శోధించి విలువ నిర్ణయం చేయడం ఎప్పుడూ ప్రమాదభరితము. అంతే కాక నేనూ, గ్రంథరచయితలలో ఒకణ్ణి అయినప్పుడు తక్కిన రచ యితల సాహితీ గుణగణాలను బేరీజు కట్టడం మరీప్రమాదము. కాని అధికంగా తప్పనిసరిగా పర్వ్యత్రా రచన యత్నపూర్వక మవుతున్న ప్పుడు, ఆ కృషిని ఎప్పటి కప్పుడు ధైర్యంగా సమీక్షించక తప్పదు. రామణీయకము సమకూర్చే దూరము లేకపోయినా సమీపదృశ్యము ఉత్తేజాన్నీ, శాంతినీ, సౌఖ్యాన్నీ చేకూరుస్తుంది.

---

1 Mannerism

భాష

సమకాలిక సందర్భంలో హిందీ సాహిత్యమంటే ఢిల్లీ-మీరట్ ప్రాంతాల్లో మాట్లాడే 'ఖడీబోలీ' అని తాత్పర్యము. అయినా సామాన్యంగా అంగీకృతమై అవిరతమై ఏకప్రమాణాన్ని నిలుపుకొంటున్న సాహిత్యభాషగా ఖడీబోలీ భాషకు వయస్సు ఇంచుమించు నూరేళ్ళే. అందులోనూ ప్రధాన కవితా ప్రవంతికి ఒకవాహినిగా ఆ భాష ఈశతాబ్దారంభంలోనే నిలతొక్కుకున్నది. అంతవరకూ వ్రజభాష కావ్యసంప్రదాయంలో ఉండేది. వ్రజభాష ఆగ్రా, మధుర ప్రాంతీయభాష. అవధీ, మైథిలీ తదితర ప్రాంతీయ భాషలూ చెబుతున్నా అన్నిటినీ గుదిగుచ్చి, హిందీ అనే పేరుపెట్టినారు. వాటి అన్నిటిలో కవిత్వమున్నా అవి సాంప్రదాయిక కావ్యభాషలు కావు. హిందీ సరిహద్దులను నిర్ణయించే విషయంలో వివాదము ఉంటూనే ఉంది. అద్యతన రాజకీయ పరిణామాలవల్ల, ప్రాంతీయ భాషామహాకాంక్షోదయంవల్ల, పరిస్థితి మరీ ఉద్దీప్తమైంది. ఐతిహాసికంగా, సంప్రదాయ సిద్ధంగా, హిందికిఉన్న స్థాయికి విరుద్ధంగా, భాషాతత్త్వశాస్త్ర నిదర్శనము కనబడుతున్నది. సంప్రదాయికమైన అభిమతము సంక్షిప్తంగా ఉల్లేఖించడం ఉపయోగదాయకము కావచ్చును. దీన్ని ఇంకా హిందీభాషా చరిత్రకారులు విశ్వజనీనంగా అంగీకరిస్తున్నారు కనుక మూల విషయము, ఈ దృక్పథము మీదనే ఆధార పడిందని జిజ్ఞాసువు తెలిసికోగలడు.

పంజాబు పడమటిహద్దునుంచి బీహారు తూర్పు పరిహద్దుదాకా, భారతనేపాల సీమనుండి మధ్యప్రదేశంవరకూ ప్రామాణికమైన వ్యవహారంలోఉన్న భాషను, సంప్రదాయసిద్ధంగా హిందీ అని వ్యవహరిస్తున్నారు అన్యభాషాప్రాంతాలకున్నట్టు మధ్యదేశమనేతప్ప, ప్రత్యేక అభిధానములేదు. అన్యభాషలవలెకాక, హిందీభాష చాలా ప్రాంతీయ భాషలతో కూడుకొన్నది. ఆ ప్రాంతీయాలు ఏకకుటుంబమునుండి సూటిగా ఉద్భవమైనవికావు. వాటిలో కొన్నిటి విషయములో తమలో తమకు కంటె అన్యభాషల ఉపభాషలతో సన్నిహిత సంబంధము ఎక్కువ. ఖడీబోలీ ప్రామాణిక హిందీభాషగా రూపొందినదాకా హిందీ

వదము భాషకన్న సంప్రదాయాన్ని సూచించేదని చెప్పవచ్చును. కేంద్రజిగమిషమైన ఒకానొక సంధాయకశక్తి, ఉపభాషా సమ్మేళనానికి ప్రాతిపదికా నిర్మాణముకోసం, ఇంచుమించుగా ప్రామాణిక భాషాస్వరూపాన్ని సాధించడంకోసం, సృజనాత్మక లేదా ఉపదేశాత్మక వాఙ్మయ కృషిని ఆ ప్రాంతాన్నంతా నిరంతరంగా నడిపించింది. ఈ కేంద్రీకరణ సంప్రదాయము హిందీని అష్టమశతాబ్దిలోని అపభ్రంశ భాషకు సంలగ్నము చేస్తున్నది. హిందీసాహిత్య చరిత్రకారులు అష్టమ శతాబ్దిలోని అపభ్రంశముతో ముడిపెట్టి సాహిత్య కథనము ఆరంభిస్తున్నారు. అందుచేత బౌద్ధయాత్రికుల గేయాలతో, ద్విపదీఖండాలతో సాహిత్యారంభమైనదనే వాదము, సమర్థింపబడుతున్నది. నిస్సందేహంగా అష్టమశతాబ్దిలో అపభ్రంశ ప్రాంతీయ భాషాభేదాలు చాలా ఉండేవి. కాని ఉత్తర భారతదేశము యావత్తూ ఏకప్రామాణికాపభ్రంశ సాహిత్య భాష వ్యవహారంలో ఉండేదనడానికి ఉన్న ఉపపత్తులు విశ్వసించ వచ్చును. అన్య ఔత్తరాహభాషలలోకన్న హిందీలోనే అపభ్రంశ భాషాసంప్రదాయాలు యథార్థంగానూ, విస్తారంగానూ సంక్రమించి ఉన్నాయి. ద్వాదశ షోడశశతాబ్ద మధ్యయుగాల్లో ప్రచలితమైన మహాభక్త్యుద్యమాల పారంపర్యముకూడా హిందీలోనూ, తదీయ ప్రాంతీయ భాషల్లోనే ఎక్కువ బాగా భద్రమైనది. వ్రజ, అవధీ భాషలు కవులవల్ల విభిన్నములైనా, బాగా ప్రాంతీయాలై వ్యాపించినా, ముఖ్యంగా వాటిల్లోనే ఈ కాలపు భక్తకవుల ఉపదేశాత్మక, మర్మయోగాత్మక, ముక్తక రచనలు భద్రము చేయబడ్డవి. సూరదాస, తులసీదాస, కబీర్, దాదు దయాళ్ హిందీప్రాంతానికి చెందినవారే. ప్రాక్, వాయవ్య, దాక్షిణాత్య కవులుకూడా హిందీలోనే భావాభి వ్యక్తీకరణం చేశారు; హిందీతోనే వారు యథాస్థానాలకు చేరుకొన్నారు.

ఈ వివాదాస్పద విషయాన్ని ఇంకా తరిచి చూడడం అనవసరం. ప్రస్తుతము ఏమయినా, హిందీని రమారమి 15 కోట్ల ప్రజలు వాడుతున్నారు. ఆ భాషాప్రాంతము భరతఖండంలో రమారమి సగం మేర వ్యాపించింది.

## ఆధునిక యుగారంభము

వారణాసి నేటికీ ప్రధానంగా భోజపురి ఉపభాషా ప్రాంతమైనా అక్కడనే ముందు ఖడీబోలీ తత్ప్రాంతీయ సాహిత్యభాషగా ఉద్భవించి, అవధీభాషా ప్రాంతీయ రచయితల గాఢప్రోద్బలంతో ఉంటూ ఆ కేంద్రీకరణ సంప్రదాయశక్తివల్లనే త్వరలోనే సుస్థాపితమైంది. ఖడీబోలీ ప్రాంతమే మందమైన ఉత్సాహంతో కొంత తటస్థంగా ఉన్నది కాని వ్రజ ప్రాంతంకంటె కొంతనయం. వ్రజబోలీ తన సుస్థిర స్థానంనుంచి భ్రష్టమైపోతాననే భావంతో ఆ ప్రాంతాన్ని పట్టుకు వేళ్ళాడడం స్వభావసిద్ధమే. ఖడీబోలీ హిందీ తన ప్రాంతం ప్రవృద్ధము కావడానికి ఉరుదూ కూడా ఒకకారణం. ఉరుదూకూడా సమాన సంప్రదాయాన్నే, అభిరుచినే, నిదర్శనమూ తనవిగానే వక్కాణిస్తున్నది. సోదరీతుల్యమైన ఉరుదూ భాషకు ప్రభుత్వాదరణము ఉన్నప్పటికీ, క్రమేణా హిందీకి మొగ్గుదల ఏర్పడ్డది. దానికి కారణము సంస్కృతిని అవగాహన చేసికోవడంలో విశాలమై లౌకికమైనదృష్టి ఉండడమే. ఈ విషయము ఇదివరలో చెప్పాను. ఆస్థాన భాషగా అతినాగరక భాషగా చెలామణీ కావడంచేత దానిగుణాలవల్లనే సంక్రమించిన దోషాలు బాధించినవి. ఉరుదూ సర్వతోముఖ వ్యవహారానికి సులువుగా చాలలేదు. ఉరుదూ యావత్ ఉద్రిక్తలోకము కోరే ఉల్లాసమూ, వర్ధన క్షమత్వమూ కల భాష కాదు. మొరటుగా ఉన్నా సుస్పష్టమైన భాషా ప్రమాణాలు లేకపోయినా, హిందీభాషలో జీవమూ సందర్భావసరాలకు, మారేందుకు అనుకూలతా ఉన్నాయి. నిస్సందేహంగా దానితొలి యత్నాలు భారంగా నట్టువడుతున్నప్పటికీ 19 వ శతాబ్దాంతంలో హిందీ రచయితలు ఉరుదూ పారశీ, భాషాజ్ఞానంతోపాటు సంస్కృత భాషాజ్ఞానం ప్రదర్శించడం అవశ్యకమని తలపోశారు. ప్రయత్న పూర్వకంగానో అప్రయత్నంగానో, తాము గ్రంథకర్తలని నిరూపించుకోవలెనని అట్లాచేసేవారు. అంతగా సంపన్నమైనది కాకపోయినా తమ భావవ్యక్తీకరణము చేయడానికి బుద్ధిపూర్వకంగా హిందీభాషను వరించారు కాబట్టి శతాబ్దిద్వితీయ దశకంలో, ‘భారతేందు’ హరిశ్చంద్రుడు (1850–1883) మొదలు మహావీర

ప్రసాద ద్వివేదీ (1868–1938) వరకూగల గ్రంథకారుల కృషివల్ల ప్రామాణిక సాహిత్యభాష స్థాపన కావడంతోటే, ఈ ఉరుదూ పారశీక మిశ్రమ ప్రయోగ ప్రదర్శన కాంక్ష లోపించింది. ప్రేమచంద్ (1880–1936) ఆదివరకే ఉరుదూ భాషలో నవలా రచయితగా ఖ్యాతి గడించిన వాడయినా, క్రాంతంగా హిందీలో ప్రవేశించడంతో దాని అడుగు ధ్రువపడ్డది. రెండు భాషలమధ్య సరికొత్తగా వివాదము చెలరేగింది. పూర్వముకన్న కేవల రాజకీయ కారణాలవల్ల ఆ వివాదము ఉగ్రతర మైంది

భారతేందు హరిశ్చంద్రుని సృజనాత్మక సాహిత్యకృషి ప్రస్తుతము గుణసౌష్ఠవ మయినదని అనలేము. మహావీరప్రసాద ద్వివేదీ కృషి అంతకన్న తక్కువ కోవలో చేరవచ్చును. అయితే భారతేందుని ప్రభావము సాంస్కృతిక పునఃప్రవృత్తిలో గాఢంగా పనిచేసింది. ద్వివేది (1903–1920) పత్త్రికా సంపాదకుడుగా, దీక్షాశీలము అకుంఠితోత్సాహాలు కలిగి, హిందీవచన రచన నిర్మాతగా, ఖ్యాతి గడించినాడు. హరిశ్చంద్రునిదియు అనుయాయుల సాహితీపరుల సారస్వత కృషి సంఖ్యలో చూచినా, సౌష్ఠవము విషయ వైవిధ్యంతో విశ్వజనీనమై సహృదయ ప్రీతిదాయకమై తద్భావ భావితులను చేస్తున్నా, సర్వే సర్వత్ర గుణం నిర్దుష్టం కాకపోయినా, ఆయన సాహిత్య పరులకు కేంద్రమైనాడు. సాహితీ వ్యాసంగ పరిధి త్వరలోనే విశాలమైంది. భాషాసంబంధమైన అసమ్మతి జనామోదము కలిగించే సామాజిక సాంస్కృతి కోద్యమంగా పరిణమించింది. ఆంగ్ల సాహిత్య పరిచయ ప్రభావాలవల్ల రచయితలు నూతన సాహిత్య ప్రక్రియలు అవలంబించి నవ్యరీతుల్లో భావవ్యక్తీ కరణను చేసినారు. కావ్యాలు, నాటకాలు, ప్రహసనాలు, గల్పికలు, సమీక్షలు, వ్యాఖ్యానాత్మక వ్యాసాలు, హాస్య వ్యాసాలతోపాటు అధికంగా వ్యక్తిగత చాపల్యం ద్యోతకముచేసే వ్యాస రచనలున్నూ వచ్చినవి. చిన్న కథలు, నవలలుకూడా రచించినారు. హరిశ్చంద్రుని కాలంనుంచీ 19 శతాబ్దాంతముదాకా వంగభాషద్వారా ఆంగ్లప్రభావము సామాన్యంగా అవగాహన చేసికొన్నారు. కలకత్తా బ్రిటీషు పాలకులకు రాజధాని కావడమూ, ఆంగ్లవిద్యావ్యాసంగానికి

కేంద్రము కావడమూ అందుకు కారణము. శతాబ్ది మారడంతో ఇంగ్లీషుతో సంసర్గము నూటిగా ఏర్పడ్డది.[1] ఆంగ్లభాష మూలంగా అన్య ఐరోపీయ ప్రభావాలుకూడా ఉమ్మరంగా వ్యాపింపసాగినవి (ప్రముఖంగా రష్యాదేశీయ నవల, అంతకన్న తక్కువగ పరాసునవల, కవిత్వం)—19 శతాబ్ది ఆదిభాగంలో, సాహస గాథలు, చిత్రాతిచిత్రాద్భుత సాహసాలు, వినోదకర, అల్పశృంగార గాథలతో కూడిన కట్టుకథల స్థానే, భావకాల్పనిక చారిత్రక ఆఖ్యాయిక (హిందీలోకానీ, వంగానువాదముకానీ) వచ్చింది. దాని తరువాత వాస్తవిక నవల, ఆధునిక కథానిక అవతరించాయి. ఈ పాటికి హిందీ రచయితకు విక్టోరియా రాణి కాలమునాటి మహాసాహిత్యవేత్తల గ్రంథజాలంతో పరిచయం ఏర్పడింది. కవిత్వంలో హిందీకవి, ఆంగ్ల సాహిత్యంలోని[2] కాల్పనిక భావగీతికా కారుల రచనలలో, అభినివేశం అలవరచుకొన్నాడు. అంతేకాదు, అతనికి పోప్, డ్రైడన్, మిల్టన్ కవీశ్వరుల కృతులతో పరిచయం ఏర్పడింది. అతనికి ఫ్రెంచి సాహిత్యవేత్తలయిన విక్టర్ యూగో, డ్యూమాల గ్రంథాలు తెలుసును. మోలియర్, బాల్జాక్, ఫ్లాబర్, మొపాసా, జోలా, టాల్‌స్టాయ్, తుర్గనీవ్, చకోవుల నామాలు అతనికి పరిచితాలవుతున్నాయి.

అయితే ప్రథమ ప్రపంచ యుద్ధానంతరంలోనే నిజానికి ఆధునిక యుగంలో అడుగుపెట్టడం సంభవించింది. ఒకతరం తరువాత సమకాలిక సాహిత్య మారాలను గురించి తర్జన భర్జన రావచ్చును. విమర్శకులు కొందరిమతం ఆధునిక యుగము కల్లోల మయమూ, ఆందోళన మయమనిన్నీ. హిందీలో ఈ రెండూ సమకాలికములూ సమానార్థకాలున్నూ. యుద్ధకాలపు టంతర యుగానికి మూడోపేరు పెట్టవచ్చును.

1 1830 లో తొలిసారిగా కలకత్తాలో ఆంగ్లకళాశాల స్థాపితమైంది. 1817 లో కలకత్తా పాఠ్యపుస్తకసంఘము నెలకొన్నది. 1833 లో ఆగ్రాలో దాని ప్రతిరూపం వచ్చింది. 1832 లో బైబిలు భారతీయ భాషల్లో భాషాంతరీకరింపబడింది.

2 రొమాంటిక్ లిరిక్ కవులు

అయితే అపార్థము చేసుకోకుండా ఉండగలందులకు ఆ కాలాన్ని వ్యాఘాత యుగమనాలి. నిజానికి ఆ మూడున్నూ వ్యక్తిత్వాన్వేషణకు సంబంధించిన వివిధ అనివార్య దశలకు ప్రాతినిధ్యము వహించినవి. ఈ వ్యక్తి అన్వేషణమే బుద్ధిపూర్వకంగానో, అప్రయత్నంగానో, తత్కాలీన సాహిత్య ప్రవృత్తికి ప్రధాన ప్రోద్బలం. అది కాఠిన్యానికీ, అనర్థ కాలకూ, ప్రకోపానికీ, ఉత్కర్షకూ, హేతువయింది. కావ్యశిల్పికన్న, ఆ యుగమే ప్రధాన మవుతూ వస్తున్న ఒకానొక సంప్రదాయంలో, సాహిత్యం వ్యక్తులకన్న లాక్షణికతా సృష్టినే ప్రమేయంగా పెట్టుకొన్నది. వ్యక్తిగత విషయ గ్రహణ క్షమత్వం వ్యక్తీకరించడంకన్న, కవిత ప్రధానోద్దేశ్యములవైపు, మనః కల్పనలవైపు మొగ్గింది. తానొక వ్యక్తిగా హిందీ గ్రంథకారుడు తెలుసుకొన్నాక సృష్టికర్తగా, ప్రజలతో ప్రమేయము కల్పించు కొన్నాడు. ఈ గ్రహింపులో బాధా వ్యాకులమూ కూడినవి తరువాత రచనలలో పరిపాకమూ, సమత్వమూ, ఈ నూతన సన్నివేశానికి గ్రంథకర్త ఎంత త్వరగానూ అనుకూలంగానూ వ్యవహరించ గలిగినాడో అనేదాన్ని ఆధారంచేసుకొని ఉన్నది.

## ఛాయావాదము - ప్రగతివాదము

సంప్రదాయక సాహిత్య మార్గాలలో రచనలు సాగుతూ ఉండగా, పురాతన సాహిత్య ప్రక్రియలనూ, సంవిధానాలనూ పరిత్యజించకుండా నవ్యభావానుగుణ్యత పరిమితంగా సంపాదించాలని రెండు ప్రధాన సారస్వతోద్యమాలు యుద్ధకాలాంతర లక్షణాలుగా విలసిల్లినవి. వాటిల్లో మొదటి ఉద్యమము కేవలం కవిత్వానికి పరిమితమైంది; రెండవది ఎక్కువగా సర్వసామాన్య మైనదిన్నీ.

సంప్రదాయక సారస్వత ప్రక్రియా శిక్షణ పూర్తిగా అంగీకరిస్తూ నవ్యమైన చైతన్య సూక్ష్మగ్రాహతకు వశంవదులై ప్రవర్తించినవారిలో మైథిలీ శరణగుప్త (1886) మహాప్రముఖుడు. సారస్వతోద్యమాల్లో ఒకానొకదాని ప్రభావము ఆయన కవితలో పూర్తిగా లేకపోలేదు. ముఖ్యంగా అనిబద్ధమైన భావగేయ కవిత్వములో కాని యాభైయేళ్ళ పైగా సంప్రదాయ మార్గాన్ని సలక్షణంగా అనుసరిస్తూనే నూత్న

సాహిత్య ప్రక్రియను కవితలో విడిచిపెట్టక పోవడమే కవితలో ఆయన విశిష్టత. భాషాదృష్టితో చూచినా, మహావీరప్రసాద ద్వివేదీ వేసిన ప్రామాణికభాషకు ఉత్తమ దృష్టాంతాలు గుప్తగారి రచనలు. పర్వ సామాన్యంగా ఆ భాషాప్రమాణాలను అంగీకరించడానికి ఆయన కృతులే కారణములు.

నవ్యకవిత్వోద్యమము భావసౌందర్య విషయకమై, నిజానుభూతి విశిష్టమై, కేవల లాక్షణికతనూ, ఉపదేశాత్మకతనూ ఎదుర్కొన్న వ్యక్తిగత విప్లవము. అది ఆరు శతాబ్దాలకు పూర్వము భక్తి ఉద్యమం వలె, కరుడుకట్టిన నిర్జీవ సంప్రదాయానికి వ్యతిరేకంగా చేసిన హృదయాక్రందనం. కవి అతి సన్నిహితమైన 'తన' అనే వస్తువును గుర్తించినాడు. అన్నిటికన్న దానినే చెప్పదలచినాడు. భాష, ఛందోరూపాలు, లాక్షణిక సంవిధానాలు, నిషేధాలు—ఉన్నవి. అన్నీ అతనికి అసమగ్రంగా ఉన్నవనిపించినది. కవి స్వీయానుభూతిని వ్యక్తము చేయడానికి, అనుకూలమైన నవ్యరీతిని నిర్మాణము చేసికొన్నాడు.

నిరాలా (సూర్యకాంత త్రిపాఠీ) 1896 — సుమిత్రానందన్‌పంత్ (1900) — కవులు ఈ ఉద్యమానికి మార్గదర్శకులు. ఇద్దరూ గొప్ప కవులు. జయ శంకర ప్రసాద్ (1889-1937), మహాదేవివర్మ (1907) కూడా పై వారివలె మార్గదర్శకులు కాకపోయినా మహాకవి శ్రేణిలో వారు. వారు పైవారివలె స్వతంత్ర సృజనాత్మక శిల్పులు కారు. కోమల పద సంఘటనాత్మక చేతన, అజంత పదప్రయోగ సూక్ష్మగ్రాహిత, మధురాలోకనమున్నూ, పంతు, నిరాలా కవులు ప్రదర్శించారు. ప్రకృతిని వీక్షించి స్వచ్ఛంగా, అప్రయత్నంగా, పులకితులై పోయిన ఈ కవులిద్దరూ, పూర్వులకన్న, అన్యసారస్వత మార్గగాములైన సమకాలికులకన్న, అన్యచ్ఛాయావాద కవులకన్న, విశిష్టతకలవారు. ఈ ఉద్యమాన్ని కాల్పనిక భావోద్యమం అనడం యుక్తమే. ఆంగ్లదేశీయ కాల్పనిక భావోద్వేగ కవుల ప్రభావము కొంతవరకూ వారిలో కొందరిమీద, ముఖ్యంగా పంతు మీద పనిచేసింది. కాని అలాంటి పోలికలు ప్రమాదం. ఈ సారస్వతోద్యమం గాఢంగా రసికజనామోదము పొందిన తరువాత దానికి వ్యతిరేకంగా ప్రగతివాదం ఉద్భవించింది. అందులో కూడా

కాల్పనిక భావోద్వేగము గాఢంగా ఉన్నది. కాబట్టి ఛాయావాదము భారతీయుల కాల్పనిక భావోద్వేగవాదము అనవలె. కరుణామయ సుందర ప్రకృతిని అద్భుతంగా ఆలోకన చేయడము వీతత్సాహిత్య మార్గలక్షణం. అయితే ఈ సాహిత్య వాదములో గాఢంగా, అనుస్యూతంగా, ఆస్తికత ఉన్నది. అయితే తదీయ రచనల్లో స్త్రీపురుషపాత్రలు విధికి వశంవదులయ్యేవారుకారు. అలాగే ప్రగతివాదముకూడా భారతీయాభ్యుదయ వాదము. ఒకరకంగాచూస్తే, అది కిందు మీదైన కాల్పనిక భావోద్వేగతావాదమే. ఆ ప్రగతి వాదంలో హేయమై నిర్దాక్షిణ్యమైన నీతితో సంబంధము లేని ప్రకృతికి, కవిత్వంలో ఉదాసీనంగా చూడబడిన దళిత పీడిత ప్రజకే, ప్రాధాన్యం ఇవ్వబడుతున్నది. సూత్రప్రాయంగా చెప్పవలసినప్పుడు ఛాయావాదము,అది కాల్పనిక భావోద్వేగతావాదానికీ, వేదాంత సమన్వయానికీ, మధ్యయేర్పడిన సాంకర్య మనాలి; ప్రగతి వాదము అనంతర కాల్పనిక భావోద్వేగతా వాదానికీ, మార్క్స్ ప్రతిపాదిత గతి తార్కిక భౌతిక వాదానికీ, అంతరంలో ఏర్పడిన సాంకర్యము అవాలి.

ఛాయావాదకవులు రసజ్ఞులైతే కావచ్చును, కాని సమస్త నిషేధాలకూ నిర్దాక్షిణ్యానికీ, పీడనకూ, లక్ష్యమైన సామాన్య మానవాళి పడే యాతన వారికి అంతగా తెలియదు. అభ్యుదయవాదులు నిజంగా మానవ వ్యక్తిత్వానికి గ్లాని కలిగించే ఘోరవర్ణనలతో మురిసిపోతున్నారు. ఆ రచనలకూ, క్షీణప్రాయుల క్రౌర్యకాముక మానసికోన్మత్త తాండవాలకూ భేదములేదు. 1930 సంవత్సరంనుంచీ హిందీ రచయితలు మానవులను నవ్యదృష్టితో ఆలోకన చేస్తున్నారు. మత రహిత దృక్పథంలో, స్వాతంత్ర్య సమరాన్ని రకరకాల అంతస్థుల్లో, సామాజికార్థిక స్థాయిలోకూడా వీక్షిస్తున్నారు. మతేతర దృక్పథంతో ఆలోకన చేయడంకూడా స్వాతంత్ర లక్షణాలలో ఒకానొకటి. కాని ఈ అభ్యుదయోదార దృక్పథం (ప్రేమచందు, నవలా రచయిత బాగాచూపినట్టు) ప్రగతివాద తాత్పర్య విషయంకాదు. అయితే ప్రగతివాదం ఆరంభంలో అయోమయంగా రచయితలో సమాజమువైపు సానుభూతి విస్తృతం చేసే ఉద్యమముగా సాహిత్యంలో వైశిష్ట్యము సంపాదించి

నప్పటికి అది క్రమేణా స్పష్టసిద్ధాంత ప్రతిపాదక కమ్యూనిజోద్యమంగా పరిణమించింది; అది ఉదార ప్రజాతంత్ర సంప్రదాయమును సంరక్షించుకొన్న రచయితలలో సంబంధాలు తెంచుకొంటూ ఆడిపోసుకొన్నది. ఆ ప్రగతి వాదోద్యమము రానురాను సంకుచితమైన కమ్యూనిస్టు గూడుపుఠాణీ కాగా, ఆ రచనకూడా క్రమేణ రాజకీయ సిద్ధాంత చోదితమై తద్భావ భావితమైంది. రచనలో (అన్యవాదాల జోక్యం) కాల్పనిక భావోద్వేగతావాదం వ్యంగ్యరూపంలో భాసించినా, అది నిషిద్ధమై పోయింది, కాని అసహనంవల్ల బుద్ధిజాడ్యము ప్రగతి రచనలో పాదుకొనక పూర్వము సిష్ణాతలైన తదీయ సిద్ధాంత వ్యాఖ్యాతలుకూడా ప్రచ్ఛన్న క్రౌర్యకాముక ప్రణయ వైపరీత్యముమండి దూరముకాలేక పోయినారు. యశపాల్ (1904) - నాగార్జున్ (1911) - అనేశక్తి సామర్థ్యాలుగల ఇద్దరిలో మొదటివారు హిందీ నవలా రచనా శిల్పంలో సిద్ధహస్తులు రచనలో వ్యాపృతులు. 'అంచల్' అనే ఉపనామముగల రామేశ్వర్‌శుక్ల (1915)-నరేశ్ మెహతాలు (1924)-మంచిరచయితలు. అంత ప్రముఖులని చెప్పడానికి వీలులేకపోయినా ప్రగతివాద లక్షణమైన ఆంతరభాషా దృక్పథాన్నిబట్టి, హిందీకి బాహిరమైన ఉదాహరణాలను గ్రహిస్తే కృష్ణచంద్ర, ఖ్వాజాఅహ్మద్ అబ్బాస్ రచనల్లో విరళంగా క్రౌర్యకాముక ప్రణయ వైపరీత్యోల్లాసానికి దృష్టాంతాలు, జనప్రీతి పొందిన నిపుణులైన ఈ గ్రంథకారుల్లో గోచరిస్తాయి.

అభ్యుదయ రచన తప్పని సరిగా కార్మిక కర్షక జవావళిని ఉద్దేశించినదనే అపోహవల్ల, ప్రగతివాదము పునఃప్రతిష్ఠితమైంది. ఆ రచనలో సంఘర్షణా సంవళితమయిన సిద్ధసన్నివేశాలలో, మూసలోపోసి తీసినట్టు పాత్రలను ప్రవేశపెట్టి, సిద్ధాంతరీత్యా నడిపించడం కద్దు. ఈ దురవస్థనుంచి ప్రేమచందు హిందీ నవలను రక్షించగలిగినాడు. చాలమంది రచయితలు మధ్యమ తరగతి పట్టణ వాస్తవ్యులు కావడం వల్ల అన్యప్రాంత ప్రజల జీవన పద్ధతులనూ, మనస్తత్వాలనూ, వారి ప్రవృత్తినీ ఎరుగక పోయినా అవి వర్ణించాలని తలంచి పూర్ణమైన అజ్ఞానాన్ని ప్రకటిస్తూ ఉంటారు. వాస్తవిక రచన అనే అబద్ధపురాతలు కుప్పతిప్పలుగా రావడానికి కారణము పైన చెప్పిన మనస్తత్వము తెలియని

రచయితలు. ఈ కుహనా వాస్తవిక రచనను పాశ్చిక విమర్శకులు అల్ప దృష్టి, మూర్ఖాభిమానమువల్ల, అలాంటి రచనలను ఎక్కువగా పొగడు తున్నారు. ఆశ్చర్యం వేస్తుంది ఈనాడుచూస్తే. దానితో సమంగా ఆశ్చ ర్యమువేసే మరో విషయ మేమంటే–హిందీ సారస్వతంలో ప్రేమ చందును మార్గోపదేశకుడుగా, నాయకుడుగా, హిందీ సాహిత్యానికి గోర్కీవంటివాడని ఎన్నికచేస్తూ, ప్రేమచందు కృషిపట్ల ఈ రచయితలు శ్రద్ధచూపడంలేదు. హిందీలో ఆఖ్యాయికా రచనా కారులలో ప్రథముడు. అనగా ఆధునిక నవలలు అనబడే రచనకు ప్రేమచందు మొదటివాడు. ఆయన చాలా తెలివిగా తన సాహిత్య క్షేత్రమును ఎన్నుకున్నాడు. ఆయన తనకు బాగా పరిచితమైన రైతాంగమునుండీ, తన పాత్రలను స్వీకరించినాడు. అంత ఎక్కువ పరిచయములేని కింది మధ్యమవర్గ ప్రజలలోనుంచి, కొన్నిపాత్రలు స్వీకరించినాడు. (ఒకసారి క్షీణించి పోతున్న జమీన్‌దారీ విధానాన్ని లేదా బుద్ధిజీవుల అభివృద్ధిని నిరూపించి నాడు. ఈ యత్నాలు సఫలమైనవనికానీ, సహేతుక మైనవనికానీ, అన దానికి వీలుకావు). ఆయన కర్షక జీవితాన్ని అద్భుత శ్రద్ధతో విశేష సానుభూతితో చిత్రించినాడు.

ఆతని నవలలో కథావస్తువు సుసంబద్ధమైనది. పాత్రల వ్యక్తిత్వో న్మీలనకై వికాసానికి, పాత్రల గాఢ వైలక్షణ్యానికి, సన్నివేశాలు సర సంగా కల్పింపబడ్డవి. ప్రేమచందు తొల్లింటి సంస్కార ప్రభావంతో ఉన్నదినాల్లో గ్రామీణ సమాజాన్ని రసభావ మయంగా చిత్రణ చేయా లనే యత్నించినాడు. పరిపాకము పొందినకొద్దీ ఆయన నిర్లిప్తంగా, సమీక్షాదృష్టి కలిగి, బాగా రచన చేసినాడు. ఆదికాలపు ఆదర్శ సామ రస్యాలు విడిచిపెట్టినాడు. (గాంధీయుగంలో ఆశ్రమము సేవాత్యాగ సామరస్య సంకేతము. ఆశ్రమకల్పనము నవలా రచనా లక్షణమైంది.) సామాజిక ఘర్షణలను రకరకాలుగా సుస్పష్టంగా గుర్తించడం, గాఢంగా చిత్రించడమున్నూ, జరిగింది. ప్రేమచందు నాటినుంచీ, నవల ఒకా నొక శిల్పాకృతిగా వర్ధిల్లింది. అయితే ఆ నవలల్లోని మానవ సాధారణీ కరణాన్ని, ఇంకా అతిక్రమించి పోగలిగిన రచనలు రావలసి ఉంటవి.

ప్రేమచందు సంస్కారాత్మక హేతువాదమునుంచి వాస్తవిక సామాజిక సంఘర్షణను అవగాహన చేసికొనేదాకా, వికాసము పొందినాడు. ఈ వికాసాన్నిబట్టి ఆయన వర్గకలహ సిద్ధాంతాన్ని సంపూర్ణంగా అంగీకరించినాడని, అభ్యుదయవాదులు ఒకానొక సిద్ధాంతము లేవదీసి, ప్రేమచందు హిందీ నవలా వికాసానికి చేసిన దోహదాన్ని, యథార్థ పాత్ర చిత్రణాన్ని వారు పూర్తిగా విస్మరించినారు.

వాస్తవ పక్షంలోచూస్తే ప్రగతివాదంవల్ల స్వతంత్ర రచయితలలో విశాల సహానుభూతి, సూక్ష్మ ఆత్మ సమీక్ష ప్రవృద్ధమైనది. గ్రంథకారుల ఆత్మతృప్తి రూపబుద్బుదాన్ని, నీటుగోటునూ, వారు వదలగొట్టినారు. తత్ఫలీ భూతమయిన కుశాగ్రబుద్ధి సునిశ్చితత్వమున్నూ ఛాయావాదమువల్ల భాషకు ప్రాప్తమైన విశాల గభీరరూప నిర్మాణ శక్తులతో, మేళవించినది. తరువాత వచ్చిన రచనలకు ఈ మనస్తత్వంవల్ల నవ్యలక్షణమూ, రుచీ, కలిగినవి. ప్రగతి వాదమువల్ల జానపద జీవన సాహిత్యములకూ, ప్రాంతీయ సంస్కృతులకూ నవ్యప్రోద్బలము చేకూరింది. ఈ సాహిత్య సిద్ధాంతము కొందరు రచయితలకూ ప్రాముఖ్యం ఇచ్చింది. లేకపోతే ఆ నవ్యులు కొందరు చాలా ఆలస్యంగా సాహితీ ప్రపంచంలో లబ్ధ ప్రతిష్ఠులు అయ్యేవారు. లేదా వారిక్షేత్రము పరిమిత మయినా ఉండేది.

ఈ సాహిత్యోద్యమాలు మరోచోట దశాబ్దాలు పట్టిన ప్రభావాలను కొద్దికాలంలో ప్రవేశపెట్టినవి. ఛాయాప్రగతి వాదాలు (రాజకీయ కమ్యూనిస్టు సిద్ధాంతముగాకాక) సాహిత్యోద్యమాలుగా ఇప్పుడు పోయినప్పటికీ, స్వభావ సిద్ధంగా వాటిరీతిలో రచనలు సాగుతున్నవి; ఈ ఉద్యమాలున్న కాలంలో సంప్రదాయక ధోరణుల్లో కవిత్వము సాగుతూ, ఇప్పటికీ వాసిస్తూ ఉన్నట్టుగానే ఈ యుగానికి సంబంధించినవే మైథిలీశరణ గుప్త కవీంద్రుని ఉత్తమ కృతులు. ఆయన సంప్రదాయక నైతిక పురుషార్థాలనూ దృఢంగా స్వీకరించి, సనాతన లాక్షణిక మార్గమువిడిచి వేయకుండానే, పురోగమించే మానవవాద భావాలకు అనుకూల్యము చూపగల మానసిక వర్ధనక్షమత్వం అద్భుతం! మఖన్‌లాల్ చతుర్వేదీ,

(1888-)[1] బాలకృష్ణశర్మ 'నవీన్' (1897-) అనే కవులిద్దరూ కాల్ప నిక భావోద్రిక్తులైన జాతీయవాదులు. మర్మయోగ పరిభాషవైపు వీరి మనసులు సహజంగా మొగ్గుతవి. 'దినకర్' (రామధారిసింహ్ 1908)- కూడా కాల్పనిక భావోద్వేగ జాతీయవాది. పౌరాణికమైన ఇతివృత్తము స్వీకరించి, ఆధునిక సందర్భాల్లో వ్యాఖ్యాన ప్రాయంగా ఇంపుగా రచన చేస్తాడు. వ్యావహారిక భాషయొక్క నుడికారముద్వారా, రచనలో ప్రబోధము చేస్తాడు ఇటీవలి కృతుల్లో సూత్రప్రాయమై అమోఘ గుణ సంవలితమైన లఘుచాటు కవితాపద్ధతి లేదా హాస్య ధోరణి గోచ రిస్తున్నది.

ఈ కవులను వారిలోవారితోనూ ఛాయావాద కవులతోనూ నవ్యుల తోనూ భాషావిషయంలో పోల్చడం ఉత్సాహ దాయకంగా ఉంటుంది. 'నవీన్' కవి సిద్ధాంతరీత్యా బాగా శుచిని కోరేవాడు. అనగా హిందీ భాషలో సంస్కృత జన్యాలు తప్ప, అన్యశబ్దాలను తోసివేయవలె నంటాడు. అయితే ప్రయోగించవలసినప్పుడు పదము అన్యభాషా జన్య మైనదా కాదా అని ఆలోచించకుండా శబ్దపు పుట్టుపూర్వోత్తరాలు లక్ష్యం చేయకుండానే, ఔచిత్యాన్ని పాటిస్తూ, రచనలో శయ్యా సౌఖ్యం చూచుకొంటూ, పదప్రయోగం చేస్తాడు. తక్కిన కవులిద్దరికీ ఏ పక్ష పాతమూ లేదు. తరుచుగా వారు ఏ పదాలుతోస్తే అవే వేస్తారు. దినకర్ కవి సామాన్యంగా భాషలో అల్లిక సొంపుమీద మనస్సుంచుతాడు. అయినా ఛాయావాదకవులవలె, శబ్దసౌకుమార్యము, మాధుర్యము వీరికి ఎవరికీలేదు. అట్లే నవ్యకవితా లక్షణమైన యత్నపూర్వక శబ్దాలంకార సంయోజనమూ వీరికి లేదు.

బాలకృష్ణరావు (1911) తొల్లింటి కవితా రచనలకూ ఛాయా వాదముతో బాగా పోలికలున్నాయి. ఆయన సానెట్ ఛందస్సును ఉత్సా హంతో వాడినాడు. ఆయన భాష సరళం. భాష సామాన్య వ్యవహార భాషకు సమీపము. ఆయన ఇతివృత్తాలు లఘువుగా ఉంటాయి. అయితే

1 ఆయన గ్రంథము 'హిమతరంగిణి'కి సాహిత్య అకాదెమీ 1955 లో పారితోషికం ఇచ్చింది.—సంపా.

ఆకృతి రమణీయం కావడంవల్ల ఆయన కవిత్వము కమ్మగా చదువు కోవలెననిపిస్తుంది.

సుమన్ (శివమంగళసింగ్ 1916-) కవితలో ఉల్లాసకరమైన సన్నిహిత సౌశ్రాత్రం, కాల్పనిక భావోద్వేగపు పోలికలను ధ్వనింపచేస్తూ ప్రస్ఫుటంగా ప్రగతివాదంలో విశ్వాసము ప్రకటించినాడు. సిద్ధాంతం అవలంబించడం ఆయనకు కుదరదు. ఆయన దీర్ఘకావ్యాలలో శబ్ద ప్రలాపం ప్రయత్న పూర్వకంగా కనిపిస్తుంది. ఆయన సహజహాస్యం వల్ల ఆ కావ్యాలు నిరర్థకత్వమునుండి సురక్షితమైనాయి. అయినా భావ గీతాత్మక ధోరణిలో ఆయన పద్యాల్లో కాల్పనికశక్తి, భావోత్సుకత, ఉల్లాసమూ మనలను ఆకర్షిస్తాయి. ఇంకా చాలామంది రచయితలు రచనా వ్యగ్రులైన వారున్నారు. ముఖ్యంగా కొందరు పైనచెప్పిన ఏ సాహిత్యమార్గాన్నీ స్పష్టంగా అవలంబించక సామాన్యంగా కాల్పనిక భావోద్వేగ వర్ణవైచిత్రితో వేదాంత భావశబలితంగా రచనలు చేస్తున్నారు. 'బచ్చన్' కవి (హరివంశరాయ్ 1907-) జనప్రీతిని పొందిన కాల్పనిక భావోద్రిక్తుడు. రమణీయంగా 'దైవోపహత' జీవులనూ, వినాశసూచనలు, మృత్యువు ఇత్యాది కాల్పనిక భావసామగ్రి స్వీకరించి రెండుదశాబ్దాలపాటు కవిత్వంచెప్పి ఖ్యాతి నిలుపు కొన్నాడు. ఆయన భాష మృదువుగా ధారావాహికంగా, వ్యావహారికమైన నుడికారానికి సమీపంగా ఉంటుంది. అప్పుడప్పుడూ అంత్యప్రాస మాధుర్యాకర్షణకు వశ్యుడై ప్రమాదంలో పడుతూ ఉన్నప్పటికీ, సమకాలిక కావ్యభాష ఇంకా అతనివల్ల ప్రభావితం అవుతున్నదని గట్టిగా చెప్పవీలుకాదు. ఛాయావాద కాలంలో కావ్యభాష వ్యవహార భాషకు తప్పని సరిగా భిన్నంగా ఉంటుందని దురభిప్రాయ మొకటి ఉండేది. ఇది ముఖ్యంగా ఆయన కావ్యరచనలవల్ల నిస్సందేహంగా తొలగిపోయింది. నరేంద్ర శర్మ (1916-) కోమలభావ సూక్ష్మగ్రాహి. ఆయన తరుచుగా ఒక సాహిత్యమార్గము వదలి మరొకదానికివెళ్ళి, మళ్ళీ వెనక్కువస్తూ ఉంటాడు. ఆదిలో ఆయన జానపద, కాల్పనిక భావోద్రేగ, దేశీయ ఛందస్సులలో కొన్ని ప్రయోగాలు చేసినాడు. ఇట్లు ప్రాచీన కావ్య రూపము విడిచిన ఆయన రచనలో ఇప్పుడు సామాన్యంగా వేదాంత

ధోరణి గోచరిస్తుంది; పురాణేతిహాసగాథా సందర్భాలు ఎక్కువగ్రహిస్తూ, సంప్రదాయక ఛందోబందోబస్తులను చివరకు అంగీకరించిన వాడవుతున్నాడు.

భగవతీ చరణవర్మ (1903–) కవితలో కాల్పనికోద్రిక్త భావ చిత్రణము, నుడికారపు సొంపునూ, అతిలోకజ్ఞతతో, మేళవిస్తాడు. ఆయన నవలల్లోనేకాక తరుచుగా హేళన సంవలిత హాస్యం, కవిత్వంలోకూడా జాలువారుతూ ఉంటుంది. ఆయన సక్రమ ఛందస్సుల్లోనే కవిత్వం చెప్పినాడు. ఛందోభంగంవల్ల కవిత్వం సాధ్యమవుతుందని ఆయన అంగీకరించడు.

గిరిజాకుమార్ మథుర్ (1917-) స్వభావ సిద్ధంగా కాల్పనిక భావోద్వేగతగల భావగేయకవి. ఎలాగయినా ఆయన చెప్పిన సౌష్ఠవమైన కవిత్వం ఆ మార్గంలోది. కాని ఆయన కవితాకృతిలోనూ సంవిధానాలలోనూ, ప్రయోగాత్మక పరిశీలనకూ పూనుకొన్నాడు. కావ్యాకృతిలోనూ, నుడికారంలోనూ ఆయన చాలా కృషిచేసినాడు. ఆయన కృషి-అది నవ్యకవిత్వం, నయీకవిత అనే దానికి దారి తీసింది. ఆయన అమెరికా సంయుక్త రాష్ట్రసంచారం చేసివచ్చిన తరువాత, నూతన సారస్వత ప్రయోగాలకు పూనుకొని పోయిపోయి, నవ్యానుభూతికన్న, అతి వేలమైన సాహిత్యవైఖరికి పూనుకున్నట్లు కనిపిస్తాడు.

శియారాం శరణగుప్త (1895-) రెండు యుద్ధాల మధ్యదినాల్లో కవులందరిలో పాశ్చాత్య ప్రభావం రవంతకూడా బహుశః లేనివాడు ఆయన ఒక్కడే. ఎన్నడూ ఆంగ్లవిద్యాభ్యాసం లేనివాడుకూడాను. ఆయన కావ్యకృతుల్లో కోమలభావ విన్యాసము, భావనిష్ఠ, శాంత సమత్వము, నిరలంకృతి, సస్యఫలవంతమైన క్షమాన్విత భరతధరిత్రీ పరీమళం గుబాళిస్తూ ఉంటవి.

సుభద్రా కుమారీ చౌహాణ్ (1904-1951) జాతీయ భావోద్రేకంతో కవిత్వము చెప్పింది. ఏ తత్కాలీన సాహిత్యపరులలో సరళప్రసన్నమై, కరుణార్ద్రమైన, గృహజీవిత చిత్రణంవల్ల, ఆమె విశిష్టస్థానము సంపాదించుకొన్నది. హోమవతి (1904-1951) కథానికలు గృహజీవన చిత్రణంతో, పరిహాసంతో కలకలలాడుతవి. ఆమె వ్యక్తిగత భావావేశా

నికి దూరంగా, నిర్లిప్తంగా ఉండలేదు. లేకపోతే ఆమె కవయిత్రిగా అగ్రగణ్య కావలసిందే.

సామాన్యమైన హిందీసాహిత్యోద్యమంలో జైనేంద్రకుమారును (1905) సులువుగా చేర్చడానికి వీలులేదు. ఆయన నవలలూ, కథానికలూ ఈ యుగసాహిత్యంలో చాలా విశిష్టమైనవని చెప్పాలి. భాష తరుచుగా కొన్ని ఊతతీరులవల్ల సౌష్ఠవాన్ని పోగొట్టుకొన్నా, తరువాత చేసిన రచనల్లో, భావము ఒక్కొక్కప్పుడు హేత్వాభాసలోకీ, శబ్దాలంకారంలోకీ దిగజారిపోయినా, ఆయన చాలా స్మరణీయమైన విశిష్ట పాత్రలను క్రాంతదృష్టితో ప్రవేశపెట్టి, భావనాంకురాల అన్యోన్య గతి చూపి, రసభావపోషణ చేసినాడు. గాంధీమహాత్ముని అహింసా తత్త్వము సహేతుకంగాను పాపాన్నికూడా నిరోధించకుండా బాధను స్వీకరించేదాకా, చూపి ధైర్యంగా ఆ భావాన్ని తుదిదాకా సాగదీసినాడు. ఆయన గాంధీయ తత్త్వాన్ని సృజనాత్మక కళావైఖరిలో వ్యక్తము చేసినాడు. జైనేంద్రుని 'త్యాగపత్ర' అనే చిన్ననవల రచనా నైపుణికి తార్కాణం. ఆయనకథలు చాలా ఉపజ్ఞకలవీ, బుద్ధిసూక్ష్మతతో ఆలోచనలు రేపే బుద్ధికౌశలము కలవిన్నీ. అవి ఆఖ్యాయికా రచనా శిల్ప సౌష్ఠవానికి ఉత్తమ తార్కాణాలు. ఇటువంటి లక్షణాలన్నీ ఆయన వ్యాసాల్లో ఉత్తమమైనవాటిలో గోచరిస్తాయి. అయితే ఆ రచనలు అప్రకృత విషయంలోకి పోవడమూ, సొగసైన శబ్దశ్లేష చమత్కారాల్లో పడి, బాగాదిగజారి పోతున్నాయి.

రెండు కవిత్వోద్యమాలున్నూ పాశ్చాత్యుల కాల్పనికోద్వేగ భావవాదమువల్లనూ, మార్క్సిసిద్ధాంతమువల్లనూ ఉద్దీప్తములుకాగా, సర్వసామాన్యమైన వైజ్ఞానికభావాభివృద్ధివల్ల వచనరచన అందులోనూ విశేషంగా నవలా రచన ప్రభావితమైంది. మతగ్రంథాలను ఇతిహాసిక దృష్టితో పరిశీలనముచేయుట కొత్తతీరుగల చరిత్రాత్మక నవలకు దారి తీసింది. గ్రంథకారుడు సంభావ్య సన్నివేశ శ్రేణిలో, ఎవరోగాథా ప్రసిద్ధ నాయకుణ్ణి సృష్టిచేయడానికి పూనుకోక, ఒకానొక యుగాన్ని పునఃనిర్మించి ఆయుగానికి సంబంధించిన ప్రజాజీవితాన్ని సమగ్రంగా చిత్రించ సాగినాడు.

భగవత్‌శరణ ఉపాధ్యాయ (1910-) కథానికలు రచించి వైదిక కాలమునుంచి మధ్యయుగాలదాకా సామాజిక పరిణామాన్ని సమగ్రంగా చిత్రించినాడు. రాహుల సాంకృత్యాయన (1895) ప్రాచీన గణతంత్ర రాజ్యాల్లో ప్రజాజీవితాన్ని పునఃతీర్చిదిద్ది ప్రదర్శించే యత్నము కావించినాడు. రాంగేయ రాఘవ (1922-) మొహెంజదరో నగరరాష్ట్ర జీవితాన్ని చిత్రించినాడు. అలాంటి పునర్నిర్మాణాలు ఒక్కొక్కసారి ఎలాగయినా చారిత్రకమని అనిపించుకోవు. గ్రంథకారుడికి ఎంత ఉపజ్ఞా వైదుష్యములున్నప్పటికీ. ఎందుకంటే బాహిరమైన జీవితపు ఆకార ప్రకార చిత్రణంలో ఎంత జాగరూకతతో ప్రతివిషయంలో ఎంత శ్రద్ధ చూపినా, అసగా దుస్తులలో గృహపరికరాలలో కర్మకాండాదుల్లో—ఆ రచయిత తత్కాలీన జీవితంమీద ఆధునిక మనోవైఖరులూ, సామాజిక ఘర్షణలూ, ఆరోపించి చొప్పిస్తున్నాడు. అయితే గ్రంథరచయిత ఇతిహాసాన్ని అలీక కల్పన చేయడానికి బుద్ధిపూర్వకంగా నడుముకట్టినాడనలేము. అయితే ఏదో ఒక సిద్ధాంతంమీద తనకున్న పక్షపాతము కొద్దీ, సమాజ వికాసవాదాన్ని చిత్రించి చూపాలనే తహతహే దానికి కారణము. రాహుల సాంకృత్యాయనులు బుద్ధిపూర్వకంగా వర్గసంఘర్షణ సిద్ధాంతాన్నీ, యశపాల్ స్త్రీ స్వాతంత్ర్య ఘర్షణనూ, చూపడం అందుకు ఉదాహరణలు. హజారీ ప్రసాద్ ద్వివేదీ హర్షుని కాలము సమగ్రంగా, సప్రమాణంగా, 'బాణభట్టకీ ఆత్మకథా'[1] అనే నవలలో చిత్రించినాడు. బాణభట్టు స్వీయ జీవితము వ్రాసికొన్న విధానము అవలంబించి తద్వారా ద్వివేదీ అద్భుతంగా మధ్యయుగాల జీవితాన్ని, పునఃతీర్చిదిద్దినాడు. ఇలా పునర్నిర్మాణం చేయడంలో రచయిత బాహిరమైన ఆకారప్రకారముల విషయంలోనేకాక, తత్కాలీన యుగంలో సామాజిక జీవిత మనఃప్రవృత్తులనూ, జాగరూకుడై యథాతథంగా చిత్రించినాడు. పురాసామాజిక జీవితాన్ని తిరిగి తీర్చి దిద్దడంలో,

---

[1] ఈ పుస్తకాన్ని సాహిత్య అకాడెమీ అన్యప్రాంతీయ భాషల్లోకి అనువాదాలు చేయిస్తున్నది. వాటిలో మలయాళం, అసామీ, బాంగ్లా తెలుగు భాషల్లోకి అనువాదాలు ప్రకటించింది—సంపా.

ద్వివేదీ విశిష్టవైదుష్యాన్నీ, అమిత శ్రద్ధనూ చూపినాడు. హిందీలో ఒకానొక రమణీయ సాహిత్యశైలిలో, సురుచిరాలంకార పదగుంభనతో, ఇంచుమించు అననుకరణీయమైన సంస్కృత మాతృకాశైలితో ఉన్నా ధారావాహికంగా, పఠితలు చదువుకొనే తీరులో, నవలారచనచేసి, గ్రంథకర్త కృతకృత్యుడైనాడు. మాతృకలో విషయాలు అద్భుతంగా ఆయన పొందుపరచడమేకాక, యుద్ధకాలంలోని సాహిత్య సృష్టిలో వైశిష్ట్యాన్ని, నవలా రచనలో ప్రావీణ్యాన్ని సంపాదించుకొన్నాడు. గీర్వాణ హిందీ భాషల్లో విద్వాంసుడై, అధ్యాపకుడై, సమీక్షాదక్షుడైన ద్వివేది లేఖినినుండి వచ్చిన నవలకు, రావలసిన గణ్యత, బహుజన ప్రీతి, ఇంకారాలేదు.

బృందావనలాల్‌వర్మ (1888-) నవలలు జనప్రీతినీ, సాహితీ పారితోషికాలనూ, పొందినవి. నవలాకారుడు జమీందారీ విధానము చితికిపోతున్న యుగాన్ని చిత్రించినాడు. కొన్ని నవలల్లో సంవిధాన రీత్యా లోపాలు కనబడినా, ఐతిహాసికకథా కథనమువలె సాగిపోతూ ఉంటుంది. కథావస్తువుతో రచయిత విపరీత భావోద్వేగంతో మమేకము కావడంచేత, ఆకృతిసౌష్ఠవము లోపించింది. అందుకు తారకాణ, ఝాంసీరాణీ అనేనవల. చిన్నదయినా 'ముసాహిబ్‌జూ' అన్ననవల, ఆయన ఉత్తమ కృతికి తార్కాణం.

సిగ్మండ్ ఫ్రాయిడ్, ఆయన అనుయాయుల ప్రభావమూ, హిందీ సారస్వతంలో ముఖ్యంగా నవలా రచనలో, గోచరిస్తున్నది. సాహిత్య సమీక్షపైనా, సమకాలిక ఐరోపీయ నవలలపైనా, స్పష్టంగా మనో విశ్లేషణాత్మకభావం ప్రచురంగా ఉన్నప్పటికీ, తద్భావ ఫలితాలను వివరంగా పరామర్శ చేయనక్కరలేదు. అవి హిందీకి సంబంధించి నంతవరకూ విశిష్టములుకావు. మనో విశ్లేషణాత్మక రచనా విధానము అనుసరించినవారు అంతగాలేరు. (1802-) ఇలాచంద్రజోషీ ఒక్కడే మనోవిజ్ఞాన మార్గగామిగా చెప్పుకోతగినవాడు. ఆయన రకరకాల మన స్తత్వాలను నిరూపణచేస్తూ, విభిన్నపాత్రసృష్టి కావించినాడు. కథలో ఆయన చిత్రించిన వాతావరణము దుఃఖభూయిష్ఠమూ, నైరాశ్యజన కమై, రుగ్మతకు సమీపంలో ఉంటుంది. ఆయన నవలల తాత్పర్యం

అంత ఘనంగా లేదు. దానికి కారణం ఆయన నవలల్లో సన్నివేశ పరం పర, అసంభావ్యము కాకపోయినా, పాత్రల ప్రవృత్తులు అతిశయించడం వల్ల, సంభావనా విరహము కల్పించేటంతగా ఉన్నది. పైగా పాత్రల ప్రవృత్తులు వైవిధ్యంలేక ఒకే మోస్తరుగా ఉంటవి. రచయిత కథాకథ నానికి ఎన్నికచేసిన పక్కీ స్వీయచరిత్ర విధానం. ఇది బాగా స్పష్టము. ఒక్కొక్కసారి కథకుడు అంతగా దారి తొలిగిపోక, సన్నివేశాలకు దూరంగా పోకపోవడంచేత, కథ ధారావాహికంగా నడుస్తుంది. ఆయన ప్రథమ రచన 'సన్యాసి' అన్న నవల. బహుశః అదే ఉత్తమకృతి అనవలె. అనంతరం వచ్చిన రచనలు ఎక్కువ పౌనఃపున్యంగా, ఉపా ఖ్యానాలతో నిండిఉంటవి.

ఈ యుగ సాహిత్యలక్షణం రచయితలలో ప్రవృద్ధమవుతున్న బహుముఖ కాల్పనిక స్వభావం. చాలమంది గ్రంథకర్తలు నవలారచ నతోపాటు, కవిత్వం చెప్పినవారే. వారు తరుచుగా సమీక్షాత్మకమైన గద్యవ్యాసాలనుకూడా రచన చేసినవారే. అదేరీతిగా భగవతీ చరణ వర్మ నవలారచయిత, శియారామ శరణగుప్త వ్యాసాలతోపాటు, దీర్ఘ లఘు నవలారచనలు చేసినారు. 'బచ్చన్', నరేంద్రశర్మ, సుభద్రా కుమారీ చౌహాన్ కథానికలు రచించారు. మఖన్‌లాల్ చతుర్వేదీ, దినకరులు వ్యాసాలు రచించారు. వారి కవిత ఎలాగయినా సంప్ర దాయసిద్ధంగానే వాసించింది. ప్రాచీన లాక్షణికులు నిర్ణయించిన ఛందోరీతుల్లోనే, వారు కవితను తీర్చి దిద్దినారు. శియారాం శరణగుప్త కొంత చెప్పకోతగిన విశిష్టమార్గము అవలంబించినాడు. పైన చెప్పినట్ట నరేంద్రశర్మ స్వేచ్ఛాఛందస్సుల్లో యత్కించిత్ సాహసాలు చేయక పోలేదు. అందువల్ల సంవిధాన దృష్టిలో యోచిస్తే 'నిరాలా' 'పంతు'ల తరువాత, నవ్యభావన, నవ్యవైఖరుల్లో వ్యక్తము కావలసి ఉన్నది. 1930 తరువాత నవ్యభావ వ్యక్తీకరణము గోచరించింది. కొద్దిమంది కవులు తాదృశయత్నాలు ఎవరిమటుకు వారు చేస్తూవచ్చారు. అయితే 1943 లో ప్రచురితమైన నవ్యకవితా సంకలనంవల్ల సంప్రదాయానికి భంగము ప్రారంభమయింది. ఈ వ్యాసంలోనే కొంతముందుకువెళ్ళి, ఈ కవితా ప్రయోగ ధోరణిని గురించి వివరిస్తాను.

## మానవ వాదము - వ్యక్తిత్వాన్వేషణము

ఈయుద్ధాంతర యుగంలోనే ఎలాగో నెమ్మదిగా, అస్పష్టంగా, కాని గాఢంగా, పరివర్తనం ప్రవృద్ధమవుతూనే ఉన్నది. అది ఛాయావాదం వలె, కేవలం ఆత్మాశ్రయమైనదీకాదు, ప్రగతివాదం వలె ద్రవ్యసంబంధము కలదీ కాదు. అయితే మానవుని వైపు పునః దృష్టి సారించి అవగాహన చేసుకోడమే దీనికి మూలము. అది విశిష్టమై సమగ్రమై మానవుని పరిపూర్ణ మానవవ్యక్తిని ఆలోకన చేయడమే. దీనివల్ల సాహితీ చైతన్యం గాఢంగా స్పందించింది. సూక్ష్మావగాహన కొత్తతీరులో విస్తృతమైంది. నిజానికి పైే చెప్పిన రెండు సాహిత్యోద్యమాలు ఉబుకుతున్న ఈ ప్రవాహపు పొంగుపై, కేవలం తరంగాలవంటివిగా వర్ణింపదగును. ఛాయావాదంలోని భావోద్రేకపు వెల్లువకూ, స్వప్నకల్పనకూ, ప్రతీకారంగా ప్రగతివాదం ఉంటూవచ్చింది. అలాగే ప్రగతివాదపు నీరసమైన ఉపదేశాత్మకతకూ, వెనువెంటనే అతిగా ధర్మ ప్రబోధ పరాయణతకూ, ప్రతీకారంగా ఛాయావాదము నిలిచింది. ఒకానొక మహాగాఢ పరివర్తన రూప ప్రవాహానికి ఉపరితలమువలె, ఉద్యమత్రయం ఉండగా దీనికి ఒకపేరు ఆదిలోనే సూచించాను. అదే వ్యక్తిత్వాన్వేషణం.

ఈ మహా పరివర్తనాన్ని ఒకే ఒక భాషలో, సాహిత్యోద్యమానికో, సంబంధించిందిగా పరిమితంగా తావన్మాత్రంగానో, కేవలం యావద్భారత దేశానికి మాత్రమో, లేదా దిగుమతి అయిన రాజకీయ సిద్ధాంతాలకు సంబంధించినదిగానో అవగాహన చేసికోరాదు దీనికి ప్రధాన కారణము పాశ్చాత్య ప్రభావము. పాశ్చాత్యులవైపు సంతృప్త దృక్పథంతో ఊడడమంటే వ్యక్తిత్వాన్వేషణమే. ప్రాగ్దేశీయుల వైపు ఆధ్యాత్మిక సమిష్ట్యాత్మ దర్శనం చేయడం చాలా దిగజారినపుడు అదొక ఆత్మరక్షణ చేసుకొనే జీవిత విధానము. చాలా ఔన్నత్యానికి వెళ్ళితే అది ఒక తీవ్రమైన ఆధ్యాత్మిక పరీక్ష. సర్వపురుషార్థాల మూల్యాలన్నింటి పునర్నిర్ణయం. గతంలో పవిత్రాలూ, అనుల్లంఘనీయాలున్నూ, అయిన సమస్త పురుషార్థనిరాసమునుంచి ప్రకృత దుఃఖోపశమిత స్థితిద్వారా, భారతీయుల సూక్ష్మవివేకము నిజమైన మూర్ధాభి

మానవత్వం దాకానో లేదా సంస్కృతి సముద్ధరణం దాకానో, రమారమి ప్రసరించింది. భారతీయుల సామాజిక రాజకీయయోచన పారి|శామికాభ్యుదయోల్లాసం నుంచి, పాశ్చాత్య భయోత్పాదక కేవల భౌతికవాదం దాకా, సాగినట్టుగా విస్తృత మధ్య దేశీయ భావసాధనమైన హిందీకూడా దాని బాధ్యత లన్నింటినీ వహించి ప్రచలితమైన ప్రభావాలన్నింటినీ ప్రతిబింబింప చేసుకొన్నది

ఈ స్వల్ప వ్యాస పరిమితిలో ఈ విస్తృత ఘర్షణను వివరంగా పరిశీలించడానికి ఆవశ్యకత లేదు, సాధ్యమూ కాదు. 'తూర్పు' అనే భారతీయ కల్పనా కథ తత్సముద్భవమని పరిశీలించడం సబబుకాదు. ఈ 'తూర్పు' పాశ్చాత్య దృష్టికి ఆభాసగానో, ఉంటుంది. భారతీయులకు పాశ్చాత్యదృష్టిలో ప్రతిబింబితమైన 'తూర్పు' వింతగా గోచరించినట్టే. సాహిత్యమార్గ చరిత్రకు సంబంధించినంతవరకూ, ఉల్లేఖనీయమైనది ఏమంటే చివరకు శాస్త్రీయ సామరస్యము సాధ్యమయ్యేలోగా, సువిశాల పరిపూర్ణ|కాంత దర్శనసీమ అంగీకృతము అయ్యేలోపల నానా 'వీర' పూజాత్మక శాఖలు క్రమక్రమంగా ఉద్భవించాయి. ఉపదేశాత్మక, కాల్పనిక భావోద్వేగాత్మక, ప్రగతి వాదాత్మక యుగాలన్నీ, ఒక్కొక్కనాయకుణ్ణో, లేదా ప్రముఖుణ్ణో, పైకి తెచ్చాయి. ఛాయావాద నాయకుడు, మహాదేశభక్తుడూ, సంప్రదాయక ఆధ్యాత్మిక పురుషార్థాల విషయంలో తాత్పర్యం కలవాడైనాడు. ప్రగతివాద నాయకుడు పార్టీ నిర్మాతగానో, ఆందోళన చేసేవాడుగానో, కామ్రేడ్ లేదా కార్మికుడుగానో అయినాడు. దేశభక్తి తప్పని సరిగా ఆధ్యాత్మికానికి దారితీసింది. దానికి కారణం వేదాంతంలో గాఢ తాత్పర్యం ఉండడ మన్నమాట. అనగా దానికి పర్యాయపదము పాశ్చాత్యద్రవ్యవాద నిరాసం. ఈ యుగంలో హిమాలయమును సంబోధిస్తూ రచించిన అసంఖ్యాక గేయ గీతిక లన్నీ పైచెప్పిన భావాన్నే వ్యక్తం చేస్తున్నాయి. దేశభక్తి భావ తీవ్రత, మర్మకవిత్వ పరిభాషతో సమన్వయం చక్కగా పొందింది. ఈ విషయం మఖన్‌లాల్ చతుర్వేది, నవీన్ వంటి కవులల్లో, గోచరిస్తుంది.

## నాయక నిష్క్రమణం

ప్రస్తుత సందర్భంలో దీనికి ఐతిహాసికమైన వినోదమే కలదు. ప్రకృత భారతదేశము ప్రపంచములో ఒకానొక భాగంగా పరిగణింప బడుతున్నది. అయితే అర్ధశతాబ్దం కిందట లేదా దశాబ్దం కిందట అలా భారతదేశము పరిగణింపబడలేదు. ఇప్పుడు ప్రాక్ పాశ్చాత్య భేదము అంత గాఢమూ, విశిష్టమున్నూ కాదు. ఆధునిక శాస్త్రసిద్ధాంతములు అంగీకృతాలు కావడంతో అవగాహనలోకి వచ్చినవి. నేటి యువభారతీయ రచయిత తనకూ పాశ్చాత్యరచయితకూ, సూక్ష్మవివేచనములో ప్రాథమిక భేదం ఉన్నదని తలంచునని గట్టిగా చెప్పలేము. అందుచేత హిందీలో ఛాయా ప్రగతివాదుల 'నాయకులు' సహజంగా నిష్క్రమించి శాస్త్రీయ మానవవాదానికి చోటివ్వవలెను. సమకాలిక స్వభావము వీరపూజాత్మకము కాదు. అంతేకాని వీర వ్యతిరేకముకాదు. గ్రంథకర్తకు మానవనిర్మాణోల్లాసంలేదు. యథాతథంగా మానవుణ్ణి మానవుడుగా అన్వేషించడంతో తృప్తిపడి దానికి చాలా ప్రాముఖ్యమిస్తున్నాడు. సమకాలిక హిందీ రచయితలందరూ రచనలో సామాన్య మానవునితో సంబంధం పెట్టుకొన్నారు. మానవుడి సామాన్యత, సహజ ప్రేమ, ఆకాంక్షలు, ఆకలి కోరికలు, దుఃఖాలు, సుఖాలు గ్రహిస్తాడు. వీటి విషయంలో సామాన్యతకూ, విశిష్టతకూ, వ్యతిరేకతలేదు. మానవుడు సామాన్యుడు, అయినా ప్రతివాడూ వ్యక్తిగా విశిష్టుడు. ఈ మతాల నుంచి సమకాలిక రచయిత ఆశావాదిగా, మానవాన్వేషణకు బయలు దేరినాడు. ఇదికూడా సమకాలిక సాహిత్యరచనలో ఒక లక్షణం. అందులోనూ ముఖ్యంగా నవ్యకవిత్వంలో పాతపడ్డ కాల్పనిక భావోద్వేగుల నైరాశ్యం, ప్రగతివాదుల బలవంతపు టాశావాద సువర్ణోషస్సుల్లో కర్మకారుడు తనను గుర్తించుకోవడం ఈ రెండూ తొలగి వాటి స్థానే మానవ వాదంలో పరిమితత్త్వం అల్పత్వం గుర్తిస్తూనే మానవీయ విశ్వాసం స్థాపితమైంది. ప్రాథమిక పురుషార్థాలను సాధించకుండా సామాన్య మానవుడు వైతొలగి పోవడానికీ, తన మహా సంపదను సమర్పణ అనగా స్వేచ్ఛగా వ్యక్తిత్వాభివ్యక్తికి ఉపలబ్ధికి ఏరకమైన యాంత్రిక

విధానము, ప్రజానియంత్రణం, రాష్ట్రమే మార్గదర్శకత్వం వహించడం, రాష్ట్రపోషణ ఆటంకాలు, పురుషార్థాలు, ప్రమాదాలు బలహీనతలను కవి వాస్తవిక మానవస్థితివలె ఎదుర్కొంటాడు. ఈ విశిష్టతవల్ల స్థూలంగా చూచేవారు నవ్యకవితకు 'అనాస్థ' అనే దోషం ఆపాదిస్తున్నారు. ఈ శబ్దాన్ని అనువదించడం కష్టము. కాని ఆ శబ్దము విశ్వాస హీనతను లేదా పూజ్య గౌరవ హీనతను లేదా పురుషార్థాల అజ్ఞతనూ ఈ మూడు భావాలను ద్యోతకం చేస్తుంది. నిజానికి పురుషార్థాల యెడ నవీనంగా గాఢంగా పూజ్యభావం కలుగుతున్నది. వాటి యాథార్థ్యం అధికంగా బోధ పడుతున్నది. కొన్ని సంవత్సరాల కిందట రచయిత శకలాలలో తనను తనను చూచుకొన్నవాడు, ప్రస్తుతం శకలాలన్నింటినీ తిరిగి నిర్మించాలనే, అవశ్యకత త్వరితంగా గ్రహించినాడు. ప్రస్తుత కాలంలో పురుషార్థ ప్రయోజనం మూలమట్టంగా అధికతరంగా మానవుడు గ్రహించినాడు. అయితే అందుకు పారమార్థిక ప్రమాణాలు కోరడంలేదు. మానవతను మించిన పురుషార్థాలకోసం మానవుడు లెక్కవేయడంలేదు. వీర నాయక భావన కాక సామాన్యమానవతను గుర్తించే మూల్యాలే సమాదరణీయా లయినవి.

## ప్రయోగవాదము - నవ్యకవిత్వము

నవ్యాధునిక మానవ వాదము వ్యక్తిత్వాన్వేషణకు పూనుకొన్నది. ఈ మహోద్యమానికి ప్రయోగవాదమనే నామకరణం చేయబడింది. ప్రత్యేకంగా ఈ పదాన్ని ఔచిత్యంతో వాడిందికాదు. మొదట ఛాయావాదమనే శబ్దాన్ని ఉపయోగించినట్టే దీని న్యూనార్థంలోనే ప్రయోగించారు. నవ్యకవితా ధోరణిని వ్యక్తము చేయడానికి 'తారాసప్తక'మనే ప్రథమ సంకలనం వచ్చింది. అందులో అవతారికలో 'ప్రయోగ' మనే పదము వాడుకచేసినారు. దానితో మూలవిచారణకూ ప్రయోగమునకూ ఆ శబ్దము ఉపయోగించినారు ఈ అస్పష్టమైన గసికకు శబ్దాన్ని వ్రేలాడగట్టినారు. గాఢనైతిక ప్రయోజనంతో నవ్యమైన పురుషార్థాలను అన్వేషించి మూల్యాల స్రోతస్సు అయిన అంతఃకరణను శోధించడమే, ప్రయోగ శబ్దానికి అర్థమైతే, ఈ నవ్యరచనకు ఆ పదము యుక్తమే.

ఈ కోవకు చెందిన కవులు సర్వసామాన్యంగా తమ కృతులను నవ్య కవిత్వమని అంటున్నారు.

నవ్యోద్యమము అనగానే అన్నిటిలోవలెనే ఇందులోకూడా దగాఖోరుల సంఖ్యకు లోటుండదు. నవ్యసాహిత్య ప్రక్రియాన్వేషణం, నవ్యభావుకులకు అవసరంకాగా, సాహిత్య రంగంలో పైకిరాదలచిన కొందరు అశిక్షితులకు ఆకారప్రకారాలు పాడుచేసి, పద్యాలేవో అల్లి నవ్యకవిత్వంగా చెలామణీ చేయడానికి, ఆ ఉద్యమము వీలుకలిగించింది నవ్యకవిత్వమనే పేరుతో ఎంతగా అన్యదేశీయాలతో జుగుప్సాకరంగా విసుగు పుట్టిస్తూ, అవలంబించిన వైఖరిని ఉపజ్ఞగామూ, చురుకైన పదాల అల్లిక, ప్రతిభా సంజనిత భావోద్దీపనంగానూ, కొందరు భ్రమ కలిగిస్తున్నారు. దీనికితోడు సాహిత్య పత్త్రికా సంపాదకులు దురదృష్టవశాత్తు సామాన్యంగా గొప్ప విమర్శనపాటవంగానీ, సమ్యక్ దృష్టిగానీ లేనివారైనారు. అయితే ఇందుకు భిన్నంగా సమర్థులు లేరని కాదు. ఆదికాలంలో సంపాదకులూ, యజమానులూ, ఒకరయిన కాలంలో తప్ప, సామాన్యంగా సంపాదకులకు నిర్ణయంలో ధైర్యం కూడాలేదు. అందుచేత వారిప్రభావము నిర్మాణాత్మకంగా లేకుండా పోయింది. పత్రికలో ప్రచురణార్థంవచ్చే రచనలను వారు వివేకంతో ఎన్నిక చేయడం లేనేలేదు. ఏ చెత్తపడితే అది, పత్రికలో అచ్చుపడుతుంది, పూర్తిగా నిషేధంచేసే వాటిల్లోతప్ప

ఈ యుగంలో సంపాదకీయ ప్రమాణాలు అవ్యవస్థితమై, పతనమై తీవ్రంగా ద్వేషకలుషితం కావడం, ఒకానొక ప్రత్యేకత అయిండి సాహిత్య విమర్శకుడున్నూ తనకర్తవ్య నిర్వహణంలో, అసమర్థుడు కావడం గమనించవలసిన విషయం. మహాభారతీయ గ్రంథాలకూ, అనేక ఐరోపీయ గ్రంథాలకూ, అనువాదాలూ, అనుకరణాలూ, హిందీలో లభ్యమవుతున్నవి. సమకాలిక సృజనాత్మక రచనలను సమీక్షించడానికి, బాధ్యతగల సమర్థులైన విమర్శకులు అంతగాలేరు. భారతీయ సంప్రదాయాన్నిబట్టి, సానుభూతితో వ్యాఖ్యచేయడం, గుణదోష ప్రదర్శనం మాత్రమే యోగ్యమని మూల్యనిర్ణయము భావితరాలవారికి విడిచిపెట్టబడేది. నేడు ఆశ్చర్యకరమైన విషయమేమంటే, విమర్శకుడు

ఆదినుంచీ అంతందాకా నిర్ణయాధికారిగా ఉండడానికి త్వరపడు తున్నాడు. అలా చేయడంవల్ల విమర్శకుడు కవి పాఠకుల మధ్య అఖాతం గాఢము చేయడమే కాని సేతువు కట్టడు. సర్వసామాన్యంగా వైరంకాకపోయినా ఉదాసీనం ఉన్నందున బహుశః కొంతవరకు తత్ఫలితంగా, సమకాలిక రచయిత, అధికంగా పూర్వంకన్న ప్రయత్న పూర్వకంగా మనస్సాక్షిగల నిర్మాత, శిల్పి కాగలిగినాడు. కవితా ధ్యయన ప్రాముఖ్యం, ఆంతర శిక్షణకూడా అధికంగా అతని ఆమో దాన్ని పొందినవి.

అయినప్పటికీ క్రొత్తతీరులో రచనల వైఖరి అంతా సాహిత్య ప్రయోగస్థితిలోనే ఉందని భావించడం పొరపాటు. ప్రయోగస్థితిలో ఉన్న రచనలన్నీ, నవ్యకవిత్వంగానూ అపోహపడకూడదు. పైగా రాజకీయ సిద్ధాంతాలవల్ల, సాహితీ సారస్యగ్రహణంలో తీవ్ర మత భేదాలు వచ్చాయి. కోమల కవిత హృదయము కలవాళ్ళు కావడంచేత అందరూ కలిసికట్టుగా ఉంటారనుకోవడం న్యాయమేకాని దానికి బదు లుగా, పరస్పర ద్వేషంతో మానసికంగా స్థిరమైన రాజకీయ తత్వాల వల్ల శత్రుకూటాలుగా రచయితలను పెట్టి వర్ణించవలె. ప్రగతివాద రచ యితలు కొందరు ప్రయోగవాదుల నూతన సాహిత్య ప్రక్రియలవల్ల బాగుపడి, వాటిని తమరచనలకు అనుకూలంగా చేసుకున్నారు. నవ్య సూక్ష్మకోమల భావరస గ్రహణకు కొందరు సహాయపడినారు. అయితే వారిని ప్రయోగవాదుల కోవలో చేర్చడానికి వీలులేదు. వారిని తక్కిన సాహిత్యవాదుల్లో చేర్చవలెను. షంషేర్ బహదూర్‌సింగ్ (1911-), భవాని ప్రసాద్‌మిశ్ర (1914–) లను తార్కాణాలుగా పేర్కొనవచ్చును. మొదటివారి రచనలో ఉరుదూసాహిత్యంలోని మెరుగుజిలుగులు, తీవ్రత, కోమలత, సిద్ధించినవి. గాఢచాతుషజ్ఞానంవల్ల, ఆయన జపా నీయ 'హోకు' కవితాకృష్టుడైనాడు. అయితే ఆయన వ్యర్థపదాలు వేయక అతిపొదుపుగా శబ్దాలువాడడమూ, భావోద్రేకం దూరదర్శినిలో వలె ప్రదర్శించడమూ, అతను ప్రజాకవి కావడానికి అడ్డంకులు. ఆయన కవితా ప్రావీణ్యమును శంకించవలసిన పనిలేదు. ఆయన ప్రధా నంగా 'కవులకు కవి', అంతేకాని "ప్రజాకవి" కాదు ఇక నుడికార

ములో. భావాభివ్యక్తీకరణ వైఖరిలోనూ భవానీ ప్రసాదమిశ్ర ప్రజలకు సన్నిహితంగా ఉంటాడు. ఆయన శబ్దజాలము, వాక్యప్రక్రియలోనేకాక, వాక్యగమనలోనూ వ్యవహారంలో ఉన్న భాషకు రమారమి సమీపము. సంప్రదాయక ఛందస్సులు అతిక్రమించకుండా, 'బచ్చన్' కవి వెళ్ళిన మార్గమును భవానీప్రసాదు అనుసరించి, స్వతంత్రంగా నవ్యసీమల్లో విహరించి, సమకాలికోద్యమానికి సాహాయ్యము చేసినాడు.

నవ్యకవిత్వోద్యమం ప్రయోజనాపేక్షగల సమస్యా సంబంధాన్ని పెట్టుకొన్నదికాగా, నవీన మానవవాద స్వభావం సృజనాత్మక వచన రచనల్లో బహుముఖాల ప్రతిబింబిత మవుతూ వచ్చింది. లోగడ చెప్పి నట్టు బహుముఖ కల్పనా సామర్థ్యం రచయితల్లో వ్యక్తమవుతూనే ఉన్నది. నవీన రచయితలు కేవలం ఏ ఒకానొక సాహిత్య ప్రక్రియకూ, అకారప్రకారానికీ బద్ధులుకాలేదు. ప్రయోజనాపేక్షతో ఆవశ్యక సమస్యలపై దృష్టిని లగ్నముచేసిన కవులు, వస్తువును సవిమర్శంగా పరిశీలించి కొంత రచన సాగించినారు. వారు సృజనాత్మక చిత్తవృత్తినే బహుభంగుల శోధించి, రచనలు చేసినారు. ధర్మవీరభారతి (1926-) యువరచయిత సర్వతోముఖ ప్రజ్ఞాశాలిన్నీ. ఆయన భావ వ్యక్తీకరణం అనేకరీతుల్లో ప్రకటితమైంది. ధర్మవీరసహాయ్ ఒక పద్యనాటిక కూడ రచనచేసినాడు. సర్వేశ్వర్ దయాళ్ సాక్సేనా, రఘువీర సహాయ్, 'మదన వాత్స్యాయన' జగదీశగుప్త, వి. యశ్. సాహి, హరివ్యాస, కున్వార్ నారాయణ, పి. యన్. త్రిపాఠీ ప్రభృతులు వృద్ధిలోక రాగల రచయితలు.

ఈ ఉద్యమంతోపాటే సమకాలికంగా వచ్చిన మరొక ప్రయోగ వాదాన్ని ఉగ్రరూపంలో ప్రాంతీయంగా పరిమితమై విజృంభించిన దాన్ని పేర్కొనాలి. బీహార్‌లో ముగ్గురు కవులు ఈ సాహిత్యోద్యమానికి కారకులు: నళినీవిలోచనశర్మ, 'కేసరి', నరేశకుమారులకు నవ్యాంగ్ల కవులు ఎజ్రాపౌండ్, ఇ. ఇ. కమ్మింగ్స్‌లవల్ల భావోద్దీపనం కలిగింది. సమకాలిక కవితా సంవిధానాధ్యయన దృష్ట్యా. వారి ఉద్యమము తెలిసికొనుట ప్రయోజనకరమూ వినోదకరమూను. కాని ఘనంగా అది సాధించినది అంటూ ఏమీలేదు చెప్పడానికి ఇంతవరకూ.

యాథార్థ్యశోధన క్రమంగా ప్రాంతీయ నవలారచనకూ కథారచనకు దారితీసింది. ఈ ప్రేరణతోపాటు విశాల మానవ మహాకారుణ్యం వల్లనూ, గద్యంలో పద్యంలోనూ, జానపదజీవితం సున్నితంగా చిత్రితమైంది. కవిత్వంలో కవిభావన జనపదాలవైపు ప్రేరేపితమైంది. నవ్యతాకర్షణంవల్ల నవ్యసాహిత్య ప్రక్రియల్లో, భావాభివ్యక్తీకరణం చేయాలనీ, ఛందస్సుల నవ్యగతుల్లో భావం పోహళించాలనే మహోత్సాహనికి, సముచిత స్థానమివ్వాలి. సిద్ధాంతపు ఒత్తిడివల్ల ప్రజానీకం కోసం ప్రజల నుడికారంలో రచన చేయవలసి వచ్చింది. శంభూనాధసింగ్, కేదారనాథ అగర్వాలు, త్రిలోచనశాస్త్రి, కేదారనాధసింగ్ ప్రభృతులను పద్యరచయితలుగా పేర్కొనాలి. జానపదదేశీయగీతికా స్వరాలు ఇతరులను చాలామందిని ఆకర్షించినప్పటికిన్నీ ఫణీశ్వర నాథ 'రేణు' (1921-), మార్కండేయ (1931-), కేశవ ప్రసాద మిశ్ర, మనోహర్ శ్యాంజోషి, శివప్రసాదసింగులు, యువకు లయిన గద్యరచయితలు వారు హిందీ కథా నవలా క్షేత్రంలో ప్రాంతీయ జీవితచిత్రణ చేసినారు. ఫణీశ్వరనాథరేణు 'మైలాఅంచల్' అనే నవల ప్రాంతీయ రచనలలో విశిష్టమైనది. రుద్ర 'బహతీ గంగా' అనే నవలలో, కాశికానగర జీవితాన్ని అనేక తరాలనుంచీ, పూర్ణంగా చిత్రించ యత్నించినాడు. ఇతఃపూర్వం పేర్కొన్న నాగార్జున్ ప్రాంతీయ జీవితస్థితిని బాగా చిత్రించి, నవలా క్షేత్రానికి విశిష్టదోహదము చేసినాడు. అమృతలాల్ నాగర్ నవలలు ప్రాంతీయాలుగా పరిమితముకాక, అందులో అతడు సమాజంలో ఒకానొక వర్గ జీవితాన్నే, ఏకదేశంగా చిత్రించినాడు. వాస్తవికాన్నే శోధించాలనే ఉద్దేశ్యం వల్లనే బుద్ధిపూర్వకంగా ఈ నవలాకారుడు దృష్టి పరిమితం చేసుకొన్నాడు. సన్నివేశంలో హాస్యకల్పన చేయడంలో తనకు సూక్ష్మదృష్టి ఉండడం చేత ఈ నవలాకర్త కథావస్తువును ప్రపంచించి, అందము అధికంగా కూర్చినాడు.

పద్యనాటిక, స్వాప్నికభావనాటికలూ, సాహిత్యంలో వచ్చిన నవ్యధోరణులు నిస్సందేహంగా రేడియో ఇటువంటి రచనకు ప్రోద్బలం ఇచ్చింది. అయితే అదే అలాంటి సాహిత్యానికి ముఖ్యకారణము కాదు. చాలా రేడియో శ్రవ్యనాటికలను శ్రవణము చేస్తున్నాము. అయితే సర్వ

సామాన్యంగా భారతదేశంలో ప్రసారమయ్యే వాటిల్లో, గుణ విశిష్టంగా ఉండేవి కొద్ది. కేవలం ఆకాశవాణికోసం ప్రత్యేకంగా వ్రాయబడని శ్రవ్యనాటికలలో కొన్ని మంచివి లభ్యము కావచ్చును. ఇక్కడ కూడా సజీవమైన రంగ సంప్రదాయంతో నాటకకర్తకు సంబంధము లేకపోవడం ఒకగట్టిచిక్కు. ఉపేంద్రనాథ అశ్క (1910-), రామకుమారవర్మ (1905-), లక్ష్మీనారాయణమిశ్ర (1903-), జగదీశ చంద్ర మథుర్, భారతభూషణ్ అగ్రవాలు (1919-) చెప్పుకోతగిన రచనలుచేసి, ఈ సాహితీక్షేత్రాన్ని సంపన్నము చేసినారు.

ఇంతవరకూ సంక్షిప్తంగా పరామర్శించిన ఈ యుగంలో సనాతన ఛందస్సులను మొత్తంమీద విడిచిపెట్టకుండా, భావగీతికా రచన చేసే కవులు చాలామంది ఉన్నారు. భావగీతా రచన అనడంవల్ల, స్వల్పసంఖ్యా పరిమితమనే అనుకోనక్కర్లేదు. భావగీతాలంటే చెవి కోసుకొనే రసికులున్నారు. అందువల్లనే ఆ సాహిత్యానికి జనామోదం కలగడంతో, భావగేయ కవులు అధికంగా వ్యాప్తిలోకి వచ్చినారు. కాని అలాంటి సాహిత్య రచనలో ఉపజ్ఞ గోచరించని మాట నిజము. నవ్యసాహిత్య సరణిలో, సమకాలిక సాహిత్య (ఒక్కహిందీలోనే కాదు) భావగేయ కవిని చేర్చడంలేదు, తక్కిన పిసలయిన గేయరచయితలనుండి ఇట్టివారిని మర్యాదగా వేరుచేయడానికి వీరిని భావగేయ రచయితలనడం స్థూలమైన సమకాలీన సాహిత్యాలోకనం సృజనాత్మక సాహిత్యానికే పరిమితమై ఉండడం మంచిది. సమకాలిక సారస్వత సమీక్షను సమీక్ష చేయడం ద్విగుణీకృతంగా ప్రమాద భూయిష్ఠం. విమర్శల్లో ఎన్నో రాగద్వేషాలు ఉంటాయి. అవశ్యకమైనచోట్ల సూటిగా కాకుండా, ఔచిత్యాన్ని మీరకుండా, కొన్ని సందర్భాలు నేను పరామర్శచేసి విడిచినాను.

లోగడ నేను చెప్పనే చెప్పినాను సమకాలిక సారస్వతాన్ని సవిమర్శంగా సింహావలోకన చేయడంలో తప్పని సరిగా కొంత వివాదానికి అవకాశం ఉండి తీరుతుంది. ప్రస్తుత వ్యాసకర్తకు ఆ విషయము తెలిసి అవశ్యకమైనదాన్ని తప్పించుకోలేక పోయినాడు. రాగద్వేషాలకు తాను అతీతుణ్ణి అని ఈ వ్యాసకర్త చెప్పుకోడంలేదు. అలా చెప్పుకొన్నప్పటికీ

ఋజువు చేయడం సాధ్యము కాని విషయము దూరంగా ఉండి అలోకన చేస్తున్నప్పుడే తగినంత నిస్సంగిత కలగవచ్చును. అయితే సాహిత్యావలోకనం సంపూర్ణంగా కాని, కొన్నింటినిగాని, చేసే సందర్భంలో వివాదాస్పదమైన ఉల్లేఖనము భావప్రకోపాన్నికానీ, ఉద్దీపనాన్నికాని, కలిగించ వచ్చును. సాహిత్య పరిచయముగల వారిలో చర్చ రావచ్చును. అంతగా సారస్వతాభినివేశం లేనివారికి కొంత ఔత్సుక్యము రేకెత్తవచ్చును. అంతేకాని, ప్రమాదము మాత్రం లేదు. తనసాహిత్య పరిశీలనంవల్ల. కొందరు సాహిత్యాభినివేశము లేనివాళ్ళు కూడా, విశాల హిందీ సారస్వత క్షేత్రంలో ఆత్మవిశ్వాసంతో, వైజ్ఞానికోత్తేజయ రసానందం కలిగించడానికి సమర్థమైన దృక్పథంతో అన్వేషిస్తారని ఈ వ్యాస రచయిత ఆశిస్తున్నాడు.

## ఆకరగ్రంథ జాతము


Indo Aryan and Hindi.
*By Dr. S. K. Chatterjee, Gujarat Vernacular Society.*

Modern Vernacular Literature of Hindustan.
*By G. A. Grierson; Calcutta, 1889*

Hindi Literature.
*By E. Greaves*

History of Hindi Literature.
*By F. E. Keay; Heritage of India Series*

Hindi Literature.
*By .R Dwivedi; Banaras, 1953*

Linguistic Survey of India.
*By G. A. Grierson, Vol. IX, Pt.1, pp. 1—605*

# భారతీయాంగ్ల సాహిత్యము

కె. ఆర్. శ్రీనివాస అయ్యంగార్

## పరిచయము

భారతదేశంమీద బ్రిటిష ప్రభావంవల్ల, అన్యవిషయాలతోపాటు, భారతీయాంగ్ల సాహిత్యమని చెప్పడానికి అనువైన ఆకర్షణీయాంగ్ల రచన ఉదయించింది. కాని నిజానికి ఇటలీదేశపు ద్విముఖాకృతికల జేనసు దేవతవంటిదీ సాహిత్యం. ఇందులో మొదట భారతదేశంలో ఆంగ్లేయులు సృష్టిచేసిన సాహిత్యం ఉన్నది. లేదా సకృత్తుగా ఆంగ్లేయులు కాల్పనిక భావోద్రేకం కలిగి, సుదూరంనుంచి, భారతాన్ని ఆలోకించి ముగిసి, భారతదేశాన్ని కథావస్తువుగా చేసి, కావించిన రచనలున్నవి. ఛాసర్ కవి కాలంనుంచీ ఆంగ్ల రచయితలు తమ కృతుల్లో భారతదేశానికి సంబంధించిన ఐతిహ్యాలు అస్పష్టంగా అక్కడక్కడా నిస్సందేహంగా వికీర్ణం చేస్తూనే ఉన్నారు. ఆంగ్ల భారతీయ సాహిత్యం భారతీయ భావాంకురాలవల్ల, భారతీయ తత్త్వంవల్ల, భావోద్దీప్తిని పొందిన ఆంగ్లేయులు సృష్టిచేసిన సాహిత్యం, నిజానికి 18 వ శతాబ్దాంతంలో విలియం జోన్సు మహాశయునితో ఆరంభమవుతున్నది. ఫలవంతమైన సంస్కృతి ద్వయపరస్పర సంపర్కం ఆసన్నమైనట్టు గోచరించింది. కాని నిజానికి ఆంగ్లభారతీయులు లబ్ధావకాశాన్ని వినియోగించుకోలేక పోయినారు. జోన్సు, లేడెన్, సర్ ఆల్‌ఫ్రెడ్ లయర్, సర్ ఎడ్విన్ ఆర్నాల్డులు, ఆశలు కల్పిస్తూ సాహిత్యారంభము చేసినారు. అయితే ఆరంభమూ, అవసానమూ, కూడా అదే అయింది. సౌజన్య శీలము కలవాళ్ళయినా, ఆంగ్లభారతీయులు సామాన్యంగా తమ జాత్యాధిక్య భావంవల్ల, మైకంలో పడ్డారు. ఆ స్వభావము ముదరడంచేత సంస్కృతులు రెంటికీ యథార్థంగా సామరస్యం అసంభవమైపోయింది. ఉడుకు

తున్న భారతీయ భారతలోక సంబంధం పెట్టుకోక, అహంప్రత్యయంతో విశ్వాసమూ ఆలోకమూ లేక, సామాన్య ఆంగ్లభారతీయ రచయిత, (ఇ. యఫ్. ఓటిన్ అన్నట్టు) దారి తప్పినాడు, "నిర్జీవ నిష్ప్రయోజన శైలవనాల్లో." ఒకవంక 'భారతదేశయానము' రచించిన ఫార్‌స్టరు వంటి మహా గ్రంథమున్నూ, అవ్వలి కొసను 'భారతదేశంమీద తీర్పు' అనే నీవోల్ చేసిన అపమార్గ రచనవంటివీ, ఆంగ్లసాహిత్యంలో హఠాత్సంఘటనలే కాని ఆంగ్ల భారతీయ సారస్వతములో ఉత్తమ రచనకు కాని అధమ రచనకుగాని ఉదాహరణ లనరాదు. భారతీయ స్వాతంత్ర్యోదమం కావడంతో ఆంగ్లభారతీయ సాహిత్యము తన విశిష్ట ప్రతిష్ఠను తప్పనిసరిగా కోల్పోయింది. ఇంకా ఆంగ్లేయులు (అమెరికావారు)న్నూ భారతీయ నేపథ్య చిత్రణము ఇంచుమించుగా చిత్రించగలుగుతున్నా, ఆ సాహిత్య వైశిష్ట్యము తరిగిపోయింది. ఇక రెండవది. భారతీయులు ఆంగ్లములో సృష్టిచేసిన సాహిత్యం ఉన్నది. దాన్ని 'హైందవాంగ్ల సారస్వత'మని అనడం అనుచితం కాదు. జార్జిసాంప్సన్ తన 'సంక్షిప్త కేంబ్రిడ్జియ ఆంగ్ల సాహిత్య చరిత్ర'లో భారతీయ గ్రంథరచయితలు ఠాకూర్, మన్ మోహన్ ఘోష్, శ్రీ అరవిందుల వంటి వారిని చేర్చినప్పటికీ, హైందవాంగ్ల సాహిత్యం' అనే ఖండంలో వారి సాహిత్య కృషిని గురించి వ్యాఖ్యానాలు చేసినప్పటికీ, భారతేతి వృత్తాలను స్వీకరించి రచనలు కావించిన ఆంగ్లేయులనూ, ఆంగ్లభాషను తమ భావశిల్ప వ్యక్తీకరణకు సాధనంగా చేసుకొన్న భారతీయ రచయితలనూ, వేరు చేయడం అవశ్యకం. 1883 లోనే కలకత్తాలో 'హైందవాంగ్ల సాహిత్యం' అనే గ్రంథం ప్రకటితమైంది. అందులో 'దేశీయ విద్యార్థుల రచనల మచ్చులు' ఉన్నవి. ఇటీవల గత పాతికేళ్ళలోగా హైందవాంగ్లేయమనే పదము చెలామణిలోకి వచ్చింది. ఆ శబ్దానికి జాతిపరంగా కానీ, మతధార్మికపరంగా కానీ ప్రాధాన్యం లేదు. గ్రంథకారుట్టీ సారస్వతాన్ని పేరు పెట్టి వర్ణించడానికి ఆ పదము వీలైనది. ఆ పదమే వ్యవహారంలో స్థిరపడిపోవడంలో ఆశ్చర్యంలేదు.

ఈ రచయిత పి. ఇ. యన్. అనే గ్రంథకార సమితికొరకై వ్రాసిన హైందవాంగ్ల సాహిత్యమనే చిన్న గ్రంథానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో

శ్రీ శే. డాక్టర్ సి. ఆర్. రెడ్డి ఇట్లా ఉద్ఘాటించారు :

" హైందవాంగ్ల సాహిత్యము భారతీయ సాహిత్యంకన్న రూపంలో భిన్నమైంది కాదు. అది దానిలో ఒకానొక అంశము. వేదములే మొదలుగా ప్రసరింపజేయుచున్న మహోజ్జ్వల ప్రకాశముయొక్క నవీన కోణము. దేశ కాల కాఠిన్యాలవల్ల అప్పుడప్పుడు తదీయ భావము అధికమైనా అల్పమైనా, నేటివరకూ వృద్ధి పొందుతూనే ఉన్నది. నేటి రవీంద్రదాసాల, అరవిందులతో శశ్వదుద్దీప్తిని పొందుతూ, విస్తృత భవిష్యత్తులో మానవతా వ్యాప్తితోపాటు ఇంకను విస్తరించే లక్షణాలతో ఉన్నది.

ప్రకృతము భారతీయ సాహిత్యం ' ఆధునిక దశ'లో ఉన్న దానివయసు నూరేళ్ళు. 17, 18 శతాబ్దాల్లో, ఒకప్పుడు వైదుష్యానికీ లలితకళా సంస్కృతులకూ నిలయంగా ఉన్న యీ విశాలోపఖండంలో,. సువ్యవస్థిత విద్యావ్యాసంగం అని చెప్పడానికి యోగ్యమైనది ఏదీ లేదు. తీవ్రంగా కృషి చేయలేదు ఎవరూ. ఇంకా మిగిలి ఉన్న కొద్దిపాటి సంప్రదాయక విద్యాపీఠాలకూ లక్షలాది నిరక్షరాస్యులకూ మధ్యగల అఖాతానికి సేతువు నిర్మించే కృషి సాగలేకపోయింది. భారతప్రజానీకాన్ని వచించడానికి వీలుకానంత భౌతిక, మానసిక, ఆధ్యాత్మికమైన. అలసత్వము పట్టుకొన్నది. భారతీయ సంస్కారవాహిని జాతీయ దాస్యకూప మరుభూమిలో మృగ్యమైపోయినట్టు గోచరించింది.

కొంతకాలానికి ఎలాగయినప్పటికీ, బ్రిటీషువారి ప్రభావము కావలసిన ప్రేరణత్రయాన్ని మన కిచ్చింది. శ్రీ అరవిందులు చెప్పినట్టు " అది నిద్రాణమైన మానసిక విమర్శనాత్మక స్వభావాన్ని పునరుద్ధరించింది. జీవితానికి పునరావాసము కల్పించింది. నవ్య సృజనాత్మక సంకల్పాన్ని మేలుకొలిపింది. నూతన పరిస్థితులను ఆదర్శాలను ఉజ్జీవిత భారతహృదయము ముఖాముఖి ఎదుర్కొనేటట్టు చేసింది. అది వెంటనే గ్రహించవలసిన ఆవశ్యకతను, అవగాహనను, వాటిని జయించుడానికి శక్తినిచ్చింది.'' నవ్యభావాలు నవ్య సాహిత్యమున్నూ వేళ్ళుతన్ని శాఖోపశాఖలై పెరగవలెనంటే, నవీనభావ ప్రయోజనములకు అనురూప శీతోష్ణస్థితి కల్పించాలి. అది పరిచితమైన భారతీయ క్షేత్రము

కావచ్చును. అయితే ఆధునిక పరికరాలూ, సంపన్నమైన దోహదమూ ఆవశ్యకాలు. రాజారామమోహనరాయలు మహాదిగ్దంతి. ఆయన క్రాంత దృష్టి, ఫలవంతమైన సమయానుకూలత, కలిగినవాడై నవశక్తిభరిత భారతాన్ని, స్ఫుటమైన రేఖాకృతిలో కలలుకని, దానిని వెంటనే సిద్ధింప చేసుకోవాలని, కఠిన సాధన చేసినాడు. దేశమంతా ముద్రణ యంత్రాలు క్రైస్తవమత ప్రచారకులు స్థాపించి, బైబిలు చౌకగా భారతీయ భాష లన్నింటిలో ప్రకటించారు. ప్రాచ్య విద్వాంసులు భారతీయ వైదుష్యానికి కొత్తమలుపు తిప్పినారు. మహాగ్రంథా లనేకము శిథిలమై పోకుండా లోకానికి అందించినారు. కొన్నాళ్ళు ఎలాగయినా, ఆంగ్లభాషా పక్షపాతులున్నూ, సనాతన దేశీయ విద్యా సంవర్ధకులున్నూ, వాగ్వాదంతో అలసి సొలసినారు. అయితే చివరకు సంస్కరణాభిలాషులకు విజయము చేకూరింది. రామమోహనరాయలూ, ఆయన మిత్రులూ, అనుచరులున్నూ, విప్లవాత్మక ఉత్సాహాభిమానాలు కలవారు కావడం చేతనూ, క్రైస్తమత ప్రచారకుల విద్యావ్యాపక కృషివల్లనూ, మెకాలే నిర్దేశించినట్లు ఆంగ్లభాషా మూలంగా ఉండవలె ననే ఆధునిక విద్యా ప్రణాళికను 1835 లో ప్రభుత్వం అనుసరించడం చేతనూ, భారతీయ విద్యావ్యాసంగ సంస్కృతులకు కనీసం రాబోయే ఒక శతాబ్దిపాటు, ఆకార ప్రకారాలు నిర్ణీతములైనాయి.

నెమ్మదిగా, అయినా నిశ్చలంగా, ఆంగ్లభాషద్వారా విద్యాప్రదానం చేసే పాఠశాలలూ, కళాశాలలూ, సంఖ్యలో అధికమై గౌరవప్రతిష్ఠలు తెచ్చుకొన్నవి. ఒకటి రెండు తరాల్లో భారతీయులు అమితంగా (ముఖ్యంగా ఆంగ్లం) ఐరోపీయ సాహిత్య సంస్కృతుల పెన్నిధులకు పరిచితు లయినారు. నవ్య విద్యాలయాల్లో ఓజోవంతమయిన విద్యావ్యాసంగం చేసి, ఆశీస్సులు పొందిన చాలమంది యువకులు, విశ్వ సంస్కృతి చిత్రంలో భారతదేశాన్ని పునః ప్రతిష్ఠించాలనే మహాకాంక్షతో, అమితోత్సాహు లైనారు. మూగగా గోచరిస్తున్న దేశము. పునఃవాణీముఖరితము కావాలని వారు తపించారు. అనగా సహజంగా తమంతట తామే రచనకు పూనుకోవాలి. ఆంగ్లభాషలోనో, మాతృభాషలోకూడా రచనలు చేయాలి. ఆంగ్ల రచనలవల్ల తమ ఆంగ్ల

ప్రభువుల మెప్పులు పొందుతూ, వివిధ భాషారంగాలలో, ప్రజలను విద్యావంతుల్ని చేయవలె. వారు అంగ్లంలోకాని, మాతృభాషల్లోకాని, రచనలు చేసినా, నూత్న సారస్వత ప్రక్రియలకు అంగ్లసాహిత్యాన్ని అన్వేషించారు. ఆధునిక ఐరోపీయ సాహిత్యములో వారికి తెలిసినది ఆంగ్ల సాహిత్యం ఒక్కటే. పాశ్చాత్య ప్రభావ మనే ఆ పూతం మంటి బెడ్డను తిరగవేసింది. అంగ్లసాహిత్యంవల్ల క్షేత్రము సారవంతమైంది. కాలక్రమంగా ఆధునిక భారతీయ సాహిత్యం ఉద్భవించింది. ఆధునిక వంగ, హిందీ, మహారాష్ట్ర, ఆంధ్ర, తమిళ, ఘూర్జర సాహిత్యాలవలె హైందవాంగ్ల సాహిత్యము కూడా భారతీయ సాహిత్యమే. ఆ సాహిత్యములో ఉజ్జ్వల సంప్రదాయము, ఇంకా పూర్ణజీవశక్తి చిహ్నాలూ, ప్రకటిత మవుతున్నవి. భారతీయాంగ్ల సాహిత్య చరిత్రను అసమానమైన యుగపంచకంగా స్థూలంగా విభజించవచ్చును :-

1820 - 1870 : అరంభము - మహామార్గ దర్శకుల యుగము
1870 - 1900 : భావోజ్జీవనము - మతధార్మిక సాహిత్య జాగృతి
1900 - 1920 : రాజకీయ జాగృతిశకము - వందేమాతరమ్ - హోమురూలుయుగము
1920 - 1947 : గాంధీయ విప్లవశకము - ఆధునిక 'వీరపురుష' యుగము
1947 - : స్వాతంత్ర్యశకము

ఈ రీతిగా నిరపేక్ష్యంగా కాకపోయినా యుగవిభజన చేయడానికి వీలుగా ఉన్నది. నిష్కర్షగా యుగ విభజనకు అవకాశం ఉండదు.

## 1820 — 1870

అంగ్లంలో భారతీయుల ఆదిరచన వచనంలో సాగిందని తలచవచ్చును. రాజారామమోహనరాయలే భారతీయాంగ్ల వచన రచనలో ప్రప్రథముడూ, మహానుభావుడున్నూ. నిజానికి ఆయన భావమార్గదర్శి. ఆయన మహామేరువువంటి వ్యక్తి. మన జాతీయ జీవితంలో అనేక శాఖల్లో ప్రయోజనాపేక్షాత్మక సంస్కరణాన్ని ప్రారంభించినాడు. ఏమిచేసినా అయన ప్రధానంగా నిర్మాత. నవ్య భవిష్యద్భారత ప్రతి

స్థాపనకు భూమిని నిష్కంటకమూ పరిశుద్ధమూ చేయవలసిన అదృష్టము ఆయనకు కలిగింది. అంతేకాక ఆయన ప్రసన్నాంగ్ల వచన రచనా ప్రవీణుడున్నూ. 'క్రీస్తు సిద్ధాంతాలు' (1820) వంటి పుస్తకాల్లో, అనేకమైన ఇతర వచన గ్రంథాల్లో, కరపత్రాల్లోనూ, అత్యాకర్షణీయమూ, పటిష్ఠమయిన ఆయన ఆత్మీయత ద్యోతక మవుతున్నది.

రామమోహనరాయలు ఆత్మవిశ్వాసంతో అవలీలగా నిజప్రావీణ్యము చూపిన ప్రథమ భారతీయాంగ్ల వచన రచయిత అయితే, హెన్రీడిరొజీయొ ప్రథమ భారతీయాంగ్లకవి. 1807 లో ఆయన జన్మించాడు. ఆయనది ఒడుదుడుకులతో వక్రమంగా సాగని జీవితం కొంత వరకు. 1831 లో కలకాతో గతించాడు. 'జుంఘీరాఫకీర్' అనే గణనీయమైన కథనాత్మకకావ్యం ఆంగ్లంలో రచించినాడు. మరికొన్ని కావ్యాలతోపాటు. డిరొజీయొ సగము భారతీయుడు, సగము బుడతకీచు అయినా, భారతీయ హృదయ భావపూర్ణమైన కవితచెప్పి, భారత జాతీయ కవి కావాలని కాంక్షించినాడు. కవితా సాధనలో గణనీయంగా సిద్ధిపొందినాడు. ఆయన కావ్యకృషి సర్వస్వముకన్న, భవిష్యత్తులో వర్ధమానకవి కాగలడని కలిగించిన ఆశకు ఎక్కువగా ఆయనను మెచ్చుకోవలెను. 'మరొకమార్గ దర్శకుడైన కవి, కాశీప్రసాద్ ఘోష. "షాయిర్ - అన్యపద్యాలు", (1830) అన్న కావ్యప్రణేత. కాని గ్రంథంలో కావ్యగుణము వస్తుతః అల్పము.

బొంబాయి, కలకత్తా, మదరాసు విశ్వవిద్యాలయాలు, 1857 లో ప్రతిష్ఠింపబడగానే కొత్తతరంవారు మిల్టన్ కవీశ్వరుని మహాకావ్యగానము అనుకరణముచేస్తూ, బర్కురచించిన మహోపన్యాస ధారావాహిక శయ్యాగాంభీర్యాన్ని శుకానువాదముచేస్తూరాగా, భారతీయాంగ్ల రచయిత తన సాహిత్యము చదివి మెచ్చుకొనే పాఠకలోకము త్వరితంగా వర్ధిల్లుతున్నదని గుర్తించినాడు. చాలమంది యువకులను ఆంగ్లపత్రికా రచన ఆకర్షించింది, కాని కవిత్వారాధకులూ లేకపోలేదు. వారిలో మైకేల్ మధుసూదనదత్తు ఉచ్చస్థాయికి చెందినవాడు. ఆయన భారత క్రైస్తవుడు. ఆయనకున్నూ అదృష్టము చిక్కెదురైనది. ప్రధానంగా ఆయన వంగసాహిత్యానికి సంబంధించినవాడు. అయితే మదరాసులో

ఆంగ్లపత్రికా సంపాదకత్వంతోపాటు, ఆయన ఆంగ్లభాషలో, కథ నాత్మక కావ్యము 'శృంఖలాబద్ధమహిళ' (1849) అనే శీర్షికతో, సంయుక్త పృధ్వీరాజుల కథ స్వీకరించి విశదంగా కవిత్వం చెప్పినాడు.

## 1870 — 1900

వీరు మార్గదర్శకులు. కాని చాలామంది భారతీయ భావనావ్యక్తీ కరణమూ, ఆంగ్లసాహిత్య ప్రక్రియనూ. మిధునీకరించి వృధా యాస పడి అనుకరించి, సాహిత్యవ్యాసంగము చేశారు. వీరిని 19 వ శతాబ్దా రంభంలోని ఆంగ్లసాహితిలోని [1] కాల్పనిక భావోద్వేగులయిన కవులూ, నవలారచయితలున్నూ, ప్రమాదకరంగా ఆకర్షించారు. కాని భారతీ యాంగ్ల సాహితీసాధన కేవలమూ కాకి బంగారపు మెఱ మెఱ మాత్రము కాదు. ప్రకృతము ఎలాగయినప్పటికీ కాలస్వభావాన్ని అనుసరించి చాలమంది అసాధారణ యువకులు, స్త్రీ పురుషులూ, పదేపదే ఆంగ్ల భాషలో, భావవ్యక్తీకరణంచేసి కృతకృత్యులు కాగలిగినారు. 19 వ శతాబ్దపు తుది దశాబ్దత్రయంలో నూత్న ఆధ్యాత్మికోజ్జీవనం అద్భుతంగా ప్రఫుల్లమైంది. శ్రీ రామకృష్ణపరమహంస, పాశ్చాత్యనాగరకతా వ్యామో హమువల్ల తాత్కాలికంగా అంధులయిన భారతీయులకు, నేత్రోన్మీల నము కలిగించి చిదాకాశపు దివ్య వైభవము చూడమన్నాడు. వివేకా నందుడు వెంటనే గురుదేవుని సందేశాన్ని, నాగరక ప్రపంచ ప్రత్యం తాలకు తీసికొనివెళ్ళినాడు. వేదాంతభావ వివరణకూ, ప్రచార ప్రబో ధము నిమిత్తం ఆయనకు ఆంగ్లవాణి ఉపకరించింది. బ్రాహ్మసమాజ, ఆర్యసమాజ, ప్రార్థనసమాజోద్యమాల మతాచార్యులుకూడా, పరిపూర్ణ ప్రావీణ్యంతో అవలీలగా ఆంగ్లభాషను భావవ్యక్తీకరణకు అను కూలంగా మలచుకొన్నారు. భారతీయాంగ్ల కవిత్వచరిత్రలో అరుదత్తు, (తొరుదత్తు) తరులతాదత్తుల మూలంగా ప్రప్రథమం యధార్థమైన సఫలతాప్రాప్తి అనే అధ్యాయాన్ని చేరగలిగినాము. కాని సాఫల్యంతో విషాద ఘటన సంభవించింది. 1874 లో అరుదత్తు, 1877లో తొరు

---

[1] రొమాంటిక్ కవులు

దత్తు ఇరవై ఇరవయ్యొక్క సంవత్సరాల వయసులోనే గతించారు. డిరోజియోవలె అరు, తోరుదత్తులుకూడా 'అప్రాప్తయశస్సుకు వారసులై' అనల్పసంసిద్ధి పొందిన కవయిత్రులూ, అపూర్వ విధముగా వృద్ధికి రావలసినవారున్నూ. 1876 లో వారు 'A Sheaf Gleaned in French Fields' (పరాసు పొలాల ఏరిన పన) అన్న శీర్షికతో, పరాసువారి కాల్పనిక భావగేయాలను ఆంగ్లానువాదాలు చేసి ప్రకటించారు. ఆ భావగేయ సంపుటిలో అరుదత్తు తన ఖండికలు కొన్ని చేర్చినాడు. వాటిలో ప్రసిద్ధమైన ప్రభాత వైతాళికగేయాన్ని 'Morning Serenade' చదివి, అద్భుతానంద పరవశుడైనాను ఆంగ్లకవి ఎడ్మండ్‌గాస్. ఆ కవితా ప్రచురణమునకు మూలకారణము తోరుదత్తు. ఆమె తక్కినకవులకు ప్రధానంగా భావోద్దీపన కలిగించింది. నిజానికి ఆ కవయిత్రీనామమే ముఖపత్రంమీద గోచరమైంది. 1882 లో ఆమె గతించిన తరువాత 'Ancient Ballads and Legends of Hindustan' (పురాతన భారతీయ ద్విపదలూ గాథలూ', అన్న ఆమె కావ్యసంపుటి ప్రకటితమైంది. వైదేశికభాషలో కవిత్వ భావాభివ్యక్తిసామర్థ్యం, ఆమెకు లీలాప్రాయమన్న విషయము, నిరూపితమైంది. సావిత్రి, సీత, ధ్రువ, ప్రహ్లాదుల, ఆఖ్యానాలు చర్వితచర్వణమే అయినా, ఆ కవయిత్రిచెప్పిన కవితలో స్వచ్ఛ నవ్యలావణ్యము గోచరిస్తుంది. తోరుదత్తుకావ్యాలు లోకంలో తొలిసారిగా ప్రకటితమై ఇప్పటికి ఎనభై ఏళ్ళు ఐనవి. కాని హెచ్. ఎ. యల్. ఫిషర్ చెప్పినట్టు, 'మహాంగ్లకవి సదస్సులో' ఆమె నామము చిరస్థాయిగావుండి తీరుతుంది.

అరు, తోరుదత్త కవయిత్రులవలెకాక, రమేశచంద్రదత్తు యావజ్జీవం పూర్ణగౌరవము పొందినాడు. ఆయన బహుకాలము జీవించినాడు. ఆయన ప్రాచీన భారతీయ నాగరకతాచరిత్ర (1890), బ్రిటీషుపాలిత భారతదేశంలో ఆర్థికచరిత్ర (1902), విక్టోరియాయుగంలో భారతదేశము (1904) అనే గ్రంథాలేకాక, రామాయణ మహాభారతాలకు ఆంగ్లపద్యానువాదాలు చేసినాడు. ఆంగ్లంలో Lake of Palms (తాళ్ళచెరువు), Slave girl of Agra (ఆగ్రాబానిసపిల్ల) అనే

నవలలు ఆయన వంగనవలలకు అనువాదాలుగా వచ్చినవి. రమేశ చంద్రుని రామాయణ మహాభారత సంక్షిప్తీకరణము అద్భుతము, ఎందుకంటే ఆయన ఇరవైనాలుగువేల శ్లోకాలుగల రామాయణాన్ని, 2,00,000 శ్లోకాలున్న భారతాన్నీ, నాలుగువేల ద్విపాదఛందంలోకి (లాక్స్లీహాల్‌ఛందంలో) కుదించినాడు. మహాకావ్య మాతృకలను మొరటుగా సంక్షిప్తముచేయక, చాలా ఉపాఖ్యానాలు, అప్రధానమైన కథనాత్మకభాగాలు తగ్గించి వచనంలో ఆవశ్యకమయిన తావుల్లో, అనుసంధానము చేయడంవల్లనూ. ఆయన క్లుప్తంచేయగలిగి కృతకృత్యుడైనాడు. రమేశచంద్రుని ఆ మహాకావ్యానువాదాలు కాలపరీక్షకు నిలవగలిగినవి అనుటే వాటిప్రశస్తి తెలుపుతుంది. నేటికి మన మహాకావ్యాలకు, అవి ఆంగ్లంలో ఉత్తమ పీఠికాప్రాయంగా ఉన్నవి. భారతీయాంగ్లరచయితల్లో రామకృష్ణ పిళ్ళె (Tales of Ind, 1895) బ్రహం జీమలబారి (The Indian Muse in English Garb; (1876), The Indian Eye on English Life, (1893) నగేశ్ విశ్వనాథ్‌పాయ్ (Stray Sketches in chakmakpore, (1894), The Angel of Misfortune, 1904) అనేవారు వచ్చారు. ఈ కవిత్రయంలో పాయ్ అద్భుత ప్రతిభావంతుడు. ఆయన గ్రీకు థియోఫ్రాస్టువలె వ్యక్తులను చిత్రించడంలోనూ, కథాకథనంలోనూ కూడా ఆంగ్లభాషను సాధనము చేసుకొన్నా, పూర్తిగా భారతీయ వాతావరణము సృష్టిచేయగలిగినాడు. ఆయన రచనలో విశిష్టవ్యక్తిత్వం ఉన్నది. రామకృష్ణ పిళ్ళె నవలా రచయిత కూడాను. Padmini (1903), The Dance of Death (1912) అనేవి ఆయన నవలలు. ఆ రచనలు సంస్కారముగల మధ్యమ వర్గీయుల అభినివేశ స్థాయిని మించిపోలేదు.

## 1900 — 1920

మహాదిగ్దంతులయిన రవీంద్ర అరవిందుల వైపు మనము దృష్టి సారిద్దాము. అతివిశాల కర్మక్షేత్రము లెన్నిటిలోనో మహాశక్తి ప్రదర్శించినవారు. వారు, 19, 20 శతాబ్దాలకు సేతువు కట్టినవారు. మన

ఖిప్పుడు రమారమి అరవై సంవత్సరాలపాటు లోకాన్ని ఉత్పాతలు ఊగించిన మహావ్యక్తుల సమక్షంలో ఉన్నాము. భారతజాతీయ కాంగ్రెసు ప్రతిష్ఠితమయినప్పటినుంచీ, రాజకీయరంగంలో నిస్పందేహంగా క్రియాభిముఖంగా ఒకానొక చలనం ఏర్పడింది. కాని ప్రస్తుత శతాబ్ద ప్రథమదశకంలోనే జాతీయోద్యమము ఉజ్జ్వల లక్ష్యప్రయోజనాలు పొందింది. వందేమాతరమ్! అది భారతీయ జాగరిత జాతీయ పునరుద్ధరణకు మంత్రమైంది. మొదట వంగదేశమూ, ఆ వెంటనే యావద్భారత దేశమున్నూ, తదీయారావమునకు క్రియాముఖం ప్రతిస్పందించింది. ఆకస్మికంగా కావ్యకర్తలు కార్యవాదులైనారు! కార్యకర్తలు కావ్యకర్తలుగా మారినారు. దానికి కారణము: వైదేశిక క్రౌర్యము వారిని కారాగారబద్ధులను చేయుటే. శ్రీ అరవిందుడు 'నారాయణ దర్శనమును' ఆలీపూర్ జైల్లో రచించినాడు. మండలే కారాగారంలో తిలక్ మహాశయుడు 'గీతారహస్యము' రచించినాడు. వందేమాతరమ్, హోమురూలు ఉద్యమాలవల్ల, ప్రథమ దశకద్వయంలో నాయకులకు ఇరవయ్యో శతాబ్దిలో కఠినసాధనా, వీరోచిత బాధాసహనమున్నూ అలవడినవి. తత్కాలీన సాహిత్యంలో, — భారతీయాంగ్ల సాహిత్యము సహా — సాధన, బాధ, జయ పరాజయాలున్నూ, యథాతథంగా ప్రతిబింబిత మైనవి.

నిజంగా రవీంద్రుడికి వంగసాహిత్యంలోనె మహోన్నతస్థానం ఉన్నప్పటికీ, పరిస్థితుల ప్రేరణవల్ల (అది చాలామందిని ప్రేరేపించింది). ఆయన ద్విభాషా రతయిత కావలసివచ్చింది. ఈ రీతిగా భారతీయాంగ్ల సాహిత్యంలోనూ, ఆయనకు శాశ్వతస్థానము లభ్యమైంది. ఆయన తన పద్యాలకూ, నాటకాలకూ ఆంగ్లానువాదాలు చేసుకోడమేకాక, స్వయంగా ఆంగ్లంలో 'శిశువు' అనే కావ్యరచన చేసినాడు. అందులో అన్నిరకాల స్త్రీ పురుషులు ఉహాతీర్థమయిన సిద్ధికి పయనిస్తారు. ఆ వర్ణనము మనోహరము. ఇబ్సెన్ రచించిన బ్రాండ్‌నాటకంలోవలె, ఆ రచన అవతరించింది ఆయన ప్రఖ్యాతమయిన 'సాధన' 'జాతీయత' 'ఆత్మీయత' 'మానవుడి మతము' (1930), అనే వచన గ్రంథాలు ఆంగ్లమూలాలంలో రచించినాడు ఖండాంతర పాఠకలోకాన్ని ఉద్దేశించి. ఏ సారస్వత

ప్రమాణాల రీత్యా నిర్ణయించినా, రవీంద్రుని బహుముఖ సారస్వతకృషి సహృదయామోదము కలిగించి తీరుతుంది. ఆయన వంగీయులకేకాదు, భారతదేశానికేకాదు, యావత్ప్రపంచానికే ఆమోదము కలిగిస్తాడు. కవి, కథాకారుడు, నవలారచయిత, తత్త్వవేత్త, విద్యావేత్త, సంస్కారోజ్జ్వల మానవతా ప్రవక్తగా, భారతీయోజ్జీవన యుగంలో కవీశ్వరుని ఆత్మీయతా ప్రకాశములోని భిన్నముఖములు. 'ఆయన మన కవాటమును తట్టినాడు. సర్వబంధములూ విడిపోయినవి. మన కవాటపాటనమైనది.'

అరవిందఘోషు, అతని సోదరుడు పెద్దవాడు మన్‌మోహన్ విద్యాభ్యాసము ఇంగ్లండులో చేసినారు. అక్కడ ఉండగానే వారికి కీర్తి వల్లరి సిద్ధమైంది. మన్‌మోహన్ రచించిన పద్యాలకు మురిసిపోయి, ఆస్కార్‌వైల్డు అనే ఆంగ్లకవి, పాల్‌మాల్ గెజెట్‌లో "శ్రీ ఘోషుకు మన సాహిత్యంలో ఒకనాడు తప్పక పేరువస్తుంది" అని వ్రాసినాడు. 'ప్రేమగీతాలు - విషాదగీతాలు', (1898) అనే గ్రంథంలోనూ, ఆయన మరణానంతరం అచ్చయిన 'ప్రేమగీతాలు - మృత్యువు' (1916), కావ్యంలో మన్‌మోహనుని శాశ్వతముగా నిలుపగల కవితాకృషి ఉన్నది. Immortal Eve (అమరసంధ్య), Orphic Mysteries (రహస్యానుభవగీతాలు) వంటి ఖండకావ్యాల్లో కరుణ, స్వచ్ఛకవితోదాత్తత, సరిసమానంగా ప్రసారితమైనవి. వేదనఉన్నదికాని, దానివల్ల ఆయన పూర్తిగా భగ్నచిత్తుడు కాలేదు. బహిరంగా అభేద్యమయిన విషాదములో కుంగినట్లున్నా, మన్‌మోహనుడు 'ఆనంద సంపాదక మహాగీతలయస్థాయి, దాకా అందుకో గలిగినాడు.

మన్‌మోహనుని సోదరుడయిన అరవిందుని విద్యాభ్యాసము లండనలో సెంట్‌పాల్ లో ఆరంభమై, కేంబ్రిడ్జిలో పూర్తిఐంది. ఆయన సివిల్ సర్వీస్ పరీక్ష ప్యాసయినా, ఆ బంధనమునుంచి అదృష్టవశాన తప్పించుకో గలిగినాడు. కొంతకాలము ఆయన బరోడా కళాశాలలో అధ్యాపకుడై శీఘ్రమే రాజకీయాకర్షణ గురుత్వానికి ఆకృష్టుడైనాడు. ఆయన అదేసమయంలో యోగసాధనవల్ల కూడా ఆకృష్టుడైనాడు. 1907–1909 సంవత్సరాల్లో ఆయన రాజకీయాల్లో ప్రముఖపాత్ర నిర్వహించినమీదట, పుదుచ్చేరి చేరుకుని అక్కడ అధ్యయనంలో, తప

స్సులో, విమగ్నుడై ఆశ్రమంలోనే ఉండి 1950 డిసెంబరులో సిద్ధి పొందినాడు. ఆయన గ్రీక్, లాటిన్, ఆంగ్ల, ఫరాసు, జర్మన్, ఇటాలియన్, సంస్కృత, వంగభాషల్లో ప్రవీణుడు. బహుముఖ సంస్కారాలు, గ్రహించి సాధనలుచేసి, ఆయన అమరయాత్రికుడూ, మహాపురుషుడూ, మహాయోగిగా పరిణతి చెందినాడు. పుదుచ్చేరిలో ఆశ్రమంలో ఎందరో సాధకులు అరవింద పాదాశ్రయులైనారు. ఆయన మరణానంతరము పుదుచ్చేరి ఆశ్రమంలో విశ్వజననీ విద్యాపీఠము స్థాపితమైంది.

అరవిందులను కేవలం కవిగానూ, జీవనసాహిత్య విమర్శకుడుగానూ యోచిస్తే, ఆయన మన తరంలో ఉత్తమోత్తమ కళానిష్ణాతలలోనివాడు ఆయన 'కావ్య సముచ్చయము - నాటకాలు' (1942) అనే బృహత్ కావ్యసంపుట ద్వయంలోని కవిత 1890 నాటికే చెప్పినాడు. ఆ కవి అనల్పంగాచేసిన కావ్యరచనలు ఆ సంపుటాల్లో ఉన్నవి. అరవిందులు అనువాదకుడుగా, కథనాత్మక కవిగా, ఛందోరీతుల్లో శబ్ద సంఘటనలోనూ, రచనాశిల్పిగా భావగేయకవిగా, దృశ్యకావ్యప్రణేతగా, సాహిత్య ప్రయోగధీరుడై, వివిధ మార్గశోధకుడై, అన్నిటికన్న వైఖరీ రూప మహోదాత్త వాగ్గుంభనతో 'భవిష్యత్కవిగా' కూడా ఆధునిక కాలంలో అద్వితీయ కవితాసాధనలో కృతకృత్యులైనారు. 'ఊర్వశి - ప్రేమమృత్యువు' అనేవి ఉదాత్త కథనాత్మకకావ్యాలు. 'బాజీప్రభువు' అనే కావ్యము గమన వైచిత్రితో ప్రథమ గణ్యమైంది. 'పెర్సియస్, ముక్తిదాత' బ్లాంక్ ఛందస్సులో విరచితమైన పద్యనాటిక. అది విశిష్ట సన్నివేశాలతో, మహాప్రవక్తృధోరణిలో, హృదయసంవాదము కలిగించే నాటకము. 'పరమేశ్వరుని గులాబి', 'భావానందము' (Thought the Paraclete) అనేవి ఆంగ్లభాషలో అతిరమ్యమైన మర్మయోగాత్మక కావ్యాలు. శ్రీ అరవిందులు సంప్రదాయక దీర్ఘచ్ఛందస్సులను తన ప్రయోజనంకోసము అనుసరించి, కృతకృత్యులైనారు; 'అన్వా, ఇలియడ్'ల వంటి దీర్ఘకావ్యాల్లో సామాన్యంగా అందరూ చిన్నచూపు చూచే ఆరుగణాల ఛందస్సు అవలంబించి, నూత్నమధుర సంగీతము ఉప్పతిల్ల చేసినారు.

శ్రీ అరవిందులు అంతేకాక వచనరచనా ప్రవీణులయిన

సర్. థామస్ బ్రౌన్, డిక్వెన్సీల సంప్రదాయంలో, గద్యనిర్మాత. ఆయన తల్చుకుంటే ప్రసన్నతారళ్యంతో, స్వాభావికస్వాదుతా పూర్ణంగా, వచన రచన చేయగలరు. Life Divine (దివ్యజీవనం), Essays on Gita (గీతావ్యాసావళి), The Synthesis of Yoga (యోగసమన్వయం), The Social Cycle (సామాజికచక్రము), The Ideal of Human Unity (మానవైక్యాదర్శం) The Future of Poetry (భావికవిత) వంటి బృహద్రచనలు (మొదట ఆర్యపత్రికలో 1914, 1921 లో ప్రచురితాలు – తరువాత గ్రంథరూపంలో వచ్చినవి) భావపూర్ణతకలిగి, పరిశోధకునికృషి, కవీశ్వరుని భావోద్రేకమూ, ద్రష్టకు గల సృజనాత్మక క్రాంతదృష్టిన్నీ, పమ్మిళితమైనవి. లఘు వచన రచనల్లో Mother (జగన్మాత), Heraclitus, Renaissance in India (భారతదేశంలో ఉజ్జీవనం) అనేవి ప్రసిద్ధాలు.

అరవిందునివలె సరోజినీదేవికూడా కవయిత్రిగా జీవితము ఆరంభించి, అనంతరము రాజకీయాల్లో పడ్డది. గాంధీయుగంలో ఆమె నిర్ణీత ప్రముఖపాత్ర నిర్వహించవలసిఉన్నదికనుక. ప్రథమ కవితాసంకలనము Golden Threshold (సువర్ణప్రాంగణం) (1905) వల్ల ఆమెకు విఖ్యాత కవయిత్రిగా కీర్తి నిలిచింది. 1906 లో వక్తృత్వములో ఆమె వాణి ప్రకాశింపగా, గోఖలే ఇలా ప్రశంసించినాడు.

''మీ ఉపన్యాసము ఘన వైజ్ఞానిక సంతర్పణకన్న మిన్న. అయ్యది సౌష్ఠవ కళాఖండము. మేమందరమూ ఆ క్షణములో ఉచ్చతర స్థాయికి కొంపోబడినాము.''

అధిక వ్యవధిలో కవితా సంకలనద్వయం ప్రకటితమైంది. అవి Bird of Time (కాలవిహంగము 1912), Broken wing (భగ్న పక్షము 1917) అనే కావ్య సంపుటాలు. కవయిత్రిగా పద్యచందోరీతులపై ప్రావీణ్యంగల సరోజినీనాయుడు నిర్దుష్ట భావగేయ రచనతో 'పద్మాసన బుద్ధుణ్ణి' ఉద్దేశించినదిన్నీ, 'బృందావనంలో వేణుగాయకుడు' వంటివిన్నీ రచించగలిగింది. ఆమె తన 'Bird of Time' (కాలవిహంగం) వలె, విస్తృత కవితాసీమల్లో విహారంచేస్తుంది. విశిష్టక్షేత్రము పరిచిత విషయ సౌందర్య చిత్రణమే అయినప్పటికిన్నీ,

అనంతర కావ్య సంపుటాల్లో ఎలాగయినా బుద్ధిపూర్వకంగా దుఃఖ భార శౌనః పున్యము, అధిక సంయమంతో కూడిన భావచిత్రణము, అగాధ హృదయాంతరమునుండి పొరలే సంగీతమూ అధికంగా పరిపక్వమైన 'ధ్యానాంతః కరణమూ' గోచరిస్తాయి. కవితామాధ్వీకసంచయం 'సువర్ణప్రాంగణం' అన్న కావ్యంలో ఉన్నట్టిదే అయినా, అంతకన్న వయఃపరిపాకము కానవస్తుంది. "దేవాలయము - ప్రేమయాత్ర" అనే కావ్యసంపుటము చివరది. ఆ సంపుటంలో భావగీతికాత్రయం ఉన్నది. ఒక్కొక్క ఖండంలో ఎనిమిదేసి పద్యాలున్నవి. జాన్‌గాన్‌వర్దీ ఆమె పద్యాలను, బ్రౌనింగ్‌సతి: రచించిన 'ఖుదతకీచుల సానెట్ల'తో, పోల్చి వాడు. ఆమె స్త్రీ బుద్ధికావడంచేత మహోదాత్త రాజకీయస్థాయిలో విశేషాంశాలు గ్రహించలేక పోయినానని అన్నా, భారత మాతృదేశసేవ చేసింది. అవసానం దాకా, ఆమెకు గాంధీయుగ రాజకీయాలు ముదావహమూ, విప్లవాత్మకమూ కాగా, రాజకీయ భావాలను కవితారూపంగా వ్యక్తము చేసింది.

## 1920 — 1947

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరము భారతదేశము, విశిష్టమైన అవకాశాలతో, సంపన్నమైన నవయుగ ప్రాంగణంలో, ప్రవేశించింది. దృశ్యమూ పరివర్తనమైంది. నాటకీయపాత్ర వర్గంకూడా మారిపోయింది. ఫిరోజ్‌మెహతా లేదు; గోఖలే, తిలకులు లేరు. విపినచంద్రపాలుని మహోజ్జ్వల వాచారంభణం శమించింది; సురేంద్రనాథుని వాగ్ఝరీ విలాసపుటింద్రజాలము మటుమాయమైంది. శ్రీ అరవింద యోగీంద్రుడు పుదుచ్చేరిలో ఆశ్రమంలో ప్రాపంచిక ప్రవృత్తికి విముఖుడై, ఏకాంతవాసి అయినాడు. దృశ్యమా నూతనము, పాత్రధారులా కొత్తవారు, రీతులా వినూత్నములు. భారతీయాంగ్ల పత్రికా లేఖనము అధిక సంక్షిప్తమై, ' లక్ష్యాన్ని ఉద్దేశించింది. మన వక్తల ఉపన్యాసములు సంక్షిప్తమూ, పటువున్నూ అయినవి. మన వచన రచయితలు మెకాలేయశబ్దాడంబారాన్ని తోసిరాజని, సహజరూపాల్లో భావాభివ్యక్తికి, యత్నించినారు. గాంధీయ నాయకత్వఫలంగా ఆంగ్ల

విద్యకు ఎదురు తాకిడి రాగా, హూణ విద్యావ్యామోహము కొంత పోయింది. 1917 లో ఉన్న కళాశాలా విద్యార్థులసంఖ్య 61000 నుంచి, పదేళ్ళ తరువాత 84000 దాకా పెరిగింది. గాంధీజీకూడా యంగ్ఇండియా, తరువాత హరిజన్ అనే ఆంగ్లపత్రికలు నడుపుతూ వాటిపై ఆధారపడి, తన అభిమతాలను, కార్యక్రమాలను, ప్రార్థనా ప్రసంగాలను, సమరఘోషలనూ, ప్రసారము చేసినారు. ప్రఖ్యాతులయిన మన నాయకులు, చిత్తరంజన్‌దాస్, మోతీలాల్ నెహ్రూ, లజపతిరాయ్, టంగుటూరి ప్రకాశం పంతులు, భోగరాజు పట్టాభి సీతారామయ్య గార్లు తమ దైనిక, సాప్తాహిక పత్రికలు, ఆంగ్లంలో నడిపి జాతీయదృక్పధాన్ని, తమ తమ వ్యక్తిభేదాలతో, గాఢంగా వ్యక్తముచేశారు. ఇదే తీరుగా కళాశాలా ప్రాచార్యుడు కూడా, స్వాభిప్రాయ వ్యక్తీకరణకు ఆంగ్లబాష పైననే ఆదారపడినాడు. అతని సాహిత్యకృషి వచనరూపము ధరించినా, అసకృత్తుగా కవితా సంకల నాత్మకంగా వచ్చినా, సాహిత్యము ప్రాంతీయ భాషల్లో వృద్ధికై అన్వేషిస్తున్నది. అయితే భారతీయాంగ్ల రచనలో ఏమాత్రమూ ఓజస్సు తరిగిపోలేదు. పరిపమానంగా సర్వతోముఖ ప్రజ్ఞాశాలితకూడా ప్రదర్శితమైంది. ఆంగ్లేయ, లేదా ఐరోపీయ సాహిత్యరంగంలో 1920, 1930 సంవత్సరాల్లో, అభిరుచిలో క్రాంతి వచ్చింది. సర్వేసర్వత్ర సంప్రదాయానికీ, నూత్నప్రక్రియకూ, జరిగే నిత్యఘర్షణ భారతదేశంలోకూడా వ్యక్తమయింది. ఆ సంఘర్షణ ఫలితం ఎటూతేలకుండనే అంతటా ఉన్నది.

భారతీయాంగ్ల సాహితీపరుల్లో, త్వరితంగా ఖ్యాతితెచ్చుకొన్న వాళ్ళల్లో, 1920 లో కె. యస్. వెంకటరమణి ఒకరు. ఆయన రచనలో భావప్రేరణ అధికము, ప్రజ్ఞాశాలిత సర్వతోముఖము. ఆయన తొలిరచన Paper Boats (1921) అనేది. ఆ నవలలో దక్షిణభారతీయ జీవిత చిత్రాలు శిల్పలాలిత్యసమంచితాలు. ఆయన శిల్పిమాత్రమేకాక, కవీ, హాస్యరచయితకూడాను. 1923 నాటి On the Sand Dunes అనే వచన పద్య సంపుటిలో, నాగరకతవల్ల కోమల మానవ హృదయానికి కలిగిన విశ్వజనీన మహావ్యధ గోచరిస్తుంది. 1927 నాటి Murugan the Tiller అనే గ్రంథప్రచురణతో, మద్రాసులోని

విద్యాసంస్కారులైన వాళ్ళను ఉట్టూతలూగించినాడు. చక్కని జాన పద జీవితచిత్రణమూ, పట్టణవాసుల ప్రవృత్తిభావతీవ్రతను హేళన చేయడమూ, పాత్రోల్మీనపాటవమూ, కవిత్వము, హాస్యము, వాస్తవి కాదర్శవాదమేళనమూ, వీటన్నిటివల్లా ఆ నవల ప్రథమగణ్య మవు తున్నది, భావసంధియుగంలో. మురుగణ రచనానంతరము, పసివా ళ్ళకు ఉపకరించే A day with Sambhu (ఒక రోజు శంభుచర్య) అనేది, The Next Rung అనే ఉపదేశగ్రంథమూ వచ్చినై. వెంకట రమణి రచించిన రెండోనవల (1932) Kandan the Patriot. ఆ నవలా రచనకు ఉద్దీపనకారణం, 1930–31 లోని గాంధీయ జాతీ యోద్యమము. మురుగన్‌తో గ్రామీణార్థికశాస్త్రాన్ని ఆదర్శప్రాయము చేసినట్లే, ఇందులో రాజకీయాలు ఆదర్శప్రాయంగా చేయబడినవి. ఆ రెండూ భిన్నంగా ఉండడానికి కారణం అన్యోన్యం అనుబంధంగా ఉండవలెనని భావమే. మరొక మదరాసువాసి, రచయిత, శంకరరామ్ రెండు కథానికాసంపుటాలు (Children of Kaveri, Creatures all) కాక హృదయాలను ఉద్రూతలూపే Love of Dust అనే నవల 1938 లో ప్రచురించినాడు. ఆ నవలలో రైతుకూ భూమికీగల అవినా భావసంబంధము చిత్రితమైంది. ఆధ్యాత్మిక విప్లవావస్థలలో మానవ జీవితాల్లో దూరస్థము కాకుండే హాస్యాశ్రువుల మధ్యగల అంతరరేఖ చిత్రించే ఘట్టాలలో ఈ నవలారచయిత శంకరరామ్ ఉత్తమశిల్పము ప్రదర్శిస్తాడు.

పైచెప్పిన వారికన్న ముల్కరాజ్ ఆనంద్ బహు గ్రంథకారుడు. భారతీయ సమాజములో కష్టజీవులను, తన గ్రంథాల్లో చిత్రించినాడు. 'రెండుఆకులు ఒకమొగ్గ', 'కూలీ', 'అస్పృశ్యుడు', 'గ్రామం' (1939) అనే నవలల్లో దళితజీవులను, శోషణ ధోరణిలోకాకుండా, సాను భూతితోనూ వారు మానవులనే గౌరవముతోనూ చూపినాడు. పమ్మార్జ కుడు, రైతు, తోటలోకూలి, పట్టణంలో కార్మికుడు, సిపాయి, ఆయన నవలల్లో సజీవంగా చిత్రితులైనారు. వేదనతో ఆకటితోఉన్నా మానవార్ద్ర హృదయంకలిగి, మూఢవిశ్వాసంతో మనసు భిన్నమై భగ్నప్రయోజ నాలు, భగ్నాశలు కలవారయినా - స్ఫుటంగా చిత్రితమైనారు. ఆర్. కె.

నారాయణ్ ఎన్నడూ సంభావ్యశ్రేణి దాటిపోని రచనలు చేయ గల సాహిత్యశిల్పి. ఆయన చాలా నవలలూ కథానికాసంపుటాలూ రచించినారు. Bachelor of Arts, The Dark Room (1938), The English Teacher (1945) అనేవి కొన్ని ఉత్తమ రచనలు ఆయనివి. దక్షిణ భారతదేశంలోని కృత్రిమ వ్యామోహమయ జీవన చాంచల్యము చిత్రించడము ఆయన కెక్కువ ప్రీతి. ఆంగ్లమానసపుత్రుడైన ఆంగ్లీకృత భారతీయుణ్ణి, నారాయణ్ విశేషంగా చిత్రిస్తాడు కథానికలో, నవలలో. ఆయన మానసిక విశ్లేషణం చేసినాడు. ఆంగ్ల మానసపుత్రుని ఆత్మవంచనం, అవకతవకలనూ. నారాయణ్ ఇటీవలి రచన, Waiting for the Mahatma. అది రాజారావు రచించిన Kanthapura వంటిది. నారాయణ్ తన గ్రంథంలో గాంధీయ విప్లవము చేసే సవాలుకు భారతీయ మానవకోటి ఎలాస్పందించిందో పరిశీలన చేసినాడు. అవి రాజకీయ రచనలు కావు. అవి వచన రచనాశిల్ప ఖండాలు.

ఈ కాలపు నవలాకారులలో ఈ కిందివారిని హుమయూన్ కబీర్ (Men and Rivers, 1945), డి.ఎఫ్. కారక (There lay the City, 1941), కుమారగురు (Life's shadows, 1938), అహమ్మద్ అలీ (Twilight in Delhi 1940), ఎ. యస్. పి. అయ్యర్ (Baladitya, 1930), కె. నాగరాజన్ (Athawar House) ప్రభృతులను ప్రత్యేకంగా పేర్కొనవచ్చును.

ప్రథమ-ద్వితీయ ప్రపంచ యుద్ధమధ్యకాలంలో భారతీయాంగ్ల కవులు ప్రశంసనీయంగా కార్యోత్సాహులైనారు. హరీంద్రనాథ చట్టోపాధ్యాయ రేఖావర్ణమయమైన దార్శనిక భావసంవేదనలవల్ల, పాఠకులను చకితులనుచేస్తూ, మహాప్రజ్ఞానమున్మేషంతో విరాజిల్లినాడు. ప్రాచార్యులైన పి. శేషాద్రి, జి. కె చెట్టూర్, వి యస్. భూషణ్, హుమయూన్‌కబీర్, ఉమామహేశ్వర్, యస్. వి. తడానీలకు సామాన్యంగా సంప్రదాయానుసరణము సంతృప్తి కలిగించినా, వారు భారతీయాంగ్ల కవితా బహుముఖప్రజ్ఞనూ, ప్రయోజనకారితనూ, ప్రదర్శించినారు. గోవా కవులైన జోసెఫ్ ఫరెటెడో, ఆర్మండో మెనిజెస్, మాన్యుల్

పి. రోడ్రిగ్స్, తమ ఇతర గుణాలతోపాటు ప్రవాస కవితకు వినూత్న మైన తీవ్రత కలిగించారు. యస్. ఆర్. డోంగర్‌కెరీ నేర్పుమీరగా సంప్రదాయ విపంచిని మీటినాడు. ఆయన మనకు 'ఐవరీటవర్' అన్న కావ్యము ప్రసాదించినాడు. ఫ్రెడూన్ కబ్రజీ రచించిన " A Minor Georgian's Swan Song" అన్న కావ్యం సొగసులు కులకడంతో పాటు, ప్రబలధాటీగతులు చూపింది.

'క్రాంతికారులు' లేదా 'నవ్య' కవులుకూడా భీషణగణంగా ఏర్ప డ్డారు. షాహిన్ సుహ్రావర్ది రచించిన 'Essays in verse' (1937) అన్న కావ్యంలో 40 ఖండికలున్నవి. ఆ రచన సంకులమై ఆర్తనాదం వలె ఉంది, పెల్లుబికిన జ్వరంతో, అనిశ్చిత స్పందనాలతో, క్షీణప్రాయ మైన నాగరకలక్షణాలను ద్యోతకము చేస్తున్నది. మంజేరి యస్. ఈశ్వ రన్, పి. ఆర్. కైకినీ 1930 లోనే సంప్రదాయాదర్శ కవులుగా ప్రసి ద్ధికి వచ్చినా వ్యక్తిగతమో లేక బాహిరమో అయిన ఘర్షణల నలిగి పోయి, అంతకంతకు వామమార్గములో చేరినారు. ఈశ్వరన్ రచించిన Catguts, Brief Orisons (1941) అనే పుస్తకాలు అతిగా బాధ పెడతాయి. భ్రాంతినుండి విముక్తివల్ల అతని కవితలో భీషణ నిశిత బుద్ధి గోచరించినా, వెన్నంటే మాధుర్యాన్నికూడా, ఆయన సాధించ గలిగినాడు. కైకినీ రచించిన మొదటి రెండు పుస్తకాలూ రవీంద్రుని గీతాంజలి పద్ధతిలో ఉన్నవి. ఖండాంతర రాజకీయ పరిస్థితులలో పరిణ మించిన మార్పులవల్ల, 'రక్తయుద్ధం' వైపు, ఆయన దృష్టి మరల్చి నాడు. 'నవ్య' రచయితలలో ఈ రచయితలపేర్లు చెప్పకోతగినవి:– బి. రాజన్ (Monsoon, 1945), క్రిషన్‌మంగ్లూ (The Night is heavy 1943), నిస్సిమ్ ఎజికీల్ (A Time to Change and Sixty poems), సుభోటాగూర్, సుధీంద్రనాథదత్త, పిరిల్‌మోదక్, నిలిమాదేవి, జె. విజయతుంగ, పి. లాల్, ఏ. కె. రామానుజన్, ఆర్. ఎల్. బర్తలోమ్యూ. ఆది. కె. సెట్ యథార్థ సంవేదనంతో, లలి తంగా స్వేచ్ఛాఛందంలో, కవిత చెప్పినాడు. (The Light above the Clouds) భక్తుడైన గురుదయాళ్‌మల్లిక్ తన 62 వ యేట భగవదనుగ్రహంవల్ల ఆయనకు అపరోక్ష సాక్షాత్కారము కలిగినది.

Hound of the Heart అన్న కావ్యంలో జీవుడు నిత్యమూచేసే శుద్ధాన్వేషణమూ, దర్శన పారవశ్యంలో ఈశ్వర వైభవాన్నీ కవితా గానము చేసినాడు.

కవిత్వమేకాక అన్యసాహిత్యక్రియలలోనూ భారతీయాంగ్ల సాహితీపరులు కృషి చేశారు. నాటకకర్తలు కొద్దిమందే ఉన్నారు. దానికి కారణం వారు రచించిన నాటకాలు రంగశాలలో ప్రయోగించే అవకాశం లేకపోవుటే. కాని వి. వి. శ్రీనివాస అయ్యంగార్ రచించిన Dramatic Divertisements, ఎ. యస్. పి. అయ్యర్ రాసిన Sita's Choice and Slave of Ideas, ఫైజీరహమాన్ రచించిన Daughter of Ind, భారతీసారాభాయ్ కృతమైన The well of the People and Two women, మృణాలినీ సారాభాయ్ చేసిన Captive Soil, జె. యమ్. లోబోప్రభువుచేసిన Apes in the Parlour and the Family Cage, పురుషోత్తమ త్రికందాస్ రచించిన Sauce for the Goose, టి. పి. కైలాసం రచించిన Karna, Fulfilment and the Burden, హరీంద్రనాథ చట్టోపాధ్యాయుని నాటికా పంచకంవల్లా, భారతీయులకు ఆంగ్లంలో నాటకరచన చేయడం అసాధ్యంకాదని తేలింది. హాస్యజనకవ్యాసము, వినోదరేఖాచిత్రము, జాన్‌సన్ విధానంలో మానసిక కల్పనా విలాసము, మాంటేన్‌రీతిలో పైకి ఆలోచనచేయడం వంటివి భారతీయాంగ్ల రచనల్లో ఇటీవల ప్రత్యేకమవుతున్నవి. ఉదాహరణకు చూడండి : యస్. వి. వి. రచించిన Soap Bubbles, More Soap Bubbles, Chaff and Grain, ఆర్. బంగారుస్వామి వ్రాసిన My Lord Kukudoon Koon, ఈశ్వరదత్తు రచించిన And All that, యశ్. జి. జోగ్ రచించిన Onions and Opinions, ఆర్. కె. నారాయణ్, చలపతిరావు, శాంతారంగాచారి, యం. కృష్ణశాగార్లవి ఛలోక్తుల ఛణకులూ, పత్రికలో Sidelights శీర్షికలో శాక (ఖాసా సుబ్బారావు) గారివి, Over a Cup of Tea అనే శీర్షికతో పోతన్ జోసెఫ్, Sotto Voce అనే మంద్ర స్వగతమును విఘ్నేశ్వరుడు, (యన్. రఘునాథ అయ్యరు) చేసే ప్రచురణలు ఉత్తమ రచనలు. సామర్థ్యంతో సాహిత్య

సమీక్షలు సాగిస్తూనే ఉన్నారు :- యస్. కె. సిద్ధాంత (The Heroic Age of India), అమర్‌నాధ్‌ఝా, అమియచక్రవర్తి, పి. నారాయణ మేనన్ (షేక్స్పియరుపై విమర్శ), హుమయూన్ కబీర్ (Poetry, Monads and Society), వి. కె. గోకక్ (The Poetic Approach to Language), యం. యం. భట్టాచార్యజీ, యస్. జి. సేన్‌గుప్త (Shakesperean Comedy), పి. డి. నరసింహయ్య, కె. స్వామినాథన్ ప్రభృతులు. శ్రీ అరవిందుల సాహిత్య సమీక్ష (The Future Poetry), ఆనందకుమారస్వామి శిల్పకళావిమర్శన (History of Indian and Indonesian Art), శివతాండవము, భారతీయశిల్ప పరిచయము (An Introduction to Indian Art) విశిష్ట రచనలు. మంచి జీవితకథలు అచ్చయినవి. సర్ హోమిమోడీ ఫిరోజిషా మెహతా జీవితాన్ని (1921), సర్ రుస్తుమ్ మసానీ దాదాబాయ్ నౌరోజీ జీవితకథనూ (1939), వి. యస్. శ్రీనివాస శాస్త్రి (My Master Gokhale 1946) అనీ, పి. సి. రాయ్ చిత్త రంజనదాసు జీవితము, యదునాథసర్కార్ శివాజీజీవితకథ, డి. వి. తంహంకర్ - Lokamanya Tilak; Father of Indian Unrest and Maker of Modern India), రామగోపాల్ లోకమాన్యతిలక్ జీవితాన్ని, ఫ్రాంక్ మోరేస్ నెహ్రూ జీవితాన్ని, ఆర్. ఆర్. దివాకర్ "మహాయోగి' అనే జీవితచరిత్రలు ప్రకటించారు. స్వీయ జీవిత చరిత్ర ,రచయితలలో మహాత్మ గాంధీ జవాహర్ లాల్ నెహ్రూలకు ఉన్నతస్థానం ఉన్నది. నిరాద్ సి. చౌధరీ రచించిన Autobiography of an Unknown Indian గ్రంథాన్ని చాలమంది చదివిచర్చించారు. దానిలో లోపాలున్నాయి. ఆ గ్రంథము చదవడానికి భారంగా నీరసంగా మనసుకు, రుగ్మత కలిగించేదే. అయినా పాండితీభారంకలిగి ధైర్యంగా సత్యముప్రకటించే ఉత్తమరచన. తక్కిన వాళ్ళల్లో కృష్ణహఠీసింగ్ (With No Regrets), భరతన్ కుమారప్ప (My student Days in America), రాజేంద్రప్రసాద్, చిమన్‌లాల్ సెటల్‌వాడ్ (Recollections and Reflections), కె. ఈశ్వరదత్తు (The Street of Ink), కె. యం. మున్షి (I Follow

the Mahatma and the End of an Era), పరమహంస యోగానంద, కృష్ణలాల్ శ్రీధరాని (My India, My America), పి. ఇ. దస్తూర్ (American Days), ఉన్నివాయర్ (My Malabar), కీ. శే. యం. యస్. రాయ్, ఆర్. డి. రానడే తమకుతోచిన వివిధరీతుల్లో కఠినమైనా, పైకి లీలాప్రాయంగా కనపడే, సాహిత్యరచన ప్రదర్శించినారు. విద్వాంసులూ, ప్రముఖ యోచనాపరులూ, దర్శన శాస్త్రేతిహాసాలలో రచనలుచేసినవారు, యం. జి. రానడే, ఆర్. సి. దత్తు, తిలక్, యదునాథసర్కార్, వ్రజేంద్రనాథసీల్, పి. టి. శ్రీనివాస అయ్యంగార్, బారిష్టర్ సవర్కార్, ఆర్. సి. మజుందార్, యం. యస్. రాయ్, ఆర్. డి. రానడే, సర్వేపల్లి రాధాకృష్ణన్, పి. యన్. శ్రీనివాసాచారి; యువరచయితల్లో పి. టి. రాజు, యస్ గోపాల్, యం. యస్. శ్రీనివాస్ ఉన్నారు. పత్రికాలేఖకులు, న్యాయవేత్తలు, వక్తలు, రాజనీతి ఆర్థిక శాస్త్రరచయితలు చాలమంది ఉన్నారు. వారిలో ఉత్తమ రచయితలు – పత్రికారచయితలలో ఫ్రాంక్‌మోరిస్, చలపతిరావువంటి వారు; న్యాయమూర్తులలో శ్రీ ఆశుతోషముఖర్జీ, సుబ్రహ్మణ్యయ్యర్ వంటి వారు; వక్తలలో శ్రీనివాసశాస్త్రి, కట్టమంచి రామలింగారెడ్డివంటివారు; రాజనీతివేత్తలలో యం. రత్నస్వామి, కె. యం. పణిక్కర్‌వంటివారు; తార్కిక వ్యాఖ్యాన వివరణలో సి. రాజగోపాలాచార్యులవంటి నిష్ణాతులు; ఆరితేరిన విద్యావేత్తలతో డాక్టర్ లక్ష్మణస్వామి మొదలియారువంటి వారూ ఉత్తమాంగ్లేయ లేదా అమెరికాదేశీయ వచనరచనా ప్రవీణులతో వారివారి రంగాలలో సమానస్థాయిలో నిలవగలిగినవారు.

వచనరచయితల్లో పైచెప్పినవారిలో ముగ్గురు నలుగురు విశేష ప్రబలమైన ఆత్మీయతవల్లనూ, తమ హేతువాద ప్రావీణ్యంవల్లనూ, తమ భావగుణవిశేషంవల్లనూ, భావానుకూల అద్భుత శయ్యావిన్యాసం చేతనూ, మహోన్నతులుగా నిలిచినారు. ఆంగ్లానువాదము చేయబడిన గాంధీమహాత్ముని స్వీయచరిత్ర 'The Story of My Experiment with Truth' కేవలము మహదేవదేశాయి కృషి. ఐనా దేశాయి, మహాత్ముని రచనాశైలి అద్భుతంగా అవలంబించినాడు. ఆ గ్రంథంలో గాంధిజీ శైలిలోని ఉదాత్తత, సుందరప్రశాంతత, గోచ

రిస్తుంది. గాంధి వచనంలో వంకరలుకాని, వడిదుడుకులు కాని గ్రంథ గ్రంధులుకానీ ఉండవు. కేవలం బైబిలువలె ప్రసన్నతా పూర్ణమైన శయ్యా విన్యాసమేకాని, అర్థవ్యక్తిలో అస్ఫుటత్వములేదు. ఆ రచన రుచికరమై, సరళస్వచ్ఛమై, ఆరోగ్యదాయకమైన జలమువంటిదై, ఉపాదేయమైనది.

నెహ్రూ పండితుని 'స్వీయచరిత్ర', Discovery of India అనే గ్రంథాలవల్ల ఆయన మరొక ఆంగ్లవచన రచనా ప్రవీణుడని చెప్పాలి. విస్తృతంగా గాఢంగా ఆంగ్లసాహిత్యాభినివేశము కలిగి, ఐరోపీయ భావసంస్కారోద్యమాలతో గాఢ పరిచయంకలిగి, ఐనా భారతీయ లేక ఆసియా సజీవ సంప్రదాయజీవనంవల్ల భావోద్రేకం ఉదయించగా, నెహ్రూగారి ఆంగ్లరచన స్వభావోక్తితో, లీలాప్రాయమైన భావుకతా సామర్థ్యం కలిగి, ప్రతీయమానార్థ భాండారమైంది. ఇటువంటి గుణవిశేషముగల శైలి నిజంగా ఆత్మీయతా ద్యోతకం. ఎందుకంటే: ఆయన రచించినా ప్రశంసించినా యావదాత్మీయత - ఆయన సంస్కారమూ, ఆయనకున్న ఓజస్సు, మానవత - అద్దంలో మాదిరిగా ద్యోతకమవుతున్నది. ఆయన వెంటనే మానవుల గౌరవాదరాలను చూరగొంటాడు.

ప్రాచార్య రాధాకృష్ణన్ వచన రచనా ప్రవీణుడు. భారతీయ దర్శన శాస్త్ర చరిత్రను బృహద్గ్రంథంగా సంపుటద్వయంగా రచించి, ఆంగ్లభాషలో భారతీయ తత్త్వ శాస్త్ర రచనకు ఒరవడి దిద్దినారు. వివరణలో ప్రజ్ఞాశాలిత, తత్త్వశాస్త్రములో విరుద్ధమతావిష్కరణంలో వివేచనాపాటవము, వాదముతో వశ్యము చేసికోగల తర్కప్రతిష్ఠవల్లనూ, ఆచార్య రాధాకృష్ణులు భారతీయ దర్శన శాస్త్రరచనలో సజీవగుణము, జీవత్సంప్రదాయము, ప్రసాదించి కృతకృత్యులైనారు. ఆయన తరువాత రచించిన గ్రంథాల్లో ముఖ్యంగా An Idealist View of Life అనే గ్రంథంలో - నిర్మాణాత్మక తాత్త్వికుడై గోచరిస్తారు. ఆయన వచనశైలి ఎప్పుడూ - ఏ రీతిగా చూచినా ఔచిత్యంతో, నేతోత్సవంగా సంపన్నమై, ఆశుధారా వాహికమై, ప్రాక్ప్రతీచీ సారస్వత సూక్తి ముక్తా నిబద్ధమైంది. వచోఝరీవేగముతోపాటు రచన అవలీలగా

ప్రావాహికంగాచేసే ఆచార్య రాధాకృష్ణులు, పూర్ణపురుషుడు, విద్వాంసుడు, ప్రవక్త, లౌకికుడు (ఎలాగో చిత్రంగా బిన్నస్వభావాలు సమరసపడినవి) కావడంవల్ల, ఆయన ఆంగ్ల వచన శైలికి ఓజోలావణ్యాలు సంక్రమించినవి.

మరో గ్రంథకారునికూడా పేర్కొనవచ్చును. శ్రీ సి. రాజగోపాలాచార్యులు. అద్వితీయ తార్కికవాద ప్రవీణుడని లోక విదితము. అది సంపూర్ణ వర్ణనముకాదు. అది ఆయనలో ఒక అంశ. నిస్సందేహంగా ఆయన భావవ్యక్తీకరణము అతి సరళము. కాని ఆయన ఆత్మీయతలో ఆధ్యాత్మికతా భావోద్రేకతా బహుముఖాలుగా ఉన్నవి. అవన్నీ ఆయన రచనలో ప్రతిబింబిస్తున్నవి. రాజాజీ వచనము గాంధీగారి శైలివలె నిరలంకృతి కలదికాదు; నెహ్రూరచనవలె సంపన్నభావ జాగరితమూ, జీవశోభా ప్రదీప్తమున్నూ కాదు. వాక్య ప్రవాహము ఒడుదుడుకులు లేక సిద్ధాంతానంతరం సిద్ధాంతం అనువర్తించినట్టు కనబడుతూ, మనోహర హేతువాదంతో నిర్మాణ మవుతుంది. అయినా స్నిగ్ధముగా ఉన్నట్లుండే ఉపరితలముకింద, చీకటిలో ప్రవాహాలుకానీ, అగాధమైన ప్రతీయమానార్థముకానీ, ఉండవచ్చును. ఇటీవల ఆయన మహాభారత రామాయణాలకు ఆంగ్లానుకరణాలు చేసి ఆధునిక యుగానికి వ్యాసవాల్మీకుల హృదయావిష్కరణము చేస్తూ, నేటి భావుకుల భావాల నుడికారపు పరిమళాల గుబాళింపుతో రుచి చూపినాడు.

## స్వాతంత్ర్యం అనంతరం

1945 లో ద్వితీయ ప్రపంచ యుద్ధాంత మయినప్పుడు, అప్పటి సామాన్య మహోత్సాహంలోని వేడుకల్లో భారతీయులు పాలుపంచుకోలేక పోయారు. అందుకు కారణము : ఆనాటి వాతావరణము భగ్నాశయ పూరితము కావడమే. గాంధీ, జిన్నా సంభాషణలు విఫలమైనాయి. అదివరకే అల్లకల్లోలమైన భారతదేశస్థితి మరిన్ని సంక్షుబ్ధమైంది. ఆజాద్ హింద్ ఫౌజు నాయకులను విచారణ చేయడం, భూలాభాయి దేశాయి అద్భుతంగా అధివక్తగా వాదించడం చేతనూ 1946 సెప్టెంబరు 2 వ తేదీన (సరిగ్గా జపాన్ పతనానంతరం సంవత్సరం గడిచిన మీదట)

తాత్కాలిక ప్రభుత్వ నిర్మాణము మన చరిత్రలో మహా సంఘటనము. కాని సంతోషమూ దుఃఖమూ మిళితమైనవి. అందుకు కారణము: ముస్లింలీగ్ దూరంగా తటస్థమై ఉండడమే. కలకత్తా, నవకాళీ, బీహార్, పంజాబు ప్రాంతాల్లో మత వైషమ్యాలతో వధలూ, రక్తపాతమూ సంభవించాయి. చారిత్రక పాఠాలను ధిక్కరిస్తూ, లౌకిక జ్ఞానాన్ని తోసిరాజని, మహాత్మ గాంధీ వంటి నాయకుని అంతర్వాణిని హెచ్చరికలను కూడా లక్ష్యం చేయకుండా, కాంగ్రెసు నాయకులు విషాదాంతంగా పరిణమిస్తున్న పరిస్థితులవల్ల కేవలం నైరాశ్యంచేత, తప్పని సరిగా భారత విభజనకు అంగీకరించినారు. 1947 ఆగష్టు 15వ తేదీన స్వతంత్ర భారతం, పాకిస్తాను లుద్భవించాయి.

నిజానికి స్వాతంత్ర్యము సిద్ధించింది. కాని అలాంటి స్వాతంత్ర్యానికై కాదు, మన రచయితలు గతంలో కలలు కన్నది కావ్య గానాలు చేసిందికాని, తరతరాల దేశభక్తులు దర్శించింది, సాధన చేసింది కాని, ఇంతకుముందు కనీ వినీ ఎరగని క్రౌర్యం, ద్వేషం, నమ్మ వీలులేని పశుత్వం తాండవించగా, మతద్వేషం ప్రజ్వరిల్లి కల్లోల పరిచిన ఘడియల్లో ఉదయించిన స్వాతంత్ర్యం దోష దూషితమయింది. లక్షలాది ప్రజలు హద్దులు దాటినారు: పచ్చని కొంపలు మాసిపోయినవి; బ్రతుకులు చితికి పోయినవి; మానవ పురుషార్థాలు పద దళితమైనవి అయినా విచిత్రంగా భారత దేశము మనగలిగింది. 1948 జనవరి 30 తేదీన రాక్షస విషాద ఘటన జరిగినా, మనగలిగింది భారతదేశం. 1946—48 సంవత్సరాల మధ్య కాలంలో అమాయకుల చిత్రవధను, రక్తపాతాన్ని, మహాత్ముని బలిదానాన్ని, పరిస్థితులవల్ల ప్రభవించిన అవమానాన్ని, బాధనూ, నైరాశ్యాన్ని, ఘోర పరిణామాలనూ విస్మరించ లేకపోయింది భారతీయ సాహిత్యం. ఈ భీషణపరిస్థితుల్లో జీవించిన రచయితలకు తదీయానుభూతిని శిల్పాకృతిలో రూపకల్పన చేయడం కష్టసాధ్యంగా తోచింది.

మాసాలు గడవగా, నిరుత్సాహక్రమంలో, సంవత్సరాలు దొరలగా, మంత్రులు మారగా, కొత్తకొత్త రాజకీయపక్షాలు ఉదయించగా, నియంత్రణం, అనియంత్రణం దాగుడుమూతలాడగా, భారతజాతి ప్రణాళికా

సంగీతముపాడగా, సృజనాత్మక సాహిత్యశిల్పికి కావలసినంత కావ్య వస్తువు, అధిక్షేపణకూ, అవహాస్యానికీ, హాస్యనాటకానికీ, ప్రహసనానికీ, హేళనకూ, తిరస్కారానికి. భావాతిరేక లాక్షణికరూపక రచనకూ లభ్యమయింది. కాని మహాకావ్యరచనా సాఫల్యానికి, ప్రశంసాత్మక భావగేయాలకూ కావ్యవస్తువులేవీ ? ఎక్కడచూచినా కృషిలోపము గోచరిస్తున్నది. క్రమంగా ప్రయాణాలు పతనమవుతున్నాయి. ప్రస్తుత భారతదేశీయ శంఖారావము నవ్యజీవమూ 'చలోఢిల్లీ ' అనే నినాదము. అతివిస్తృతంగా జాతిలో ఆత్మవంచనము వ్యాప్తమైంది; నెహ్రూపండితుడు భారతములోనూ యావత్ప్రపంచములోనూ సమ్మానము పొందుతున్నా, ఆయనకూడా స్వాతంత్ర్యసిద్ధితోపాటు విచ్చలవిడిగా విజృంభించిన అవకాశవాదుల స్వార్థశక్తులను నిరోధించలేకపోయినాడు. దేశానికి సవ్యమార్గదర్శకంగా ఉంటవనుకొనవలసిన విశ్వవిద్యాలయాలే, స్వతంత్రయోచనకానీ, సృజనాత్మక పురుషార్థాలుకానీ ఉపయోగించుకోలేని అల్పులవల్ల అధికంగా నియంత్రితమై ఉన్నందున ఘోర దోషభూయిష్ఠాలయినవి.

దీనికి ప్రతిగా పంచవర్ష ప్రణాళికలవల్ల ఏర్పడిన కార్యోత్సాహాన్ని వినియోగముచేసికొని ప్రజా సృజనాత్మక శక్తుల్ని నిర్ణీత మార్గంలో నడిపించడానికి యత్నాలు కూడా సాగుతూనే ఉన్నాయి. రెండేళ్ళ కిందట స్థాపితమైనప్పటి నుంచీ, 'సాహిత్య అకాదెమీ' ధైర్యోత్సాహాలతో కృషి చేస్తున్నది. 'ప్రజాభిరుచి సుశిక్షితంచేసి సాహిత్య వికాసం కోసం', గ్రంథ ప్రకాశ సంస్థలు స్థాపితమైనాయి. పత్రికలు నవ్య స్వేచ్ఛ బాధ్యతలు పొందుతున్నాయి. అయినప్పటికీ సాహిత్య పరిషత్తులు, అకాదెమీలు, గ్రంథ ప్రకాశ సంస్థలూ మహా సాహిత్య సృష్టిని చేయించ లేవు. ఉత్తమ సాహిత్య కృషి మానవుడు మానవుడితో మాట్లాడినప్పుడే సాధ్యము. అది హృదయానంద స్పందనాల ఆదాన ప్రదానము. అది బిగిసిన హృదయాలను ద్రవింపజేసేది. జీవాత్మ మరొక జీవాత్మతో అన్యోన్యంగా పొందే ఆధ్యాత్మిక యోగము. అందులో భిన్నాంతః కరణావృత్తులు మేళనమై ప్రవహిస్తవి. సాహిత్య గుణ వైశిష్ట్యము, గ్రంథకారుని ఆత్మీయతా గుణముపైనే చివరకు ఆధార

పడవలెను. (ఆచార్య రాధాకృష్ణులు ఉల్లేఖించినట్లు) మానవులు అధికంగా ధీరులై 'నిర్లిప్తచిత్తులై' ఉండగలిగితే, రాజకీయ పోషణ ప్రచారాల ఒత్తిడికి లొంగిపోక నిలవగల మనోదార్ఢ్యమును అధికంగా అలవరచు కొన్నప్పుడు, నవ్యతా ప్రలోభానికిగాని కేవల సంవిధానపు గరిడీలకుగాని మానవులు వశ్యులు కానప్పుడు, వారు తమ అమృత స్వప్నాలను చిరకాలము నిలిచే శిల్పాంగా పరిణమింప చేయడంలో కృతకృత్యులు కాగలరు.

స్వాతంత్ర్యయుగంలోని ఘటనా పరంపరలో ఒకానొక ఉత్తమోత్తమ ఘటన శ్రీ అరవింద యోగీంద్రుల 'సావిత్రీ' మహాకావ్య ప్రకటన. అది ప్రసిద్ధపౌరాణిక గాథ; ఒకానొక ప్రతీకము. 1950-51 సంవత్సరకాలంలో అది ప్రకాశితమైంది. 19 వ శతాబ్దం చివరదశకాంతంలో ఆరంభమై, 'ఊర్వశి - ప్రేమ మృత్యువు' అనే కావ్యాలతో సమకాలీనమై అర్ధ శతాబ్దిపాటు ప్రవర్ధిల్లుతూ, అనేక సవరణలు పొందుతూ, ఒకసారి గ్రహింపబడుతూ ఒకసారి మూలబడుతూ, ఆకస్మికంగా నవభావోద్దీపాగ్నికుండ సంభూతమై, అనన్యప్రభాషమున్మేషంతో గోచరమైంది. చివరకు ఆ మహాకావ్యము ఖండత్రయాత్మంగా, ద్వాదశగ్రంథ విభక్తమై, నలభైఎనిమిది సర్గలై, మొత్తం ఇరవైనాలుగువేల పంక్తుల్లో బ్లాంక్‌ఛందస్సులో, రూపు దాల్చింది. మహాభారతంలో సావిత్రీ సత్యవంతుల ప్రసిద్ధోపాఖ్యానం ఇతివృత్తం. అయితే అరవిందుడు ఆ కథకు రహస్యయోగాత్మక వర్ణికాలేపనమున్నూ, అనుభవాతీత నిరపేక్షతనూ కూర్చినారు. బహుశః భవిష్యత్తులో దీన్ని సాహిత్య చరిత్రకారులు Paradise Lost అనంతరం, ఆంగ్లంలో పుట్టిన ఉత్తమోత్తమ మహాకావ్యంగా ప్రశంసిస్తారు. The Future Poetry అనే సాహిత్యగ్రంథంలో, శ్రీ అరవిందులు రమారమి నలభైఏళ్ళకిందట, భవిష్యత్తులో కవితా సామ్రాజ్యసీమలు విస్తృతమయ్యే అవకాశాన్ని సూచించినారు. కవిత్వము అతిస్వచ్ఛమై, అన్యోన్య హృదయసంవాది - అయినప్పుడు, మధ్యమాటలు తగ్గిపోతవి. అప్పుడు సహృదయ రసాస్వాదనకు కవిత అందుతుంది. బుద్ధి భావ చిత్రణాలను వేరుపరచకపూర్వమే, వాక్యాలను పరిచ్ఛిన్నము చేయక

ముంధే, లేదా అర్థవిపరిణామంలో తాను ప్రవర్తిల్లకపూర్వమే,—అవ్యవధానంగా అస్వాదనీయం[1] కావాలి కవితావాణి, స్వరం శ్రవణేంద్రియ గోచరమైనట్టు తేజము విషయాకారాకారితమైనట్టు, మంత్రము ఆత్మలో మగ్నమైనట్టు. కవితావాక్కు భావానికి ప్రత్యామ్నాయమైన సంకేతలిపి కాదు: అది తనకు తానైన సృజనాత్మక జీవాగ్నికణం. పదేపదే కవితా వాక్కు రూపుధరించి నవ్యకవిని సవాలు చేయగలదు. సావిత్రి మహా కావ్యసృష్టికి అధారభూతమైన మహాలక్ష్యం, కవితాఫణితిలో పృధివిపై దివ్యజీవనావతరణమే. నిజంగా కావ్యం స్వసంవిత్ ప్రకాశంతో విస్తృత నియంత్రితశక్తి విధానంతో, సృజనాత్మక దివ్యజీవన సంగీతలయతో 'ఒకానొక వృధివీసముద్భవ కాంతిశిఖ. అయినప్పటికీ అది అమరుల దివ్యసందేశదూత' వంటిదని వర్ణింపవచ్చును.

అరవిందులే కాక, అరవింద భావ భావితులు ఇతరులు కూడా కొందరు ఆత్మానుభవోద్దీపిత నవ్యకవితాస్రవంతి పొంగిపొరలునట్లు చేస్తున్నారు. కె. డి. సేత్నా (1949) 'The Adventure of the Apocalypse' అన్నరచన. 'The Secret Splendour' అనే ఆయన తొలిరచనవలె, గుప్తమైన అధ్యాత్మిక రహస్యానుభవాలతో కూడినది దిలీపకుమారరాయ్ రచించిన 'Eyes of Light' (1948) అనే సుదీర్ఘదార్శనిక తత్త్వప్రతిపాదన కావ్యంలో ఇతివృత్తం, భాగవతంలోని ప్రహ్లాదచరిత్రపై ఆధారపడింది. అందులో ఆయన యౌగికానుభవంనుంచి చాలా భావగేయాలు ఉదయించాయి. అందు చేత ఆ కవిత నిరవచ్ఛిన్న సాక్షాత్కారలక్షణ లక్షితమైంది. నిరోదబరన్ రచించిన 'Sub Blossoms' (1947) అనే కావ్యాన్ని 'భవిష్యత్కవితా పరిణామపథాన్ని, నెమ్మదిగా అనావృతంచేసే విశదచిహ్నముగా వర్ణించారు అభిజ్ఞులు. నళినీకాంతగుప్త (To the Heights), నిశికాంత్ (Dream Cadences), పంజలాల్ (Rosary and Lotus Petals), పృథ్వీంద్ర, రొమేణ, జెహోమి ప్రభృతుల ప్రధాన భావోద్దీపనము శ్రీ అరవిందులవల్ల వచ్చింది. పైన ఉల్లేఖించిన

---

[1] Semantics

రహస్యయోగాత్మక కవిత్వము ఎంతమాత్రమూ పలాయన స్వభావులది కాదు. ప్రమాణస్థాయి దిగజారినందున, పురుషార్థాలపై దృష్టి కోలుపోయి నప్పుడు, తత్కాలీన స్వభావాన్ని సరిదిద్దడానికి యథార్థ రహస్య యోగము ఉపకారక మవుతుంది. సర్వానికీ మూలమై, సర్వబీజ ప్రాయమై, తిరిగి అధిష్ఠాన భూమిని చేరడానికి, నవజీవనారంభానికి, అది ఒకానొక నిశ్చితమార్గము. అస్పష్టమై విఫలమై వర్తమానమునుండి ఉదయించగల వినూత్న లోకాలోకనమున్నూ, నూత్నపురుషదర్శన మున్నూ మంత్రోచ్చారణవంటి కవితతో సాధించడమే అరవిందాను యాయుల కవితాదర్శము. కథానవలా రచనల్లోనూ ఆధ్యాత్మికతవైపు మొగ్గు కనబడుతున్నది. దిలీపకుమార రాయల 'The Upward Spiral' (1949) అనే అసామాన్య నవలలో ఆధ్యాత్మికదృష్టి గోచరి స్తున్నది. అది భావనాశక్తిగల ఒక వ్యాసము. మహాకాంక్షాశక్తి, తత్సం సిద్ధికి సంబంధించిన గ్రంథమది. ఆ గ్రంథంలో సంవాదములు విసుగు దల పుట్టించకమానవు. అనుస్యూతంగా ఉన్న యౌగిక ప్రయోజనం వల్ల, వాదాలన్నిటిలో ఏకవాక్యత ఉన్నది. రాజకీయంగా స్వాతంత్ర్యం వచ్చినా, నవజాతీయ చైతన్యము కలిగినా, గతపదేళ్ళలో ప్రాంతీయ భాషలు ఎంతో ముందడుగువేసినా, ఎన్నిమార్పులు వచ్చినా, వాటి ప్రభా వము భారతీయాంగ్లసాహితిలో కనబడదు. దాని విస్తృతిగాని, గుణము కాని తగ్గలేదు. పైగా కొన్ని క్షేత్రాల్లో బహుశః ఆంగ్లభాషమీదమోజు అదివరకున్న దానికన్న మిన్నగాఉంది. స్వాతంత్ర్యం, దేశవిభజనం, ప్రణాళికలు వీటివల్ల ఈ యుగంలో విశేషక్రియాశక్తి, సాధన ఉత్పన్న మైనవి. ఈ కాలము తదుద్దీపనాలవల్ల భావోత్సాహాలవల్ల సాధితాల వల్లనూ - అంతేకాక కాలికమైన అవరోధాలు, వైఫల్యాలు, అవమానాల వల్లనూ కూడా—ప్రత్యేకత కలది. సృజనాత్మక గ్రంథకారుడికి ముఖ్యంగా నవలారచయితకు ఎటువంటి పిలుపు ! ఈ యుగము ఒక సవాలు—అంతేకాదు అద్భుతావకాశము రచయితకు. సూర్యప్రకాశంలో ఆకస్మికంగా కురిసే జడివల్లె, వివిధవర్ణశబలిత భారతలోకాన్ని, దీర్ఘ దుస్స్వప్న భూతంనుంచి, జాగరితమైన భారతజాతిని, ఆలోకించి, గ్రహించ గలవా రెవరు ? మన సిద్ధిని మహాకావ్యబద్ధము ఎవరు చేయగలరు ?

మహాసాధన లక్షితమైన భావ గేయాలాపన చేయగల వారెవరు ? ఆత్మ వంచనామయమైన లోకాన్ని అవహేళన చేసే హేళనాత్మక రచనలు, విపుల వ్యథాకీలిత విషాద కావ్య రచనలు ఎవరు చేయగలరు ?

నవలా రచయితలు కొందరు 1930, 1940 సంవత్సరాల్లో ఖ్యాతి తెచ్చుకొన్న వాళ్ళు—ఆనంద్, నారాయణ్—బహుళ గ్రంథరచన చేస్తూ జనామోదమును నిలుపుకొన్నారు. 'కొత్తగా వచ్చినవారు'—భబనీ భట్టాచార్య, కమలా మార్కండేయ, ఖుశ్వంత్‌సింగ్, శాంతా రామారావు, సుధీన్ ఘోష ప్రభృతులు సమకాలిక సారస్వత రంగానికి, భిన్న భావోద్వేగ శబలిత కాంతినీ, నిశ్చిత విజయ సూచననూ, కూర్చినారు. నిస్సందేహంగా స్వాతంత్ర్యం కోసం, చేసిన వీరోచిత సంగ్రామమును ఇటీవల నవలా రచనా ప్రయోగాలు, ప్రస్ఫుటంగా చూపుతున్నవి. అటువంటి నవలలు ప్రముఖమైనవి: వేణుచితాలే రచించిన 'In Transit' (1951), అహమ్మద్ అబ్బాస్ కృతమైన 'ఇంక్విలాబ్'. భబనీ భట్టాచార్య విరచితమైన 'So Many Hungers' (1948), కమలా మార్కండేయ ప్రణీతమైన 'Some Inner Fury', ఖుశ్వంత్‌సింగ్ రచించిన 'Train to Pakistan'. లాంబర్టు మాస్కరేన్హా బుడత కీచుల పాలనలో మహా దారుణ కిరాత కృత్యాలనుండి విముక్తికోసం గోవాలో చేసిన పోరాటాన్ని, 'Sorrowing Lies My Land' అనే నవలగా రచించినాడు రైతాంగ జీవితము, పట్టణపు కృత్రిమ నాగరకత, కలవారికి లేనివారికి మధ్య ఘర్షణ, తూర్పు పడమరల మధ్య గోచరించే అఘాతం, సంప్రదాయం పుట్టించే వ్యతిరేక శక్తులు, విప్లవం వంటి ఇతివృత్తాలు, సమకాలిక నవలా రచయితలు స్వీకరిస్తున్నారు. ఇంకా మరికొందరు స్వప్న కల్పనలుచేసి కృత కృత్యులవుతున్నారు. అలాగ పరుషోత్తమ త్రికందాసు అస్వాభావిక హింసను కల్పన చేసినాడు. ఒకానొకని మొండెమునకు మరొకని శిరసు తెచ్చి అతకగా, తదనంతర మానసిక ప్రవృత్తి ఎల్లా పరిణమించే అవకాశాలున్నవో రచయిత భావనచేసి Living Mask అనే నవల రచించినాడు. ఆ గ్రంథము మనలను బాధిస్తుంది, కాని వెంటనే మనసును ప్రబ

లంగా ఆకర్షిస్తుంది. సుధీన్‌ఘోష వ్రాసిన 'వెర్మిలియన్ బోట్' 'And Gazelles Leaping', 'Flame of the Forest' అనే నవలలు ఉల్లాసదాయకాలు. ఈ నవలలు ప్రాగ్దేశీయ కల్పనాసముల్లాసితాలు. అయితే వాటిలో విషయము పల్చనైపోవడం, ప్రధానంగా ఉద్దిష్టం కావలసినదాన్ని పల్చన చేయడమున్నూ కనబడుతుంది. జి. వి. దేశానీ 'All about Mr. Hatter' అనే నవల, జేమ్సుజాయిన్ అనే ప్రముఖ ఆంగ్లేయ నవలాకారుని చైతన్యస్రవంతీ విధానంవల్ల, భావోద్దీపితుడై రచించాడని స్పష్టపడుతున్నది.

డాక్టర్ భబని భట్టాచార్య 'So Many Hungers', 'Music for Mohini', 'He Who Rides a Tiger' (1954) అని మూడు నవలలు రచించి, సృజనాత్మక నవలాకారుడుగా ఖ్యాతి చిరస్థాయి చేసుకొన్నాడు. 'So Many Hungers' అన్న నవల వంగదేశంలో యుద్ధకాలాన్ని, నిష్ఠుర వాస్తవిక ధోరణిలో చిత్రించినాడు. ఆ గ్రంథము ప్రపంచఖ్యాతి పొంది, బాగా అమ్ముడు పోయింది 'Music for Mohini' అనే నవలలో మోహిని అనే విప్రకన్య సుతారపు కథ. జయదేవుడనే భర్త విద్వాంసుడు. ఆయనతో సహధర్మిణిగా కృతకృత్యురాలు కావడానికి యత్నిస్తుంది. 'He who Rides a Tiger' అనే నవల క్షామ పీడిత వంగదేశగాథ. లీలాప్రాయంగా చేసిన రచన అది. కాలో అనేవాడు సమాజాన్ని వేళాకోళం చేస్తాడు. మనకు కేవలం ఆమోదం కలిగిస్తుంది ఆ హాస్యం. కలకత్తాలో జీవన ద్రుతగతి, పట్టణాల్లో సంశ్లిష్ట విపరీత మనోవికారములూ, వ్యసనములూ, అక్కడ కృత్రిమజీవనం, ప్రజోద్యమాలపీడనం, ప్రజానీకానికి విపరీత భావోద్రేకంతో కూడిన అపస్మారము—వీటన్నింటి చేతనూ, నవల పాఠకునిలో ఔత్సుక్యం కలిగిస్తుంది. నవలా రచయితగా భబనిభట్టాచార్య బహుముఖ ప్రజ్ఞాశాలి. హేళనాత్మక హాస్యము, సామాజికమైన అంతరాత్మ, పాత్రోన్మీలనలో కోమల తారతమ్య భావము, అన్నింటికన్న బహురూపాల్లో బాధిత జీవులయెడల గ్రంథకర్త కున్న కారుణ్యమున్నూ అపరిమితము.

కమలా మార్కండేయ అనే నవలా రచయిత్రి 'Nectar in a Sieve', 'Some Inner Fury' (1956) అనే గ్రంథాలు రచించింది. అవి కె. యస్. వెంకటరమణి వ్రాసిన 'Murugan, the Tiller', 'Kandan, the Patriot' అనే నవలను జ్ఞప్తికి తెస్తాయి. 'Nectar in a Sieve' అనే నవలలోది జానపదుల కథ. పారిశ్రామిక, నవీన సాంకేతికతా ప్రభావంలో కొట్టుమిట్టాడుతున్న అగతికుల విషాదగాథ. అయితే కథలో 'రుక్మిణి' అనే నాయిక కథ చెబుతుంది. ఆమె పాత్ర స్ఫుటంగా చిత్రితమైంది. ఆమె శోకమూర్తి అయిన మాత పాత్రగా వ్యక్తమైంది., లేదా తానే వ్యక్తము చేసుకొన్నది. 'Some Inner Fury' అనే నవలలో ఇతివృత్తం క్లిష్టమైంది. 1942 ఆగష్టు నెలలో Quit India ఉద్యమంలో 'అంతందాకా పోరాడమనే' సందర్భంలో భారతీయ కన్య ఒకానొక ఆంగ్లేయుణ్ణి ప్రేమిస్తుంది. Some Inner Fury అనేది విషాదాంత రాజనీతిగాథ అలాగే ఆమె తొలి రచన కూడా భారతీయార్థిక విషాదాంత గాథ. ఈ నవలలు, రెండింటిలోనూ ప్రధాన పాత్రలు, తీవ్రమైన ఆర్థిక సంక్షోభాన్ని లేక దురదృష్టంగా పరిణమించిన రాజనీతినీ అతిక్రమించి, మానవాత్మ అజేయమైందని ఉద్ఘాటిస్తాయి. ఆమెది పరిశుద్ధ భావప్రతీతి గల వచన రచన.

శాంతా రామారావు రచించిన ప్రథమ నవల 'Remember the House'. ఈ రచనలో ఆమె వర్ధమాన రచయిత్రి అని బాగా విశదమవుతుంది. కథా కథనం చేసే 'బాల' అనే కన్య వికాసాన్ని మనము కనిపెట్టి చూడగలుగుతాము. ఆమెకు జీవితంలో అవకాశాలు లభించగానే, అనుభవంవల్ల అవ్యక్త చేతన నిశిత మవుతుంది. కాని వైఫల్యంవల్ల, మాయావరణం దాటడంవల్ల ఆమెకు లాభం ప్రాప్త మవుతుంది, సాఫల్యంఔన్నత్యం మోస్తరుగానే కాల్పనిక భావోద్వేగానికి వశ్యురాలు కాబోయింది. కాని నిజస్థితివల్ల వెనక్కు తగ్గుతుంది. కొత్తదనము ఉద్రేకము కలిగిస్తుంది. అయితే సంప్రదాయాన్ని తోసి రాజనడం సులభసాధ్యంకాదు. నయనతార సైగల్ రమణీయంగా ఆత్మకథారూప వ్యాసము 'Prison and Chocolate Cake'

(1954) అనే పేరుతో ప్రకటించింది. 1957 లో 'A Time to be Happy' అనే నవలలో, స్వాతంత్ర్య సంపాదనకు పూర్వకాలాన్ని, ఆమె చిత్రించింది. శైవలులు, సహాయులు అనే రెండు స్పష్టమయిన కూటాలు తయారవుతాయి. కథ మంచిది, యుగాన్నిబాగా చిత్రించింది. ఆనందలాల్ 'The House at Adampur' అను నవలలో, ఢిల్లీ, ముఖ్యంగా పంజాబులో, 1947 కు పూర్వం ఉన్న శ్రీమంతుల జీవితపుతెఱ ఒత్తిగలచేయబడింది. ఆ భవనం అన్నివైరుధ్యాలతోకలిసి నిలిచింది. పురుషులు రెండు ప్రపంచాలమధ్య ఊగులాడేవారు. వారి మనసుల్లో విషద్వేషమయమైన అసంతృప్తి, లోలోపల పురుగులాగ పాకింది. యం వి. రామశర్మ 'The Stream' అనే నవలలో గోపాలం అనే అజ్ఞాతజీవిని చిత్రిస్తాడు. అతడు కొంతవరకు, థామస్ హార్డీ రచించిన నవలలో 'జూడ్' అనే పాత్రవలె, రెండు కొప్పాలమధ్య నలిగి, ఆ స్త్రీలతో సంతృప్తిగా చెలిమి సాధించలేకపోతాడు. యస్ వై. కృష్ణస్వామి వ్రాసిన 'Kalyani's Husband' (1947) అనే నవలలో కూడా హార్డీ రచించిన 'The Woodlanders' నవలలోని Fitzpiers ను జ్ఞప్తికి తెస్తుంది అస్పష్టంగా. కల్యాణి భర్త, శేఖర్ పాత్ర చిత్రణము నిస్సందేహంగా రంజకంగా ఉంది. అయితే అంగీకార యోగ్యంగా లేనే లేదు. శేఖర్పాత్ర. వెంకటరమణి రచించిన 'Murugan, the Tiller' లో కేదారిని జ్ఞప్తికితెచ్చే మరొక మైలాపూరులోని పతితుడు ప్రధాన నాయకుడు. అయితే మైలాపూరులోని వాస్తవిక వాతావరణాన్ని కల్పించలేక పోయినాడు. రచయిత నాయకునిలో ఓతప్రోతంగా పెనవేసుకొన్న వైరుధ్యాలను చిత్రించలేక పోయాడు. ఆయన తన పూర్వుడివలె కృతకృత్యుడు కాలేకపోయినాడు రచనలో

ఖుశ్వంతసింగు వ్రాసిన 'A Train to Pakistan' (1956) నవల ప్రత్యేకమైనది. విధిబలీయమై భారతదేశ విభజనము జరుగుతున్న కాలంలో, పంజాబు విచ్చలవిడిగా దారుణనరకాన్ని తలపుకు తెచ్చింది. పాపము పెరిగి పెరిగి పోగా, తత్ఫలంగా నిష్కర్షగా మాతృదేశాన్ని రెండు తుండెములుగా నరికివేశారు. కులద్వేషవాతం వీయ

డంతో. జంఝామారుతం మానవకోటిని పెకలించి, ఖండ ఖండాలుగాచేసి రాసులుగా పోసింది. దాన్ని తప్పించుకోడం ఎవరికి సాధ్యం? హత్యలు, నేరాలు పగబట్టి హత్యలు—ఎన్నో ఎన్నో హింసలు! ప్రతీకారం అంతు లేకుండా సాగిపోవలసిందేనా? అయితే మానవస్వభావము ప్రేమే కాని ద్వేషముకాదు. తుపాను హింస చెలరేగి ఉపశమించినమీదట, చివరకు శాంతి అవతరించక తప్పదు. జగత్‌సింగ్ ఒక మోటుమనిషి. అతను నూరన్ అనే ముసల్మాను కన్యను ప్రేమించాడు. అతను శిఖ్ఖు. భారతదేశంనుంచి పాకిస్తానుకు ముసల్మాను కాందిశీకులను తీసుకొని పోతున్న రైలులో, అతని ప్రేయసికూడా ఉన్నది. అతడు ఆ రైలును తన ప్రాణమును పణంగాపెట్టి అర్పించి రక్షిస్తాడు. కాల్పనిక భావో ద్వేగానికి విముఖుడయిన ఖుశ్వంతసింగు, మోసాన్ని, ముఖ్యంగా ముసుగువేసుకొని జ్ఞానశీలాలున్న వాళ్ళవలె పచ్చిమోసం చేసేవాళ్ళను, సహించలేడు. ఈవిషయము అతని 'రక్తాశ్రువులు' అనే నవలలోనేకాక, 'The Mark of Vishnu' అనే కథానికా సంకలనములోనూ స్పష్టమవుతుంది ఈశ్వరన్ 'Painted Tigers' అనే ప్రసిద్ధకథానికా సముచ్చయము రచించినాడు.

పత్రికలకు కథానికలు కావలసి వస్తాయి కనుక, పాఠకులు ఆవు రావురుమంటూ ఉంటారు కనుక, నవలలూ కథానికలూ ప్రకటితమవుతూ వస్తున్నాయి. దానికితోడు అమెరికన్ ఆంగ్లేయ గ్రంథప్రకాశకులు భార తీయ రచయితలను మంచి నవలలు వ్రాయమని ప్రోత్సహించడానికి ఇష్టపడకపోవటం లేదు. కాని సాధ్యమైన నవలా, కథానికలకూ, కాల్ప నిక భావనాత్మక నవలా కథానికలకూ భేదం ఉన్నది. పైచెప్పిన నవ లలు తమ తమ గుణాలచేత ఉద్దీపనం కలిగించినా, తృప్తినిచ్చినా, రచయితలు సృజనాత్మకంగా అవగాహన చేసుకొని, మన స్వాతంత్ర్య సంఘర్షణను శోభారమణీయంగా రచన చేయలేక పోయినారు. అందు చేత భవిష్యత్తులో ఎవరో మహానవలాకారుడు, టాల్‌స్టాయి రాసిన 'War and Peace'.అనే గ్రంథంతో పోల్చడానికి యోగ్యమయిన మహావచన కావ్యరచన చేయవలసి ఉంటుంది చాలామంది రచన చేయగా ఆ సమూహంలో ఏ కొద్దిమంది రచయితలో నిలవగలుగుతారు.

ఏమైనప్పటికీ భావికాలంలో భారతీయాంగ్లేయ నవలకూ కథకూ తప్పక స్థానం ఉంటుంది. నవలాకారులు, కథానికా రచయితలు పైన చెప్ప బడిన వారివలె సాహిత్య ప్రయోగశీలురైన వారిస్థాయికి అకృష్టులైతేసరి. ప్రాక్పశ్చిమాలకూ, లేదా, నవ్యకల్పనకూ సంప్రదాయానికీ, ఉండే ఘర్షణ, విభిన్నస్థాయిలో ప్రదర్శనయోగ్యమై నిరంతర కథావస్తువుగా ఉన్నది. నవలాకారులూ, నాటకకర్తలూ, గతకాలంలోవలె భావికాలం లోనూ, తప్పక దానిచేత ఆకృష్టులవుతారు.

ఈ వ్యాసము ముగించేలోగా ఆంగ్లంలో ప్రకటితమయ్యే భార తీయ పత్రికల విషయము ఒకటి రెండు మాటలు చెప్పాలి. మన భారత జాతీయోజ్జీవనపు తొలిరోజుల్లో, మదరాసునుండి 'హిందూ', కల కత్తానుంచి 'అమృతబజారు పత్రిక' అభ్యుదయాత్మక స్వపరిపాలన సమస్యావిషయము ప్రజకు ఉద్బోధించి, ప్రజాభిమానము కలిగించ డంలో ప్రముఖపాత్ర వహించాయి. ఆ పత్రికలు ఇప్పటికీ ప్రవర్ధ మాన జాతీయ సంస్థలుగా ఉంటూ ఉండడము ముదావహంగా ఉంది. ఒకానొకప్పుడు విశేషఖ్యాతిని ఆర్జించి, జనప్రీతి దాయకాలైన పత్రి కలు, ఉదాహరణకు 'ఇందుప్రకాశ' (బొంబాయి) 'వందేమాతరమ్' (కలకత్తా) వంటివి వచ్చేవి. అవి చరిత్రలో చేరినవి; ప్రస్తుతం లేవు. జాతీయ మహానాయకులైన శ్రీ అరవింద (వందే మాతరమ్, కర్మయోగి పత్రికలు), లజపతిరాయ్ (The People), చిత్తరంజన్‌దాస్ (Forward), గాంధీజీ (Young India, Harijan), సి. వై. చింతా మణి (The Leader), పట్టాభి సీతారామయ్య (Janmabhumi), సుభాష్‌చంద్రబోస్ (Forward Block), యం. యన్. రాయ్ (Independent India, Marxian Way), లోకమాన్య తిలక్ (The Mahratta), ఆచార్య కృపలానీ (Vigil), కె. యం. మున్షీ (The Social Welfare) వంటివారు తమ కాలంలో తమ భావ వ్యాప్తికి పటువుగా పత్రికలను సాధనాలుగా చేసుకొన్నారు. మన కాలంలో ప్రస్తుతం 'Hindu', 'Amritabazar Patrica' 'Indian Express', 'Hindustan Times', 'Bombay Chronicle', 'National Herald' నిన్నటిదాకా ఆంగ్లో

హైందవ పత్రిక లనబడే 'Times of India', 'Statesman', 'Mail' — అన్నీ అద్భుతంగా భారతీయ ప్రజాతంత్ర పరిస్థితులకు అనుకూలంగా ఘనంగా సేవచేస్తూ, సౌష్ఠవ పత్రికా ప్రమాణాలను నిలుపుకొంటూ, జాతీయాభ్యుదయ దృష్టితో, యావద్భారత దృక్పథంతో విరాజిల్లుతున్నవి. సాప్తాహిక పత్రికలు — ఎప్పుడూ జనప్రీతి గల 'Illustrated Weekly', ని తప్పిస్తే—అంత దృఢంగా నిలవలేవు. అయితే ఒకప్పుడు 'Indian Social Reformer, 'The Servant of India' వంటి వారపత్రికలు దేశంలో అనల్ప గౌరవమూ, పేరూ పొందాయి. అలాగే 'Mysindia' (Banglore), 'Thought' (Delhi), 'Swarajya' (Madras), 'Radical Humanist' (Calcutta), వంటి పత్రికలు మన జాతీయ జీవితములో ప్రముఖపాత్ర వహిస్తున్నాయి. అవి అవసరమైనప్పుడల్లా సుస్పష్టంగా, ధాటీగా అల్పసంఖ్యాకుల దృక్పథాన్ని ఉద్ఘాటిస్తున్నాయి. మాసపత్రికలూ ఉన్నాయి, ప్రపంచంలో ఇతర ప్రాంత పత్రికలతోపాటు కష్టాల్లో పాలు పంచుకొంటూ. Calcutta Review, Modern Review, Indian Review పత్రికలు ఉపయోగకరమైన దీర్ఘ చరిత్ర కలవి. ప్రబుద్ధ భారత, వేదాంత కేసరి, మదర్ ఇండియా పత్రికలు మంచి స్థాయిలో నడుస్తున్నాయి. అయితే వాటిది తాత్త్విక దృష్టి. Aryan Path పత్రికకు ముప్పయ్యేళ్ళు నిండాయి. అది మహాప్రశంసనీయంగా సేవచేసింది పురుషార్థ వివేచన చేయడం వల్ల, జీవిత మూల్యాల సమీక్ష చేయడంవల్ల, సూక్ష్మ విమర్శనా సంప్రదాయాన్ని దేశంలో పెంపుచేస్తూ, నిర్మాణాత్మక కర్తవ్యం పెట్టుకొన్నది. నేను చాతుర్మాసిక, ద్వైమాసిక పత్రికలు 'విశ్వభారతి', 'Quest' (Bombay), 'Advent' (పుదుచ్చేరి), 'Literary Criterion' (Mysore) వంటి వాటి విషయము చెప్పకుండా ఊరుకోరాదు. విద్వత్ ప్రీతిదాయకమైన పత్రికలు, విశ్వవిద్యాలయాలు, విద్వత్ పరిషత్తులు ప్రకటించేవి — ఇతర పత్రిక లెన్నో తగిన ప్రమాణము నిలుపుకొంటూ వర్ధిల్లుతున్నాయి.

## వ్యాసకర్తలను గురించి

1. విరించి కుమార బారువా — (జన్మ 1910) – అసామీ భాషలో ప్రముఖ విద్వాంసుడు, నవలాకారుడు, కథకుడు– ఆయన రచనలు: 'Assamese Literature','A cultural History of Assam', 'Studies in Early Assamese Literature.'
2. మాయాధర్ మాన్‌సింహో (జన్మ 1905) ప్రముఖ ఓఢ్ర కవి, నాటకకర్త, విమర్శకుడు; శంబలపూర్‌లో గంగాధర్ మెహార్ కలాశాలకు ప్రిన్సిపాలు– ఆయన రచనలు కొన్ని; ధూప, హేమపుష్ప, అక్ష్యతా (అన్నీ కావ్య సముచ్చయాలు); కవి, కవిత– 'ఒరియా సమాజ్ ఓ సాహిత్య' అన్నవి.
3. ఖ్వాజా అహ్మద్ ఫరూకీ (జన్మ 1917) ఉర్దూలో ప్రముఖ విమర్శకుడు; ఢిల్లీ కలాశాలలో ఉరుదూ శాఖకు అధ్యక్షుడు; మీర్ తక్కీ–మిర్ హయాత్ షాయిరీ అనే విమర్శనకు సాహిత్య అకాడెమీ బహుమతి ఇచ్చింది.
4. వి. కె. గోకక్ (జన్మ 1909) కవి, నాటకకర్త, వ్యాస రచయిత, విమర్శకుడు; హైదరాబాదులో 'సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీషు'కు డైరెక్టరుగా ఉన్నారు. కర్ణాటక కవి సమ్మేళనకు 1934 లోనూ, 1949 లోనూ

కర్ణాటక సాహిత్య గోష్ఠికిన్నీ అధ్యక్షుడు; ఆయన రచనలు కొన్ని: పవన (పద్యాలు) Indian Karnataka (వ్యాసాలు), సాహిత్యదల్లి ప్రగతి (సమీక్ష)

5. పి. యన్. పుష్ప (జన్మ 1917) శ్రీనగర్‌లో ఎ. యస్. కళాశాలలో హిందీ సంస్కృత శాఖలకు అధ్యక్షుడు; హిందీలో కాశ్మీర సాహిత్యం, ఆంగ్లంలో కాశ్మీర కవితా సంకలనం ప్రకటించినాడు.

6. మన్‌సుఖ్‌లాల్ ఝవేరీ (జన్మ 1907) కవి, విమర్శకుడు; బొంబాయిలో సెంట్ జేవియర్స్ కళాశాలలో గుజరాతీ భాషకు ప్రాచార్యుడు; ఆయన రచనలు కొన్ని: చంద్రదూత, ఆరాధనా (కవితా సముచ్చయాలు రెండూ), గుజరాతీ సాహిత్యానున్ రేఖాదర్శన్ (సమీక్ష)

7. టి. పి. మీనాక్షిసుందరం (జన్మ 1901) వ్యాసకర్త, విమర్శకుడు; అణ్ణామలై విశ్వవిద్యాలయంలో తమిళ భాషకు ప్రాచార్యుడు.

8. కె. రామకోటీశ్వరరావు (జన్మ 1894) బందరులో జాతీయ కళాశాలకు ప్రిన్సిపాలుగా ఉండేవాడు – భారతీయ సంస్కృతికి సంబంధించిన 'త్రివేణి' అనే ఆంగ్ల పత్రికకు సంపాదకుడు; కావూరి ప్రధాని (జీవిత కథ), మహారాష్ట్ర వీరులు– ఆయన రచనలు.

9. ఖుష్వంతసింగ్ (జన్మ 1915) ప్రముఖ పత్రికా రచయిత, నవలారచయిత, కథకుడు, యోజన పత్రికా సంపా

దకుడు, శిఖుల చరిత్ర రచయిత, Train to Pakistan (నవల, ఆంగ్లంలో), నమ్ పీచ్ కీ పియహై (కథలు)

10 కాజీ అబ్దుల్ వదూద్ (జన్మ 1894) నవలాకారుడు, వ్యాసకర్త, వంగ భాషలో కథకుడు- 1939లో వంగ సాహిత్య పరిషత్తుకు అధ్యక్షుడు - ఆయన రచనలు కొన్ని : మీర్-పరిబర్ (చిన్నకథలు), నవపర్యాయ (వ్యాసావళి), ఆజాద్ (నవల)

11. యం. వి. రాజాధ్యక్ష (జన్మ 1913) బొంబాయిలో ఎలిఫిన్‌స్టన్ కలాశాలలో ఆంగ్లోపన్యాసకుడు; 'పంచకవి' అనే మహారాష్ట్ర ప్రముఖ కవులని, అయిదుగురివి కావ్యాలు ఏర్చి కూర్చినాడు.

12. సి. కున్హన్ రాజా — మలయాళములోనూ సంస్కృతములోనూ ప్రముఖ విద్వాంసుడు; ఆంధ్ర విశ్వవిద్యాలయములో సంస్కృతాచార్యులుగా ఉండేవారు.

13. వి. రాఘవన్ (జన్మ 1908) - మద్రాసు విశ్వవిద్యాలయంలో సంస్కృతానికి ప్రాచార్యుడు- అఖిల భారత ప్రాచ్య పరిషత్తు తరఫున పారిస్‌లో అంతర్జాతీయ ప్రాచ్య విద్వాంసుల సదస్సుకు 1953 లో ప్రతినిధి; ఆయన సంస్కృతంలో, తమిళంలో, ఆంగ్లంలో పాండితీ పూర్ణమైన రచనలు ప్రకటించినాడు. సుమారు 250 పరిశోధక వ్యాసాలు ప్రకటించినాడు. Journal of Oriental Resarch పత్రికకు సంపాదకుడు.

14. యల్. హెచ్. అజ్వానీ (జన్మ 1899) సింధీ కవి, విమర్శకుడూ; బొంబాయిలో బంద్రాలో జాతీయ కలా శాలకు ప్రిన్సిపాలుగా ఉన్నాడు; ఆయన కవిగా, సింధీ కవితా వ్యాస సంకలనకర్తగా ప్రసిద్ధుడు — నవోదార్ (పద్యాలు) విచార్ (వ్యాసాలు);

15. యస్. హెచ్. వాత్స్యాయన్ (జన్మ 1911) హిందీకవి, నవలాకారుడు, కథకుడు 'వాక్' (త్రైమాసిక పత్రిక) సంపాదకుడు ; ఆయన రచనలలో కొన్ని; భగ్నదూత్ (పద్యాలు), శేఖర్, ఏక్ జీవనీ (నవల). అజ్ఞేయ్ కీ కహానియాం (కథలు)

16. కె. ఆర్. శ్రీనివాస అయ్యంగార్ (జన్మ 1908) విద్వాంసుడు, విమర్శకుడు, జీవితకథా రచయిత, ఆంధ్ర విశ్వ విద్యాలయంలో ఆంగ్ల భాషా ప్రాచార్యుడు; ఆయన రచనలు : Indo - Anglican Literature, Indian Contribution to English Literature & Sri Aurobindo.

# సూచి